# డా|| వాసిరెడ్డి సీతాదేవి

## సాహిత్యం -4 ◆ నవలలు



అడవి మల్లె ◆ ఉరిత్రాడు ◆ వెన్నెల మండుతోంది

మరో దయ్యం కథ ◆ [illegible]

# డా॥ వాసిరెడ్డి సీతాదేవి

# రచనలు - 4

# నవలలు

♦ అడవిమల్లె ♦ ఉరిత్రాడు
♦ వెన్నెల మండుతోంది
♦ మరో దయ్యం కథ
♦ కోతి-కొబ్బరికాయ



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్. 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Dr. VASIREDDY SĪTHADEVI RACHANALU-Vol. 4 (Novels)
Adavimalle ♦ Urithradu ♦ Vennela Manduthondi ♦
Maro Dayyam Katha ♦ Kothi - Kobbarikaya

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ

ప్రచురణ నెం. : 2347

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : జనవరి, 2003



వెల: రూ. 200/-

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హిమాయత్‌నగర్. హైదరాబాద్.

అంకితం

2-6-1966 న దివంగతులైన

మా నాన్న

## వాసిరెడ్డి రాఘవయ్య గారికి

శ్రద్ధాంజలితో

– సీతాదేవి

# పరిచయం

తెలుగు పాఠకలోకానికి వెలుగు పంచిపెట్టిన నవలా రచయితలలో వాసిగన్నవారు కుమారి వాసిరెడ్డి సీతాదేవిగారు. పుస్తకరూపం ధరిస్తున్న ఆమె తొలి నవల 'అడవి మల్లె.'

'నవలా రచయిత' అనడంలో శ్లేష వుంది. 'అడవిమల్లె' ప్రచురణతో ఆ శ్లేషకు ప్రాణప్రతిష్ఠ జరుగుతున్నది. నిజమే- నవలామణి రచించిన నవలామణి 'అడవిమల్లె.' దానికి నేను పరిచయ వాక్యాలు వ్రాయడమేమి, పాఠకలోకానికి చిరపరిచిత అయిన సీతాదేవిగారిని పరిచయం చేయడమేమి - సాహసమే! ఈ సాహసం చేయమన్నది సీతాదేవిగారు. కనుక ఇది స్త్రీ సాహసమే అనాలి.

స్త్రీ సాహసం రచనా రూపంలో తాళ్ళపాక తిమ్మక్క నాడు మొగ్గదొడిగి, మొల్లగా వికసించి, ముద్దుపళనిగా మురిపాలు చిందినా, శతాబ్దాలనాడే అది తెలుగునాట వెలుగు బాటలు వెలయించినా, ఈ శతాబ్దంలో నిన్న మొన్నటిదాకా నూతన సాహితీ ప్రక్రియలకు అది పూనుకొనలేదు. అందుకే కవయిత్రులు కనుపించారుగాని, ఇటీవలివరకు కథా రచయిత్రులు, నవలా రచయిత్రులు కానరాలేదు. గట్టిగా పది పదిహేనేళ్ళనుంచీ మహిళలు ఈ నూతన రచనావ్యాసంగానికి ఉద్యమించారు. సాంసారికమైన గాథలను నవలలుగా మలచడంలో పురుషులనే మించారు. కథలు, కథానికలు, నవలలు, నవలికలు 'ప్రకృతి' పరంగా వికసించిన మల్లికలై - నేడు మూడు పూవులు, ఆరు కాయలు, పదారు ఫలాలుగా ఫలించడం తత్ఫలితమే.

కథారచనలో, నవలారచనలో సైతం కొత్త పుంతలు త్రొక్కి, ఉత్తమ రచయిత్రిగా స్థిరపడినవారు సీతాదేవిగారు. తమ ఇంటిపేరుగా, తరతరాల సాహితీ సమాదరణకు అవినాభావ సంబంధంగల సీతాదేవిగారి 'అడవిమల్లె' జీవనరాగతత్త్వ సుగంధాన్ని వెదజల్లుతున్న జవ్వాదిమల్లె.

'అడవిమల్లె' నవల చదువుతున్నంతసేపు అందులో హేమ, గౌరి పాత్రల వెనుక లీలగా, అవలీలగా, రచయిత్రి స్త్రీ-పురుష బాంధవ్యానికి సంపూర్ణతను సాధించడానికి చేసిన ప్రయత్నం కనిపిస్తుంది. రాగపరంగా హేమ, త్యాగపరంగా గౌరి - చంద్రంతో సహజీవనంకోసం - కాదు; చంద్రం కోసమే జీవించారు. కథానిర్వహణతోపాటు జీవిత మూల్యాలను చాటిచెప్పడంలో సీతాదేవిగారు సిద్ధహస్తులని నిరూపించే ఈ నవల ఆద్యంతం రసవత్తరంగా, రమణీయంగా ఉన్నది. కథనంలో సంసారమథనం ఇంత చక్కగా సాధించినవారు అరుదు. రచయిత్రులలో ప్రేమాయణ రచనకు పూనుకొనని నియమం, సంయమం సీతాదేవిగారి సహజగుణాలు. తత్త్వాన్వేషణమే-ఆమె రచనలో శిల్పం, జీవం.

ప్రాయానికి మించినవని చెప్పదగిన అభిప్రాయాలు ఆమె కలిమి. ఆమె ఆలోచన వేరు. అదే 'అడవిమల్లె' కథనంలో బలిమి.

పెరల్‌బక్, ఎమిలీబ్రాంటీల ప్రభావం కథనంలోను, డికెన్స్ అభిరుచి ఇతివృత్తం ఎన్నికలోను సీతాదేవిగారి రచనలో కానవస్తుంది అని చెప్పకపోతే ఎంతచెప్పినా కొందరికి ఆమె రచనలోని రమణీయత అర్థంకాకపోవచ్చు. అట్లని అనేక రచనలలో కానవచ్చే అనుకరణ దోషం మాత్రం ఇక్కడ లేదు. ఉత్తమ రచయిత్రిగా ఆమెను ఎంచినా; ప్రకటించినా - అందుకే అందులో వంచన లేదు.

జీవనదిలా ప్రవహించే భావనదిలో పాత్రలను పడవలుగా చేసుకొని సాహితీయాత్ర సాగిస్తున్న సీతాదేవి - రచయిత్రిగా అక్షరకీర్తిని ఆర్జించుకోవాలని ఆశిస్తున్నాను; ఆదేశిస్తున్నాను.

హైదరాబాద్ **వేటూరి సుందరరామమూర్తి**

26-7-67.

# ఇందులోని నవలలు

## డాక్టర్ వాసిరెడ్డి సీతాదేవి సాహిత్యం
## 5 సంపుటాల్లో

### మొదటి సంపుటం

మట్టిమనిషి — రూ. 135-00

### రెండవ సంపుటం

సమత + వైతరణి
+ అర్చన + తిరస్కృతి — రూ. 190-00

### మూడవ సంపుటం

కథలు — రూ. 140-00

### నాల్గవ సంపుటం

అడవిమల్లె + ఉరిత్రాడు
+ వెన్నెల మండుతోంది + మరో దయ్యం కథ
+ కోతి - కొబ్బరికాయ — రూ. 200-00

### ఐదవ సంపుటం

రాబందులూ - రామచిలకలు +
మృగతృష్ణ + తొణికిన స్వప్నం + సావేరి — త్వరలో.....

# అడవిమల్లె

వీధి దీపాలు వెలిగాయి. అయినా ఆ యింటి ముంగిలి చీకటిగానే ఉంది. కృష్ణారావు ఇంటిముందున్న మొక్కల దగ్గరనుంచి వరండాలోకి వచ్చాడు. సోఫాలో కూర్చుని నిట్టూర్పు విడిచాడు.

"వరండాలో లైటన్నా వేయలేదేం?" వంట గదిలో నుంచి బయటికి వచ్చిన కాంతమ్మ అన్నది.

భార్యమాట వినిపించుకోనట్లే లేచి కృష్ణారావు గేటుదగ్గరకొచ్చాడు. వీధిలోకేసి కాసేపుచూసి మళ్ళీ లోపలికి వచ్చాడు. వరండాలో లైటు వెలిగించి సోఫాలో జారగిలపడుతూన్న భర్తనుచూసి కాంతమ్మ అన్నది:

"ఎందుకూ కాలుగాలిన పిల్లిలా ఇంట్లోకీ బయటకూ తిరుగుతారు? ఇప్పుడేం కొంపలు మునిగిపోయినై?"

"నీ కలాగే ఉంటుందే? అదే నీ కడుపున పుట్టిన బిడ్డయితే ఇలా ప్రవర్తిస్తావా?" అన్నాడు కృష్ణారావు.

"బాగానే ఉంది నంబడం! నన్నంటారేం? తమ్ముడి మీద అంత ప్రేమ కారిపోయేవాడివి వెళ్ళలేకపోయావూ?" అంటూ రుసరుసలాడుతూ కాంతమ్మ లోపలికి వెళ్ళింది.

అవును! తను వెళ్ళి వుండాల్సింది. స్కూల్లో 'పేరెంట్సు డే' అనీ అందరి పిల్లల తల్లిదండ్రులు వస్తారనీ, తననూ, వదిన్నీ తప్పక రమ్మని చంద్రం మరీమరీ చెప్పి వెళ్ళాడు. కృష్ణారావుకు ఆనాడు తల్లి అన్న మాటలు జ్ఞాపకం వచ్చి, ఎక్కడో గుండెల్లో కలుక్కుమన్నట్లయింది.

"ఇక తల్లివైనా తండ్రివైనా నీవే చంద్రానికి" అంటూ తల్లి పార్వతమ్మ, తమ్ముణ్ణి తనచేతిలో పెడుతూ ప్రాణాలు వదిలింది.

"మామయ్యా! మా టీచర్లంతా చంద్రాన్ని ఎంత పొగిడారనుకున్నావ్! అన్నిట్లోనూ ప్రథమ బహుమతి చంద్రానికే. ముఖ్యంగా చంద్రం తను రాసిన కవిత్వం చదివితే - వచ్చిన అతిథులంతా ఎంత ఆనందించారనుకున్నావ్ మావయ్యా! అందరూ ఎవరబ్బాయి అంటే ఎవరబ్బాయి అని అడిగేవాళ్ళే!" చంద్రానికి లభించిన బహుమతుల్లో సగం మోసుకుని వచ్చిన పక్కింటి ప్రసాదరావుగారి అమ్మాయి హేమ గబ గబా గుక్క తిప్పుకోకుండా చెప్పసాగింది.

కృష్ణారావుకు ఆనందం, విచారం రెండూ ఒకదాన్నొకటి త్రోసుకువచ్చాయి. తలెత్తి తమ్ముడివైపు చూశాడు. చంద్రం తన చేతిలో ఉన్న పాకెట్లను టేబులుమీద పెడుతున్నాడు. అతని వదనంలో ఎంత దాచాలనుకున్నా దాగని విషాదచ్ఛాయలు కనిపిస్తున్నాయి.

"మావయ్యా! నువ్వూ అత్తయ్యా రాలేదని చంద్రం ఎంత బాధపడ్డాడనుకున్నావ్? అందరూ తనను పొగుడుతుంటే చంద్రం ఏమీ వినిపించనట్లే ఉండిపోయాడు. అతని కళ్ళు చివరవరకూ మీ కోసం వెతుకుతూనే ఉన్నాయ్" అన్నది హేమ – ఒక్కొక్క ప్యాకెట్ విప్పి చంద్రానికి వచ్చిన బహుమతులను కృష్ణారావుకు చూపిస్తూ.

"ఆఫీసులోనే ఆలస్యం అయింది. అందుకే రాలేక పోయాము," కృష్ణారావు తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో అన్నాడు.

చంద్రం ఇదేమీ గమనించనట్లే తన గదిలోకి వెళ్ళిపోయాడు. అతని వెనకే హేమకూడా వెళ్ళింది.

కృష్ణారావుకు తమ్ముడు చంద్రం అంటే అమితప్రేమ. కాని అతను భార్య కాంతమ్మకు జడిసి తన ప్రేమను పైకి చూపించడు. కాంతమ్మకు కారణం లేకుండానే మరిది చంద్రం అంటే వళ్ళుమంట. అసలు ఆమె తత్త్వమే అంత. ఆమెకు తన కూతురు రజని అంటే తప్ప ఇంకెవరన్నా ఎలాంటి అపేక్షలూ మమతలూ ఉన్నట్లు కనిపించదు. కనీసం కట్టుకున్న ఆయనమీద ఎంత ప్రేమాభిమానాలున్నాయోగాని, భర్త అని అయినా గౌరవంలేదు. సాధారణంగా ఆడవారికి పుట్టింటివారంటే ఉండే అభిమానం, మమత కూడా ఆమెలో ఉన్నట్లు గోచరించదు.

కృష్ణారావు తాత, వయస్సులో ఉన్నప్పుడు గుంటూరులో పొగాకు కొట్టుపెట్టి ఆకూ, కాడా అమ్మి అలా అలా చనిపోయేనాటికి లక్షలు ఆర్జించాడు. నాలుగు పుగాకు బ్యారెన్లుకూడా కట్టించాడు. పొగాకు వ్యాపారంతోపాటుగా వడ్డీ వ్యాపారం కూడా చేసేవాడు. అసలు ఆయన ఆర్జించిందంతా వడ్డీ వ్యాపారంలోనూ, తాకట్ల వ్యాపారంలోనూ అని అంటారు, ఆయన సంగతి తెలిసినవాళ్ళు. ఆయనకు ఒకే ఒక కొడుకు భద్రయ్య. భద్రయ్యకు వ్యాపారంలోని మెలకువలు అంతగా తెలియవు. అతని హయాములో కుదువపెట్టుకున్న నగలు చాలావరకూ నకిలీ నగలని తేలింది. పొగాకు వ్యాపారంలో కూడా లాభాలు తగ్గాయి. ఆయన పోయేనాటికి తండ్రి వదలి పోయిన ఆస్తిలో సగం ఆస్తీ, భార్యా, ఇద్దరు కొడుకులూ మిగిలారు. అప్పటికి కృష్ణారావుకి పందొమ్మిది సంవత్సరాలు. తాతగారి తెలివి పెద్ద కొడుక్కు వచ్చిందని మురిసిపోయేవాడు తండ్రి భద్రయ్య. బి. ఏ. చదువుతున్న కృష్ణారావు తండ్రి మరణంతో చదువుకు స్వస్తిచెప్పి వ్యాపారంలో దిగాడు. భార్య కాపరానికి వచ్చిన మరునాడే అర్థం చేసుకున్నాడు కృష్ణారావు– తను నలుగుర్లో అల్లరి పడకుండా గౌరవంగా బతకాలంటే భార్యమాట వినక తప్పదని.

తండ్రి చనిపోయే నాటికి చంద్రం ఐదేళ్ళవాడు.

ఆ మరుసటి సంవత్సరమే తల్లిపోయింది.

చంద్రానికి స్కూల్లో వచ్చిన బహుమతులన్నీ ఒక్కొక్కటే చూసుకుని కృష్ణారావు ఆనందానికి అంతులేకపోయింది. కాని ఆ ఆనందాన్ని బయటకు వెలిబుచ్చలేని తన అసమర్థతమీద తనకే కోపం వచ్చింది. తన తమ్ముడు చాలా తెలివైనవాడు. ఈ సంవత్సరంతో స్కూలుఫైనలు అయిపోతుంది. ఇప్పటినుంచే వ్యాపారంలో పెడితే తనకు చేదోడు వాదోడుగా ఉంటాడు. వ్యాపారం ముందు ముందు మూడు పువ్వులు – ఆరు

కాయలు కాగల అవకాశం ఉంది. ఇంకో నాలుగైదు సంవత్సరాలకు ఒక ఇంటివాణ్ణి చేస్తే తన బాధ్యత తీరిపోతుంది.

ఆలోచిస్తున్న కృష్ణారావు దృష్టి, బయటకు వెళ్ళిపోతున్న హేమ వేపు మళ్ళింది. హేమ చక్కని పిల్ల! చంద్రం కంటే రెండు సంవత్సరాలు చిన్న. ఏపుగా, తోటకూర మొక్కలా పెరిగిందేమో - చంద్రంకంటే ఓ సంవత్సరం పెద్దగానే కనిపిస్తుంది. హేమకు చంద్రం అంటే ఎంతో ఇష్టం. ఆ భగవంతుడు కనికరిస్తే తన తమ్ముడంత అదృష్టవంతుడు ఉండడు అనుకున్నాడు కృష్ణారావు.

హేమమాలిని ప్రసాదరావు ఏకైక పుత్రిక. వారి కుటుంబం మొదటినుంచి విద్యా సంస్కృతులకు ఆలవాలమై ఉంది. తాతగారు జడ్జి. తండ్రి వకీలు. ప్రసాదరావు అన్నగారు పబ్లిక్ ప్రాసిక్యూటరు. ప్రసాదరావు మాత్రం చిన్నప్పటినుంచి సాహిత్యం అంటే అభిరుచి చూపించేవాడు. కవిత్వం అంటే చెవి కోసుకునేవాడు. తండ్రి అతని అభిరుచిని అర్థంచేసుకొని ప్రసాదరావును తన వంశపారంపర్యంగా వస్తున్న వకీలు వృత్తినుంచి తప్పించి, తెలుగు ఎం. ఏ. చెప్పించాడు.

ప్రసాదరావు ఆర్ట్సుకాలేజీలో లెక్చరరుగా చేరాడు. ఆయనంటే అందరికీ ఎంతో గౌరవం. సంస్కారాన్ని నిర్వచించటం కష్టం. కాని ప్రసాదరావు మూర్తీభవించిన సంస్కారం అనేవారు అందరూ. ఆయన వదనంలో పేరును సార్థకంచేస్తూ ప్రసాదగుణం ఉట్టిపడుతుంటుంది.

ప్రసాదరావు పాతిక సంవత్సరాలు నిండకుండానే భార్యను కోల్పోయాడు. అప్పటికి హేమ రెండేళ్ళది. మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా హేమను అల్లారుముద్దుగా పెంచుకుంటున్నాడు. సవతి తల్లి ప్రేమమీద ఆయనకు నమ్మకం లేదు. హేమను తన ఆదర్శాలకు అనుకూలంగా మలచుకుంటూ వస్తున్నాడు-శిల్పి మట్టిముద్దను మలచినట్లు.

హేమ సాహిత్యం అన్నా, లలితకళలన్నా ఎంతో అభిరుచిని చూపిస్తుంది. వినయవిధేయతలు ఆమె సొత్తు. అంత చిన్న వయస్సులోనే అలవరచుకున్న గాంభీర్యం, ప్రవర్తనలో నిండుతనం, స్కూల్లో మాష్టర్లందర్నీ చకితుల్ని చేసేవి

హేమ తెల్లగా సన్నగా ఉంటుంది. మధ్యకు విరిచికట్టిన రెండు జడలూ ముందుకు పడుతుంటే కొంచెం వంగి నడుస్తుంది. కళ్ళు పెద్దవి కాకపోయినా వయస్సును మించిన భావాలను వ్యక్తపరచే ఏదో ప్రత్యేకత ఆ కళ్ళలో ఉంది. నిరుసోగ ముఖానికి కోటేరు వేసినట్లుండే ముక్కు, మొనతేలిన గడ్డం, చిన్ననోరూ - మొత్తంమీద పదిమందిలో తన ప్రత్యేకతను చాటించుకునే రూపం ఆమెది.

హేమకు చంద్రం అంటే ఎంతో ఇష్టం. ఐదో తరగతి నుంచీ కలసి చదువుతున్నారు. హేమ మాట్లాడుతుంటే శ్రద్ధగా ఆలకించటం చంద్రానికి ఇష్టం.

తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోని చంద్రానికి హేమ తండ్రి ప్రసాదరావు చూపే ఆప్యాయత, హేమ చూపే అభిమానం ఎంతో సంతృప్తిని, ఆనందాన్ని ఇచ్చేవి.

అన్నా - వదినలంటే చంద్రం హృదయంలో ఏ మూలో, అయిష్టం గూడుకట్టుకో సాగింది. వారు చూపే నిరాదరణవల్ల కలిగే బాధ చంద్రం గుండెల్లో రోజురోజుకు చిక్కగా పేరుకుపోసాగింది.

చంద్రానికి అన్న కూతురు రజని అంటే ప్రాణం. బాబాయి ఉంటే ఆ పసిదానికి ఇంకెవరూ అక్కరలేదు.

చంద్రం పదునాలుగేళ్ళు దాటి పదిహేనో ఏడులో అడుగుపెట్టాడు. బక్కపలచగా ఉండే చంద్రం ఉన్న వయసుకంటే ఓ సంవత్సరం చిన్నగానే కనిపిస్తాడు. చామనఛాయ, నొక్కులజుట్టు, దట్టమైన కనుబొమ్మలకింద ఎప్పుడూ ఏదో ఆలోచనలను నింపుకొని ఉండే చిన్నవైనా చురుకైన కళ్ళూ, విశాలమైన ఫాలభాగము, పొడవుగా కొంచెం వంగివుండే ముక్కు, కొంచెం లావుగా కనిపించే పెదవులు - చంద్రం మొత్తంమీద స్ఫురద్రూపి అనే చెప్పాలి.

ఏం చేస్తే వదినచేత తిట్లు తినాల్సివస్తుందో ననే భయంలో పెరిగిన చంద్రం కొత్తవారి ముందు మాట్లాడటానికి జంకుతాడు. హేమ ప్రోత్సాహం లేకుండా ఏ పనీ ధైర్యంగా చెయ్యలేడు.

ఆనాడు స్కూల్లో పేరెంట్సు డే, అన్నా - వదినా వచ్చి తను స్కూల్లో ఎలా ప్రయోజకు డనిపించుకుంటున్నాడో చూడాలని ఉబలాటపడ్డాడు. చీటికీ మాటికీ చీదరించుకొనే వదినకు తనేమిటో తెలుస్తుందని ఆశించాడు. అన్న కృష్ణారావు తన ప్రయోజకత్వం చూసి మురిసిపోతాడని చిత్రించుకున్నాడు మనస్సులోనే చంద్రం. కాని కనీసం అన్నకూడా రాకపోవటం ఎంతో కష్టమనిపించింది అతనికి. అదే అమ్మా - నాన్నా బ్రతికుంటే అలా చేసేవారా? అన్నయ్యకు తనంటే ప్రేమే. వదినకు భయపడి వచ్చి ఉండడు. అయినా అన్నయ్య వదినకు అంతగా ఎందుకు భయపడాలో! అదే తనయితేనా?

చంద్రానికి ఏడుపు పొర్లుకొచ్చింది. దిండులో తలదూర్చి ఏడ్చాడు.

వరండాలో పరధ్యాన్నంగా కూర్చొనివున్న కృష్ణారావు, భార్య కాంతమ్మ అన్నానికి లేవమని కేకపెట్టడంతో ఈ ప్రపంచంలోకి వచ్చాడు.

"చంద్రం భోజనం చేశాడా?" భార్య ముఖంలోకి చూడకుండానే ప్రశ్నించాడు కృష్ణారావు. ఈనాడు తమ్ముడిమీద అనురాగం, జాలీ కట్టలు తెంచుకున్నాయి కృష్ణారావు హృదయంలో. మరోవైపు మొదటిసారిగా భార్యంటే ఓ విధమైన అసహ్యం కలుగుతూంది. ఆమె గొంతు వినిపిస్తే కోపం ఉబికివస్తుంది.

"దొరగారు గదినుంచి బయటకొస్తేనా? ఆయనగార్ని సాగతీసే ఓపికా, తీరికా ఇక్కడ ఎవరికీ లేవు" అంటూ రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది కాంతమ్మ వంటింట్లోకి. అలా వెళుతున్న భార్యను చూస్తుంటే కృష్ణారావుకు పుట్టలోకి వెళుతున్న జర్రిగొడ్డును చూసినట్లనిపించింది.

గబగబా తమ్ముడి గదిలోకి వెళ్ళాడు. చంద్రం వెల్లికిలా పడుకొని నిద్రపోతున్నాడు. అలా నిద్రపోతున్న చంద్రం ముఖంమీద కట్టిన కన్నీటి చారలు చూడగానే కృష్ణారావుకు దుఃఖం పొర్లుకొచ్చింది. వళ్ళుమరచి నిద్రపోతున్న తమ్ముణ్ణి లేపాలనిపించలేదు.

కృష్ణారావు వంటగది గుమ్మంలో నిలబడ్డాడు. కాంతమ్మ రెండు కంచాలలో అన్నం పెడుతున్నది.

"ఆకలిలేదు, అన్నం తినను" అన్నాడు కృష్ణారావు.

"ఊс!" హుంకరిస్తూ రెండు కంచాలలోని అన్నంతీసి విసురుగా గిన్నెలో వేయసాగింది కాంతమ్మ.

కృష్ణారావు వరండాలో ఈజీఛైర్‌లో కళ్ళుమూసుకొని కూర్చున్నాడు. మనస్సంతా కలత కలతగా ఉంది.

"ఏవండీ కృష్ణారావుగారూ, భోజనాలయ్యాయా?"

"ఎవరూ? ప్రసాదరావుగారా! రండి రండి!" అంటూ ఆహ్వానించాడు కృష్ణారావు, తెచ్చిపెట్టుకున్న ఉత్సాహంతో.

"చంద్రం ఏం చేస్తున్నాడు?" అన్నాడు ప్రసాదరావు పైపుపొగను గుప్పుగుప్పున వదులుతూ.

కృష్ణారావు గతుక్కుమన్నాడు. "నిద్రపోతున్నాడు–" అన్నాడు ఎలాగో.

"చూడండి! మన రెండు కుటుంబాలమధ్య ఉన్న చనువుకొద్దీ చెబుతున్నాను, ఏమీ అనుకోకండీ! పసి హృదయాలను నొప్పించకూడదు. తల్లి అయినా తండ్రి అయినా మీరేకదా!"

కృష్ణారావు రాయిలా బిగుసుకుపోయాడు. అది గమనించిన ప్రసాదరావు ప్రసంగం మారుస్తూ "చంద్రం మంచి కవి అవుతాడండీ!" అన్నాడు.

ఇంతసేపూ ముకుళించి ఉన్న కృష్ణారావు వదనం వికసించింది.

"వయస్సుకు మించిన ఊహలు కలవాడు చంద్రం. అతి తెలివైన పిల్లల్ని చాలా జాగ్రత్తగా కాపాడాలి. తెలివైన పిల్లలు అతిత్వరగా మార్గం తప్పే అవకాశాలున్నాయి."

కృష్ణారావు ఉలకలేదు పలకలేదు. కాని అతని బాధ ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది.

"ఆс, అసలు సంగతి – చంద్రాన్ని కాలేజీకి పంపించనంటున్నారట?"

"అవునండీ! వ్యాపారంలో పెడదామనుకుంటున్నాను."

"ఇంత చిన్న వయస్సులో బాధ్యతలు నెత్తినవేయటం భావ్యంకాదు."

"నా ఉద్దేశం అదికాదండీ! ఈ వ్యాపారానికి వాడూ సమభాగస్తుడు. ఇప్పటినుంచే వ్యాపారంలో మెలకువలు తెలిస్తే వాడి భవిష్యత్తుకే మంచిదని అలా అనుకున్నాను" అన్నాడు కృష్ణారావు పట్టుపడిన అపరాధిలా.

"చంద్రం తెలివైనవాడు. రేపు తనకు చదువు లేదని బాధపడవచ్చు. చంద్రం బాగా చదివి పైకిరావాలని దీవిస్తున్నానని ఇవ్వాళ స్కూలు ఫంక్షన్‌లో హెడ్‌మాస్టరుకూడా అన్నారు."

"అలాగేనండీ! మీ అందరి సలహాప్రకారమే, వాడికి ఇష్టం వచ్చినంతకాలం చదువు చెప్పిస్తాను," అన్నాడు కృష్ణారావు, చంద్రాన్ని ఇప్పటినుంచే వ్యాపారంలో పెడితేనే మంచిదని మనస్సులో ఉన్నప్పటికీ.

"సరే వస్తానండీ! ప్రొద్దుపోయింది" శెలవు తీసుకొని వెళ్ళిపోయాడు ప్రసాదరావు.

"ఈయనగారి పని ఊళ్ళోవాళ్ళకు సలహాలు ఇవ్వటమేలాగుంది. అయినా మన బంగారం మంచిదయితే...."

"ఏంటే నీ వాగుడు?" అన్నాడు కృష్ణారావు, మధ్యలోనే భార్య మాటలకు అడ్డువచ్చి.

"మరేంవిటంటి! అతడొచ్చి చెప్పటం. మీరు వాణ్ణి చదివిస్తానని ఒప్పుకోవటం."

"అవును, వాణ్ణి చదివించదలచుకున్నాను,!" ఖచ్చితంగా అన్నాడు కృష్ణారావు.

"ఉన్నదంతా తమ్ముడి చదువుకు దోచిపెట్టి, నా బిడ్డనోట్లో దుమ్ముకొట్టండి."

"వాడు ఈ ఆస్తికి సమభాగస్తుడని మర్చిపోకు," అంటూ కృష్ణారావు అక్కడనుంచి లేచి లోపలకు వెళ్ళాడు విసురుగా.

# 2

"నాన్నా! నాన్నోయ్! చంద్రం రాసిన కథకు మొదటి బహుమతి వచ్చింది నాన్నా!" అంటూ దీపావళి సంచిక చేతిలోపట్టుకొని హేమమాలిని తండ్రి గదిలోకి దూసుకొచ్చింది. ప్రసాదరావు చదువుతున్న పుస్తకం మడిచి బల్లమీద పెట్టాడు. కళ్ళద్దాలు తీసి హేమవైపు చూశాడు. హేమ వదనంలో ఆనందపు అర్ణవం అలుముకుని ఉంది.

"ఏంవిటమ్మా, చాలా హుషారుగా ఉన్నావు?" అన్నాడు ప్రసాదరావు ఆప్యాయంగా కూతురివైపు చూస్తూ.

"చంద్రానికి మొదటి బహుమతి వచ్చింది నాన్నా!" సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అవుతోంది హేమ.

"ఎందులోనమ్మా?" ప్రసాదరావు చిరునవ్వుతో అడిగాడు.

"బాలల కథలపోటీకి చంద్రం కథ రాశాడు – నే నప్పుడే చెప్పాను మొదటి బహుమతి నీదేనని."

"పిచ్చిపిల్ల!" అనుకున్నాడు తండ్రి మనస్సులోనే.

"పెద్దవాడైతే చంద్రం చాలా పెద్దరచయిత అవుతాడుగదు నాన్నా?"

"అవునమ్మా! చంద్రం చాలా గొప్పవాడు అవుతాడు," అన్నాడు. పక్కనే సోఫాలో కూర్చొనివున్న హేమ తలను నిమురుతూ.

"ఇప్పుడే వస్తా నాన్నా!" అంటూ హేమ బయటకు పరుగెత్తింది.

హేమ చంద్రానికి ఈ వార్త అందించటానికే పరిగెత్తిందని తెలుసుకున్న ప్రసాదరావు తనలో తనే నవ్వుకున్నాడు. అన్నీ సవ్యంగానే జరిగితే, దైవం అనుకూలిస్తే, ఆ ఇద్దరూ ఒక ఇంటివాళ్ళయితే – ఇక తనకే కొరతా ఉండదు. కూతురి భవిష్యత్తుని గురించిన తీయని తలపుల్లో తేలిపోయాడు ప్రసాదరావు.

హేమ కృష్ణారావు ఇంటికి వచ్చేప్పటికి హాల్లోవున్న రెండు పడక కుర్చీల్లో కాంతమ్మా – కృష్ణారావు కూర్చొని చంద్రం చదువుగురించి తర్కించుకుంటున్నారు. భార్య పోరుతోపాటు కృష్ణారావులో తమ్ముణ్ణి చదివించాలనే పట్టుదల పెరిగింది. కాంతమ్మ కాపరానికి వచ్చిన ఇంతకాలానికి భర్త ముందు మొదటిసారి ఓడిపోయింది. కోపంతో, రోషంతో ముఖం కందగడ్డలా అయింది.

"చంద్రం, చంద్రం!" అంటూ పరుగెత్తుకుంటూ వచ్చిన హేమ, హాల్లో కృష్ణారావునూ కాంతమ్మనూ చూసి చటుక్కున ఆగిపోయింది.

"రామ్మా రా! నాన్నగారేం చేస్తున్నారు?" కృష్ణారావు ఉత్సాహంగా అడిగాడు, అప్పటికి భార్యతో పడుతున్న ఘర్షణ ఆగిపోయినందుకు సంతోషిస్తూ.

"ఇప్పుడే భోజనంచేసి ఏదో చదువుకుంటున్నారు. చంద్రం లేడండీ?" అన్నది హేమ.

"ఉన్నాడమ్మా! చంద్రం!" అంటూ కేకవేశాడు కృష్ణారావు.

"చూశారా! పత్రికలో చంద్రం రాసినకథ పడింది. మొదటిబహుమతికూడా వచ్చింది" అంటూ హేమ తన చేతిలోని పత్రికను కృష్ణారావుకు అందించింది. కృష్ణారావు చేతిలోకి తీసుకున్నాడో లేదో కాంతమ్మ వచ్చి లాక్కుంది. హేమ కాంతమ్మవైపు గర్వంగా చూసింది. ఈ దెబ్బతో కాంతమ్మ చంద్రాన్ని ఎలా చులకనగా చూడగలదో చూస్తాగా అనుకుంది.

"నిజంగా?" కృష్ణారావు ప్రశ్నించాడు. కంఠంలో ఆశ్చర్యం, ఆనందం మిళితమైనాయి. చంద్రం రజనిని ఎత్తుకొనివచ్చి అన్న దగ్గరగా నిలబడ్డాడు. హేమవేపు చూసి చిరునవ్వుతోనే పలకరించాడు.

"చంద్రం! నీ కథకు మొదటి బహుమతి వచ్చిందట. హేమ ఎంత మంచివార్త తెచ్చిందో చూడు. నిన్ను చూసుకుని నిజంగా గర్విస్తున్నాను చంద్రం! నీకు ఇష్టమొచ్చినంతకాలం చదువుకో. వెధవ వ్యాపారం .... వెధవ లెక్కలు... నువ్వే రాయాలా ఏం? అవసరమైతే ఇంకో మేనేజర్ను పెడతాను." కృష్ణారావు సంతోషాన్ని వెలిబుచ్చేడు.

చంద్రం కోర్కెలకు రెక్కలు తొడిగినట్లయింది. ఆనందంతో తేలిపోతూ, వంగి అన్న పాదాలకు నమస్కరించాడు. అలా వంగిన తమ్ముణ్ణి రెండు చేతుల్తో పైకి లేవనెత్తాడు. కృష్ణారావు కళ్ళలో నీరు తిరిగింది. అవి ఆనంద బాష్పాలో లేక ఇంతవరకు తమ్ముడి యెడల చూపిన నిరాదరణను తలచుకొన్నందువల్ల వచ్చిన దుఃఖాశ్రువులో చెప్పడం కష్టమే.

ఆ దృశ్యాన్ని చూస్తున్న హేమ ఆనందానికి అంతం లేదు.

కాంతమ్మకు వళ్ళు మండిపోయింది.

"ఓ యబ్బో! ఇంకేమో అనుకున్నా! ముష్టి యాభయ్ రూపాయల బహుమతికేనా అన్నదమ్ములిద్దరూ అంత మురిసిపోతున్నారు?" కాంతమ్మ మూతి తిప్పింది.

"ఎంతడబ్బు వచ్చిందనేది కాదు, మొదటి బహుమతి రావటం గొప్ప. దాని ఖరీదును డబ్బుతో కట్టలేం" అన్నాడు కృష్ణారావు.

అప్పటికే కథ చదవటం మొదలుపెట్టిన కాంతమ్మ కృష్ణారావు మాట వినిపించుకోలేదు. చంద్రం ఉత్సాహం నీరు కారిపోయింది. హేమ ముఖంలో నిరుత్సాహం కనిపిస్తోంది.

అందరూ మౌనంగా ఆలోచిస్తున్నారు. అంత ఉత్సాహం ఇంతలో చల్లబడటం చూసిన కృష్ణారావు మనస్సు చివుక్కుమంది.

"చంద్రం! ఇవ్వాళ మనమందరం కలసి సినిమాకు వెళదాం. హేమా! మీ నాన్నగారిని కూడా రమ్మను" అన్నాడు కృష్ణారావు.

చంద్రం కళ్ళలో కాంతిరేఖలు కదిలాయి. వదినవైపు చూశాడు. కృష్ణారావు, హేమా కూడా ఆమెవైపు చూశారు. కాంతమ్మ కథ చదువుతూంది. ఆమె కనుబొమలు ముడిపడ్డాయి. కోపం ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది.

"చూశారా! చూశారా! ఎంతపని చేశాడో మీ ముద్దుల తమ్ముడు" అంది కాంతమ్మ. ఆమె గొంతులో కోపం, దుఃఖం నేను ముందంటే నేను ముందని పోటీ పడుతున్నట్లనిపించింది.

"ఏం చేశాడేమిటి! విసుగ్గా అన్నాడు కృష్ణారావు. `ఇలాంటి సంతోష సమయంలో కూడా భార్య ధోరణికి అసహ్యించుకుంటూ.

"ఇంకా ఏం చెయ్యాలి! ఈ కథ నామీదే రాశాడు-" కాంతమ్మ గొంతు బొంగురుపోయింది.

చంద్రం ఉలిక్కిపడి వదిన ముఖంలోకి చూశాడు. హేమ ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేస్తూ చూచింది చంద్రం ముఖంలోకి. కృష్ణారావు పకపక నవ్వాడు.

"నా బతుకు చూస్తే మీ అందరికీ నవ్వుగా ఉంది. అంత తేలికయిపోయాను" కాంతమ్మ గొంతులో మాటలు ఉంగిడి చుట్టుకుపోయాయి.

"ఛ! ఏమిటి కాంతం! నీ ధోరణీ నువ్వూ! ఇవ్వాళ మనందరంకలసి చంద్రంతో సినిమాకు వెళ్ళాలి" అన్నాడు కృష్ణారావు, భార్యను బతిమాలుకుంటున్న ధోరణిలో.

"నా బతుక్కి ఆ సినిమా ఒక్కటే తక్కువ." ఛీత్కారం చేసింది కాంతమ్మ.

"ఇప్పుడు నీ బతుక్కి వచ్చిన లోపం ఏమిటో?"

"ఇంకా ఏం కావాలి? నా బతుకు బజార్లోకి ఎక్కింది. నిండా పద్దానుగేళ్ళు లేని రాలుగాయి నన్ను పత్రికలలోకి ఎక్కించటమూ, కట్టుకున్న మొగుడు అది చూసి ఆనందించటం. ఇంతకంటే ఇంకేం కావాలి?"

"చంద్రానికి నువ్వంటే ఎంతో గౌరవం, ప్రేమా.... నువ్వే వాణ్ణి...."

"అవును, నేనే వాణ్ణి కాల్చుకు తింటున్నాను. వాడు రాసింది కూడా అదే. వదినకు బదులు సవతితల్లి అని పెట్టాడు అంతే." కాంతమ్మ పమిటచెంగుతో కళ్ళు అద్దుకుంది.

చంద్రం తన భుజాలమీద నిద్రపోతున్న రజనితో లోపలకు వెళ్ళిపోయాడు. హేమ తలవంచుకొని చిన్నగా బయటకు వెళ్ళిపోయింది. ఇది చూసిన కృష్ణారావు గుండెలలో కోపం సుళ్ళు తిరిగింది.

"ఛీ రాక్షసీ! పిల్లల్ని బాదపెట్టటానికికూడా వెనకాడవు."

"అవును, నేను రాక్షసినే. నీ తమ్ముడు కూడా అలాగే రాశాడు. నేను పిల్లల్ని పీక్కుతినే రాక్షసిని. నేను మనిషిని గాను" అంటూ శోకాలు మొదలుపెట్టింది కాంతమ్మ.

కృష్ణారావుకు ఏం చెయ్యాలో తోచలేదు. కండువాతీసి భుజంమీద వేసుకొని మండే ఎండలో ఎటో నడచి పోయాడు. కాంతమ్మ మీద కోపం వస్తే కృష్ణారావు

చెయ్యగలిగిన వనల్లా ఇదొక్కటే - నాలుగయిదు గంటలపాటు ఆమె కళ్ళకి కనిపించకుండా వెళ్ళిపోవటం.

ఛీ! తన బ్రతుకెందుకు! ఈనాడుకూడా తమ్ముణ్ని సంతోషపెట్టలేకపోయాను. బీదతనంవల్ల మానవుడు కుంగిపోతాడు. బాధలకు గురి అవుతాడు కానీ బీదవాడు కూడా అనుకూలవతియైన భార్య ప్రేమలో క్షణకాలంపాటు తన కష్టాలను మరిచి స్వర్గవిహారం చెయ్యగలడు. ఇంట్లో ఆడవాళ్ళు తెలివితక్కువగా, గయ్యాళిగా, మొండిగా ఉంటే ఎంత ధనం ఉన్నా మానవుడు సుఖించలేడు.

ఊరంతా కాలుకాలిన పిల్లిలా అశాంతిగా తిరిగి కృష్ణారావు రాత్రి పదిగంటలకు ఇంటికి చేరాడు. వస్తూనే చంద్రం గదివైపు నడిచాడు.

చంద్రం వళ్ళుమరచి నిద్రపోతున్నాడు. చంద్రం పక్కనే నిద్రపోతున్న రజని బోసినవ్వులు విరజిమ్ముతోంది. రజని చంద్రాన్ని ఒక్క నిముషం విడిచి ఉండదు. "నువ్వన్నా త్వరగా పెద్దదానివయి మీ అమ్మకు బుద్ధి చెప్పమ్మా!" అనుకున్నాడు కృష్ణారావు.

బయటకువస్తున్న కృష్ణారావు ఉలిక్కిపడి గడపలోనే ఆగిపోయాడు.

"కొట్టొద్దు! అన్నయ్యా, నన్ను కొట్టకు - నేను ఆ కథ వదినమీద రాయలేదు. రజనితోడు! అమ్మతోడు! నీమీద రాయలేదు వదినా!" కలవరిస్తున్నాడు చంద్రం.

'నన్ను కొట్టకు అన్నయ్యా! నేను తప్పు చెయ్యలేదు. ఇక నేను ఎప్పుడూ కథలు రాయను'.

కృష్ణారావులోని చైతన్యం గడ్డకట్టిపోయింది. రాయిలా బిగుసుకుపోయాడు.

ఎంతోసేపటికికాని కృష్ణారావు తేరుకోలేదు. నిద్రపోతున్న తమ్ముడిమీదకు వంగి నొసటిని ముద్దుపెట్టుకున్నాడు. కృష్ణారావు రెండు కళ్ళనుండి జారిన కన్నీరు చంద్రం ముఖాన్ని తడిపింది.

# 3

తెల్లవారితే పరీక్షా ఫలితాలు తెలుస్తాయి. ఆ రాత్రి చంద్రానికి నిద్ర పట్టలేదు. పక్కమీద ఇటూ అటూ పొర్లుతున్నాడు. నిద్ర పట్టందే? ఏమయినా కథ రాసుకుంటే! గబుక్కున లేచి కూర్చున్నాడు. కాగితాలూ కలం తీసుకున్నాడు. పరీక్ష ఏమౌతుందో! ఒకవేళ తను తప్పితే! లెక్కలు బాగా చెయ్యలేదు. ఎందువల్లనో ఎంత ప్రయత్నించినా తనకు లెక్కలు సరిగ్గా రావు! పరీక్ష రాసి తప్పక పాసవుతాను అనుకున్నాడు. కాని రోజులు గడిచినకొద్దీ పరీక్ష పోతుందేమోననే భయం పెరగసాగింది. తీరా పరీక్షా ఫలితాలు తెలిసేరోజు దగ్గరకు వచ్చింది. తనకు పరీక్ష పాసవుతాననే నమ్మకం పూర్తిగా పోయింది.

చేతిలోని కాగితాలూ, కలం బల్లమీద పెట్టి పుస్తకాల బీరువా దగ్గరకు వెళ్ళాడు. డిటెక్టివ్ నవల అయితే బుర్రకు పూర్తిగా పని కల్పించవచ్చునుకొని "పీపాలో శవం" బయటకు తీశాడు ఊహుఁ, వాక్యం ముందుకు జరిగితేనా? అక్షరాలు అంకెల్లా కనిపిస్తున్నాయి. అందులో తన నంబరు కనిపించటంలేదు.

తన భవిష్యత్తంతా రేపు రాబోయే పరీక్షా ఫలితాల మీదనే ఆధారపడి ఉంది. వదినకు తను పైచదువు చదవటం ఇష్టంలేదు. ఒక రకంగా అన్నయ్యకు కూడా ఇష్టంలేదు. అన్నయ్యకు తనను ఇప్పటినుంచే వ్యాపారంలో పెట్టటం ఇష్టం. తను పరీక్ష తప్పితే అన్నయ్య దగ్గిర పైచదువుకు వెళ్తానని పట్టు పట్టలేదు. అన్నయ్య వదినను కాదనలేదు. తను చదువుకు స్వస్తి చెప్పక తప్పదు.

అయితే ఇక తనకు చదువుకొనే అదృష్టమే ఉండదా? అమ్మా, నాన్నా ఉంటే తను ఒకసారి పరీక్ష తప్పినంతమాత్రాన చదువు మాన్పించి ఇంట్లో కూర్చోపెట్టేవారా? తల్లిదండ్రులకు దూరమై ఈనాడు బాధపడుతున్నాడు. చదువుసంధ్యలకు దూరమైతే తను జీవితమంతా బాధ పడాల్సిందే.

చదువులేని తనతో హేమ ఇప్పటిలాగే స్నేహంగా ఉంటుందా? తనను ప్రసాదరావుగారూ, హేమా ఎప్పటిలాగే గౌరవిస్తారా? హేమ రేపటినుంచీ కాలేజీకి వెళుతుంది. మరి తనో! అన్నయ్య పక్కన కూర్చొని లెక్కలు వ్రాయటం నేర్చుకుంటాడు. చంద్రానికి ఏడుపు పొర్లుకొస్తోంది.

లేదు! ఏది ఏమయినా తను తప్పక చదువుతాడు. ఇటు ప్రపంచం అటు అయినా తను హేమ దృష్టిలో చిన్న కావటాన్ని సహించలేడు. తను ఎటూ "గురుకుల్" వెళ్ళి చదవాలనుకుంటున్నాడు. ఆ చదువుకు ఈ పరీక్షతో నిమిత్తంలేదు.

"గురుకుల్" వెళ్ళి చదవాలని ఉన్నదని చెప్పినప్పుడు ప్రకాశం హేమా కూడా ఫక్కున నవ్వారు. చిన్నప్పుడు రామ మందిరంలో పురాణకాలక్షేపం చాలా శ్రద్ధగా వినేవాడు. ఆశ్రమాలలో ఋషుల దగ్గర శుశ్రూష చేసి విద్య నార్జించే బ్రహ్మాచారుల కథలు తనకు ఎంతో ఆనందాన్ని కలిగించేవి. తనకు కూడా అలాంటి జీవితం గడపాలనిపించేది. "గురుకుల్" వాతావరణం కూడా అలాగే వుంటుందట. తనకు అందరిలా కాలేజీ డిగ్రీలమీద మోజు ఏనాడూ లేదు.

సంస్కృత సాహిత్యాన్ని క్షుణ్ణంగా చదివి మన భారతీయ సంస్కృతిని ఆకళింపు చేసుకోవాలనేదే తన కోరిక. తను తప్పక వెళ్ళి తీరుతాడు, చదువుతాడు. తను గొప్పవాడు కావాలి. ముఖ్యంగా హేమకోసం, హేమ సంతోషంకోసం తను గొప్పవాడు కావాలి.

తెలతెలవారుతూండగా చంద్రం ఆలోచనలనుంచి నిద్రాదేవి ఒడిలోకి జారిపోయాడు.

ముత్తయిదువు నొసటి కుంకుమలా తూర్పుదిక్కున సూర్యబింబం ఎర్రగా మిలమిల లాడుతూంది. దూరంగా ఫ్యాక్టరీ కూత కూలీలను ఆహ్వానిస్తున్నది. కృష్ణారావు కాఫీతాగి సిగరెట్టు వెలిగించాడు తాపీగా. ఇంతలో పేపరు కుర్రాడు పేపరు విసిరేసి వెళ్ళాడు.

"ఇవ్వాళ చంద్రం పరీక్షలు పడతాయటగా?" అంది కాంతమ్మ, పేపరు తిరగేస్తున్న భర్త నుద్దేశించి.

కృష్ణారావుకు ఆ విషయం గుర్తులేదు. తమ్ముడు తప్పక పాసవుతాడని అతని విశ్వాసం.

అన్ని కథలు రాసి, అందరి మెప్పునూ, అభిమానాన్నీ చూరగొన్న చంద్రానికి ఈ పరీక్ష పాసుకావటం ఒక లెక్కా అనుకున్నాడు. నింపాదిగా, ఎలాటి ఆదుర్దా లేకుండా పరీక్షా ఫలితాలు పడ్డ పేజీ తిప్పాడు.

చంద్రం నంబరు కనిపించలేదు. మళ్ళీ ఆదుర్దాగా పైనుంచి క్రిందకు వెతకసాగాడు. తమ్ముడు తప్పాడని నమ్మలేకుండా ఉన్నాడు కృష్ణారావు. ఫస్టుక్లాసులో హేమమాలిని ఒక్కతే పాసయింది.

"ఏం, అంతసేపు చూస్తున్నారు, పాసయాడా?" అన్నది కాంతమ్మ. 'నాకు ముందే తెలుసు ఆ వాజమ్మ పాసుకాడని' అనే భావం స్ఫురిస్తూంది. కాంతమ్మ స్వరంలో.

కృష్ణారావుకు ఆమె ముఖంలోకి చూసే ధైర్యం లేదు.

"చెప్పరేం?" రెట్టించింది కాంతమ్మ.

"ప్యాసుకాలేదు". గొణిగాడు కృష్ణారావు.

"హేమ పాసయిందా?"

"ఆ - ఫస్టుక్లాసు వచ్చింది" అంటూ లేచి కృష్ణారావు చంద్రం గదివైపు నడిచాడు. కాంతమ్మ వెనకే బయలుదేరింది.

చంద్రం మంచి నిద్రలో ఉన్నాడు. విసురుగా గదిలో ప్రవేశించిన కృష్ణారావు, నిద్రపోతూన్న చంద్రాన్ని చూసి మంచం దగ్గరే ఓ క్షణం నించున్నాడు. సాలోచనగా, చేతిలో ఉన్న పేపరు మంచం పక్కనే ఉన్న టేబుల్‌మీద పడేసి నీరసంగా బయటకు నడిచాడు కృష్ణారావు. పరీక్ష తప్పిన తమ్ముడిగదిలోకి ప్రవేశించిన కృష్ణారావుకు నిద్రపోతున్న చంద్రం ముఖం చూడగానే ఏదో అవ్యక్తమైన బాధ కలిగింది. ఆ బాధ జాలితో మిళితమైనది. చంద్రాన్ని నిద్రలో చూచినప్పుడల్లా కృష్ణారావుకు తల్లిదండ్రులు గుర్తొస్తారు. తల్లితండ్రుల ఆదరణకు దూరమైన తమ్ముని యెడల కృష్ణారావు హృదయంలో జాలి కట్టలు తెంచుకుంటుంది-ఇలాంటి సమయాలలో.

"సిగ్గు లేకపోతేసరి ముఖానికి! ఇంకా నిద్రపోతున్నాడు. ఆడపిల్ల ఫస్టున పాసయింది. ఇంట్లో వాళ్ళమీద కథలు రాయటం వచ్చిన వాడికి పరీక్ష వ్రాయటం రాదుకాబోలు-" కాంతమ్మ గొంతు నిద్రపోతూన్న చంద్రం చెవుల్లో గరగరలాడింది. ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. అప్పటికే కృష్ణారావు, కాంతమ్మ బయటకు వెళ్ళిపోయారు.

చంద్రానికి వళ్ళంతా విరగ్గొట్టినట్లుంది. రాత్రంతా నిద్రలేదు. తెల తెల వారుతూండగా నిద్రపట్టిందేమో మండిపోతున్నాయి - చాలని నిద్రతో బరువుగా వాలిపోతూ కళ్ళు.

మండుతూన్న కళ్ళను బరువుగా, బద్ధకంగా తెరిచాడు. ఎదురుగా టేబులుమీద పత్రిక కనిపించింది. అంతా అర్థమయింది. అయినా ఏదో ఆశ! వణుకుతున్న చేతులలోకి పత్రిక అందుకున్నాడు.

అనుకున్నంతా అయింది. ఇప్పుడు తను అన్నకు ముఖం ఎలా చూపించాలి?

"తగిన శాస్తి జరిగింది - తమ్ముడి తెలివితేటలకు విరగపడ్డందుకు."

కాంతమ్మ అంటున్న మాటలు చంద్రం విన్నాడు. అన్నయ్య ఏమంటున్నాడో వినాలని ప్రయత్నించాడు. కాని అన్నయ్య గొంతు వినిపించలేదు. అన్నయ్య ఏమీ అనలేదు. బహుశా తనలాగే బాధపడుతూ ఉండి ఉంటాడు. అన్నయ్యకు తనంటే ఎంతో ప్రేమ. కాని తను ఆ ప్రేమను నిలుపుకోలేకపోయాడు. తను కవిత్వమనీ, కథలనీ

పెట్టుకోకుండా ఇంకొంచెం శ్రద్ధగా చదివి ఉంటే పరీక్ష తప్పక పాసయి ఉండేవాడు చంద్రానికి తను ఏదో తప్పుచేసినట్లనిపించిది.

చంద్రం దొంగలా అన్నా-వదినలను తప్పించుకొని బాత్‌రూమ్‌కు వెళ్ళి కాళ్ళూ, చేతులు కడుక్కొని వచ్చి, బట్టలు వేసుకున్నాడు. కాఫీ తాగటానికి వంటింట్లోకి వెళ్ళటానికి ధైర్యం చాలలేదు. చిన్నగా ఇంటినుండి బయటపడ్డాడు.

ప్రసాదరావుగారి ఇంటిముందుకు వచ్చిన చంద్రం ఏదో ఆలోచించి వెంటనే గిరుక్కున తిరిగి, గబగబా పక్క సందులోకి వెళ్ళిపోయాడు. పరీక్ష తప్పిన తను ఏ ముఖం పెట్టుకుని వెళతాడు హేమ ఎదుటకు? తను పాసయివుంటే తెల్లవారేటప్పటికి హేమ పరుగెత్తుకుని వచ్చి ఉండేది. కాని తను పరీక్ష తప్పాడు. హేమగానీ, ప్రసాదరావుగారు కాని రాలేదు. బహుశా వారి దృష్టిలో తను ఈ రోజునుంచీ తెలివి తక్కువ వాడు కావచ్చును. ఛ! అలా ఎప్పటికీ కాదు. కేవలం తను చిన్నబుచ్చుకుని ఉంటాడు. తను బాధ పడడం చూడలేకనే హేమ వచ్చి ఉండదు.

ఏది ఏమయినా హేమ ఫస్టున వచ్చినందుకు అభినందించటానికి తను వెళ్ళి ఉండాల్సింది. తనకు ఆ గడపలో కాలు పెట్టటానికి ఎందుకు మనస్కరించలేదు? ఎందువల్ల? తనలో ఏ మూలన్నా హేమంటే ఈర్ష్యవుందా? అలా ఎన్నటికీ కాదు. హేమకు తను పరీక్ష తప్పటంవల్ల బాధ కలుగుతుందని తనకు తెలుసు. అందువల్లనే ఆమె ముందుకు వెళ్ళటానికి మొహం చెల్లడంలేదు తనకు.

చంద్రం తిండీ, నీరు లేకుండా ఆనాడు ఎక్కడెక్కడో తిరిగాడు పిచ్చివాడిలాగ. ఊరంతా తిరిగి తిరిగి పబ్లిక్ పార్కుకెళ్ళి కూర్చున్నాడు.

మంచు కురుస్తోంది. చలికాలం కావటంవల్ల ఏడు గంటలకే పార్కులో జనం పల్చబడ్డారు. రెండుచేతులూ మెలిక వేసుకొని భుజాలు పట్టుకొని పార్కు బెంచీమీద ఒక మూల ముడుచుకుని కూర్చుని ఉన్నాడు చంద్రం. ఇంటికి వెళ్ళాలంటే భయంగా ఉంది. అన్నయ్య ఏమంటాడో, వదిన ఏమంటుందో! వాళ్ళు అన్నా అనకపోయినా తనకే వాళ్ళ ఎదటపడాలంటే సిగ్గుగా ఉంది.

"చంద్రంలా ఉన్నాడు, చూడు నాన్నా!" అంటూ హేమ, చంద్రం కూర్చున్న బెంచీ దగ్గరకు వచ్చింది. చంద్రం ఉలిక్కిపడి హేమవైపు చూశాడు. హేమ వెనకనే ప్రసాదరావు చేతికర్రతో నిల్చొని ఉన్నారు. చంద్రం బెంచీ మీదనుంచి లేచి నిల్చున్నాడు. ఏం మాట్లాడాలో తోచలేదు.

హేమ వదనం-చంద్రం ఊహించినట్లు వికసించి లేదు వాడిపోయి ఉంది. చంద్రానికి ఆశ్చర్యం కలిగింది. హేమ చంద్రం పరీక్ష తప్పినందుకు బాధపడుతూంది. తను ఫస్టున పాసయిన సంతోషం ఏ కోశానా కనిపించటంలేదు. అర్థం చేసుకొన్న చంద్రం తను పట్టి అసమర్థుడు అనుకొని కుంగిపోయాడు. హేమ తనకంటే వయస్సులో, ఉదారతలో ఎంతో పెద్దదయినట్లు కనిపించింది చంద్రానికి.

"క్షమించు హేమా! నిన్ను కంగ్రాచ్యులేట్ చెయ్యటానికి రాలేకపోయాను" అన్నాడు చంద్రం సిగ్గుపడుతూ.

"బలేవాడివే. నీ పరీక్షపోయి బాధపడుతున్న వాడివి నన్ను కంగ్రాచ్యులేట్ చెయ్యటానికి రావటం ఏమిటి? ఉదయం పేపరు చూడగానే నేనూ నాన్నగారూ రావాలనుకున్నాం. కానీ నీవు ఎంత బాధపడుతూ ఉంటావో ఊహించిన నేను రాలేకపోయాను. నాన్నగారుకూడా రాత్రికి వెళదాంలేమ్మా అన్నారు."

"ఆఁ అవును, చంద్రం! పొద్దుటినుంచీ నువ్వు ఇంటికే రాలేదట? మీ అన్నయ్యకు ఒకటే గాబరా. ఫోనులమీద ఫోనులు చేశాడు. మీ వదిన కూడా పాపిష్టిదాన్ని, నేనే తిట్టి చంద్రాన్ని ఇంటినుంచి వెళ్ళగొట్టానని ఏడుస్తున్నదట. ఇంట్లో ఎవరూ అన్నాలు తిన్నట్టులేదు. పద ఇంటికి వెళదాం," అన్నాడు ప్రసాదరావు.

అందరూ నడుస్తున్నారు మౌనంగా. చంద్రం బుర్రలో ఆలోచనలు ముసురుకుంటున్నాయి. వదిన ఏడ్చిందా? వదినకు తనంటే నిజంగా ప్రేమ ఉన్నదన్న మాట!

ఆమెకు తన ప్రేమను ఎలా చూపించాలో తెలియదు. పైకి ఎంత కఠినంగా కనిపించినా ఒకోసారి అంతగా కరిగిపోతుంది.

ప్రసాదరావు చంద్రాన్ని బలవంతంచేసి ముందు తన ఇంటికి తీసుకెళ్ళాడు. భోజనంచేసి ప్రసాదరావు చంద్రాన్ని వెంటబెట్టుకొని వచ్చేప్పటికి కృష్ణారావు వరండాలో ఆదుర్దాగా పచార్లు చేస్తున్నాడు.

తమ్ముడు ఏమయాడో తెలియదు. తను ఇంతవరకూ వెదికాడు కాని, ఎక్కడా కనిపించలేదు. ఏవేవో అపశృతులతో హృదయం కంపించిపోతూంది. కాంతమ్మ కనిపిస్తేనే కళ్ళలో కారం చల్లినట్లుంది – కృష్ణారావుకి. అల్లరి చేస్తున్న రజనికి రెండు తగలనిచ్చాడు. కాంతమ్మ కూడా ఏదో అరిష్టాన్ని ఊహించుకొని భయంతో కుక్కిన పేనులా, బిక్కమొహంతో వంటింటి గడపలోనే కూర్చుండిపోయింది.

ప్రసాదరావుతో కలిసివస్తున్న చంద్రాన్ని చూడగానే కృష్ణారావుకి ప్రాణం లేచి వచ్చింది. తమను అంత గాబరా పెట్టినందుకు కోపంకూడా రాకపోలేదు. తమాయించుకున్నాడు.

"కృష్ణారావుగారూ! చంద్రం మా ఇంట్లో భోజనం చేశాడు. దిగాలుపడి పార్కులో కూర్చొనుంటే చూసి, ఇంటికి తీసుకెళ్ళి ధైర్యం చెప్పాను. అసలే కుంగిపోతున్నాడు. సున్నిత హృదయం, మరేమీ అనకండి" అన్నాడు ప్రసాదరావు కుర్చీలో కూర్చుంటూ.

"అసలు వాణ్ణి నేనేమయినా అంటేగదా మీరేమయినా అనటానికి? ఏంరా, అలా వెళ్ళేవాడివి మాటమాత్రం చెప్పొద్దూ! ఉదయం నుంచీ మీ వదినా, నేనూ కూడా ఎంత బాధపడిపోతున్నామో ఊహించావా?"

"వాడి దృష్టిలో మనం రాక్షసులం. మనం తనకోసం ఎందుకు బాధపడతాం?" అంటూ అందుకుంది కాంతమ్మ.

చంద్రం అపరాధిలా తలవంచుకొని నిలబడ్డాడు. కాంతమ్మ రజని ఏడుపువిని లోపలకు వెళ్ళిపోయింది. కృష్ణారావు, ప్రసాదరావు కూర్చుని ఉన్న కుర్చీకి ఎదురుగా కూర్చున్నాడు. అదను చూచుకొని చంద్రం చిన్నగా అక్కడనుంచి కదలాడు.

"చంద్రం! ఇలా వచ్చి కూర్చో" అన్నాడు ప్రసాదరావు.

రెండు అడుగులు ముందుకు వేసిన చంద్రం అలాగే నిలబడిపోయాడు.

"రా! కూర్చో" అన్నాడు కృష్ణారావు. చంద్రం వెళ్ళి అన్న పక్కగా కూర్చున్నాడు.

"పరీక్ష పోయినందుకు చాలా బాధపడుతున్నాడు. ఇక చదువుమాని వ్యాపారంలో దిగమంటారని భయపడుతున్నాడు," అన్నాడు ప్రసాదరావు–చల్లకువచ్చి ముంత దాచట మెందుకు అన్న ధోరణిలో.

"అవునండీ, నేనూ అలాగే అనుకుంటున్నాను. పాసయితే చదివించాలనే అనుకున్నాను. మళ్ళీ ఈ స్కూలు ఫైనల్ ఇంకో సంవత్సరం చదవాలి. అయినా స్వంత వ్యాపారం ఉన్నవాళ్ళకి డిగ్రీ చదువు లెందుకులెండి! ఉద్యోగం చెయ్యాల్సిన అవసరం చంద్రానికి లేదు. నలుగురికి ఉద్యోగం యివ్వగల వ్యాపారం చేతిలో ఉన్నవాళ్ళం. ఇప్పటినుంచే వాణ్ణి వ్యాపారంలో పెడితే మంచిది" అన్నాడు కృష్ణారావు సిగరెట్టు ముట్టించుకొంటూ.

"నేను ఇంకా చదువుకుంటాను." గొణుగుతూ లోపలికి వెళ్ళాడు చంద్రం.

అలా వెళుతున్న చంద్రంవైపు చూస్తూ సిగరెట్టు పొగ వదులుతున్నాడు కృష్ణారావు.

"చంద్రానికి గురుకుల్ వెళ్ళి చదవాలనివుంది. భారతీయ సంస్కృతినీ, చరిత్రనూ క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలనీ, అది ఇంగ్లీషు చదివి సాధించేది కాదనీ చంద్రం అభిప్రాయం. సంస్కృత సాహిత్యాన్ని క్షుణ్ణంగా చదవాలని ఉవ్విళ్ళూరుతున్నాడు. ఇంత చిన్నతనంలో అన్ని నిశితమైన అభిప్రాయాలున్న కుర్రాడి మేథస్సు ఎలాంటిదో ఊహించుకోండి. అతను కల్పించుకున్న ఊహాసౌధాల్ని పడగొట్టకండి. పసిహృదయం గాయపరచకండి గురుకుల్‌కు పంపించండి. అక్కడ చాలా నియమాలను పాటించాలి. అవన్నీ నచ్చకపోతే తిరిగి వచ్చేస్తాడు. మీరు మాత్రం పంపించకుండా ఉండి, తరువాత పశ్చాత్తాపపడే పరిస్థితులు కల్పించకండి–" అన్నాడు ప్రసాదరావు.

లోపల ఇష్టం లేకపోయినా చంద్రం సంతోషం కోసం ఒప్పుకున్నాడు కృష్ణారావు. పోనియ్, కొంతకాలం వదినగారి సాధింపులన్నా తగ్గుతాయి అని మనస్సుకు సర్ది చెప్పుకున్నాడు. ఏడు సంవత్సరాలు తమ్ముణ్ణి వదలి ఉండాలంటే తనకు కష్టంగానే ఉంది. కానీ తనక్కూడా భార్యమధ్యా - తమ్ముడిమధ్యా అడకత్తెరలో పోకలాంటి బ్రతుకు తప్పుతుంది. మళ్ళీ తిరిగివచ్చేప్పటికి చంద్రం ఇరవై రెండు ఏళ్ళవాడు అవుతాడు. పూర్ణ వ్యక్తిత్వంతో వస్తాడు. తమ్ముణ్ణి పాతికేళ్ళ రూపాన్ని ఊహల్లోనే చిత్రించుకున్న కృష్ణారావు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయాడు.

ఇంతలో కృష్ణారావు పొగాకు కంపెనీలో పనిచేసే నాగేంద్రం వచ్చి నిలబడ్డాడు.

ప్రసాదరావు - "పొద్దుపోయింది. వస్తా"నంటూ తను వచ్చినపని సవ్యంగా జరిగినందుకు సంతోషంతో చేతికర్ర ఊపుకుంటూ వెళ్ళిపోయాడు.

"ఏం నాగేంద్రం! ఇంత పొద్దుపోయి వచ్చావు?" అడిగాడు కృష్ణారావు.

"ఆ పొగాకు అమ్మిన తాలూకు వెయ్యిరూపాయలు ఇంతకుముందే ఆ ఆసామి తెచ్చి ఇచ్చాడు. నా దగ్గిర ఆ పూరి గుడిసెలో దాచటానికి భయపడి ఇచ్చిపోదామని

వచ్చాను బాబుగారూ!" అంటూ రొంటినుంచి రూపాయల కట్టతీసి అందించాడు నాగేంద్రం కృష్ణారావుకు. కృష్ణారావు నోట్లు లెక్కపెట్టాడు. పది వంద రూపాయల నోట్లు.

చంద్రం రజనిని భుజాలమీద కూర్చోపెట్టుకుని ఆడిస్తూ వరండాలోకి వచ్చాడు.

"బుల్లెమ్మగోరూ! ఇంకా నిద్రపోలా?" అంటూ నాగేంద్రం, చంద్రం దగ్గిరకెళ్ళి రజనిని అందుకోబోయాడు. గళ్ళలుంగీ, ఎర్ర బనీనులోనుంచి నల్లగా బలిసిన శరీరం, నాగేంద్రం రూపం చూసి రజని రెండు చేతులతో బాబాయి మెడను చుట్టివేసి మొహం పక్కకు తిప్పుకుంది.

డబ్బు లెక్క పెట్టుకుని కృష్ణారావు తలెత్తి చంద్రం వైపుచూశాడు. అతని బుర్రలో ఓ ఆలోచన మెరిసింది. చంద్రాన్ని గురుకుల్ పంపించటానికి ఎటూ నిర్ణయించుకున్నాడు. ఈ వెయ్యి రూపాయలు భార్యకు తెలియకుండా అట్టేపెట్టి గుప్‌చుప్‌గా చంద్రాన్ని రైలు ఎక్కించవచ్చును. తనకు ప్రత్యేక దాపరికం లేదు. వచ్చింది వచ్చినట్లు కాంతమ్మ దాపరికంలోనే ఉంటుంది. బ్యాంకులో డబ్బులెక్క వారానికోసారి గుమాస్తా దగ్గిర ఆరా తీస్తుంది. చంద్రాన్ని చదువుకు పంపటానికి ప్రస్తుతం ఓ వెయ్యి రూపాయలన్నా కావాలి. ఆ వెయ్యి రూపాయలు బ్యాంకునించి తియ్యాలంటే భార్య ఓ చిన్న గాలిదూమారం లేపుతుందని తనకు తెలుసు. అదొక్కటే ముఖ్యంగా చంద్రం చదువును గురించి తన భయం. ఇప్పుడు ఆ సమస్యకూడా భగవంతుని దయవల్ల దానంతట అదే తీరిపోయింది. తను పొగాకు అమ్మింది ఆమెకు తెలియదు. అదృష్టవశాత్తు ఇప్పుడు నాగేంద్రం ఈ డబ్బు తెచ్చి ఇవ్వటంకూడా ఆవిడ చూడలేదు. డ్రాయరు సొరుగులాగి డైరీ తీసి అందులో పది పచ్చనోట్లు పెట్టి మళ్ళీ డైరీ సొరుగులోపెట్టి మూశాడు.

బీరువాతీసి పెట్టాలంటే అసలే కాంతమ్మ అనుమానం మనిషి.

నాగేంద్రం కృష్ణారావు దగ్గిర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. చంద్రం మాత్రం కృష్ణారావు ఎదురుగా నిద్రపోతున్న రజనిని భుజంమీద పడుకోబెట్టుకొని అలాగే నిల్చున్నాడు. అతన్ని చూసి కృష్ణారావుకు తనను ఏదో అడగాలనే నిల్చున్నాడని అర్థం అయింది. తమ్ముడు ఏ విషయం తనను అడగటానికి నిల్చున్నాడోకూడా అర్థం అయింది కృష్ణారావుకు. తన నిర్ణయాన్ని తమ్ముడికి చెప్పాలనుకున్నాడు. ఇంతలోనే లోపలకు వస్తున్న కాంతమ్మను చూసి ఆగిపోయాడు.

"ఏరా, ఇంకా నిల్చొనే ఉన్నావు? వెళ్ళి పడుకో. రజనిని ఇలా ఇవ్వు" అంటూ తమ్ముడి భుజంమీద నిద్రపోతున్న రజనిని అందుకొని తమ్ముడికి మాట్లాడటానికి అవకాశం యివ్వకుండా తన గదిలోకి గబగబా వెళ్ళిపోయాడు.

తనను చదివిస్తాడో లేదో తేల్చేసుకోవాలని ఎంతో ఆలోచించి ధైర్యం కూడదీసుకొని వచ్చిన చంద్రంకు అసలు విషయం మాట్లాట్టానికి అవకాశం కూడా చిక్కలేదు. రోషం, కోపం పెనవేసుకొని వస్తున్నాయి. ఏమయినా సరే తను చదవాల్సిందే. అన్న డబ్బు ఇస్తేసరి. లేకపోతే ఆ ఇంట్లో ఒక్కక్షణం ఉండకూడదనుకొన్నాడు. ఏదో నిర్ణయానికి వచ్చిన చంద్రం పగలంతా ఎండలో తిండీ తిప్పలూ లేకుండా తిరిగాడేమో పక్కమీద మేను వాలుస్తూనే గాఢనిద్రలో మునిగిపోయాడు.

# 4

గోడ గడియారం ఎనిమిది కొట్టింది. తూర్పుదిక్కున బారెడు పొద్దు ఎక్కింది. కృష్ణారావు ఇవ్వాళ ఫ్యాక్టరీకి వెళ్ళటం ఆలస్యమయింది.

హడావిడిగా భార్య ఇచ్చిన కాఫీతాగి హాల్లోకి వచ్చాడు. వెంటనే కృష్ణారావుకు రాత్రి తను డ్రాయరు సొరుగులో దాచిన డబ్బు విషయం జ్ఞాపకం వచ్చింది. కాంతమ్మ రజనికి వంటింట్లో పాలు పడుతోంది. ఆ డబ్బు భార్య చూడకుండా భద్రపరచటానికి ఇదే అదను అనుకున్నాడు.

డ్రాయరు తెరుస్తూనే కాగితాలన్నీ చిందర వందరగా కెలికి వుండటం గమనించాడు కృష్ణారావు. ఆశ్చర్యం వేసింది. గబగబా డైరీ కోసం వెతికాడు. డైరీ చేతికి తగలగానే 'అమ్మయ్య' అనుకున్నాడు. తీరా తీసి తెరచి చూస్తే డబ్బులేదు! మరుక్షణంలోనే భార్యమీద కోపం వచ్చింది. ఇలాంటి విషయాలు పసికట్టటంలో ఆమెకు ఆమే సాటి అనుకున్నాడు. ఏమయినాసరే, తను చంద్రానికి ఆ డబ్బు ఇచ్చి రెండు రోజుల్లోనే గురుకుల్‌కు పంపించాలి.

"కాంతం.... కాంతం!" గావుకేక పెట్టాడు.

"ఆ వస్తున్నా! ఏమిటా కేకలు, కొంపలంటుకుపోతున్నట్లు!" చేతులు పమిటకు తుడుచుకుంటూ వచ్చింది కాంతమ్మ వంటింట్లోనుంచి.

"ఆ డబ్బు ఎందుకు తీశావు?"

"ఏ డబ్బు!" తెల్లమొహం వేసింది కాంతమ్మ.

అన్నీ వేషాలు. వళ్ళు మండిపోయింది కృష్ణారావుకు.

"ఇంకేం డబ్బు? ఆ వెయ్యి రూపాయలు!" గర్జించాడు.

"వెయ్యి రూపాయలా? ఎక్కడివి? ఎక్కడపెట్టారు?"

"వేషాలు వెయ్యకు. ఇలాతే ఆ డబ్బు మర్యాదగా."

"మీ కేమయినా పిచ్చిగాని ఎత్తలేదు గదా? అసలు మీరు అంటున్నది నాకు అర్థం కావటంలేదు-" ఈసారి కాంతమ్మకూడా వాల్యూం పెంచింది.

"రాత్రి నాగేంద్రం వెయ్యి రూపాయలు తెచ్చి ఇచ్చాడు. అది ఇక్కడే ఈ డ్రాయరు సొరుగులోనే దాచాను. తెల్లవారేటప్పటికి ఏ దొంగ వస్తాడు? నువ్వే తీశావు. గొడవ చెయ్యకుండా ఇవ్వు. ఆ డబ్బు నాకు చాలా అవసరంగా కావాలి."

"వెయ్యిరూపాయలు పోయాయా? పైగా నన్ను దబాయిస్తున్నారు. దొంగతనం చెయ్యాల్సిన కర్మ నాకేం కాలింది? తీస్తే తీశానని చెబుతాను."

"అదే చెప్పమంటున్నాను."

"నేను తియ్యందే తీశానని ఎందుకు చెబుతాను? అందుకే ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడంటారు."

"అంటే?"

"అంటే ఏముంది. నేను తియ్యలేదు. ఇకపోతే ఈ ఇంటిలో ఉన్న మూడో మనిషి…"

"కాంతం!…." అరిచాడు కృష్ణారావు.

"అవును, ఇంకెవరు, నీ తమ్ముడే తీశాడు!" కాంతమ్మ గట్టిగా హెచ్చుస్థాయిలోనే అంది.

"ఛీ! నోరుముయ్!" కాంతమ్మ చెంప చెళ్ళుమన్నది.

కాంతమ్మకి ప్రపంచమంతా తలక్రిందులైనట్లనిపించింది. భర్తచేత తను దెబ్బతిన్నది. పది సంవత్సరాలుగా తన మాటకు జవదాటని తన భర్త కృష్ణారావు మొదటిసారిగా తనమీద చెయ్యిచేసుకున్నాడు. దెబ్బవల్ల కలిగిన బాధకంటే కాంతమ్మకు భర్తలో కలిగిన మార్పు ఎక్కువ బాధను కలిగించింది. వాకిట్లో కట్టి ఉండే మూగపశువు ఒక్కసారిగా మానవ భాషలో యజమానిని తిట్టటం ప్రారంభిస్తే ఆ యజమాని పరిస్థితి ఎలా ఉంటుంది? సరిగ్గా అలాగే ఉంది కాంతమ్మ మానసిక పరిస్థితి. పైటకొంగుతో కన్నీరు తుడుచుకుంటూ కదలిపోయింది కాంతమ్మ.

కాంతమ్మ చెంప ఛెళ్ళుమన్న మరుక్షణంలోనే కృష్ణారావు కోపమంతా నీరుకారి పోయింది. కాలు జారితే తీసుకోవచ్చు కాని, నోరు జారితే తీసుకోలేమనే సామెత ఉంది. కాని చెయ్యిజారితేకూడా తీసుకోలేం. తను ఏనాడు చెయ్యని పని చేశాడు. కాదు తన భార్య తనచేత ఇంతపని చేయించింది. కాకపోతే చంద్రం తన రక్తం పంచుకొని పుట్టిన తన సోదరుడు దొంగా? చంద్రంలాంటి బుద్ధిమంతులు ఎందరు ఉంటారు? వాడి మంచితనానికి తనూ, తన భార్యా ఇచ్చే ప్రతిఫలం చివరకు ఇదేనా? తన తల్లీతండ్రీ బ్రతికివుంటే ఈనాడు తన భార్య చంద్రానికి దొంగతనాన్ని అంటగట్టగలిగేదేనా? అసలు ఇలాటి పరిస్థితి వచ్చేదా?

అదిరిపోతున్న కణతలు నొక్కుకుంటూ కుర్చీలో కూలబడ్డాడు కృష్ణారావు.

ఏమయినా తను కాంతాన్ని కొట్టటంలో చాలా తొందరపడ్డాడు. భార్యమీద చెయ్యి చేసుకొనే మగవాణ్ణి తను పశువుకంటే హీనంగా తలచేవాడు. ఈ రోజు తను అదేపని చేశాడు. నిజంగానే కాంతం తియ్యలేదేమో! డబ్బు విషయం అడగ్గానే తెల్లమొహం వేసింది. అంతా వేషాలు అనుకున్నాడు తను వళ్ళు తెలియని ఆవేశంతో. ఒకవేళ తీసివుంటే "తీశాను, ఏం చేస్తావు?" అనే తత్వం ఆమెది. పైగా ఆవిడకు నాగేంద్రం తనకు డబ్బు ఇవ్వటంగానీ, దాన్ని తను దాచటంగానీ తెలియనే తెలియదు. అలాటప్పుడు తను ఆమెకు దొంగతనాన్ని అంటగట్టాలా? తను చేసిందిమాత్రం ఏమిటి? తను తన భార్యను 'దొంగ' అంటే, ఆమె తన తమ్ముడే దొంగ అంది, అంతే. అంతమాత్రానికే తను చెయ్యి చేసుకున్నాడు. చివరకు మొగవాడిగా ముఖ్యంగా మొగుడిగా తనలో తెలియకుండానే దాగివున్న అధికారం, అహంకారం సమయం చూచుకొని బయటపడ్డాయి.

ఇంతకూ ఆ డబ్బు ఏమయినట్లు? రాత్రికి రాత్రి ఏ బయటి దొంగ వచ్చివుంటాడు? ఆ డబ్బు సంగతి తనకూ నాగేంద్రానికీ మాత్రమే తెలుసు. వెంటనే కృష్ణారావుకు రాత్రి తన ఎదుట ఏదో చెప్పటానికి నిల్చొనివున్న చంద్రం జ్ఞాపకం

వచ్చాడు. ఎవరో వీపుమీద కొరడాతో కొట్టినట్లయింది కృష్ణారావుకు ఆ ఆలోచన రాగానే.

అయితే... ఇంకా అనుమానం ఎందుకు? ఇది వాడిపనే. తను చదివించడనే అనుమానంతోనే చంద్రం ఇంతపని చేశాడు. ఎంత అవమానం! ఎంత అప్రతిష్ట? తన వంశంలో ఎన్నడూ లేనిపని జరిగింది. ఇంక కాంతంముందు తను తల ఎలా ఎత్తుకు తిరగ్గలడు?

కృష్ణారావు హృదయంలో కోపం సుళ్ళు తిరగసాగింది. గబగబాలేచి చంద్రం గదిలోకి వెళ్ళాడు. ఖాళీమంచం బోసిగా కృష్ణారావు మొహంలోకి చూసింది. బాత్‌రూమ్ దగ్గరకు వెళ్ళాడు. చంద్రం అక్కడా లేడు. ఇంటిచుట్టూ, ఇల్లంతా పిచ్చివాడిలా చంద్రంకోసం తిరిగాడు. చంద్రం జాడలేదు.

కృష్ణారావు వరండాలో గేటువైపు చూస్తూ నిల్చున్నాడు. ఆకాశం మేఘావృతంగా వుంది. మధ్యమధ్య వానజల్లులు పడుతున్నాయి. కృష్ణారావు మనసు ముసురు పట్టిన ఆకాశంలా ఉంది.

చంద్రం సాధారణంగా ఎనిమిది గంటలకు ముందు నిద్రలేవడు. ఈ రోజు నిద్రలేవటమే కాకుండా ఈ వర్షంలో ఎవరూ చూడకుండా బయటకు వెళ్ళిపోయాడు. ఇంకా అనుమానం దేనికీ? ఇది వాడిపనే. ఎక్కడకు వెళ్ళాడో? రానియ్! తాట వలిచేస్తాను.

ఇంతపని చేసినవాడు మళ్ళీ తిరిగివస్తాడా! ఒకవేళ తిరిగి రాకపోతే! అంత కోపమూ నీళ్ళుకారిపోయింది. ఏదో అజ్ఞాత భయంతో వణికిపోయాడు, కృష్ణారావు.

ఆ వెయ్యి రూపాయలు ఖర్చుపెట్టేస్తాడు, ఏ బొంబాయికో చేరి. ఆ తరవాత! ఏ రౌడీల చేతిలోనో.... లేక బిచ్చమెత్తుకొనో.... ఇక ముందుకు ఆలోచించలేకపోయాడు. అలా జరిగితే తన తలిదండ్రుల ఆత్మలు తనను శపిస్తాయి. నిజమే. తన తమ్ముడు ఇలా దిగజారిపోవటానికి కారణం ఎవరు? తనే! తన భార్య భయంతో ఏనాడూ తమ్ముణ్ణి ఆప్యాయంగా దగ్గరికి తీసుకున్న పాపాన పోలేదు. ఆప్యాయంగా మాట్లాడి ఎరుగడు. కనీసం తన ఆస్తిలో సమభాగస్తుడయిన చంద్రానికి చదువు చెప్పించటానికి తనకూ, తన భార్యకూ ఇష్టం లేకపోయింది. తన పాపానికి పరిష్కారం లేదు.

వెంటనే ఏదో గుర్తుకు వచ్చి ఫోన్‌దగ్గరికి వెళ్ళాడు.

"హల్లో! నేను కృష్ణారావును. అమ్మా హేమా! నాన్నగారు లేరా? ఆహఁ - ఏం లేదు. చంద్రం అక్కడికి వచ్చాడేమోనని.

"రాలేదా! పొద్దుటే ఎక్కడికో వెళ్ళాడు, అందుకే...." అంటూ ముందుకు మాట్లాడలేక కృష్ణారావు రిసీవర్ పెట్టేశాడు.

హృదయంలో బాధ, భయం, అవమానం. కోపం ఒకదాన్ని ఒకటి పెనవేసుకుపోతున్నాయి. అరచేతితో నొసలు పట్టుకొని కూలబడ్డాడు ప్రక్కనే ఉన్న సోఫాలో.

ఇల్లంతా తుపాను రాబోయేముందు ఉండే ప్రశాంతత అలుముకుపోయింది.

ఏదో అలికిడి విని కృష్ణారావు తలెత్తి చూశాడు. చంద్రం పిల్లిలా తన గదిలోకి దూరటం కనిపించింది. చంద్రాన్ని చూడగానే కృష్ణారావులో అంతవరకూ ఉన్న పశ్చాత్తాపం, భయం స్థానాన్ని కోపం ఆక్రమించుకుంది.

"చంద్రం!" కృష్ణారావు కేకకు ఇల్లు ప్రతిధ్వనించింది. చంద్రం ఆ కేకకు అదిరిపడ్డాడు. అపరాధిలా అడుగులో అడుగువేసుకుంటూ వచ్చి అన్నముందు నిలబడ్డాడు.

"ఏరా గాడిదా! ఎక్కడి కెళ్ళావ్?"

చంద్రం భయంగా అన్న మొహంలోకి చూశాడు. జవాబివ్వలేదు.

"ఏరా మాట్లాడవు? ఆ డబ్బు ఎక్కడ దాచావు?"

ఈసారి చంద్రం మొహంలో భయం స్థానాన్ని ఆశ్చర్యం ఆక్రమించుకొన్నది. బిగుసుకొని కొయ్యలా నిలబడ్డాడు.

"అలా చూస్తావేం? ఆ డబ్బు ఎక్కడ దాచావో చెప్పు!"

మాట పూర్తికాకుండానే చంద్రం చెంప ఛెళ్ళుమన్నది. చంద్రం కళ్ళకు ఏదో వెలుగు కనిపించి అంతలోనే చీకట్లుకమ్మాయి.

"నాకు తెలియదు" అన్నాడు, అన్నగారు మళ్ళీ ఎత్తిన చేతికి భయంతో తన రెండు చేతులను అడ్డం పెడుతూ.

"దొంగవెధవా! అబద్ధాలుకూడా?" కసికొద్దీ రెండు చేతులతో అందినచోటల్లా బాదటం మొదలుపెట్టాడు కృష్ణారావు. చంద్రం శరీరాన్ని అప్పగించి నిల్చున్నాడు.

కొట్టి కొట్టి చేతులు నొప్పిపుట్టాయి. కృష్ణారావుకు.

"చెబుతావా చెప్పవా? రాత్రి ఈ డ్రాయరులో దాచిన డబ్బు ఎందుకు తీశావు?"

"నేను తియ్యలేదు, నాకేం తెలియదు" అన్నాడు చంద్రం, ఉబికి వస్తున్న దుఃఖాన్ని దిగమింగుకుంటూ.

చంద్రం చెబుతున్నది నిజమేనేమో ననిపించింది కృష్ణారావుకు ఒక క్షణకాలం. "అయితే ఇంత పొద్దుటే ఎక్కడి కెళ్ళావు?" గద్దించాడు కృష్ణారావు.

చంద్రం మాట్లాడలేదు. తలవంచుకొని నిలబడ్డాడు. అతని మౌనం కృష్ణారావు హృదయంలో మళ్ళీ అనుమానాన్ని రేకెత్తించింది.

"మాట్లాడవేంరా?" గట్టిగా అరిచాడు.

"హేమావాళ్ళ ఇంటికి....."

చంద్రం దొంగతనం చేసినందుకు బాధపడుతున్న కృష్ణారావుకు అతను నిజం చెప్పకపోవటం, పైగా అబద్ధాలు చెప్పటం పిచ్చివాణ్ణి చేశాయి. అతనిలో వివేకం నశించింది. ఆవేశం ఆవహించింది. పిచ్చిగా బాదసాగాడు.

ప్రసాదరావూ, హేమా – చంద్రం పొద్దుటే ఎక్కడికి వెళ్ళివుంటాడా అనీ, యింకా మరెన్నో శంకలతో కృష్ణారావు ఇంటికి వచ్చారు. వాకిట్లో అడుగు పెడుతూనే అక్కడి దారుణ దృశ్యంచూసి, ఒక్క క్షణకాలం నివ్వెరపోయారు.

హేమ తెప్పరిల్లి వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ, 'నాన్నా! చంద్రం–' అంటూ తండ్రి చెయ్యిపట్టుకొని చంద్రాన్ని చూపుతూ గట్టిగా లాగింది.

ప్రసాదరావు గబగబా వెళ్ళి కృష్ణారావు భుజం పట్టుకొని పక్కకు తోసి, చంద్రాన్ని దగ్గరకు తీసుకున్నాడు. అంతసేపూ అణచుకున్న దుఃఖం చంద్రంలో కట్టలు తెంచుకున్నది. బావురుమంటూ ప్రసాదరావు చేతుల్లో ఒదిగిపోయాడు.

"ఏమిటిది కృష్ణారావు? మీకేమైనా పిచ్చిగాని ఎత్తలేదుగదా! రత్నంలాంటి బిడ్డ! ఎప్పుడూ తప్పు పని చేసినవాడు కాదే! ఇప్పుడేం జరిగింది?" అంటూ ప్రసాదరావు చంద్రాన్ని గుండెలకు హత్తుకున్నాడు.

"హుఁ, రత్నం! అలా అనుకుంటూ వుండబట్టే ఇప్పుడు కడుపు దహించుకు పోతున్నది. ఇంత నీచానికి పాల్పడతాడని ఏనాడూ అనుకోలేదు. మా వంశంలో తప్ప పుట్టాడు," అంటూ కృష్ణారావు రొప్పుతూ నిలబడలేక పక్కనేవున్న వాలుకుర్చీలో కూలబడ్డాడు.

కృష్ణారావులో అంత కోపోద్రేకాలు ఏనాడూ చూసివుండని ప్రసాదరావు, యిప్పటి అతడి తీవ్ర ప్రవర్తనకు ఏదో పెద్ద కారణమే వుండి వుంటుందనుకున్నాడు. అతడు కృష్ణారావుకేసి ఒకడుగు వేసి "అసలు యింతకీ చంద్రం ఏం చేశాడు?" అని ప్రశ్నించాడు.

కృష్ణారావు ప్రసాదరావుకు జరిగిన సంగతంతా వివరంగా చెప్పాడు. తండ్రి ప్రక్కనే నిలబడి అంతా శ్రద్ధగా విన్న హేమ మనసు కలవరపడింది. చంద్రం అలాంటిపని చేసి వుండవలసింది కాదని తండ్రీ కూతుళ్ళిద్దరూ భావించారు.

"నిన్న మీముందే వాడ్ని గురుకుల్‌కు పంపిస్తానని చెప్పాగదా? ఇంతలో దొంగతనం చెయ్యవలసిన అవసరం ఏం వచ్చిందో మీరే ఆలోచించండి" అన్నాడు కృష్ణారావు రెండు చేతులతో తల పట్టుకుని.

"ఏదో చిన్నతనం.... తెలియక చేసివుంటాడు. అయినా, ఆ చేసిన దొంగతనం పరాయి యింట్లో కాదుగదా? ఆ డబ్బు ఎక్కడ దాచిందీ నేను చెప్పిస్తాను. మీరు కొంచెం శాంతంగా ఉండండి" అంటూ ప్రసాదరావు చంద్రంకేసి చూశాడు. చంద్రం దించిన తల ఎత్తకుండా అంత దూరంలో నిలబడి వున్నాడు.

"బాబూ, చంద్రం! గురుకుల్ వెళ్ళటానికి మీ అన్నయ్య డబ్బివ్వరేమో అన్న అనుమానం నీకెందుకు కలిగింది? నీవు వయసులో, విద్యలో చిన్నవాడివైనా, ఆ రెండింటినీ మించిన వివేకం వున్నవాడివి. యిలాంటి తప్పిదం చెయ్యవచ్చునా? బహుశా, చదువుమీద వున్న ప్రేమకొద్దీ అలా చేసివుంటావ్. ఇప్పుడు తప్పొప్పుకుని, ఆ డబ్బు ఎక్కడ దాచిందీ మీ అన్నగారికి చెప్పెయ్యి. ఆయన తప్పక నిన్ను క్షమిస్తారు. ఆయన నిన్ను గురుకుల్‌కు పంపుతారు" అన్నాడు ప్రసాదరావు.

చంద్రం జవాబివ్వలేదు. కనీసం తలైనా ఎత్తలేదు. ప్రసాదరావు అతణ్ణి సమీపించి ప్రేమగా గడ్డం పట్టుకుని, తల పైకెత్తి కళ్ళలోకి చూశాడు. ఆ కళ్ళు వర్షభారంతోవున్న మేఘాల్లా వున్నాయి. వాటి వెనక దాగివున్న చంద్రం మనోభావాలేమిటో అంత అనుభవశాలి అయిన ప్రొఫెసరుకూ అర్థం కాలేదు.

చంద్రం చేత నిజం చెప్పించబోయి ప్రసాదరావుగారే ఏదో తికమకలో పడిపోయాడని అనుకున్న కాంతమ్మ భర్తచేతిదెబ్బతిన్న చెంపను వేళ్ళతో రాచుకొంటూ,

“కాళ్ళూ చేతులూ విరిచికట్టి గొడ్ల చావిట్లో పడేస్తే క్షణాలమీద వాడే నిజం చెబుతాడు,” అన్నది కసిగా.

కృష్ణారావుకు భార్య అన్న మాటలు సబబుగా తోచకపోయినా, ఆ క్షణాన తమ్ముడిమీద వున్న కోపంతో భార్యను సంతృప్తిపరచటానికి, ఆమె చెప్పినట్టు చేయటం బావుంటుందన్న నిర్ణయానికి వచ్చాడు.

కృష్ణారావు, భార్య అన్నంతపనీ చేయబోతున్నాడని గ్రహించిన ప్రసాదరావు చంద్రం తల నిమురుతూ, “బాబూ చంద్రం! ఆ డబ్బు ఎక్కడ దాచావో నిజం చెప్పెయ్యి” అని అడిగాడు.

ఆ మాటలతో చంద్రం తలయెత్తి ప్రసాదరావు ముఖంలోకి దీనంగా చూశాడు. ‘మీరూ నేను దొంగననే నమ్ముతున్నారా?’ అని ప్రశ్నిస్తున్నాయి, అతడి చూపులు.

ప్రసాదరావుకు ఏమిచేయటానికి తోచలేదు. చంద్రంచేత నిజం చెప్పించటం తనకు సాధ్యమయేలా లేదు. భార్య ప్రోత్సాహంతో కృష్ణారావు తమ్ముణ్ణి పెడరెక్కలు విరిచి కట్టివేసేందుకు సంసిద్ధమవుతున్నాడు. ఇక అక్కడ వుండి ఏం ప్రయోజనం? ఆయన ఎవరితోనూ ఏమీ అనకుండా గిరుక్కున వెనుదిరిగి బయటి కెళ్ళాడు. హేమ తండ్రిని అనుసరించింది.

కృష్ణారావు కుర్చీలోంచి లేచాడు. తను చేయబోతున్నది కిరాతక కృత్యం అన్న భావం అతడి హృదయంలో మెదలింది. కాని, దాన్ని మించిన క్రోధం అతడి నరనరాన్నీ పట్టి కుదిపింది. తమ్ముడి ముఖంకేసి చూడకుండా, అతడి రెండు చేతులూ వడిసిపట్టుకుని గొడ్ల చావిడికేసి లాక్కుపోయాడు. చావిట్లో ఒక గుంజకు చంద్రాన్ని పెద్ద తాడుతో బిగించికట్టేశాడు.

“వాడికి.... రాత్రికి నేను తిరిగివచ్చేవరకూ అన్నం పెట్టవద్దు. విన్నావా?” భార్యను ఉద్దేశించి అంటూ కృష్ణారావు తలవంచుకుని వేగంగా వీధిలోకి వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం రెండుగంటలు దాటింది. చంద్రం ఆకలితో దహించుకుని పోతున్నాడు. దాహంవల్ల గొంతు పిడచకట్టుకుపోతున్నది. కళ్ళు అవమానాగ్నితో మండుతున్నాయి. హృదయంలో పేరుకున్న బాధ కన్నీరు రూపంలో వెలువడి అతడి చెంపలను తడుపుతున్నది.

తను దొంగతనం చేసినట్టు వదిన అనటమే తడవుగా అన్నయ్య నమ్మేశాడు. అసలు తనకు దొంగతనం చెయ్యాలన్న ఆలోచన రాలేదు. అవకాశం లేదని అతనెందుకు గ్రహించలేక పోయాడు? తనకూ ఆస్తిలో భాగం ఉంది. డబ్బు తను ధైర్యంగా అడిగి తీసుకోగలడు. కాని ఇంట్లో దొంగతనం జరిగినమాట నిజం.... ఆ దొంగ ఎవరై వుంటారు? తన వదిన! మొట్టమొదటిసారిగా అతడి హృదయంలో ఆమె అంటే అసహ్యభావం కలిగింది.

తను చేసిన తప్పల్లా పొద్దున్నే ఎవరితోనూ చెప్పకుండా ప్రకాశం ఏమయాడో తెలుసుకునేందుకు వాళ్ళ యింటికి వెళ్ళటమే. ప్రకాశం తన ప్రాణ స్నేహితుడు. మెత్తని మనసు కలవాడు. ఒకరకంగా పిరికివాడు. భయస్థుడు. పరీక్ష తప్పితే ఆత్మహత్య చేసుకుంటానని తనతో అన్నాడు. పరీక్ష తప్పాడు - అన్నంతపని చేస్తాడేమో అన్న

ఆదుర్దాలో తను తెల్లవారుతూనే వాళ్ళింటికి వెళ్ళాడు. అది అన్నయ్య ఆజ్ఞను ధిక్కరించటమే.

కృష్ణారావు కుటుంబానికీ, ప్రకాశం వాళ్ళ కుటుంబానికి తాత ముత్తాతల కాలంనుంచీ బద్ధ విరోధమట. ఆ ఇంటిపై వాలిన కాకి, యీ ఇంటిపైన వాలేందుకు లేదు. ఇంతకూ అంత వైరభావం ఏ కారణంవల్ల వచ్చిందో అన్నయ్య తనతో చెప్పలేదు. 'నీవు చిన్నవాడివి. అలాంటి విషయాలు అర్థం చేసుకోగల జ్ఞానం నీకు లేదు. నా మాట గుర్తుంచుకో. ఎలాంటి పరిస్థితుల్లోనూ, నువ్వాగడప తొక్కకూడదు.' ఇదీ అన్నయ్య ఇచ్చిన సుగ్రీవాజ్ఞ. అందువల్లే తను ప్రొద్దున్నే ప్రకాశం వాళ్ళ ఇంటికి వెళ్ళినట్టు అన్నయ్యతో చెప్పలేకపోయాడు. ఆ కారణంగా దొంగతనం తనమీద పడింది. వదిన రేపిన అనుమానంతో, అన్నయ్యకు తను దొంగ అన్న గట్టినమ్మకం కలిగింది.

అన్నింటికంటె అవమానకరం అయిన విషయం – తనంటే ఎంతో ప్రేమా, వాత్సల్యంగల ప్రసాదరావుగారుకూడా తనను దొంగగా భావించటం. హేమ కూడా అలా అనే నమ్మివుంటుందా? తను నిర్దోషినని రుజువు చేసుకోనిదే వాళ్ళ ముఖం చూడగలగటం అసంభవం.

"చంద్రం!" అన్న చిన్న పిలుపు అతడి చెవులకు వీణాస్వరంలా వినిపించి, చంద్రం తల ప్రక్కకు త్రిప్పి చూశాడు. హేమ అతణ్ణి సమీపిస్తున్నది. ఒక చేతిలో తినుబండారాలతో నిండివున్న వెండిపళ్ళెం, మరో చేతిలో నీళ్ళు నింపిన మరచెంబు. ఆమెను చూస్తూనే చంద్రం ముఖం ఆనందంతో విప్పారింది.

"హేమా! వచ్చావా? త్వరగా యీ కట్లు విప్పేయ్. ఒళ్ళంతా నొప్పులు. కాళ్ళు పీక్కుపోతున్నాయి," అన్నాడు చంద్రం హేమను తొందర చేస్తూ.

హేమ అతడి మాటలు విననట్టే తొణక్కుండా అతడి ముందుకు వచ్చి, తాపీగా పళ్ళెం, మరచెంబు కింద పెట్టింది. తరువాత పళ్ళెంలో వున్న తినుబండరాల్లో ఒకటి తీసుకొని చంద్రం నోటికి అందించబోయింది.

"ఈ కట్లు శరీరాన్ని ఒరపిడి చేస్తున్నై. చచ్చేంత బాధగా వుంది. ఇప్పుడా తిండి? ముందు నా కట్లు విప్పు" అన్నాడు చంద్రం ఆదుర్దాగా.

హేమ పెదవులు బిగించి 'ఊహూఁ' అంటూ తలాడించి, "అదేంకుదరదు చంద్రం! నువ్వు నిజం చెప్పందే కట్లు విప్పను. ఆ డబ్బు ఎక్కడ దాచావో నాతోనైనా చెప్పు. నేనా సంగతి నాన్నగారితో చెప్పి నీ కట్లు విప్పేలా చేస్తాను. అంకుల్ నిన్ను మళ్ళీ కొట్టకుండా చూసే బాధ్యత నాది" అన్నది.

హేమ మాటలకు చంద్రం నిర్విణ్ణుడయిపోయాడు. హేమ కూడా తనను దొంగగా భావిస్తున్నదన్నమాట! అతడికి అంతా అయోమయంలా కనిపించింది. తన కాళ్ళకింద భూమి కుంగిపోతున్నట్టూ, తను కట్టివేయబడిన గుంజతోసహా పాతాళానికి కూలిపోతున్నట్టూ భయం వేసింది.

హేమ ఏదో మాట్లాడుతున్నది. అవేమీ చంద్రానికి అర్థం కావటంలేదు. కాని, అతడి చెవుల్లో ఒకే గింగురు శబ్దం.... వేయి కంఠాలు మూక ఉమ్మడిగా "చంద్రం

దొంగ!" అంటున్నాయి. ఆ కంఠస్వరాలలో హేమ గొంతు మరింత స్పష్టంగా వినబడుతున్నది. 'చంద్రం దొంగ! చంద్రం.....!'

ఒక్క క్షణకాలం నిశ్శబ్దం. చంద్రం నీరసంగా ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు. గొడ్లచావిడి మొండిగోడల వెనుక ఏదో అలికిడి అయ్యింది. ఆ వెంటనే మొండిగోడలమీద నీడలాంటి చిన్న ఆకారం! చంద్రం ఆశ్చర్యంగా అటుకేసి చూశాడు.

గోడమీదనుంచి కిందికి చూస్తూ ఒక పదేళ్ళపిల్ల అతడికి కనిపించింది. ఆమె బీదయింటి పిల్లలా అతుకులువేసి కుట్టిన పచ్చపువ్వుల ఎర్ర పరికిణీ, ఎర్రగళ్ళ తెల్లజాకెట్ వేసుకున్నది. ఆ అమ్మాయి కిందికి దూకేందుకు, దూరం ఉజ్జాయింపు వేసుకుంటున్నట్టు కిందికీ, పైకీ పరీక్షగా చూస్తున్నది.

చంద్రానికి అంత శారీరక, మానసిక బాధలోకూడా ఆ అమ్మాయి వాలకం చూడముచ్చట కలిగింది. అతడామె ముఖ కవళికలను పరీక్షగా చూడసాగాడు. గుండ్రని పెద్ద కళ్ళూ, చిన్న నొసలు, పోనుపోను కొంచెం వెడల్పయిన ముక్కు, నొక్కుల జుత్తు, కింది పెదవికంటే కొంచెం లావయిన పై పెదవి గల ఒంపులు తిరిగిన చిన్న నోరూ, చామనఛాయ శరీరం – చూడగానే ఆకర్షించే ప్రత్యేకత ఏదోవుంది ఆ బాలిక ముఖంలో.

చంద్రంతోపాటు హేమకూడా ఆ మొండిగోడమీది పిల్లకేసి ఆశ్చర్యంగా చూడసాగింది. అంతలో ఆ పిల్ల దబుక్కుమంటూ కిందికి దుమికి చంద్రం హేమలు వున్నచోటుకు రాసాగింది 'ఎంత బావుందీ అమ్మాయి!' అనుకున్నాడు చంద్రం, "గిజ గిజ లాడుతూంటే, కట్లిప్పకుండా నువ్విక్కడ తమాషా చూస్తున్నావా?" అన్నదా అమ్మాయి, హేమ ముందుకువచ్చి ఒయ్యారంగా నిలబడి.

హేమ చీదరిస్తున్నట్టు ఆ అమ్మాయికేసి చూసి, ఈ అలగాపిల్లకు జవాబిచ్చే దేమిటనుకుంటూ ముఖం పక్కకు తిప్పుకున్నది. ఆ పిల్ల సరాసరి చంద్రం దగ్గరకివెళ్ళి అతడి కట్లిప్పటానికి వంగింది. హేమ పళ్ళు కొరుకుతూ "జాగ్రత్త! ఏం చెయ్యబోతున్నావ్? కట్లిప్పావో, మా అత్తయ్యను కేకవేసి, నీ వీపు పగలగొట్టిస్తాను. చంద్రం తప్పు చేశాడు. పెద్దవాళ్ళు శిక్షిస్తున్నారు, మధ్య నువ్వెవరు కట్లిప్పటానికి?" అన్నది రోషంగా.

"అబ్బో! ఏవిటా తప్పు? తప్పులు చేయనోళ్ళెవరూ? చాల్లే – అడ్డంరాకు, తప్పుకో" అంటూ ఆ పిల్ల హేమ భుజం పట్టుకొని ఒక్కతోపు తోసింది. ఆ బాలిక అంటే వయసులో కొంచెం పెద్దదయినా, హేమ సుకుమారంగా పెరిగినది కావటంతో ముందుకు పడబోయిందల్లా, చప్పున చంద్రం కట్టివున్న గుంజను పట్టుకొని పడకుండా కాలు నిలదొక్కుకున్నది.

ఆ అమ్మాయి చకచకా చంద్రం కట్లు విప్పసాగింది. ఒక అలగా పిల్ల తన వంటిమీద చెయ్యి చేసుకోవటమా? ఉక్రోషంలో హేమ "ఉండు, అత్తయ్యను పిలుచుకొస్తాను" అంటూ చావిట్లోనుంచి గబగబా బయటికి పరిగెత్తింది.

ఆ తెలుకొండీ జడపిల్ల చంద్రం కట్లు క్షణాలమీద విప్పేసింది. అంతవరకూ శరీరంలో నరిగా రక్తప్రసారం ఆడక, ఒక్కసారి తనను బంధించిన కట్లు ఊడిపోవటంతోనే తిరిగి ప్రసారం ప్రారంభం కావటంతో చంద్రానికి కళ్ళు బైర్లుకమ్మినై.

కాళ్ళూ, చేతులూ చచ్చుపడిపోయినట్టయి నిలబడలేక గుంజదగ్గరే కూలబడ్డాడు. తనకింత సహాయంచేసిన ఆ బీదపిల్లమీద అతడికెంతో కృతజ్ఞతాభావం కలిగింది.

"నీ పేరేమిటి?" అని అడిగాడు చంద్రం ఆ అమ్మాయిని.

"గౌరి. మరి నీ పేరో?" అన్నదా పిల్ల రాగం తీస్తూ.

"చంద్రం. అది సరేకాని, నువ్వు నాకట్లెందుకు ఊడదీశావ్? అందరిలాగే నీకూ నేను దొంగలా కనిపించలేదా?" అన్నాడు.

"నువు దొంగ వెందుకవుతావ్? ఆ మొండిగోడ పక్కగ వెడుతూంటే లోపల్నించి మాటలు వినిపించినై. ఎవరో చూద్దామని గోడ ఎక్కాను. నువ్వు! నీ ముఖం చూడగానే కష్టాల్లోవున్న మంచబ్బాయి అనుకున్నాను. గోడ దూకాను, కట్లిప్పాను, సరిపాయె!" అన్నది గౌరి అమాయకంగా కళ్ళుతిప్పుతూ.

చంద్రం గౌరి మాటలూ, ఆ చెప్పిన తీరూ చూసి చకితుడై పోయాడు. ఎందుకనో అతడి కా క్షణంలో ఆ అమ్మాయిని ముద్దు పెట్టుకోవాలనిపించింది. చప్పున చేతులు చాచి, గౌరిని దగ్గరకు లాక్కుని నుదుటిమీద గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు. మొండిగోడ మీదికి ఎక్కి, అవతల వైపుకు దూకి, పరుగు లంకించుకొన్నాడు.

# 5

కృష్ణా టుబాకో ఫ్యాక్టరీ పట్టణానికి ఓ చివరలో వుంది. ఫ్యాక్టరీకి నాలుగైదు ఫర్లాంగుల దూరంలో వున్న మైదానం లాంటి పెద్ద ఖాళీ స్థలంలో నూరుకుపైగా గుడిసెలున్నాయి. ఆ గుడిసెల్లో నివసించేవారంతా కృష్ణా టుబాకో ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులే. కృష్ణారావు ఆ ఖాళీస్థలంలో గుడిసెలు వేయించి తన ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులకు అద్దెకిచ్చాడు. ఆ గుడిసెలన్నీ రెండుమూడు తప్ప దాదాపు ఒకటిగానే వున్నాయి. ఆ రెండు మూడు మాత్రం కొంచెం ఎత్తుగా రెండు నిట్టాళ్ళతో వేసిన గుడిసెలు. వాటిల్లో ఒకదాంట్లో నాగేంద్రం వుంటాడు.

నాగేంద్రం ఒడ్డూ పొడుగూ వుండే మోటుతరహా మనిషి. అతడంటే భయపడని ఫ్యాక్టరీ కార్మికుడుండడు. అతడిది మోటు శరీరం, కిరాతక స్వభావం. ఈ సంగతి కార్మికులందరికీ అనుభవమే. బహుశా అతడిలోని యీ లక్షణాలే కృష్ణారావుకు అతడంటే అభిమానం కలగటానికి కారణం అయివుండవచ్చు. హక్కులనీ, సమ్మెలనీ, కార్మికులెప్పుడైనా ఆందోళన ప్రారంభిస్తే యిలాంటి దుష్టణ్ణి చక్కగా వినియోగించుకోవచ్చునని వ్యాపార మెలకువలూ, వ్యవహారజ్ఞానం బాగావున్న కృష్ణారావు అనుకున్నాడు.

ఫ్యాక్టరీలో పనిచేసే కూలీలమీద అజమాయిషీ అంతా నాగేంద్రానిదే. మేస్త్రీలూ, ఫోర్‌మన్‌లమీద కూడా వాడు అధికారం చెలాయిస్తాడు. ఫ్యాక్టరీలో కొత్తవాళ్ళ కెవరికైనా పని కావాలన్నా, వున్నవాళ్ళల్లో ఎవరినైనా తొలగించాలన్నా కృష్ణారావు ముందుగా నాగేంద్రాన్ని సంప్రదిస్తాడు. ఈ కారణంవల్ల కార్మికుల ఉద్యోగ కాలపరిమితి చాలావరకు నాగేంద్రం దయా దాక్షిణ్యాలమీద ఆధారపడి వుంటుంది. అందువల్ల ఆ గుడిశెలలో నివసించే కూలీలంతా అతడి అడుగులకు మడుగులొత్తుతారు. ఆడ కూలీలమీద

అందులోనూ కాస్త వయసులోవున్న వాళ్ళమీద అతడు చేయని అఘాయిత్యం వుండదు. లొంగకపోతే వుద్యోగం పోతుంది. తరవాత ఆకలి, దారిద్ర్యం - నిలిచేందుకు నీడైనా లేకపోవటం - ఇన్ని బాధల నెదుర్కొని నిలిచి పోరాడగల శక్తి వారికిలేదు.

నాగేంద్రం వుండే గుడిశెలలో ఆదెమ్మ అనే ఒక నడికారు దాటిన స్త్రీ వుంటోంది. తెలియనివాళ్ళు కొందరు ఆమె నాగేంద్రం తల్లి అనుకుంటారు. కాని నిజానికి వారిద్దరిమధ్యా ఎలాంటి బంధుత్వమూ లేదు. పిల్లా జెల్లాలేని ఆదెమ్మ, ఏ దిక్కూలేక రోడ్లవెంట తిరిగే నాగేంద్రాన్ని చిన్నతనంలోనే దగ్గిరకుతీసి పెంచి పెద్దవాణ్ణి చేసింది. ఆదెమ్మ సంరక్షణకిందికి వచ్చేనాటికే నాగేంద్రం పదీ పన్నెండేళ్ళవాడు. ఒకనాడు రోడ్డంట వెళూతూన్న ఆదెమ్మకు మురుగు కాలవ పక్క చప్టామీద వణుకుతూ పడివున్న పన్నెండేళ్ళ నాగేంద్రం కనిపించాడు. ఆ దిక్కులేని పక్షిమీద ఆదెమ్మకు జాలికలిగి ఇంటికి తీసుకువచ్చి, మందులూ మాకులూ యిచ్చి ఆరోగ్యవంతుడ్ని చేసింది.

ఆ నాటినుంచీ నాగేంద్రం ఆదెమ్మ యింట్లోనే వుండిపోయాడు. బిడ్డా పాపాలేని తనకు, వృద్ధాప్యంలో కాలూచేయీ పడిపోతే సహాయంగా వుంటాడని ఆదెమ్మ ఆశపెట్టుకుంది. కూటికోసం అక్కడా యిక్కడా వెతుక్కోకుండా, యిక్కడ హాయిగా జరిగిపోతున్నది గనుక, ఈ ఇల్లు వదలకూడదనుకున్నాడు నాగేంద్రం. ఈ విధంగా తెలిసో తెలియకో ఎవరి స్వార్థం వాళ్ళు చూచుకున్నారు. ఆ కారణంవల్ల వారిమధ్య ప్రేమా - వాత్సల్యాల్లాంటివి ఏమీలేవు.

ఆదెమ్మ ఎంతో కాలంగా ఎలాంటి చిక్కులు లేకుండా సుఖంగా సాఫీగా బతుకుతూ వస్తున్నది. డబ్బెక్కణ్ణించి వస్తుందో, ఎలా వస్తుందో ఎవరికీ తెలియదు. "నాకు బొంబాయిలో బాగా డబ్బున్న బంధువున్నాడు" అంటుంది ఆదెమ్మ. అదే అన్ని ప్రశ్నలకూ, అనుమానాలకూ తిరుగులేని జవాబు. ఆ బంధువు ఒకానొక అవినీతి వ్యాపారంలో అందెవేసిన చేయి. అతడికి అన్ని ముఖ్య పట్టణాల్లో ఏజంట్లున్నారు. వాళ్ళపని అక్కడ దొరికిన ఆడపిల్లల్ని ఎత్తుకుపోయి అమ్మటం. ఆదెమ్మ చేసేపనికూడా అదే. వాళ్ళు ముఖ్యంగా సినిమా హాళ్ళవద్దా రైల్వేస్టేషన్లలోనూ కాపలా వేసేవాళ్ళు. అక్కడ ఏ తల్లిదండ్రులైనా తమ పిల్లల్ని కొంచెం ఆదమరచి వున్నారో, ఆ అదనులో వాళ్ళను చేజిక్కించుకుని పారిపోయి, క్రమంగా వాళ్ళను బొంబాయిలోని ఆదెమ్మ బంధువుకు చేర్చేవారు.

ఆదెమ్మ యిల్లుచేరిన కొద్ది రోజుల్లోనే నాగేంద్రం అంతవరకూ తాను కాలం ఎలా గడుపుకు వస్తున్నదీ ఆమెకు చెప్పాడు. పెద్ద శిక్షణ అవసరం లేకుండానే వాడు తనకు సహాయకారి కాగలడని ఆదెమ్మ గ్రహించింది. ఆనాటినుండి ఆమె నాగేంద్రాన్ని తన దుర్మార్గ వృత్తిలో బాగా ఉపయోగించుకున్నది.

ఆదెమ్మ కిప్పుడు దాదాపు యాభై అయిదు సంవత్సరాల వయసు. నాగేంద్రం ముప్ఫయ్యోపడిలో పడ్డాడు. వాడు ఆమె యిల్లు చేరిననాటినుంచి యీనాటివరకూ వాళ్ళు చేసిన దారుణకార్యాలు వాళ్ళకే ఎరుక.

గౌరి ఆదెమ్మవల్ల పదేళ్ళక్రితం దొంగిలించబడిన పరాయి బిడ్డ. పదేళ్ళక్రిందట ఒకనాడు....

ఆదెమ్మ చక్కగా ముస్తాబు చేసుకుని గౌరవకుటుంబ స్త్రీలా తెనాలి రైల్వేస్టేషన్‌లో ఒక బెంచిమీద కూర్చుని, వచ్చే పోయే ప్రయాణీకుల్ని పరీక్షగా చూస్తున్నది. ఇంతలో ఒకామె ఒక చిన్నబిడ్డను ఎత్తుకుని ఆదెమ్మ దగ్గరకు వచ్చి బెంచీమీద ఆమె పక్కగా కూర్చున్నది. ఆదెమ్మ ఆ స్త్రీని పరిశీలనగా చూసింది.

ఆమె ముఖలక్షణాలూ, పిల్లను సముదాయించే తీరూ చూస్తే, కొంచెం పెద్ద కుటుంబ స్త్రీలా కనిపించింది. కాని, ఆమె ధరించిన దుస్తులు బాగా మాసిపోయి వున్నాయి. జుట్టు చిందరవందరగా రేగి వున్నది. చేతిలో ఒక చిన్న మూట వున్నది. ముఖం చాలా విచారగ్రస్తంగా వున్నది.

ఆ స్త్రీ తన బిడ్డను కాసేపు జోకొట్టి, కళ్ళు మూయగానే బెంచీ మీద మెల్లిగా పడుకోబెట్టి, ఆదెమ్మతో "అమ్మా, కాస్త సహాయం చేయగలవా? నిన్నటినుంచీ తిండిలేక ప్రాణం శోషకు వస్తున్నది. ఈ బిడ్డను కొంచెం చూస్తూవుండండి. ఆ కనబడే దుకాణంలో టీ తాగివస్తాను" అన్నది.

అలాంటి అవకాశం కోసమే ఎదురు చూసున్న ఆదెమ్మ ముఖంలో ఎంతో జాలి కనబరుస్తూ, "అలాగా పాపం! వెళ్ళి టీ తాగిరండి! బిడ్డకేం, నేను చూస్తూ వుంటాను" అన్నది.

ఆ స్త్రీ టీ స్టాల్‌వైపుకు వెళ్ళింది. అక్కడ జనం తొక్కిసలాట జాస్తిగా వుండటంతో, ఆమెకు వెంటనే టీ దొరకలేదు. ఆమె జనం వత్తిడిని తప్పుకుంటూ స్టాల్ దగ్గిరకు పోయి, టీ కోసం డబ్బులిచ్చి బెంచీమీద నిద్రపోతున్న తన బిడ్డకేసి మళ్ళీ మళ్ళీ చూడసాగింది.

ఇంతవరకూ స్టేషన్‌లో వున్న రైలుబండి కూతవేసింది. అదే సమయంలో ఎక్కణ్ణుంచో నాగేంద్రం తుఫానులా వచ్చి, ఆదెమ్మ పక్కన నిద్రపోతున్న బిడ్డను లేవనెత్తి భుజాన వేసుకుని, ఒక్క అంగలోపోయి రైలెక్కాడు. ఆదెమ్మకూడా అతడి వెనకనే పోయి రైలెక్కింది.

టీ స్టాల్ దగ్గిర జనంలో నిలబడి టీ తాగుతున్న బిడ్డతల్లి, ఈ ఘోరం చూసి నిలువెల్లా కంపించిపోయి, మాటా పలుకూ లేకుండా మూర్ఛపడిపోయింది.

ఆదెమ్మా, నాగేంద్రం సరిగా రెండేళ్ళయినా నిండని ఆ బిడ్డను తమ ఇంటికి చేర్చారు. క్రమంగా ఆ పాపను అంచెలమీద బొంబాయి చేర్చాలి. అది అంత త్వరలో సాధ్యం కాలేదు. ఈ లోపల బిడ్డ అంద చందాలూ, వచ్చీరాని మాటలూ ఆదెమ్మలో మాతృవాత్సల్యాన్ని రగుల్కొల్పినై. ఆ బిడ్డను తానే పెంచుకుంటానన్నది ఆదెమ్మ. అమ్మితే చాలా డబ్బు వస్తుందని నాగేంద్రం మొదట్లో ఒప్పుకోకపోయినా, చివరకు తలూపి వూరుకున్నాడు. ఆదెమ్మ ఆ బిడ్డను ముద్దుగా 'గౌరి' అని పిలవసాగింది.

గౌరి పెరిగి పెద్దదవుతున్నకొద్దీ ఆమె అందం నాగేంద్రాన్ని ఆకర్షించసాగింది. తమ యిద్దరి మధ్యా వయస్సులో వున్న పెద్ద తేడా ఆ దుష్టుడి బుద్ధికి తోచలేదు. పెళ్ళీడురాగానే, తానే గౌరిని పెళ్ళాడాలని వాడు నిశ్చయించుకున్నాడు. ఆ మాట ఆదెమ్మకు చెపితే, ఆమె మౌనంగా ఎటూ తేల్చకుండా తలాడించి వూరుకున్నది. నాగేంద్రం నిరుత్సాహపడలేదు. తనమాట కాదన్నరోజున ఆదెమ్మను తాను పోలీసులకు

ఒప్పుచెప్పగల ననుకున్నాడు వాడు. తన శక్తి ఎలాంటిదో తెలిసిన ఆదెమ్మ తన కోర్కెకు ఆటంకాలు కల్పించలేదని నమ్మాడు.

వయసు పెరిగినకొద్దీ ఆదెమ్మ ప్రవర్తనలో చాలా మార్పులు రాసాగాయి. ఆమె యిప్పుడు తాను చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తమేదైనా చేసుకోవాలన్న ఆలోచనలో పడింది. అందుకు మరేంలేదు; గౌరిని దుష్టుల చేతుల్లో పడకుండా కాపాడి, మంచిగా బతికే ఏ యువకుడికైనా యిచ్చి వివాహం చేయాలనుకొన్నది.

గౌరికి ఆదెమ్మ మనసులో జరుగుతున్న సంఘర్షణగాని, నాగేంద్రం ఎత్తుగడలుగానీ ఏమీ తెలియవు. గౌరి ఆదెమ్మను అమ్మమ్మ అనీ, నాగేంద్రాన్ని మామ అనీ అనుకుంటున్నది. వాళ్ళిద్దరూ ఆమెకు అలా అనే చెప్పారు. గౌరికి ఆదెమ్మ అంటే యిష్టం. కాని, నాగేంద్రం అంటే ఎందుకనో అసహ్యపడుతూండేది. ఎవరి ప్రవర్తన ఎలాంటిదో తరచి చూడగల వయసుగాని, జ్ఞానంగానీ లేకపోయినా, ఆ పసి హృదయంలో నాగేంద్రం మొరటువాడనీ, దుష్టుడనీ నమ్మకం కుదిరిపోయింది.

చిన్నచిన్న విషయాలలోకూడా గౌరి, నాగేంద్రాన్ని ఎదిరించి, అతడి చేత దెబ్బలు తినేది. ఆదెమ్మ యింట లేనప్పుడు నాగేంద్రం ఆమెను ఏదో నెపం పెట్టి దగ్గరకు పిలిచి ముద్దు పెట్టుకునేందుకు ప్రయత్నించేవాడు. ఆ సమయాలలో గౌరికి అతడంటే మరింతగా అసహ్యం కలిగేది.

చంద్రాన్ని గొడ్లసావిటిలోంచి కట్లువిప్పి విడిపించిన తరువాత గౌరి యిల్లు చేరింది. నాగేంద్రంమామ ముద్దుపెట్టుకో ప్రయత్నిస్తే, తన కెంతో ఏహ్యాభావం కలుగుతుంది. చంద్రం తనను ముద్దుపెట్టుకున్నాడు. అసహ్యం అనిపించలా. పైగా ఆ ముద్దుతో అతడంటే ఎన్నో అర్థంకాని ఊహలు తనలో రేకెత్తుతున్నాయి. చంద్రం మంచివాడు. చాలా చాలా మంచివాడు. అయితే అతణ్ణి గుంజకెందుకు కట్టేశారు? ఎక్కడికి పారిపోయాడు? ఆకలయితే అన్నం ఎవరు పెడతారు? తను కట్లు విప్పవలసిందికాదు.... విప్పబట్టే పారిపోయాడు. ఒకవేళ యింటికి తిరిగి రాడేమో!.....

అలాంటి ఆలోచనలలో తలమునకలైవున్న గౌరికి, వంటింట్లో ఏదో అలికిడైనట్టు తోచి, అటుకేసి మెల్లిగా నడిచింది. ఆదెమ్మా, నాగేంద్రం పొయ్యిప్రక్కన చిన్న గుంట తవ్వి, దానిపక్కన కూర్చుని మెల్లిగా మాట్లాడుకుంటున్నారు. ఆదెమ్మ కొన్ని రూపాయల నోట్లు ముంతలోపెట్టి మూకుడు కప్పింది. నాగేంద్రం దానికి తాడు బిగించి, గుంటలో పెట్టాడు.

"జాగర్తరోయ్, నాగూ! ముంతలో మట్టిపడకుండా, గుంటపూడ్చు కాసినా కూసినా వెయ్యిరూపాయలు!" అన్నది ఆదెమ్మ.

నాగేంద్రం విసుగ్గా తలాడిస్తూ, "నీ కేమన్నా మతిపోయిందా? మూకుడుతో మూసిన ముంతలో మట్టెలా పడుతుంది?" అంటూ గుంటతవ్వగా వచ్చిన మట్టితో, తిరిగి గుంటను పూడ్చాడు.

ఆదెమ్మ పక్కనే ముద్దచేసివున్న పేడ పెట్టి ఆ స్థలమంతా శుభ్రంగా అలుకుతూ, "నాకింకా భయంగానే వుందిరా! ఆ కృష్ణారావుగారు నీమీదేం అనుమాన పడరుగందా?" అన్నది.

"ఆ భయం ఏమీలేదు. తమ్ముడు చంద్రం దొంగిలించాడని ఆయనకు నమ్మకం కుదిరిపోయింది. పోలీసులకు రిపోర్టుకూడా యివ్వడు–" అంటూ లేచి నిలబడ్డాడు నాగేంద్రం. ఆదెమ్మకూడా అలుకుడుపని పూర్తిచేసి నిలబడింది. ఇద్దరూ వాకిటికేసి నడవబోతూ ఎదురుగా గౌరి నిల్చొని వుండడం చూశారు.

"ఎంతసేపునుంచి ఇక్కడున్నావే?" అడిగాడు నాగేంద్రం.

"చాలాసేపునుంచీ. మీరు చేసిందికూడా చూశాను!" అన్నది గౌరి తొణక్కుండా.

ఆ జవాబుతో ఆదెమ్మ గతుక్కుమన్నది. నాగేంద్రం గౌరిని సమీపించి, తలమీద చిన్నగా మొట్టుతూ, "ఇదంతా నీకోసమేనే పిల్లా!" అన్నాడు.

"నాకోసమా! ఛీ! మీ దొంగతనం సంగతి కృష్ణారావుగారితో యిప్పుడే చెప్పొస్తాను" అంటూ గౌరి గిరుక్కున వెనుదిరిగింది.

నాగేంద్రం కళ్ళు చింతనిప్పుల్లా అయినై. కోపంగా గౌరి జడ పట్టుకుని వెనక్కు లాగాడు.

"నా జడ వదులు. నువు చంపినా, కోసినా నేను నిజం చెప్పకుండా వూరుకోను" అంటూ గౌరి పెనుగులాడింది.

నాగేంద్రం రౌద్రమూర్తి అయిపోయి, గౌరి జడపట్టుకుని కిందకు వంచి, వీపుమీద దభీదభీమంటూ బలంగా బాదాడు. గౌరి ఒకటి రెండు కేకలుపెట్టి స్పృహతప్పి కిందపడిపోయింది

ఆ స్థితిలో గౌరిని చూడగానే నాగేంద్రం కోపమంతా జాలిగా మారింది. అతడు తల వంచుకొని వీధివాకిలి దగ్గరకు వెళ్ళిపోయాడు. కాసేపటికి గౌరి కళ్ళుతెరచింది. పక్కన కూర్చుని ఆదెమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకోవటం ఆమెకు కనిపించింది. గౌరికి తను ఆదెమ్మనూ, నాగేంద్రాన్నీ ఎదిరించటం పొరపాటన్న భావం కలిగింది. ఆ వెంటనే మారుమాటాడకుండాపోయి గోడమూలనున్న మంచం లాక్కొని పడుకొన్నది. ఆ రాత్రి ఆదెమ్మా – నాగేంద్రం ఎంత బతిమాలినా గౌరి అన్నం తినలేదు.

ఒకరాత్రివేళ గౌరికి మెలకువ వచ్చింది. ఆదెమ్మ, నాగేంద్రం ఘర్షణ పడుతున్నారు.

"అదంటే నీ కొక్కదానికే ప్రేమనుకోకు. కొట్టినందుకు నాకూ బాధగానే వుంది. ఏంచేసేది? ఒట్టి మొండిఘటం!" అన్నాడు నాగేంద్రం.

"మొండో గిండో చాలా నీతిగల పిల్ల. మనం చేసే పాడుపనులు దానికి నచ్చవు. అది పుట్టిన వంశం గొప్పదయివుండాలి," అన్నది ఆదెమ్మ.

"ఏం గొప్పో! దొరికిన పిల్లలందర్నీ అమ్మినట్లే దీన్నీ అమ్మేస్తే ఏ చిక్కూ రాకపోవును," అన్నాడు నాగేంద్రం విసుగ్గా.

"అదీ నిజమేరా! ఎంతమంది పిల్లల్ని తల్లులనుంచి వేరుచేసి అమ్మాంకాదు? ఈ పిల్లను ఇక్కడకు తెచ్చిన క్షణంనుంచీ నాకు దీని తల్లి మనసులో మెదులుతున్నదనుకో. మనం దీన్ని బెంచీమీదనుంచి లాగి బుజాన వేసుకుని రైలుపెట్టెలో జొరపడుతూంటే, పాపం, ఆ తల్లి నిలువుగుడ్లేసి మనకేసి చూస్తూ, పెద్ద కేకపెట్టి దెబ్బతిన్న పిట్టలా కిందపడిపోవటం నాక్కనిపించింది," అన్నది ఆదెమ్మ బొంగురుబోయిన గొంతుతో.

"ఆ కేకేదో నువ్వు రైలు రొదలో విన్నావన్నమాట! అది సరేగాని ఆదెమ్మక్కా! ఈ గౌరంటే నీకు ఎప్పట్నుంచి యింత ప్రేమ పుట్టుకొచ్చిందీ? మాటవరసకంటాను. యిప్పుడు దానికొచ్చిన కష్టమేమిటి?" అన్నాడు నాగేంద్రం.

"కష్టం ఏం వుందిలే - అరే నాగేంద్రం! నాదొక్క కోరికరా. ఎవరైనా మంచి కుర్రాణ్ని చూసి గౌరికి ముడిపెట్టాలనివుంది."

"దానికి ఏ కుర్రాణ్ణో తెచ్చి పెళ్ళిచేస్తావా?" అంటూ ఎగిరిపడ్డాడు నాగేంద్రం. "దాన్ని నా పెళ్ళాం కాకుండా ఎవరూ ఆపలేరు. నీ వొట్టి కుట్రముండవని నాకేనాడో తెలుసు. అది అప్పుడెంత చిన్న పిల్లయితేనేం; దాన్ని దొంగిలించుకు వచ్చినరోజునే, అది నా పెళ్ళాం అనుకున్నాను."

"ఛీ ఏం మాటది! పదేళ్ళ పిల్లకు, ముప్ఫయేళ్ళు నెత్తిమీదకొచ్చిన నీతో పెళ్ళా?" అన్నది ఆదెమ్మ కోపంగా.

"మగాడి విషయంలో వయస్సేమిటే ఆదెమ్మక్కా! గౌరి నాది; దాని అందానికి హక్కుదారుణ్ణి నేను. చూస్తుండు - రేపోమాపో ముహూర్తం చూసి, దాని మెళ్ళో పుస్తె కట్టేస్తా. ఆ దెబ్బతో దాని పొగరూ అణుగుతుంది, నీ నోరూ మూతబడుతుంది" అంటూ నాగేంద్రం చర్రున మంచంమీంచి లేచి బయటికి వెళ్ళిపోయాడు.

ఈ సంభాషణంతా వింటూంటే గౌరికి మతి పోతున్నట్టనిపించింది. వీళ్ళు తనకేమీ కాదన్నమాట! తనను తల్లినుంచి దొంగిలించుకువచ్చిన దుర్మార్గురాలు ఆదెమ్మ తనకు అమ్మమ్మకాదు.... పరమ దుర్మార్గురాలు! తనను కని పెంచిన తల్లిని యిక ఎన్నటికీ తాను చూడలేకపోవచ్చు. అమ్మ ఎలా వుంటుంది? నాన్న ఎవరు? ఏం చేస్తూంటాడు? తనదే వూరు? ఏం కులం?.... యిలా ఆలోచిస్తున్న గౌరి కళ్ళనుంచి అశ్రువులు సంతతధారగా కారసాగినాయి.

.....ఈ దుర్మార్గుడు నాగేంద్రం తనను పెళ్ళాడతాడా? నిజమే. వాడు దుష్టుడు. అన్నంతపనీ చెయ్యొచ్చు. వాడికి దొరక్కుండా ఎటయినా పారిపోవాలి. అలా పారిపోగలిగితే, ఆ మధ్య తనూ అమ్మమ్మ.... ఛీ, అమ్మమ్మా? కాదు - ఆదెమ్మ వెంట వెళ్ళి చూసిన సినీమాలో లాగా అమ్మను ఏ ఆస్పత్రిలోనో కలుసుకోవచ్చును. యింతకూ తను ఎక్కడికి పారిపోయేట్టు?

ఇలా మథనపడుతున్న గౌరి దగ్గరకు ఆదెమ్మ వచ్చి నిద్రపోతున్నదేమో కనుక్కునేందుకు వంగి ముఖంలోకి చూసింది. గౌరి ఆదెమ్మ జుట్టు పట్టుకుని, "మా అమ్మ ఎక్కడుందో చెప్పు? నువ్వు అమ్మమ్మవు కాదు, దెయ్యానివి!" అన్నది.

"అయితే, మా మాటలన్నీ విన్నావన్నమాట? సరే, యిదీ ఒకందుకు మంచిదే. నేను దెయ్యాన్నే. కాని, నన్ను అసహ్యించుకోకు. నువ్వంటే నాకు కన్న కూతురుమీద వున్నంత ప్రేమ!" అన్నది ఆదెమ్మ.

"అంత ప్రేమయితే, నన్ను మా అమ్మ దగ్గరకు తీసుకపోయి ఒప్పచెప్పు. మా అమ్మకూ, నాన్నకూ చెప్పి నీకు బహుమానం ఇప్పిస్తా," అన్నది గౌరి! బతిమాలుతున్నట్టు.

"మీ అమ్మ ఎవరో, ఎక్కడుంటుందో నాకు తెలియదమ్మా గౌరీ! నేను ఒక్క సహాయం నీకు చేస్తాను. ఈ దుర్మార్గుడు నాగేంద్రం నుంచి నిన్ను కాపాడుతాను. లే,

పోదాం. వాడు మళ్ళీ యింటికి రాకముందే పోవటం మంచిది" అన్నది ఆదెమ్మ వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

గౌరి గబ గబా మంచం దిగింది. ఆ క్షణంలో ఆ బాలికకు తాను తన తల్లిని త్వరలో చూడబోతున్నాననే ఆశవల్ల ఎంతో ఆనందం కలిగింది. ఆదెమ్మ ఒక గోతాం సంచిలో గౌరి దుస్తులన్నీ సర్దింది. ఇద్దరూ ఇంటికి తాళం వేసి బయలుదేరారు. గౌరి మనస్సు సంతోషంతో ఉరకలు వేస్తున్నది. తను తన కన్నతల్లి దగ్గరకు వెళ్ళిపోతున్నది. తల్లి తనను చూసి ఎంత ముచ్చటపడుతుందో!.....

ఆదెమ్మ ఒక పెద్ద బంగళాముందు ఆగింది. గేటుముందున్న గూర్ఖావాడు ఆదెమ్మకేసీ, గౌరీకేసీ ప్రశ్నార్థకంగా చూశాడు. గౌరి గేటు పక్కనవున్న సైన్‌బోర్డుకేసి చూసింది. దానిమీద రాసివున్న అక్షరాలను కూడబలుక్కుని చదివింది "అనాథ శరణాలయం."

గౌరి గుండె గతుక్కుమన్నది ఆదెమ్మ తనను తన తల్లిదగ్గరకు కాదు తీసుకుపోతున్నది.. ఈ శరణాలయంలో వున్న కొందరు పిల్లలను చూసింది. శరణాలయాన్ని గురించి వాళ్ళూ వీళ్ళూ చెప్పుకునే మాటలు కూడా విన్నది. ఆదెమ్మ తిరిగి తనను మోసంచేసి, యీ బందిఖానాలో పెట్టేందుకు ప్రయత్నిస్తున్నది. తను ఆదెమ్మకు అందకుండా పారిపోతే....

గౌరి పారిపోయేందుకు నాలుగడుగు లేసిందో లేదో, ఆదెమ్మా గూర్ఖా కలిసి ఆమెను పట్టుకున్నారు. ఆ తరువాత విడిపించుకునేందుకు పెనుగులాడుతున్న గౌరిని బంగళావైపుకు లాక్కుపోయారు.

ముతక ఖద్దరు చీర కట్టి లావుగా, నల్లగావున్న ఒక వయసుమళ్ళిన స్త్రీ వాళ్ళకు వరండాలో కనిపించింది. ఆమె ముఖంలో ఏ భావమూ లేదు కళ్ళద్దాలలోనుంచి గౌరికేసి గుచ్చిగుచ్చి చూసింది. గౌరి ఆ చూపుకు బెదురుకున్నది. ఆ స్త్రీ శరణాలయానికి మాట్రిన్.

"అమ్మా! ఈ అమ్మాయిని మీ దగ్గిర చేర్చుకోవాలి," అన్నది ఆదెమ్మ, రెండు చేతులూ ఎత్తి మాట్రిన్‌కు దణ్ణం పెడుతూ.

"ఎవరా అమ్మాయి? యిక్కడ దిక్కులేనివాళ్ళను మాత్రమే చేర్చుకుంటామని తెలీదా?" అన్నది మాట్రిన్ కసురుతూన్నట్టు.

"దిక్కులేని పిల్లేనమ్మా! తల్లి నిన్నే చచ్చిపోయింది. ఆలనా పాలనా చేసేవాళ్ళెవరూ లేరు," అన్నది ఆదెమ్మ.

"అబద్ధం!" అంటూ గౌరి అరిచింది, తను యింతసేపుగా భావనాప్రపంచంలో కల్పించుకున్న తల్లి చచ్చిపోయిందని ఆదెమ్మ చెప్పటం విని సహించలేక.

"ఈ పిల్లకు యీ పెద్ద బంగళా చూసి భయంవేసింది. అందుకే అట్లా మాట్లాడుతున్నది. నా మాట నమ్మండి" అంటూ ఆదెమ్మ మాట్రిన్‌ను ప్రాధేయపడింది.

మాట్రిన్ పెదాలమీద ఓ తృటికాలం చిరునవ్వులాంటిదేదో కనిపించి, యిట్టే మాయమైపోయింది. "ఓం, యీ రకం పిల్లలసంగతి నాకు మహా చక్కా తెలుసు!" అంటూ మాట్రిన్ వెనక్కు తిరిగి, "లక్ష్మీ, లక్ష్మీ!" అని కేక పెట్టింది. ఆ కేక వింటూనే తలుపులు బార్లా తెరుచుకుని, రూపంలో మాట్రిన్‌కు మేనత్తలావున్న ఆయా బయటికివచ్చి,

మాటా పలుకూ లేకుండా గౌరి రెక్క పట్టుకుని ముందుకు లాగింది. గౌరికి భయంతో ముచ్చెమటలు పోశాయి. పెద్దగా అరవాలనుకున్నది. గొంతు పెగలలేదు. ఆయా ఆమెను "ఏయ్, నడు!" అంటూ బరబరా లోపలికి యీడ్చుకుపోయింది. ఆదెమ్మ ముఖం పాలిపోయింది. ఆదిలోనే గౌరిని అంత మోటుగా శరణాలయంవాళ్ళు లోపలకు లాక్కుపోతారని ఆమె అనుకోలేదు.

"అమ్మా! గౌరి కొంచెం బాగా బతికినపిల్ల. కాస్త పెంకె. తమరు...." ఆదెమ్మకు ఆపైన మాటలు గొంతులోనే ఉంగిడి చుట్టుకుపోయాయి. మాట్రిన్ ముక్కుపుటాలు ఎగరవేస్తూ ఆమెకేసి బెబ్బులిలా చూస్తున్నది.

"వాగుడంతా కట్టిపెట్టు. ఓc, యీ రకం పిల్లలసంగతి నాకు మహ చక్కా తెలుసు! ఇక మాట్లాడకు. చూడాలనుకొంటే ఆ పిల్లను నెలకోసారి వచ్చి, చూసిపోవచ్చు; యిక నడు" అంటూ మాట్రిన్ లోపలికెళ్ళిపోయింది.

ఆదెమ్మ తలొంచుకుని వెనుదిరిగి కాళ్ళీడ్చుకొంటూ బంగళా గేటు దాటి రోడ్డుమీదికి వచ్చింది. ఇన్నేళ్ళ తరవాత ఆమెకు లోకమంతా భయంకరంగా తోచింది. తన జీవితంలో ఏదో పెద్ద వెలితి కనిపించిది.

ఇక తను ఇంటికిపోవటం అనవసరం అనుకొన్నదామె. జరిగిందేమిటో తెలిసిన తరువాత, నాగేంద్రం ఇక తనను బతకనివ్వడు. ఈ ముసలితనంలో తను వుండేందుకు పంచకూడా లేకుండాపోయింది. ఇదంతా తను చేసుకొన్న పాపమేనా?......

ఆదెమ్మ రోడ్డు ప్రక్కనున్న చెట్లనీడకిందగా, ఒక గమ్యం అంటూ లేకుండా నడవసాగింది. ఆనాటినుంచీ ఆమెను ఆ ప్రాంతాలవాళ్లెవరూ మళ్ళీ చూడలేదు.

# 6

గౌరి కట్లిప్పగానే గొడ్లచావిడి మొండిగోడ దూకిన చంద్రం. తను ఎటు వెళుతున్నదీ చూసుకోకుండా ఊళ్ళోకి చాలాదూరం పారిపోయాడు. అతడి ఉద్దేశం తను ఇంటినుంచి ఎంతదూరం పోగలిగితే అంతమంచిదని.

బాగా అలసిపోయిన చంద్రం, ఒక వీధి మలుపులో గోడకానుకొని నిలబడ్డాడు. ఆసరికి బాగా పొద్దెక్కి, ఎండ తీక్షణం కాసాగింది. చంద్రానికి ఎక్కడలేని ఆకలి పుట్టుకొచ్చింది. ఇంట్లో వుండగా అతనేనాడూ అంత ఆకలి ఎరగడు. జేబులు తడువుకొంటే, ఒక్క అర్థరూపాయిబిళ్ళ దొరికింది. దానితో ఆ దాపులనున్న హోటలులోకి పోయి, రెండు ఇడ్లీ తిని, కాఫీతాగి సూటిగా పార్కులోకివెళ్ళి, అక్కడ చెట్లమాటునవున్న ఓ బెంచీమీద పడుకున్నాడు. బాగా అలసిపోయి ఉన్నాడేమో – అతడికి నిద్రపట్టింది.

చాలసేపటితరువాత అతడు కళ్ళు తెరిచేసరికి చుట్టూ చిమ్మచీకటి: బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ చంద్రం లేచి కూర్చున్నాడు. పార్కులో జనం అంతగా లేరు. తను ఏదోవిధంగా గుంటూరు వదలి, ఎవరికంటా పడకుండా బొంబాయికి పారిపోవాలని అతడు నిశ్చయించుకొన్నాడు. బొంబాయి చాలా పెద్ద పట్టణమట. అక్కడ పనిలేనివాడంటూ వుండడట. అక్కడ తను చేతనైనపని ఏదో ఒకటి చేసి బతగ్గలడు. కొంత డబ్బు కూడబెట్టిన తరువాత గురుకులానికి వెళ్ళి చదువుకోవాలి.

చంద్రం బయలుదేరాడు. ఒళ్ళంతా నొప్పులుగా వున్నది. జ్వరం తగిలినట్టు కాలిపోతున్నది. తనెక్కడికి పోవాలో ఆలోచించకుండానే పార్కువదలి నడవసాగాడు. కొంతదూరం వెళ్ళేసరికి రైలుకట్ట కనిపించింది. దూరంగా రైలుకూత వినబడింది. రైలన్నా రైలుస్టేషనన్నా అతడి కెందుకో దిగులూ, ఆనందంకూడా కలుగుతుంటాయి. ఇలా అంటే, స్కూల్లో అతడి స్నేహితులంతా నవ్వి, వేళాకోళం పట్టించేవాళ్ళు, రైళ్ళూ, విమానాలూ వచ్చి ప్రపంచాన్ని కుదించేశాయి అంటాడు మేష్టరు. తనకు మాత్రం అలా అనిపించదు. ఇవి వచ్చిం తరువాతే ప్రపంచం మరింత విశాలమైందనుకొంటాడు. తను ఇష్టంలేని వాళ్ళనుంచి ఎంతదూరమైనా పారిపోయేందుకు యీ రైళ్ళూ, విమానాలూ బాగా ఉపయోగిస్తవి. ఇల్లేకాదు, ఈ దేశమే వద్దనుకుంటే, వాటి సహాయంతో మరోదేశంపోయి హాయిగా బతకవచ్చు. అలా దేశమే వదిలిపోయినవాళ్ళు కొందరున్నారట!

రైలుకట్టమీద ఇలా ఆలోచిస్తూ నడుస్తున్న చంద్రానికి, పట్టాల మీద నీడలా కదులుతున్న ఓ ఆకారం కనిపించింది. ఆశ్చర్యపోతూ, చంద్రం అటుకేసి ఒకడుగు వేసేంతలో, స్టేషన్‌కేసి వస్తున్న రైలు పెద్ద కూతవేసి, మహావేగంగా ఆ ప్రాంతాన్ని సమీపిస్తున్నది. చంద్రం ఒక్క దూకులో పట్టాల మీదికిపోయి, అక్కడవున్న ఆకారాన్ని రెండుచేతులతోనూ పట్టి, పట్టాలనుంచి అవతలకి నెట్టి, కాలు నిలదొక్కుకోలేక దభీమంటూ ఆ ఆకారంమీద పడిపోయాడు. ఇంతలో రైలు ప్రళయ భయంకరంగా గర్జిస్తూ దాటిపోయింది. చంద్రం లేచి నిలబడ్డాడు. అంతవరకూ అతడితో పెనుగులాడిన ఆకారంకూడా లేచీ నిలబడుతూనే, "ఎవరూ? చంద్రం!" అంటూ చంద్రాన్ని కావిలించుకుంది.

"నువ్వా, ప్రకాశం! ఏమిటిది? ఆత్మహత్య చేసుకోవాలనుకొన్నావా?" అన్నాడు చంద్రం, తన స్నేహితుణ్ణి గుర్తించి.

"అవును చంద్రం! రైలుకిందపడి ఆత్మహత్య చేసుకొందామనుకున్నాను. నువ్వు ఎందుకడ్డుతగిలావు? రెక్కల కష్టంమీద బతికే మా నాన్న నా చదువుకోసం ఎంతో ఖర్చు పెట్టాడు. నేను బాగా చదివి ఏ ఐ. ఏ. యస్. ఆఫీసర్నో అవుతానని ఆయన ముచ్చట పడేవాడు. నేను పరీక్ష తప్పాను. ఈ సంగతి తెలిస్తే నాన్న ఎంత బాధపడతాడో తెలుసా?" అన్నాడు ప్రకాశం ఏడ్పుగొంతుతో.

"తెలివితక్కువగా మాట్లాడబోకు ప్రకాశం! నువ్వు పరీక్ష తప్పావని తెలిస్తేనే అంత బాధపడే మీ నాన్న, నిజంగా నువ్వు ఆత్మహత్య చేసుకొంటే బతికుండగలడను కొంటున్నావా?" అన్నాడు చంద్రం కోప్పడుతున్నట్టు.

"నువ్వన్నది నిజమే చంద్రం! పరీక్ష తప్పానన్న విచారంలో యివేమీ నేనాలోచించలేదు. ప్రాణానికి తెగించి నన్ను కాపాడావు. పద మా యింటికిపోదాం. నువ్వీ రాత్రికి మా యింట్లో వుండాలి–" అంటూ ప్రకాశం ముందు దారితీశాడు.

చంద్రం మౌనంగా ప్రకాశం పక్కన నడవసాగాడు. హఠాత్తుగా ప్రకాశానికో అనుమానం కలిగింది. ఇంత రాత్రివేళ చంద్రం యీ రైలు కట్టకేసి ఎందుకొచ్చినట్టు? చంద్రంకూడా పరీక్ష తప్పాడు. అతడూ తన లాగే....

"చంద్రం! నువ్వీ ప్రాంతాని కెందుకొచ్చావ్? నాలాగే నువ్వూ..... అవునా?" అని అడిగాడు ప్రకాశం.

"అలాంటి అనుమానం ఏమీ పెట్టుకోకు. నేను చచ్చేందుకు ఇటురాలేదు. ఒకవేళ రైలుకిందపడి చచ్చినా, నాకోసం దిగులు పడేవాళ్ళెవ్వరూ లేరు" అన్నాడు చంద్రం నిస్పృహగా.

"నీకోసం దిగులుపడేవాళ్ళే లేరా?" అంటూ ప్రకాశం ఆప్యాయంగా చంద్రం చేయి పట్టుకున్నాడు. చంద్రం చేయి వణికింది. అతడు గద్గదస్వరంతో, "అవును, ప్రకాశం! యీ లోకంలో నాకోసం దిగులుపడేవాడివి నువ్వొక్కడి వున్నావు" అన్నాడు.

ఆ తరువాత యిద్దరూ మౌనంగా నడిచారు. ఇంటిని సమీపించేసరికి ప్రకాశం తండ్రి భద్రయ్య వాకిట్లో తలవంచుకుని విచారంగా కూర్చుని వుండటం వాళ్ళకు కనిపించింది. వాళ్ళు వస్తున్న అలికిడి వింటూనే భద్రయ్య తల ఎత్తి, వాళ్ళకేసిచూసి, కొడుకును గుర్తించి "వచ్చావా, బాబూ!" అంటూ పరుగెత్తి వెళ్ళి ప్రకాశాన్ని కావలించుకొని, "పరీక్ష తప్పినందుకు నీవేం అఘాయిత్యం చేసుకున్నావో అని పొద్దుటినుంచీ కుమిలిపోతున్నాను. ఇంతసేపూ ఎక్కడెక్కడ తిరుగుతునావు? చంద్రం! నువ్వు పరీక్ష పాసయావా?" అంటూ ఆ యిద్దరినీ ఇంట్లోకి తీసుకుపోయాడు.

కొద్దిసేపటి తరువాత ప్రకాశం, చంద్రం భోజనం చేశారు. చంద్రానికి తిండి సహించలేదు కాని, భద్రయ్య బలవంతం చేయగా తిన్నాడు. భద్రయ్య ఒకటికి రెండుసార్లు అడిగినమీదట ప్రకాశాన్ని రైలుపట్టాలమీద తానెలాంటిస్థితిలో చూసింది అతడికి చెప్పాడు.

భద్రయ్య హృదయం చంద్రంపట్ల కృతజ్ఞతాభావంతో నిండిపోయింది. అతడు తనకు పుత్రభిక్ష పెట్టాడు! అంత చిన్నవాడికి తన కృతజ్ఞతాభావం ఎలాంటి మాటలతో చెప్పటం? భద్రయ్య చంద్రం చేతులు పట్టుకుని, నుదుటిమీద చేయివేశాడు. అది వెచ్చగా వున్నట్టు తోచింది.

"చంద్రం, నీకు బాగా జ్వరం వచ్చినట్టుంది. ఒరే బాబూ! ఆ మంచం వేసి చంద్రాన్ని అక్కడ పడుకోబెట్టు, నేను డాక్టర్‌ని పిలుచుకువస్తాను" అంటూ భద్రయ్య, చంద్రం వద్దని వారిస్తున్నా వినక డాక్టరు కోసం పరిగెత్తాడు.

డాక్టరు వచ్చిచూచి, ఇది మామూలు జ్వరంలా లేదన్నాడు. ఏవో మందులిచ్చాడు. మూడు నాలుగు రోజుల తరువాత అది టైఫాయిడు అని తేలింది. భద్రయ్య, కృష్ణారావుకోసం కబురు చేస్తానన్నాడు. చంద్రం వద్దంటే వద్దనటమేగాక, అన్న అక్కడికి వచ్చేలావుంటే, తను ఎటైనా పారిపోతానన్నాడు. మీకు యిక్కడ ఇబ్బందిగా వుంటుందిగనక తనను ధర్మాసుపత్రికి తీసుకుపొమ్మన్నాడు.

"ఎక్కువగా మాట్లాడకు, చంద్రం! నువ్వు యిక్కడ వుండటం మాకిబ్బందిగా వుంటుందా? ఎంతమాట! నువ్వు నా బిడ్డను కాపాడావు; నా బిడ్డతో సమానుడివి" అంటూ భద్రయ్య పైపంచతో కళ్ళు తుడుచుకున్నాడు.

"నేను పొరపాటుగా మాట్లాడాను. ఏమీ అనుకోకండి! ఈ టైఫాయిడ్ నన్నేమీ చేయదు. నేను బతుకుతాను, నేను నిర్దోషినని రుజువు చేస్తాను. కాని, ఒకవేళ ఈ

జ్వరంతో చచ్చిపోతే, నా శవాన్ని కాల్చివేసిన తరువాత మా అన్నయ్యవాళ్ళకు కబురుచేయండి. చంద్రం చనిపోతూ తను డబ్బు దొంగిలించలేదని అన్నట్టు ఆయనతో చెప్పండి" అంటూ చంద్రం కన్నీరు పెట్టుకున్నాడు.

చంద్రానికి జ్వరం నదిలి, స్వస్థత కలిగేందుకు నెలరోజులు పట్టింది. ఆ తరవాత ఓ వారంరోజులు గడవగానే, చంద్రం, యిక తను వెళ్ళిపోతానన్నాడు. భద్రయ్య ఒప్పుకోలేదు. "మరికాస్త ఆరోగ్యం కలగ్గానే వెళ్ళుదువుగాని. మా ప్రకాశం నీ గురించి అంతా చెప్పాడు నువ్వు డెహరాడూన్‌కో ఎక్కడికో వెళ్ళి చదువుకోవాలనుకొంటున్నావట. అలాగే చదువుకో. ప్రకాశం పాసయితే, కాలేజీ చదువుఖర్చులకు ఉంటుందని ఏడు సంవత్సరాలుగా కొంత డబ్బు కూడబెట్టాను. అది యిప్పుడు ఆరు వందలయింది. ఆ డబ్బు నీకిస్తాను. అది తీసుకొని మరికొంత ఆరోగ్యం కలిగింతరవాత, నువ్వెక్కడ చదువుకోవాలంటే, అక్కడికి వెళ్ళు. నువ్వు బాగా చదివి, ప్రయోజకుడివై తిరిగి రావాలని నా కోరిక" అన్నాడు భద్రయ్య.

"నాకు డబ్బవసరం లేదండీ, నా తిప్పలు నేను పడగలను" అన్నాడు చంద్రం.

"ఈ డబ్బే నీ తండ్రి యిస్తానంటే వద్దనగలవా?" అన్నాడు భద్రయ్య నిట్టూరుస్తూ.

"చంద్రం, నాన్న చెప్పినట్టు చెయ్యి. నాన్నకూ, నాకూ కూడా సంతోషం కలుగుతుంది" అన్నాడు ప్రకాశం.

వాళ్ళు చూపిన ఆదరానికి చంద్రం కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. ఇంత ఆదరం, ప్రేమా అతడేనాడూ ఎరగడు. డబ్బు తీసుకోవడానికి ఒప్పుకున్నాడు. కాని అతడికోసంగతి తెలుసుకోవాలని వున్నది. తమ కుటుంబానికీ, యీ కుటుంబానికీ ఎందుకంత బద్ధవైరం? భద్రయ్య కాస్త తటపటాయించి, చివరికిలా చెప్పాడు:

"నువ్వింకా చిన్నవాడివి, అయినా బలవంతం చేశావు గనక చెపుతున్నాను. మా తాతగారిదీ, మీ ముత్తాతగారిదీ ఒకే ఊరు. అప్పట్లో మాది చాలా మోతుబరి కుటుంబం కింద లెక్క. మీ ముత్తాతగారు కుటుంబ పోషణకు చాలా అవస్థలపాలవుతుండేవారట. ఆయన ఒకసారి మా తాతగారితో అన్ని సంగతులూ చెప్పుకున్నారు. మా తాత ఆయనకు మూడువందల రూపాయలిచ్చి, గుంటూరు వెళ్ళి పొగాకు దుకాణం పెట్టుకోమని సలహా యిచ్చారు. ఆనాడు మూడు వందల రూపాయలంటే యిప్పటి మూడువేల రూపాయలతో సమానం.

మీ ముత్తాతగారు గుంటూరు వెళ్ళి వ్యాపారం సాగించారు. గిట్టుబాటుగానే వుంది. మరికొంత పెట్టుబడి పెట్టి, భారీ ఎత్తున వ్యాపారం చేయాలని ఆయనకు ఆలోచన వచ్చి, ఆ మాట మా తాతగారితో చెప్పారు. వ్యాపారంలో భాగస్వామి కమ్మన్నారు. అందుకొప్పుకుని, మా తాత, వున్న పొలమమ్ముకుని గుంటూరు చేరారు.

మా తాతా, మీ ముత్తాతా వ్యాపారంలో భాగస్వాములయ్యారు. వ్యాపార గొడవలన్నీ మీ ముత్తాతగారే చూసేవారు. వ్యాపారంలో ఎంత లాభాలు వస్తున్నదీ మా తాతకు తెలియదు. కుటుంబ ఖర్చులకు డబ్బుమాత్రం తీసుకుంటూ వుండేవారు. కొన్నేళ్ళు గడిచాయి. వ్యాపారం ఏపాటి లాభసాటిగా నడుస్తున్నదో తెలుసుకునేందుకు మా తాత, మీ ముత్తాతను ఆ వివరాలు అడిగారు. ఆ వివరాలన్నీ చెపితే నీకు వున్నమతిపోతుంది.

కుటుంబ ఖర్చులకు సరిపడా డబ్బిస్తున్నానుగదా? కాలక్షేపం చేసెయ్యి అన్నారట మీ ముత్తాతగారు. ఇద్దరూ ఘర్షణ పడ్డారు. అసలు నీకు వ్యాపారంలో వాటాయే లేదు, పో పొమ్మన్నాడట మీ ముత్తాత. పల్లెలో మిగిలిన కొద్ది పొలమూ అమ్మి, కోర్టుకు వెళ్ళాడు మా తాత. కేసు గెలవలేదు. లెక్కలు పుస్తకాల్లో ఎక్కడా మా తాత వాటాదారుడన్న సంగతే లేదు. ఏదో జీతండబ్బులు తీసుకుని పనిచేసేవాడన్న ధోరణిలో ఆ లెక్కలన్నీ రాసివున్నాయి.

ఆ దెబ్బతో మా తాత మంచంపట్టి మూణ్ణెల్లు తిరక్కుండానే చనిపోయాడు. అప్పట్లో మా నాన్న హైస్కూల్లోనే అనుకుంటాను - చదువుతూండేవాడు. ఆ రోజులలో ఆయన చాలా దుడుకుమనిషి. చదువు పాడవడం, వున్న చదువుతో మంచి వుద్యోగం దొరక్కపోవటంతో, ఆయన బాగా పగబట్టి, ఒకరోజున దారిలో ఒంటరిగా మీ ముత్తాతను దొరకపుచ్చుకొని బాగా కొట్టాడు. అప్పటికే ముసలివాడై వున్న మీ ముత్తాత, ఆ దెబ్బలతో మంచంమీంచి లేవలేని స్థితికి వచ్చాడు. మా నాన్నమీద కోర్టులో కేసుమాత్రం పెట్టలేదు. కదిలిస్తే డొంకంతా కదిలి, తన పాత మోసాలన్నీ మళ్ళీ కోర్టు కెక్కుతాయని భయపడి వుంటాడు. ఏదేమయితేనేం, ఆనాటినుంచీ - మీ కుటుంబం మా కుటుంబం బద్ధశత్రువులైపోయారు.

మానాన్న - ఎక్కడా సరైన ఉద్యోగం దొరక్క గోతాలమిల్లులో కూలీపనికి కుదిరాడు. ఆయన వారసత్వమే నాకూ వచ్చింది. ఎలాగో కాలక్షేపం చేస్తున్నాను. చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకున్న ప్రకాశంమీదే నా ఆశలన్నీ. ఈ సంవత్సరం పరీక్ష తప్పాడని, నాకేం కోపం లేదు. మరో సంవత్సరం చదివి పాసవుతాడు. నువ్వూ, ప్రకాశం స్నేహితులు కావటం, నాకెంతో సంతోషంగా ఉంది. వాణ్ణి రైలుకింద పడకుండా కాపాడి, మా వంశాన్ని నిలబెట్టావు. ఒకప్పుడు మీ కుటుంబమే మా కుటుంబానికి రుణపడి వున్నదనుకునేవాణ్ని. ఇప్పుడు మేమే మీ కెంతో రుణపడివున్నాం. మీ రుణం రూపాయలూ, అణాల్లో తీర్చగలిగింది కాదు."

భద్రయ్య చెప్పినదంతా శ్రద్ధగా విన్న చంద్రానికి తన కుటుంబం ఎంత నీచానికి ఒడిగట్టి, యీనాడు యింత ధనాన్ని కూడబెట్టిందో అర్థమైంది. కూలి చేసుకుని పొట్టపోసుకునే భద్రయ్య ముందు తనూ, తన అన్నా ఎంతో అల్పులు! భద్రయ్య దారిద్ర్యానికి తన కుటుంబమే కారణం. కాని ఈనాడు ఆ భద్రయ్యే తన చదువుకోసం డబ్బిస్తున్నాడు!

చంద్రం హృదయంలో భద్రయ్య మీద కృతజ్ఞతాభావం పొంగిపొర్లింది. అతడు మైకం కమ్మినవాడిలా లేచి, భద్రయ్య కాళ్ళమీద పడిపోయాడు. భద్రయ్య అతన్ని ఎంతో ఆప్యాయతతో పైకెత్తి గుండెలకు హత్తుకున్నాడు.

# 7

ఎనిమిది సంవత్సరాలకాలం యిట్టే గడిచిపోయింది. సంఘ జీవితంలో చెప్పలేం కాని - వ్యక్తి జీవితంలో ఎన్నో మార్పులు కలగటానికి ఎనిమిది సంవత్సరాలు చాలు.

కృష్ణారావు నడుపుతున్న చిన్న పొగాకు కంపెనీ పెద్ద ఫ్యాక్టరీగా మారింది. పాత సైన్‌బోర్డు స్థానాన్ని, 'శేఖర్ టుబాకో ఫ్యాక్టరీ' అన్న కొత్తబోర్డు ఆక్రమించుకున్నది. గుంటూరు టౌనుకు చిన్న సిటీ లక్షణాలు ఏర్పడినై. మెడికల్ కాలేజీతోపాటు, మరికొన్ని కొత్త కాలేజీలూ, హాస్పిటల్సూ వచ్చాయి. పల్లెటూళ్ళలో నివసించే ధనిక కుటుంబాలవాళ్ళు చాలామంది పిల్లల చదువుకోసం అంటూ పట్టణం మీదికి ఎత్తివచ్చారు. బీద కుటుంబీకులు, విడవకుండా కూలీనాలీ దొరుకుతుందన్న ఆశతో గ్రామాలు వదిలి లేచివచ్చారు.

పై చూపులకు పట్టణం బాగా మారింది. వాతావరణం మరింతగా మారింది. కాని ఫ్యాక్టరీలలో, కార్ఖానాలలో కష్టించి పనిచేసే కూలీల జీవిత విధానంలో మార్పులేదు. కృష్ణారావు యాజమాన్యంలో నడుస్తున్న పొగాకు ఫ్యాక్టరీకి అంతదూరంలో వున్న మైదానంలో మరికొన్ని కొత్త పూరిగుడిశెలు లేచాయి. వాటితోపాటు అక్కడ మురికీ, బీదతనం కూడా మరికొంత పెరిగింది.

పూర్వం వేలల్లో నడిచిన కృష్ణారావు వ్యాపారం యిప్పుడు లక్షలమీద నడుస్తున్నది. పాత డాబా యింటిస్థానంలో రెండంతస్తుల విశాలమైన మేడ కట్టించాడు. అతడిప్పుడు నవనాగరిక జీవితానికి అవసరం అయిన అన్ని హంగులూ ఏర్పాటు చేసుకున్నాడు. ఇంటికి కావలసిన ఫర్నిచరంతా ఆర్డరిచ్చి బొంబాయినుంచి తెప్పించాడు.

కృష్ణారావు ఏకైక పుత్రిక రజనికి యిప్పుడు పన్నెండో ఏడు. రజనిని అందరూ అచ్చం బాబాయి పోలిక అంటారు. చంద్రం యిల్లు వదిలిపోయినప్పుడు రజని మూడేళ్ళ పిల్ల. ఆ కారణంగా ఆమెకూ చంద్రం ఏమీ గుర్తులేదు. కాని, హేమ దగ్గిరకు వెళ్ళినప్పుడల్లా రజని చంద్రాన్ని గురించి అడుగుతూండేది. ఎలాంటివాడు? కోపధారా? నిదానస్తుడా? ఎర్రగా వుండేవాడా? చామనఛాయా? ఈ ప్రశ్న లెప్పుడైనా తల్లి నడిగితే, ఆవిడ కస్సుమనేది, తండ్రి నడిగితే ముభావంగా తలవంచుకు వూరుకుని, బాధపడుతున్నట్టు కనబడేవాడు.

చంద్రం బాబాయికి తానంటే చాలా ప్రేమ అనీ, ఎప్పుడూ భుజంమీద వేసుకుని తిప్పుతుండేవాడనీ, హేమ ద్వారా తెలుసుకుని రజని చాలా ఆనందపడేది. బాబాయి యిప్పుడెంత ఎత్తు పెరిగివుంటాడు? ఏనాటికైనా ఇంటికి తిరిగివస్తాడా? ఇలాంటి ప్రశ్నలతో రజని సతమతమైపోతూ వుండేది.

రజని చాలా చురుకైన పిల్ల. తల్లిదండ్రులకు ఏకైక సంతానం కావడంవల్ల ఎంతో అల్లారుముద్దుగా పెంచుకొంటున్నారు. తల్లి కాంతమ్మకు రజనిమీద ఈగవాలినా ఎక్కడ కందిపోతుందోనన్నంత భయం. రజని మాటకు ఎదురు చెప్పే ధైర్యం ఆ ఇంటిలో ఎవరికీ లేదు. కొంచెం కోపగిస్తే చాలు, అలిగి కూర్చునేది. ఆమెకు సినిమా పత్రికలూ, డిటెక్టివ్ నవలలూ చదవడంలో వున్న శ్రద్ధ, స్కూలు పుస్తకాలమీద లేదు. అందువల్లనే రజని రెండు సంవత్సరాలుగా థర్డుఫారంలోనే వుండిపోయింది. కృష్ణారావు కూతురు చదువు అశ్రద్ధ చేస్తున్నదని తెలిసి, గట్టిగా కోప్పడాలనుకునేవాడు. కాని కాంతమ్మకు భయపడి అతడామెను మందలించలేకపోతున్నాడు.

కాంతమ్మ దృష్టిలో తన కూతురు చదవటం, పరీక్షలు ప్యాసవటం - అంతా వట్టి హైరానా, ఎంత పెద్ద చదువు చదివి మాత్రం తన కూతురు ఉద్యోగాలు చేయబోతున్నదా? ఊళ్ళేలబోతున్నదా? తన బిడ్డ గొప్ప అదృష్టవంతురాలు. బిడ్డ వయసుతోపాటు తమ సంపదకూడా పెరుగుతున్నది. దానికి చదువుమీద యిష్టం లేకపోతే, చదవమని బలవంతం చెయ్యటం ఎందుకు? ఇంకో అయిదారేళ్ళు గడిస్తే, తమ హోదాకు సరితూగే కుటుంబంలోని కుర్రవాణ్ణెవర్నయినా తెచ్చి, దానికి ముడేసి, ఇంటిలోనే ఇల్లరికం వుంచుకుంటే సరిపోతుంది.

కాంతమ్మ కెప్పుడూ యిలాంటి ఆలోచనలే. ఆమె వట్టి ఆలోచనలతో సరిపెట్టుకుని యింట్లో కూర్చోక, తమ అంతస్థుకు తగినవారనుకున్న కుటుంబాలవాళ్ళతో పరిచయాలూ, స్నేహాలూ ప్రారంభించింది. డబ్బుతోపాటు కాంతమ్మ మానసికంగా కూడా కొంత పెరిగింది. ధనం వల్లగాని, ఉద్యోగరీత్యాగాని గొప్పవాళ్ళని ఆమె అనుకున్న వ్యక్తులతో, సమానస్థాయిలో మాట్లాడటం నేర్చుకున్నది.

ఉన్నట్టుండి ఒక శుభముహూర్తాన కాంతమ్మ లేడీస్ క్లబ్బులో మెంబరుగా చేరింది. అక్కడి కొచ్చేవారంతా కొద్దో గొప్పో చదువుకున్న వాళ్ళూ పెద్ద పెద్ద ఆఫీసర్ల భార్యలూ వారి సంతానమూనూ. కాంతమ్మ తన భర్త దగ్గిర ఓపిక వున్నప్పుడల్లా నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చుకుని, వాటిని సందర్భశుద్ధి వున్నా లేకపోయినా క్లబ్బులో ధారాళంగా వుపయోగించేది. విన్నవాళ్ళు - విరగబడి నవ్వబోయి పెద్దింటావిడ, ఏమనుకొని పోతుందో అని చిరునవ్వు నవ్వే ప్రయత్నంలో వికవిక పకపక మనేవాళ్ళు. అలాంటి సందర్భాలలో కాంతమ్మకు అరికాలిమంట నెత్తికెక్కేది. 'డిగ్రీలూ, ఉద్యోగాలూ, వున్నా, లక్ష్మి లేనివాళ్ళకు, మర్యాదా మన్ననా ఏం తెలుస్తుంది?' అనుకొనే దావిడ యీసడింపుగా. ఆ నవ్విన వాళ్ళనందర్నీ నాగరికత తెలియని పశువులకింద

క్లబ్బు కొచ్చేవాళ్ళల్లో రిటైర్డు హైకోర్టు జడ్జి సుందరంగారి భార్య అంటే కాంతమ్మకు మహాచెడ్డకోపం. కాంతమ్మకూ ఆమెకూ ప్రతి చిన్న విషయంలోనూ వాదోపవాదాలు జరుగుతూండేవి. ఇక కలెక్టరు భార్య కళావతి వున్నది. ఆమె ఆ క్లబ్బుకు వచ్చే వారందరిలోకి సౌందర్యవతి, విద్యావతి. ఆమె ఎవరి మనసూ నొప్పించకుండా తాను నవ్వుతూ అందర్నీ నవ్విస్తూండేది. ఆమె అన్నా కాంతమ్మకు పడదు, కాని పైకిమాత్రం ఎంతో ఆప్యాయతా, గౌరవం కనబరుస్తూండేది.

ఒకనాడు క్లబ్బులో అందరూ పేకాడుతున్నారు. మధ్య మధ్య మిసెస్ సుందరం, కాంతమ్మ ఒకరినిమించి ఒకరు గొప్పలు చెప్పుకుంటున్నారు. మిసెస్ సుందరం ఒక్కతే కాంతమ్మతో యిలాంటి కబుర్లు పెట్టుకుంటుంది. తతిమ్మావారు ఆమె సంగతి అంతగా పట్టించుకోరు.

"మీరు కట్టిన చీర బావుంది. కొత్తదా?" అడిగింది మిసెస్ సుందరం కాంతమ్మను.

"అబ్బే. లేదు; డ్రైవాష్‌నుంచి వచ్చింది. నేను పట్టుచీర ఒక్కసారికంటే ఎక్కువ కట్టను, డ్రైవాష్‌కు వేసేస్తాను. అదీ ఫ్యాషన్స్ కంపెనీవాళ్ళకే. వాళ్ళు చీరకు రెండు

రూపాయిలు చార్జి వేస్తారు. అదెంతలెండి! మా వారికి నేను నలిగిన చీర కట్టుకోవటం బొత్తిగా యిష్టం వుండదు," అన్నది కాంతమ్మ గర్వంగా.

"మీవారే నయం! మావారు వాష్‌కు వేసిన చీర కట్టుకుంటే కోప్పడతారు. అందుకని, కొత్తచీర ఒకేసారి కట్టి, దాన్ని మా పనిపిల్ల కిచ్చేస్తాను. అది ఆ చీరల్ని డ్రైవాష్‌కు వేసిగాని మరి కట్టుకోదు. అదిప్పుడిప్పుడే కాస్త బడాయి నేరుస్తున్న పిల్లలెండి!" అన్నది మిసెస్ సుందరం వచ్చే నవ్వు ఆపుకుంటూ.

ఈ మాటలు విన్నవాళ్ళందరూ గొల్లుమంటూ నవ్వారు. కాంతమ్మకు ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకినట్టయింది. ఒకే మోతాదులో యింత అవమానాన్ని ఆమెనాడూ మింగవలసి రాలేదు. ఆనాటితో ఆమె క్లబ్బు ఛాయలకేసికూడ పోవటం మానుకున్నది.

కాంతమ్మను గృహసమస్యలుకూడా కొన్ని బాధించసాగినై. ఆదాయం పెరగటంతో, ఆ అంతస్తుకు తగినట్టు బ్రతుకుదామని కాంతమ్మ ఇంటిలో నౌకర్లనూ, చాకర్లనూ కొందరిని చేర్చింది. తిండి, ఇరవై పాతిక రూపాయిల నెలజీతాలకు వచ్చిన వాళ్ళు అవకాశం దొరికితే ఎన్నెన్ని దొంగతనాలు చేయగలరో ఆమె ఆలోచించుకొని బెదిరిపోతుండేది. ఈ నౌకర్లలో ఒక్కర్నీ నమ్మటానికి లేదు. వంటవాడు కాస్త సందు దొరికితే పాలూ పెరుగులు మెక్కెయ్యటమేగాక, కూరా నారా అలగావాళ్ళందరికీ పంచేస్తాడు. ఇల్లూడ్చే పిల్లా, పక్కలు పరిచే ముసిలిదీ.... వీళ్ళను అసలు ఆదమరిచి ఉండేందుకే లేదు. నెలాఖర్న వీళ్ళందరికీ జీతం డబ్బులిచ్చేప్పుడు కాంతమ్మకు ప్రాణం కడబట్టినంత పనయ్యేది. పనీపాటూలేని వాళ్ళందరికీ తాను ఊరికే డబ్బు ధారపోస్తున్నట్టు బాధపడేది. కాని, ఇంటికి ఈ హంగులన్నీ తప్పవు. పెళ్ళీడుకు వస్తున్న పిల్ల వున్నది. ఏ క్షణాన ఎలాంటి సంబంధాలు వస్తయ్యో చెప్పలేం.

కృష్ణారావులోకూడా రోజురోజుకూ పెరిగిపోతున్న ఆదాయం చాలా మార్పులు తెచ్చింది. ఏనాడూ రాజకీయాల జోలికి పోని కృష్ణారావు అవంటే ఎంతో ఆసక్తి కనబరుస్తున్నాడు. ఏవైనా ఎన్నికలొస్తే, అతని ఇంటికి వచ్చేపోయే కార్లసంఖ్య చెప్పటం కష్టం. అసెంబ్లీకి నిలబడవలసిందిగా కొందరతణ్ణి గట్టిగా కోరారు. అంత తొందరేం వచ్చిందిలే అన్న ధోరణిలో కృష్ణారావు మాట్లాడాడు. ఇలాంటి సంగతులు తెలిసినప్పుడల్లా కాంతమ్మ భర్త అంత ప్రయోజకుడై పోవటానికి కారణం తనే అనుకుంటుంది. ఆమె పలుకుబడివల్లే కావచ్చు. ఒకప్పుడు నాస్తికుడిలా మాట్లాడే కృష్ణారావు యిప్పుడు గొప్ప ఆస్తికుడూ, వెంకటేశ్వరస్వామి భక్తుడూ అయిపోయాడు. సింహద్వారం దాటి ఇంటిలో ప్రవేశించగానే, నిలువెత్తు ఏడుకొండలవాడి విగ్రహం అందర్నీ ఆకర్షిస్తుంది. భార్యాభర్తలిద్దరూ తప్పకుండా శనివారాల్లో ఉపవాసాలు చేస్తుంటారు.

డబ్బూ, పలుకుబడీ, ఆరోగ్యం, చక్కని కుమార్తె - యిన్ని వున్నా, ఎటో పారిపోయిన తమ్ముడు చంద్రాన్ని మాత్రం కృష్ణారావు మరిచిపోలేకపోతున్నాడు. అతడు గుర్తు వచ్చినప్పుడల్లా, కృష్ణారావు తమ్ముడిపట్ల తాను చేసిన దౌష్ట్యానికి బాధపడు తుండేవాడు. దొంగతనం చేసినా, తమ్ముణ్ణి తానలా గొడ్ల చావిడిలో గుంజకు కట్టివేయవలసిందికాదు. ఈ పాడుపని చేయటం ద్వారా తను మరణించిన తల్లితండ్రుల ఆత్మలకు శాంతిలేకుండా చేసి ఉండవచ్చు. చంద్రం యింకా బతికేవున్నాడా?

తమ్ముణ్ణి గురించిన యీ అనుమానం కృష్ణారావుకు సరిగ్గా ఆఫీసుకు బయలుదేరే సమయాలలో ఎదురవుతుండేది; ఆ రోజునా ఎందుకనో చంద్రం హఠాత్తుగా గుర్తుకు వచ్చాడు. కృష్ణారావు ఆఫీసుకు వెళ్ళే ప్రయత్నం మాని, తన గదిలోకి వెళ్ళి పడుకొన్నాడు. భార్యవచ్చి అడిగితే ఒంట్లో బాగోలేదని చెప్పాడు.

గోడగడియారం పన్నెండు కొట్టింది. బయట ఎండ మండిపోతున్నది, గదిలో ఫాన్ తిరుగుతున్నా, గాలి మరింత వేడెక్కిపోతున్నది. ఫాన్ ఆపితే ఎక్కడలేని ఉక్క.

కృష్ణారావు మంచంమీంచి లేచి వరండాలో కెళదామనుకునేంతలో అప్పుడే భోజనం చేసిందేమో– ఆయాసపడుతూ కాంతమ్మ గదిలో ప్రవేశించి, "చూడండి, యిక్కడ ఎంత ఉక్కగా వుందో! ఒక్క గదన్నా ఎయిర్ కండిషన్ చేయించమంటే చేయించారూ? ఆ జడ్జి సుందరంగారు చూడండి, ఉన్నదాన్లోనే ఎంత గొప్పగా కనబడతారో! మూడు గదులు ఎయిర్ కండిషన్ చేయించారట," అన్నది.

ఈ మాటలు వింటూనే కృష్ణారావుకు వళ్ళు మండిపోయింది. తన భార్య ఒక్కనాడైనా తన తమ్ముణ్ణి గురించి అడిగిన పాపానపోలేదు. వాడింకా బతికుంటే ఎక్కడో బికారిలా జీవితం గడుపుతూండి వుంటాడు. ఆస్తిలో వాడికీ వాటా వున్నది. అయినా వాడికి అనుభవించే రాతలేదు. ఉన్నది చాలక తన భార్య ఎయిర్ కండిషన్లు కావాలంటుంది. చంద్రం తిరిగి రాకపోవటమే ఆమె కోరుకుంటున్నట్టు కనబడుతుంది. అప్పుడు ఆస్తంతా తన కూతురికే దక్కుతుంది. ఈ మనిషిలో మానవత్వం ఉందా?

"ఉలకరూ పలుకరూ, ఏమిటంత యిదిగా ఆలోచిస్తున్నారు? ఒంట్లో మరీ అంత బాగోపోతే; డాక్టరుకు ఫోన్ చేయండి. అయినా, నా మాట మీరేనాడు లెక్కచేశారు గనక!" అంటూ కాంతమ్మ ముఖం ముడుచుకుని, దూరంగా పోయి కూర్చున్నది.

కృష్ణారావు భార్య అన్నమాటలకు ఏ జవాబూ యివ్వలేదు. అతడికి ఆలోచనలమీద ఆలోచనలు వస్తున్నవి. కాంతమ్మ మాట తనెప్పుడు కాదన్నాడో అతడికి గుర్తుకు రావటంలేదు. నిజంగానే ఆమె మాట పాటించక, ఆమెను తగిన హద్దుల్లో ఆమెనుంచినట్టయితే, తన తమ్ముడు దేశాలుపట్టి పోవలసిన అవసరం కలిగేది కాదేమో! ఈనాడు లక్షల ఆస్తికి వారసుడైన చంద్రం పొట్టకోసం ఎన్నెన్ని బాధలు పడుతున్నాడో? భగవాన్! తనుచేసిన పాపానికి నిష్కృతిలేదు.

కృష్ణారావు చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకుంటూ మంచంమీద ఓ పక్కకు వత్తిగిలి పడుకున్నాడు. చంద్రంజాడలు తెలుసుకునేందుకు తాను చేయవలసినదంతా చేశానన్న తృప్తి అతడికి లేదు. చంద్రం ఎక్కడ వున్నదీ తెలియపరిచినవారికి పెద్ద బహుమానం యిస్తానని, అతడు పత్రికల్లో ప్రకటనలు వేయించాడు. ఫలితం లేకపోయింది. గురుకుల్ వాళ్ళకు రాస్తే, చంద్రమోహన్ అనే తెలుగు కుర్రవాడొకడు కొత్తగా వచ్చి చేరినట్టు జవాబిచ్చారు. తన తమ్ముడు చంద్రశేఖర్– చంద్రమోహన్ అని పేరు మార్చుకున్నాడేమో అన్న అనుమానం అనుమానంగానే వుండిపోయింది. వ్యాపార గొడవల్లో పడిపోయి తానా విషయం అంతటితో వదిలేశాడు. తాను ఒకసారి ఆ గురుకుల్‌కు వెళ్ళివస్తే ఎంత బావుండేది! కాని, తానాపని చెయ్యలేదు. ఆఫీసు.... వ్యాపారం.... లాభాలు.... భగవాన్!

భర్త పక్కకు తిరిగి పడుకుని, ఎంతసేపటికీ మాట్లాడకపోయేసరికి, కాంతమ్మకు ఉక్రోషం వచ్చి, చివాలున గదిలోంచి హాల్లోకి వెళ్ళి, అక్కడ యీజీఛైరొకటి లాక్కుని పడుకున్నది. ఇంతకాలం జరిగినా, దొంగతనం చేసి యింట్లోంచి పారిపోయిన తమ్ముడిమీద తన భర్తకు ప్రేమ తగ్గకపోవటం ఆమెకు వింతగా తోచింది. ఆనాడు చంద్రం విషయంలో కల్పించుకుని, భర్తచేత ఎన్నడూ లేంది చెంప ఛెళ్ళుమనిపించుకొన్న తరవాత కాంతమ్మ మరిది ప్రసక్తి భర్తదగ్గిర ఏనాడూ తేలేదు. భర్త అతణ్ణి గురించి ఏమైనా చెబితే వినేది, ఊకొట్టేది, అంతే.

కాంతమ్మకు కొంచెం కునుకుపట్టే వేళకు ఎవరో తన భర్త గదిలోకి వచ్చిన అలికిడి వినబడింది. ఈ వేళప్పుడు ముందు పిలవాపెట్టకుండా అంత స్వతంత్రంగా గదిలోకి వచ్చే వాళ్ళెవరై వుంటారబ్బా? అనుకుంటూ కాంతమ్మ యీజీఛైరులోంచి లేచి తలుపుదగ్గిరకు వెళ్ళింది. గదిలో సంభాషణ సాగుతున్నది. ఆ వచ్చినవాడు ప్రసాదరావు!

ప్రసాదరావు వుత్తినేరాడు; ఆ సంగతి కాంతమ్మకు బాగా తెలుసు. వచ్చినప్పుడల్లా చంద్రాన్ని గురించి హోరెత్తిపోయేట్టు అదీ యిదీ మాట్లాడేస్తాడు. ఈ వేళకానివేళ వచ్చాడు గనుక యిందులో ఏదో విశేషమే వుంటుంది.

కాంతమ్మ గదిలోకి రెండడుగులు వేసి, గోడపక్కగా వున్న టేబిల్‌మీద కాగితాలూ, అవీ సర్దుతున్నట్టు నటిస్తూ, భర్తముఖంకేసీ, ప్రసాదరావు ముఖంకేసి పరీక్షగా చూసింది. ప్రసాదరావు ముఖంలో ఏదో సంతోషం తాండవిస్తున్నది. భర్త ముఖంలో అంతకుముందున్న చిటపటలు పోయి, ఆ స్థానాన్ని మందహాసం ఆక్రమించుకుని వున్నది. అతడేదో పత్రికను శ్రద్ధగా పరికించి చూస్తున్నాడు. కాంతమ్మ టేబిల్‌పక్కనే వున్న సోఫాలో కూర్చుని ఆముదం తాగబోయే ముఖంపెట్టి భర్తకేసి చూస్తూ వుండిపోయింది.

కృష్ణారావు హఠాత్తుగా పత్రికమీంచి తల ఎత్తి, కాంతమ్మకేసి చిరునవ్వుతో చూస్తూ, "కాంతం! యిలా రా! చూడు! యీ ఫోటో మన చంద్రానిదే, సందేహంలేదు" అన్నాడు.

కాంతమ్మ ఏదో పుట్టిమునిగినట్లు హడావిడిగా సోఫాలోంచి లేచి భర్త దగ్గిరకుపోయి, అతడందించిన పేపరు తీసుకుని, ఫోటోకేసి చూసింది.

"ఏమండీ కాంతమ్మగారూ! చంద్రమేగదూ?" అని ప్రశ్నించాడు ప్రసాదరావు.

"అవునండీ! అచ్చం చంద్రంలాగే వున్నాడు. కాని, పేరు చంద్రమోహన్ అని వుంది మరి!" అన్నది కాంతమ్మ – కంఠస్వరంలో ఆశ్చర్యం, దాన్నిమించిన అనుమానం స్ఫురింపజేస్తూ.

"మన చంద్రమే! అనుమానపడేందు కాస్కారమే లేదు," అంటూ కృష్ణారావు ప్రసాదరావుకేసి తలతిప్పి, "ప్రసాదరావుగారూ, మీకు బాగా గుర్తేగా? చంద్రం పారిపోయిన కొత్తలో మనం గురుకుల్ వాళ్ళకు వుత్తరం రాశాం. వాళ్ళు చంద్రశేఖర్ అనే కుర్రవాడెవరూ తమ గురుకుల్‌లో లేడనీ, కానీ చంద్రమోహన్ అనే కుర్రవాడొకడు కొత్తగా వచ్చి తమవద్ద చేరాడనీ బదులు రాశారు. చంద్రశేఖర్, చంద్రమోహన్ అని పేరు మార్చుకుని వుండొచ్చని మనకు కాస్త అనుమానం కలిగికూడా – ఆ విషయాన్ని అంతటితో ఎందుకు వదిలేశామో, యీనాటికీ నాకు అర్థం కావటంలేదు. శేఖర్.... మోహన్, ఎంత చిన్నమార్పు! అయినా, మనం అమాయకుల్లా ఆ సంగతి నంతటితో

వదిలేశాం. చంద్రం పేరెందుకు మార్చుకుంటాడులే అని సర్దిచెప్పుకున్నాం" అన్నాడు ఎంతో బాధపడుతూ.

"అవును, పెద్ద పొరపాటే జరిగిపోయింది. మనం అమాయకుల్లా కాదు - సొంతం మతిపోయిన వాళ్ళలా ప్రవర్తించాం. గురుకుల్ వాళ్ళకు డబ్బుపంపి, ఆ చంద్రమోహన్ అనే కుర్రవాడి ఫోటో పంపమని రాసినా, అప్పట్లోనే నిజం బయటపడేది. అదంతా యిప్పుడనుకొని ఏం లాభంలెండి? పత్రిక పొద్దునే వచ్చినా, ఆ ఫోటో నేను గమనించనే లేదు. ఇంతకుముందే అమ్మాయి హేమచూసి ఆ సంగతి నాకు చెప్పింది. పాపం, దానికెంత సంతోషం కలిగిందనుకున్నారు? బాల్యస్నేహం కదా!" అన్నాడు ప్రసాదరావు.

కాంతమ్మ పత్రికను భర్తచేతికిస్తూ "అమ్మయ్య, దేవుడి దయ వల్ల చంద్రం క్షేమంగా వున్నట్టు తెలుసుకున్నాం ఇప్పుడెక్కడున్నదీ... ఆ అడ్రసు మీకు తెలుసుగదా? వెంటనే వెళ్ళి తీసుకురండి" అన్నది.

కాంతమ్మ యింత హఠాత్తుగా, యింత మంచి మార్పు రావటం కృష్ణారావుకు చాలా ఆనందం కలిగించింది. ప్రసాదరావు కూడా సంతోషించాడు. "ఎంత కాదన్నా స్త్రీ హృదయం కదా మరి" అనుకున్నాడాయన.

"కృష్ణారావుగారూ! ఇది మనందరికీ ఎంతో సంతోషసమయం" అంటూ ప్రారంభించాడు ప్రసాదరావు. "నేను ఒకరోజు మీతో అన్నాను గుర్తుందా - చంద్రం మంచి రచయిత అవుతాడని ఇప్పుడు చూడండి, చంద్రం రాసిన 'సాహిత్యమూ - సంస్కృతీ' అన్న పుస్తకానికి అకాడెమీ బహుమతి లభించింది. చంద్రాన్ని గురించిన పరిచయ వాక్యాలు చదివారు గదా! చంద్రం రాసిన నాలుగు నవలలు యింతకుముందే అచ్చయ్యాయట" అన్నాడు.

ప్రసాదరావు మాటలు వింటూంటే కృష్ణారావుకు సంతోషం, దుఃఖం కూడా ముంచుకు వస్తున్నది. "ఆలస్యం ఎందుకు? నేను రేపే బయలుదేరి వెళతాను" అన్నాడాయన.

"మీ రెళ్ళేవరకూ ఢిల్లీలోనే వుంటాడని నమ్మకం ఏమిటి? అది అతను స్థిరంగా వుండే చోటు కాదుగదా! కనక, స్థిరంగావుండే అడ్రసేదో ముందు తెలుసుకు మరీ బయలుదేరండి" అని సలహా యిచ్చింది కాంతమ్మ.

"అదీ నిజమేనండీ, కృష్ణారావుగారూ! సెంట్రల్ సాహిత్య ఆకాడెమీకీ, యీ ఫోటో ప్రకటించిన హిందూస్తాన్ టైమ్స్ పత్రికకూ చంద్రం అడ్రసుకోసం రాస్తాను. అది తెలియగానే, మీరు బయలుదేరి వెళ్ళవచ్చు" అన్నాడు ప్రసాదరావు.

కృష్ణారావుక్కూడా అలా చేయడమే బావుంటుందనిపించింది, ప్రసాదరావు కుర్చీలోంచి లేచి, వెళ్ళొస్తానని చెప్పి బయలుదేరగానే కృష్ణారావు అతనివెంట గేటుదాకా పోయి సాగనంపి, "మీ రొచ్చేముందు నేను చంద్రాన్ని గురించే ఆలోచిస్తున్నాను. మీరు మంచి శుభవార్త తెచ్చారు, చాలా కృతజ్ఞుణ్ణి" అన్నాడు.

"చంద్రం మీకూ మాక్కూడా సమానంగా ప్రేమపాత్రుడు. ఇంత కాలానికి హేమ ముఖంలో ఆనందం, కొత్తకాంతీ చూశానంటే నమ్మండి" అన్నాడు ప్రసాదరావు.

ప్రసాదరావు గేటుదాటి వెళ్ళిపోగానే, కృష్ణారావు గబగబా ఇంట్లోకి వచ్చి, శరీరంలోకి నూతన శక్తి వచ్చినవాడిలా చప్పట్లు చరుస్తూ, "రజనీ! రజనీ! ఎక్కడ?" అంటూ కేకలు పెట్టాడు.

రజని డిటెక్టివ్ నవల ఒకటి తెరచి పట్టుకుని తన గదిలోనించి అయిష్టంగా బయటికివచ్చి. "ఏం, డాడీ! కథ మంచి క్లయిమాక్సులో వున్నప్పుడు పిలుస్తూంటారు. ఏమిటో తొందరగా చెప్పండి" అన్నది కొంచెం విసుగ్గా.

"మరేం లేదమ్మా! ఎవరేం చెప్పినా నమ్మి హడావిడి చేస్తుంటారు మీ నాన్న" అన్నది కాంతమ్మ దెప్పిపొడుస్తున్నట్టు.

కాంతమ్మ మాటల్లో యింతలోనే అంత పెద్ద మార్పు వచ్చినందుకు ఆశ్చర్యపడుతూ, కృష్ణారావు పత్రికను కూతురు చేతికిచ్చి, "ఆ ఫోటో ఎవరిదో తెలుసా?" అని అడిగాడు.

రజని – ఫోటోకేసి ఓమారు చూసి కిందవున్న పేరు చంద్రమోహన్ అని చదివి, "నాన్నా! ఆయన ఫోటో లోగడే ఎక్కడో చూశాను. ఆఁ. గుర్తుకొచ్చింది. ఈయన వ్రాసిన నవల ఒకటి... దాని పేరేమిటబ్బా... ఆఁ– 'తిరస్కృతి' రాజా యిస్తే చదివాను. చాలా బాగా రాశాడు. ఆ నవల అట్టమీదకూడా యిదే ఫోటో వుంది. అప్పుడు కూడా అనుకున్నాను, ఈ మొహం ఎక్కడో చూసినట్టుందే అని" అన్నది రజని.

"ఆ నవల నా కివ్వనేలేదే! ఎన్నాళ్ళ కిందట చదివావు?" అని ప్రశ్నించాడు కృష్ణారావు.

"ఓ అర్నెల్లయిపోయింది. నీ కెందుకివ్వాలి! నువ్వసలు నవలలు చదవనే వద్దంటావుగా" అన్నది రజని చిరుకోపంగా.

"చూడమ్మా, నీ పెట్టెలోవున్న బాబాయి ఫోటో ఒకసారి తెస్తావా?"

"ఎందుకూ? యిప్పుడే తెస్తాను" అంటూ రజని ఒక్క పరుగున పోయి, పెట్టెలోంచి ఫోటో తీసుకువచ్చి తండ్రి కిచ్చింది.

అంతదూరంలో నిలబడి తండ్రీ – కూతుళ్ళ హడావిడంతా గమనిస్తున్న కాంతమ్మ, "కాస్తకే అంత మురిసిపోతే ఎలా? మనిషిని పోలిన మనుష్యులు ఎందరో వుంటారు" అన్నది మూతి తిప్పుతూ, రజని కీమాటలేమీ అర్థంకాలేదు.

"చూడమ్మా! ఈ రెండు ఫోటోలకూ పోలిక లున్నవేమో?" అంటూ కృష్ణారావు, పత్రికనూ, ఫోటోనూ కూతురుకిచ్చాడు. అతడు భార్య అన్నమాటలు వినిపించుకున్నట్టే లేదు.

రజని రెండు ఫోటోలనూ ఒకదాని పక్కన ఒకటిపెట్టి ఓ క్షణం కాలం పోల్చి చూసి, "అవును డాడీ! ఈ ఫోటోలో ఉన్నది బాబాయే! సందేహంలేదు. ఇంటి కెప్పుడొస్తాడో" అంటూ పెల్లుబికిన ఆనందంతో రెండు చేతులతోనూ తండ్రిని చుట్టేసింది.

"దొంగతనం చేసి ఇంటిలోంచి పారిపోయిన తుంటరి కుర్రాడు అంత గొప్పవాడవుతాడంటే, నాకు నమ్మకం కలగటం లేదు. తండ్రీ కూతుళ్ళు మరీ అంత తన్మయత్వం పడకండి?" అన్నది కాంతమ్మ విసురుగా.

"శకునపక్షిలా పలక్క, అలా నోరుమూసుకు కూర్చో, నీ నమ్మకాలూ, అపనమ్మకాలతో నన్ను వేధించకు. నీకు తోచిందేతప్ప, ఇతర్లు చెప్పింది ఏనాడు నమ్మావు కాబట్టి?" అన్నాడు కృష్ణారావు కోపంగా.

ఈ మాటలతో కాంతమ్మ ముఖం కందగడ్డలా చేసుకొని, "కూరాకులో పురుగులా నన్ను దులిపెయ్యకండి. కాస్త లోకం తెలిసినవాళ్ళెవరికైనా, దొంగతనంచేసి దేశాలు పట్టిపోయిన కుఱ్ఱాడేమవుతాడో వూహించటం కష్టంకాదు. చంద్రం ఎప్పుడో ఆకలిదప్పులకు అలమటించిపోయి వుంటాడు. అలాకాక, బతికివుంటే, ఏ జేబులు కొట్టే వృత్తిలోనో ప్రవేశించి సగం కాలాన్ని జైళ్ళల్లో గడుపుతూండి వుంటాడు" అన్నది.

కృష్ణారావు భార్యమాట పూర్తిచేసే లోపలే రౌద్రమూర్తి అయిపోయి, చేయిపైకెత్తి ఆమెకేసి ఒక అడుగు వేశాడు. కాంతమ్మ భయపడిపోయి, చల్లగా అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

కృష్ణారావు కోపాన్ని అణచుకునే ప్రయత్నంలో కళ్ళలో నీళ్లు తిరిగినై. అతడు సోఫాలో ఉస్సురంటూ కూలబడి, రజనిని దగ్గిరకు తీసుకొంటూ, "మీ అమ్మ వుండుండి, అనవసరంగా నాకు కోపం తెప్పిస్తుంది. సరే, అది మామూలుగా యీ కొంపలో జరుగుతున్నదే అనుకో. నువ్వెందుకు ముఖం అలా పెట్టుకున్నావ్? ఏం భయంలేదు. బాబాయి ఎక్కడున్నా వెతికి తీసుకొస్తాను. వాడికి నువ్వంటే ఎంత ప్రేమ! ఎప్పుడూ భుజాన వేసుకొని తిప్పుతూ, ఆడిస్తూండేవాడు" అన్నాడు.

రజని పసిహృదయానికి బాబాయిని చూడాలన్న కోర్కె కలచివేసింది. ఆ పన్నెండేళ్ళపిల్లా, తండ్రి ఒడిలోంచి లేచి, హాలులోవున్న నిలువెత్తు వేంకటేశ్వరుడి పటందగ్గిరకు వెళ్ళి, చేతులు జోడించి, "వేంకట రమణా! మా బాబాయి యివ్వాళే యింటికొచ్చేట్టు చెయ్యి. యిలా చెయ్యమని నిన్ను చాలాసార్లు అడిగాను. ఈసారికైనా తప్పక చేస్తావా?" అంటూ నమస్కరించింది. కృష్ణారావుకూడా అప్రయత్నంగా కూతురుతో పాటు లేచి, నిలబడి, ఆ పటానికి తలవంచి నమస్కరించాడు.

# 8

ప్రసాదరావు ఇంటికొచ్చేప్పటికి, హేమ టేబిల్ ముందు కూర్చుని ఏదో రాస్తూండటము అతడి కంటపడింది. తండ్రిరాకను కూడా గమనించనంతగా ఆమె తన పనిలో లీనమైపోయింది.

ప్రసాదరావు కూతుర్ని సమీపించి, "ఏమిటమ్మా! రాస్తున్నావ్?" అంటూ పక్కనున్న సోఫాలో కూర్చున్నాడు.

హేమ ఉలిక్కిపడి, తల ఎత్తి తండ్రికేసి చూసింది. ఆమె ముఖం జేవురించి వున్నది. తడబడుతూ ఏమో చెప్పబోయి వూరుకున్నది.

"సాహిత్య అకాడెమీకీ, పత్రికవాళ్ళకూ చంద్రం అడ్రసుకోసం రాస్తున్నావా?" అన్నాడు ప్రసాదరావు, సోఫాలోంచి లేచి ఆప్యాయంగా కూతురు తల నిమురుతూ.

"అవును, నాన్నా!" అన్నది హేమ, మరింతగా తల వంచుకుంటూ.

"పిచ్చితల్లీ! నా దగ్గిరకూడా ఎందుకమ్మా అంత సందేహం, దాపరికం? నీ మనసు ఏనాడో నేనర్థం చేసుకున్నాను. ముందుగానే లేనిపోని ఆశలు మాత్రం పెంచుకోకు. మనిషిని పోలిన మనుషులుంటారు. చంద్రం విషయంలో అలాంటి అనుమానాలకు ఆస్కారం వున్నట్టు కనబడకపోయినా, నన్నో సందేహం బాధిస్తున్నది- పేరు మార్చుకున్నవాడు, మనకు తన అడ్రసు తెలియనిస్తాడా అని," అన్నాడు ప్రసాదరావు.

"చంద్రం యింకా అజ్ఞాతవాసం గడపాల్సిన అవసరం ఏమిటి నాన్నా? చిన్నప్పుడు - ఇల్లు విడిచి పారిపోయినప్పుడు, తన నెవరూ పట్టుకోకుండా అలా పేరు మార్చుకొని వుంటాడు. ఇప్పుడు అలాంటి అవసరం ఏమీ లేదుకదా?" అన్నది హేమ.

"ఆలోచిస్తూంటే నాకూ అలానే తోస్తున్నది. ఆ ఫోటో చంద్రానిదే అయివుండాలనీ, అతడు మనం రాయగానే ఇంటికి తిరిగి రావాలనీ, నేను మనసారా కోరుకొంటున్నాను. నువ్వు సుఖపడాలనే కోర్కెతప్ప, నాకీ లోకంలో మరే కోర్కెలూ లేవు. నేను చేసిన పాపానికి శిక్ష అనుభవించకూడదు," అన్నాడు ప్రసాదరావు జీరపోయిన గొంతుతో.

హేమ అదిరిపడింది. నాన్న పాపం చేశాడా? ఈ మాట తనతో ఆయన అనటం యిది రెండోసారి. నాన్నలాంటి మనిషి పాపంచేస్తే, యిక యీ లోకంలో పుణ్యం సేసినవాళ్ళెవరు? అలాకాక, పైకి పుణ్యాత్ముల్లా, పెద్దమనుష్యుల్లా కనిపించేవాళ్ళంతా ఏదో ఒక పాపంచేసే వుంటారా? ప్రతి మనిషి హృదయంలోనూ చీకటి కోణాలుంటాయా?....

"నాన్నా!"

తన గదికేసి వెళ్ళిపోతున్న ప్రసాదరావు కూతురి కంఠస్వరంలో పలికిన ఏదో అపశృతికి విహ్వలుడైపోయి "ఏమిటమ్మా!" అంటూ వెనుదిరిగాడు.

"నాన్నా! నువ్వు పాపం చేశావంటే నేను నమ్మను. నాకు వూహ వచ్చింతరవాత నీ నోటినుంచి యీ మాట వినటం. యిది రెండోసారి. నన్ను బాధపెట్టక, జరిగిందేమిటో చెప్పు, నాన్నా!" అనడిగింది హేమ.

ప్రసాదరావు ముఖం వెలవెల పోయింది. తను అప్రయత్నంగా యీ మాట కూతురుతో చెప్పటం రెండవసారి అన్నమాట! తనెందుకీ మధ్య యింతగా మనోవేదన పొందుతున్నాడు? ఏ మాత్రం తొణకకుండా, నిబ్బరంగా వుండే తను, ఎందుకింతగా చలించిపోతున్నాడు? తనింత కాలంగా హృదయంలో దాచిన రహస్యం పురుగులా తనను తొలిచేస్తున్నది. ఆ రహస్యం ఎవరికీ చెప్పదగింది కాదు. హేమకు అసలే చెప్పగూడదు. అది విన్ననాడు, తానామె దృష్టిలో హీనాతిహీనుడై పోతాడు. కాని తనకు తెలియకుండానే తనలో అలాంటి రహస్యం .... పాపం.... దాగి వున్నట్టు హేమతో అనేశాడు.....

"నాన్నా! ఏమిటలా మాటా పలుకూ లేకుండా నిలబడ్డారు?" అన్నది హేమ, తండ్రి స్థాణువులా నిలబడి, వెర్రిచూపులు చూస్తూండటం గమనించి.

ప్రసాదరావు తేరుకున్నాడు. హేమ కళ్ళల్లో నీళ్ళు తిరగటం అతడి కంటబడింది. "హేమా! ఎందుకలా కన్నీళ్ళు పెడతావు? నీ విచారం నేను చూడలేనమ్మా! నా మాటలేవీ పట్టించుకోకు. నాకున్న ఒక్క విచారం నువ్వు కోరుకున్న వ్యక్తి నీకు లభిస్తాడో లేదో అనీ, జీవితంలో నీవు సుఖపడతావో లేదో అనీ మాత్రమే. ఈ బాధక్కారణం నేను చేసిన

పాపం, నిన్ను వెన్నాడి కష్టాలపాలు చేస్తుందేమో అని. అంతకన్నా నా విచారానికి మరే కారణం లేదు" అంటూ గబగబా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

హేమ తండ్రి వెళ్ళిన వైపుకేసి చూస్తూ నిల్చుండి పోయింది. పాపం చేశానని తండ్రి అన్నమాటల్లో ఆమె కేమాత్రం నమ్మకం కలగలేదు. పాపం, నేరం, ప్రాయశ్చిత్తం – యిలాంటి పదాల అర్థాన్ని, ఎవరికి వారు తమ మానసికస్థాయికి అనుగుణంగా అన్వయించుకుంటారు. 'పాపం' అన్న మాటకు తండ్రి నిర్వచనం ఏమిటో తనకు తెలియదు. ఇరవై రెండేళ్ళ వయసుగల యువతిగా తనకున్న జీవితానుభవం, సైకాలజీలో ఎం. ఏ. ఫస్టుక్లాసులో ప్యాసై, కాలేజీలో లెక్చరరుగా ఉద్యోగం చేస్తున్న తన వ్యక్తిత్వం – తండ్రిని అర్థం చేసుకోవటానికి కొరకాకుండా పోయినై.

విజ్ఞానం, సంస్కారం, ఎందునా తొణకని గాంభీర్యతా – యివన్నీ, హేమలోవున్న సుగుణాలు. జీవితంపట్ల ఎంతో నిర్లిప్తత కనబరిచేది. ఆమెకు చెప్పుకోదగ్గ స్నేహితులంటూ ఎవరూ లేరు. మనసిచ్చి యితర్లకు చెప్పుకోవలసిన విషయాలూ, సమస్యలూకూడా ఏవీలేవు. కాలేజీలో అందరికీ ఆమె వ్యక్తిత్వంపట్ల ఆశ్చర్యం, గౌరవంతోపాటు జిజ్ఞాసకూడా కలిగేది. అంతా తండ్రి స్వభావమే అనుకొనేవారు.

ప్రసాదరావు మాత్రం కుమార్తె భవిష్యత్తు ఎలా వుండబోతుందో అని దిగులుపడేవాడు. చంద్రంపట్ల ఆమెకున్న ప్రేమ సంగతి తెలిసిన తరవాత, ఆమె వివాహం పెద్ద చిక్కు సమస్య కావచ్చునని ఆయనకు భయం కలిగింది. కావాలనే తను హేమను యితర ఆడపిల్లలకు భిన్నంగా పెంచాడు. తన ఆదర్శాలకు అనుకూలంగా ఆమె వ్యక్తిత్వాన్ని మలిచేందుకు ప్రయత్నించాడు.

అందర్లాగే తనూ తన కూతురిని పెంచి వున్నట్టయితే, ఆమె కాలేజి చదువప్పుడో, అది ముగిసిన తరవాతో, అందుబాటులో వున్న ఏ అబ్బాయినో చూసి, ప్రేమించి వివాహం ఆడివుండేది. స్త్రీలో జిజ్ఞాస పెరిగినకొద్దీ ఆమె జీవిత సుఖాలపట్ల నిర్లిప్తంగా వుంటుందని ప్రసాదరావు గట్టిగా నమ్మాడు. కాని, హేమ యీ రోజున అందరు యువతుల్లానే ప్రవర్తిస్తున్నది. చంద్రం తిరిగి రాకపోతే, తనకు జీవితం శూన్యం అన్న ధోరణి కనబరుస్తున్నది. అతడి ప్రసక్తిరాగానే, ముఖంలోని గాంభీర్యత అంతాపోయి, ఏవో సిగ్గుతెరలు కమ్మినట్టు ముఖం దించేసుకొంటున్నది.

"ఇదీ ఒక విధంగా మంచిదే! దాని భవిష్యత్తు అదే నిర్ణయించుకోవటంకన్న కావలసిందేముంది?" అనుకొంటూ తల మీంచి పెద్ద భారం దిగినవాడిలా, ప్రసాదరావు దిండులో తలదూర్చి కళ్ళు మూసుకున్నాడు.

హేమ తాను సాహిత్య అకాడమీవాళ్ళకూ, పత్రికవాళ్ళకూ రాసిన వుత్తరాలు ముందు పెట్టుకొని, ఆలోచనా ప్రవాహంలో కొట్టుకుపోసాగింది. చంద్రమోహన్ చంద్రం కాకపోతే, తన భవిష్యత్తు ఎలా వుంటుంది? చిన్నప్పటి ఫోటోల ఆధారంతో, తాను ఆ రెండు పేర్లూ ఒక్కరివే అన్న దృఢనిశ్చయానికి రావటం అంత మంచిది కాదేమో! జీవితంలో తిరిగి చంద్రాన్ని చూడగలనని తాను ఎన్నడూ ఊహించలేదు. చిన్నప్పటి చంద్రం రూపం, తన హృదయంలో శాశ్వతంగా నిలిచిపోయింది. తాను పెరిగి పెద్దవుతున్నకొద్దీ, ఆ రూపం తన అభిరుచులకు అనుకూలంగా మార్పులు చెందుతూ

వస్తున్నది. నిత్యం ఆ రూపాన్ని తను ఆరాధిస్తూనే వున్నది. తన హృదయంలోని ఆ స్థానాన్ని మరెవరూ ఆక్రమించలేరన్న నమ్మకంతో, తను యావజ్జీవితమూ ఒంటరి బతుకు గడపటానికే నిశ్చయించుకొన్నది.

కాని, యీనాడు తనలో కొత్త ఆశలు చిగురిస్తున్నవి. ఆ ఫోటో చంద్రానిదే! అతడు తిరిగి వస్తాడు! చంద్రం యిన్నేళ్ల తరవాత తననింకా మరిచిపోకుండా జ్ఞాపకం వుంచుకొని వుంటాడా? ఆ రోజున చంద్రం తనను ఎంత బతిమాలినా, కట్లు విప్పలేదు. తన క్రౌర్యానికి చంద్రం తననెంత అసహ్యించుకొని వుంటాడు? కట్లిప్పటంద్వారా, తన హృదయ మార్దవాన్ని కనబరిచి, అలగాపిల్ల చంద్రం హృదయంలో ఒక స్థానం ఏర్పరచుకొన్నదేమో! ఒకవేళ, వాళ్లిద్దరూ కలిసే పారిపోయారేమో! ఊహుం- అలా ఎన్నటికీ జరగదు. కానీ.... ఈసరికే చంద్రం మరెవరినైనా వివాహం చేసుకొని వుంటే!

ఈ భావం మనసులోకి రాగానే, హేమ నిలువెల్లా కంపించిపోతూ, యిక ఆలోచించలేక, పుస్తకాల బీరువా దగ్గిరకు వెళ్ళి, ఓ పుస్తకం తీసి ఓ క్షణకాలం దానికేసి చూసి కిందికి జారవిడిచి, తిరిగివచ్చి కుర్చీలో కూర్చున్నది.

ఆ తరవాత హేమ ఎక్కువ ఆలోచించకుండానే, ఒక దృఢనిశ్చయానికి వచ్చింది. ఏది ఏమైనా చంద్రాన్ని గురించి తెలుసుకోకుండా వూరుకోవటమే మంచిది! ఒకవేళ తానింకా అతడికి గుర్తుంటే అతడికై అతడే తనకోసం తిరిగివస్తాడు. అలా కానప్పుడు తను అతడికోసం బాధపడటం వృథా....

హేమ తానంతకుముందు రాసిన రెండు వుత్తరాలను చింపి, కిటికీలోంచి వీధిలోకి విసిరివేసింది. ఒక వారంరోజులాగి, తండ్రికి ఆ వుత్తరాలకు జవాబు రాలేదని చెప్పేందుకు నిశ్చయించుకున్నది.

# 9

మద్రాస్ మెయిల్ అరవయి మైళ్ళ వేగంతో పరుగెడుతూంది. మొదటి తరగతి పెట్టెలో ప్రయాణం చేస్తున్న చంద్రం బుర్రలో ఆలోచనలు అంతకన్నా వేగంగా పరుగెడుతున్నాయి. అతని కళ్ళు యాంత్రికంగా చేతిలోవున్న దినపత్రిక మీదకు మరలాయి.

దినపత్రిక చివరిపేజీలోని ఫోటోమీద అతని కళ్ళు ఓ క్షణకాలం నిలిచాయి. కింద రాసిన అక్షరాలను పదేపదే చదువుకున్నాడు.

"చంద్రమోహన్ 'సాహిత్యమూ - సాంస్కృతిక విలువలూ' అనే గ్రంథానికి సాహిత్య అకాడమీ ద్వారా 5,000 రూపాయలు బహుమతి లభించింది. ఒక సుప్రసిద్ధ ప్రకాశన సంస్థ ఆ గ్రంథానికి రాయల్టీగా పది వేల రూపాయలు ఇచ్చి ప్రచురణ హక్కులను పొందింది."

ఇది చదువుకొన్న అతని కళ్ళు ఆనందంతో, ఏదో సాధించానన్న సంతృప్తితో మెరిసిపోతున్నాయి. హృదయంలోని ఉత్సాహం ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్నది.

ఎనిమిది సంవత్సరాలనాడు తిరస్కారాన్నీ, అవమానాన్నీ, అపవాదునూ నెత్తికెత్తుకొని ఇల్లు విడిచి ఊరు విడిచి వెళ్ళిపోయిన పదిహేను సంవత్సరాల అర్భకుడు, చంద్రశేఖరే చంద్రమోహనై, ఈనాడు సంపూర్ణ వ్యక్తిత్వాన్ని సంతరించుకొని, విజ్ఞాన విద్వత్తులను ఆర్జించి, చూసేవారిని నిముషంలో ఇట్టే ఆకర్షించగల వ్యక్తిత్వంతో తిరిగి తను పుట్టిపెరిగిన గడ్డమీదకు వస్తున్నాడు.

నా అనేవాళ్ళు తనకు ఎలాంటి సహాయం చెయ్యకపోయినా తను స్వయంకృషితో ఇంతవాడయాడు. భారతదేశంలో రచయితలుగా జీవిస్తూ మొదటి తరగతి పెట్టెలో ప్రయాణం చెయ్యగలవారు ఎందరుంటారు? కాని ఈనాడు తను కావాలనే ఓ కొత్త అనుభవంకోసం మొదటి తరగతిలో ప్రయాణం చేస్తున్నాడు. ఆలోచిస్తూనే చంద్రం సిగరెట్టు వెలిగించాడు. కిటికీనుంచి బయటకు చూశాడు.

చిక్కని తెల్లని వెన్నెల పాముకుబుసంలా ఆకాశం నుంచి కొండశిఖరాల మీదగా పాకుతూ, చెట్లకొమ్మల సందుల్లో నుంచి జారుతూ నేలంతా తెల్లని దుప్పటిలా పరచుకుంటూ ఉన్నది. వనస్పతులు తలలు వంచి నిద్రిస్తున్నాయి. సృష్టిలో వెతికినకొద్దీ సౌందర్యం కనిపిస్తోందనీ, సౌందర్యమే సృష్టికి సింగారమనీ మొదటిసారిగా అనిపించింది చంద్రానికి. ఇంతకు ముందుకూడా తను ఎన్నో వెన్నెల రాత్రులను చూశాడు. కాని ఇంత అందాన్ని ఎన్నడూ చూడలేదు. ఈ అందం, ఈ వెన్నెలా, తనలో ఎన్నడూ కలగని ఓ విచిత్రమైన అనుభూతిని కలిగిస్తున్నాయి. కారణం? మానవునికి అతని మానసిక పరిస్థితికి అనుకూలంగా ప్రకృతి కనిపిస్తుందేమో?

ఆలోచిస్తున్న చంద్రశేఖర్‌కు రైలు ముందుకు పరుగెడుతూంటే సమస్త సృష్టి వెనక్కు పరిగెడుతున్నట్లనిపించింది. అతని ఆలోచనలు కూడా దాదాపు ఎనిమిది సంవత్సరాల వెనక్కు పరుగెత్తసాగాయి.

అనాడు కూడా సరిగ్గా ఇదే మెయిలులో - కాని ఎదురు దిక్కుగా ప్రయాణం చేస్తున్నాడు. ఆనాటి తన జీవితానికి, ఈనాటి తన జీవితానికీ ఉన్న వైవిధ్యమే ఆనాటి తన ప్రయాణానికీ, ఈనాటి తన ప్రయాణానికీ ఉంది. ఆనాడు దొంగతనం చేశాడనే అపవాదును నెత్తికెత్తుకొని ఇంటినుంచి పారిపోయిన పదిహేను సంవత్సరాల బాలుడు, వచ్చీరాని వయస్సు, తెలిసీ తెలియని జ్ఞానం, అర్థం అయీ కాని ప్రపంచం, అటు చిన్నవాడూ కాదు, ఇటు పెద్దవాడూ కాదు, ఆ వయస్సులో లోకంనుంచి పసిపిల్లలకు లభించే ప్రేమా, జాలీ లభించవు సరిగదా - అటు పెద్దవారికి లభించే గౌరవమూ లభించదు. ఇంటినుంచి దొంగగా పారిపోయిన బాలుడు లోకం దృష్టిలో ఏమయినా కావచ్చును; లేక అసలు ఏమీ కాకపోవచ్చు.

ఆనాడు తను మూడవ తరగతి పెట్టెలో చాలీచాలని చోటులో, కిటికీకి దగ్గరగా చలికి ముడుచుకొని, మోకాళ్ళమీద గడ్డం ఆనించి కూర్చొని వున్నాడు. తను ఒంటరిగా ఆ వయస్సులో అలా ప్రయాణం చెయ్యటం పెట్టెలోని చాలామందిలో కుతూహలాన్ని రేకెత్తించినమాట నిజమే. తన నుంచి ఎలాంటి సమాధానం రాకపోవటం చూసి మళ్ళీ ఎవరిగొడవల్లో వాళ్ళు పడిపోయారు. తన దగ్గరకు వచ్చి ప్రేమగా ఆప్యాయంగా పలకరించినవాళ్ళు లేరు. బహుశా తనను ఏదో గాలిరకం అనుకొని వుంటారు.

హృదయంలో భయం, బాధ, కళ్ళలో కన్నీటి మేఘాలు, బయట కన్ను పొడుచుకున్నా కనిపించని కారుచీకటి తన భవిష్యత్తులాగే ఉంది. ముఖంమీద పడుతున్న వానజల్లుతో తన కన్నీరు కలసి ప్రవహిస్తూ ఉంది. ఇప్పుడు అదంతా తనకు ఒక పీడకలలా జ్ఞాపకం ఉంది.

కాని ఈనాడు, తను ఇంత కావటానికి ఎవరు కారణం? ప్రకాశం తండ్రి, ప్రకాశం వాళ్ళ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేడు. ప్రకాశం తండ్రి ఆ ఆరువందలూ యివ్వకపోతే, తను గురుకుల్‌కు వెళ్ళకపోతే ఏమయి ఉండేవాడు? క్రమంగా ఏ జేబులు కొట్టే దొంగగానో మారివుండేవాడు. సంఘటనల చక్రంలో పడి నిరంతరం నలిగిపోయే మానవ జీవితం ఎప్పుడు ఏ రూపాన్ని ధరిస్తుందో ఎవరూ చెప్పలేరు. మానవుడు సన్మార్గుడు కావటానికి కారణాలూ, పరిస్థితులూ పక్కపక్కనే పోటీపడి నడుస్తూ ఉంటాయేమో?

తను ముందు ప్రకాశం ఇంటికే వెళ్ళాలి. అంతకంటే తనకు ఆప్తులు ఎవరున్నారు కాబట్టి? ఇప్పుడు తనదగ్గర పదివేలరూపాయల చెక్కు ఉంది. దాన్ని అలాగే ప్రకాశం తండ్రికి కృతజ్ఞతతో సమర్పించుకుంటాడు. ఆనాడు వాళ్ళు తనకు చూపెట్టిన ఆదరణముందు ఈ పదివేలు ఎంత? ప్రకాశం ఏం చేస్తున్నాడో? చదువుకొని ఏదైనా ఉద్యోగంలో ఉండివుంటాడు. తను గుంటూరులో ఉన్నంతకాలం, తన భవిష్యత్ కార్యక్రమాన్ని నిర్ణయించుకొనేంతవరకూ తను ప్రకాశంతోనే వుంటాడు.

జీవితంలో కొందరు వ్యక్తులు చేసిన సహాయం జీవితాంతం ఋణం తీర్చుకోలేనిదిగా మిగిలిపోతుంది. తను ఏం చేసినా వాళ్ళ ఋణం తీరదు.

తన భవిష్యత్తును తీర్చిదిద్దవలసిన బాధ్యత ఉన్నవాళ్ళు తమ బాధ్యతను నిర్వహించలేకపోయారు. తను పారిపోతే అన్నయ్య తనను వెతికించటానికి ఏం ప్రయత్నం చేశాడు? ఎందుకు ప్రయత్నిస్తాడు? తను వెళ్ళిపోతే ఆస్తిని భాగించవలసిన పని వుండదు. మానవుడు డబ్బు తన కోసం అనే విషయాన్ని మర్చిపోయి తనే డబ్బుకోసం జీవిస్తున్నట్లనుకుంటాడు. మళ్ళీ ప్రతి ఒక్కరూ డబ్బును గురించి పెద్దవాళ్ళు అనుభవంతో చెప్పిన నీతి కథలను విన్నవారే. ప్రతినిత్యం జీవితమే డబ్బుగా భావించి, కాపీనంతో ఎన్నో పాపాలుచేసి డబ్బు కూడబెట్టి, ఠపీమని ఏ జబ్బూ లేకుండా చచ్చేవాళ్ళను కళ్ళముందు చూస్తూనే ఉంటారు. సికిందరు చనిపోయేప్పుడు చెప్పాడట; తన రెండు చేతులూ శవపేటిక నుంచి బయటకు అందరికీ కనిపించేలా పెట్టమని. అంటే – విశ్వాన్ని జయించిన తను కూడా చివరకు వట్టిచేతులతోనే వెళుతున్నానని ప్రపంచానికి చెప్పాలని అతని ఆశయం. కాని ఆ జ్ఞానోదయం అతనికి ఎప్పుడు కలిగింది? చివరి నిముషంలో, బహుశా దాన్నే శ్మశాన వైరాగ్యం అంటారేమో?

డబ్బు లేనివాడికి ఇతరులకు ఇవ్వటంలో, ఉన్నవాడికి వీలయినంతవరకు ఇతరులనుండి గుంజుకోవటంలోనే ఆనందం కలుగుతుందేమో! ప్రకాశం కుటుంబానికి ఎలా ఇవ్వటమో తెలిస్తే, తన కుటుంబానికి ఎలా తీసుకోవటమో తెలుసు. మనిషికీ – మనిషికీ ఉండే సున్నితమైన సంబంధాన్ని డబ్బు వ్యామోహం తెంచివేస్తుందేమో! ఈనాడు తను జన్మభూమికి తిరిగి వస్తున్న కారణాలు రెండు: ఒకటి ప్రకాశంనూ, అతని

తండ్రీని చూసి తన కృతజ్ఞతను తెలుపుకోవటం. రెండు హేమా ప్రసాదరావు గారల ముందు తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవటం.

హేమ ఎలా ఉందో! బాగా చదివి, పెద్ద పెద్ద డిగ్రీలు పొంది వుంటుంది. చాలా హుందాగా, గంభీరంగా ఉంటుందేమో! మంచి హోదాలో ఉన్న యువకుణ్ణి వివాహం చేసుకొని ఉంటుంది. ఆమె భర్త ఎలా వుంటాడో?

చంద్రం హృదయాంతరాళాలలో ఎక్కడో అశాంతి పొర్లినట్లనిపించింది. హేమకు వివాహం అయివుంటుందా? అది జరగటానికి వీల్లేదు. అలా ఎన్నటికీ జరిగివుండదు. పదిహేను సంవత్సరాల బాలుడికంటే పధ్నాలుగు సంవత్సరాల బాలిక మానసికంగా ఎంతో పెద్దదిగా పెరుగుతుంది. తన వయస్సుతోపాటే తనకు తెలియకుండానే, తనలోని ప్రతి జీవాణువుతోపాటు హేమమెడల ప్రేమకూడా పెరిగింది తనలో. మరి హేమా? ఆమె తనను ఎంతో గౌరవించి అభిమానించేది. అలాటి తను కంటికి దూరం కాగానే ఆమె హృదయంకూడా దూరం అయివుండాలా? అలా ఎన్నటికీ జరగదు. ముఖ్యంగా – స్త్రీ జీవితంలో ఒక్కసారే ప్రేమించగలదు. హేమ అవివాహితగానే ఉండి ఉంటుంది.

అంతలోనే చంద్రంలో భావుకత్వం స్థానాన్ని, వివేకం ఆక్రమించుకుంది. తనెంత స్వార్థంగా తెలివితక్కువగా ఆలోచిస్తున్నాడు? దొంగగా ఇల్లు విడిచి పారిపోయి, ఎనిమిది సంవత్సరాలుగా జాడలు తెలియని తన కోసం హేమ అవివాహితగా ఉండి ఉంటుందని ఊహించుకొని ఆనందిస్తున్నాడు. ఆమె అవివాహితగానే ఉండాలని కోరుకుంటున్నాడు.

మానవుడు ఎంత కృత్రిమంగా బతకటానికి ప్రయత్నిస్తున్నాడు? వస్తువులకు రంగులువేసి, సత్యానికి ముసుగు కప్పి, తనకు కావాల్సిన రూపంలో చూట్టానికి ప్రయత్నిస్తూ తనను తానే మోసం చేసుకొంటున్నాడేమో? వస్తువులను వాటి అసలు రూపంలో చూట్టానికి, సత్యాలను నగ్నంగా చూట్టానికి మానవుడు భయపడటానికి కారణం ఏమిటో?

ఆలోచిస్తున్న చంద్రం కళ్ళు అప్రయత్నంగానే వినీలాకాశంలో మేఘాలచాటున దోబూచులాడుతూ రైలుతోపాటు తనూ పయనిస్తున్నట్లున్న పూర్ణచంద్రునిమీద పడ్డాయి. పరిపూర్ణుడై తన సుధాంశువులతో సమస్త ప్రకృతినీ ఆనంద డోలికలలో ఓలలాడిస్తోన్న ఈ చంద్రుడు రేపటినుంచీ క్షీణించడం మొదలుపెడతాడు. దేనికోసం – ఎవరికోసం? చంద్రం కళ్ళు వెన్నెల వెండితొడుగు తొడుగుకున్నట్లున్న కొండలవైపూ, అక్కడనుంచి చెట్లవైపూ వాలాయి. సృష్టిలోని సమస్త వస్తువులూ నగ్నంగానే ఉంటాయి. మానవుణ్ణి మినహాయించి ప్రతి ప్రాణీ నగ్నంగా, సహజంగానే జీవిస్తుంది.

రాతియుగంలోని మానవుడు కూడా నగ్నంగా ఉండేవాడనీ, సహజంగా జీవించేవాడనీ తను చదివాడు. నగ్నంగా జీవించిన మానవుడిలో పాపపుణ్యాల భావం ఉండేదికాదట! మహర్షులు నగ్నంగా ఉండటానికి కారణం అదేనేమో?

మానవుడిలో స్వార్థం, కృత్రిమత్వం తలలెత్తాయి. శరీరంమీది ఆచ్ఛాదనలతోపాటు, క్రమంగా తన ఆత్మను కూడా తననుంచే దాచటానికి ప్రయత్నించసాగాడు. పాప పుణ్యాలకు నిర్వచనాలు ఏర్పడ్డాయి. పాపాలను దాచటానికి అనేక కృత్రిమ ఆచ్ఛాదనలను సృష్టించుకొంటున్నాడు. ఈనాటి మానవుడు నగ్నసత్యాలంటే భయపడటానికి కారణం

ఇదేనేమో? తన జీవితంతోపాటు పెనవేసుకొని వేలసంవత్సరాలుగా వస్తున్న ఈ కృత్రిమ ముసుగుల్ని మానవుడు తొలగించుకొని ఏనాటికైనా బయటపడగలడా? ఏమో, అది సంభవం కాకపోవచ్చును!

ఏమిటి – ఈ రోజు తనలో చాలా విచిత్రమయిన ఆలోచనలు రేగుతున్నాయి? ఆలోచనలనుంచి బయటపడ్డానికి ప్రయత్నించిన చంద్రానికి రజని జ్ఞాపకం వచ్చింది.

రజని ఎలా ఉందో ఇప్పుడు? రజని అచ్చు తన పోలికే అనేవారు అందరు. ఈ మాట ఎవరైనా అన్నప్పుడు వదిన ముఖంలో మారే రంగులు చూడాల్సిందే! వదినకు ఎందుకో తనమీద అంతకోపం? డబ్బుమీదగల వ్యామోహమే అందుకు కారణం కావచ్చు. ఆస్తికి వారసుడు తన భర్తతోపాటు ఇంకోడు ఉండటం ఆమెకు ఇష్టం ఉండిఉండదు. తనకు ఆస్తిలో చిల్లిగవ్వకూడా అక్కరలేదని చెప్పేయదలచుకొన్నాడు. తనమీద మోపిన దొంగతనం తాలూకు – ఆ వెయ్యి రూపాయలూ అన్న ముఖంమీద కొట్టదలచు కొన్నాడు.

ఆలోచనా స్రవంతిలో కొట్టుకుపోతున్న చంద్రం, మెయిల్ బెజవాడ స్టేషన్ చేరుకొన్నది కూడా గమనించలేదు. పెట్టెలోవాళ్ళ కేకలకు ఉలిక్కిపడి లేచి నిల్చున్నాడు. గుంటూరు బండి కదలటానికి సిద్ధంగా ఉంది. త్వరగా కూలీని పిలిచి సామాను పట్టించుకొని బండి ఎక్కాడు. మెయిల్ మూడుగంటలు ఆలస్యమైనా అదృష్టవశాత్తూ గుంటూరు బండి అందింది. అదే చాలనుకున్నాడు. బండి గుంటూరు చేరుకొనేసరికి మూడున్నర అయింది.

ఇంతలో చీకటిలో ప్రకాశం ఇంటికి వెళ్ళటంకంటే తెల్లవారేంతవరకూ వెయిటింగ్ రూములో గడపటం మంచిదనుకున్నాడు. సామాను మొదటి తరగతి వెయిటింగ్ రూమ్‌లో పెట్టించి, కూలీకి డబ్బులిచ్చి పంపించేశాడు. కళ్ళు మూసుకొని ఈజీఛైర్‌లో పడుకున్న చంద్రాన్ని మళ్ళీ ఆలోచనలు ముసురుకున్నాయి.

ఒక అర్థగంట ఎలాగో గడిపాడు. వెయిటింగ్ రూమ్‌లోని గడియారం నాలుగు గంటలు కొట్టింది. గుంటూరులో, ముఖ్యంగా స్టేషన్ దగ్గరలో ఉన్న హోటళ్ళు నాలుగింటికే తెరుస్తారని తెలుసు చంద్రానికి. కొంచెం కాఫీ తాగి వచ్చి చిన్నగా ప్రకాశం ఇంటికి బయలుదేరవచ్చు ననుకున్నాడు.

చంద్రం లేచి బాత్‌రూమ్‌లోకి వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చాడు. పెట్టే, బెడ్డింగ్ క్లోక్ రూములో పెట్టించి, కాఫీ తాగటానికి స్టేషన్ బయటకు నడిచాడు.

ఈ ఎనిమిది సంవత్సరాలలో గుంటూరు ఎంతో మారిపోయినట్లనిపించింది చంద్రానికి. చల్లనిగాలి వీస్తూంది. ఇంత కాలానికి తన పుట్టిన గడ్డపై కాలు పెట్టాడు. అతనిలో ఏదో చిత్రమయిన అనుభూతి కలుగుతోంది. హోటల్లో కాఫీ తాగి బయటకు వచ్చిన చంద్రానికి చల్లగాలికి అలా కొంచెం తిరగాలనిపించింది. పట్టణంలో వచ్చిన మార్పును గమనిస్తూ ముందుకు నడుస్తున్నాడు. దూరంగా కనిపించే ఎత్తయిన పొగ గొట్టాలు చూసి పారిశ్రామికంగా పట్టణం చాలా అభివృద్ధి చెందింది అనుకున్నాడు.

అలా బజార్లన్నీ కలియజూస్తూ ముందుకు నడుస్తున్న చంద్రం ఒక మలుపు తిరిగాడు. అక్కడ పెద్ద భవనం, దానిచుట్టూ ప్రహరీ గోడ కనిపించాయి. అంతకు

ముందు ఆ భవనం అక్కడ లేదు. కుతూహలంతో ఆ భవనాన్ని గమనిస్తూ నడుస్తున్న చంద్రం చటుక్కున ఆగిపోయాడు ప్రహరీగోడ ప్రక్కనే ఏదో పెద్ద మోత వినిపించింది. ఉలిక్కిపడి నిలబడి పోయిన చంద్రానికి గోడమీద ఏదో నీడ కనిపించిది. తెల్ల దుస్తులలో ఉన్న ఒక మానవాకారం ముందు దేన్నో పడేసి తర్వాత తను కిందకు దూకడానికి ప్రయత్నిస్తున్నది. ఆ అకారం స్త్రీ రూపమని లీలగా గ్రహించిన చంద్రం గుండె దడదడలాడింది. దెయ్యాలంటే చిన్నతనంలో తను భలే భయపడేవాడు. కాని ఇప్పుడు తనకు దయ్యాలున్నాయనే నమ్మకం లేదు. ధైర్యం కూడదీసుకొని ఒక అడుగు ముందుకు వేశాడో లేదో – గోడమీద ఆకారం కిందకు దూకటం, అంతకు ముందే పడేసిన వస్తువుని చేత్తో తీసుకొని పరిగెత్తటం కనిపించింది. చంద్రం కూడా అప్రయత్నంగా ఆ ఆకారం వెనక పరిగెత్తాడు.

సందు గొందులు తిరిగి ఆ ఆకారం అకస్మాత్తుగా మాయం అయింది. చంద్రం ఆశ్చర్యంగా పది నిముషాలు అటూ ఇటూ చూసి, ఇక లాభంలేదని ముందుకు నడిచాడు. ఆ భవనం ఎవరిదో, ఆ పారిపోయిన వాళ్ళెవరో తెలుసుకోవాలని కుతూహలం కలిగింది అతనికి. ఒక స్త్రీ ఆ విధంగా గోడదూకి పారిపోవటం ఏమిటో – ఎంత ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేకపోయాడు అతడు.

ఆ పెద్ద భవనం గేటు ముందుకొచ్చి నిలిచాడు చంద్రం. గూర్ఖావాడు గోడకానుకొని నిద్రపోతున్నాడు. చంద్రం భుజం పట్టుకుని గూర్ఖావాణ్ణి ఊపాడు. వాడు ఉలిక్కిపడి బిల్లంగోడులా ఎగిరి నిల్చున్నాడు. కొంచెం తమాయించుకొని ముఖం చిట్లించుకుంటూ చంద్రం ముఖంలోకి 'ఏం కావాలి?' అన్నట్లు చూశాడు.

"ఈ ఇల్లెవరిది?"

చంద్రం ప్రశ్నకు గూర్ఖావాడు ఫక్కున నవ్వాడు. గేటుకు కుడిపక్క గోడకు తగిలించి ఉన్న సైనుబోర్డువైపుకు చెయ్యి చూపించాడు.

'అనాథ శరణాలయం' అన్న బోర్డు చూడగానే చంద్రానికి అంతా అర్థం అయింది.

"ఒక అమ్మాయి యిప్పుడే గోడదూకి పారిపోయింది."

గూర్ఖా చంద్రం ఊహించినట్లు ఏమీ గాబరాపడలేదు కొంచెంకూడా చలించలేదు.

"ఎప్పుడూ ఎవరో ఒకరు పారిపోతూనే ఉంటారు. అదేం కొత్త కాదు," అంటూ గూర్ఖా మళ్ళీ యథాస్థానంలోకి వెళ్ళి కూర్చున్నాడు. నిద్ర పాడుచేసినందుకు చంద్రాన్ని లోలోపలే శపిస్తున్నట్లనిపించింది వాడి వాలకం చూస్తుంటే.

ఎప్పుడూ ఎవరో ఒహరు పారిపోతూనే వుంటే ఇంత పెద్ద ప్రహరీ, గేటుముందు ఈ గూర్ఖావాడూ ఎందుకో? అని గొణుక్కుంటూ ముందుకు నడిచాడు చంద్రం.

అనాథ శరణాలయంలో అనాథలయితే ఉంటున్నారు కాని శరణం అనేదే లేదు. శరణాలయాలు స్థాపించటం, సోషల్ వర్కర్సుగా పేరు ప్రతిష్టలు సంపాయించుకోవటం, అంతా ఓ కొత్త జీవనోపాధికి మార్గాలు మాత్రమేనా? ఈ శరణాలయాల్లో ఆదరణా, ప్రేమా, లభిస్తూవుంటే అనాథలు యిలా ఎందుకు పారిపోతారు? మానవునికి కావలసింది కేవలం కడుపుకింత అన్నమేకాదు. శరీరాన్ని పెంచటానికి ఆహారం ఎంత అవసరమో, మానసికాభివృద్ధికి ప్రేమ, ఆదరణలుకూడ అంతే అవసరం. శారీరక పుష్టితోపాటు

మానసిక పుష్టికూడా కావాలి మానవునికి. బహుశా దీనివల్లనే మానవుడు మిగతా ప్రాణులకంటే శ్రేష్ఠుడేమో!

# 10

అనాధ శరణాలయాలను గురించి పరిపరి విధాలుగా ఆలోచిస్తూ చంద్రం మెయిన్ రోడ్డు ప్రక్కనే నడుస్తున్నాడు. గుంటూరు పొగాకు వ్యాపారానికి ఘనత వహించింది. ఎన్నో కొత్త పొగాకు బేరన్లూ, గోడౌన్లూ, కంపెనీలూ ఏర్పడ్డాయి. వాటిని గమనిస్తూ హుషారుగా ముందుకుసాగాడు చంద్రం.

గోడదూకి పారిపోతున్న స్త్రీ తన వెనక ఎవరో పరిగెత్తుతున్నట్లు గమనించి సందు గొందులు తిరిగి మెయిన్ రోడ్డు పక్కగా వున్న ఒక పొగాకు బేరన్‌లోకి జొరబడి ఒక మూలగా నక్కి నిలబడిన ఆమెను ఎవరిదో బలమైన మొరటుచెయ్యి పట్టుకుంది. ఆమె భయంతో బిగుసుకొని పోయింది. నోట మాట పెగలటంలేదు. ఆమెను ఆ బలమైన చెయ్యి వెలుతురు ముందుకు లాక్కొచ్చింది.

భయంతో వణుకుతూ మొగ్గలా తనలో తానే ముడుచుకుపోతున్న ఆమెను "ఎవరు నువ్వు?" అని గర్జించింది మొగవాడి గొంతు.

ఆ గొంతు విని ఆ అమ్మాయి ఆశ్చర్యంగా అతడి ముఖంలోకి చూసింది – అంతవరకూ భయంతో పాలిపోయిన ముఖంలోకి జీవం వచ్చినట్టయింది.

"నాగూ! నాగేంద్రం! నువ్వా! నన్ను గుర్తుపట్టలా! నేనే – నేనే! గౌరిని! గౌరినే!" అంది ఆ అమ్మాయి ఉబికివస్తున్న సంతోషంతో.

"అరె గౌరీ, నువ్వా! ఇంతకాలం ఎక్కడున్నావు? ఆ ఆదెమ్మ ముండ నిన్ను నా నుంచి దూరం చెయ్యటానికే నిన్ను తీసుకెళ్ళి ఎక్కడో దాచేసింది. చివరకు నేను నీరుపోస్తే కాసిన పండు నాకే దక్కిందిలే!" అన్నాడు నాగేంద్రం గౌరిని బలంగా దగ్గిరకు లాక్కుంటూ.

"నాకు ఆకలేస్తోంది; నిన్నంతా పస్తు, ఏమన్నా ఉంటే పెట్టు," అంది గౌరి అమాయకంగా, నాగేంద్రం మాటల్లో అంతరార్థం తెలుసుకోలేక. అతని చేతులనుంచి తప్పించుకోవటానికి ప్రయత్నించింది.

"మరి నా ఆకలి సంగతో?" అంటూ గౌరిని నాగేంద్రం బలాత్కారంగా దగ్గిరకు లాక్కున్నాడు.

గౌరి బలంగా నాగేంద్రాన్ని వెనక్కు తోస్తూ "నువ్వు మంచోడివి కాదు. నన్ను వదులు," అంటూ పెనుగులాడింది. నాగేంద్రం కౌగిలినుంచి విడిపించుకొని పరుగెత్తబోయిన గౌరిని జడపట్టుకొని వెనక్కు లాగాడు నాగేంద్రం.

"ఎక్కడికి పోతావే? నా మాట విను. నన్ను పెళ్ళి చేసుకో. నీ కోసమే ఇంతకాలంగా ఎదురు చూస్తున్నాను," అంటూ మళ్ళీ గౌరిని గట్టిగా రెండు చేతులలో బిగించాడు.

"ఛీ! నన్ను వదులు" అంటూ చెయ్యి కొరికింది.

నాగేంద్రం కోపం బుసలుకొట్టింది. గౌరిని బలంకొద్దీ పట్టుకున్నాడు. గౌరి పెనుగులాడలేక గట్టిగా అరవటం మొదలు పెట్టింది.

"నోరు ముయ్! అరిచావంటే పీక నొక్కుతాను. పైగా నీ అరుపులు విని వచ్చే మగాడు ఎవడూ లేడు ఇక్కడ; జాగ్రత్త!"

గౌరి ఆర్తనాదం ఆ రోడ్డునే ఆలోచిస్తూ నడుస్తున్న చంద్రానికి వినిపించింది. వెంటనే చంద్రం అరుపులు వినిపిస్తున్నవైపు నడిచి బేరన్‌లోకి జొరబడ్డాడు.

కళ్ళముందున్న అమానుషకృత్యం చూచిన చంద్రంలో పౌరుషం ప్రజ్వరిల్లింది. ఒక్క దూకులో వెళ్ళి నాగేంద్రం జుట్టు లంకించుకొని దూరంగా లాగాడు. గౌరిని విడిచి నాగేంద్రం చంద్రంతో కలియబడ్డాడు.

నాగేంద్రం దాదాపు నలభయ్యో వడిలో పడ్డాడు. చంద్రం యువకుడు. చంద్రం నాగేంద్రాన్ని గోడకు నొక్కిపట్టి ముఖంలోకి చూశాడు. నాగేంద్రాన్ని వదిలేశాడు.

"ఎవరు నువ్వు?" గర్జించాడు నాగేంద్రం.

"నన్ను గుర్తుపట్టలేదా? చంద్రాన్ని - కృష్ణారావు తమ్ముడ్ని."

నాగేంద్రం ముఖంలో కోపం స్థానాన్ని భయం ఆక్రమించుకున్నది. ఆశ్చర్యంకూడా కలిగింది.

"చిన్నబాబుగారూ! మీరా? ఎప్పుడొచ్చారు? ఇది నా వుప్పు తిని పెరిగినపిల్ల. ఈ విషయంలో కలుగజేసుకోకండి" అన్నాడు నాగేంద్రం, మాటలలో మృదుత్వాన్ని తెచ్చిపెట్టుకుంటూ.

"అహఁ - నువు పెంచిన పిల్లా! ఆ పిల్ల ఎక్కడ పెరుగుతున్నదో నాకంతా తెలుసు. ఇకముందు ఇలాంటి పనులు చెయ్యకు, జాగ్రత్త!" అంటూ గౌరికోసం చూశాడు చంద్రం. ఆమె ఎక్కడా కనిపించలేదు. అవకాశం చూసుకొని పారిపోయిందని తెలుసుకున్నాడు. రోడ్డు ఎక్కిన చంద్రం, రోడ్డు మలుపులో నిల్చొని ఎవరికోసమో ఎదురు చూస్తున్న గౌరిని చూశాడు. చంద్రాన్ని చూడగానే ఆమె ముఖం విప్పారింది. గబ గబా చంద్రం దగ్గరకు వచ్చి నిల్చింది.

గౌరిని పరీక్షగా చూశాడు చంద్రం ఆమె అంత ఎత్తూ కాదు, పొట్టీ కాదు, కాయకష్టంతో బొద్దుగా బలంగావున్న శరీరం, నీలం తెల్ల నేత చీరలోంచి కూడా ఆమె శరీర సౌందర్యాన్ని విరజిమ్ముతోంది. చామనఛాయ అయినా ముఖం ఎంతో కళకళలాడుతూ అమాయకంగా కనిపిస్తోంది. పొందికయిన అవయవాలతో తయారుచేసి తిరునాళ్ళలో అమ్మే రంగులు వేసిన మట్టి బొమ్మలా ఉంది అనుకున్నాడు చంద్రం. ఆమెను చూస్తుంటే జాలీ, పారిపోయి ఇలా వచ్చినందుకు అయిష్టం రెండూ కలుగుతున్నాయి చంద్రంలో. వీధిలైటుకింద నిలబడివున్న ఆమె చంద్రం ముఖంలోకి రెప్పవాల్చకుండా చూడటం గమనించాడు. ఆ పెద్ద పెద్ద గుండ్రటి కళ్ళలో ఏదో ఆశ... అమాయకత్వం.... మొండితనం చూస్తున్న చంద్రానికి ఆమెను ఇంతకుముంద ఎక్కడో చూసినట్లనిపించింది.

ఆమె చేతిలో పాతకాలపు చిన్న ట్రంకుపెట్టె ఒకటి ఉంది.

"శరణాలయానికి వెళ్ళు. లేకపోతే చూశావుగా అర్థగంటన్నా కాలేదు బయటకు వచ్చి ఎంత ప్రమాదం జరిగిందో. నీలా వయస్సులో వున్న ఆడపిల్లలు వున్నచోటు వదలి, బయటకు వంటరిగా వెళ్ళిపోకూడదు."

గౌరి జవాబివ్వలేదు. మౌనంగా తల దించేసుకుంది. ఆమెకు తిరిగి ఆ శరణాలయానికి వెళ్ళటం ఇష్టంలేదని గ్రహించాడు చంద్రం. ఎన్నో విధాలుగా ఆమెకు నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు. కానీ ఆమె ఉలకలేదు. పలకలేదు. వెళ్ళనని తలమాత్రం ఒకటి రెండుసార్లు ఆడించింది.

చెప్పి చెప్పి విసుగు పుట్టింది చంద్రానికి. "ఎలాగన్నా చావు - నా కెందుకు?" అంటూ గత్యంతరంలేక ముందుకు సాగాడు చంద్రం.

ఏడు సంవత్సరాలక్రితం తనవాళ్ళంతా చంద్రానికి దొంగతనం అంటగట్టి స్తంభానికి కట్టివేశారు ఆ కట్లు విప్పింది ఓ అపరిచిత బీద బాలిక. అలా ఆమె కట్లు విప్పకపోతే చంద్రం భవిష్యత్తు ఏమయివుండేదో ఊహించటం కష్టమే. 'ఎలాగన్నా చావు నాకెందుకు' అన్న చంద్రానికి ఆ బాలికే ఆ అనాథ అని తెలియదు.

దేశంలో ఎన్నో మార్పులు వచ్చాయి. వస్తున్నాయి. స్వాతంత్ర్యం వచ్చింది. దేశం సర్వతోముఖాభివృద్ధికి వివిధ ప్రణాళికలద్వారా కృషి జరుగుతూంది. కాని సంఘంలో స్త్రీ అంటే దృక్పథంలో ఎలాంటిమార్పూ రాలేదు. వయస్సులోవున్న ఆడపిల్ల తనచుట్టూ తనకోసం ఇతరులు ఏర్పాటుచేసి పెట్టిన అవధులనూ, గోడలనూ దాటి బయటపడి తన అభిరుచికి అనుకూలంగా స్వతంత్రించి బ్రతకాలంటే, గౌరవంగా, క్షేమంగా రెండు గంటలయినా బతకలేదు - ఎందువల్ల? తను ఇల్లు విడిచి పారిపోయాడు. ఆనాటికి తన వయస్సు ఈ అమ్మాయికంటె రెండు సంవత్సరాలు ఎక్కువ ఉండవచ్చు. అదే తను ఆడపిల్ల అయివుండి, ఇంటినుంచి పారిపోయి ఉంటే....

ఆలోచిస్తూ నడుస్తున్న చంద్రానికి ఎవరో తనను వెంబడిస్తున్నట్లు తోచి ఆగి వెనక్కు తిరిగాడు.

ఆ అమ్మాయి ఇంకా తనను వెంబడించడం చూసి ఆశ్చర్యపోయాడు చంద్రం. తను ఆగటంతోనే ఆ అమ్మాయికూడా ఆగి, తలవంచుకొని నిల్చుంది.

"నా వెంబడి ఎందుకొచ్చావ్?" అడిగాడు చంద్రం. జవాబు రాలేదు. వెంటనే ఏదో తోచి పాంటుజేబులో చెయ్యి పెట్టి పదిరూపాయల నోటు తీసి ఆమెకు అందిస్తూ "ఊఁ తీసుకో" అన్నాడు.

ఆ పిల్ల ఒక్కసారి చంద్రం చేతిలోని నోటువైపూ, మరోసారి చంద్రం ముఖంలోకి చూసింది. చేతిలో పెట్టె కింద జారి పడింది. చటుక్కున రెండు చేతుల్లో ముఖం దాచుకొని వెక్కివెక్కి ఏడవసాగింది.

చంద్రం తెల్లబోయాడు. ఆ వయస్సులోవున్న ఆడపిల్ల, ముఖ్యంగా అపరిచిత, పైగా నడిరోడ్డులో ఏడుస్తుంటే, ఏం చెయ్యాలో తోచక తికమకలో పడ్డాడు చంద్రం.

తెల్లగా తెల్లవారింది. ఫ్యాక్టరీల కూతలు వినిపిస్తున్నాయి. కూలీలు గుంపులు గుంపులుగా నడుస్తున్నారు. చంద్రాన్నీ గౌరినీ ఆ విధంగా చూసి అప్పటికే కొందరు వాళ్ళను చుట్టేశారు. ఇది చూసి చంద్రానికి మతిపోయినట్లనిపించింది. పైనించి వస్తున్న

టాక్సీని ఆపాడు చంద్రం. చంద్రం వెనకే గబగబా వెళ్ళి టాక్సీ ఎక్కింది గౌరి. చంద్రం ఏమీ అనలేక చూస్తూ ఊరుకున్నాడు. టాక్సీ ముందుకు సాగింది. వెనకనుంచి కూలీల నవ్వులు వినిపించాయి. చంద్రానికి ఏదోగా అనిపించింది.

టాక్సీ స్టేషన్ వైపుకు వెళుతూంది. పక్కన కూర్చొని వెక్కివెక్కి ఏడుస్తున్న గౌరిని పరీక్షగా చూశాడు చంద్రం.

నవ్వుతున్నప్పుడు అందరు ఆడవాళ్ళూ అందంగా వుండరు. కొందరు నవ్వుతుంటే ఏడుస్తున్నట్లుంటుంది. కొందరు నవ్వుతుంటే పెదవుల చివర్లకు కొక్కేలు తగిలించి రెండు వైపులనుంచీ లాగినట్లు ఉంటుంది. కొందరు నవ్వుతుంటే పై పెదవి పైకి మడతబడి ఎర్రటి చిగుళ్ళు కనిపిస్తాయి. కొందరు నవ్వుతుంటే పై పెదవి పైకీ, కింది పెదవి కిందకీ విరుచుకుని, పైనా కిందా చిగుళ్ళు కనిపిస్తూ, పండి పగిలిన కాబూలీ దానిమ్మ పండులా వుంటుంది ఆ నోరు. కాని ఏడుస్తున్న ప్రతి ఆడదీ అందంగానే వుంటుంది. బహుశా అందుకే ఆడది ఏడుస్తుంటే మగవాడు భరించలేడేమో! చంద్రం తన ఆలోచనకు తానే నవ్వుకున్నాడు.

"ఎందుకు ఏడుస్తావ్? ఏడుపు మానకపోతే టాక్సీనుంచి దింపేస్తాను" అన్నాడు చంద్రం, ఆ అమ్మాయి ఏడుపును మానిపించే ఉద్దేశంతో.

గౌరి ఆ మాట వినగానే ఏడుపును దిగమింగుకోవటానికి ప్రయత్నించసాగింది. కొంగుతో ముఖం తుడుచుకొని తలవంచుకొని కూర్చుంది.

"నీ పేరేమిటి?"

"గౌరి."

చంద్రానికి ఆ పేరు ఎక్కడో విన్నట్లనిపించింది. కాని అంతగా పట్టించుకోలేదు.

స్టేషన్ ముందు టాక్సీ ఆగింది. తన వెనకే దిగుతున్న గౌరిని చూసి "ఇక్కడే వుండు, సామాను పట్టించుకొస్తాను" అన్నాడు చంద్రం నవ్వుముఖంతో.

సామానుతో తిరిగివచ్చిన చంద్రం టాక్సీ డ్రయివర్‌తో కొరిటిపాడు అన్నాడు. డ్రయివర్ అనుమానంగా చంద్రాన్నీ, గౌరిని మార్చి మార్చి చూసి ఏదో అర్థం అయినట్లు నవ్వుకున్నాడు. ఆ నవ్వు చంద్రానికి ఏదోగా అనిపించింది. జుగుప్సతో మనస్సు చికాకయింది.

కొరిటిపాడులో దాదాపు అందరూ బీదవాళ్ళే వుంటారు. తన వేష భాషలు చూసీ, గౌరి వేషం చూసీ డ్రయివర్‌కు ఏదో అనుమానం కలిగినట్లుంది. ఆ ఆలోచన చంద్రానికి అసహ్యం కలిగింది. పక్కన కూర్చొనివున్న గౌరిమీద చిర్రెత్తుకొచ్చింది. వీలయినంత త్వరలో వదుల్చుకోవాలని అనుకున్నాడు.

టాక్సీ కొరిటిపాడు చేరింది. నగరంలో వింతమార్పు వచ్చినా ఆ బస్తీ మాత్రం చంద్రం చూసినది చూసినట్లే ఉంది. కాకపోతే కొంచెం శుభ్రంగా, పూరిఇళ్ళు కొంచెం మంచి దశలో కనిపిస్తున్నాయి. అంత పొద్దుటే ఆ బస్తీకి టాక్సీ రావటం చూసి పిల్లలూ, పెద్దలూ, అందరూ ఆశ్చర్యంతో బిలబిల్లాడుతూ వచ్చారు. పక్కన గౌరి లేకపోతే చంద్రం ఆ దృశ్యాన్ని ఎంతయినా ఆనందించి ఉండేవాడు. టాక్సీ ప్రకాశం ఇంటి ముందు ఆగింది. ఆ ఇల్లు చూడగానే మునుపటికంటే మెరుగ్గానే ఉంది అనుకున్నాడు చంద్రం.

టాక్సీ దిగిన చంద్రం - తలుపు తాళం వేసి వుండటం చూశాడు. నిరాశతో మళ్ళీ టాక్సీ ఎక్కబోతున్న అతని చుట్టూ పిల్లలూ, ఒకరిద్దరు పెద్దలూ చేరారు.

"ఓ రాజవ్వా! చూడు లీడరన్నకోసం ఎవరో వచ్చారు" అంటూ పిల్లలు కేకలు పెట్టసాగారు.

"ప్రకాశం ఎక్కడకు వెళ్ళాడు?" అడిగాడు చంద్రం ఒక నడికారు మనిషిని.

"కృష్ణలంక వెళ్ళాడు బాబూ! అక్కడ వరదొచ్చి కొన్ని ఇళ్ళు పోయినయ్. ప్రకాశంబాబు అక్కడ సబబు, సందర్భం కనుక్కోటానికి వెళ్ళిండు." చెబుతూ చెబుతూ టాక్సీలో ఉన్న గౌరికేసి చూసి ఆగిపోయాడు ఆ పెద్దమనిషి.

ఇంతలో దాదాపు అరవయ్ సంవత్సరాల వయస్సు భారంతో కొంచెం నడుం వంగివున్న బక్కపల్చని ముసిల్ది వచ్చి తలుపు తాళం తీసింది. చంద్రం తన సామాను దించుకున్నాడు. టాక్సీ డ్రైవర్‌కు డబ్బిచ్చి పంపించేశాడు. అన్ని కళ్ళూ గౌరినే చూస్తున్నాయి. గౌరికి అదంతా ఏమీ పట్టినట్టు లేదు. ముఖం సంతోషంతో వెలిగిపోతోంది.

"లోపలకు వెళ్ళు" అన్నాడు చంద్రం చిరాగ్గా.

రాజవ్వ అదోలా నవ్వటం గమనించాడు చంద్రం. ప్రాణం చచ్చిపోయింది. వయసులో ఉన్న అమ్మాయితో ఒక యువకుణ్ణి చూస్తే ఈ మనుషులకు వేరే ఇంక ఏమీ ఆలోచించటానికే ఉండదేమో!

వాళ్ళ తప్పు మాత్రం ఏముందిలే! తను ఓ గొప్పింటివాడిలా కనిపిస్తున్నాడాయె. గౌరిలాంటి బీదపిల్లతో చూసి ఎవరైనా 'ఎక్కడనుంచో లేపుకొచ్చాడ'నే అనుకుంటారు. ఇలాటి జంటను చూస్తే తను ఏమనుకుంటాడో?

సామాను లోపలపెట్టి, వాల్చివున్న నులక మంచం మీద కూలబడ్డాడు చంద్రం.

"నీళ్లు పట్టిఉన్నాయి. స్నానం చెయ్యండి బాబూ!" అంది ఎదురుగా వచ్చి నిల్చొన్న రాజవ్వ.

గోడకు ఆనుకొని బిక్కముఖంతో కూర్చుని ఉన్న గౌరిని చూచాడు చంద్రం. జాలివేసింది. "ముందు నువ్వెళ్ళి స్నానం చేసిరా గౌరీ!" అన్నాడు.

గౌరి వెంటనే లేచి దొడ్లోకి వెళ్ళింది. అలా వెళుతున్న గౌరినే చూస్తున్నది రాజవ్వ.

"ప్రకాశం ఎప్పుడొస్తాడు?" అడిగాడు చంద్రం రాజవ్వను.

"ఇవ్వాలో రేపో వస్తాడు" అందామె.

చంద్రం చిన్నగా రాజవ్వను కబుర్లలోకి దించాడు. ఆమె ద్వారా ప్రకాశం గురించి కొన్ని విషయాలు తెలుసుకున్నాడు.

ప్రకాశం నాన్న చనిపోయి ఆరేళ్ళయింది. ప్రకాశం తండ్రిపోగానే ట్రాన్స్‌పోర్టు సర్వీస్‌లో మెకానిక్‌గా చేరాడు. పెళ్ళి చేసుకోలేదు. కాని ఊళ్ళోవాళ్ళ సమస్యలన్నీ అతని సమస్యలేనట! రాజకీయాల్లో ప్రవేశించి ఒకసారి జైలుకు వెళ్ళాడట. ఆ తరవాత ఉద్యోగం పోయిందట.

"అయితే అవ్వా! ఇప్పుడు ప్రకాశం ఏం చేస్తున్నాడు?" అడిగాడు చంద్రం.

"మెకానిక్కు పనేదో సొంతంగానే చేసుకుంటున్నాడు. దొడ్లోకి వెళ్లినప్పుడు చూడండి. షెడ్డులోనూ, దొడ్లోనూ అంతా ఇనుపసామాన్లే. సంపాదిస్తాడు బాగానే. కాని ఏం లాభం? చేతిలో చిల్లిగవ్వ ఉండదంటే నమ్ము బాబూ!"

"ఏంచేస్తాడు వచ్చిన డబ్బంతా?"

"ఇక్కడ ఇన్ని గుడిసెలు ఉన్నయ్యా! ఎక్కడ ఏ గుడిసెలో నూకలు లేకపోయినా ప్రకాశంబాబే ఆదుకుంటాడు. ప్రకాశం బాబే ఆళ్ళందరికి దేముడితో సమానం. ప్రకాశం 'ఊ' అంటే గుంటూర్లో ఉన్న పాటక జనం నిప్పుల్లో దూకుతారనుకోండి! లీడరుబాబు ఇల్లంటే చాలు – ఏ రిక్షావాడైనా, టాక్సీవాడైనా తీసుకొస్తాడనుకోండి!"

"అయితే పెళ్ళెందుకు చేసుకోలేదు?"

"అదేబాబూ! అందరం సెప్పీ సెప్పీ ఊరుకున్నాం. పెళ్ళి చేసుకుంటే సేవ చేయటానికి ఈలుండదంట! అయ్యో నా మతి మండిపోను! మాటల్లోనే పడిపోయాను. వంట చేస్తాను," అని లేవబోతున్న అవ్వను వారించాడు చంద్రం.

"అక్కర్లేదవ్వా? హోటల్లో భోజనం చేసి, ఆ తరవాత ఆ అమ్మాయిని అనాధ శరణాలయంలో చేర్పించాలి. ఆ తరవాత మా వాళ్ళందర్నీ చూసి ఏ రాత్రి కొస్తానో; తాళంచెవి నా కిచ్చి నువ్వెళ్ళిపో," అన్నాడు చంద్రం. గౌరి గురించి అలా చెప్పగానే కొంత భారం తగ్గినట్లనిపించింది చంద్రానికి.

రాజవ్వ తాళంచెవి యిచ్చి వెళ్ళిపోయింది.

ప్రకాశం ఎలాంటి జీవితం గడుపుతున్నాడో అవ్వ మాటల ద్వారా వూహించుకున్నాడు చంద్రం. అంత నిదానంగా, అమాయకంగా, పిరికివాడిలా ఉండే ప్రకాశం – ఎలా మారిపోయాడో ఊహించుకోటానికే ఆశ్చర్యంగా ఉంది.

ప్రకాశం తండ్రిని తను చూసి కృతజ్ఞతను తెలుపుకోలేకపోయాడు. తను నిజంగానే దురదృష్టవంతుడు.

చంద్రం ఆలోచిస్తూ నాలుగువైపుల దృష్టి సారించాడు. ఇల్లు రెండు నిట్టాళ్ళతో వేసిన పూరి ఇల్లే అయినా ఎంతో శుభ్రంగా ఉంది. మధ్య మట్టిగోడతో రెండు గదులుగా విభజించి ఉంది. ఒకటి వంటకూ సామానుకూ అయి ఉంటుంది. తను కూర్చొని ఉన్నది ప్రకాశం డ్రాయింగురూంలాగుంది. చిన్న టేబులు – చుట్టూ నాలుగు చెక్క కుర్చీలు ఉన్నాయి. గోడలోకి ఉన్న అలమరు నిండా దేశనాయకుల ఫొటోలు ఉన్నాయి.

యధాలాపంగానే లేచి పుస్తకాలున్న అలమారు దగ్గరకు వెళ్లాడు చంద్రం. కింద అరలో అన్నీ వారపత్రికలూ, దినపత్రికలూ వున్నాయి మొదటిసారిగా చేతికి అందింది గోర్కీ 'అమ్మ.' ఇంకా కొన్ని గోర్కీ పుస్తకాలూ, చెకోవ్ పుస్తకాలూ, శ్రీశ్రీ మహాప్రస్థానం. టాల్‌స్టాయ్ పుస్తకాలూ ఉన్నాయి. ప్రకాశం పుస్తకాలు చదివే అలవాటు అలవర్చుకున్నందుకు చంద్రానికి సంతోషం కలిగింది. అకస్మాత్తుగా తన మొదటి నవల "భగ్నప్రేమ" కనిపించింది. ఆశ్చర్యం వేసింది. ఇతర పుస్తకాలను పట్టిచూస్తే ప్రకాశం ఎలాంటి భావాలు కలవాడో అర్థం అవుతుంది. ఎలాంటి పుస్తకాలు చదువుతున్నాడో తెలుస్తూనే ఉంది. కాని ఆ గ్రంథాల మధ్య తన పుస్తకం ఉండటం ఆశ్చర్యంగానే ఉంది. అది తన చిన్ననాటి స్నేహితుడు రచించిందని గ్రహించి వున్నాడేమో?

# 11

స్నానం చేసి ముస్తాబయి వచ్చిన గౌరిని చూశాడు చంద్రం. బాగా నలిగి మాసిన చౌకరకం సిల్కు చీరా, మిసమిస లాడుతున్న మెరూను రంగు 'శాటిన్' జాకెట్టూ – తమాషాగా ఉంది. ముఖానికి వేసిన పౌడరు తడిమీద వేసిందేమో అక్కడక్కడ ముద్దలు ముద్దలుగా ఉంది. బిర్రుగా లాగి వేసిన జడకు పచ్చరిబ్బను వేసింది. ఆ జడచివర తేలికొండిలా వంకరగా లేచింది. ఆమె వేషం చూడగానే చంద్రానికి నవ్వొచ్చింది.

తేలుకొండీ జడ చూడగానే ఎనిమిది సంవత్సరాల క్రితం తన కట్లు విప్పి తనను ఇంటినుంచి పారిపోవటానికి సహాయపడ్డ అమ్మాయి గుర్తొచ్చింది. తను మర్చేపోయాడు. ప్రకాశం, తండ్రితోపాటు తను – ఎవరికైనా కృతజ్ఞుడై ఉండాలంటే ఆ పిల్లకే. ఏమయిందో? ఎక్కడుందో? మళ్లీ ఎప్పటికైనా ఆ పిల్లను చూడగలడా? చూసినా గుర్తించగలడా? ఆ పిల్ల కూడా దాదాపు అంతే వయస్సులో ఉండవచ్చును. అప్రయత్నంగానే గౌరి ముఖంలోకి దీక్షగా చూశాడు. ఆ అమ్మాయి పోలికలున్నట్ల నిపించింది. మళ్లీ అంతలోనే తను భ్రమపడుతున్నా ననుకున్నాడు.

ఈ అమ్మాయిని తను ఎలాగయినా వదిలించుకోవాలి. ఇది ఏనాటి ఋణమో? కొందరు జీవితంలో చాలా చిత్రంగా తటస్థపడుతుంటారు. మల్లెతీగలా కాళ్ళకు చుట్టుకుంటారు. అది వదలదు. మనం దాన్ని నిర్దయగా తెంచివేసి ముందుకు సాగనూలేము. ఇలాంటి సంఘటనే ఏ సినిమాలోనో చూసి లేక ఏ కథలోనో చదివి అసందర్భంగా ఉంది అనుకొని ఉండేవాడు తను. కాని ఇప్పుడు తన జీవితంలోనే జరిగింది. మానవుని జీవితంలో అతని ప్రమేయం లేకుండానే, ఊహించనివీ, ఆశించనివీ, అసందర్భంగా జరుగుతూనే ఉంటాయి.

అర్ధగంటలో స్నానం ముగించుకుని ముస్తాబయి బయలుదేరుతున్న చంద్రం దగ్గరకు వచ్చి "ఎక్కడకూ?" అంది గౌరి భయపడుతూ.

"భయపడకు, నిన్నుకూడా తీసుకెళ్తాలే" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"ఎక్కడికీ?" ఈసారి కొంచెం చనువుతీసుకుంటూనే అడిగింది.

గౌరి చక్రాల్లాంటి కళ్ళు ఆనందంతో మెరిసిపోయాయి.

"ఆ ముఖాని కున్న పౌడరు కొంచెం తుడుచుకొని బయలుదేరు," అన్నాడు.

గౌరి సిగ్గుపడుతూ గబగబా తుడుచుకుంది. "మీకు శరణాలయంలో పౌడరు కూడా కొనిపెడతారా?" అడిగాడు చంద్రం.

"ఊహుఁ" గౌరి తల అడ్డంగా తిప్పింది.

"మరి నీకు ఈ పౌడరు ఎక్కడనుంచి వచ్చింది?"

"రాజి ఇచ్చింది.?"

"రాజి ఎవరు?"

"నీకు తెలవదులే. మా శరణాలయంలోనే ఉండేది."

"ఇప్పుడు లేదా అక్కడ?"

"వెళ్ళిపోయింది రంగయ్యతో. పది రోజులయింది. రాత్రిపూట గోడదూకి పారిపోయింది. నేనే సహాయం చేశాను. రాజికి రంగయ్యే మా మేట్రమ్మ చూడకుండా పౌడరు తెచ్చిపెట్టాడు. అందులో కొద్దిగా నాకిచ్చింది." అమాయకంగా చిన్నపిల్లలా చెప్పుకుపోసాగింది.

"రంగయ్య ఎవరు? అతనితో ఎందుకు వెళ్ళిపోయింది?"

"వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటున్నారుగా? అందుకే వెళ్ళిపోయింది!" అమాయకంగా కళ్ళు మెరిపిస్తూ అంది.

చంద్రం ఆ అమ్మాయి అమాయకత్వం చూసి జాలిపడ్డాడు. విజ్ఞాన వికాసాలు ఇవ్వలేని శరణాలయాలు ఎందుకో!

గౌరి ఏదో చెబుతూనే ఉంది. ఆమె మాటల్లో ఎన్నో పేర్లు వచ్చాయి. కాని చంద్రం మానసికంగా అవన్నీ వినేస్థితిలో లేడు.

తాళం వేసి రోడ్డుమీదకు రాగానే జట్కా దొరికింది.

జట్కాలో కూర్చున్న చంద్రాన్ని ఎన్నో ఆలోచనలు చుట్టివేశాయి. గౌరిలాంటి పిల్లలూ, రాజిలాంటి పిల్లలూ ఉండటానికి ఎవరు కారకులు?

జట్కా ఒక హోటల్ముందు ఆగింది. చంద్రం జట్కా దిగి గబగబా నడుస్తున్నాడు హోటల్లోకి; గౌరి తనకేమీ కాదని అందరూ అనుకోవాలన్నట్లు. గౌరితో హోటల్లోకి పోవాలంటే చచ్చేంత సిగ్గుగా వుంది.

గౌరి హోటలు భోజనం తినే తీరుచూస్తే ఆ మాత్రం భోజనం ఆమె జన్మలో తినివుండ దనిపిస్తుంది. చంద్రానికి జాలితో హృదయం కరిగిపోయింది.

భోజనం చేస్తున్నంతసేపూ గౌరి తన స్నేహితురాళ్ళను గురించీ, శరణాలయం భోజనం గురించీ ఏమేమో చెబుతోంది. చంద్రం దగ్గిర చనువు తీసుకోవటానికి గౌరికి ఎంతోసేపు పట్టలేదు. గౌరికి వయసు దాదాపు పద్దెనిమిది సంవత్సరాలున్నా మానసికంగా పన్నెండూ-పదమూడు సంవత్సరాల వయస్సుకంటే పెరగలేదనుకున్నాడు.

భోజనం కాగానే జట్కా ఎక్కారు.

"ఏ సినిమాకు?" ఉత్సాహంగా అడిగింది గౌరి.

"దేనికి వెళదాం?" ముందు ఉలిక్కిపడి, మళ్ళీ అంతలోనే తమాయించుకొని అడిగాడు చంద్రం.

"జింబో." తడుముకోకుండా గబుక్కున అనేసింది. చంద్రం ఫక్కున నవ్వాడు. గౌరి కోపంతో మూతి సున్నాచుట్టింది. 'కోపంలో బలేగా ఉందిలే' అనుకున్నాడు చంద్రం.

జట్కా శరణాలయం ముందు ఆగింది. గౌరి అది చూసి ఏడుపు ముఖం వేసింది. చంద్రం జట్కాదిగి గౌరిని దిగమన్నాడు. దిగనన్నది. గేటులో ఉన్న గూర్ఖా గౌరినిచూసి గబగబా జట్కా దగ్గరకు వచ్చాడు.

"మీరు లోపల కెళ్ళండి బాబూ! దీన్ని నేను తీసుకొస్తాగా" అన్నాడు గుర్ఖా.

చంద్రం గేటుదాటి లోపలికి రెండు అడుగులు వేశాడోలేదో గౌరి జట్కా దిగి, తనను పట్టుకొన్న గూర్ఖావాడు చెయ్యి పట్టుకు కొరికింది. వాడు 'అయ్యబాబోయ్' అని చెయ్యి లాక్కోవటమే తడవుగా గౌరి మెరుపులా పారిపోయింది.

చంద్రం తెల్లబోయి చూశాడు. "అది అంతే బాబు, మా రాలుగాయి గుంట, ఎవరికీ భయపడదు. నిన్ననంగా పారిపోయింది. ఇప్పటి కప్పుడే ఎన్ని రుచులు మరిగిందో! ఇంకా ఇక్కడ వుంటదా అది? మీ పిచ్చి కాకపోతే" అన్నాడు గూర్ఖావాడు, గౌరి కరచినచేతిని చూసుకుంటూ కసిగా. చంద్రానికి గూర్ఖావాడి మెడ నులిమేయాలన్నంత కోపం వచ్చింది. గబగబా వెళ్ళి జట్కా ఎక్కి ఏలూరురోడ్డులో కృష్ణా టుబాకో కంపెనీకి పోనియ్ అన్నాడు.

ఏమిటో ప్రపంచం! ఒంటరిగా ఉన్న ఆడపిల్లను చూసి, చదువుకున్నవాడూ, చదువు లేనివాడూ, ఆడదీ, మగాడూ, అందరూ ఒకేలా ఆలోచిస్తారు. ఏ నాటికో స్త్రీకి ఈ దేశంలో నిజమైన గౌరవం లభించేది?

అంతలో గౌరిమీద పుట్టెడు కోపం వచ్చింది. తన బాధ్యతను తను నిర్వహించటానికి ప్రయత్నించాడు. అంతే! ఆ బజారు పిల్లకోసం తను బాధపడటం అనవసరం అని సర్దిచెప్పుకోవటానికి ప్రయత్నించాడు. కాని మనస్సులో ఎక్కడో అశాంతిగానే ఉంది.

జట్కా ఓ రెండంతస్తుల భవనం ముందు ఆగింది.

"ఇక్కడాపావేం?" అన్నాడు చంద్రం యథాలాపంగా.

"మీరు చెప్పిన కంపెనీ ఇదే బాబూ!" అన్నాడు జట్కావాడు.

చంద్రం ఆశ్చర్యంగా చూశాడు - ఆ పెద్ద భవనంకేసి.

"కృష్ణా టుబాకో కంపెనీ" అనే పెద్దసైజు సైన్‌బోర్డు కొట్టవచ్చినట్లు కనిపించిది.

ఆ భవనం, ఆ బోర్డూ, ఈ ఏడు సంవత్సరాల్లో కృష్ణారావు ఎంత సంపాదించాడో కాస్త అటూ ఇటూగా చెబుతూనే ఉన్నాయి. చంద్రానికి వెంటనే ప్రకాశం తండ్రి చెప్పిన కథ గుర్తుకొచ్చింది. ప్రకాశం ఇల్లు కళ్ళముందు కదిలింది. గుండెల్లో ఎక్కడో ఏదో గ్రుచ్చుకున్నట్లనిపించింది.

జట్కావాడికి డబ్బులిచ్చి ఆ పెద్ద గేటును దాటి భవంతిలో ప్రవేశించాడు. ఇంతకు ముందుకంటే ఆఫీసులో కార్యకర్తలు ఎక్కువే వున్నారనుకున్నాడు. ప్రొప్రయిటర్ గది మేడమీద ఉన్నదని తెలుసుకొని గబగబా పైకి ఎక్కాడు. ఇంతకాలం తరవాత అన్నను చూడాలనే ఆదుర్దా ఎంత అణచుకున్నా అతనిలో పొంగి వస్తూనే ఉంది. ఎలాంటి వాడయితేనేం అతను తన అన్న. అందుకేనేమో మరి రక్తసంబంధం అంటారు.

ప్రొప్రయిటర్ రూమ్‌లోకి ప్రవేశించబోతున్న చంద్రాన్ని ప్యూన్ అడ్డగించి చేతికి కాగితం ముక్క అందించాడు. చంద్రం పేరురాసి ఆ చీటిని ఆ ప్యూన్‌కు అందించాడు. ప్యూను లోపలకు వెళ్ళాడోలేదో కృష్ణారావు గబగబా బయటకు వచ్చి అమాంతం చంద్రాన్ని కౌగిలించుకున్నాడు.

"వచ్చావా చంద్రం! ఎంత మారిపోయావురా? నా కంటే ఓ గుప్పెడు పెరిగావు. ఇంతకాలం మమ్మల్ని వదిలి ఎలా ఉండగలిగావురా! కనీసం నీవు ఎక్కడ ఉన్నదయినా ఓ ముక్క రాయకూడదా?" ఆనందంలో ఉక్కిరి బిక్కిరి అయిపోతూ గబగబా అనేశాడు కృష్ణారావు. తమ్ముడి చెయ్యి పట్టుకొని తన గదిలోకి తీసుకెళ్ళాడు. వాకిట్లో ప్యూన్ శిలాప్రతిమలా నిలుచుండిపోయాడు.

ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. కృష్ణారావుకు ఆనందంలో ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. తమ్ముణ్ణి తనివితీరా చూస్తూ కూర్చున్నాడు. కృష్ణారావు కళ్ళలో అకస్మాత్తుగా నీరు తిరిగింది.

"ఇంత కాలం ఎక్కడ ఉన్నావు చంద్రం? ఏం చేస్తున్నావు?" అడిగాడు కృష్ణారావు, ఏం మాట్లాడాలో తోచక.

ఇంతసేపూ అన్నగారి ఆప్యాయతా, వాత్సల్యం చూస్తూ ప్రపంచాన్నే మర్చిపోయి ఉన్న చంద్రం, అన్నవేసిన ప్రశ్నతో ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు.

"దేశదిమ్మరికీ, దొంగకూ, ఒక ఊరేమిటి? అన్ని ఊళ్ళూ అతనివే, అన్ని ఉద్యోగాలూ అతనివే!" చంద్రం గొంతులో వ్యంగ్యం తొంగిచూసింది. ఆ జవాబు విన్న కృష్ణారావుకు ఎవరో చాచి లెంపకాయి కొట్టినట్లయింది ముఖంలో బాధ స్పష్టంగా కనిపిస్తోంది.

చంద్రం జేబులోనుంచి పది రూపాయల నోట్ల కట్ట ఒకటి తీసి కృష్ణారావు ఎదురుగా టేబిల్‌మీద విసురుగా వేశాడు.

"తీసుకోండి! ఆనాడు మీ ఇంట్లో నేను దొంగిలించానన్న డబ్బు" అన్నాడు చంద్రం.

కృష్ణారావులోని చైతన్యం మంచులా గడ్డకట్టుకుపోసాగింది.

"అసలు నేను ఇక్కడకు వచ్చింది ఈ డబ్బు ఇవ్వటానికే. ఇక నేను వస్తాను" అంటూ లేవబోయిన చంద్రం అన్నముఖం చూసి లేవలేకపోయాడు.

కృష్ణారావు శరీరంలో ఎక్కడా జీవం వున్నట్టు కనిపించలేదు. అప్పుడే ప్రాణంపోయిన శవాన్ని కుర్చీలో కూర్చోపెట్టినట్లు వున్నాడు. చంద్రం గబగబా లేచివెళ్ళి "అన్నయ్యా!" అంటూ కదిపాడు కృష్ణారావును. చంద్రం గొంతు కొంచెం వణికింది.

పీడకలనుంచి నిద్రలేచినట్లు ఉలిక్కిపడ్డాడు కృష్ణారావు. అంతవరకూ గడ్డకట్టిన చైతన్యం అతనిలో మళ్ళీ కరిగి ప్రవహించసాగింది. గబుక్కున లేచి తమ్ముణ్ణి కౌగిలించుకొని కుమిలి కుమిలి ఏడ్చాడు.

చంద్రం తను చాలా తప్పు చేశానని బాధపడ్డాడు. తను వచ్చీ రాకముందే, తనను చూసిన సంతోషంనుంచి అన్న కోలుకోక మునుపే తను అంత కఠినంగా ప్రవర్తించవలసింది కాదు.

"ఏమిటన్నయ్యా ఇది!" అన్నచేతులనుంచి తప్పుకొని అన్నాడు చంద్రం. కృష్ణారావు కొంచెం తమాయించుకున్నాడు.

"చంద్రం! ఈ ఏడు సంవత్సరాలలో ఈ ఆస్తి పదింతలు పెరిగింది దీనికి నీవు సమభాగస్తుడివి. ఆనాడు నీవు తీసుకున్న డబ్బు నీదే. పైగా, దాన్ని నీకు ఇవ్వాలనే అక్కడ దాచాను, మీ వదినకు తెలియకుండా."

"అదేమాట ఆనాడు ఎందుకనలేకపోయావు?" అందామనుకున్నాడు చంద్రం, కాని అనలేకపోయాడు.

"ఎప్పుడొచ్చావు?"

"పొద్దుట పాసెంజరుకు."

"అయితే ఇంటికి రాలేదేం? ఎక్కడ దిగావు?"

"నాకు ఇల్లు ఎక్కడుంది? ప్రకాశం ఇంటిలో దిగాను" అంటూ చంద్రం కృష్ణారావు ముఖంలోకి చూశాడు. కృష్ణారావు ముఖం పాలిపోవటం గమనించాడు.

"నా ఇల్లు - నీ ఇల్లు కాదురా? నాన్నా, అమ్మా వుంటే ఇలా అనేవాడివేనా?"

"నాన్నా, అమ్మా ఉంటే ఇలా ఇల్లువిడిచి అనాథగా పోవాల్సిన పరిస్థితి వచ్చేదేనా?" అన్నాడు చంద్రం ఎత్తుపొడుపుగా.

చంద్రం ఆనాటి తన ప్రవర్తనను ఎన్నటికీ క్షమించలేడని అర్థం చేసుకున్నాడు కృష్ణారావు.

కొంచెంసేపు విషయాన్ని మార్చాలనుకున్నాడు. వెంటనే బెల్‌నొక్కి సెక్రటరీని పిలవమన్నాడు. రెండు నిమిషాల్లో ఒక స్త్రీ ప్రవేశించింది.

"ఈ అబ్బాయి నా తమ్ముడు. బయట ఊళ్ళో చదువుతూండేవాడు. ఇవ్వాళే వచ్చాడు. మన ఫ్యాక్టరీ చూపించు. చంద్రం! ఈమె నా సెక్రటరీ, మిస్ అనూరాధ. ఆమెతో వెళ్ళి ఫ్యాక్టరీ చూసి అర్ధగంటలో వచ్చేసేయ్."

అన్న మనసును అవసరమైనదానికంటే ఎక్కువ నొప్పించానేమోనని ఆలోచిస్తున్న చంద్రం మారుమాట్లాడకుండా అనూరాధ వెనకే బయలుదేరాడు.

తన అన్నకు ఒక ప్రయివేట్ సెక్రటరీ కూడా ఎందుకో? పైగా, ఆడమనిషిని ఎందుకు పెట్టుకున్నాడో! ఆమె వయసు అసలెంతో కాని దాదాపు ముప్పయ్ అయిదు సంవత్సరాలున్న మనిషిలా కనిపిస్తుంది. ఫ్యాక్టరీ చూపిస్తూ వివరాలు చెబుతుంటే ఆమెను ఎక్కడో చూసినట్లనిపించింది. ఆమెను చూస్తుంటే మంచి సంస్కారంగల మనిషిలా అనిపించింది. ఆమె అంటే అంతలోనే గౌరవభావం కలిగింది చంద్రానికి.

తమ్ముడు వెళ్ళగానే కృష్ణారావు పెద్దగా నిట్టూర్చాడు. వెంటనే ఇంటికి ఫోన్ చేశాడు.

కాంతమ్మకు కృష్ణారావు చంద్రం వచ్చిన వార్తను ఎంత సంతోషంగా వినిపించాడో, మరుక్షణంలోనే ఆవిడ ధోరణికి అంతగానూ కుంగిపోయాడు. భార్యమీద కోపం, అసహ్యం కలిగింది. ఇంటిబిడ్డ ఇంతకాలానికి తిరిగివస్తే సంతోషించని ఆడదికూడా వుంటుందా అనుకున్నాడు. ఆస్తికి వారసుడు మళ్ళీ తిరిగివచ్చాడనే అయివుండాలి. అంతకంటే ఆమె ప్రవర్తనకు వేరేకారణం కనిపించలేదు. కృష్ణారావుకు కోపం వచ్చింది.

"రాత్రికి నలుగురు భోజనానికి వస్తున్నారు - వంట చేయించు" అని చెప్పి విసురుగా ఫోన్ పెట్టేశాడు. మళ్ళీ వెంటనే ప్రసాదరావుకు ఫోన్ చేశాడు.

"ఆఁ- నేనే కృష్ణారావును. రాత్రికి మీరూ, హేమా - మా ఇంటికి భోజనానికి రావాలి. మీరే ప్రత్యక్షంగా చూద్దురుగాని, తప్పక రావాలి" అంటూ ఫోన్ పెట్టేశాడు కృష్ణారావు.

కృష్ణారావు ఇంటికి బయలుదేరటానికి సిద్ధంగా కూర్చున్నాడు. తమ్ముడికోసం ఎదురుచూస్తున్నాడు.

చంద్రం లోపల ప్రవేశించగానే కృష్ణారావుకూడా లేచి టేబిల్ మీద వున్న నోట్లకట్టను మళ్ళీ తమ్ముడి ప్యాంటు జేబులో పెట్టాడు. చంద్రం ఏమీ అనలేకపోయాడు. ఇంకోసారి వచ్చి అన్నగారి సెక్రటరీ చేతికిచ్చి వెళ్ళిపోవచ్చు ననుకున్నాడు.

"ఫ్యాక్టరీని చాలా వృద్ధిచేశావు, చాలా సంతోషం!" అన్నాడు చంద్రం మర్యాదకోసం అన్నట్లు. కృష్ణారావు జవాబివ్వలేదు. సిగరెట్టు పెట్టెతీసి జేబులో పెట్టుకుని బయలుదేరాడు.

"ఇక నేను వెళ్ళివస్తా" అన్నాడు చంద్రం, అన్న ఇంటికి బయలుదేరుతున్నట్లు తెలుసుకొని.

"వెళతావా? ఎక్కడకు?"

"నా ఇంటికి. నేను ఎక్కడుంటే అదే నా ఇల్లు."

"నేను ఊళ్ళో వుండగానే నువ్వు ఎక్కడో ముఖ్యంగా మన ఫ్యాక్టరీలో పనిచేసే కూలీ నాలీ జనం వుండేచోట వుంటావా? అది నా ఇల్లు కాదు నీ ఇల్లే. పద ఇంటికి. తరవాత కార్లో వెళ్ళి సామాను తెచ్చుకుందువుగాని" అన్నాడు కృష్ణారావు.

"అక్కర్లేదు. నన్ను అక్కడే వుండనివ్వు. ఆ పూరిగుడిసెల్లోనే నాకు ఒకనాడు ఆప్యాయతా, ఆదరణా దొరికింది. నేను మీ యింటినుంచి దొంగగా వెళ్ళిపోయాను. మళ్ళీ ఆ గడప తొక్కదలచుకోలేదు."

"నా ఇల్లేమిటిరా?" మందలింపుగా అన్నాడు కృష్ణారావు.

"నేను దొంగగా ఆ ఇల్లు విడిచిననాడే అది నా ఇల్లు కాదని నిర్ణయమయి పోయింది." ఉద్రేకంతో అన్నాడు చంద్రం.

తమ్ముడు చాలా ఆవేశంలో వున్నాడని, ఇప్పుడు ఇక ఎంత చెప్పినా లాభంలేదనీ అర్థం చేసుకున్నాడు కృష్ణారావు.

"సరే! నీ ఇష్టం వచ్చినచోటే వుందువుగానిలే. ఇప్పుడు నాతో పద! భోజనంచేసి వెళుదువుగాని. మీ వదిన ఎదురు చూస్తూ వుంటుంది."

చంద్రం వదినపేరు వినగానే అదోలా నవ్వాడు. కృష్ణారావు తల వంచుకున్నాడు.

"క్షమించు అన్నయ్యా, నేను రాలేను. ఇక నన్ను బలవంతం చెయ్యకు" అన్నాడు చంద్రం కొంచెం సౌమ్యంగా.

"మా కోసం కాకపోయినా కనీసం పలవరించే రజని కోసమయినా ఒక్కసారి రారా చంద్రం!" అన్న కృష్ణారావు గొంతులో బాధ ఎంత దాచుకోవాలన్నా కనిపించింది.

రజని పేరు వినగానే చంద్రం హృదయంలో పాలసముద్రం పొంగింది. కనీసం తను రజని ఎలా ఉందనయినా అడగలేదు. నిజంగా తనలో ఇంత కాఠిన్యం వుందని తనకే తెలియదు. పసిబిడ్డ రజని తనకేం అపచారం చేసింది? రజని ఎంత అయిందో? ఎలా వుందో? ఎన్ని కబుర్లు చెబుతుందో? చంద్రం మారుమాట్లాడకుండా కృష్ణారావు వెనకే బయలుదేరాడు.

కారు చాలా వేగంగా పోతోంది. కృష్ణారావు చాలా ఉద్రేకంగా వున్నాడు. చంద్రం తాపీగా కూర్చొని అన్ననే గమనిస్తున్నాడు. కాని అన్నమీద కలగవలసినంత గౌరవం

కలగటంలేదు. అందుకే మనిషికీ మనిషికీ వుండే సున్నితమైన బంధాన్ని తెగేంతవరకూ లాగకూడదంటారేమో!

"చంద్రం"....! కృష్ణారావు ఏదో అడగాలని ఆగిపోయాడు.

"ఊс" అన్నాడు చంద్రం, ఎలాంటి ఉత్సాహాన్నీ చూపించకుండానే.

"పెళ్ళి చేసుకున్నావా?" కృష్ణారావు తను అన్న మాటలు అతనినే వెక్కిరించి నట్లనిపించింది. తనేం ప్రశ్నవేశాడు? చంద్రం పెళ్ళి చెయ్యవలసిన బాధ్యత వున్న తనే ఈనాడు ఈ ప్రశ్న వేయవలసి వచ్చింది. ఈ పరిస్థితికి కారణం కూడా తనే. ఎంత హాస్యాస్పదం!

"నాకు పెళ్ళా! పిల్ల నెవరిస్తారు,! చూసిచూసి ఒక దొంగకు?" అన్నాడు చంద్రం చురుకుగా.

మళ్ళీ ఇద్దరిమధ్యా మౌనం.

కృష్ణారావుకు తమ్ముణ్ణి గురించి ఎన్ని విషయాలో తెలుసుకోవాలని వుంది. కాని చంద్రం తన ప్రశ్నలకు దేనికీ సరయిన సమాధానం ఇవ్వటంలేదు.

శరీరం కాలినప్పుడు మూడు రకాలుగా బాధ కలుగుతుంది. ఒకటి – ఆ కాలిన భాగంలో కలిగే బాధ. రెండు – దానివల్ల శరీరం అంతటా కలిగే బాధ. మూడు – గాయం మానుతుంది. కాని మచ్చ మిగిలిపోతుంది. ఆ మచ్చ చూచినప్పుడల్లా దాని తాలూకు పరిస్థితుల జ్ఞాపకంవల్ల కలిగే బాధ. అలాగే చంద్రం ఆనాడు పొందిన అవమానం, బాధను మళ్ళీ మళ్ళీ అన్నగారి ప్రతి ప్రశ్నా జ్ఞాపకం చేస్తున్నది. అందువల్లనే అన్నకు సరైన జవాబులు ఇవ్వలేకపోతున్నాడు.

## 12

ప్రొద్దు వాటాలింది. పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నాయి. పశువుల వెనక నడుస్తూ పాలవాళ్ళు రోడ్లమీద అక్కడక్కడ కనిపిస్తున్నారు.

రింగు రోడ్డులోని కృష్ణారావు రెండంతస్తుల భవనం గేటు తెరిచి వుంది. ఎదురుగా వరండా గడపల మీద రజని రెండు అరచేతుల్లో గడ్డం ఆన్చి మోకాళ్ళమీద మోచేతులు పెట్టుకొని కూర్చొని వుంది. ఆ బాలిక చక్రాల్లాంటి గుండ్రని పెద్ద పెద్ద కళ్ళు తదేకంగా గేటువైపే చూస్తున్నాయి. ఆమె ముఖంమీద నీరెండ పడుతున్నది. ఆకుల మధ్య నుంచి సగం సగంగా కనిపిస్తున్న ముద్దమందార మొగ్గలా ఆమె ముఖం రెండు చెంపల్ని కప్పిన అరచేతుల మధ్యనుంచి కనిపిస్తున్నది.

"ఎందుకే ఆ ఎండలో అలా కూర్చున్నావ్? ఇంతవరకూ వచ్చినవాడు ఇంటికిరాక ఎక్కడకు పోతాడులే! రా లోపలకు" అంటూ కేక పెట్టింది కాంతమ్మ. తల్లికేక వినిపించుకోనట్లే కూర్చుంది రజని.

నల్లరంగు కొత్తమోడల్ ఫియట్ లోపలకువచ్చి ఆగింది. రజని కారుదగ్గరకు పరుగెత్తింది.

"చూశావా చంద్రం! రజని నీ కోసం ఎదురుచూస్తూ గేట్లోనే కూర్చుని వుంది" అన్నాడు కృష్ణారావు కారుడోర్ తెరుస్తూ.

చంద్రం కారుదిగుతూనే రజనిని అమాంతంగా రెండు చేతులతో గుండెలపైకి ఎత్తుకున్నాడు.

"ఎంత పెద్దదానివయావు రజనీ!" అన్నాడు ఆనందంతో ఉక్కిరి బిక్కిరవుతూ.

"మరి! ఇంకా అలాగే మూడేళ్ళ పసిపాపలాగే ఉందనుకున్నావా?" అన్నాడు కృష్ణారావు ఆనందం ఉబికివస్తున్న స్వరంతో.

రజని సిగ్గుపడిపోయింది తండ్రి మాటలకు. వరండాలోకి వస్తున్న వదినను చూచి రజని నొసటిమీద ముద్దు పెట్టుకొని దించేశాడు చంద్రం.

"బాగున్నావా వదినా?" వదినను పలకరించాడు చంద్రం నవ్వుముఖంతో.

"రా చంద్రం! ఎంత పెద్దవాడి వయావు? ఇంతకాలానికి మేము గుర్తొచ్చామా?" అంటూ ఎంతో ఆప్యాయత చూపిస్తూ ఆహ్వానించింది కాంతమ్మ.

అంతవరకూ తన భార్య చంద్రంపట్ల ఎలా ప్రవర్తిస్తుందోనని భయపడుతూ వచ్చిన కృష్ణారావుకు తలమీదనుంచి పెద్దభారం దించినట్లయింది. ఆమె చూపుతున్న ఆదరణంతా నటన మాత్రమేనని తెలుసు కృష్ణారావుకు. కనీసం అలా నటించింది, అంతేచాలునని తృప్తిగా నిట్టూర్చాడు కృష్ణారావు.

కుశల ప్రశ్నలు పూర్తి అయాయి. కాంతమ్మ రెండు వెండిగ్లాసుల్లో కాఫీ తెచ్చి అన్నా తమ్ముళ్ళకు అందించింది. సరాసరి ఇంటికి రాకుండా ఎక్కడో దిగినందుకు చంద్రాన్ని ఎత్తిపొడిచింది. చంద్రం ఇంతకాలానికి తన ఇంటిలో తనవారిమధ్య కూర్చుని వున్నాడు. వదిన ఆప్యాయతను చూసిన చంద్రం హృదయంలో దాగివున్న ఆ కాస్తకోపం కూడా కర్పూరంలా కరిగిపోయింది. అతని మనస్సు నిండు సంతృప్తితో తొణికిసలాడుతున్నది.

గుళ్ళో దేవుణ్ణి తన్మయంతో తదేకంగా చూసున్న భక్తునిలా రజని ఒక్కమాటకూడా మాట్లాడకుండా బాబాయినే చూస్తూ కూర్చుంది. అది గమనించిన చంద్రానికి నవ్వు వచ్చింది. రజనికోసం తను ఏమీతేలేదు.

అసలు తనకు ఆ భావమే తట్టనందుకు బాధపడ్డాడు.

"అన్నయ్యా! కారులో రజనీ, నేనూ ఒకసారి బజారు వెళ్ళివస్తాం" అన్నాడు చంద్రం.

చంద్రం భావాన్ని గ్రహించాడు కృష్ణారావు. "ఇప్పుడేం బజారు వెళతావు? రేపు వెళ్ళొచ్చులే. తొందరేం - ఇక్కడ వుండేవాడివేగా?" అన్నాడు కృష్ణారావు.

"ఏం అమ్మా, రజనీ! బాబాయికోసం అంత కలవరించేదానివి - తీరా బాబాయివస్తే మాట్లాడవేం?" అన్నాడు కూతురుతో.

"తను ఊహించుకున్నంత బాగాలేడేమో యీ బాబాయి" అంటూ నవ్వాడు చంద్రం. ఒక్కసారి కాంతమ్మ, కృష్ణారావు కూడా ఫక్కున నవ్వారు.

రజని సిగ్గుపడిపోయింది.

"బాబాయికి నీ పుస్తకాలూ అవీ చూపించమ్మా!" అన్నాడు కృష్ణారావు.

రజని ఉత్సాహంగా లేచింది. చంద్రం లేచి రజని దగ్గరకు వచ్చి నెత్తిమీద చిన్నగా మొట్టాడు. రజని నవ్వుతూ బాబాయి చెయ్యి పట్టుకొని తన గదిలోకి తీసుకెళ్ళింది.

అంత సిగ్గుపడ్డ రజని అంతలోనే బాబాయితో కలిసిపోయింది. ఊపిరి సలపనీయకుండా కబుర్లు చెప్పింది. తన పుస్తకాలన్నీ చూపించింది. అందులో డిటెక్టివ్ నవలలూ, చవకబారు కథల పుస్తకాలు చూసి చంద్రం ఆశ్చర్యపోయాడు. ఆ పుస్తకాలను గురించి రజని మాట్లాడుతుంటే చంద్రానికి ఆశ్చర్యంతోపాటు బాధకూడా కలిగింది. చంద్రం రాసిన 'భగ్నప్రేమ'ను గురించికూడా మాట్లాడింది. రజని వయస్సుకు మించి మాట్లాడుతూందనీ, చాలా చురుకైన పిల్లనీ కాని ఆ చురుకుదనాన్ని సరిఅయిన మార్గంలో పెట్టడానికి పెద్దవాళ్ళు ప్రయత్నించలేదనీ చంద్రం అర్థం చేసుకున్నాడు. ఆ వయస్సులో రజని ప్రేమ కథలను గురించి మాట్లాడుతుంటే చంద్రానికి కొంచెం ఎబ్బెట్టుగా తోచింది.

కొందరిలో శారీరక వయస్సుతోపాటు క్రమంగా మానసిక వయస్సూ పెరుగుతుంది. కొందరి పిల్లల్లో అసలు వయసుకంటే చాలా త్వరగా మానసిక వయస్సు పెరుగుతుంది. ఇలాంటి పిల్లలే పెద్దలకు సమస్యలుగా తయారవుతారు. ఇలాంటివారికి సరైన అవకాశాలను కలిగించి, వాళ్ళ మెదడుకు సరిఅయిన మేత పెట్టి, మంచి మార్గంలో నడిపిస్తే ఇలాంటివారే గొప్పవారవుతారు. వారి తెలివితేటలకు సరిఅయిన మార్గం దొరకనప్పుడు తప్పు మార్గంలో పడే అవకాశం వుంటుంది. బుద్ధులు వెర్రితలలు వేస్తాయి. ఎక్కువ తెలివైన పిల్లల విషయంలో తల్లిదండ్రులు ఎంతో శ్రద్ధ వహించాల్సి వుంటుంది. రజని ఈ కోవకు చెందిన పిల్లే. అతిగారాబంతో ఇది మంచి ఇది చెడు అనికూడా తెలుసుకొనే అవకాశం లేకుండా పెంచుతున్నారు తలిదండ్రులు.

కొందరి పిల్లలకు అసలు వయస్సు పెరుగుతున్నా మానసిక వయస్సు మాత్రం చాలా మందకొడిగా పెరుగుతుంది.

"బాబాయ్! హేమపిన్ని వచ్చింది" అంటూ రజని లేచి తుర్రున గదినుంచి పరుగెత్తింది.

ఆలోచనల్లోవున్న చంద్రం ఎవరో వచ్చినట్లున్నారు. రజని వెళ్ళిందని మాత్రమే అర్థం చేసుకున్నాడు. యధాలాపంగా లేచి హాల్లోకి వచ్చాడు. ఎదురుగా ప్రసాదరావుగారు. అతని పక్కనే తెల్లని పట్టు దుస్తుల్లో తెల్లగా, సన్నగా, పొడవుగా, నాజూకుగావున్న ఓ యువతి నిల్చొని వుంది. ఆమెను చూస్తూనే చదువూ, సంస్కారమూ మూర్తీభవించాయన్నట్లనిపించింది. చంద్రానికి మరో క్షణంలో ఏదో భావం మెరుపులా బుర్రలో మెరిసి, గుండెలలో 'ధక్' మని నిలిచిపోయింది.

ఎవరామె? హేమ! అప్పుడే విచ్చిన మల్లెపువ్వులా వున్న ఈమె హేమా?

చంద్రం హృదయం తన పని మర్చిపోయింది ఓ క్షణకాలంపాటు. వెంటనే ప్రమాదాన్ని గ్రహించి తన నడక సాగించింది. కాని ఆ నడక క్రమం తప్పింది. చంద్రం మంత్రముగ్ధుడిలా హేమను అలాగే చూస్తూండిపోయాడు.

చంద్రాన్ని గుర్తించని ప్రసాదరావు కృష్ణారావు గదిలోకి వెళ్ళాడు.

తననే రెప్పవాల్చకుండా చూస్తున్న ఆ అపరిచిత యువకునివైపు చిత్రంగా చూసింది హేమ. ఆమె దృష్టి కుడిచెవుకు కిందగా మెడమీద వున్న పెద్ద పుట్టుమచ్చమీద పడింది.

"చంద్రం!" – పెదవులు కొంచెం కదిలాయి. కాని ధ్వని బయటకు రాలేదు. ఇంతకాలంగా ఆమె హృదయాకాశాన్ని ఏలుతున్న నెలవంక ఈనాడు అనుకోకుండా పూర్ణచంద్రుడై ఆమె ఎదుట నిలిచాడు. అనుకోకుండా ఆనందాంబుధిలో మునిగిపోయిన హేమకు ఊపిరి సలపటంలేదు.

తన బాబాయి, హేమ అలా ఒకర్నొకరు చూస్తూ నిలిచిపోవటం చూసిన రజనికి తమాషాగా అనిపించింది. తన చక్రాల్లాంటి పెద్ద కళ్ళను తమాషాగా తిప్పుతూ, ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తున్నది. మొన్నను తను చూసిన సినిమాలో నాగేశ్వరరావూ, కృష్ణకుమారీ అలాగే ఒకర్నొకరు చూసుకున్నారు – అనుకుంది. బాబాయీ, హేమ పిన్నీ ప్రేమించుకుంటున్నారు – బలే! బలే! రజని తను చదివే నవలల జ్ఞానం, చూసే సినిమాల అనుభవంతో, ఆ వయస్సు పిల్లలకు సాధారణంగా అర్థంగాని విషయాన్ని అర్థం చేసుకున్నట్లనుకొని ఆనందించసాగింది.

"ఏమోయ్ చంద్రం! ఎవరో అనుకున్నాను సుమా! ఎంత ఎదిగావు? చిన్నప్పుడు నిన్ను చూసి ఇంత స్ఫురద్రూపి వవుతావనుకోలేదు సుమా!" అంటూ ప్రసాదరావు, కృష్ణారావుతో కలసి, హేమా, చంద్రంల దగ్గరకు వచ్చాడు.

చంద్రం, హేమా ఒకేసారి ఉలిక్కిపడ్డారు. తన పరిస్థితిని అందరూ గ్రహించారేమోనని సిగ్గుపడిపోయింది. హేమ.

"కూర్చోమ్మా హేమా!" అన్నాడు కృష్ణారావు.

అందరూ కూర్చున్నారు. ప్రసాదరావు చంద్రం గురించి ఎన్నో ప్రశ్నలు వేశాడు. కాని చంద్రం కొన్నిటికి ముక్తసరిగా జవాబిచ్చాడు. కొన్నిటికి అసలు జవాబే ఇవ్వలేదు. గతాన్ని జ్ఞాపకం చెయ్యటం చంద్రానికి ఇష్టం లేనట్లుందని అర్థం చేసుకుని ప్రసాదరావు ప్రసంగాన్ని మార్చాడు. హేమ చదువుగురించీ, ఉద్యోగం గురించీ చెప్పసాగాడు.

"ఈ విషయాలన్నీ ఎవరిక్కావాలి? అసలు హేమకు పెళ్ళయిందో లేదో ఒక్కరూ చెప్పరేం?" అని తనలో తనే విసుక్కున్నాడు చంద్రం. ఆమెకు వివాహం అయిందో కాలేదో తెలుసుకోవాలనే ఆదుర్దా నిముష నిముషం పెరగసాగింది.

సరిగ్గా అదే భావం హేమలో కూడా ఆందోళన కలిగించసాగింది. ఆమె మౌనంగా అందరి మాటలు వింటూ కూర్చుంది. ఇన్ని విషయాలు అడిగే నాన్న, చంద్రానికి వివాహం అయిందో కాలేదో కనుక్కోడేం?

కృష్ణారావు కూడా తమ్ముడి వివాహం అయిందో కాలేదో తెలుసుకోవాలనే కుతూహలం తమ్ముణ్ణి చూచినప్పటినుంచీ పట్టుకుంది. తను అడిగితే తమ్ముడు చెప్పడు. ప్రసాదరావన్నా అడిగితే బాగుండును అనుకున్నాడు.

కాని ప్రసాదరావుకు అసలు ఆ అనుమానమే వచ్చినట్లు లేదు. చంద్రం రూపురేఖలూ, మాట్లాడే తీరు, అతనిలో కనిపిస్తున్న సంస్కారం చూసిన ప్రసాదరావు తన హేమ చాలా అదృష్టవంతురాలని మురిసిపోయాడు.

"చంద్రం! మీ అన్నయ్య ఎంత చక్కని గార్డెన్ పెంచాడో చూశావా?" - చంద్రం, హేమలు మాట్లాడుకోవటానికి అవకాశం కలిగించాలనే ఉద్దేశ్యంతో అన్నాడు ప్రసాదరావు.

"అబ్బే, ఇంకా వాడేమీ చూడందే!"

"ఇంకా మేం వచ్చి గంటకూడా కాలేదు. అప్పటినుంచి బాబాయి, కూతురు కబుర్లతోనే సరిపోయింది. హేమా! చంద్రానికి గార్డెన్ చూపించమ్మా!" అన్నాడు కృష్ణారావు, ప్రసాదరావు అభిప్రాయాన్ని తెలుసుకొని.

రజని చటుక్కున లేచింది. "బాబాయ్‌కి, నేను చూపిస్తాను మనతోట," అంది చంద్రం చెయ్యిపట్టుకు లాగుతూ. చంద్రం నవ్వుతూ లేచి నిల్చున్నాడు. హేమ కూడా లేచి తోటవైపు బయలుదేరింది. బాబాయి చెయ్యిపట్టుకుని రజని కూడా ఉత్సాహంగా బయలుదేరింది.

"చూడమ్మా రజనీ! వంటింట్లో అమ్మకు కాస్త సాయం చెయ్యి," అన్నాడు కృష్ణారావు.

"వంటవాడున్నాడుగా? నే నెందుకు అమ్మకు సాయం చెయ్యాలి?" అంది, తండ్రి పురమాయింపుకు కారణం తెలుసుకోలేని రజని.

"వంటసాయం కాదమ్మా! కప్పులూ, ప్లేట్లు అవీ తుడిచి సిద్ధంగా పెట్టవద్దూ? మరి బాబాయి వచ్చాడని ఇచ్చే పార్టీలో ఆమాత్రం కూడా పని చెయ్యకపోతే ఎలా?" అన్నాడు కూతుర్ని బుజ్జగిస్తున్నట్లు కృష్ణారావు.

రజని బుంగమూతి పెట్టుకొని అయిష్టంగా బాబాయి చెయ్యి విడిచిపెట్టి వంటింట్లోకి వెళ్ళింది. హేమా-చంద్రం తోటవైపు వెళ్ళారు.

"బాబాయి అంటే మా రజనికి ఎంత గౌరవమో చూడండి, అందుకే మొదటిసారిగా నేను పని చెప్పితే కిక్కురుమనకుండా వెళ్ళింది!" మురిపెంగా అన్నాడు కృష్ణారావు ప్రసాదరావుతో.

గార్డెన్ అంతా హేమా, చంద్రం మౌనంగా తిరిగారు. రకరకాల పూలచెట్లతో ఎంతో శ్రద్ధగా పెంచిన ఆ గార్డెన్ చంద్రానికి ఎంతో ఆహ్లాదకరంగా అనిపించింది. ముఖ్యంగా హేమ తనకూడా ఉండటం వల్లనే ఈ పూలతోట తనకు ఇంత అందంగా కనిపిస్తుందేమో ననుకున్నాడు చంద్రం.

ఇద్దరికీ ఓ యిష్టమైన కలగంటున్నట్లు అనుభూతి కలిగింది. కలలోనే మళ్ళీ తమతమ కలల్లో తేలిపోతున్నారు ఎవరికీ మాట్లాడాలని లేదు. మాట్లాడితే అంత ఆనందాన్నిస్తున్న ఆ అనుభూతి ఎక్కడ కరిగిపోతుందోనని వారి భయం. కృష్ణారావూ, ప్రసాదరావూ వాళ్ళిద్దర్నీ ఇలా తోటలోకి పంపించటానికి ప్రయత్నించినప్పుడే హేమ అవివాహిత అని తెలుసుకున్నాడు చంద్రం.

అలా ఎంతసేపు తోటంతా కలియతిరిగారో వారికే తెలియదు. మల్లెపందిరి దగ్గరకు రాగానే అక్కడున్న సిమెంటు బెంచీని చూపిస్తూ "ఇక్కడ కూర్చుందాం" అన్నాడు చంద్రం. హేమ అంగీకారసూచకంగా తల ఆడించింది.

చంద్రాన్ని మళ్ళీ మళ్ళీ చూడాలని ఉంది హేమకు. తనివితీరా చూడాలని వుంది. చంద్రం తనను చూడటం లేదనుకున్నప్పుడల్లా చూస్తున్నది చంద్రం ఆ విషయాన్ని

గమనించకపోలేదు. చంద్రం ముఖంలోకి చూసి మాట్లాడటానికి ఏదో బలహీనత హేమను వశం చేసుకుంది. ఎక్కడలేని సిగ్గు ముంచుకొస్తూంది. ఆ విషయం ఆలోచిస్తే హేమకు చాలా ఆశ్చర్యం అనిపిస్తుంది. ఏమిటి ఈ అనుభూతి! స్త్రీ, మగవాడిని చూసి సిగ్గుపడుతుందంటే ఆమెలోని బలహీనతే అందుకు కారణం అనుకొనేది తను. చీటికి మాటికి మగవారిముందు సిగ్గుపడాలంటే తనకు చాలా సిగ్గు. కానీ ఈరోజు తనకు తెలియకుండానే తనలో సిగ్గు ప్రవేశించింది.

"హేమా!" చంద్రం హేమ చేతిని మృదువుగా తన చేతిలోకి తీసుకున్నాడు.

హేమ ఉలిక్కిపడి చేతిని లాగేసుకుంది. కాని అలా చేసిన వెంటనే చంద్రం బాధపడుతున్నాడేమోనని అతని ముఖంలోకి చూస్తూ-

-అవే కళ్ళు! పెద్ద పెద్ద కనురెప్పలు కొంచెం వాలినట్లుండే ఆ కళ్ళు తనకెంతో ఇష్టం. చంద్రం కళ్ళు అందమైన ఆడపిల్లకు వుండవలసిన కళ్ళు. ఆ కళ్ళే చంద్రం ముఖానికి సౌమ్యతను కలిగిస్తూ, చూడగానే మంచివాడు అనే భావాన్ని కలిగిస్తాయి.

"ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" - చంద్రం ప్రశ్నకు హేమ తన ఆలోచనల నుంచి బయటపడింది.

"నువ్వు.... మీ....రు రాసిన పుస్తకాలు కొన్ని చదివాను," అంది హేమ గాబరాగా, చంద్రాన్ని మాటల్లోదించే ధోరణిలో.

చంద్రం పకపక నవ్వాడు. హేమ చంద్రం ముఖంలోకి తెల్లబోయి చూసింది, ఆ నవ్వుకు కారణం తెలియక.

"ఏమిటి హేమా! 'మీరు' అంటున్నావు? ఈ ఎనిమిది సంవత్సరాల్లోనే నీ మనస్సుకు అంతదూరం అయిపోయానా? అప్పుడు నేనుకూడా నిన్ను 'మీరు' అనాలికాబోలు!" అన్నాడు చంద్రం, ఆఖరుమాటల్ని కొంచెం సాగదీస్తూ. హేమ వస్తున్న నవ్వును పెదవులతోనే అతికష్టంమీద బంధించింది.

"హేమా! ఎంత పెద్దదానివయావు?" అన్నాడు చంద్రం హేమ సౌందర్యాన్ని కళ్ళతోనే తాగుతూ, తననే రెప్పవాల్చకుండా చంద్రం చూస్తుంటే హేమకు కొంచెం ఇబ్బందిగా అనిపించింది.

"అయితే చంద్రం! నువ్వు ఇక్కడ నుంచి పారిపోయావుగదా? ఆ తరవాత ఏం జరిగింది? ఎక్కడెక్కడికి వెళ్ళావు?... ఏం చదివావు? చెప్పవూ?" అంది హేమ చంద్రాన్ని వేరే మాటల్లోకి దించాలనే ఉద్దేశంతో.

హేమ ప్రశ్నలకు చంద్రం మనస్సు చివుక్కుమంది. అవును, తను ఇంటినుంచి పారిపోయాడు. పైగా, దొంగతనపు నేరాన్ని నెత్తిన వేసుకొని పారిపోయాడు. హేమ ఆనాడు తనను దొంగగా భావించింది. ఈనాడు? ముఖ్యంగా ఇంత కాలానికి కలుసుకున్న ఈ క్షణంలో కూడా హేమ ఆ విషయాన్నే గుర్తుచేస్తున్నది: సిగ్గుచేత చెయ్యి లాగేసుకున్నదని తను భావించాడు. ఎంత పొరపాటు! హేమ తను - ఏం చదివాడో, ఎన్ని డిగ్రీలు పొందాడో, దొంగగా పారిపోయిన తను - ఈ మధ్యకాలంలో ఏమేమి చేశాడో తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నది. అంటే?....

గతాన్ని త్రవ్వి చంద్రాన్ని బాధించానని తెలుసుకుంది హేమ. చంద్రం ముఖంలోని విషాదాన్ని చూసి హేమ తను తప్పుచేసినట్టు బాధపడింది.

"చంద్రం! నువ్వు రాసిన కవిత్వం ఏదయినా వినిపించవూ?" ప్రసంగాన్ని మార్చే ఉద్దేశ్యంతో ఉత్సాహంగా అడిగింది హేమ.

"కవిత్వమా? నేను కవిత్వం ఏమీ రాయలేదు," అన్నాడు చంద్రం ముభావంగా.

విచారంగా ఎక్కడకో చూస్తున్న చంద్రం ముఖంలోకి చూడసాగింది హేమ తనివితీరా. విచారంతో అమాయకంగా కనిపిస్తూన్న చంద్రం ముఖం ఎంతో అందంగా కనిపించింది హేమకు. కనీ కనిపించని పాపిడితో వెనక్కువిరిచి దువ్విన నొక్కులు లేని ఆ జుత్తు లోపలకు వేళ్ళుదూర్చి గుప్పెడునిండా జుత్తు పట్టుకొని వూపుతూ "ఇంతలోనే అంత కోపమా?" అని అడగాలనిపించింది హేమకు.

"ఒక పాట పాడనా చంద్రం!" అంది హేమ. ఆ మాట వినగానే తన పాటలంటే ఒకప్పుడు చెవి కోసుకొనే చంద్రం ముఖం సంతోషంతో చాటంత అవుతుందని ఆశించిన హేమ నిరాశతో కుంగిపోయింది.

"ఊఁ" అన్నాడు చంద్రం ఎలాటి ఉత్సాహాన్నీ చూపకుండానే.

హేమ పాడటం మొదలుపెట్టింది. చంద్రం ఉలిక్కిపడి హేమ వైపు చూశాడు. హేమ తలవంచుకొని పాట పాడుతున్నది. చంద్రానికి ఆశ్చర్యం, ఆనందం ఒకేసారి కలిగాయి. ఆ పాట తను చిన్నప్పుడు రాసింది. ఆనాడు స్కూలు వార్షికోత్సవంలో ఆ పాటకే బహుమతి లభించింది. తనకు గుర్తులేని ఆ పాటను హేమ ఎంత పదిలంగా తన మనసుస్సులో దాచుకుందో! ఆ పాటలో పెద్ద విశేషం ఏమీ లేదు. ఏదో చిన్న తనపు తెలిసీ తెలియని భావాలు - కాని, హేమ దానికి చక్కని బాణీకట్టి పాడుతుంటే ఎంతో మధురంగా వుంది ఆ పాట. హేమను తను అర్థం చేసుకున్నాడు.

పాట ఆగిపోయింది. "ఎంత బాగుంది?" అన్నాడు చంద్రం తన్మయత్వంతో.

"ఏమిటి బాగుంది? నా పాటా లేక నీ కవిత్వమా?" కొంటెగా నవ్వింది హేమ. చంద్రం శ్రుతి కలిపాడు.

"చంద్రం!" ఏదో అడగాలని మళ్ళీ అడగలేక ఆగిపోయింది హేమ.

"ఊఁ అడుగు! ఆగిపోయావేం! నీ ప్రశ్న ఏమిటో నేను చెప్పనా?" అంటూ హేమ కళ్ళలోకి సూటిగా, చిలిపిగా చూశాడు చంద్రం.

హేమ సిగ్గుతో ముడుచుకుపోయింది మల్లెమొగ్గలాగ.

"నేను ఇంకా వివాహం చేసుకోలేదు కాని త్వరలోనే చేసుకోబోతున్నాను!" లేని గాంభీర్యాన్ని గొంతులోకి తెచ్చుకుంటూ, హేమ ముఖంలో దేన్నో వెతుకుతూ అన్నాడు చంద్రం.

సిగ్గుదొంతర్లు దొర్లుతూంటే ఆమె ముఖం వెన్నెల్లో ఓ వింత సోయగాల్ని వెదజల్లుతోంది.

"ఎవర్నని అడగవేం?"

చంద్రంలో ఇంత కొంటెతనం, చిలిపితనం కూడా ఉన్నాయని హేమ అనుకోలేదు. హృదయవీణను ఎవరో మీటినట్లయింది.

"నే నెందుకడగటం? నువ్వే చెప్పు!" అంది ధీమాగా, ఆ చెప్పబోయే పేరు తనదేనని ఊహించుకుని హేమ.

హేమ ధీమాను చంద్రం అపార్థం చేసుకున్నాడు. అయితే హేమకు తన వివాహంతో ప్రమేయం లేదన్నమాట! కేవలం చిన్ననాటి స్నేహితునిగానే గౌరవిస్తున్న దన్నమాట!. అవును. ఆమె చదువూ, సంఘంలో ఆమెకున్న గౌరవం, చిన్నతనంలోనే దొంగగా ఇల్లు విడిచి పారిపోయిన ఓ వ్యక్తిని వివాహం చేసుకోవాలనే భావాన్ని కలలో కూడా రానివ్వవు. చంద్రానికి వెంటనే ఓ ఊహ తట్టింది. హేమ మనస్సును తను అర్థం చేసుకోలేకపోతున్నాడు. పరీక్షించటానికి మంచి అవకాశం లభించింది. ఈ అవును, కాదు అనే మీమాంసలో పడి కొట్టుకోవటం అనవసరం.

"చెప్పమంటావా? నేను వివాహం చేసుకోబోయే అమ్మాయికి నీ అంత చదువూ సంస్కారమూ లేదు. సంఘంలో ఏలాంటి గౌరవమూ మనిషికి ఓ ప్రత్యేకమైన వ్యక్తిత్వములాటివి ఏమీలేవు. ఒక అమాయకురాలైన బీద అమ్మాయి," అన్నాడు చంద్రం గబగబా. అతని స్వరంలో తీవ్రత కనిపిస్తోంది.

హేమ ఉలిక్కిపడి చంద్రం ముఖంలోకి చూసింది. అకస్మాత్తుగా ఆమె ముఖంలోని చైతన్యం గడ్డకట్టినట్లు కనిపించింది చంద్రానికి. అది చూసిన చంద్రం ముఖంలోకి ఓ కొత్తకాంతీ, ఉత్సాహం ఉబికి వచ్చాయి. 'దొంగ దొరికిపోయింది, బతికిపోయాను' అనుకున్నాడు. కింది పెదవిని బిగించి వచ్చే నవ్వును ఆపుకుంటూ హేమ చేతిని తన చేతిలోకి తీసుకొని గట్టిగా నొక్కాడు.

హేమ ఉలిక్కిపడి చంద్రం ముఖంలోకి చూసింది. కేవలం తనను ఏడిపించటానికే అలా చేశాడని తెలుసుకున్న హేమ 'అమ్మయ్య' అనుకుంది మనసులోనే. చంద్రం చేతిలోని తన చేతిని లాక్కోబోయింది. కానీ చంద్రం వదల్లేదు.

"నా చెయ్యి వదులు. నీ కాబోయే భార్య చూస్తే ఊరుకోదుసుమా!" అంటూ చెయ్యి లాక్కుంది హేమ.

"ఆ అమ్మాయి చాలా మంచిది, చూసినా ఏమీ అనుకోదు," అన్నాడు చంద్రం నవ్వుతూ.

"అలాగా? అయితే ఆ అమ్మాయి ఎలా వుంటుందో కాస్త వర్ణించండి కవిగారూ!" అంది హేమ ఎగతాళిగా.

హేమను కాస్త ఉడికించాలనిపించింది చంద్రానికి. వర్ణించాలంటే వెంటనే ఏ రూపమూ కళ్ళకు కట్టలేదు. ఇంతలో గౌరి గుర్తొచ్చింది.

"వర్ణించమన్నావా? మళ్ళీ ఉడుక్కుంటే లాభంలేదు."

"మధ్యలో నా కెందుకు ఉడుకుబోతుతనం?"

"అలాగేం? అయితే విను. చామని చాయకంటే ఓ చాయ ఎక్కువే అనుకో. అంత ఎత్తూకాదు – అంత పొట్టీకాదు. కొంచెం బొద్దుగా వుంటుంది. ముఖంలో

దీనత్వం, కళ్ళలో అమాయకత్వం, బిర్రుగా బిగించి రిబ్బనుకట్టి, తేలుకొండిలా చివర వంకరతిరిగి పైకి లేచిఉండే జడ, బలేగా వుంటుందిలే."

హేమ ముఖంలో భావ పరివర్తనని గమనించిన చంద్రం ఇంకా చెప్పుకు పోసాగాడు:

"నీతో ఆ అమ్మాయిని పోల్చాలంటే ఒక చక్కని ఉదాహరణతో చెప్పవచ్చు."

"ఏమిటది?" ఎంత దాచ ప్రయత్నించినా హేమ స్వరంలో ఆతృత, వుడుకు బోతుతనం కొట్టొచ్చినట్లు కనిపిస్తూనే వున్నాయి.

"నువ్వెప్పుడయినా అడవిమల్లెను చూశావా?" చంద్రం హేమ కళ్ళలోకి చూస్తూ ప్రశ్నించాడు. చంద్రం కళ్ళలో కదిలిపోతున్న కాంతిరేఖలను చూసి హేమకు వళ్ళు మండిపోయింది. ఆ పిల్ల గురించి చెబుతుంటేనే కళ్ళు ఆనందంతో మెరిసిపోతున్నాయే, ఆ అమ్మాయిని చూస్తుంటే ఎలా వుంటాయో అనుకుంది హేమ.

"అడవిమల్లెను ఎప్పుడూ చూడలేదా హేమా?"

"లేదు" అంది హేమ – వుబికివస్తున్న దుఃఖాన్ని దిగమింగుకుంటూ.

"నువ్వు ఎన్నోసార్లు మద్రాసు వెళ్ళావు. అక్కడ కదంబంలో మల్లెపూలను చూసేవుంటావు. అవి దూరంనుంచి చూట్టానికి మామూలు మల్లెపూలలాగే వుంటాయి. కానీ, దగ్గిరగా చూస్తే మామూలు మల్లెలోని నాజూకుతనం లేకుండా కొంచెం మొరటుగా కనిపిస్తాయి. వాటికి, మంచిమల్లెకు వుండే సుగంధం కూడా వుండదు. మనస్సులను ఆకర్షించలేని ఆ పూలు వెలవెలబోతుంటాయి."

"చాలా గొప్పగా వుంది పోలిక!" అంది హేమ ఉడుకుబోతుతనంతో.

తమాషాగా మొదలుపెట్టిన చంద్రం చెప్పుకుపోతూంటే గౌరి కళ్ళకు కట్టినట్లు అయింది.

"అవును, ఆ అమ్మాయి కూడా అందంలో నీకు తీసిపోదుకాని, మంచిపోషణలేని శరీరం. కాయకష్టానికి అలవాటుపడ్డ శరీరం కావటం వల్ల నీ అంత నాజూకుగా కనిపించదు. విద్యాగంధం లేదు. సభ్యసమాజంలో పెరగలేదు. కాబట్టి హృదయ వికాసంలేదు. ఆమెకూ అన్ని అవకాశాలూవుంటే నీలాగే...."

"చంద్రం! ఇక చాలు ఆపు" అంది హేమ ఆవేశంగా.

చంద్రం ఆవేశంనుంచి బయటపడ్డాడు. తను అనుకున్నదొకటీ, మాట్లాడింది మరొకటీ. గౌరి స్థితీ, గౌరిలాంటి ఆడపిల్ల స్థితీ తలచుకొని తను అసలు విషయం మర్చిపోయి, ఆవేశంగా ఏదో ఏదో మాట్లాడేశాడు. తనను తను సంబాళించుకున్నాడు. ప్రశాంతంగా హేమ ముఖంలోకి చూచాడు.

కందగడ్డలా, కోపంతో, అవమానంతో ఎర్రబడ్డ హేమ ముఖం చూసి చంద్రం ఫక్కున నవ్వాడు. ఇదంతా తనను ఏడిపించటానికి అల్లిన ఓ కట్టుకథ మాత్రమే అని తెలుసుకొన్న హేమ మనస్సు శాంతపడింది.

"మొత్తంమీద రచయిత వనిపించుకున్నావు?" అంది హేమ కోపాన్ని అభినయిస్తూ.

"బాబాయ్! అమ్మ భోజనాలకు పిలుస్తోంది" అంటూ పరుగెత్తుకొచ్చింది రజని.

"ఓణీ వేసుకుంటే రజని పెద్దపిల్లలా వుందికదూ చంద్రం!" అంది హేమ, రజనిని చూసి నవ్వుతూ. పవిట సర్దుకుంటున్న రజని నెత్తిమీద చిన్నగా మొట్టికాయ వేశాడు చంద్రం.

"ఏంటయ్యా, కొడతావ్?" అంటూ రజని బాబాయి చెయ్యిపట్టుకొని బయలుదేరింది.

భోజనాల దగ్గిర అందరూ చాలా సంతోషంగా వున్నారు. ఎన్ని విషయాలో చర్చించుకున్నారు. వదినగారు మరిది విస్తట్లో మరీ మరీ వడ్డించింది.

తను పుట్టిన ఇంట్లో, తనవారందరి మధ్యా, ముఖ్యంగా హేమ పక్కన కూర్చొని భోజనం చేస్తున్న చంద్రానికి తన అంత అదృష్టవంతుడు ఇంకొకడు లేడనిపించింది.

"చంద్రం! చూడు నాయనా! పెద్దవాణ్ణి చెబుతున్నాను. మరోలా భావించకు-"

ప్రసాదరావు ప్రారంభించిన ఉపోద్ఘాతం అర్థంకాక ప్రశ్నార్థకంగా చూశాడు చంద్రం.

"నీ ఇల్లు, వాకిలీ, ఇంత ఆస్తీవున్న నీవు - ఎక్కడో, ఎవరిపంచనో పడివుండాల్సిన కర్మేంకాలింది చెప్పు చంద్రం! మీ అన్నయ్య ఎంత బాధపడుతున్నాడో తెలుసా?"

చంద్రం ముఖం చిట్లించుకున్నాడు. ఏదో అనాలన్నంత ఆవేశం వచ్చింది. కాని గొంతులోని మాటల్ని నోటివరకూ రానివ్వకుండా అణచుకున్నాడు. అందరూ అంత ఆనందంగా వున్న ఆ సమయంలో తను ఆవేశంతో అశాంతిని రేపటం మంచిది కాదనుకున్నాడు.

చంద్రం మౌనాన్ని అంగీకారంగా తీసుకున్న ప్రసాదరావు "ఈ రాత్రికే సామాను తెచ్చేసుకో చంద్రం!" అన్నాడు ఉత్సాహంగా.

చంద్రం అన్న ముఖంలోకి చూశాడు. కృష్ణారావు కళ్ళల్లో ఆదుర్దా స్పష్టంగా కనిపించింది. కాంతమ్మ అప్పుడే వంటింటివైపు వెళ్ళటంవల్ల ఆమె అభిప్రాయాన్ని తెలుసుకోలేకపోయాడు చంద్రం. అతని కళ్ళు అప్రయత్నంగానే హేమ వైపుకు మళ్ళాయి. తల వంచుకుని పళ్ళెంలో పులుసన్నం కలుపుతున్న వైఖరిచూస్తే, హేమ మనస్సు ఎక్కడో వున్నట్లనిపించింది. ఆమె తలఎత్తి చంద్రంవేపు చూసింది.

"వచ్చేయి చంద్రం! కనీసం నా కోసమయినా వచ్చేయి!" హేమ కళ్ళతోనే ప్రాధేయపడుతున్నట్లనిపించింది చంద్రానికి.

"వచ్చేయ్ బాబాయ్! నువ్వు రాకపోతే నేనూ నీదగ్గిరకే వచ్చేస్తా." రజని ఏడుపుగొంతు విన్న చంద్రం ఉలిక్కిపడ్డాడు.

"వస్తానమ్మా! ఇకనుంచి ఇక్కడే ఉంటాను" అన్నాడు చంద్రం ఆలోచించకుండానే.

అందరి ముఖాలూ ఆనందంతో వెల్లి విరిశాయి. హేమ ముఖం మెర్క్యూరీ లైటులా ఒక్కసారి వెలిగింది.

"భోజనం కాగానే నువ్వూ, రజనీ కార్లోవెళ్ళి సామాను తీసుకురండి" అన్నాడు కృష్ణారావు సంతోషంగా.

"ఇవ్వాళకాదు. ప్రకాశం ఊళ్ళోలేడు. ప్రకాశం వచ్చేంతవరకూ నేను అక్కడే వుంటాను. అతను రేపో ఎల్లుండో రావచ్చు. ఆ తరవాత ప్రకాశానికి చెప్పి, రెండు మూడు రోజుల్లో వచ్చేస్తాను -" అన్నాడు.

ఆ మాట లంటున్నప్పుడు చంద్రం ముఖంలోని గాంభీర్యాన్ని చూచి అంతకంటే బలవంతంచేసే ధైర్యం ఎవరికీ లేకపోయింది.

భోజనాలయాయి. తాంబూలాలు వేసుకుంటూ, అంతా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.

ఇంతలో పనిమనిషి వచ్చి ఎవరో అమ్మాయి చంద్రంబాబుకోసం వచ్చిందనీ, వెళ్ళమంటే వెళ్ళకుండా గంటసేపటినుండి గేటులో గొడవ చేస్తూందనీ చెప్పింది. అన్ని కళ్ళూ చంద్రంవైపు తిరిగాయి - ఆశ్చర్యంగా, అనుమానంగా. చంద్రంకూడా ఏమీ అర్థంకాక ఓ క్షణకాలంపాటు తెల్లబోయాడు.

వెంటనే అతని బుర్రలో గౌరి మెరుపులా మెరసింది. గాబరాగా లేచి బయటకొచ్చాడు. గౌరి గేటులో గూర్ఖావాడితో తగాదా పడుతోంది లోపల ప్రవేశించటానికి.

గౌరిని చూడగానే చంద్రంలోని నవనాడులూ కుంగిపోయాయి. అంతలోనే అంతులేని కోపంవచ్చింది. గబగబా రెండు అంగుల్లో గేటుచేరాడు.

"ఏం, మళ్ళీ ఇక్కడికెందుకొచ్చావ్?" గద్దించాడు చంద్రం.

"సినిమాకు తీసుకెళతానని ఆ నరకంలోకి తోస్తావా? నిన్నేవెూ మంచి వాడనుకున్నాను. అన్నీ దొంగమాటలే-" తిరిగి తిరిగి అలసిపోయివున్న ఆమె గొంతులో కోపం, దుఃఖం పెనవేసుకున్నాయి. కళ్ళలో తిరిగిన నీటిని బలవంతంగా ఆపుకుంటోంది కట్టలు తెగకుండా.

గౌరి మీద చంద్రానికి జాలివేసింది. కాని, వెంటనే తన పరిస్థితి జ్ఞాపకం వచ్చి గాబరాపడ్డాడు.

"అనవసరంగా గొడవచెయ్యకు. ముందు నువ్విక్కడినుంచి పోతావా పోవా?" బెదిరించినట్లు అన్నాడు చంద్రం.

"పోతాను, ముందు నా పెట్టె నా కిచ్చెయ్యి, అందులోనే నా బట్టలూ, సామానూ ఉంది. ఇంటి తాళంచెవి నీ దగ్గరేగా వుంది," అంది రోషంగా గౌరి. కన్నీరు కట్టలుతెంచుకుంది. అప్పటికే ఇంట్లోవాళ్ళంతా బయటకొచ్చి ఇద్దర్నీ ఆశ్చర్యంగా చూస్తున్నారు. రజని పక్కనే నిల్చొని తమాషా చూస్తున్నట్లు ఆనందిస్తున్నది.

గౌరి పలికిన చివరిమాటలు అందరి మనసుల్లో అనుమానాన్ని ధృవపరిచింది. కాంతమ్మ భర్త ముఖంలోకి చూసి అదోలా వ్యంగ్యంగా నవ్వింది. కృష్ణారావు తల సిగ్గుతో, అవమానంతో వాలిపోయింది. గబగబా లోపలకు వెళ్ళిపోయాడు. ప్రసాదరావు కళ్ళలో అవమానం, ముఖంలో జుగుప్స ఉబికివచ్చాయి. హేమకు దుఃఖం వచ్చింది. అంతలోనే చంద్రం అంతకుముందే చెప్పినమాటలు గుర్తొచ్చాయి. ఈ అమ్మాయి అచ్చం చంద్రం వర్ణించిన అమ్మాయిలాగే వుంది. హేమ మనస్సంతా ఏదో అసహ్యంతో నిండి చీదర చీదరగా అనిపించింది.

చంద్రం అందరి ముఖాలవైపూ మార్చి మార్చి చూశాడు. తను ఎలాంటి పరిస్థితిలో పడిపోయాడో తెలుసుకున్నాడు. ఒక్క క్షణంకూడా అక్కడ నిల్చోలేకపోయాడు. విసురుగా గేటు తెరుచుకొని బయటకు వెళ్ళబోయాడు.

"బాబాయి... ఎక్కడికి? నేనూ వస్తా!" పరిస్థితిని అర్థం చేసుకోని రజని అమాయకంగా అంటూ బాబాయి చెయ్యి పుచ్చుకుంది.

చంద్రం ఆగి, ఆప్యాయంగా రజని తలమీద నిమిరాడు. కళ్ళలో నీరు తిరిగింది. "నువ్వన్నా నన్నర్థం చేసుకోమ్మా!" అన్న భావం రజని తల నిమురుతున్న అతని చేతి స్పర్శలో ఇమిడి వుంది. ఏదో అనబోయాడు. ఇంతలో కాంతమ్మ సుడిగాలిలా వచ్చింది. రజని చెయ్యి పట్టుకొని బిరాబిరా లోపలకు ఈడ్చుకుపోయింది.

"ఆ బజారు మనషుల్తో నువ్వెక్కడికి పోతావే?" లోపలకు వెళుతూ అన్న కాంతమ్మ ఎత్తిపొడుపు మాటలు శూలాల్లా గుచ్చుకున్నాయి చంద్రం చెవులకు.

గౌరి రెక్క పట్టుకొని మొదటగా రోడ్డుమీదకు లాక్కెళ్ళాడు చంద్రం. ఎదురుగా వస్తున రిక్షాను ఆపి గౌరిని ఎక్కమని తనూ ఎక్కి కూర్చున్నాడు.

చంద్రంలో కోపం పొగలు కక్కుతూంది. మరోవైపు బాధా, అవమానం – ఇన్నిటికీ కారణమయిన గౌరిని నమిలి మింగేయాలనిపిస్తోంది. చేతి వ్రేళ్ళతో కణతలు నొక్కుకుంటూ తనను తానే సంబాళించుకోటానికి ప్రయత్నిస్తున్నాడు. చంద్రం బుర్ర పనిచేయటం మానేసింది. ఏ ఆలోచనా లేదు. కేవలం ఏదో హోరుతో తల బద్దలవుతూంది.

గౌరికి తను చాలా పెద్ద తప్పే – ఏదో చేశానని అర్థం అయింది. భయంతో రిక్షాలో ఒదిగి ముడుచుకొని కూర్చుంది. ఏ క్షణంలో బద్దలవుతుందోనని భయపడుతూ అగ్ని పర్వతం పక్కనే కూర్చొని వున్న మానవుని మానసిక పరిస్థితిలా వుంది గౌరి మానసిక స్థితి.

రిక్షా కొరిటపాడు చేరింది. అప్పటికే పదిన్నర అయింది. గుడిసెల్లో సందడి సద్దుమణిగి ఉంది. చంద్రం రిక్షా వాడికి డబ్బులిచ్చి యంత్రంలా ప్రకాశం ఇంటివైపు నడిచాడు. గౌరి బిక్కుబిక్కుమంటూ చంద్రం వెనకే వెళ్ళింది.

చంద్రం తాళంతీసి లోపలకు వెళ్ళాడు. గౌరి ఇంట్లోకి వెళ్ళటానికి జంకుతూ వాకిట్లోనే నిలబడింది. మరో క్షణంలో చేతిలో ట్రంకుపెట్టెతో చంద్రం బయటకు వచ్చాడు. ఆ పెట్టెను దభీమని గౌరి కాళ్ళముందు పడేసి గిర్రున వెనక్కు తిరిగివెళ్ళి తలుపు గడియ పెట్టుకున్నాడు.

మంచంమీద నడుం వాల్చిన చంద్రానికి దుఃఖం పొర్లుకొచ్చింది. కళ్ళవెంట నీళ్ళు కారిపోతున్నాయి. కొంతసేపటికి తలలో హోరు తగ్గింది. మనస్సుకు కొంత ఆలోచించే శక్తి వచ్చింది.

ఎవరో ఏడుస్తున్న వెక్కిళ్ళు వినిపించాయి చంద్రానికి. అయితే, గౌరి వెళ్ళిపోలేదన్నమాట! తను ఎంత మొరటుగా ప్రవర్తించాడు! తన సంస్కారం ఇంతేనా? అర్ధరాత్రిపూట ఆ పిల్ల ఎక్కడకు వెళుతుందని తను ఎందుకు ఆలోచించ లేకపోయాడు?

ఎందుకు ఆలోచించాలి? ఆ పిల్ల ఎవరూ? తనెవరూ? తనను గురించి ఎవరు బాధపడుతున్నారు? అలా జాలిపడేగా ఇప్పుడు ఇంత అవాంతరం కొనితెచ్చుకున్నాడు.

గౌరి వెక్కిళ్ళు అంతకంతకూ తారాస్థాయి నందుకొంటున్నాయి. చంద్రం మనస్సులో చెయ్యిపెట్టి కలచినట్లయింది. టవల్‌తీసి గట్టిగా చెవులుమీదగా తలకు చుట్టుకున్నాడు-ఆలోచనలను కట్టిపెట్టి నిద్రపోవటానికి ప్రయత్నించాడు.

తనను విధి ఎందుకు ఆడిస్తోంది? ఒక గంట క్రితం తనకన్నీ ఉన్నాయని, ప్రపంచంలో తన అంత అదృష్టవంతుడు లేడనీ అనుకున్నాడు. కాని అంతలోనే విధి తన అంత దురదృష్టవంతుడు లేడని రుజువు చేసింది. మానవుణ్ణి ఆడించే సూత్రాలు విధి చేతిలో వుంటాయా? మానవుడు కేవలం నిమిత్తమాత్రుడేనా? తనకు తెలిసి తను ఎలాటి పాపమూ చెయ్యలేదే? మరి తనకు ఈ శిక్ష ఏమిటి? తన అదృష్టంలో తన వాళ్ళనే వారిదగ్గర వుండే రాత లేదా?

ఈ గౌరి ఎవరు? ఎక్కడ పుట్టిందో? ఎక్కడ పెరిగిందో? తన జీవితంలోకి అకస్మాత్తుగా సుడిగాలిలా ఎందుకు ప్రవేశించాలి?

తన అన్నా – వదినా తనవంక ఎలా చూశారు? వదినె ముఖంలోని ఆ నవ్వును తన జన్మలో మరచిపోలేడు. అంతవరకూ ఆమె చూపిన ఆదరణ కేవలం నటన మాత్రమేనా? తన అన్న అవమానంతో, అభిమానంతో తల దించుకున్నాడు. తను అంత అవమానకరమైన పని ఏం చేశాడు? ప్రసాదరావు చూపుల్లో ఎంత తిరస్కారం?

హేమ కూడా తనను అనుమానించింది. ఆ రోజు కూడా ఇలాగే తనను దొంగగా అనుమానించింది. ఆమె హృదయ సంస్కారం అంతేనా?

వాళ్ళనెందుకు నిందించాలి? ఆ పరిస్థితులు అలా వచ్చాయి

తను ఎంత పొరపాటు పని చేశాడు? హేమను పరీక్షించటానికి తను మరో అమ్మాయిని వివాహం చేసుకోబోతున్నట్లు చెప్పాడు. పైగా ఆ పిల్లను, గౌరిని దృష్టిలో పెట్టుకొని, వర్ణించాడు. అంతలోనే గౌరి అక్కడకు రావటం, హేమలో అనుమానం ప్రవేశించటంలో ఆశ్చర్యం లేదు. మళ్ళీ హేమకు తన ముఖం ఎలా చూపించగలడు? ఇక తనను వారెవరూ నమ్మలేరు. తన ఆశలన్నీ అడియాశలయ్యాయి. ప్రకాశాన్ని చూసి తను శాశ్వతంగా ఆంధ్రదేశం నుంచి వెళ్ళిపోతాడు! ఎక్కడకు?

ఇక ముందుకు ఆలోచించలేకపోయాడు. లేచి టైం చూశాడు. మూడు అయింది. బయట ఎలాటి అలికిడీ లేదు. గౌరి వెళ్ళిపోయి వుంటుందా? ఈ రాత్రిపూట ఎక్కడకు వెళ్ళి వుంటుంది?

కుతూహలంకొద్దీ తలుపు తీసుకొని బయటకు వచ్చాడు. బయట గుడిసెముందు వసారాలో ఒకమూల ముడుచుకొని వుంది గౌరి. వెన్నెల ముఖంమీద పడుతూంది. కన్నీళ్ళతో తడిసిన ముంగురులు చెంపలకు అతుక్కుని వున్నాయి. పెదవులమీద చిరునవ్వు, మంచి నిద్రలో వున్న ఆమె ముఖం అమాయకత్వానికి ప్రతిబింబంలా కనిపిస్తూంది.

నిద్రలో నవ్వుతూంది. "బహుశా ఈ ప్రపంచంలో ఆశించి అందని వస్తువేదో ఆమెకు స్వప్నంలో అందుతున్నట్లు కనిపిస్తోందేమో!" అనుకున్నాడు చంద్రం.

అలా వంటరిగా చలిలో నిద్రపోతున్న గౌరిమీద చంద్రానికి జాలి వేసింది. తను చాలా కఠినంగా ప్రవర్తించానని బాధపడ్డాడు.

వంగి - గౌరిని కుదుపుతూ లేపాడు. ఉలిక్కిపడి లేచి కూర్చుంది గౌరి. ఎదట నిల్చున్న చంద్రాన్ని చూచింది భయంగా.

"లే. లోపలకివచ్చి పడుకో. రేపు తెల్లవారగానే వెళ్ళిపో," అంటూ లోపలకు వెళ్ళాడు చంద్రం.

గౌరి నిద్రమత్తులోనే పెట్టెతీసుకుని లోనికి వెళ్ళింది.

# 13

తలుపుమీద ఎవరో దబాదబా బాదుతున్నారు. మంచి నిద్రలో ఉన్న చంద్రం ఉలిక్కిపడి లేచాడు. కిటికీనుంచి లోపల పడుతున్న కిరణాలు చంద్రం ముఖంమీద చురుగ్గా పడ్డాయి. దిగ్గున లేచి కూర్చున్నాడు. తలుపు ఎవరోకాని చాలా గట్టిగానే కొడుతున్నారు. ఎవరైతే మాత్రం అంత గట్టిగా, ఊపిరి తీసుకోనివ్వకుండా కొట్టాలా ఏం? విసుగ్గా వెళ్ళి తలుపు తెరిచాడు చంద్రం.

అంత పొట్టీ - పొడుగూకాని ఓ యువకుడు ఎదురుగా కనిపించాడు. ఆ యువకుడు లావు కాకపోయినా చంద్రం అంత సన్నగా, నాజూకుగా మాత్రం లేడు. ఆ వచ్చిన యువకుడు చంద్రంవైపు ఆశ్చర్యంగా చూశాడు.

"ఎవరు కావాలండీ? ప్రకాశం ఊళ్ళో లేడు" - నిద్రమత్తు ఇంకా వదలని చంద్రం బలవంతంగా వున్న కనురెప్పల్ని పైకి ఎత్తటానికి ప్రయత్నిస్తూ అన్నాడు. ఆగంతుకుడ్ని సరిగా చూడకుండానే వెనక్కు తిరిగాడు.

"తమరెవరండీ?" అంటూ ఆ ఆగంతుకుడు లోపలకు వచ్చి, చేతిసంచిని టేబిల్‌మీద వుంచి, బెడ్డింగును ఒక కుర్చీమీద పెట్టాడు. అంత చనువుగా బెడ్డింగుతోసహా లోపలకు వచ్చిన వ్యక్తిని చూస్తున్న చంద్రానికి నిద్రమత్తు కాస్తా వదిలింది. ఆ వచ్చిన యువకుడు చంద్రం కళ్ళల్లోకి ఆశ్చర్యంగా చూస్తున్నాడు. కళ్ళు చిన్నవే అయినా చూపు మాత్రం చాలా చురుగ్గా వుంది. దువ్వెనపళ్ళలా నిటారుగా వుండే జుట్టు చాలా దగ్గిరగా కత్తిరించి వుంది. ఆ జుట్టూ!.... ఆ నల్లని చురుకైన కనుపాపలు....

అదే సమయంలో ఆగంతుకుని దృష్టి నున్నగా, అందంగా వుండే చంద్రం మెడమీద పుట్టుమచ్చమీద పడింది. ఆ పుట్టుమచ్చ! తీర్చి దిద్దినట్లుండే ఆ కన్ను, ముక్కుతీరు!

'ప్రకాశ్!' చంద్రం నోటినుంచి పూర్తిగా వెలువడిందో లేదో, 'ఒరేయ్ చంద్రం!' అంటూ ప్రకాశం చంద్రాన్ని చుట్టేశాడు. ఆ క్షణంలో ఆ స్నేహితులిద్దరూ అనుభవించిన ఆ అపూర్వ అనుభూతి - స్నేహమే సాక్షాత్తు సాకార రూపంలో వచ్చినా వ్యక్తం చెయ్యలేదేమో! అలా ఎంతసేపు వుండిపోయారో వారికే తెలియదు. ప్రకాశం భుజంమీద పడిన కన్నీటి బొట్లు అతణ్ణి ఈ లోకంలోకి తెచ్చాయి.

"అరే చంద్రం! ఏమిటిది? మొత్తంమీద రచయిత వనిపించావోయ్!" అంటూ ప్రకాశం, చంద్రం రెండు భుజాలమీద చేతులు వేసి పక్కనే వున్న కుర్చీమీద కూర్చోపెట్టాడు.

చంద్రం కళ్ళు తుడుచుకుంటూ నిండుగా నవ్వాడు. తన చిన్న చిన్న చురుకైన కళ్ళను వీలయినంత పెద్దవి చేస్తూ చంద్రం ముఖంలోకి రెప్పవాల్చకుండా తమాషాగా చూడసాగాడు.

"ఏమిటలా చూస్తున్నావ్?"

"రచయితవు - కాబోలు చెప్పు చూద్దాం?"

"బాగుంది, నాకేం తెలుసు? నువ్వేచెప్పు!"

"ఓస్ ఇంతేనా? నీ అందాన్ని చూస్తున్నాను. మగవాడికి ఇంత అందం పనికిరాదు. ఎందుకో తెలుసా? నేనే ఆడపిల్లనైతే ఎంత బాగుండేది అని అనుకుంటున్నాను. అలాంటప్పుడు నిన్ను చూసిన ఆ ఆడపిల్లల గతేంకాను?"

"ఎంత మాట్లాడుతున్నావురా ప్రకాశం! నీలో చాలా మార్పువుంది. ఉండు ముఖం కడుక్కొస్తాను - తరవాత మాట్లాడుకుందాం," అంటూ లేచి చంద్రం దొడ్లోకి వెళ్ళిపోయాడు.

ప్రకాశం ఉత్సాహంగా లేచి పక్కగదిలోకి వెళ్ళబోయి వాకిట్లోనే ఆగిపోయాడు. కింద జంపఖానామీద ఒత్తిగిలి పడుకొని వున్న గౌరిని చూసి గిర్రున వెనక్కు తిరిగాడు. అయితే, చంద్రం భార్యనుకూడా వెంటబెట్టుకొని వచ్చాడన్నమాట! గట్టివాడే! నవ్వుకున్నాడు తనలో తానే ప్రకాశం.

పళ్ళు తోముకుంటూ కూర్చున్న చంద్రానికి బుర్రలో చిన్నప్పటి స్మృతులు గిర్రున తిరగసాగాయి. శరీరంలోని ప్రతీ జీవాణువూ కొత్త జీవం పోసుకున్నట్టనిపిస్తోంది. ఇద్దరి వ్యక్తులమధ్య వుండే పవిత్రమైన స్నేహబంధాన్ని మించి స్వార్థరహితమైనది మరో సంబంధం ప్రపంచంలో లేదేమో!

ఒకప్పుడు బక్కపలచగా, పీలగా, భయస్థుడిలా కనిపించే ప్రకాశమేనా ఈ ప్రకాశం! కత్తిలా దూసుకుపోయే స్వభావాన్ని ఎలా అలవరచుకున్నాడో!

"ఒరేయ్ చంద్రం! ఎంతసేపురా పళ్ళు తోముతావు?" ప్రకాశం కేకతో ఆలోచినలనుంచి బయటపడ్డాడు చంద్రం. గబగబా ముఖం కడుక్కుని భుజంమీద వున్న తుండుతో ముఖం తుడుచుకుంటూ లోపలకు వస్తున్న చంద్రానికి ఎదురుగా చేతిలో కాఫీ గ్లాసుతో, పెదవులమీద చిరునవ్వుతో ప్రత్యక్షం అయ్యాడు ప్రకాశం.

"కాఫీ!" ఆశ్చర్యంగా ఏదో అడగబోతున్న చంద్రం మాటలకు మధ్యలోనే అడ్డువచ్చి "అవును, కాఫీ! నేనే చేశాను. తాగిచూడు మా మరదలు తయారుచేసిన కాఫీకన్నా గూడా బాగుంటుందో లేదో!" అంటూన్న ప్రకాశం చేతినుంచి చంద్రం కాఫీగ్లాసు అందుకున్నాడు.

"అవును కాని, మా మదరల్ని కూడా వెంటబెట్టుకొచ్చినవాడివి మాటమాత్రం అన్నావా? ఇందాక ఏమేమో వాగేశాను," అన్నాడు ప్రకాశం, స్వరం తగ్గించి చంద్రాన్ని ఉడికించే ధోరణిలో.

అంతవరకూ ఆనందంగా ప్రకాశం మాటలను వింటూ కాఫీ తాగుతున్న చంద్రం చివర మాటలకు మిగిలివున్న కాఫీని ఒక్కసారి కషాయంలా మింగేశాడు.

"మా మరదల్ని కూడా నిద్రలేపవోయ్! కాఫీ తాగుతుంది. ముఖ్యంగా మా చంద్రం భార్య ఎంత అందమైనదో చూడాలని నా మనస్సు తహతహలాడుతూంది."

"ఊరుకోరా బాబూ! నీకు పుణ్యం వుంటుంది. ఆ అమ్మాయి వింటే ఏమయినా అనుకోగలదు."

"అదేమిటి? అలా అంటున్నావు! అయితే ఆవిడ...." ప్రకాశం కంఠంలో సందేహం, ముఖంలో ఆశ్చర్యం కనిపించాయి.

చంద్రం మనస్సు చివుక్కుమంది. అయితే ప్రకాశం కూడా తనను అనుమానిస్తున్నాడా? లేదు, ప్రకాశం అనుమానించడు! అనుమానించకూడదు. ప్రపంచంలో ఏ సన్నిహితుడూ అర్థం చేసుకోలేని ఒక హృదయపు లోతుల్ని ఒక్క స్నేహితుడు మాత్రమే అర్థం చేసుకోగలడు.

"ఏమిటోయ్! అంత ఆలోచన? ఏ చిక్కుల్లోనైనా చిక్కుకున్న అబలకు ఆశ్రయం యిచ్చావా ఏమిటి?" నవ్వుతూ ప్రశ్నించాడు ప్రకాశం.

కొంతవరకైనా ప్రకాశం తనను అర్థం చేసుకున్నాడు; అంతే చాలునని సంతోషించాడు చంద్రం.

తను గుంటూరు స్టేషన్‌లో దిగినవప్పటినుంచీ ప్రకాశం వచ్చి తలుపు కొట్టినంతవరకూ జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పాడు చంద్రం.

"అవును. ఈ అనాధ శరణాలయాలలో జరిగే దారుణాలను గురించి చాలా చాలా విన్నాను. కొందరికి ఇదొక జీవనోపాధిగా ఉపయోగపడుతోంది. కొందరికి కీర్తిని సంపాదించి పెడుతోంది. దాతలనుంచి సేకరించే దానంతోపాటు ప్రభుత్వ గ్రాంటులుకూడా లభిస్తున్నాయి ఇలాంటి శరణాలయాలకు. అందులో చాలా భాగం అధికారుల జేబుల్లోకే పోతోంది. పైగా, కొందరు శరణాలయాధికారులు అందమైన ఆడపిల్లలల ద్వారా పెద్ద పెద్ద ఆఫీసర్ల దగ్గరా, ధనవంతుల దగ్గిరా డబ్బూ, పరపతి సంపాదిస్తున్నారట! మేము ఈ విషయాలను గురించి కూడా ఏం చెయ్యాలా అని ఆలోచిస్తున్నాము" అన్నాడు ప్రకాశం.

"ఇంత దారుణమా?" తెల్లబోయి ప్రశ్నించాడు చంద్రం.

"నేను ఏదో టూకీగా చెప్పాను. దగ్గరకు పోయి చూస్తే అసలు విషయం తెలుస్తుంది . మరి నువ్వు, ఆ అమ్మాయిని ఎందుకు పారిపోయి వచ్చిందో అడిగావా?"

"అడగలేదు." సిగ్గుపడుతూనే జవాబు ఇచ్చాడు చంద్రం.

"అడగలేదు, ఎందువల్ల? అలా అడిగితే ఆ అమ్మాయి బాధ్యత ఎక్కడ నీమీద పడుతుందోననే భయమేకదూ? చంద్రం! చదువూ, సంస్కారం కలిగి, రచయితగా సంఘంలో బాధ్యతగల వ్యక్తివి నీవే ఇలా ప్రవర్తిస్తే, ఇక మామూలు వారి విషయం ఏం చెప్పాలి? ఇలాంటి అనాధలు బాగుపడే రోజు ఏనాడైనా వస్తుందంటావా?"

"నన్నేం చేయమంటావు ప్రకాశం? ఈ అమ్మాయివల్ల అన్నయ్య ఇంటిలో నాకు జరిగిన పరాభవం విన్నావుగా?"

"అందుకని నీ బాధ్యతను నీవు విస్మరిస్తావా? వారి సంకుచిత భావాలకు ఒకనాడు వాళ్ళే సిగ్గుపడతారు."

"అదెలా సాధ్యం. ఇప్పుడు నేనేం చెప్పినా వాళ్ళు నమ్మరు," అన్నాడు చంద్రం.

"అసలు చెప్పుకోవాల్సిన అవసరం ఏముంది? నిజం నిలకడమీద తెలుస్తుంది. తప్పు చెయ్యని నీవు బాధపడటం సిగ్గుపడటం అనవసరం?" ఆవేశంగా అన్నాడు ప్రకాశం.

"నా బాధంతా హేమ కూడా...."

"ఆమె మాత్రం అంతకంటే ఎక్కువ ఏం ఆలోచిస్తుందంటావు? ఆ సభ్యతా, సంఘంలో అంతస్థూ, నాగరికతా, సంస్కృతీ ముసుగుల్లోనుంచి చూసేవారి చూపుకు వారు ఆశించినదానికీ, అభిరుచికీ భిన్నంగా వున్నదంతా హేయమయినదే."

హేమను విమర్శించటం చంద్రం సహించలేకపోయాడు. "పోనియ్, ప్రకాశం! అదంతా నా దురదృష్టమే. మానవుడు విధి చేతిలో కీలుబొమ్మ ఏమో! లేకపోతే చెయ్యని దొంగతనం నా మీద ఎందుకు పడాలి? ఇంత కాలానికి తిరిగివచ్చి, మళ్ళీ అందరూ నన్ను ఆప్యాయంగా స్వీకరిస్తారనీ నా అంత అదృష్టవంతుడు లేడనీ అనుకున్న మరుక్షణంలోనే నేను మళ్ళీ అందరికి దూరం కావాల్సిరావటం ఏమిటి? అందుకు నేను పెద్దగా విచారించటం లేదు. అసలు నేను ఈ వూరు వచ్చింది నిన్నూ, నాన్నను చూసి నా కృతజ్ఞతలు చెప్పుకోవాలనే. నా దురదృష్టం కొద్దీ నాన్నను చూసే యోగం లేకపోయింది. నిన్ను చూశాను. నేను వచ్చిన పని అయిపోయింది. రేపో మాపో నీ అనుమతి తీసుకొని వెళ్ళిపోతాను." చంద్రం ఉద్రేకంగా చెప్పుకుపోతున్నాడు.

"ఒరేయ్! సెంటిమెంటల్ ఫూల్! ఇక ఆపు నీ మెట్ట వేదాంతం. కర్మ, విధి, అదృష్టం అనే పదాలజాడ్యం నీకూ పట్టుకుందీ? ఈ జాడ్యం మానవప్రయత్నానికే గొడ్డలిపెట్టు. ఈ జబ్బువల్ల నిలబడి స్థయిర్యంతో సాధించవలసిన కార్యాలను చూసి మానవుడు పలాయనం చిత్తగిస్తాడు. నువ్వూ అలాగే అందరినుంచీ దూరంగా పారిపోవటానికి మళ్ళీ ప్రయత్నిస్తున్నావు."

"అదృష్టం - దురదృష్టం కాకపోతే నా జీవితంలో జరుగుతున్న సంఘటనలను ఏమంటావు?"

"నేను దీన్నే జీవితం అంటాను. సంఘర్షణే జీవితం. జీవితంలో ఎన్నో సంఘటనలు తటస్థపడుతుంటాయి. అవి మనకు అనుకూలం అయినవిగా వుంటే అంతా మన ప్రయోజకత్వమే అనుకుంటాము. మనకూ మన సౌఖ్యానికీ అడ్డుతగిలే సంఘటన లయితే కర్మ, విధి అంటూ వాటి నుంచి పారిపోవటానికి ప్రయత్నిస్తాము. కాని ఎదుర్కొని పరిష్కరించటానికి ప్రయత్నించము. జీవిత సమస్యల్ని ఎదుర్కోవటానికి సాహసం, ఆత్మబలం, బుద్ధిబలంకూడా కావాలి. కేవలం కల్పనాశక్తిమాత్రం కలిగి అందమైన కలల్లో ఊహలలో విహరించే నీలాటివాళ్ళు బాహ్యా సంఘర్షణనుంచి పారిపోయి అంతః

సంఘర్షణ పడతారు. తమతో తామే పోరాడుతూ, తాము నిలబడ్డ భూమిని మర్చిపోయి ఆకాశంలో విహరిస్తున్నామనుకుంటారు. తన చుట్టూవున్న మానవులు తాము కల్పనాలోకంలో చిత్రించుకున్నవారికి భిన్నంగా కనిపించినప్పుడు ప్రపంచంనుంచి పలాయన మంత్రం పఠించటానికి ప్రయత్నిస్తారు."

"విధి, కర్మ – అనేవి లేకపోతే ఆ పదాలు ఇంతకాలంగా మానవ హృదయాలను ఎలా శాసించగలుతున్నాయంటావు?"

"దానికి కారణం కొందరు స్వార్థపరులు. ఆ పదాలను జాగ్రత్తగా ఒక తరంనుంచి మరో తరంవారికి అందిస్తూ వస్తున్నారు. సంఘంలో తమ ఔన్నత్యాన్నీ, అధికారాన్నీ, అంతస్థునూ నిలబెట్టుకోవటానికి కొన్ని వర్గాలు ఈ పదాలను ఆయుధాలుగా ఉపయోగించుకుంటూ వస్తున్నాయి. పూర్వకాలంలో మత ప్రచారకులుగా, ఉన్నత వర్గంగా చలామణిలో వున్న బ్రాహ్మణవర్గం ఈ పదాలను ఉపయోగించి అధిక సంఖ్యాకులను అజ్ఞానులుగా చేసి తమ ఆధిక్యాన్ని నిలుపుకుంటూ వచ్చారు. ఆ తరవాత రాజులూ, మహారాజులూ, జమీందారులూ, తమ అధికారాన్ని సుస్థిరం చేసుకున్నారు – ఈ పదాల ద్వారా. ఈనాడు కష్టజీవుల కళ్ళు తెరవకుండా వుంచటానికి, ఈ పదాలను సంఘంలో అంతస్థులు వున్నవారంతా వుపయోగిస్తున్నారు. పొద్దస్తమానం ఎముకలు పిండిచేసుకున్నా, తన అర్థ ఆకలికి కారణం తెలుసుకోవటానికి మానవుణ్ణి ప్రయత్నించనివ్వకుండా చేస్తున్నాయి ఈ పదాలు."

"ఏమిటి! కమ్యూనిస్టులా మాట్లాడుతున్నావు?" నవ్వుతూ అన్నాడు చంద్రం – ప్రకాశం ధోరణిని మార్చాలనే ఉద్దేశంతో.

"కమ్యూనిజమా? కమ్యూనిజం నా దృష్టిలో ఓ అందమైన ఆదర్శాలు కనే స్వప్నం మాత్రమే అది సాధ్యపడేది కాదు. కాకపోతే ఈ పేరుతో అధికారవర్గం మారుతుంది అంతే! రష్యాలో ఇంతవరకూ కమ్యూనిజం స్థాపన జరగకపోవటానికి కారణం ఏమిటి? కమ్యూనిజమనేది ప్రకృతి నైజానికే విరుద్ధం. కాకపోతే కమ్యూనిస్టులు వుపయోగించే 'స్వాతంత్ర్యం, సమానత్వం' అనే నినాదాలు తమ హీనస్థితికి కారణాలు 'విధి, కర్మ' అనుకుంటూ అజ్ఞాన నిద్రలోవున్న కష్టజీవులకు మేలుకొలుపులా పనిచేస్తున్నాయి."

"కమ్యూనిజం ప్రకృతి నైజానికి విరుద్ధమని నేను అనుకోను."

"స్వాతంత్ర్యం అంటే ఏమిటి? మానవుడు ఏనాడు సంఘజీవిగా మారాడో ఆనాడే కొంత స్వాతంత్ర్యాన్ని అరికట్టుకున్నాడన్నమాట! కొందరికి అసలు స్వతంత్రమే అక్కరలేదు. అది ఇచ్చినా దాంతో ఏం చెయ్యాలో వారికి తెలియదు. ఒకరిద్వారా శాసించబడటంలోనే వారికి ఆనందం లభిస్తుంది. ప్రేమపూర్వకమైన శాసనానికి మానవ హృదయం ఎప్పుడూ లొంగుతూనే వుంది. ఉదాహరణకు వాక్ స్వాతంత్ర్యాన్ని తీసుకుందాం. మనం అనుకున్నదంతా మాట్లాడగలగుతున్నామా? ఒక వ్యక్తి తమాషా ముఖాకృతిని చూసి "నీ ముఖం బావురుకప్పలా వుంది," అని చెప్పాలనిపిస్తుంది. కాని చెప్పగలమా? స్వాతంత్ర్యం వుంది కదా అని రోడ్డుమీద ఇష్టం వచ్చినట్లు తిరగ్గలమా? ఇక మానవత్వం అంటావా – ప్రకృతిలో ఏ రెండు ఆకులూ, ఏ రెండు పువ్వులూ, ఏ ఇద్దరూ వ్యక్తులూ సమానంగా వుండరు. అందరి వ్యక్తుల్నీ మానసికంగా, శారీరకంగా సమానంగా పుట్టించగలిగిన

యంత్రాన్ని దేన్నయినా కనిపెట్టిననాడు కమ్యూనిజం సంభవమేమో కాని, అంతవరకూ అది కేవలం కొందరి ఆదర్శాల స్వప్నం మాత్రమే."

"అందరి మానవులకూ సమానమైన అవకాశాలను కల్పించాలనేది కూడా నీ దృష్టిలో అసంభవమేనా?" చంద్రం ప్రశ్నించాడు.

"అవును. అదికూడా అసంభవమే. ఏ ఇద్దరు వ్యక్తులూ మానసికంగా, శారీరకంగా ఒకటిగా లేనప్పుడు ఒకేలాంటి అవకాశాలను అందరికీ కల్పించటంలో అర్థంలేదు. కొందరు వ్యక్తుల బుర్రలు బొత్తిగా పనిచెయ్యవు. అలాంటివారు కాయకష్టానికే ఉపయోగపడతారు. ఒక మంచి ఇంజనీరు కాగల తెలివితేటలు గలవానికీ, కేవలం కాయకష్టం మాత్రమే చెయ్యగలవానికీ ఒకే అవకాశము కల్పించారనుకో - అప్పుడు అ అవకాశాన్ని ఇద్దరూ సమానంగా వుపయోగించుకోగలరంటావా?"

"సమానావకాశాలంటే అది కాదని నా ఉద్దేశం. ప్రతి మనిషికీ తన అభిరుచికీ, బుద్ధికౌశల్యానికి అనుకూలమైన అవకాశం అందుబాటులో వుండేలా చెయ్యమని."

"నేను చెబుతుందీ అదే. ప్రతి మనిషికీ జీవించడానికి కొన్ని కనీస అవసరాలు వుంటాయి. అవికూడా అందుబాటులో లేని మానవుడు జంతువులా బ్రతకటం మానవ సంఘానికి సిగ్గుచేటు. ఆ తరవాత వారివారి మానసిక స్థాయికీ, అభిరుచికీ అనుకూలమైన చదువూ, దానికితగ్గ పనులూ కల్పించాలి. వారివారి పనులను దృష్టిలో పెట్టుకుని వారివారి అవసరాలను గుర్తించాలి. ఒక భవన నిర్మాణం జరగాలంటే డిజైన్‌వేసి, ప్లాన్‌గీచి దానినెలా నిర్మించాలో నిర్ణయించే ఇంజనీయరూ వుండాలి. రాళ్ళు మోసేవాళ్ళూ వుండాలి. రాళ్ళు మోసేవారిచేత డిజైను, డిజైనువేసే వారిచేత రాళ్ళూ మోయించలేంగా? ఇంజనీరు ఒకేసారి దూరదూరంలో వున్న కొన్ని భవనాల పర్యవేక్షణ చెయ్యగలడు. కాని రాళ్ళుమోసేవాడు ఒక సమయంలో ఒకే చోట పనిచెయ్యగలడు. అందువల్ల ఇంజనీరుకు కారు అవసరం. కాని రాళ్ళుమోసేవాడికి అక్కరలేదు. అందుకే అందరికీ సమానావకాశాలు అనకుండా, అవసరమైన అవకాశాలు అంటే బాగుండేదేమో! దీనిని నువ్వు సోషలిజం అను లేక ఏ ఇజం అన్నా అను నా కభ్యంతరం లేదు."

"ఎంత సేపయింది బాబూ వచ్చి?" అంటూ ప్రవేశించింది రాజవ్వ. అంతలో ప్రకాశం వాక్ప్రవాహం ఆగిపోయింది.

"ఓ గంట అయింది. త్వరగా వంటచెయ్యి. ఇతను చంద్రం, నా చిన్ననాటి స్నేహితుడు. ఇతనుకూడా ఇకనుంచి ఇక్కడే వుంటాడు."

"అలాగే బాబూ!" అంటూ రాజవ్వ లోపలకు వెళ్ళిపోయింది. ప్రకాశానికి గౌరి నిద్రలేవలేదన్న విషయం జ్ఞాపక మొచ్చింది.

"అరె, మన మాటలలో గౌరిని మర్చేపోయాం. చూడు రాజవ్వా! ఆ అమ్మాయిని నిద్రలేపు" అన్నాడు ప్రకాశం.

గౌరి పేరు ఎత్తగానే మళ్ళీ చంద్రం ముఖంలో మార్పువచ్చింది. అది గమనించిన ప్రకాశం నవ్వుకున్నాడు.

"బాబూ, ఇలారండి." పెద్ద కేక పెట్టింది రాజవ్వ.

ఆ కేకకు ఇద్దరూ ఉలిక్కిపడి లేచి లోపలకు వెళ్ళారు ఆదుర్దాగా.

"వళ్ళు మంగలంలాగ మాడిపోతోంది. పలకటం లేదు," అంది రాజవ్వ.

చంద్రం గబుక్కున వంగి గౌరి నొసటిమీద చెయ్యి వేశాడు. వళ్ళు కాలిపోతోంది. ఆమెను కుదుపుతూ "గౌరీ! గౌరీ!" అంటూ పిలిచాడు ఆదుర్దాగా.

గౌరి చిన్నగా కళ్ళు తెరిచింది. కాని ఆ చూపులు ఎవర్నీ చూస్తున్నట్లు లేవు. వెర్రిగా ఎక్కడో దేన్నో చూస్తుంది. ఆ వెర్రిచూపుల వెనక నుండి ఏదో భయం తొంగిచూస్తోంది.

"నన్ను మళ్లీ ఆ నరకంలోకి పంపించవద్దు. మా పెద్దమ్మ నన్ను చంపేస్తుంది," ఆగిఆగి అస్పష్టంగా అన్న గౌరి మాటలకు చంద్రం, ప్రకాశం ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు. అంతలోనే గౌరి కళ్ళు మూతలుపడ్డాయి. ఈసారి ఎంత పిలిచినా పలకలేదు.

"నేను వెళ్ళి డాక్టర్ను తీసుకొస్తాను" అంటూ ప్రకాశం తుండు భుజాన వేసుకొని గబగబా బయటకు వెళ్ళిపోయాడు.

చంద్రం ఏదో పెద్ద తప్పు చేసినవాడిలా గౌరి పక్కనే కూర్చుని ఆలోచిస్తున్నాడు.

రాత్రి తను చాలా నిర్దయగా ప్రవర్తించాడు. గౌరికి తనమూలంగానే ఇలా ముంచుకొచ్చింది. ప్రకాశం అయితే అలా ప్రవర్తించి వుండేవాడా? తను సంస్కృతి గురించి పుస్తకంకూడా రాసి బహుమతిని పొందాడు.

చంద్రం గౌరి ముఖంలోకి చూశాడు. ఆమె ఆ పెద్ద పెద్ద కనురెప్పలు మూసుకొని అమాయకంగా నిద్రపోతున్నట్లుంది. ముంగురులు చెదరి ముఖంమీద చిందర వందరగా పడివున్నాయి.

చంద్రం యాంత్రికంగా ఆ ముంగురులను సర్దుతూ ముఖంలోకి జాలిగా చూస్తూ కూర్చున్నాడు. ప్రకాశం డాక్టరుతో ప్రవేశించాడు. ఇప్పుడే ఏ జ్వరం అయిందీ చెప్పలేనన్నాడు డాక్టరు. ఇన్‌జెక్షన్ ఇచ్చి కొన్ని మందులు రాసి ఇచ్చి వెళ్ళిపోయాడు. డాక్టరు ఇచ్చిన చీటీని చేత్తో పట్టుకొని ఏదో ఆలోచిస్తున్న ప్రకాశాన్ని చూసి చంద్రం లేచాడు. పెట్టె తెరచి వెయ్యి రూపాయలు ఉన్న కవరు తీసి అందించబోయాడు.

"ఏమిటిది?"

"డబ్బు! నీ దగ్గిర వుంచి వాడు."

"ఎంత వుంది అందులో?"

"వెయ్యి రూపాయలు!"

"అంత డబ్బు నా కెందుకు? ఓ పదిరూపాయలు ఇవ్వు. ఇప్పుడు మందులకు సరిపోతుంది."

"నా దగ్గిర డబ్బు తీసుకోవటానికి సందేహిస్తున్నావా? ఈనాడు నేను ఇంతవాణ్ణి కావటానికీ, ఈ డబ్బు సంపాదించగలగటానికీ కారకులు ఎవరు? నువ్వు. నీ ఋణం ఎంత డబ్బు ఇచ్చినా తీర్చుకోలేనిదని నాకు తెలుసు. కాని...." చంద్రం గొంతు బొంగురుపోయింది.

"అదుగో, మళ్ళీ మొదలుపెట్టావ్. మరోమారి కృతజ్ఞతా గితజ్ఞతా అను, చెబుతాను. నేను పరాయివాళ్ళకెవరికి సహాయం చేశాను? నా ప్రాణస్నేహితునికి సహాయం చేశాను. అందువల్ల నాకు సంతృప్తి లభించింది. అంటే, అందులో నా స్వార్థం వుందన్నమాట!"

"మరి అయితే నా దగ్గిర డబ్బు తీసుకోవటానికి సందేహిస్తావెందుకు?" రెట్టించాడు చంద్రం ఉద్రేకంగా.

"నీ దగ్గర నాకు సందేహం ఏమిటోయ్! ఇప్పుడు అంత డబ్బు ఎందుకన్నాను, అంతే," అంటూ ప్రకాశం చంద్రం చేతిలో కవరు అందుకున్నాడు. చంద్రం ముఖం వికసించింది.

"ఇంత సున్నితమైన మనస్సు పెట్టుకుని ఎలా బతగ్గలవో చంద్రం!" అని ప్రకాశం మనస్సులోనే అనుకున్నాడు.

ప్రకాశం, చంద్రం – ఇద్దరూ కలసి గౌరిని మంచంమీద పడుకోబెట్టారు.

# 14

గౌరి పూర్ణ ఆరోగ్యవంతురాలు కావటానికి పదిహేను రోజులు పట్టింది. ప్రకాశం, చంద్రం – ఇద్దరూ కూడా ఎంతో శ్రద్ధంగా ఆమెకు సేవలు చేశారు. మళ్ళీ తనను శరణాలయానికి పంపించరు అనే నమ్మకం కుదిరినాకనే ఆమె ఆరోగ్యం పుంజుకుంది. అది ప్రకాశం, చంద్రం, తెలుసుకోకపోలేదు.

చంద్రంకంటే ప్రకాశం దగ్గర గౌరికి చనువు ఎక్కువ. ముభావంగా కనుపించే చంద్రం అంటే ఆమెకు గుండెలో ఎక్కడో ఓ మూల భయం బిడాయించుకుని కూర్చుంది.

ఒకరోజు ప్రకాశం అడిగితే గౌరి శరణాలయ జీవితం గురించీ, ముఖ్యంగా ఆ రోజు తను గోడదూకి పారిపోవటం గురించీ చెప్పింది.

అక్కడ వాళ్ళకు పెట్టే తిండి, వాళ్ళయెడల అధికారులు చూపే నిరాదరణా, తిరస్కారం గురించీ ఆమెకు చాతనయిన ధోరణిలో చెప్పింది. ముఖ్యంగా గౌరి గోడదూకి పారిపోవటానికి కారణభూతమైన సంఘటన చంద్రాన్ని వేధించింది.

గౌరి జూనియర్ మెట్రిక్‌లో వుంది. కొంచెం మొండిఘటం. అప్పుడప్పుడు ఎదురు తిరిగి మాట్లాడి మాట్రిన్‌చేత, సూపర్నెంటుచేతా దెబ్బలు తినేది. అధికారులే కాకుండా, వయస్సులో వున్న కొందరు ఆడపిల్లలుకూడా చిన్నపిల్లలమీది అధికారం చేసేవారు.

ఆ రోజు పొద్దుట లేస్తూనే సూపర్నెంటు గౌరికోసం కబురు పెట్టింది. గౌరి భయపడుతూ సూపర్నెంటు గదికి వెళ్ళింది. గౌరి తను ప్రొద్దుటే చేసిన అపరాధం ఏమిటో అర్థంకాక బిక్కమొహం వేసింది. గౌరి వూహించినట్లు సూపర్నెంటు ఆమెను చూడగానే కళ్ళు వురమలేదు. ఆల్‌సేషియన్‌లా గుర్రుమనలేదు. కనీసం పిల్లిలా 'కస్ మని' కూడా అనలేదు. గౌరిని నవ్వుతూ దగ్గిరకు పిలిచింది. సూపర్నెంటు నవ్వు ముఖాన్ని గౌరి ఏనాడూ చూసి ఎరగదు. అది చూసిన గౌరికి ఆమె నవ్వకుండా వుంటే బాగుండుననిపించింది. భయపడుతూనే ముందుకు రెండడుగులు వేసింది.

"ఇలారా గౌరీ! చూడు, ఈ చీరా జాకెట్ బాగున్నాయా?" టేబిల్ మీద పెట్టివున్న కాగితం పొట్లం విప్పింది సూపర్నెంటు.

పసుపుపచ్చ నైలాన్ చీర, అదే రంగు జాకెట్టు. గౌరి కళ్ళు సంతోషంతో మెరిసిపోయాయి. అంతలోనే ఏదో అనుమానం ఆ సంతోషాన్ని వెనక్కు నెట్టివేసింది.

"పిచ్చిపిల్లా! ఎందుకు భయపడతావు? ఇవి నీ కోసం తెచ్చాను? చూడు బాగున్నాయేమో?"

గౌరి సంతోషంతో ముందుకు వెళ్ళి ఆ చీరను చేత్తో తాకి చూసింది. ఆ స్పర్శ ఆమెను ఏదో లోకానికి లాక్కుపోయింది. ఇంత మంచి చీర తనకే? అవును – తనకే... అనుకుంది.

"వెళ్ళి త్వరగా తలకుపోసుకో, ఈ బట్టలు వేసుకుందువుగాని ఇవ్వాళ నీ పుట్టినరోజు" అంది సూపర్నెంటు.

ఇవ్వాళ తను పుట్టిన రోజా? అంటే? అయితే? ఇంతకు ముందు తనకు పుట్టిన రోజు రాలేదేం మరి? సరిగ్గా ఎన్ని ఏళ్ళో, ఏ రోజు పుట్టిందో ఈమె కెలా తెలుసు? గౌరి అమాయకపు బుర్ర ఆలోచించలేక ఆ విషయాన్ని వదిలేసింది.

ఆ కమలకీ, సుందరికీ బలేగర్వంలే! సూపర్నెంటు ఎప్పుడూ వాళ్ళనే ప్రేమగా చూస్తుంది, మంచి బట్టలు కూడా తెచ్చి ఇస్తుంది వాళ్ళకు. కాని ఈ రోజు, తన కోసం తెచ్చిన చీరంత మంచి చీర ఇంతవరకు ఇక్కడ ఎవరూ కట్టలేదు. గౌరి కళ్ళు మూసుకొని తలంటి పోసుకుంటూంటే ఆ మూసిన కళ్ళలో పచ్చనైలాన్ చీరనుంచి అలలు లేచి లేచి పడుతున్నాయి.

కొత్త బట్టలు ధరించి గౌరి ఆ రోజంతా కొత్తగా రెక్కలు వచ్చిన పక్షిపిల్లలా గెంతుతూ తిరిగింది. కమలా, సుందరీ, ఇంకా కొంతమంది పెద్దపిల్లలు గౌరిని చూసి అదోలా నవ్వారు. వారి కళ్ళలో కనుపించిన అసూయకు జవాబుగా గౌరి గర్వంగా చిరునవ్వులు విసిరింది.

సూపర్నెంటు ఆరు గంటలకు గౌరికి కబురు పంపించింది. గౌరి ఉత్సాహంగా ఆమె గదికి వెళ్ళింది.

"ఎంత అందంగా వున్నావో తెలుసా? ఇవ్వాళ నీవు సినిమాకు వెళతావా?" అంది సూపర్నెంటు ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ.

పెద్దమ్మగారి ఆప్యాయతను చూరగొన్న పెద్ద పిల్లలు అప్పుడప్పుడు సినిమాలకు వెళుతుండటం తెలుసు గౌరికి. సంతోషంతో తల గిర గిర ఆడిచింది గౌరి. అయితే తనకు ఇకనుంచి సినిమాలూ.... మంచి మంచి చీరలూ.... సెంట్లూ... పౌడర్లూ.... అబ్బో ఎన్నో ఎన్నో... గౌరి గాలిలో తేలిపోతున్నట్లు అనుభూతిని పొందిలింది.

మేట్రన్‌తో రిక్షాలో కూర్చున్న గౌరి కళ్ళు ఇంతంత చేసుకొని రోడ్డుమీద నడిచే జనాన్ని, రోడ్డుపక్క కొట్లనూ చూస్తూ తన్మయత్వం పొందసాగింది.

రిక్షా ఒక పెద్ద హోటల్‌ముందు ఆగింది. మేట్రన్ దిగి గౌరిని దిగమన్నది.

"ఇది సినిమా హాలా?" అంది గౌరి ఆశ్చర్యంగా – సినిమాకు అనిచెప్పి హోటల్‌కు ఎందుకు తీసుకొని వచ్చిందో అర్థంకాక.

"సినిమాకు వెళదాంలే, తొందరేమీ లేదు. ముందు కాఫీ తాగుదాం పద" అంది మేట్రన్.

గౌరి మేట్రన్ వెనకే హోటలు మేడమీదకు దిక్కులు చూస్తూ నడిచింది. మేట్రన్‌తో ఒక గదిలో ప్రవేశించిన గౌరి అమాయకపు బుర్ర అయోమయంలో పడింది.

ఆ గదిలో పొద్దుట తమ శరణాలయం తనిఖీకి వచ్చిన ఆఫీసరు వున్నాడు. ఆ ఆఫీసరు చిరునవ్వుతో లేచి గౌరిని సమీపించాడు. గౌరి గాబరాగా వెనక్కు తిరిగింది మేట్రన్ కోసం. అప్పటికే అక్కడ నుంచి మేట్రన్ తప్పుకుంది. తలుపుకూడా బయట నుంచి వేసింది. అంత పెద్ద ఆఫీసరు ముందుకు రాగానే కలిగిన గాబరాలో గౌరి ఇదేమీ గమనించలేదు. ఆ ఆఫీసరు గౌరి రెక్కపట్టుకొని అనునయంగా కూర్చోబెట్టబోయాడు. తనకు ఏదో జరగరాని అన్యాయం జరగబోతుందని మాత్రం అర్థం అయింది గౌరికి. గౌరి ఆ ఆఫీసరుతో పెనుగులాటలో పక్కనే టేబుల్ మీద వున్న గాజు కూజాను నేలమీద కొట్టింది. తత్తరపాటుతో వేసిన కాల్లో గాజుపెంకులు గుచ్చుకొని ఆఫీసరు తలుపు తియ్యమని కేకపెట్టాడు. తలుపు తెరుచుకుంది. గౌరి మెరుపులా పరిగెత్తింది.

శరణాలయం చేరుకున్న గౌరి, పిల్లి నోటికి చిక్కి గాయపడ్డ పక్షిలా వణికిపోతూ సూపర్నెంటు గదిలోకి వెళ్ళింది. గౌరి వాలకం చూసిన సూపర్నెంటు గాబరా పడింది. గౌరి ఏడుస్తూ జరిగిందంతా చెప్పింది. మరో క్షణంలో సూపర్నెంటు గౌరి జుట్టు పట్టుకొని వంచి కక్షగా వీపుమీద బాదింది. ఒక గదిలో పెట్టి తాళం వేసింది. ఆ రాత్రి భోజనం లేదు. చీకటి గదిలో, ఆకలి కడుపుతో ఏడుస్తూ కూర్చున్న గౌరికి ఇక తను ఆ శరణాలయంలో వుండటం అంత మంచిది కాదని తోచింది. తెల్లవారుఝామున గౌరి స్నేహితురాలు తలుపు తీసింది. గౌరి పారిపోవటానికి ఆ అమ్మాయే సహాయం చేసింది.

ఆ తరువాత కథ చంద్రానికీ, ప్రకాశానికీ తెలిసిందే. చంద్రానికి గౌరి అంటే జాలి కలిగింది. తను ఆమెయెడల చూపిన నిరాదరణను తలచుకుని బాధ పడ్డాడు.

"అయితే గౌరీ! ఆ రోజు నేను ఆ ఇంట్లో వున్నట్లు నీ-కెలా తెలిసింది?" చంద్రం ప్రశ్నించాడు.

"శరణాలయంనుంచి నేను పారిపోయాను. కాని చాటుచాటుగా నిన్ను వెంబడిస్తూనే వున్నాను. నువ్వు ఇంటికి వెళ్ళగానే నా పెట్టె తీసుకొని వెళ్ళిపోవాలనుకున్నాను. నువ్వు పొగాకు కంపెనీనుంచి ఎవరిదో కార్లో వెళ్ళిపోయావు. ఎక్కడికి వెళ్ళావో తెలియక బిక్కమొహంతో నిల్చున్నాను. ఇంతలో నాగేంద్రంవచ్చి తనతోవస్తే నిన్ను చూపిస్తా నన్నాడు."

"నాగేంద్రం నీకు అంతకుముందే తెలుసా?" చంద్రం విస్తుపోతూ ప్రశ్నించాడు.

"తెలుసు. ముందు నన్ను నాగేంద్రం, అదెమ్మా పెంచారు" అంటూ గౌరి ఆ నాటిరాత్రి తను విన్న విషయం అంతా చెప్పింది. కాని గౌరి తను ఒక అబ్బాయిని కట్లు విడిపించానన్న విషయంమాత్రం చెప్పలేదు.

"అయితే, ఆ డబ్బు నాగేంద్రం తీశాడన్నమాట!" అన్నాడు ప్రకాశం.

"నాకు మొదటినుంచీ వాడిమీదే అనుమానం" అన్నాడు చంద్రం.

"గౌరికూడా ఏ పెద్దయింటి బిడ్డో అయివుండొచ్చు" అన్నాడు ప్రకాశం సాలోచనగా. చంద్రం ఆలోచిస్తూ, కూర్చుండిపోయాడు. ఆ డబ్బు విషయం ముందుగానే వీళ్ళకెలా తెలిసిందో అనుకుంది గౌరి. తెలుసు కాబోలు అని ఏ సరిపెట్టుకుంది – అంతకంటే ఆలోచనరాని గౌరి.

# 15

ప్రకాశం స్థలంలోనే ఒక చిన్న నిట్టాడి గుడిసెలో వుంటున్న రాజవ్వ దగ్గిర గౌరిని పెట్టాడు ప్రకాశం. వయస్సులోవ్ను ఆడపిల్ల పెద్దవాళ్ళెవరూ లేకుండా తనతో నివసించడం ఆ అమ్మాయి భవిష్యత్తుకు మంచిదికాదని ఆలోచించిన ప్రకాశం ఈ ఏర్పాటు చేశాడు. భోజనం వగైరా అంతా ప్రకాశం ఇంటిలోనే. రాజవ్వ వంటా అది చేసిపెట్టి, పొగాకు కంపెనీకి పనికి వెళుతుంది. గౌరి రాజవ్వకు పనిసాయం చేస్తూంటుంది. పగలంతా ఇల్లు సర్దటం, సాయంకాలం వంటచెయ్యటం గౌరి వంతు. ప్రకాశం ఎప్పుడూ ఎవరితోనో బయట తిరుగుతూనే వుంటాడు. చంద్రం మాత్రం ఎక్కువ ఇంటిలోనే వుంటాడు. కాని మౌనంగా ఏవేవో పుస్తకాలు చదువుకుంటూ వుంటాడు. గౌరితో ఎక్కువగా మాట్లాడడు. గౌరికి కూడా చిన్న చిన్న పుస్తకాలు తెచ్చి ఇచ్చి చదువుకోమని చెబుతూండేవాడు. గౌరికి చంద్రంతో మాట్లాడటం ఇష్టం.

ఆ వాతావరణంలో గౌరికి అంతకుముందు తనకు తెలియని విషయాలు తెలుస్తున్నట్లు అనిపించసాగింది. గౌరి త్వరలోనే ఆ గూడెం వాళ్ళందరికీ ప్రియపాత్రురాలయింది. లీడరన్నకు కావల్సినవాళ్ళంతా ఆ గూడెంవాళ్ళ గుండెలలో ప్రాణంలాంటివారే. సాయంత్రం అయేటప్పటికి ఆ గూడెం పిల్లలంతా గౌరిచుట్టూ చేర్తారు. గౌరి వాళ్ళతో ఆడుకుంటూ వాళ్ళకు కథలు చెబుతూ వుంటుంది. గౌరి ఆనందం చూసి ప్రకాశం సంతృప్తిగా నిట్టూర్చేవాడు.

మరో రెండు నెలలుపోతే ట్యుటోరియల్ కాలేజీలో చేర్పించి గౌరికి చదువు చెప్పించటానికి నిర్ణయించుకున్నాడు ప్రకాశం. ఆ నిర్ణయం విని చంద్రం ఎంతో సంతోషించాడు. ఆ రెండు నెలలూ గౌరికి చదువు చెప్పమని చంద్రానికి చెప్పాడు ప్రకాశం.

ప్రకాశం గౌరిని వివాహం చేసుకుంటే బావుణ్ణు అనుకున్నాడు చంద్రం.

ఆ సాయంత్రమే చంద్రం గౌరికోసం మంచి మంచి చీరెలు కొని తెచ్చాడు. తన ప్రకాశం భార్యగా వూహించుకున్న గౌరిని శరణాలయం బట్టలలో చూట్టం ఇష్టంలేక పోయింది చంద్రానికి. ఈ విధంగానన్నా ప్రకాశం ఓ ఇంటివాడైతే తనకు అంతకంటే సంతోషం కలిగించేది మరోటి లేదు.

ప్రకాశం మరోలా వూహించుకొని ఆనందించాడు. చంద్రం ఈ విధంగానన్నా సుఖపడితే అదేచాలు ననుకున్నాడు. గౌరికి చంద్రం అంటే చాలా ఇష్టం అన్న విషయాన్ని ప్రకాశం ఏనాడో గ్రహించాడు. కాని చంద్రం మనస్సే అర్థంకాలేదు ప్రకాశానికి.

మొదటినుంచి సభ్యసమాజానికి దూరంగా పెరిగిన గౌరికి కృత్రిమ మర్యాదలూ, నాగరికతా తెలియవు. అందువల్లనే ఆమెకు ప్రకాశంను ప్రకాశం అనీ, చంద్రాన్ని చంద్రం అని పిలవటానికి అట్టేకాలం పట్టలేదు. ప్రకాశం దగ్గర గౌరికి మరీ చనువు. కాని చంద్రం అంటే ఆమెకు ఓ విధమైన భయం. గౌరికి తనంటే ఇష్టమనీ, ఆ ఇష్టం ఇంకేరూపాన్నయినా ధరించగలదనీ తెలుసుకున్న చంద్రం గౌరితో అంత చనువుగా వుండటం మంచిది కాదని ముభావంగా వుండేవాడు.

ఆ రోజు ప్రకాశం ఊరికి వెళ్ళడానికి తయారవుతున్నాడు. గౌరి ప్రకాశం బట్టలూ, సామానులూ సూటుకేసులో సర్దుతూంది. అప్పుడే షికారుకు వెళ్ళిన చంద్రం తిరిగి వచ్చాడు.

"చంద్రం! నేనొక అర్జంటు పనిమీద తెనాలి వెళ్ళుతున్నాను. ఎల్లుండికి వచ్చేస్తాను" అన్నాడు ప్రకాశం అద్దంముందు నిల్చొని తలదువ్వుకుంటూ.

"నేను కూడా రేపు వెళ్ళిపోతున్నాను. ఆ విషయం నీకెలా చెప్పటమా అని ఆలోచిస్తూ వున్నాను" అన్నాడు చంద్రం ఉదాసీనంగా.

ప్రకాశం ఓ క్షణకాలంపాటు చంద్రం ముఖంలోకి విస్తుబోయి చూశాడు.

"నువ్వు వెళ్ళిపోతావా? ఎక్కడకు?"

"విధి ఎక్కడుకు తీసుకెళితే అక్కడకే! నేను వచ్చిన పని అయిపోయింది."

"ఏమిటాపని?" కొంచెం మందలిస్తున్నట్లున్న స్వరంతో అడిగాడు ప్రకాశం.

"కేవలం నిన్నూ, నాన్నను చూడాలనీ, మా అన్నయ్యకు నేను దొంగిలించానని భావించిన డబ్బు తిరిగి ఇచ్చేయాలనీ వచ్చాను. అనుకోకుండా అయినవాళ్ళంతా దగ్గరయి, మళ్ళీ ఇట్టే దూరం అయ్యారు. నాన్నను చూడలేకపోయాను. నిన్ను చూశాను."

సామాను సర్దుతున్న గౌరి చేతులు పని మానేశాయి. ఆదుర్దాగా చంద్రం ముఖంవైపు చూస్తూ వుండిపోయింది. అది గమనించిన చంద్రం "పిచ్చిపిల్ల! ఏమిటో ఈ అనుబంధం?" అనుకున్నాడు మనసులోనే.

ప్రకాశం మాట్లాడలేదు. అతని మౌనాన్ని అంగీకారంగా తీసుకున్నాడు చంద్రం. మనసు ఎందుకో చివుక్కుమంది.

"ప్రకాశం! నీ ఋణం నేను ఇంకా నాలుగు జన్మలెత్తినా తీర్చుకోలేనిది. కాని, ఒకటి చేశాను నీ అనుమతి లేకుండా."

"ఏమిటి?" ప్రకాశం గొంతులోని తీవ్రతకు గౌరి పెద్ద కళ్ళు ఇంకొంచెం పెద్దవయాయి. ప్రకాశం ముఖంలోకి ఆందోళనగా చూసింది.

"నా పేరున ఢిల్లీ బ్యాంకులో ఉన్న పదివేల రూపాయలు ఇక్కడ బ్యాంకుకు ట్రాన్సుఫర్ చేయించాను. అవి నీ పేరున వేశాను."

"మహా గొప్పపని చేశావు. మా అప్పును చక్రవడ్డీకట్టి తీర్చినట్టున్నావు!" ఉబికి వస్తున్న కోపాన్ని అణచుకుంటూ అన్నాడు ప్రకాశం.

"నన్ను అపార్థం చేసుకోకు ప్రకాశం! మానవుడు ఎప్పుడూ ఆత్మసంతృప్తికోసం, ఆనందంకోసం పాకులాడుతాడు. చిన్నప్పటినుంచీ నేను అన్ని ఆనందాలకూ దూరంగానే

పెరిగాను. మానవుడు 'నా' అనే వ్యక్తులకోసం బతుకుతాడు. తన సంపాదనతో, తను చేసేపనులతో తనవారిని ఆనందపరచి తను ఆనందపడాలని తాపత్రయపడతాడు. నాకు నీకంటే ఎవరూ లేరు. నాకాడబ్బు ఒక సత్కార్యానికి లభించింది. దాన్ని నేను వాడుకోవటంలో నాకు ఆనందం వుండదు. నావాళ్ళకు దాన్ని ఇవ్వగలిగితేనే నాకు ఆనందం – కాదనకు ప్రకాశ్!" అంటూ చంద్రం ప్రాధేయపూర్వకంగా యాచించాడు.

"పోనియ్, ఆ డబ్బుతో గౌరిని చదివించు. ఆమెకోసం ఖర్చు చెయ్యి."

ప్రకాశం ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఇంకొక విషయం. నా ఆస్తినంతా నీ పేరనే వ్రాశాను. ఇవాళ్ళే రిజిస్ట్రేషన్‌కూడా అయిపోయింది. ఆ డబ్బుతో గౌరిలాంటి కొందరు అనాధల్ని ఉద్ధరించు. సత్కార్యానికి వుపయోగించు. ఈ విశాల ప్రపంచంలో నేను బతకగలను. నాకివన్నీ అక్కరలేదు." ప్రశాంతంగా చెప్పుకు పోతున్నాడు చంద్రం.

ప్రకాశం ఒక్కసారిగా చంద్రాన్ని తన రెండు బాహువుల్లో బిగించాడు. ఉద్రేకం, ఉదారత్వం – రెండూ ఒకదాన్ని ఒకటి పెనవేసుకున్నాయి.

ప్రకాశం తనను తాను సంబాళించుకొని వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. చంద్రం, ప్రకాశం ముఖంలోకి అతని జవాబుకోసం ఆదుర్దాగా చూడసాగాడు.

ప్రకాశం ముఖంలో ఏదో నిర్ణయం కనిపించింది చంద్రానికి.

"నువ్వంత ఇదిగా ఇస్తున్న దేన్నీ నేను కాదనలేను. ఆ దస్తావేజులు ఎక్కడ?" చిరునవ్వుతో ఉత్సాహంగా అడిగాడు ప్రకాశం.

చంద్రం సంతోషంగా లోపలకు వెళ్ళి తన పెట్టెలో వున్న దస్తావేజులున్న కవరు తెచ్చి ప్రకాశంకు అందించాడు. అందుకోబోయిన ప్రకాశం చెయ్యి చటుక్కున వెనక్కు పోయింది. చంద్రం ప్రశ్నార్థకంగా చూశాడు.

"నాకు నువ్వొక మాట యివ్వాలి. అప్పుడే దీన్ని తీసుకుంటాను" అన్నాడు ప్రకాశం.

"ఏమిటది?" సందేహిస్తూ అన్నాడు చంద్రం.

"ముందు చేస్తానని మాటయిస్తేనే చెబుతాను."

"అలాగే, చంపక చెబుదూ?"

"అలాగే అంటేకాదు. నా చేతిలో చెయ్యివేసి ప్రమాణం చెయ్యి."

చంద్రం ఫక్కున నవ్వాడు. ప్రకాశం తెల్లబోయాడు. అయితే, ఇదంతా చంద్రం తమాషాగా చేసిందేనా? ఎందుకు చేశాడు? తనకు డబ్బు మీద ఆశ వుందో లేదోనని పరీక్షించటానికా? ప్రకాశం ముఖం చిన్నబోయింది.

"ఏంరా ప్రకాశం! మొన్న నేను విధి, కర్మ అన్నానని అంత పెద్ద ఉపన్యాసం దంచావే. మరి ఇప్పుడు నన్ను చేతిలో చెయ్యి వేసి ప్రమాణం చెయ్యమంటున్నావు! అసలు కిటుకు అందులోనే వుంది. మనం ఎంత విజ్ఞానాన్ని ఆర్జించుకున్నా, ఆధునిక భావాలను అలవరచుకున్నా, పాశ్చాత్య భావప్రభావం ఎంత తన మీదపడినా, ఇలాంటి నమ్మకాలు మనకు తెలియకుండానే మన రక్తంలో జీర్ణించుకుని వుంటాయి. లేకపోతే నీలాంటివాడికి ఒట్టుమీద నమ్మకం ఏమిటోయ్, మనిషి మాటమీద వుండాలిగాని!"

ప్రకాశం వాదనలో దిగే మూడ్‌లో లేడు. "ఏడిచావు లేరా! మరి నేను చెప్పినట్లు చేస్తావా?"

చంద్రం, ప్రకాశం చేతిని తన చేతిలోకి తీసుకుంటూ "నీవేం చెప్పినా చేస్తాను" అన్నాడు.

"అయితే, నువ్వు ఇక్కడ నుంచి ఎక్కడకూ వెళ్ళకూడదు. నువ్వు ఈ ఊరు వదలటంలోనే నీ క్షేమం వుందని నేను అనుకున్ననాడు నేనే నిన్ను పంపిస్తాను. ఇక నుంచి నీవు నా రక్షణలో వుంటావు - సరేనా?"

ప్రకాశం మాటలకు చంద్రం జవాబు ఇవ్వలేకపోయాడు. తల వంచుకుని మౌనంగా కూర్చున్నాడు.

అంతవరకూ ఊపిరి బిగబట్టి స్నేహితు లిద్దరి మాటలు శ్రద్ధగా వింటున్న గౌరికి చంద్రం ప్రస్తుతం ఎక్కడకూ వెళ్ళటం లేదని మాత్రం అర్థమయింది. తేలికగా గాలి పీల్చుకుంది. అప్పుడు కాని ఆమెకు వంటింట్లోకి పొయ్యిమీద మాడిపోతున్న కూర వాసన రాలేదు. గబగబా లేచి వంటింటిలోకి వెళ్ళిపోయింది.

"ఏమిటిరా ఆ మౌనం? నీకు ఇష్టం లేకపోతే వెళ్ళిపో" అన్నాడు ప్రకాశం విసుగ్గా.

"చాలా పెద్ద శిక్షే విధించావు ప్రకాశ్!" అన్నాడు చంద్రం నీరసంగా.

"మరి నువ్వు నాకు చేసిన అన్యాయం చిన్నదనుకుంటున్నావా? దానికి తగిన శిక్ష ఇదే. కాగితాలూ ఇలా ఇవ్వు" అంటూ చంద్రం చేతులో కవరు అందుకున్నాడు ప్రకాశం. తర్వాత -

"ఏరా చంద్రం! మళ్ళీ ఒకసారయినా హేమను చూట్టానికి వెళ్ళావా?" చంద్రం మనస్సును అర్థం చేసుకున్న ప్రకాశం ప్రశ్నించాడు.

హేమ పేరు వినగానే చంద్రం కళ్ళల్లో కదిలిన కాంతి రేఖలను గమనించాడు ప్రకాశం.

"ఏ ముఖం పెట్టుకొని హేమ దగ్గరకు వెళ్ళమంటావ్?" అన్నాడు చంద్రం చిన్నబుచ్చుకున్న ముఖంతో.

"నీకు అసలు వున్నదే ఒక ముఖం! అసలు వచ్చిన చిక్కే అది, ఏం చేస్తాం? అదే పెట్టుకొని వెళ్ళు. లోకంలో చాలామందికి ఒక ముఖంకంటె ఎక్కువే వుంటాయి ఎప్పుడు ఏది అవసరమో దాన్ని ధరిస్తూ వుంటారు. అలాటివారే ప్రపంచంలో బ్రతకగలరు. వాళ్ళనే లౌక్యం తెలిసినవాళ్ళు అంటారు. అయినా నువ్వు తప్పేం చేశావని? అసలు విషయం చెప్పు. హేమ అంత అర్థం చేసుకోలేని మూర్ఖురాలని నేను అనుకోను" అన్నాడు ప్రకాశం.

ప్రకాశం ప్రోత్సాహంతో చంద్రం హృదయంలో ఆశలపందిరి వెల్లివిరిసింది.

"నాకు బండికి టైమవుతూంది. నువ్వెళ్ళి కాళ్ళూచేతులూ కడుక్కుని బట్టలు మార్చుకో, భోజనం చేసేద్దాం" అన్నాడు ప్రకాశం చంద్రం వీపుమీద చరుస్తూ.

"ఉండరా బాబూ!" అంటూ వీపు తడుముకుంటూ నవ్వుతూ బాత్‌రూమ్‌కు వెళ్ళాడు చంద్రం. టవల్‌తో ముఖం తుడుచుకుంటూ లోపలకు వస్తున్న చంద్రానికి

కాగితాలు కాలిన వాసన వచ్చి, వంటింటి గడపలో నిల్చొని లోపలకు చూశాడు. ప్రకాశం కుంపటిదగ్గర కూర్చొని వున్నాడు. కుంపట్లో కాగితాలు కాలుతున్నాయి. పక్కన తను అంతక్రితం దస్తావేజులు పెట్టి ఇచ్చిన కవరు పడివుంది!

# 16

ఆ రోజు కృష్ణారావు ఇంటిలో జరిగిన సంఘటన హేమ అభిమానాన్నీ, అహంభావాన్నీ, అభిజాత్యాన్నీ, గాయపరచింది. చంద్రంమీద ఒక విధమైన ద్వేషభావం మొలకెత్తింది ఆమెలో. కాని చంద్రం అంటే ఆమెలో ఏర్పడిన బలీయమైన ప్రేమ కొత్తగా ఉద్భవించిన ద్వేషభావం మీద అధికారం ప్రారంభించింది. ప్రేమ-ద్వేషం పోరాటం ప్రారంభమయింది ఆమెలో. ప్రేమిస్తున్న వ్యక్తిని ద్వేషిస్తున్నప్పుడు ఆ హృదయం నరకయాతననే అనుభవిస్తుందేమో! గంభీరంగా, ప్రశాంతంగా వుండే హేమ ముఖంలో దైన్యమూ, చికాకూ, ఆవేదనా కనిపించసాగాయి. ఎప్పుడూ ఆలోచిస్తూ పరధ్యానంగా వుంటున్న హేమను చూసి ప్రసాదరావు లోలోపల కుమిలిపోసాగాడు.

ఆదివారం ప్రసాదరావు ఏదో పనిమీద బయటకు వెళ్ళిపోయాడు. హేమకు ఆ రోజు మరీ మనస్సు బాగా లేదు. ఉండి ఉండి ఆమె ఆలోచనలు చంద్రం వైపు పరుగెత్తసాగాయి. లైబ్రరీ గదిలో అటూ ఇటూ తిరగసాగింది. అంతకుముందు హేమకు ఆ గదికి వెళ్తే మళ్ళీ బయట ప్రపంచం గుర్తే వుండేది కాదు. కాని ఈమధ్య బొత్తిగా ఒక పుస్తకం కూడా చదవలేకపోతూంది.

ఏం చేసినా ఎంతకూ సమయం గడవని హేమ ఒక పుస్తకం తీసుకొనివచ్చి వసారాలో కూర్చుంది. గడియారం ఐదు కొట్టింది. నాన్న వచ్చే సమయం అయింది అనుకుంది. చేతిలోని పుస్తకం పట్టుదలగా చదవసాగింది. పేజీలు తిరుగుతున్నాయి. కాని ఆమేమి చదువుతుందో ఆమెకే బోధపడటం లేదు.

ఆ రోజు ఆమె శరీరంలోని ప్రతి అణువు చంద్రం కోసం తపిస్తున్నట్లనిపిస్తూంది. చంద్రం మళ్ళీ తిరిగి తన జీవితంలో ప్రవేశించకుండా వున్నా బాగుండేది. మళ్ళీ తిరిగివచ్చి ప్రశాంత సరోవరంలా వున్న తన మనస్సులోకి రాయి విసిరాడు. ఎంత నాటకం! ఎన్ని అబద్ధాలు! ఆ కొద్ది క్షణాలల్లోనే తనను ఆశాసౌధాలకు ఎక్కించాడు. పుట్టుకతో పుట్టిన బుద్ధిని మార్చటం ఎవరితరం? చిన్నతనంలోనే దొంగతనం చేసి ఇల్లు విడిచి పారిపోయిన ఒక అల్పుణ్ణి తను ఆదర్శమూర్తిగా చిత్రించుకొని పూజించింది. తను చిన్నతనం నుంచీ హృదయ మాధుర్యాన్నంతా చిలకరించి ఎంతో జాగ్రత్తగా పెంచుకున్న ప్రేమ వల్లరి, తెలివితక్కువగా కళ్ళుమూసుకొని నడవటంవల్ల, అది తన కాళ్ళకే చుట్టుకుంది. దాన్ని నిర్దయగా తెంచుకొని ముందుకుపోక తప్పదా?

హేమ ఆలోచనలు. గౌరి వైపుకు మళ్ళాయి. మనస్సంతా జుగుప్సతో నిండిపోయింది. ఆడవిమల్లె అట-అడవిమల్లె! ఎంత మొరటుగా వుంది? ఆ బజారు పిల్లను తనతో పోలుస్తాడా? తను ఇంతకాలం ఎదురు చూసింది ఇంత అతి సాధారణమైన అభిరుచులుగల మగవాడి కోసమా? అందరి ముందూ సిగ్గన్నా లేకుండా

ఆ పిల్ల రెక్క పట్టుకొని ఎలా బర బర ఈడ్చుకుపోయాడు! ఎలాటి సంబంధం లేకపోతే ఆ పిల్లమీద అతనికి అంత అధికారం వస్తుంది? హేమకు దుఃఖం పొర్లుకొచ్చింది.

ఇక తను అతని ముఖం కూడా చూడదు. చంద్రం అంటే తనకు పరమ అసహ్యం.

నిజంగా చంద్రాన్ని చూడకుండా తను వుండగలదా? అయితే ఎందుకీ అశాంతి? చంద్రం నిజంగా తనను ప్రేమించటం లేదా? అతను ఈ నెల రోజుల నుంచి ఒక సారైనా వచ్చాడా? నిజంగా చంద్రం వస్తే తనలో అతన్ని వెళ్ళిపొమ్మని చెప్పగల శక్తివుందా? హేమ ఆలోచనలు బలిసిన గుర్రాలలా పరుగెత్తసాగాయి.

బయట అడుగుల చప్పుడుకు తలఎత్తి చూసింది. హేమ. ఎదురుగా చంద్రం! గోధుమ వన్నె టెర్లిన్‌షర్టు, నల్లటి ట్వీడ్ పాంటు లోపలకు వేసుకున్నాడు. పైజమా - లాల్చీతో కంటె సొగసుగా అందంగా వున్నాడనుకుంది హేమ. చంద్రాన్ని చూడగానే హేమ ముఖం వెలిగిపోయింది సంతోషంతో. అంతవరకూ వున్న ఆలోచనలన్నీ ఒక్కసారి ఎక్కడికో పారిపోయాయి. తనలో వుబికి వస్తున్న ఆనందాన్ని అతికష్టంమీద అణచుకుంది. ముభావంగా, తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో అంది -

"కూర్చో చంద్రం!"

చంద్రం అపరాధిలా హేమకు ఎదురుగా వున్న కుర్చీలో మౌనంగా కూర్చున్నాడు. ఇద్దరి మధ్యా భరించరాని మౌనం. ఇంతలో వంటమనిషి హేమ కోసం కాఫీ తెచ్చింది. మరోకప్పు తెమ్మని చెప్పి తన చేతిలో కప్పును చంద్రానికి అందిస్తూ "కాఫీ తీసుకో చంద్రం!" అంది.

కాఫీ కప్పును అందుకుంటూ చంద్రం హేమ ముఖంలోకి చూశాడు. నిర్వికారంగా వున్న హేమ ముఖం చంద్రానికి ఒక సమస్యగా మారింది. ఆనాటి సంఘటన ఆమెమీద ఎలాంటి ప్రభావాన్నీ కలిగించ లేదా? ఏమీ జరగనట్లే వుంది!

"మరి నీకో?" అంటూ కాఫీ కప్పును అందుకున్నాడు చంద్రం, ఆలోచనల నుంచి బయటపడుతూ.

"ఇదుగో, నాకూ వచ్చింది" అంటూ వంట మనిషి తెచ్చిన కాఫీ కప్పును అందుకుంది.

మళ్ళీ ఇద్దరి మధ్యా మౌనం. చంద్రం అసలు విషయాన్ని చెప్పటానికి ఇదే తరుణం అనుకొని ప్రారంభించాడు.

"హేమా! ఒక విషయం చెబుతాను, నన్ను - అపార్థం చేసుకోవు గదూ?"

హేమ మాట్లాడలేదు. ఏమిటన్నట్లు అతని ముఖంలోకి చూసింది.

"ఆ రోజు ఆ అమ్మాయి...." హేమ ముఖంలో మార్పును గమనించిన చంద్రం గొంతులో పచ్చి వెలక్కాయపడ్డట్లు అయింది. హేమ అదోలా నవ్వింది. ఆ నవ్వుల్లో నిర్లక్ష్యం, నువ్వు ఏ అమ్మాయితో తిరిగితే నాకేం కావాలనే భావం స్ఫురించింది చంద్రానికి. చంద్రం మనస్సు చివుక్కుమంది. అంతకంటే హేమ తనను నిందిస్తే, తిడితే బాగుండేది

"చంద్రం! ఉదాత్తమైన ప్రేమను ఇతివృత్తంగా తీసుకొని ఒక మంచి నవల రాయకూడదూ?" అంది హేమ ధోరణి మారుస్తూ. హేమ గౌరిని గురించి చర్చించటం కూడా తనకు అవమానంగానే భావించింది.

"ఒక నవల సగం రాశాను – మిగతా సగం పూర్తి చెయ్యాలి" అన్నాడు చంద్రం కూడా తెచ్చిపెట్టుకున్న నిర్లక్ష్యంతో.

హేమ, చంద్రం ఇక్కడనుంచి వెళ్ళిపోయాక జరిగిన విషయాలు తెలుసుకోవటానికి ప్రశ్నలు వేసింది. చంద్రం గురుకుల్, కాంగడీలో విద్యార్థి జీవితం ఎలా వుంటుందో వివరించి చెప్పాడు.

ప్రసాదరావు రాకతో వారి సంభాషణకు అంతరాయం కలిగింది. తనను చూసి ప్రసాదరావు ముఖం చిట్లించుకోవటం చంద్రం చూడకపోలేదు.

"నమస్కారమండీ!" అన్నాడు చంద్రం.

"నమస్కారం. ఎంత సేపయింది వచ్చి చంద్రం!" అన్నాడు ప్రసాదరావు, లేని వుత్సాహం తెచ్చిపెట్టుకుంటూ.

"ఓ గంట అయింది."

"ఇన్ని రోజులకా కనిపించటం? ఏమిటో అంత తీరని పనులు?" అన్నాడు ప్రసాదరావు నిష్ఠురంగా.

"రోజూ రావాలనుకుంటూనే రాలేకపోయాను" అన్నాడు చంద్రం.

ఐదు నిముషాలపాటు మౌనంగా అందరూ వారి వారి ఆలోచనల్లో పడిపోయారు.

"చూడు చంద్రం! నీవు నా బిడ్డలాంటివాడివి. నన్ను అపార్థంచేసుకోకు."

ప్రసాదరావు ఉపోద్ఘాతం దేన్ని గురించో అర్థం చేసుకున్న చంద్రం మౌనంగా వినసాగాడు.

"నిన్ను అభిమానించి, ప్రేమించేవాళ్ళలో నే నొకణ్ణి, కనుక ఇదంతా చెబుతున్నాను"

"మీరు నాకు తండ్రిలాంటివారు. నిరభ్యంతరంగా అడగండి." ఈ విధంగానన్నా తను చెప్పదలచుకున్నది చెప్పటానికి అవకాశం లభిస్తుందని సంతోషంగా అన్నాడు చంద్రం.

"చూడు చంద్రం! మన అంతస్థులనూ, అభిరుచులనూ, సంస్కృతినీ తెలియజేసేవి మనచుట్టూ వుండే స్నేహితులూ, మనం నివసించే ప్రదేశాలూను. నువ్వు ఆ అలగా జనంతోవుంటూ, నిన్ను నీవు క్రిందకు దించేసుకుంటున్నావు. నీతి నియమాలంటే ఏమిటో, సభ్యతా సంస్కృతులంటే ఏమిటో తెలియని ఆ జనంతో నీవు నివసించటం అంత మంచిది కాదు. ఆ రోజు ఆ పిల్ల చూడు ఎలా ప్రవర్తించిందో? అంతమందిలో అలా నిన్ను బయటపడేసిందా లేదా? మాంసం తింటే మాత్రం ఎముకల్ని మెడలో వేసుకొని తిరుగుతామా?"

అంటే – గౌరితో ఎలాటి సంబంధమైనా వుండవచ్చు. దాన్ని అందరూ తెలుసుకోనంతవరకూ అభ్యంతరం లేదన్నమాట! ప్రసాదరావు దృష్టిలో సంఘంలో

అంతస్థులేని వాళ్ళంతా అవినీతిపరులేనా? 'సంస్కారానికి ప్రతిరూపంగా కనిపించే ప్రసాదరావేనా యిలా మాట్లాడుతుంది? భావుకుడైన చంద్రం ఆవేశం పెల్లుబికింది.

"అలాటి ఆడవాళ్ళు సంఘానికి చీడపురుగులు. నీలాంటివాడినే వల్లో వేసుకోగల వీళ్ళు యింకేం చెయ్యరు? ఇలాంటివారు స్త్రీ జాతికే మాయని మచ్చలు-తీరని కళంకాలు!" ప్రసాదరావు కాలేజీ స్టూడెంట్సుకు లెక్చరిస్తున్న ధోరణిలో చెప్పుకుపోతున్నాడు.

"కొయ్యకు చేవ వున్నంతకాలం చీడపట్టదు. కొందరు స్త్రీలు మీరన్నట్లే సంఘానికి చీడపురుగుల్లా తయారుకావచ్చు. కాని దానికి బాధ్యు లెవరు? కొయ్యలో బలహీనత వచ్చినప్పుడే చీడ పడుతుంది. అలాగే సంఘంలో బలహీనతే సంఘానికి చీడపురుగుల్ని తయారుచేస్తుంది. అది చూసి సంఘాన్ని శాసించే అంతస్థుగలవాళ్ళు సిగ్గుపడాలి."

చంద్రం వుద్రేకంగా అన్న మాటలకు హేమకు వళ్ళు మండిపోయింది. చంద్రం ఆ బజారు పిల్లను సమర్థిస్తున్నాడని అసహ్యం వేసింది.

"నువ్వు సమర్థించేవాళ్ళు అందమైన శరీరం మీద పుట్టే కురుపులాంటివారు. చీము, రక్తం కారుతూ చూసేవాళ్ళకు జుగుప్సను కలిగిస్తాయి కురుపులు. అందువల్ల ఆ అందమైన శరీరం అంతా కుళ్ళిపోయిందనీ, ఈ కురుపుకు కారణం అదేననీ నిందించం. అలాగే బరితెగించి, కొందరు ఆడవాళ్ళు వ్యభిచారిణులుగా తయారౌతూ నీతి నియామాలు లేకుండా ప్రవర్తిస్తూ సంఘానికి మానని జుగుప్సాకరమైన కురుపుల్లా తయారవుతున్నారంటే నువ్వు మొత్తం సంఘాన్నే ఎలా నిందిస్తావు?" అంది హేమ. ఆమె ధోరణిలో ఉద్రేకంకంటే ఎక్కువగా ఉడుకుబోతుతనం ధ్వనించింది.

చంద్రం నవ్వుతూ తాపీగా జవాబిచ్చాడు:

"శరీరం అందంగా పైకి ఆరోగ్యంగా కనిపించవచ్చును. కాని శరీరం మీద అసలు కురుపు పుట్టటం అంటే ఆ శరీరం అంతా అనారోగ్యానికి గురి అయిందన్న మాట. రక్తంలో రోగక్రిములు ప్రవేశించి రక్తాన్నంతా కలుషితం చేస్తున్నాయన్నమాట. ఆ చచ్చిన క్రిములు కురుపు ద్వారా బయటపడకపోతే లోలోపలే కుళ్ళి, రక్తాన్నంతా విషతుల్యంగా మార్చవచ్చు. అంటే – ఒక విధంగా ఆ కురుపు ఆ శరీరాన్ని కాపాడుతుంది. అలాగే సంఘం పైకి చాలా అందంగా కనిపించవచ్చు. పెద్ద మనుషుల్లా సంస్కారపు ముసుగుల్లో నవ నాగరీకుల్లా, నీతిమంతుల్లా కనిపించే ఎందరు తమకు దొరికిన అవకాశాలను ఉపయోగించుకోకుండా వుండకలుగుతున్నారు? అలాంటివారిలో బయలుదేరిన అనారోగ్యమే కొందరు అనహాయులు సంఘానికి కురుపుల్లా తయారుకావటానికి కారణం మనకు చరిత్ర ద్వారా తెలిసిన మొదటి వేశ్య మన దేశంలో అంబాపాలి. ఆమెతోనే అది ఒక వృత్తిగా తయారయినట్లు తెలుస్తుంది. తమ సామ్రాజ్యాన్ని సుస్థిరంగా వుంచాలంటే పెద్ద అధికారులంతా ఐకమత్యంగా వుండాలి. దాని కొరకు అందరికీ ఇష్టమైనదీ, అందరికీ సమానంగా వుపభోగ్యమయినదీ అయిన ఒక వస్తువుండాలని కొందరు రాజనీతిజ్ఞులు అందమైన అంబాపాలీని వేశ్యగా మార్చారు."

"అంటే – నువ్వు అవినీతినీ, వ్యభిచారాన్నీ సమర్థిస్తున్నావన్నమాట" అన్నాడు ప్రసాదరావు దుడుకుగా.

"నేను అవినీతిని సమర్థించటం లేదు. అసలు ఏది అవినీతో తెలుసుకో మంటున్నాను. ఆ మాటకొస్తే అవినీతి అనేది దేశ కాలాలనుబట్టి మారుతూ ఉంటుంది. మనం దేనిని ఈనాడు నీతి అనుకుంటున్నామో అది కొన్నాళ్ళ తరువాత అవినీతిగా పరిగణించ బడవచ్చును."

"ఆ జనంతో చేరి వాళ్ళను వెనకేసుకొస్తున్నావన్నమాట" ప్రసాదరావు ఈసడింపుగా అన్నాడు.

చంద్రం ఓ క్షణకాలం విస్తుపోయి ప్రసాదరావు ముఖంలోకి దీక్షగా చూసి మళ్ళీ ప్రారంభించాడు:

"ఆర్థికంగా, సాంఘికంగా, తక్కువ స్థాయిలో వుండి చదువూ, నాగరికతా లేని వాళ్ళంతా నీతిలేని వాళ్ళనుకోవటం, ముఖ్యంగా, మీలాటివారు అనుకోవటం - చాలా పొరపాటు. అన్నీ వుండీ అవినీతిగా ప్రవర్తిస్తూ కూడా సంఘంలో ప్రముఖ స్థానాలను ఆక్రమించుకొని పెద్ద మనుషుల్లా, గౌరవనీయుల్లా, చలామణీ అవుతున్నవాళ్ళు ఎందరు లేరు? ఉదాహరణకు, గౌరిని, అంటే ఆ రోజు మీరు చూసిన అమ్మాయిని తీసుకోండి. మీరు అనుకున్నట్లు ఇంకా ఆ అమ్మాయి ఎలాంటి అవినీతికరమైన జీవితానికీ పాలుపడలేదు. మీరు ఆ అమ్మాయిని గురించి ఊహించుకున్నదంతా భ్రమ మాత్రమే. చిన్నతనం నుంచీ ప్రపంచానికి దూరంగా అనాధ శరణాలయంలో చేరింది. చదువు సంధ్యలు లేకపోయినా, అమాయకురాలే అయినా, ఆమెలో అవినీతిని ఎదుర్కొనే స్వభావం ఉంది. అందుకే అవినీతిని ప్రోత్సహించే ఆ శరణాలయం నుంచి పారిపోయి వచ్చింది. ఆ పిల్లకి అదృష్టవశాత్తూ ప్రకాశం దగ్గిర ఆశ్రయం దొరికింది. లేకపోతే ఆ వయస్సులో వున్న ఆడపిల్ల అనాధగా బజారులో నిలిచిపోయినప్పుడు సంఘం ఆమెను నీతిగా బతకనిస్తుందా? ఒకవేళ ఆ పిల్లే చెడిపోయి వుంటే - దానికి బాధ్యులు ఎవరై ఉండే వారు?"

చంద్రం ఉద్రేకంతో మాటలు దొరక్క ఓ నిముషం మౌనం వహించాడు. మళ్ళీ అదే ధోరణిలో అందుకున్నాడు:

"మానవుడు కొంతవరకే పరిస్థితులకు ఎదురు ఈదగలడు. చివరకు ప్రవాహ వేగానికి తలవంచక తప్పదు. ముఖ్యంగా గౌరిలాంటి అనాధల జీవితాలు, ఖాళీ అయిన తరవాత నీటిమీద పారవేసిన వార్నీసు డబ్బాల లాటివి. నీటి ప్రవాహం మీద ఖాళీడబ్బా కొంతసేపు మునుగుతూ తేలుతూ ముందుకుపోతుంది. ఆ ప్రవాహం కొంతసేపు దానితో ఆడుకొని చివరకు పూర్తిగా ముంచివేస్తుంది. అలాగే వీరికోసం ఎలాంటి వసతులూ, సౌకర్యాలూ ఎవరూ కల్పించలేదు. పెద్దవారి అండా, రక్షణా, ప్రేమా ఉండదు. తెగిన గాలిపటాలలాటి వారి బ్రతుకులు ఎటు పోతాయో, ఏ ముళ్ళ కంచెమీద పడి చిరిగిపోతాయో ఎవరికీ అక్కరలేదు. కాని, చివరకు దగాపడిన వారి జీవితాలను చూసి సంఘానికి చీడపురుగులంటూ ఏవగించుకుంటారు."

వింటున్న హేమ ముఖం కోపంతో కందగడ్డలా అయింది. ప్రసాదరావు చంద్రం మాటలకు అడ్డువస్తూ అన్నాడు:

"నువ్వు సమర్థిస్తున్న ఆ పిల్ల ఏ పాప ఫలమో అయివుంటుంది. అందుకే అనాధశరణాలయానికి చేరవేయబడింది." ప్రసాదరావు స్వరంలో ఉద్రేకం కంటే కోపం ఎక్కువగా ధ్వనించింది.

చంద్రం ముఖంలో ఉద్రేకం స్థానాన్ని చిరునవ్వు ఆక్రమించుకుంది. తాపీగా ప్రసాదరావు ముఖంలో ఓ క్షణం చూసి అన్నాడు:

"కావచ్చు. కాని, అది ఆ అమ్మాయి చేసిన తప్పు కాదుగా! ఏ అవివాహితో లేక వితంతువో దగాపడి వుంటుంది. జీవితంలో మోసగింపబడి వుంటుంది. ఫలితంగా మోసగించి పారిపోయిన వాడికి సంఘంలో యధాస్థానం ఉంటుంది. కానీ మోసగింపబడిన ఆ అమాయకురాల్ని సంఘం బహిష్కరిస్తుంది. కన్న తల్లిదండ్రులు కూడా క్షమించరు. అలాటప్పుడు ఆమె ఏం చేస్తుంది? ఈ సందర్భంలో ఎక్కడో చదివిన వాక్కులు గుర్తొస్తున్నాయి..... 'ఒక స్త్రీ తన మెడలోని ముత్యాల హారాన్ని ఏం చేసినా సంఘం పట్టించుకోదు. పదిమంది చూస్తుండగా ఆమె దాన్ని నదిలో పారేసినా ఆమెను శిక్షించదు. కాని తమ శరీరంలోని భాగమైన గర్భాన్ని గాయపరచుకుంటే ఆమెను న్యాయశాస్త్రం శిక్షిస్తుంది. అలాంటి స్త్రీలు రహస్యంగా ఇల్లు విడిచి పారిపోయి ఆ పుట్టిన బిడ్డల్ని ఏ శరణాలయాల్లోనో పారేస్తున్నారు! దానికి బాధ్యులు ఎవరంటారు? నిజంగా చెప్పాలంటే – ఇలాంటివాటికి సంఘంలోని ప్రతి ఒక్కరూ బాధ్యులే!"

ప్రసాదరావు ముఖం వాడిపోయింది. హేమ అతిబలవంతం మీద ఉద్రేకాన్ని అణచుకుంటున్నది.

చంద్రం ఇదేమీ పట్టించుకోకుండా చెప్పుకుపోసాగాడు:

"ఇలాటిదే ఒక సంఘటన చెబుతాను. అంతా విని, దానికి బాధ్యులు ఎవరో చెప్పండి. నేను బొంబాయిలో వున్నప్పుడు నాకు ఒక ఆంధ్రుడు ఆశ్రయం ఇచ్చాడు. ఆయన చాలా మంచివాడు. ఉదారత్వం అనేది ఎలా వుంటుందో ఆయన దగ్గిర చూడవచ్చును. ఆయనకు దాదాపు ఏభయ్ ఐదు ఏళ్ళు వుంటాయి. ఏదో కంపెనీలో పెద్ద ఉద్యోగమే చేస్తున్నాడు. ఆంధ్రులంటే ఆయనకు మహా అభిమానం అతని భార్యకు మతి స్థిమితం లేదు. వారికి ఒకే కుమార్తె ఉండేదట. వారి మంచితనమే వాళ్ళ కొంపకూల్చింది. మనవైపు నుంచి ఎవరో యువకుడు బొంబాయిలో ఆరునెలల ట్రైనింగ్ కోసం వెళ్ళాడట. తెలిసినవాళ్ళెవరో ఆయనకు బొంబాయిలోవున్న ఆ పెద్దమనిషి అడ్రసు ఇచ్చి పంపారట. ఆ ఆరునెలలూ వాళ్ళు ఆ అబ్బాయిని బలవంతంగా తమ ఇంటిలోనే ఉంచుకొని బిడ్డలా చూశారట. ఆ సమయంలోనే అతనికి ఎలాగో వారి అమ్మాయితో సాన్నిహిత్యం ఏర్పడింది. అతని ట్రయినింగు పూర్తికాగానే వెళ్ళిపోయాడు. ఆ తరవాత రెండు నెలలకు ఆ అమ్మాయి అర్ధరాత్రి యిల్లు విడిచి పారిపోయింది. కారణం వేరుగా చెప్పనక్కరలేదు. ఆమె రాసి పెట్టిన ఉత్తరం చూసుకున్న తల్లిదండ్రుల పరిస్థితి ఏమైవుంటుందో ఊహించుకోవచ్చును. మాటవరసకు ఈ గౌరి ఆ అమ్మాయికి పుట్టిన పాపఫలమే ననుకోండి.... అలాటప్పుడు..."

"నీకు పుణ్యం వుంటుంది చంద్రం! ఇక మాట్లాడకు!" అరిచాడు ప్రసాదరావు. చంద్రం, హేమ ఆశ్చర్యంగా ప్రసాదరావు ముఖంలోకి చూశారు. అప్పటికే

ఆయనవళ్ళంతా చెమటపట్టి వుంది. లేచి వెళ్ళబోయి తూలిన ప్రసాదరావును చంద్రం, హేమా పట్టుకొని ఆయన గదిలోకి తీసుకెళ్ళి పడుకోబెట్టారు.

"క్షమించండి. నేను మిమ్మల్ని చాలా బాధపెట్టినట్లున్నాను" అన్నాడు చంద్రం అపరాధిలా.

ప్రసాదరావు కళ్ళు మూసుకొని పడుకొని వున్నాడు. హేమ తిరస్కారంగా చంద్రం ముఖంలోకి చూసి గబగబా గదినుంచి బయటకువచ్చి మేడమీదకు వెళ్ళిపోయింది.

హేమకు క్షమాపణ చెప్పుకోవాలని నిల్చున్నాడు చంద్రం. కాని, హేమ ఎంతకూ రాలేదు. ఏమిటా ఇలా జరిగింది! తను అనుకున్నదేమిటి? అనుకోకుండా ఏర్పడిన గండిని పూడ్చటానికి వచ్చిన తను హేమ మధ్య తన మధ్య- అగడ్తనే త్రవ్వుకున్నాడు. తను ఏది చెయ్యాలనుకుంటాడో దానికి వ్యతిరేకంగా జరుగుతూంది!

ఆలోచిస్తూ - బరువుగా, భారంగా, బయటకు నడిచాడు చంద్రం.

# 17

పోరాటం వ్యక్తుల మధ్య జరగదు. వ్యక్తుల విభిన్న ఆదర్శాల మధ్య జరుగుతుంది విభిన్న ఆదర్శాలు, అభిరుచులూ గల ఇద్దరు వ్యక్తులు ప్రాణస్నేహితులుగానో, లేక ప్రేమికులుగానో వుండగలుగుతున్నారంటే వారిలో మానవత వారి అభిరుచులనూ, ఆదర్శాలనూ అదుపులో పెట్టగలిగి వుండివుండాలి. ఈ కోవకు చెందిన వ్యక్తులు జీవితంతో రాజీ పడగలరు. పరిస్థితులతో రాజీ పడటం మానవ వికాసానికి గొడ్డలిపెట్టే కావచ్చును కాని తను ప్రేమించే హృదయం ముందు తన ఆదర్శాలను, అభిరుచులనూ అదుపులో పెట్టుకోక తప్పదు. అలా కానప్పుడు ఇద్దరు ప్రత్యేక వ్యక్తిత్వంగల వ్యక్తులు ఒకరికొకరు ఎంత దగ్గరకు రావాలని ప్రయత్నించినా దూరం అవుతూనే వుంటారు.

చంద్రం, హేమల మధ్య ఇలాటి పోరాటమే జరుగుతున్నది. వారిద్దరూ ఒకరికొకరు ఎంత దగ్గరకు రావాలని ప్రయత్నిస్తున్నారో అంత దూరం అవుతున్నారు. హేమలోని అభిమానం, అభిజాత్యం తన ప్రేమను ప్రకటించడంలో అడ్డుపడుతున్నాయి.

అవమానించబడిన ప్రేమ ద్వేషంగా మారుతుంది. కృష్ణారావు ఇంట్లో జరిగిన సంఘటన హేమ అహాన్ని దెబ్బకొట్టింది. చంద్రం, గౌరి లాటివారిని సమర్థించటం గాయపడిన హృదయాన్ని మళ్ళీ రేపినట్లయింది. ఆమె హృదయాంతరాళాల్లో ఎక్కడో లోతుగా చంద్రం యెడల ద్వేషం తేలు పిల్లలా కదలసాగింది. తను ప్రేమించే వ్యక్తినే ద్వేషించ సాగిన హృదయం పడే యాతనంత బాధ మరోటి లేదేమోననిపిస్తుంది హేమకు.

ప్రేమ, ద్వేషం మధ్య జరుగుతున్న పోరాటంలో హేమ హృదయం విలవిల్లాడి పోతుంది. ఏదో అశాంతి నీడలా వెన్నంటసాగింది హేమను. చంద్రం ఆ ఊరువచ్చి నాలుగు నెలలు కావస్తుంది. దాదాపు రోజూ సాయంత్రం హేమ దగ్గిరకు వస్తూనే వున్నాడు. హేమ ఒకవైపు చంద్రాన్ని అసహ్యించుకుంటూనే- కొంచెం అతను రావటం ఆలస్యం అయితే అశాంతితో అల్లాడిపోతుంది. ఒకరోజు రాకపోతే గౌరితో చంద్రాన్ని

ఊహించుకొంటూ అతన్ని అసహ్యించుకొంటుంది. అతన్ని చూట్టం, అతనితో మాట్లాడడం తనకు అసహ్యం అనుకొంటుంది. మళ్ళీ అతని ముఖం చూడకూడదని ఎన్నోసార్లు నిర్ణయించుకుంటుంది. అంతలోనే వెక్కివెక్కి ఏడ్చేస్తుంది. ఆ తరవాత హృదయం కొంత తేలిక పడుతుంది. ద్వేషం స్థానాన్ని ప్రేమ వశపరుచుకుంటుంది. చంద్రంకోసం మనస్సు గిజగిజలాడిపోతుంది.

వారం రోజులనుంచీ చంద్రం రాకపోవటానికి కారణం అనేక రకాలుగా వూహించుకోసాగింది హేమ. ఆ రోజు సాయంత్రం ఆమె హృదయం శ్రావణ మేఘంలా భారంగా ఏ కొంచెం చల్లగాలి తగిలినా వర్షించటానికి సిద్ధంగా వుంది.

హేమ అశాంతిగా ఇంటిముందు ఆవరణలో తిరుగుతోంది. తనకు తెలియకుండానే మొక్కల పువ్వులు తెంపింది. ఆకులు పళ్ళ సందునుంచి చేత్తో చింపుతుంది. లోపలకు వెళుతుంది. హాలులో ఆగి మళ్ళీ వెనక్కు వరండాలోకి వస్తుంది.

ఈ రోజు ఏమయినా తను ఖచ్చితంగా చెప్పదల్చుకుంది. తను అంత చవకబారు అభిరుచులుగల మొగవానిని ప్రేమించలేదు - చంద్రం అంటే తనకు అసహ్యం. అతనితో ఆ మాట ఈ రోజు చెప్పేస్తుంది. లేకపోతే తనను ఏమనుకున్నాడు? కాలక్షేపంకోసం తన దగ్గరకు వచ్చి కబుర్లు చెబుతున్నాడా? ఆ బజారు పిల్లకోసం ఆ గుడిసెల్లో పడివుంటాడా? తనంటే ఏ కొంచెం లక్ష్యంవున్నా తన అభిరుచులను తెలుసుకోవటానికి ప్రయత్నించాడా?

ఆ అమ్మాయితో.... ఛీ! అలాంటివాడిని తను ప్రేమించటం ఏమిటి? చంద్రంలో బలహీనత వుంది కాబట్టే తనదగ్గర చనువు తీసుకోలేకపోతున్నాడు. ఒక వ్యక్తి ఒకేసారి ఇద్దర్ని ప్రేమించగలడా? కేవలం వ్యామోహం.... ఆలోచిస్తున్న హేమకు గుండెలు చిక్కవట్టినట్లయింది. వెళ్ళి వరండాలోవున్న కుర్చీలో యాంత్రికంగా కూలబడింది. కళ్ళనుంచి తనకు తెలియకుండానే ఎంతోసేపుగానో కారుతున్న నీటిని ఉలిక్కిపడి గబగబా తుడుచుకుంది. ఇంకానయం- చంద్రం రాలేదు. తను ఏడుస్తున్నట్లు కనిపిస్తే చంద్రం దృష్టిలో ఇంకా చవక అయివుండును.

తను చంద్రాన్ని నిజంగా అసహ్యించుకుంటుందా? కాదు.... తన ప్రేమను అవమానించాడనే కక్షకొద్దీ తనే కావాలని అతనిమీద అసహ్యాన్ని పెంచుకోవటానికి ప్రయత్నిస్తున్నది. కాని అది సాధ్యమా?

చిన్ననాటి స్నేహం తనకు తెలియకుండానే ప్రేమ రూపాన్ని ధరించి తనలోని ప్రతి జీవాణువుతోపాటు పెరిగింది. రక్తంలో ప్రవహిస్తూంది. తనలోని రక్తం గడ్డకట్టిననాడుకాని చంద్రం యెడల ప్రేమ కరడుకట్టదు. రక్తనాళాలలో రక్తంతోపాటు ప్రవహిస్తూ హృదయంలోకి ప్రతి నిముషం ప్రవేశిస్తూనే వుంది. చంద్రం ప్రేమను ద్వేషిస్తుందంటే తనను తానే ద్వేషించుకుంటుందన్నమాట!

తను చంద్రాన్ని మరచిపోవటం అసంభవం. అతనులేని జీవితం తనకు అక్కరలేదు. మగవాడు - పైగా, పెద్దల రక్షణకు దూరంగా పెరిగినవాడు. పరిస్థితుల కారణంగా కొన్ని అలవాట్లకు లొంగిపోయి వుండవచ్చు. తను చంద్రాన్ని సానుభూతితో అర్థం చేసుకొని, అతన్ని తనకు అనుకూలంగా మార్చుకోవడానికి బదులుగా, ప్రతి చిన్న

విషయాన్ని కొండంతగా ఊహించుకొని అసహ్యించుకుంటూ అతన్ని దూరం చేసుకుంటున్నది. అసహ్యంతో వ్యక్తుల్ని దూరం చేసుకుంటామేకాని దగ్గరకు లాక్కోలేము. ఇకనుంచి తన హృదయం మీది కృత్రిమ తెరలను తొలగించుకొని చంద్రాన్ని దగ్గరగా తీసుకోవాలి.

చంద్రం మరీ అమాయకుడిలా వున్నాడు. తన ముఖంలోని జుగుప్సను చూసినప్పుడు చంద్రం ముఖాన్ని ఎంత చిన్నబుచ్చుకుంటాడో! అలా చిన్నబోయిన చంద్రం ముఖం చూస్తుంటే తన రెండు చేతులు అతని మెడచుట్టూ చుట్టి అనునయించాలనిపిస్తుంది. కాని, తను చస్తే అలా చెయ్యలేదు- ఎందువల్ల?

చంద్రం అలా దూరదూరంగా ఎందుకుంటున్నాడు? చంద్రానికే ధైర్యంవుండి ఇంగ్లీషు సినిమాల్లో, కొన్ని నవలల్లోని హీరోల్లాగా బలవంతంగా తనను దగ్గరకు లాక్కుంటే తను లొంగిపోకుండా వుండగలదా? అభిమానంగల స్త్రీ ఎప్పుడూ తను ప్రేమిస్తున్న వ్యక్తులద్వారా శాసించబడాలని కోరుకుంటుంది. ప్రేమతో కూడిన అధికారానికి లొంగని స్త్రీ హృదయం వుండదేమోనని తను అనుకుంటూ వుంటుంది అప్పుడప్పుడు. రచయిత అయిన చంద్రం తనలోని బలహీనతను ఎందుకు అర్థం చేసుకోలేకపోతున్నాడు?

ఎవరో గేటు తెరుచుకొని లోపలకు వస్తున్నట్లు ఆలోచనల్లోవున్న హేమకు లీలగా అనిపించి అటువైపు చూసింది. చంద్రం! అంతవరకూ చీకటి గదిలో దేనికోసమో వెతుకుతున్న హేమకు అకస్మాత్తుగా ఎవరో మెర్క్యూరీ లైటు వేసినట్లనిపించింది. హృదయంలోని ఆ వెలుగును కళ్ళద్వారా బయటపడకుండా బలవంతంగా వెనక్కు నెట్టేసింది. లేనిపోని గాంభీర్యాన్ని తెచ్చిపెట్టుకొన్నది ముఖంలోకి.

చంద్రం వచ్చి హేమకు ఎదురుగావున్న కుర్చీలో కూర్చున్నాడు. హేమ చిరునవ్వుకు జవాబుగా నవ్వలేదు. చంద్రం మూతి బిగింపు చూసిన హేమకు నవ్వు వచ్చింది.

"ఇంటిలో చాలా వుక్కగా వుంది. అలా ఓసారి పార్కు వైపుకు వెళదామా చంద్రం?"

హేమ మాటలను నమ్మలేనట్లు విస్మయంగా చూశాడు చంద్రం. చంద్రం వాలకం చూస్తుంటే ఆ రోజు ఏదో నిర్ణయించుకొని, పోట్లాటకు సిద్ధంగా వచ్చినట్లనిపించి హేమకు తమాషా అనుభూతి కలిగింది. తనకు కావాల్సింది అదేనేమో!

హేమ, చంద్రం జవాబుకు ఎదురు చూడకుండానే లోపలకు వెళ్ళి, ఐదు నిముషాల్లో హేండ్‌బాగ్‌తో వచ్చి నిల్చుంది. చంద్రం లేచి యాంత్రికంగా హేమ వెనకనే నడవసాగాడు. హేమ ప్రవర్తనలో మార్పు చంద్రాన్ని ఆశ్చర్యంలో ముంచివేసింది. పార్కు రెండు ఫర్లాంగుల దూరంలోనే వుంది. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. అలా ఒకరి పక్కన ఒకరు నడుస్తూ ఎవరి ఊహల్లో వారు తేలిపోతున్నారు.

హేమ తన పక్కన అలా నడుస్తుంటే చంద్రానికి ఎన్నో సామ్రాజ్యాలను జయించినట్లుంది. ఆనాడు తను గౌరితో నడుస్తూ అందరూ తనవంకే చూస్తుంటే సిగ్గుతో తాబేలులా ముడుచుకుపోయాడు. తాబేలులాగా తనకూ ఓ కవచం వుంటే ఎంత బావుణ్ణు! ఎవరికీ కనిపించకుండా అందులోకి ముడుచుకుపోదును అనిపించింది. కాని ఆ మాటే ప్రకాశంతో అంటే తనను క్షమించడు. తనకు న్యాయంగా అలా

అనిపించకూడదు. అది తన బలహీనతే కావచ్చు. కాని, ఈ రోజు తను సగర్వంగా నలుగురూ చూడాలన్నట్లు నడుస్తున్నాడు...

ఈ చంద్రం ఏమిటి? తను చొరవతీసుకున్నా మాట్లాడడేం? బహుశా తన ప్రవర్తనలోని మార్పును ఊహించుకోలేకుండా వున్నాడేమో! పార్కులో తనూ - చంద్రం.....

చంద్రం, చక్కగా కత్తిరించి పెంచిన గరికమీద పడుకున్నాడు. తల కుడిచేతిమీద ఆనించి ఎదురుగా కూర్చున్న తన ముఖంలోకి రెప్పవెయ్యకుండా ఎలా చూస్తున్నాడో! తను సిగ్గుతోటి 'టచ్ మి నాట్'లా ముడుచుకుపోతుంది! అలా చూసి చూసి ఒక్కసారిగా తన చెయ్యి పట్టుకొని ముందుకు లాగాడు. తన తల చంద్రం గుండెలమీద పడింది.

హేమ ఉలిక్కిపడింది. పార్కు గేటుముందుకు వచ్చారు. అంతా పగటి కలేనా?

చంద్రం ఒక మూలగావున్న బెంచీవైపుకు నడుస్తున్నాడు హేమకు నిరుత్సాహం అనిపించింది. పలక్కుండా వెళ్ళి బెంచీమీద చంద్రం పక్కగా కూర్చుంది.

"నాలుగు రోజులుగా రాలేదేం?" హేమ ప్రశ్నించింది. చంద్రం ఎన్ని రోజులు రాకపోయినా అతని రాకపోకలు తనకేం పట్టనట్టు నటించే హేమ అలా ప్రశ్నించటంతో చంద్రం ఆశ్చర్యానికి అంతులేదు. చంద్రంలో సంతోషం పాలపొంగులా పొంగుతుంది. కాని, చంద్రానికి మరోవైపు అనుమానంగానే వుంది- తనకు అంత అదృష్టమా అని. "ప్రకాశంవాళ్ళ యూనియన్ వార్షికోత్సవానికి ఒక నృత్య నాటిక రాయమంటే రాశాను. గౌరి అభినయిస్తుంది. నేను ఆ హడావిడిలో వున్నాను."

"గౌరి! ఎవరా గౌరి? ఆ బజారు పిల్లకాని కాదుగదా! గౌరి ఎవరు?"

హేమ ప్రశ్నకు చంద్రం జవాబు ఇవ్వటానికి కొంచెం జంకడం గమనించింది. "ఆ అడవిమల్లేనా?" స్వరంలో హేళన!

హేమ స్వరంలోని అవహేళనకు చంద్రం మనస్సు చివుక్కుమంది. హేమ కళ్ళలో తిరస్కారం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. ఏమిటీ హేమ? చాలా చిత్రమయిన మనిషి!

"ఇవాళే ప్రోగ్రాం! నిన్ను కూడా తీసుకు వెళ్ళటానికి వచ్చాను" అన్నాడు చంద్రం - హేమకు కలిగిన అనుమానాన్ని వెనక్కు నెట్టటానికి ప్రయత్నిస్తూ. అతను తిరిగేది కాకుండా తననుకూడా అలగా జనంలోకి రమ్మంటున్నాడు. హేమకు కోపం వచ్చిందికాని, అణచుకుంది. ఇలా లాభంలేదు. తను చంద్రం మంచి - చెడ్డ విషయంలో జోక్యం కలిగించుకోక తప్పదు అనుకుంది.

"నువ్వు రాసిన బ్యాలె నాకు కావాలి. మా కాలేజీలో ప్రదర్శిస్తాం" అంది హేమ, మాటల ధోరణిని మరోవైపుకు మరల్చుతూ.

"అయితే, ఇవ్వాళ నువ్వు రావన్నమాట?" అన్నాడు చంద్రం.

"నన్ను బలవంతం చెయ్యకు చంద్రం! ఆ జనంలో నాకు ఊపిరి సలపదు. ఇవ్వాళ నువ్వు ఎక్కడకూ వెళ్ళటానికి వీల్లేదు, మాతో భోజనం చేసి వెళ్ళాలి" అంది హేమ.

నిజంగా హేమ ఇవ్వాళ చాలా చిత్రంగా ప్రవర్తిస్తూంది. హేమ అంత చనువుగా వుంటే తను ఆ అవకాశాన్ని ఎలా జారవిడుచుకోవటం? కాని, ప్రకాశం.... గౌరి....ఇద్దరూ తను రాకపోతే చాలా బాధపడతారు.

"ఏమిటో అంత ఆలోచన! వెళ్ళటానికి వీల్లేదు – అంతే!" అతి చనువుగా అధికార యుక్తంగా అంది హేమ. చంద్రం లొంగిపోయాడు.

"నీవు ఆజ్ఞాపిస్తే కాదనేశక్తి నాలోలేదు. అలాగే కానీ."

"కానీలు ఏనాడో పోయాయి. నయాపైసా అను. లే వెళదాం, నాన్న వచ్చివుంటారు" అంటూ హేమ లేచింది.

చంద్రం హేమ చెయ్యిపట్టుకొని లాగి కూర్చోబెట్టాడు. "అప్పుడే ఏం తొందరా? నీతో కొంచెం మాట్లాడాలి, కూర్చో" అన్నాడు చంద్రం.

హేమ కొంచెం గాబరాపడ్డది. "ఏం మాట్లాడతావు?"

ఈ రోజు చంద్రం ఇంటిలో బయలుదేరినప్పుడే అసలు హేమ తనను ప్రేమిస్తున్నదో, లేదో తేల్చుకోవాలని నిర్ణయించుకొని బయలుదేరాడు. ఈ ముసుగులో ఆట ఎంత కాలమో తేల్చుకోదలచుకున్నాడు. అనుకోకుండా హేమకూడా సుముఖంగానే ఉన్నందుకు సంతోషించాడు చంద్రం.

"నేను నీతో మాట్లాడదగినవి ఏమీ లేవా? ఇటు నా ముఖంలోకి చూసి చెప్పు" అంటూ చంద్రం, ఎదురుగా వున్న ఫౌన్‌టెన్ వైపుకు చూస్తున్నట్లు నటిస్తున్న హేమ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు గోముగా. హేమ విముఖతను చూపించలేదు. చంద్రం ఆమెను దగ్గరకు తీసుకుంటూ "హేమా!" అన్నాడు. స్వర్గద్వారంలో అడుగుపెడుతున్న హేమను ఎవరో ఒక్కసారిగా బలంగా కిందకు తోసేశారు. ఎవరది గౌరి! గౌరి రూపం కళ్ళకు కట్టింది. ఈ చంద్రం ఆ బజారు పిల్లను కూడా ఇలాగే...ఛీ....శరీరం మీద పాకుతున్న విషపురుగును విదిలించినట్టు హేమ ఒక్కసారిగా చంద్రం పట్టును విడిపించుకుంది. ఆమె ముఖంలో ఏవగింపు, కళ్ళలో ద్వేషం చూసిన చంద్రంకు మతిపోయినట్టయింది.

అకస్మాత్తుగా తనంటే ఆమెకు అంత అసహ్యం కలగటానికి కారణం ఊహించుకోలేకపోయాడు. హేమను ఓ చిత్రమైన వస్తువును చూసినట్లు కొంచెంసేపు చూశాడు. బహుశా ఆమెకు తనంటే ఇష్టం లేకపోవచ్చును. కేవలం చిన్ననాటి స్నేహితునిగానే అభిమానిస్తుందేమో! కాని, అలాకూడా అనిపించదు. చంద్రానికి విసుగూ, కోపం కలిగాయి.

హేమ ముంజేతిని చాలా గట్టిగా పట్టుకున్నాడు. హేమ లాక్కోవటానికి ప్రయత్నించింది. కాని, చేతిని విడిపించుకోలేకపోయింది. చంద్రం ఆమె చేతినింకా నొక్కాడు. బాధతో హేమ ముఖం కందిపోయింది. చంద్రంలో ఇంత మొరటుతనం, ధైర్యం వుందని వూహించని హేమ విస్తుపోయి చంద్రం ముఖంలోకి చూసింది.

చంద్రం కళ్ళలో ఉద్రేకం, ముఖంలో గాంభీర్యం. "హేమా చెప్పు! నేనంటే నీకు ఇష్టంలేదా? అలానిచెప్పు. "మళ్లీ నీకు అసహ్యం కలిగించే నా ముఖాన్ని చూపించను" అంటూ హేమ చేతిని విసుగ్గా వదిలేశాడు.

నిజంగానే చంద్రానికి కోపం వచ్చింది. చంద్రం నిజంగా అన్నంతపనీ చేస్తాడేమో!

"ఊఁ చెప్పు! నాకు ఇవ్వాళే, ఈ క్షణంలోనే జవాబు కావాలి?" చంద్రం ఒక్కొక్క మాటకు హేమ హృదయం మీటిన వీణలా మధురకంపనంతో తన్మయం చెందుతున్నది.

"నువ్వు చెప్పవు - నాకు తెలుసు. నేనంటే నీకు అసహ్యం. అవును. నీ చదువుకూ, అభిరుచులకూ నేను తగను. దొంగతనం చేసి ఇంటినుంచి పారిపోయినవాణ్ణి. ఏదో చిన్నప్పటి స్నేహితుడుగదా అని ఇంతకాలం నన్ను ఆదరించి భరించావు. క్షమించు. ఇప్పటికే నిన్ను చాలా బాధించాను. మళ్ళీ ఇక జన్మలో నిన్ను బాధించను, సెలవు" అంటూ ఉద్రేకంగా లేచి నిల్చున్న చంద్రం చేతిని గాబరాగా పట్టుకుంది హేమ.

"చంద్రం కోపంలో ఎంత అందగా వుంటాడు!" అనుకుంది. చంద్రం కోపం చూస్తుంటే హేమకు నవ్వు వస్తుంది. హేమ నవ్వుముఖాన్ని చూసిన చంద్రం తన చేతిని విసురుగా లాక్కున్నాడు.

"నన్ను చూస్తుంటే నీకు నవ్వు వస్తుంది గదూ? అందని పండుకై ఎగిరేవాణ్ణి చూస్తే నవ్వురాక మరేం వస్తుందిలే?" స్వరంలో బాధ ధ్వనించింది. చంద్రం ముఖం రాహుగ్రస్తుడైన చంద్రునిలా వుంది.

"ఏమిటి చంద్రం, మరీ అంత చిన్నపిల్లవాడిలా ప్రవర్తిస్తావు? నేను కాదన్నానా?"

"ఆఁ- అయితే ఒప్పుకుంటున్నావా? నన్ను వివాహం చేసుకుంటావా?" చంద్రం సంతోషంగా హేమ రెండు చేతుల్నీ పట్టుకున్నాడు. హేమ వారించలేదు.

"అలాటి ప్రశ్నలకు ఆడపిల్లలు అంత త్వరగా జవాబు ఎలా చెపుతారను కుంటున్నావు?"

"ఐతే పద, ఇప్పుడే నాన్నగారితో మాట్లాడదాం" అన్నాడు చంద్రం.

"అంత తొందరేం వచ్చింది? చంద్రం! వివాహం అనేది జీవితంలో ఒకేసారి జరుగుతుంది. ఒకసారి పొరపాటయితే మళ్ళీ సర్దుకుందాంలే అనుకొనే పనికాదు. వివాహానికి పూర్వం మనం పూర్తిగా ఒకరి నొకరు అర్థం చేసుకోవటం అవసరం. నాకు కొంత సమయం ఇవ్వు ఆలోచించుకోవటానికి."

చంద్రం నిరుత్సాహంగా హేమ చేతుల్ని వదిలేశాడు.

"అదుగో, అప్పుడే అలక. అలక ఆడవాళ్ళకే అందం. పద వెళదాం" అంది హేమ చంద్రాన్ని మందలిస్తున్నట్లు.

"సరే, నీ ఇష్టం" అన్నాడు చంద్రం.

ఇద్దరూ బయలుదేరారు. చంద్రానికి, ముఖ్యంగా హేమకు ఇంతకాలంగా పోగొట్టుకున్న అతి ప్రియమైన వస్తువేదో మళ్ళీ లభించినట్లు అనుభూతి కలిగింది. ఇద్దరూ ఉత్సాహంగా కబుర్లు చెప్పుకొంటూ నడుస్తున్నారు. పార్కు సందు మలుపు తిరిగారు.

"టుబాకో వర్కర్స్ యూనియన్ వర్ధిల్లాలి!" "ప్రకాశం బాబు - జిందాబాద్!" అంటూ చెవుల్ని బద్దలుచేసే నినాదాలతో దిక్కులు ప్రతిధ్వనిస్తున్నాయి. టుబాకో వర్కర్సు ప్రొసెషన్ ఎదురయింది.

ముందు వరసలో ప్రకాశం, గౌరి చేతుల్లో జండాలతో నడుస్తున్నారు. తెల్లని ఖద్దరు పైజామా, లాల్చీ, తల మీద గాంధీటోపీ..... ఆదర్శం, ఆవేశం కలిసి వుద్భవించినట్లున్న ప్రకాశాన్ని చంద్రం ముగ్ధుడై చూస్తూ నిలబడ్డాడు. హేమ దృష్టి గౌరిమీద పడింది. తన వునికి కూడా మర్చిపోయి చంద్రం గౌరిని చూస్తున్నాడని అపోహపడింది హేమ. అంతలో ఆమె హృదయంలో ద్వేషంతాలూకు తేలు, కొండీ నెత్తింది. రెండడుగులు ముందుకువేసి దూరంగా నిల్చుంది.

కోటి జనంలోవున్నా తన చంద్రాన్ని ఇట్టే గుర్తించగల గౌరి చురుకైన కళ్ళు చంద్రంమీద పడ్డాయి.

"ప్రకాశం! అడుగో చంద్రం!" అంటూ సంతోషంతో గంతులేసినంత పని చేసింది గౌరి.

ప్రకాశం గబగబా చంద్రం దగ్గరకు వచ్చి రెక్క పట్టుకొన్నాడు అప్యాయంగా. "రారా చంద్రం! నువ్వుకూడా ఊరేగింపులో నడవాలి అన్నాడు."

చంద్రం కళ్ళు గాబరాగా హేమ కోసం వెతికాయి.

"ఏరా చంద్రం! తెలిసిన వాళ్ళెవరయినా చూస్తారని భయమా? అవునులే, యజమాని కూలీలతోపాటు ఊరేగింపులో నడవటం ఏమిటి?"

చంద్రం ముఖం పాలిపోయింది. తను అన్నమాటలకు బాధపడ్డాడు ప్రకాశం.

"వద్దులేరా చంద్రం! తమాషాగా అన్నాను. మీటింగు దగ్గిరకు మరో గంటకల్లా 'వచ్చేయ్!" అంటూ ప్రకాశం వెళ్ళి ప్రొసెషన్‌లో నిల్చున్నాడు.

దూరంగా నిల్చున్న హేమవైపు క్షమించమన్నట్లు చూశాడు చంద్రం. హేమ ముఖం తిప్పుకొని గబగబా ముందుకు నడుస్తోంది. చంద్రం యాంత్రికంగా వెళ్ళి ప్రకాశం పక్కనే నడవసాగాడు.

రెండడుగులు ముందుకువేసి నిలబడి వెనక్కు తిరిగి చూసిన హేమకు చంద్రం ప్రొసెషన్‌లోకి వెళ్ళి నిల్చోవడం కనిపించింది. కోపం, రోషం, అవమానం, ద్వేషం- నేను ముందంటే నేను ముందంటూ హేమ హృదయంలో పోటీ పడుతున్నాయి. మీ అందరికంటే నేను ముందున్నానంటూ దుఃఖం పొర్లుకొచ్చింది. ఏదో ఆవేశించినట్లు నడుస్తోంది గబగబా.

పక్కన మురుగుకాలవ కదిలి గప్పున వాసన వేసింది. హేమ ముఖం తిప్పిచూసింది. వరాహావతారం ఆనందంగా దొర్లుతుంది ఆ మురుగులో!.... అంతే, దానికి కావల్సింది అదే! పన్నీటి గుంటలో పడేసినా దానికి ఊపిరి సలపదు! కక్షగా అనుకుంది హేమ.

వరండాలో కూర్చొనివున్న తండ్రిని గబగబా దాటుకుంటూ గదిలోకి వెళ్ళి గభాల్న తలుపులు బిగించుకొని మంచం మీద విరుచుకుని పడిపోయింది. అంతవరకూ గొంతులోనూ, కళ్లలోనూ దాగివున్న దుఃఖం స్వేచ్ఛగా పొంగింది. దిండులో తలదూర్చి వెక్కి వెక్కి ఏడ్చింది - అంత గంభీరంగా కనిపించే హేమమాలిని!

# 18

ఆనాడు జరిగిన పబ్లిక్ మీటింగులో ప్రకాశం బలవంతంతో చంద్రం కూడా మాట్లాడాడు. చంద్రం ఉపన్యాసంలో ఉద్రేకంకంటే వివేకం ఎక్కువ కనిపించింది. కార్మికుల హక్కుల్ని గురించి, వాటిని సాధించే మార్గాలను గురించీ మాట్లాడాడు:

"సాధ్యం ఎంత పవిత్రమయిందో దానిని పొందే సాధనాలు కూడా అంత పవిత్రంగానూ ఉండాలి. ఉదాహరణకు – ఒక భక్తుడు శుచిగా స్నానం చేసి, జపమాల ధరించి, పత్రపుష్పాలతో దేవాలయానికి బయలుదేరాడనుకోండి. ఆ దేవాలయానికి వెళ్ళటానికి రెండు మార్గాలున్నాయి. ఒకటి రాజమార్గం, రెండోది నానా అశుద్ధంగా వుండే అడ్డత్రోవ. అడ్డత్రోవన దేవాలయానికి త్వరగా, తేలిగ్గా వెళ్ళవచ్చు కాని, ఆ భక్తుడు మాత్రం శుద్ధమైన త్రోవనే వెళతాడు. అలాగే మనం మన హక్కుల్ని సవ్యమైన మార్గంలో నడిచి సాధించుకోవాలి..." చంద్రం తన ఉపన్యాసం ముగించే ముందు కార్మికులయెడల యజమానుల కర్తవ్యాన్ని గురించి మాట్లాడడం కూడా మరచిపోలేదు. చంద్రం ఉపన్యాసం ముగించగానే కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి.

తరవాత వినోద కార్యక్రమం మొదలయింది. చంద్రం రచించిన నృత్యనాటికను ప్రదర్శించారు. పొగాకు మొక్క పుట్టుక నుంచి అది ఫ్యాక్టరీలో సిగరెట్‌గా మారేవరకు ఎన్ని రూపాలు ధరించిందో తన నాటికలో చిత్రించాడు చంద్రం. దానిని గౌరి, తను శరణాలయంలో నేర్చుకున్న నృత్యజ్ఞానంతో అభినయించింది. ఆమె నృత్యంలో పరిపక్వత లేదు, తాళం కూడా సరిగా లేదు. కాని, ఆమె తనకున్న ఆ కొద్ది నృత్యపరిచయంతోనే ఎంతో ఆకర్షణీయంగా అభినయించింది. ఆమెలోని ప్రతిభను చూసి చంద్రం ఆశ్చర్యపోయాడు. ప్రకాశం మురిసిపోయాడు.

ఆనాటి ప్రోగ్రాం ముగిసింది. ఎక్కడివాళ్ళు అక్కడ తమ తమ ఇళ్ళకు బయలుదేరారు.

మొఖానికున్న రంగు కడుక్కుని దుస్తులు మార్చుకొని గౌరి, తన కోసమే ఎదురు చూస్తూ కూర్చున్న ప్రకాశం, చంద్రాల దగ్గిరకు వచ్చింది.

"చాలా బాగుంది నీ అభినయం, ఇంత బాగా చేస్తావనుకోలేదు" అన్నాడు చంద్రం.

చంద్రం ప్రశంసకు గౌరి మనస్సులోనే పొంగిపోయింది. ఆమె కోరింది కూడా అదే. ఆ ఒక్క మాటకోసమే పదిరోజులుగా నిద్రాహారాలు మాని ప్రాక్టీస్ చేసింది.

"మీ రిద్దరూ ఇంటికి వెళ్ళండి. నాకు కొంచెం పనుంది. అర్ధగంటలో వచ్చేస్తాను" అన్నాడు ప్రకాశం.

"ఆ రోజు సినిమాకు తీసుకెళతానని మోసం చేశావు. ఇవ్వాళ సినిమాకు వెళదాం" అంది గౌరి చంద్రంతో.

"సినిమాకా? ఇప్పుడా?" ప్రశ్నించాడు చంద్రం బెదిరిపోతూ.

"తొమ్మిదే అయింది. ఇంకా రెండో ఆట మొదలుపెట్టటానికి చాలా సమయం వుంది, తీసుకెళ్ళు. గౌరి ఇవ్వాళ చాలా సంతోషంగా వుంది. నిరుత్సాహపరచకు" అన్నాడు ప్రకాశం చంద్రంతో.

"నువ్వుకూడా వస్తే అందరం వెళదాం" అన్నాడు చంద్రం.

"నాకు చాలా అవసరమైన పని వుంది. నేను కలుసుకోవాలన్న వ్యక్తి తెల్లవారుఝామునే ఊరికి వెళ్ళిపోతాడు" అన్నాడు ప్రకాశం.

"అయితే, రేపే వెళదాంలే" అని అనాలనుకున్నాడు. కాని, జవాబుకోసం ఎంతో ఆదుర్దాగా తన ముఖంలోకి చూస్తున్న గౌరిని చూసి జాలివేసింది. కాదనలేకపోయాడు.

గౌరి సినిమా శ్రద్ధగా చూస్తుంటే, కొందరు వ్యక్తులు ఆవురావురుమని భోజనం చెయ్యటం గుర్తొచ్చింది చంద్రానికి. చంద్రం మనస్సు సినిమామీద లేదు. గౌరిగురించే ఆలోచించసాగాడు. హేమకూ, గౌరికీ ఎంత తేడా వుంది!

సినిమా ముగిసింది. సినిమాహాలు ప్రకాశం ఇంటికి ఎంతోదూరం లేదు.

చంద్రం, గౌరి ఇంటివైపు బయలుదేరారు. చంద్రం మనస్సును ఒక్కసారిగా హేమ తలపులు చుట్టేశాయి. హేమ ఎందుకలా ప్రవర్తిస్తూంది? హేమతో ఇలా సినిమాకు వచ్చివుంటే తన అనుభూతే వేరుగా వుండేది. చంద్రానికి మనస్సులో ఏదో అర్థంకాని ఖాళీ ఏర్పడ్డట్టనిపించింది.

గౌరి ఆలోచనలూ, అనుభూతీ భేదంగా వున్నాయి. ఆమె శరీరంలోని ప్రతి జీవాణువూ ఉత్సాహంతో ఉరకలు తీస్తోంది. ఎంతో కాలంగా తనకు దూరమైన అతి ప్రియతమమైన వస్తువేదో తనకు లభించినట్లు ఆ అమాయిక హృదయం అనుభూతిని పొందింది.

యధాలాపంగా నడుస్తున్న చంద్రం తలమీద ఏదో బలంగా పడింది. 'అబ్బా' అంటూ విరుచుకు పడిపోయాడు. గౌరికి జరిగిందేమిటో తెలుసుకునేలోపల ఎవరో బలంగా తన దండ చెయ్యిని పట్టుకొని లాక్కుపోవటానికి ప్రయత్నిస్తున్నట్లుతోచి గట్టిగా ఓ గావుకేక పెట్టింది. అక్కడక్కడ పలచగా నడుస్తున్న సినిమా జనం కేక వినవచ్చినవైపుకు పరుగెత్తసాగారు. పోలీసుల బూట్లు చప్పుడు దగ్గరవుతుంటే అంతవరకూ గౌరిని లాక్కెళ్ళటానికి ప్రయత్నిస్తున్న అతనూ, మరో అతనూ చేతిలో లాఠీలతో పరిగెత్తారు పక్క సందునపడి.

ఆ పారిపోతున్న వారిలో ఒకడు నాగేంద్రం అని గౌరి చురుకైన కళ్ళు గుర్తించాయి.

చంద్రం చుట్టూ జనం చేరారు. తల నుంచి రక్తం కారుతోంది. చంద్రం బాధగా మూలిగి కదిలాడు. ఇద్దరు ముగ్గురు కలసి చంద్రాన్ని కూర్చోబెట్టారు. గౌరి తన పమిటచెంగు చింపి చంద్రం తలకు రక్తం కారకుండా కట్టడానికి అందించింది. కొంచెం తేరుకున్న చంద్రం 'ఏమంత పెద్ద దెబ్బకాదు, ఆసుపత్రికి అక్కరలేదు' అంటూ లేచాడు.

పోలీసు ఇన్‌స్పెక్టరు చంద్రం పేరు, విలాసం అడిగాడు. చంద్రం కృష్ణారావు తమ్ముడని తెలుసుకొని ఇన్‌స్పెక్టరు స్టేషన్‌కు రమ్మని నిర్బంధించలేదు. గుంటూరులో వున్న ధనికుల్లో ఒకడైన కృష్ణారావు తమ్ముడు కొరిటపాడు అడ్రసు ఇవ్వటం అందరికీ ఆశ్చర్యాన్నే కలిగించింది. అందరి కళ్ళూ కుతూహలంతో గౌరివైపు మళ్ళాయి. ఎవరికి తోచినట్లు వారు వూహించుకుంటూ వెళ్ళిపోయారు.

# 19

ఇన్‌స్పెక్టర్ చంద్రాన్నీ, గౌరినీ - చంద్రం వద్దంటున్నా వినకుండా తన కారులో తీసుకెళ్ళి ఇంటిదగ్గర వదిలాడు. అవసరమైతే ఒకసారి పోలీసు స్టేషన్‌కు రావాల్సి వుంటుందని చెప్పి వెళ్ళిపోయాడు.

తెల్లవారేటప్పటికి స్థానిక పత్రికలో తాటికాయంత అక్షరాలలో క్రితం రాత్రి జరిగిన సంఘటన వన్నెల చిన్నెలతో ప్రకటించబడింది.

"కృష్ణా టుబాకో కంపెనీ ప్రొప్రయిటరు కృష్ణారావు తమ్ముడు చంద్రశేఖరంపై దుండగీడుల దౌర్జన్యం! కొరిటిపాడులో నివసించే ఒక ఆడపిల్లతో సినిమాకు వెళ్ళివస్తుంటే ఇది జరిగింది. ఆ యువతి పేరు గౌరి. ఆమెను ఎత్తుకుపోయే ప్రయత్నంలోనే ఘర్షణ జరిగినట్లు తెలుస్తూంది."

వార్త చదివిన హేమ చేతినుంచి పేపరు జారి కింద పడింది. ఎదురు కుర్చీలో కూర్చుని మరో పత్రిక చదువుతున్న ప్రసాదరావు కొయ్యబారి వున్న హేమను చూసి విస్మయం చెందాడు.

క్రిందపడివున్న పేపరు చేతిలోకి తీసుకున్నాడు. వార్త చదివిన ప్రసాదరావుకు చంద్రంపై పట్టరాని కోపం, అసహ్యం కలిగాయి. హేమ అప్పటికే అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది. ప్రసాదరావు మనస్సు వికలం చెందింది. లేచి, స్నానంచేసి బయటకు బయలుదేరాడు. హేమ గది తలుపులు లోపలనుంచి వేసివున్నాయి. ఇవ్వాళ ఆమె కాలేజీకి వెళ్ళే సూచనలు ఏమీ కనిపించలేదు. గట్టిగా నిట్టూర్చుతూ బయటకు నడిచాడు ప్రసాదరావు.

ప్రసాదరావు, కృష్ణారావు గదిలో ప్రవేశించేటప్పటికి సిగరెట్ పొగతో మేఘాలు తయారవుతున్నాయి. కృష్ణారావు నొసలు బిగించి కప్పువైపుకు చూస్తూ సిగరెట్ దమ్ములు పీలుస్తున్నాడు. ఎదురుగా టేబిల్‌మీద ఆ వార్త పడిన పేపరు కనిపించింది ప్రసాదరావుకు. కృష్ణారావు అంత గంభీరంగా వుండటానికి కారణం అర్థం అయింది.

ప్రసాదరావు కూర్చున్న తరవాత కూడా ఎవరూ కొంతసేపు మాట్లాడలేక పోయారు. ఆ సమయంలో ప్రసాదరావు రాకకు కారణం చెప్పకనే తెలుస్తుంది ఆ విషయాన్ని చర్చించాలంటే ఇద్దరకూ బాధగానే వుంది.

"వార్త చూశారుగా?" ప్రసాదరావు చిన్నగా విషయాన్ని కదిపాడు.

"చూశాను. వీడింత అప్రయోజకుడవుతాడని కలలో కూడా ఊహించలేదు. మా వంశానికే కళంకం తెచ్చాడు. ఇలాంటివాడు పుట్టగానే చచ్చినా బాగుండేది అని ఆలోచిస్తున్నాను" అన్నాడు కృష్ణారావు బాధగా.

చంద్రాన్ని కృష్ణారావు తిట్టడం ప్రసాదరావుకు తన హేమను శపించినట్లు అనిపించింది. చంద్రాన్ని సమర్థించాలనిపించింది.

"దీనికి చాలావరకు మనమే బాధ్యులమేమో ననిపిస్తుంది. కుర్రవాళ్ళు, పైగా చిన్నప్పటినుంచీ పెద్దవాళ్ళ రక్షణకు దూరంగా పెరిగినవాళ్ళకు కొన్ని అలవాట్లు ఏర్పడి వుండవచ్చును. చంద్రాన్ని మనం అలా వదిలేయడంవల్లనే ఇదంతా జరుగుతూంది."

"నన్నేం చెయ్యమంటారు?"

"మీరువెళ్ళి ఎలాగయినా ఒప్పించి ఇంటికి తీసుకొని వచ్చేయండి."

"వాడికి నా మాటంటే బొత్తిగా ఖాతరు లేకుండా పోయింది. పైగా, నా మీద పగ సాధించటానికే ఈ మాదిరిగా ప్రవర్తిస్తున్నాడు."

"చంద్రం అలాటివాడు కాదు. మీరంటే అతనికి ఇప్పటికీ అభిమానమే. కాకపోతే చిన్నతనంలో గాయపడిన హృదయం. అతనిని అనునయంగాకాని మనం మార్గంలోకి తీసుకురాలేము," అన్నాడు ప్రసాదరావు.

"ప్రయత్నించి చూస్తాను. దీనికంతా కారణం అసలు ఈ ప్రకాశంగాడే. వాణ్ణి ఈ ఊళ్ళో లేకుండా చెయ్యాలి" అన్నాడు కృష్ణారావు.

ప్రసాదరావు ఆశ్చర్యంగా చూశాడు.

"అంత ఫని మాత్రం చెయ్యకండి! ప్రకాశం మీద ఈగ వాలటాన్ని కూడా చంద్రం సహించలేడు. మనం ప్రకాశాన్ని ఏమయినా చేసినట్లు పసిగట్టాడా – చంద్రం మనకు శాశ్వతంగా దూరం అవుతాడు."

"ఊఁ– అదీ చూస్తాను" అంటూ సిగరెట్టు ముక్క కొరికి ఊశాడు కృష్ణారావు. "ఇంతవరకూ వచ్చాక నా కుటుంబ గౌరవం కాపాడుకోవటానికి ఏదైనా చేయటానికి సిద్ధంగా ఉన్నాను."

స్ప్రింగ్‌డోర్ తెరచుకోవటంతో కృష్ణారావు మాటలు మధ్యలోనే ఆగిపోయాయి. ప్రైవేటు సెక్రటరీ అనూరాధ లోపల ప్రవేశించి ఎదుటి కుర్చీలో కూర్చుంది. తెల్లటి దుస్తుల్లో అందంగా కనిపించిన అనూరాధను ఆత్మీయత వుట్టిపడే కళ్ళతో చూశాడు కృష్ణారావు 'ఏమిటి?' అన్నట్లు.

"బాస్!" అంటూ ఏదో చెప్పబోయి అకస్మాత్తుగా పక్కకు తిరిగి చూసి ఆగిపోయింది అనూరాధ. ఏదో వింత వస్తువును చూసినట్లు ప్రసాదరావును రెప్ప వాల్చకుండా చూస్తూ వుండిపోయింది. క్రమంగా ఆమె ముఖంమీద చెమట బిందువులు కనిపించసాగాయి. కృష్ణారావు విస్మయంతో ఆమెనే చూస్తూండిపోయాడు. తూలి పడిపోబోతున్న అనూరాధను కృష్ణారావు పట్టుకుని పక్క సోఫాలో పడుకోబెట్టాడు.

కృష్ణారావు ప్యూన్‌ను కేకవేసి మంచినీళ్ళు ఇవ్వమన్నాడు. ఆమె ముఖంమీద నీళ్ళు చిలకరించి కదిపిచూశాడు. కాని ఆమెకు తెలివిరాలేదు. గాబరాగా ఫ్యామిలీ డాక్టరుకు ఫోన్ చేశాడు. ఇంత జరుగుతున్నా కదలక మెదలక కుర్చీలో తాపీగా కూర్చొనివున్న ప్రసాదరావును ఆశ్చర్యంతో చూశాడు కృష్ణారావు. అప్పుడే ప్రాణంపోయిన శవంలా బిగుసుకొని పోయివున్న ప్రసాదరావును చూసి కృష్ణారావు గాబారాగా లేచివచ్చి కదిపాడు. ఏదో భయంకరమైన దుస్స్వప్నం నుంచి బయటపడినట్లు ప్రసాదరావు నాలుగు వైపులా వెర్రిగా చూశాడు. మరో క్షణంలోనే తేరుకొని లేచి అనూరాధ పడుకొనివున్న సోఫా దగ్గిరకు వెళ్ళి, పక్కనే తల దగ్గిర కూర్చుంటూ "అనూ, అనూ" అంటూ ఆమెను ఆవేశంగా కదిపాడు.

కృష్ణారావుకు అర్థంకాక అయోమయంగా చూస్తూ కూర్చున్నాడు. తెలివిలేని అనూరాధ తలను నిమురుతూ ఆమె ముఖంలోకే చూస్తూ కూర్చున్నాడు ప్రసాదరావు.

డాక్టరువచ్చి ఇన్‌జెక్షన్ ఇచ్చి స్మెల్లింగ్ సాల్టు ముక్కు దగ్గిర వుంచాడు. ఆమె కదలింది. ఒకసారి కళ్ళు తెరిచి మళ్ళీ మూసుకుంది.

"ప్రమాదం ఏమీలేదు. ఒకోసారి అనుకోని సంఘటన సంభవించినప్పుడు ఇలా జరుగుతుంది. పది నిముషాలలో తెలివి వచ్చేస్తుంది. కాని, ఒక వారంరోజులు ఆమెకు మానసికంగా, శారీరకంగాకూడా విశ్రాంతి అవసరం" అని చెప్పి డాక్టరు వెళ్ళిపోయాడు.

డాక్టరు వెళ్ళిపోయిన కొద్దిసేపట్లోనే అనూరాధకు పూర్తిగా తెలివి వచ్చేసింది. తను ఎక్కడ వుందీ, ఏ పరిస్థితిలో వుందీ తెలుసుకున్న ఆమె ఒక్కసారిగా లేచి కూర్చుంది. తన సోఫాలోనే కూర్చునివున్న ప్రసాదరావును తిరస్కారంగా చూసి లేచి నిల్చుంది. ప్రసాదరావు ఆమెను లేవవద్దని వారించబోయాడు. కాని, ఆమె చూపును తట్టుకోలేక అపరాధిలా తల వంచుకొన్నాడు. అనూరాధ తూలి పడబోయి నిలదొక్కుకుంది. కృష్ణారావు ఏమనుకున్నాడో?.... ఆ తలపు రాగానే అనూరాధ సిగ్గుతో చితికిపోయింది. ఏ అద్భుత శక్తో వచ్చి తనను నిల్చున్నపాటున మాయం చేస్తే ఎంత బావుణ్ణు! కనీసం తను నిల్చున్న భూమి పగిలి తనలో ఇముడ్చుకుంటే? అలా ఎందుకు జరుగుతుంది? సీతాదేవి తన బిడ్డ కాబట్టి ఆనాడు ఆమెను భూదేవి తన హృదయంలో దాచుకుని, ఆమెకు జరగబోయే అవమానం నుంచి కాపాడింది.

ఆమె ఇబ్బందిని కనిపెట్టాడు కృష్ణారావు. "వెళ్ళమ్మా, వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. ఓ వారం రోజులు శెలవు తీసుకోండి" అన్నాడు కృష్ణారావు.

ఆ అవకాశం కోసమే ఎదురుచూస్తున్న అనూరాధ ఆ గదినుంచి గబగబా బయటకు వెళ్ళిపోయింది.

కింకర్తవ్య విమూఢుడై కూర్చొనివున్న ప్రసాదరావుతో కృష్ణారావు అన్నాడు: "ఆమె చాలా ఆవేశంలో వున్నట్టుంది. ఏమయినా అఘాయిత్యం చెయ్యవచ్చు. మీరు వెళ్ళి కొంత ఓదార్చటం అవసరం అనుకుంటాను." పరిస్థితి కొంతవరకు అర్థం అయింది కృష్ణారావుకు.

"లేవండి. ఆమె ఈ బిల్డింగులోనే చివర గదుల్లో వుంటుంది" అని చెప్పి బెల్ మోగించాడు. వచ్చిన ప్యూన్‌తో "అయ్యగారికి అనూరాధమ్మగారి గది చూపించు" అన్నాడు.

ప్రసాదరావు మౌనంగా లేచి ప్యూన్ వెనకే యాంత్రికంగా నడుస్తున్నాడు.

ఆయన అపరాధిలా జంకుతూ అనూరాధ గదిలో అడుగుపెట్టాడు. ఆమె మంచంమీద బోర్లా పడుకొని గుండెలు పగిలిపోయేలా విలపించడం చూశాడు.

ప్రసాదరావు ఆవేశం కట్టలు తెంచుకుంది. ఒక్కసారిగా ఆమెను సమీపించాడు. ఆమెను తన రెండు బాహువుల్లో పొదివి పట్టుకొని బలంగా గుండెలకు అదుముకుంటూ కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు. అనూరాధ ప్రసాదు గుండెల్లో ఇమిడిపోవటానికి ప్రయత్నిస్తుందాన్నట్లు అతని గుండెల్లో తలదాచుకొని ఏడుస్తోంది. ఇంతకాలం ఈ విశాల ప్రపంచం గుండెలో భూగోళమంత ఒంటరితనాన్ని దాచుకొని జీవిస్తున్న అనూరాధకే ప్రసాదు గుండెల్లో తలదాచుకొని ఏడుస్తుంటే, ఏదో లోతులు తెలియని అగాధంలోకి జారిపోతున్నవాని చేతికి ఏదో ఆధారం దొరికినట్లు కొంత ఊరట కలిగింది.

ఆవేశం తగ్గింది. పరిస్థితిని ఆలోచించే శక్తి చేకూరింది. తనను తను సంబాళించుకుంది. అనూరాధ ఒక్కసారిగా ప్రసాదు బాహుబంధాన్ని విడిపించుకుని దూరంగా జరిగి కూర్చుంది.

ప్రసాదుకు ఆమె ముఖంలోకి చూసే ధైర్యం లేదు. తలవంచుకొని కూర్చున్న ప్రసాదు చెక్కిళ్ళమీద కన్నీటి బొట్లు అద్దంమీద వానజల్లు పడినట్లు దొర్లుతున్నాయి. అనూరాధ రెప్పవేయకుండా ప్రసాదునే చూస్తూ కూర్చుంది. ఆమె ముఖంలో ఎలాంటి అవేశంగాని, కోపంగాని లేదు. మంచివాని మనస్సులా అతి నిర్మలంగా వుంది ఆమె ముఖం. ఆమె కళ్ళలో మాత్రం 'ఇదంతా నిజమేనా' అనే సందేహం, ఆ సందేహాన్ని నిజంగా తీర్చుకోవాలనే తహ తహ కనిపిస్తుంది. కలగాపులగంగా నెరసిన జుట్టును, వయస్సు తెచ్చిన మార్పులతో పరిపక్వత చెందిన విశిష్టమైన వ్యక్తిత్వానికి ప్రతిరూపంగా కనిపిస్తున్న ప్రసాదరావు రూపాన్ని ఆనాటి యువకుడుగా తనకు పరిచయమైన ప్రసాదు రూపంతో పోల్చుకుంటూ కూర్చుంది అనూరాధ.

కళ్ళకు కండువా అడ్డం పెట్టుకుని మౌనంగా రోదిస్తున్న ప్రసాదు చెయ్యి పట్టుకొని "ఛ. అదేమిటి! అలా ఆడపిల్లలా మీరు ఏడవటం బాగా లేదు" అంది మందలిస్తున్నట్లు. ఆ మందలింపులోని ఆత్మీయతకు ప్రసాదరావుకు దుఃఖం పొర్లుకొచ్చింది. కాని నిభాయించుకొని కళ్ళు తుడుచుకున్నాడు. అదోలా అనూరాధ ముఖంలోకి చూశాడు. ఆమె ముఖం చాలా ప్రశాంతంగా వుంది. ప్రసాదు ఆవేశంతో ఆమె చేతిని పట్టుకొని "నన్ను క్షమించగలవా అనూ?" అన్నాడు ప్రాధేయపడుతూ.

అనూరాధ విస్మయంగా ప్రసాదు ముఖంలోకి చూసింది. చిన్నగా తన చేతిని అతని చేతినుంచి లాక్కుంది. తను ప్రసాదును క్షమించగలదా? క్షమించే తప్పేనా అతను చేసింది? ఎంత తేలికగా క్షమించమని అడుగుతున్నాడు? ఆ మాట తను అనగలిగినా, వ్యర్థమయిపోయిన తన నిండు జీవితాన్ని తిరిగి ఇవ్వగలడా? అప్పుడే రేఖలు విప్పుకుంటున్న మొగ్గను నిర్దయగా నలిపి దుమ్ములో పారవేశాడు. దాన్ని మళ్ళీ వికసించేలా చేసే శక్తి అతనిలో వుందా? నిండు పాలకుండలాంటి తన జీవితాన్ని నిర్లక్ష్యంగా తన్ని వెళ్ళిపోయాడే! ఆ ఒలికిపోయిన పాలను మళ్ళీ నింపగలడా? ప్రసాదు తన తప్పుకు క్షమాపణ అడుగుతున్నాడు. కాని తన నిండు జీవితాన్ని – తన ఇరవై సంవత్సరాల యౌవనాన్ని – తిరిగి తనకు ఎక్కడనుంచి తెచ్చి ఇవ్వగలడు? తనలో అతన్ని క్షమించే శక్తి లేదు. క్షమించదు! క్షమించలేదు!

"నేను దుర్మార్గుణ్ణి. నేను నీకు తీరని ద్రోహం చేశాను. నన్ను క్షమించవా అనూ?" ప్రసాదు కంఠం బొంగురుపోయింది.

అనూరాధ అదోలా నవ్వింది. ఆ నవ్వు ప్రసాదును "నిన్ను క్షమించాలా?" అని సవాలు చేసినట్లనిపించింది.

"అవును. నేను చేసిన పాపానికి క్షమాపణ లేదు. నన్ను క్షమించకు– శిక్షించు. నా పాపానికి పరిష్కారం చెప్పు. నన్ను నిందించు. నన్ను క్షమించవద్దు అనూ.... నాకు క్షమలేదు. నన్ను తిట్టు – కాని, అలా చూడకు. అలా నవ్వకు. నేను సహించలేను"

అన్నాడు- అనూరాధ రెండు అరచేతులనూ పైకెత్తి తన ముఖాన్ని దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ.

అనూరాధ తన చేతుల్ని లాక్కుంది. కన్నీటితో తడిచిన అరచేతులను చూసుకుంటూ కూర్చుంది.

"నిజం అనూ! నా మాట నమ్మవూ? నీకు నేను కావాలని ద్రోహం చెయ్యలేదు. నా ప్రేమను శంకించకు."

అనూరాధ ఆశ్చర్యంగా ప్రసాదు ముఖంలోకి చూసింది. "ఇంకా నా దగ్గర ఏముందని అబద్ధాలాడుతున్నావు?" అనాలని అనిపించింది.

"నా మాట నమ్మవూ? నిన్ను చూసిన క్షణంలోనే నాకు మతి పోయింది. జన్మజన్మాంతారాలుగా నాతో వుంటూ నన్ను విడిచిపోయిన వస్తువేదో అకస్మాత్తుగా మళ్ళీ నాకు లభించినట్లనిపించింది. నేను కాలేజీలో చదివే రోజుల్లో కూడా ఆడపిల్లలవైపు చూసిన పాపాన పోలేదు. కాని నిన్ను చూసిన ఆ క్షణం నాకు కలిగిన అనుభూతి చాలు - ఒక జీవితానికి. నీవు లేకుండా నేను లేను, వుండను - అనుకున్నాను. అందువల్లనే అప్పటికి నాకు వివాహం అయినట్లు నీకు చెప్పలేకపోయాను. అది చాలా పెద్ద తప్పే. కాని, నిన్ను ఏనాడూ వ్యామోహ దృష్టితో చూడలేదు. గుడిలోని దేవతలా గుండెల్లోనే నీ రూపాన్ని నిలుపుకొని పూజించుకోవాలనుకున్నాను."

ప్రసాదు ఓ క్షణం ఆగాడు. అనూరాధ మౌనంగా చూస్తూ కూర్చుంది.

"ఆనాటి రాత్రి నీ జీవితంలో కాళరాత్రిగా మారింది. రోజూలాగే ఆనాడు కూడా నువ్వు నా గదికి పాఠం చెప్పించుకోవటానికి వచ్చావు. ఆ రోజు తలంటి పోసుకున్నావు- వదులుగా జడ వేసుకున్నావు. ముఖంమీద కురులు...."

"ఆగు. ఇంక చెప్పకు రాక్షసుడా!" అరవాలనిపించింది కానీ అనూరాధ గొంతు పెగల్లేదు.

"ఆ నిముషంలో నాకు మతిపోయింది. ఎవరో మంత్రించినట్లు అయిపోయాను. వివేకం నశించింది. పశుత్వం విజృంభించింది. నేను అవివాహితుణ్ణని అనుకుంటున్న నువ్వుకూడా అంత అభ్యంతరం పెట్టలేదు. జరగరానిది జరిగిపోయింది-" వాక్ప్రవాహం ఆగిపోయింది. కొద్దిసేపు కణతలు నొక్కుకుంటూ కూర్చున్నాడు. రక్తనాళాలు తెగుతాయేమోనన్నంతగా తలలో పోటు ప్రారంభించింది.

"అంత జరిగిన తరవాత కూడా నేను వివాహితుడనని నీకు చెప్పలేదు. కారణం నిన్ను బాధపెట్టటం ఇష్టంలేకనే."

అనూరాధ తిరస్కారంగా నవ్వింది.

"అలా నవ్వకు. కావాలంటే తిట్టు, నీ చేత్తో యింత విషం తాగించు. కానీ నన్ను తిరస్కారంగా చూడకు. ఎగతాళిగా నవ్వకు. నేను చెప్పేది పూర్తిగా విను."

- ఓ క్షణం ఆగి నిట్టూర్చాడు.

ప్రసాదు మళ్ళీ ప్రారంభించాడు:

"మరో నెలకల్లా బొంబాయిలో నా ట్రయినింగ్ పూర్తి అయి ఇంటికి వచ్చేశాను.

వచ్చేప్పుడు నెలరోజుల్లో వచ్చి నిన్ను తీసుకెళతానని చెప్పాను. ఆ మాట నేను నిజాయితీతోటే చెప్పాను - అలా చేద్దామనే ఉద్దేశంతోనే చెప్పాను."

అనూరాధకు ఆశ్చర్యం కలిగింది. అప్పటికే వివాహితుడైనవాడు అలాగ చెయ్యటం సాధ్యమా? ఇది నమ్మవలసిందేనా?

"నా భార్య చాలా ఉత్తమురాలు. నాకు చిన్న తలనొప్పి వచ్చినా భరించలేకపోయేది. నిన్ను చూసేనాటివరకూ నేను ఆమెను ప్రేమిస్తున్నాననే భ్రమపడ్డాను."

అనూరాధ ముఖం చిట్లించుకుంది.

"జరిగిన విషయం నా భార్యతో చెప్పి ఆమెను ఒప్పించి నిన్ను తీసుకెళదామనుకున్నాను."

అనూరాధ ప్రసాదువైపు విస్మయంగా చూసింది.... భార్య, భర్త కోసం ఏమయినా చెయ్యగలదు. కాని, యిది మాత్రం.... తనే ఆమె స్థానంలోవుంటే ఛస్తే ఒప్పుకోదు. తననే దైవంలా భావించి పూజించే భార్యకు ఇంత దారుణమైన విషయం చెప్పగల మగవాణ్ణి ఏమని పిలవాలి?

ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ ప్రసాదు మళ్ళీ ప్రారంభించాడు:

"అప్పటికి రెండో వివాహం మీద నిషేధం లేదు. నా భార్యను ముందు వప్పించి నిన్ను రిజిష్టరు వివాహం చేసుకొని, తీసుకొని రావాలనుకున్నాను. తీరా వివాహం అయినాక తెలిసినా నీవు నన్ను క్షమించగలవనే ఆశతోనే అలా భావించాను. నేను నీ దృష్టిలో పరమ స్వార్థపరుడిగా కనిపించవచ్చును...." ప్రసాదరావు నిట్టూర్చి ఓ క్షణం ఆగిపోయాడు.

"ఆ విషయాన్ని ఎప్పుడు నా భార్యకు చెప్పాలనుకొని, ఎంత ధైర్యాన్ని కూడదీసుకున్నా చెప్పలేకపోయాను. ఎప్పుడు చూసినా ఆమె సంతృప్తిగా అమృతపాత్రలా కనిపించేది. అందులో విష బిందువును కలపటానికి ధైర్యం చాలలేదు. ఇక లాభంలేదు. ఇద్దర్నీ మోసంచేస్తే కాని లాభం లేదనుకున్నాను. నిన్ను వివాహం చేసుకొని తీసుకొచ్చి ఇద్దర్నీ ఒకేసారి ఒకరికొకర్ని పరిచయం చెయ్యాలనుకున్నాను. కాని, ఆ సన్నివేశాన్ని ఊహించుకుంటే పెనుగాలికి ఊగే వృక్షంలా అయిపోయేవాణ్ణి. చివరకు ముందు నీ దగ్గిర నిజం ఒప్పేసుకొని నీ సలహా ప్రకారం చేద్దామని నిర్ణయించుకున్నాను. సెలవు కూడా పెట్టాను. సెలవు ఇంకా మంజూరు కాలేదు. ఈ లోపల నా భార్యకు అకస్మాత్తుగా జబ్బుచేసింది. అది మశూచిగా తేలింది. అప్పటికే నాకు మూడు సంవత్సరాల ఆడపిల్ల వుంది. నా భార్య ఆ వ్యాధితోనే పోయింది. ఆమె పోయినప్పుడు నాకు కలుగవలసినంత బాధ కలగలేదేమని ఇప్పటికీ అనిపిస్తూ వుంటుంది.

"నన్ను చూస్తుంటే నీకు అసహ్యం వేస్తుంది కదూ! నా భార్య అలా అకస్మాత్తుగా పోవటం నేను చేసిన పాపానికి శిక్షగా భావించాను. అలా అసహ్యించుకున్నట్లు చూడకు అనూ! అది నేను భరించలేను. నేను చెప్పేదంతా విని, నాకు ఏ శిక్ష అయినా విధించు. మరో నెలకల్లా నీకోసం బొంబాయి బయలుదేరాను. విధి నా పాపానికి అతి క్రూరంగా శిక్షిస్తాదని వూహించుకోలేదు. కొత్త ఉత్సాహాన్ని కూడదీసుకొని నీకోసం బయలుదేరాను. నేను మీ ఇంటికి వెళ్ళినప్పుడు మీ నాన్నగారు ఇంట్లో లేరు. మీ అమ్మగారు నన్ను

గుర్తించక పోవడం చూసి ఆశ్చర్యపోయాను. నీకోసం ముఖమంతా కళ్ళు చేసుకొని వాకిలివైపు చూస్తున్నాను. కర్టెన్ కదిలింది. నా గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. కాని నీకు బదులు వంటవాడు కనిపించాడు. నిన్ను పిలవమంటే- వాడే విషయమంతా చెప్పాడు. నీవు అకస్మాత్తుగా ఇల్లు వదిలి వెళ్ళిపోయావని, మీ అమ్మగారికి మతిపోయిందనీ, మీ నాన్నగారు అవమానంతో, దుఃఖంతో కుమిలి కృశించిపోతున్నారని చెప్పాడు. అది విన్న నా మానసిక పరిస్థితిని గురించి వూహించుకోవలసిందేకాని చెప్పలేను. అప్పటినుండి దాదాపు రెండు మూడు సంవత్సరాలు నా ముఖాన్ని నేను అద్దంలో చూసుకోవడం మానేశాను. నిండా ముప్పయ్ సంవత్సరాలు లేని నన్ను అందరూ మళ్ళీ వివాహం చేసుకోమని బలవతం చేశారు. కాని, ఆ మాట వినడం కూడా సహించలేకపోయాను. ఆ రోజునుంచి నిన్ను తలచుకొని బాధపడని రాత్రి, నన్ను నేను అసహ్యించుకోని రోజు లేదు. నా బిడ్డకోసం బతకవలసి వచ్చింది..." ప్రసాదు స్వరం దుఃఖంతో పూడుకుపోయింది.

"అనూ! అలా అకస్మాత్తుగా ఇల్లు వదిలి యెందుకు వెళ్ళిపోయావు? నువ్వు ఆ విధంగా చెయ్యకుండావుంటే మన జీవితాలు ఇలా...."

అనూరాధ తలయెత్తి ప్రసాదు ముఖంలోకి నిర్లక్ష్యంగా చూసింది, ఆ చూపునుంచి తప్పించుకోవటానికి ప్రసాదు ముఖం దించుకున్నాడు. ఓ క్షణం ఇద్దరిమధ్య మౌనం.

"జరిగింది మర్చిపో అనూ! ఇప్పటికైనా నా పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకొనే అవకాశాన్ని ఇవ్వు. నేను చాలా అదృష్టవంతుణ్ణి, ఇంతకాలానికి నాకు లభించావు."

అనూరాధ ప్రసాదు ముఖంలోకి అర్థంకానట్లు చూసింది.

"మన ఇంటికి వెళదాం. లే అనూ! హేమ చాలా మంచిపిల్ల. ఆ పిల్లకు తల్లిలేని లోటు తీర్చు."

అనూరాధ ముఖం బాధతో బిగుసుకొనిపోవటాన్ని ప్రసాదు గమనించలేదు. కాని ఆమె మౌనాన్ని అంగీకారంగా వూహించుకున్న ఆనందంతో "ఒప్పుకుంటున్నావా అనూ! ఇప్పుడే కృష్ణారావుగారితో చెప్పేస్తాను. ఆయన కారులోనే మనం వెళ్ళిపోదాం" అంటూ లేచిన ప్రసాదు- "ఆగు" అన్న అనూరాధ కటుస్వరానికి ఉలిక్కిపడి కుప్పలా కూలిపోయాడు.

"కాదనకు అనూ!" రెండుచేతులూ పట్టుకున్నాడు.

"ఎక్కడకు? మీ ఇంటికా? ఏ హోదాలో?" ఒక్కసారిగా చేతులు లాక్కుంది ప్రసాదు చేతుల్లోనుంచి.

"నా ఇంటికి కాదు, మన ఇంటికి. ఇంక ఏ హోదాతో నంటావా? అది నీకు నేను వేరే చెప్పాలా?" ఆవేశంగా అన్నాడు ప్రసాదు.

అనూరాధ నిర్లక్ష్యంగా నవ్వింది.

"సరే, నేను వెళుతున్నాను. కనీసం నా చావువార్త విన్న తరవాతయినా ఒకసారి మనయింట్లో కాలుపెట్టు, అంతేచాలు, నా ఆత్మకు శాంతి లభిస్తుంది." ఈసారి ప్రసాదు స్వరంలో ఆవేశం స్థానాన్ని కోపం ఆక్రమించుకుంది.

అనూరాధ ప్రసాదు ముఖంలోకి దీక్షగా చూసింది. ఆ ముఖంలో ఆమెకు నిజాయితీ కొట్టవచ్చినట్లు కనిపించింది. అనూరాధ కళ్ళలో నీరు తిరిగింది.

"అలా ఆవేశపడకు ప్రసాద్! ఈ వయస్సులో ఆవేశాన్ని అదుపులో పెట్టుకోవడం అవసరం."

అనూరాధ తిన్నగా ఎవరిదో విషాదగాథ చెబుతున్నట్లు, తనకు తానే మాట్లాడుకుంటున్నట్లు, ఎటో దూరతీరాల్లోకి చూస్తున్నట్లు చూస్తూ చెప్పుకుపోతోంది-

"ఒకప్పుడు నీ ఇంటికి పెళ్ళికూతురుగా రావాలని కలలుకన్నాను. నీకోసం కళ్ళల్లో వత్తులు వేసుకొని ఎదురుచూశాను. ప్రతి చిన్నవస్తువు కదిలికలోనూ, ప్రతి చిన్నశబ్దంలోను నీ అడుగుల చప్పుడే విని కొండంత ఆశతో నీకోసం ఎదురు చూశాను. హృదయ కలశంలోని మధువునంతా వెచ్చించి, ఆకాంక్షలనే పుష్పాలలో నింపాను. జీవితాన్నే నారగా పేని, ఆ ఆశల పుష్పాలను అందంగా కూర్చి మాల కట్టాను. ఆ మాలతో నీ కంఠాన్ని అలంకరించాలనే ఆశతో నీకోసం అనుక్షణం ఎదురుచూశాను. చూస్తుండగానే మాల వాడిపోయింది. చివరకు ఎండిపోయింది. కాని, నీవు రాలేదు. ఆ మాలకు ఒకరి కంఠాన్ని అలంకరించే శక్తి ఏనాడో నశించింది. దాన్ని కదలిస్తే ఆ పూలు రాలిపోతాయి. చివరకు మిగిలేది వట్టి నార మాత్రమే. ఆ నార ఒక కంఠానికి ఉరితాడు కాగలదేమో కాని, కంఠమాల కాలేదు. నన్ను ఇలాగే బ్రతకనియ్యి. వేరే జీవితాన్ని భరించే శక్తి నాలో ఏనాడో నశించింది..." అనూరాధ కంఠంలో నిర్లిప్తత స్పష్టంగా కనిపిస్తూంది.

"అలా అనకు అనూ! నువ్వు నా భార్యవు, ఏనాటికి కనిపించినా ఆ స్థానం నీకు భద్రంగానే వుంది. నా అపరాధాన్ని క్షమించి నాతో రా."

"హుం- అపరాధం.... క్షమ..... నిన్ను క్షమించే శక్తి నాలో లేదు. నిన్ను క్షమించ వలసింది నేను కాదు..." అనూరాధ కంఠం రుద్ధమయింది.

"ఎవరో చెప్పు, వారు నీ తల్లిదండ్రులేగా? ఇవాళే బొంబాయి వెళ్ళి వారి పాదాలమీద పడి క్షమాపణ వేడుకుంటాను. వారు నన్ను క్షమిస్తారని నాకు నమ్మకం వుంది" అన్నాడు ప్రసాదు ఉద్రేకంతో.

"తల్లీ! తండ్రీ! మళ్ళీ వారికి నేను బతికి వున్నట్లు తెలియటం కూడా నాకు ఇష్టంలేదు. నాలాంటి చరిత్రహీనురాల్ని కన్నందుకు ఫలితం వాళ్ళు అనుభవించి తీరాలి...." ఆమె కంఠంలో కక్ష ఎవరి మీదో ఆమెకే తెలియదు.

ఆశ్చర్యంగా చూశాడు ప్రసాదు. ఏమీ అర్థం కాలేదు. మరయితే ఎవరా మూడోవ్యక్తి? బుర్ర బద్దలుకొట్టుకున్నా అర్థం కాలేదు.

"అర్థం కాలేదుకదూ?" హెచ్చరిస్తున్నట్లున్న ఆమె మాటలకు తెల్లబోయి చూడటం తప్ప జవాబు ఇవ్వలేకపోయాడు.

అయితే, అనూరాధ మళ్ళీ వివాహం చేసుకుందా? లేక, ఇంతకాలం తనకోసమే ఎదురుచూస్తూ వుంటుందనుకొనటంలో అర్థం లేదు. తన స్వార్థమే తనను అలా ఆలోచించనివ్వలేదు.

"చెప్పమంటావా? వినే ధైర్యం వుందా?" అనూరాధ స్వరంలోని కాఠిన్యానికి ఇంకా తెల్లబోయాడు ప్రసాదు. మాట్లాడలేకపోయాడు.

"ఆ మూడోవ్యక్తి ఎవరోకాదు. నువ్వూ - నేనూ చేసిన పాపానికి ప్రతిఫలమైన ఒక అభాగ్యురాలు!"

ప్రసాదు చెంపన ఏదో అదృశ్యహస్తం ఛెళ్ళున కొట్టినట్లు ఉలిక్కిపడ్డాడు.

"ఏం, అలా ఉలిక్కిపడతావు?"

ప్రసాదు అయోమయంగా అనూరాధ ముఖంలోకి చూడసాగాడు. అనూరాధ ముఖంలో ఇంతసేపూ కనిపించని కాఠిన్యం ఏదో కనిపించింది. మరో క్షణంలో అనూరాధ అకస్మాత్తుగా ఇల్లువదిలి పారిపోవటానికి కారణం లీలగా కళ్ళకు కట్టింది.

"అంటే..... మన బిడ్డ.... ఎక్కడ.... ఎక్కడ వుంది?" అన్నాడు ప్రసాదు తడబడుతున్న మాటల్లో.

అనూరాధ జవాబివ్వలేదు. ప్రసాదు లేచి విసురుగా ఆమె దగ్గరకు వచ్చాడు. రెండు భుజాలను మొరటుగా పట్టుకొని వూపుతూ "నా బిడ్డ ఎక్కడ? చెప్పు, నువ్వు క్షమించకపోయినా నా బిడ్డ నన్ను తప్పక క్షమిస్తుంది" అన్నాడు.

అనూరాధ అసహ్యంతో ప్రసాదు చేతుల్ని తోసేసింది. ఉద్రేకంతో పిచ్చివాడయాడు. బుర్ర పనిచేయటం మానేసింది. కేవలం ఒక పిచ్చి ఆవేశం మాత్రమే అతని ప్రతి అణువులో ఉరకలు తీస్తున్నది.

"చెప్పవుకదూ? నీకు నేను బాధపడటమే కదూ కావల్సింది? నన్ను ఇలా చిత్రవధ చేస్తావా? సరే చూడు, ఆనందించు-" అంటూ ఉద్రేకంకొద్దీ నుదుటిని గోడకువేసి కొట్టుకోసాగాడు.

అనూరాధ ఒక్కసారిగా లేచివెళ్ళి ప్రసాదు తలను పట్టుకుంది బలంగా.

"ఏమిటీ పిచ్చి? వచ్చి కూర్చో, చెబుతాను" అంది అనూరాధ మందలింపు స్వరంతో.

"నేను కూర్చోను. అమ్మాయి ఎక్కడుందో చెప్పు. స్కూలుకు వెళ్ళిందా? ఏ స్కూలో చెప్పు. ఇప్పుడే వెళ్లి తీసుకొస్తాను."

"అదే నాకూ తెలియదు. ఎక్కడ వుందో, ఏం చేస్తూందో?" స్వప్నంలో కలవరిస్తున్నట్లు అంటూ మంచం మీద నీరసంగా కూలిపోయింది అనూరాధ.

ప్రసాదు నమ్మలేనట్లు చూశాడు. "నా పాపపు ముఖాన్ని మన అమ్మాయి చూడటం నీకు ఇష్టంలేదు కదూ? నాకు మీ జీవితాల్లో జబర్దస్తీగా ప్రవేశించే అధికారం లేదు. సరే, నేను వెళుతున్నాను. నేను చనిపోయిన వార్త విని అయినా నువ్వు నన్ను క్షమిస్తావని నాకు నమ్మకం వుంది." విసురుగా బయటకు వెళ్ళిపోతున్న ప్రసాదు షర్టును గట్టిగా పట్టుకొని వారించింది.

"వెళుదువుగాని ప్రసాద్! కాని, నేను చెప్పేదికూడా విని వెళ్ళు. నిజంగానే నా బిడ్డ ఎక్కడవుందో నాకు తెలియదు." అనూరాధకు దుఃఖం పొర్లుకొచ్చింది. ప్రసాదు కుప్పకూలిపోయాడు అనూరాధను ఓదార్చే శక్తి కూడా లేదు. స్థాణువులా చూస్తూ కూర్చున్నాడు. అనూరాధ క్రమంగా తనను తను సంబాళించుకొని చెప్పసాగింది-

"నువ్వు నెలరోజుల్లో వచ్చి నన్ను తీసుకెళతానని చెప్పి, నన్ను ఓదార్చి వెళ్ళావు. నీ మాటలు నిజమేనని నమ్మాను. ఆ నెలరోజులు నాకు కాలం ఆగిపోయినట్లు

అనిపించింది. ప్రతి నిముషం ఒక యుగంగా గడిపాను. రెండు నెలలు దాటింది. కాని నువ్వు రాలేదు. నాకు నెల తప్పినట్లు తెలుసుకున్నాను. ప్రకృతికి కూడా ఆడదే అలుసు. ఆడదాన్ని ప్రపంచం క్షమించనట్లే తప్పుచేస్తే ప్రకృతి కూడా క్షమించదేమో! నాకు ప్రకృతి వేసిన శిక్ష – దానికి ఎదురు లేదు. మూడో నెలకూడా వచ్చింది. అప్పటికే పనివాళ్ళలో గుసగుసలు ప్రారంభమయాయి. నీవు వస్తావనే నమ్మకం నశించింది. ఈ విషయం తెలిస్తే నాన్న నన్ను క్షమించడు. అమ్మనూ, నన్నూ చంపి, తను చచ్చిపోతాడు. ఆయన ఎంత మంచివారో నీకు తెలుసు. కాని, ఇలాటి విషయాలను ఆయన క్షమించడం ఎరగను. పైగా, నా పాపిష్టి ముఖాన్ని ఆయనకు చూపించలేక ఒక అర్ధరాత్రి ఇల్లు వదిలి వచ్చేశాను. హైదరాబాదులో నాలాటివారికి ఆశ్రయం ఇచ్చే సదనాలు ఉన్నాయని నాకు తెలుసు. సరాసరి అక్కడికే వెళ్ళాను. అక్కడ నాకు అనుకున్నట్లే ఆశ్రయం లభించింది. అక్కడే గిరిజ జన్మించింది. ఆ సదనంలో అనేక రకాలవాళ్ళు వుంటారు. ఆ సంవత్సరం అక్కడ ఎలా గడిపానో నాకే తెలియదు. నా బిడ్డను నానుంచి వేరుచేసి మరొక బాలసదన్‌కు పంపించాలని ఆర్డరు అయింది. అది నాకు ఇష్టంలేక బిడ్డతో బయటకు వచ్చాను. ఏం చెయ్యాలో, ఎక్కడకు వెళ్ళాలో తెలియలేదు. అంధకారంలో ఆశాకిరణంలా నువ్వే కనిపించావు. గుంటూరువచ్చి అన్ని కాలేజీలూ తిరిగి చివరకు నీ అడ్రసు సంపాదించాను. అలాటిరోజు ఏ ఆడదాని జీవితంలోనూ రాకూడదు. ఎంతో ఆశతో, బాధతో, మరోవైపు దెబ్బతిన్న అభిమానంతో నీ ఇంటిగేటు ముందు నిల్చున్నాను. అదురుతున్న గుండెలకు నిద్రపోతున్న బిడ్డను అదుముకుని నిల్చున్నాను. రకరకాల పూలమొక్కలపైగా వరండాలో కూర్చొని పేపరు చదువుతున్న నీవు కనిపించావు. గుండె లయతప్పి కొట్టుకోసాగింది. అడుగు ముందుకు పడలేదు. నీకు ఎదురుగా వున్న కుర్చీలో ఓ నాలుగైదేళ్ళ బిడ్డ కూర్చొని బిస్కట్లు తింటున్నది. మంచి దుస్తుల్తో చక్కగా అలంకరించబడి వున్న ఆ బిడ్డ దూరానికి రబ్బరు బొమ్మలా అందంగా కనిపించింది. ఆ బిడ్డ నీ బిడ్డేమోనని అనుమానం రాగానే నాలోని చైతన్యం క్రమంగా గడ్డ కడుతున్నట్లనిపించింది. అలాగే ఎంతసేపు నిల్చున్నానో నాకే తెలియదు. ఇంతలో నీ దగ్గర వున్నపిల్ల గొల్లున ఏడ్వటంతో ఈ లోకంలోకి వచ్చాను. కిందపడిన బిడ్డను నువ్వు ఎత్తుకున్నావు. ఇంతలో ఓ పాతిక సంవత్సరాల అందమైన యువతి గాబరాగా లోపలినుంచి వచ్చి నీ చంకలోని బిడ్డను లాక్కుంది. నిన్ను ఏదో మందలిస్తున్నట్లు అనిపించింది నాకు. ఆమె వెనకే నీవు చిరునవ్వుతో లోపలకు వెళ్ళావు. ఆ స్త్రీ ఎవరో నాకు అర్థమైపోయింది. నా చేతిలోని బిడ్డవైపు చూసుకున్నాను. తన తల్లి పడుతున్న నరకయాతనను అర్థం చేసుకోలేని ఆ పసిప్రాణం హాయిగా నిద్రపోతోంది. హోమ్‌వాళ్ళు ఇచ్చిన గౌనులోవున్న నా బిడ్డను నీ బిడ్డతో పోల్చుకున్నాను. మరుక్షణంలో గిర్రున వెనక్కు తిరిగాను. తెనాలి స్టేషన్‌కు వెళ్ళాను. నాలో ఆలోచించే శక్తి లేదు. యంత్రంలా స్టేషన్‌కు వెళ్ళి కూర్చున్నాను. నాలాటి అనాధలకు కన్నతల్లిలా కడుపులో పెట్టుకొని ఆశ్రయం ఇచ్చే ఆ సదనానికే వెళ్ళటానికి నిశ్చయించుకున్నాను. పిల్లను అనాధాశ్రమానికి పంపించడానికి నిశ్చయించుకున్నాను. గుండె రాయి చేసుకొన్నాను. నేను చేసిన పాపానికి ప్రాయశ్చిత్తంగా ఏది వచ్చినా అనుభవించటానికి నిశ్చయించుకొన్నాను. నామీద నాకే ఏదో పగ

సాధించుకోవాలనే కోరిక కలిగింది. హైదరాబాదు బండికోసం ఎదురుచూస్తూ తెనాలి స్టేషన్‌లో కూర్చున్నాను..." అనూరాధ వాక్ప్రవాహం ఒక్కసారిగా ఆగింది.

ప్రసాదు ఊపిరి బిగపట్టి వింటున్నాడు.

అనూరాధ ఓసారి నిట్టూర్చి మళ్ళీ ప్రారంభించింది-

"తెనాలి స్టేషన్‌లో నిద్రపోతున్న బిడ్డను బెంచీమీద పడుకోబెట్టాను. ఆకలితో కళ్ళు తిరిగినట్లయింది. పక్కనే కూర్చొనివున్న ఓ నడివయస్సు ఆడమనిషితో కొంచెం బిడ్డ పడకుండా చూస్తుండమని చెప్పి టీ స్టాలు వైపుకు వెళ్ళాను. టీ స్టాలు చుట్టూ జనం. ఒక కప్పు టీ కోసం నిల్చున్నాను. మధ్య మధ్య వెనక్కు తిరిగి బిడ్డవైపు చూస్తూనే వున్నాను. టీ స్టాలు ముందు కొంచెం జనం పల్చబడ్డారు. నేను ముందుకు వెళ్ళి టీ కప్పు అందుకొని కొంచెం పక్కగావచ్చి నిలబడి టీ పెదవుల దగ్గిర పెట్టుకోబోతూ అప్పుడే స్టేషన్‌నుంచి బయలుదేరుతున్న ఏదో బండికేసి చూశాను చేతిలో కప్పు కింద పడిపోయింది. ఆ నడికారు ఆడది బయలుదేరుతున్న బండిలో ఒక పెట్టె గేటులో నిల్చునివుంది. ఓ కుర్రాడు నా బిడ్డను దానికి అందించి వాడూ కదులుతున్న రైలు ఎక్కిపోయాడు. క్షణంలో అంతా అయిపోయింది. ఎవరో నెత్తిన బలంగా కొట్టినట్లు కళ్ళు బయర్లుకమ్మాయి. కెవ్వున కేకపెట్టి పడిపోయాను. తెలివివచ్చేటప్పటికి ఏదో మిషనరీ ఆసుపత్రిలో వున్నాను. చెప్పానుగదూ - అప్పటికే నాలో ఏదో కక్షలాంటి భావం బయలుదేరిందని. ఆ కక్ష ఎవరిమీదో తెలియదు. కాని, నామీద నాకే కక్షగా వుండేది. ఏడవలేదు. ఒకరికి చెప్పుకోలేదు. నాకు అలాగే కావాలి నాకు తగిన శిక్షే లభించింది అనిపించింది.

"కొంచెం తేరుకోగానే నాకు మొదట ఆశ్రయం కలిగించిన హోమ్‌కే వెళ్ళాను. పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఒకసారి కాలుజారినవాళ్ళు పూర్తిగా బజారుపాలు కాకుండా ఇలాంటి ఆశ్రమాలు కాపాడుతున్నాయనే ఒకవిధంగా చెప్పవచ్చును. శ్రద్ధ తీసుకొని ఇలాంటి హోముల్ని విరివిగా స్థాపిస్తే పరిస్థితుల ప్రాబల్యంవల్ల పతితలయ్యేవారి సంఖ్య తగ్గవచ్చును-" చెబుతూ చెబుతూ ఒకక్షణం ఆగిపోయింది అనూరాధ. మళ్ళీ గట్టిగా నిట్టూర్చి మొదలుపెట్టింది:

"నేను ఇంటరు పాసయానని తెలిసి నాకు ఆ హోమ్‌లోనే గుమాస్తా ఉద్యోగం ఇచ్చారు. అక్కడే ఒక గదిలో వుంటూ నాకు తోచినరీతిని ఆ అమాయకులకూ, అనాథలకూ తోడ్పడుతూ కాలక్షేపం చెయ్యసాగాను. అది మరో చిన్న ప్రపంచం. మనిషికో గాథ. ఆ గాథల వెనక బాధ. ఇలా పదిహేను సంవత్సరాలు గడిచాయి. పూర్తిగా గత జీవితాన్ని మరిచిపోయాననే అనుకున్నాను-" ఆగి ప్రసాదు ముఖంలోకి చూసింది. ప్రసాదరావు ఆదుర్దాగా 'ఆ తరవాత?' అన్నట్లు చూశాడు.

"ఆ హోమ్‌లోనే ఓ ముసల్ది ఆయాగా కొంతకాలంగా పని చేస్తున్నది ఓ రోజు అకస్మాత్తుగా దానికి వళ్ళు పేలిపోయే జ్వరం వచ్చింది. నేను తీసుకెళ్ళి ఆసుపత్రిలో చేర్చాను. మూడోరోజు ఆసుపత్రి నుంచి ఆయా బతకదనీ, తీసుకెళ్ళమనీ ఫోన్ వచ్చింది. నేనూ, మేట్రన్ వెళ్ళాం. నేను వెళ్ళి పిలిస్తే అతికష్టమీద కళ్ళు తెరిచింది నన్ను పక్కనే

కూర్చోమని సైగచేసింది. చనిపోయే ముందు మనస్సులో వున్నది చెప్పటానికి ప్రాణి కొట్టుకొంటుందని విన్నాను. నేను వెంటనే ఆమె తలదగ్గర కూర్చుని దగ్గరగా వంగాను.

"నేను చాలా పాపాలు చేశాను. ఎందరి పిల్లల్నో తల్లుల్నుంచి వేరుచేశాను." అతి కష్టంమీద అన్నది. కళ్ళు మూతలు పడ్డాయి. నాకు గుండెలు పిండినట్లయింది. ఆ పాపిష్టిదాని ముఖంనుంచి కళ్ళు మళ్ళించాను. అక్కడనుంచి లేవబోయాను.

"తెనాలి...." ఆయాసం వచ్చింది. లేవబోయిన నేను ఆదుర్దాగా మళ్ళీ ఆమె దగ్గరగా కూర్చోని ముఖంలోకి చూశాను.

అతికష్టంమీద కళ్ళను తెరుస్తూ, "ఓ పిల్లను తల్లినుంచి వేరుచేశాను, తెనాలి స్టేషన్‌లో. ఆ పిల్లను కొంతకాలం పెంచాను–" నాకు తెలియకుండానే నాలోని మాతృత్వం ఒక్కసారి పొంగింది. ఆ పిల్ల ఇప్పుడు ఎక్కడవుంది? అని అడిగాననుకున్నాను. కాని నా గొంతు పెగిలి ఆ మాటలు బయటకు వచ్చాయో లేదో నేను చెప్పలేను.

"ఆ పిల్ల..... గుంటూరు... అనాధాశ్రమంలో వుంది. నువ్వు తెచ్చి పెంచుకుంటానని మాట ఇవ్వు. నా ప్రాణం పోతుంది" అంటూ కళ్ళుమూసింది.

ఓ క్షణం నేను స్తంభించిపోయాను. తేరుకొని "ఆ పిల్ల పేరు ఏమిటి? ఏ అనాధాశ్రమం?" అన్నాను ఆదుర్దాగా – ఆ ముసలిదాన్ని వూపుతూ. చేతులకు మానవ శరీరానికి బదులుగా ఏదో గట్టిగా తగిలింది.

"ప్రాణం పోయింది" అంటూ నర్సు శవంమీద గుడ్డ కప్పింది.

"నేను ఏ జన్మలో ఏ పాపం చేశానో, నేను ఆమాత్రం జీవించటం కూడా భగవంతునికి ఇష్టం లేకపోయింది. ప్రతి క్షణం నా బిడ్డను చూడాలనే అశాంతి నన్ను పిచ్చిదాన్ని చేసేసింది. ఈ విషయమంతా మా సూపర్నెంటుతో చెప్పాను. ఆమె గుంటూరు శరణాలయాలన్నింటికీ రాసింది. నాంచారమ్మ అనే అవిడ ఎవరూ ఏ పిల్లనూ చేర్పించిన రికార్డులు లేవని జవాబులు వచ్చాయి. బహుశా ఆ ముసల్దాని అసలు పేరు నాంచారమ్మ కాకపోవచ్చును. పాపిష్టిదాన్ని పిల్ల పేరన్నా తెలుసుకోలేకపోయాను.

నా బిడ్డ నాకు దొరకదు అనే భావాన్ని భరించలేకపోయాను. ఏనాటికైనా నా బిడ్డను చూడగలననే ఆశను పిచ్చిదానిలా పెంచుకున్నాను. ఏదో ఉద్యోగం సంపాదించుకొని గుంటూరు వెళ్ళాలని నిర్ణయించుకొన్నాను. అది తెలిసిన మా సూపర్నెంటు తెలిసిన వాళ్ళద్వారా నాకీ ఉద్యోగాన్ని ఇప్పించింది."

"ఆ తరవాత గిరిజ ఎక్కడుందో తెలుసుకోలేదా?" ఇంతసేపూ వూపిరి బిగబట్టి వింటున్న ప్రసాదరావు ప్రశ్నించాడు ఆదుర్దాగా.

అనూరాధ నిట్టూర్చింది.

"అన్ని శరణాలయాల్లోనూ వెదికాను. కాని, నా బిడ్డను ఎలా గుర్తించటం? నాకు తెలుసు – వాళ్ళలో నా బిడ్డ వుందని. కాని, కన్నబిడ్డ ఎదురుగా నిల్చొనివున్నా తెలుసుకోలేని అసహాయురాల్ని. గిరిజ పేరుతో ఎవరూ లేరు, కాని, ఏనాటికైనా నా బిడ్డని నేను కలుసుకోగలను అనే ఆశ ఏ మూలో గూడు కట్టుకొని వుంది నా హృదయంలో. ఆ ఆశతోనే జీవిస్తున్నాను."

"దీనికంతా కారకుణ్ణి నేనే అనూ! 'నేనే కాదు – నిన్ను ఆ భగవంతుడు కూడా అన్యాయం చేశాడు. అందటానికి సిద్ధంగా వున్న ప్రతి తరుణంలో నీకు దేన్నీ అందకుండా చేశాడు ఆ భగవంతుడు. నువ్వు ఆ రోజు నా దగ్గిరకు వచ్చావు. కాని నన్ను కలుసుకోకుండానే వెళ్ళిపోయావు. ఆ రోజు నీవు చూసింది నా భార్యను కాదు. అప్పటికే నా భార్య చనిపోయింది. హేమకు ఆరోగ్యం సరిగా లేదని రాస్తే నా భార్య చెల్లెలు వచ్చి ఓ నెల రోజులు వుండి వెళ్ళింది. కనీసం ఆనాడైనా నేను నిన్ను చూడగల్గితే మన జీవితాలు మరోలా వుండేవి." నిట్టూర్చాడు ప్రసాదరావు. అనూరాధ మౌనంగా కూర్చుంది.

"నా మాట విను అనూ, నా వెంట వచ్చేయ్! మన అమ్మాయి ఎక్కడవున్నా వెతికే బాధ్యత నాది," అన్నాడు ప్రసాదరావు ఆప్యాయంగా అనూరాధ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ.

ఓ క్షణం ప్రసాదరావు ముఖంలోకి అదోలా చూసి చిన్నగా చేతుల్ని లాక్కుంది.

"రాను, రాలేను, నన్ను ఇలా బ్రతకనియ్! ఏనాటికైనా గిరిజ కనిపించి నాన్న దగ్గిరే వుందాం అంటే అప్పుడు ఆ విషయం గురించి ఆలోచిస్తాను."

"అదేనా నీ నిర్ణయం?"

"ఆఁ– అదే! నన్ను బలవంతం చెయ్యకు."

"పోనియ్, రోజుకోసారి వచ్చి నిన్ను చూసి వెళతాను. దానికి అభ్యంతరం చెప్పవుగా?"

"వీల్లేదు. నన్ను యీమాత్రం గౌరవంగానైనా బ్రతకనియ్! నీవు రోజూ వస్తుంటే చూసేవాళ్ళేమనకుంటారు? ఈ వయస్సులో అలాటి అపోహలకు అవకాశం ఇచ్చే ధైర్యం, సహనం నాలో లేవు. ఇప్పటికే నాకు కృష్ణారావుగారి ముఖం చూడాలంటే చచ్చేంత సిగ్గుగా వుంది."

"నువ్వెన్నన్నా చెప్పు, ఈ విషయంలో నేను ఒప్పుకోను. నిన్ను... చూడకుండా నేను వుండలేను. కృష్ణారావుతో అని విషయాలూ చెప్పేస్తాను."

"ప్రసాద్!" గట్టిగా అరిచింది అనూరాధ.

ప్రసాదు తొణకలేదు. అతని ధోరణి చాలా మొండిగా – అన్నంతా చేస్తాడని అనిపించింది అనూరాధకు.

"అయితే, నువ్వు నన్ను ఈ ఊళ్ళో వుండనివ్వదలచుకోలేదన్న మాట? సరే, ఈ రాత్రికే మళ్ళీ ఈ విశాల ప్రపంచంలోకి పొట్ట చేత్తోపుచ్చుకుని వెళ్ళిపోతాను." అనూరాధ స్వరంలోని దృఢత్వానికి ప్రసాదరావు బెదిరిపోయాడు.

"అంతపని చెయ్యకు అనూ! మళ్ళీ నా ముఖం నీకు చూపించను," అంటూ దిగ్గున లేచాడు ప్రసాదరావు.

విసురుగా వెళ్ళిపోబోయిన ప్రసాదరావు చేయి పట్టుకుంది అనూరాధ.

"ఏమిటి?" అన్నట్లు విరక్తిగా చూశాడు ప్రసాదరావు అనూరాధ ముఖంలోకి.

"ఎలాటి అఘాయిత్యం చెయ్యనని మాట ఇవ్వు. నాకు అవసరం అయినప్పుడు కబురు పంపిస్తాను, కనిపించాలి" అంది అనూరాధ కళ్ళ నీళ్ళతో.

"అలాగే" అన్నాడు విసుగ్గా.

"బాధ పడవద్దు, ఎలాగయినా నా బిడ్డను నాకు చూపించటానికి ప్రయత్నించు."

బరువుగా, భారంగా బయటకు నడిచిన ప్రసాదరావును కళ్ళనీళ్ళతో కనిపించినంతవరకూ చూస్తూ సాగనంపింది అనూరాధ.

# 20

చంద్రం తలకు కట్టు కట్టించుకొని ఆసుపత్రినుంచి తిరిగి వచ్చాడు. ఏదో పుస్తకం చదువుతున్న ప్రకాశం తల ఎత్తి "ఏమన్నాడు డాక్టరు?" అని అడిగాడు పుస్తకాన్ని మూసి టేబిలుమీద పెడుతూ.

"పెద్ద గాయం ఏమీకాదు. రెండు రోజులకొకసారి కట్టు మార్చాలట. మరో పది రోజులవరకూ ఈ వేషం వేసుకోక తప్పదట" అన్నాడు చంద్రం నవ్వుతూ.

గౌరి వంటింట్లో నుంచి వచ్చి గడపలో నిల్చుంది. తల మీదగా గడ్డం కింద ముడితో కట్టులో చంద్రం గౌరి కళ్ళకు సరదాగా, సినిమాలో హీరోలా కనిపించాడు. రెప్ప వేయకుండా అతనినే చూస్తున్న గౌరితో నవ్వుతూ "ఏమిటలా చూస్తున్నావ్! చంద్రం అంత బాగున్నాడా?" అన్నాడు ప్రకాశం.

గౌరి సిగ్గుతో ముడుచుకుపోయింది, మల్లెమొగ్గలాగ. ప్రకాశం ఫక్కున నవ్వాడు. గౌరి తుర్రున వంటింట్లోకి పారిపోయింది.

చంద్రం అదేమీ పట్టించుకోనట్లు, ప్రకాశం అంతవరకూ చదువుతూ టేబుల్‌మీద పెట్టిన పుస్తకాన్ని తీసుకొని తిరగవేయసాగాడు.

"మీ అన్నయ్య నిన్నోసారి అర్జంటుగా రమ్మన్నాడట. ఎవరో వచ్చి వెళ్ళారు. ఎందుకో ఏమో, ఓసారి వెళ్ళిరా!" అన్నాడు ప్రకాశం చంద్రం చేతిలోని పుస్తకాన్ని తీసుకుంటూ.

"వార్తా పత్రికలో న్యూస్ చదివి వుంటాడు. నాలుగు చీవాట్లు వెయ్యటానికి పిలిచివుంటాడు. వెళ్ళనక్కరలేదు. అంత అవసరమైన విషయాలుంటే తనే రావచ్చుగా?" అన్నాడు చంద్రం నిర్లక్ష్యంగా.

"మరీ అంత ఆడపిల్లలా అభిమానపడితే ఎలాగోయ్! నీతో మాట్లాడటానికి కబురు చేసే హక్కులేదా మీ అన్నకు? పైగా, చిన్నప్పటి నుంచి పెంచినవాడు. తండ్రి తరవాత తండ్రంతటివాడు. అంత నిరసనగా మాట్లాడకు. నాకంటె ఎక్కువ చదివినవాడివి. పెద్ద రచయితవు. కాని, అప్పుడప్పుడు చాలా పసిపిల్లవాడిలా మాట్లాడుతుంటావు. ఆ వార్త చదివి నీ అన్న బాధపడటంలో అసహజం నాకేమీ కనిపించలేదు" అన్నాడు ప్రకాశం.

"బాధపడి వుండడు. అవమానంగా తలచివుంటాడు" అన్నాడు చంద్రం నిష్ఠురంగా.

"అదికూడ అసహజం కాదు. ఆ వార్త చదివిన నాకే చిన్నతనం అనిపించింది. మరీ మీ అన్నకు-నిన్ను ప్రేమించేవాళ్ళకు అలా అనిపించడంలో ఆశ్చర్యం ఏమీలేదు. కొంతకాలంగా నేనే చెప్పాలనుకుంటున్నాను. ఇప్పుడు అవకాశం వచ్చింది కాబట్టి

చెబుతున్నాను. నీ మంచినీ, నీ ఉజ్జ్వల భవిష్యత్తునూ చూడాలని కోరేవాళ్ళలో నేనూ ఒకణ్ణి. నువ్వు గొప్పవాడివిగా ఇక్కడవాళ్ళంతా గుర్తించాలని నా తాపత్రయం."

"ఇంత ఉపోద్ఘాతం ఎందుకు చెబుతున్నావో అర్థం అయింది" అన్నాడు చంద్రం చిరుకోపంతో.

"అదే నాకు కావాల్సిందికూడా. నన్ను అర్థం చేసుకో, నా మాట విని ఇక్కడనుంచి వెళ్ళిపో. ఎవరు ఎక్కడ వుండాలో అక్కడే వుండటం మంచిది. మనం రోజూ కలుసుకోవచ్చును. ఒక వూళ్ళోనే వుంటాంగా? పెద్దవాళ్ళ మీద అంత పంతం పనికిరాదు. రాత్రి జరిగిన సంఘటనలో నీ స్థానంలో నేను వున్నాననుకో - పత్రికలో అలాటి వార్తకు స్థానం వుండేదికాదు! ఇలాంటివి కూలీ - నాలీ చేసుకొని బ్రతికే జనంలో మామూలే అని ఎవరూ పట్టించుకొనేవారుకాదు. అన్నయ్య ఇంటికి వచ్చేయమంటే వెళ్ళిపో. అలా అనకపోయినా నీ యింటికి నువ్వు వెళ్ళటానికి అభిమానం ఏమిటి?"

"అయిందా నీ వుపన్యాసం! వెళ్ళిపోతాను. ఈ ఊరు విడిచే వెళ్ళిపోతాను. సరేనా?" అన్నాడు చంద్రం వస్తున్న కోపాన్ని అణచుకుంటూ.

"ఫూల్‌లా మాట్లాడకు. ఎంతో చదివావు. విజ్ఞానాన్ని ఆర్జించుకున్నావు. కాని, లోకజ్ఞానం శూన్యం. ఎలా బ్రతగ్గలవోయ్? నీ మనస్సుకు చాలా పెద్ద గాయమే తగిలిందని నాకు తెలుసు. కాని ఏ బంధాన్నయినా మనం తెగేంతవరకు లాగకూడదు. హేమ విముఖతకు కారణం కూడా ఆలోచించవు. కేవలం బాధపడతావు నువ్వు ఇలాంటి ప్రదేశాల్లో వుంటూ, మాలాటివాళ్ళతో తిరుగుతుంటే ఆ అమ్మాయి నిన్ను ఎలా అర్థం చేసుకుంటుందో ఒక్కసారయినా ఆలోచించావా?" మందలిస్తున్నట్లు అన్నాడు ప్రకాశం.

"అంటే - నువ్వూ అంతస్తుల్ని మర్చిపోలేకుండా వున్నావన్నమాట?" అన్నాడు చంద్రం ఆశ్చర్యంగా.

"అంతస్తుల్ని మనం మర్చిపోవాలన్నా, సంఘం మనల్ని మర్చిపోనివ్వదు. అనుక్షణం ఆ అంతస్థులు అడ్డు వస్తూనే వుంటాయి. అవి ఒకరిద్దరి ప్రయత్నంతో తొలగిపోయేవి కావు. అంతస్థులు అడ్డురాని సమాజం ఏర్పడటానికి ఇంకా చాలాకాలం పడుతుంది. అలాంటప్పుడు ఎవరిస్థానంలో వాళ్ళు వుండటమే మంచిది. నువ్వు మీ అన్న దగ్గర వుంటేనే నాకూ లాభం. నువ్వు నీ స్థానంలో వుండి, నా ఆశయాల సిద్ధికి ఎక్కువ సహాయం చెయ్యగలవు. కృష్ణా టుబాకో కంపెనీ భాగస్వామిగా నువ్వు మాకు ఎక్కువ ఉపయోగపడగలవు."

చంద్రం మౌనంగా వింటున్నాడు చంద్రం తన అభిప్రాయాలను కొంతవరకు అర్థంచేసుకుని ఆలోచిస్తున్నాడని తెలుసుకొని ప్రకాశం లోలోపలే సంతోషించాడు.

వంటింటి గడపకు చేరబడి వాళ్ళిద్దరి సంభాషణ వింటున్న గౌరి చలనరహితంగా స్థంభించిపోయింది. చంద్రం జవాబు వినటానికి శక్తినంతా కూడతీసుకుంటూ ఊపిరి బిగపట్టి కూర్చుంది.

ప్రకాశం చెప్పింది కొంతవరకు సబబుగానే వుందనుకున్నాడు చంద్రం. నిజమే- తనకు లోకజ్ఞానం తక్కువ, హేమను ఆమె పరిస్థితులలో వుంచి అర్థంచేసుకోవటానికి తను ప్రయత్నించలేదు. హేమమధ్య, తనమధ్య వున్న అఘాతానికి కారణాన్ని తను

ఆలోచించటానికి ప్రయత్నం కూడా చెయ్యలేదు. అవును. తన ఇంటికి తను వెళ్ళటానికి ఒకరి ఆహ్వానం ఎందుకు? పైగా, తను ప్రకాశానికి ఏ సహాయం చెయ్యకపోగా ఒక బరువుగా తయారయాడు.

"ఏంవిటోయ్, అంత ఆలోచన? సరే, నేను చెప్పాల్సింది, నా బాధ్యత కాబట్టి చెప్పాను. ఆ తరవాత నీ ఇష్టం. నువ్వు నా దగ్గిరే వుంటే నా కంతకంటే సంతోషం మరొకటి లేదు" అన్నాడు ప్రకాశం తేలిగ్గా నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"నువ్వు చెప్పింది ఏది చెయ్యలేదు? అలాగే వెళతాను" అన్నాడు చంద్రం.

"ఆ వెళ్ళటం తరవాత చూసుకోవచ్చును. ముందు అన్నయ్య ఎందుకు కబురు పంపించాడో – ఒకసారి వెళ్ళిరా!"

"సాయంకాలం వెళతాను."

"కాదు. ఇప్పుడే వెళ్ళు. అర్జంటుగా రమ్మని కబురు పంపించాడు. ఆఫీసుకు వెళ్ళి ఏమిటో అడిగి త్వరగా వచ్చేయ్. నువ్వు వచ్చాకనే భోజనం చేద్దాం" అన్నాడు ప్రకాశం.

"అలాగే. త్వరగా వచ్చేస్తాను" అంటూ వెళ్ళిపోయాడు చంద్రం.

చంద్రం అలా గడప దిగాడో లేదో గౌరి సుడిగాలిలా వచ్చి నిల్చుంది ప్రకాశం ముందు. స్నానం చేయటానికి షర్టు గుండీలు తీసుకుంటూ నిల్చున్న ప్రకాశం అలా అంత దగ్గరగా వచ్చి నిల్చున్న గౌరి ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు. మరుక్షణంలోనే గౌరి ప్రకాశం షర్టును గుండెల దగ్గర పట్టుకొని రెండు చేతుల్తో ఆవేశంగా లాగింది. షర్టు చిరిగింది. ప్రకాశం కొయ్యబారిపోయాడు. మరో నిముషంలో ఏదో తెలియని ఆవేశంతో అతని ఒక చెయ్యి గౌరి నడుంచుట్టింది. మరో చేత్తో జడపట్టుకొని గౌరి తలను వెనక్కు లాగి ఆమె ముఖంమీదకు వంగి ఆమె కళ్ళలో దేన్నో వెతకబోయాడు. ఆ కళ్ళలో కోపం, ఉద్రేకం – ప్రకాశం చెంప ఛెళ్ళుమంది. ఉలిక్కిపడి ప్రకాశం గౌరిని దూరంగా నెట్టేశాడు. విసురుగా వెళ్ళి కుర్చీమీద పడింది. కుర్చీతోపాటు గౌరి కూడా కిందపడింది. మరుక్షణంలోనే లేచి నిల్చుంది. కోపంతో బుసలుకొడుతూ నిల్చున్న గౌరిని ప్రకాశం తెల్లముఖం వేసి చూస్తున్నాడు.

మండుతున్న చెంప, చిరిగిన షర్టూ ప్రకాశాన్ని ఈ లోకంలోకి తెచ్చాయి. కాని గౌరి ప్రవర్తన అర్థం కాలేదు.

"నువ్వు దొంగవు. మోసగాడివి. ఇదంతా నువ్వే చేస్తున్నావు!" కక్షగా అరిచింది గౌరి.

ప్రకాశం ఆశ్చర్యానికి అంతులేదు. అయోమయంగా చూశాడు గౌరివైపు.

"నాకు ముందునుంచీ తెలుసు, నువ్వే ఇదంతా చేస్తున్నావని. చంద్రంబాబును ఇక్కడనుంచి తరిమెయ్యాలని చూస్తున్నావు."

ప్రకాశం చిన్నకళ్ళు విస్మయంతో విచ్చుకున్నాయి.

"నువ్వే చంద్రాన్ని ఆ అమ్మాయి దగ్గిరకు వెళ్ళమని చెబుతున్నావు. చంద్రంబాబుకు నేనంటే ఇష్టమే. చంద్రంబాబును వెళ్ళగొట్టి నన్ను పెళ్ళి చేసుకోవాలని చూస్తున్నావు–" గౌరి స్వరంలో కోపస్థాయి పెరగసాగింది.

ప్రకాశం మరీ తెల్లబోయాడు.

"నేను చచ్చిపోతాను. కాని నిన్ను మాత్రం చేసుకోను-" అంటూన్న గౌరి ఒక్కసారి అరచేతుల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది. ప్రకాశం నిల్చున్న చోటనే కొయ్యబారిపోయాడు. బుర్ర పూర్తిగా పనిచెయ్యటం మానేసింది.

ఒక ఫర్లాంగు దూరం వెళ్ళిన చంద్రం తను పర్సు మర్చిపోయినట్లు తెలుసుకొని తిరిగివచ్చాడు. గోడకు చేరబడి అరచేతుల్లో ముఖాన్ని దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్న గౌరినీ, అల్లంతదూరంలో చిరిగిన షర్టుతో కొయ్యబారి నిల్చొనివున్న ప్రకాశాన్ని చంద్రం విస్మయంతో మార్చి మార్చి చూశాడు. వెంటనే పరిస్థితి మరోలా వూహించుకున్నాడు. చంద్రం మనస్సు జుగుప్సతో నిండిపోయింది.

ప్రకాశం కూడా చాలామంది మగవాళ్ళలాగే ప్రవర్తించాడా? ఒంటరిగా అసహాయంగా వున్న ఆడదానిపట్ల అందరు మగవాళ్ళు ఒకేలా ప్రవర్తిస్తారా? ఆ క్షణంలో వాళ్ళ అభిప్రాయాలూ, ఆదర్శాలు ఏమవుతాయి? అందుకేనేమో ప్రకాశం తనను అప్పటికప్పుడు అంత ఉపన్యాసం ఇచ్చి బయటకు నెట్టాడు. చంద్రం మనస్సు చీదర చీదరగా వుంది గౌరి పట్ల జాలి కట్టలు తెంచుకుంది.

చంద్రాన్ని చూసిన ప్రకాశం క్రమంగా ఈ లోకంలోకి వచ్చాడు. ఏదో చెప్పాలని చంద్రం ముఖంలోకి చూశాడు. చంద్రం కళ్ళలో తిరస్కారం, ముఖంలో ఏవగింపు. ప్రకాశం అంతరాంతరాల్లో ఏదో కలుక్కుమంది. చంద్రం తనను అంత నీచంగా అర్థం చేసుకున్నాడా, ఒకవైపు సిగ్గూ, మరోవైపు అవమానంతో చంద్రం ముందు నిల్చోలేక గబగబా బయటకు వెళ్ళాడు ప్రకాశం.

ప్రకాశం అలా వెళ్ళిపోవటం చంద్రం అనుమానాన్ని మరీ బలపరిచింది. వెళ్ళిపోతున్న ప్రకాశాన్ని పుట్టలోకి పోతున్న పాముని చూసినట్లు చూశాడు చంద్రం. 'ప్రకాశం అయిపోయాడు. అదే మరొకరయితే రక్తం కళ్ళచూసి వుందును' అనుకున్నాడు.

గౌరి అసహాయతను చూస్తుంటే చంద్రం గుండెలు చెరువులయాయి. పక్కనే వెళ్ళి కూర్చుని తలమీద ఆప్యాయంగా నిమురుతూ "ఊరుకో, ఏడవకు" అన్నాడు చంద్రం.

గౌరి ఒక్కసారిగా చంద్రం చేతికి చుట్టుకుపోతూ బోరున ఏడ్చింది.

"ఛ! ఏమిటిది. లే - ఏడవకు. లేచి ముఖం కడుక్కో. నేను వున్నానుగా, నీకేం భయంలేదు" అన్నాడు చంద్రం.

గౌరికి చంద్రం మాటలు అర్థంకాలేదు. కాని, అతను తన కోసం బాధ పడుతున్నాడని అర్థం అయింది.

"లేచి ముఖం కడుక్కో" అంటూ చంద్రం లేచి నిలబడ్డాడు అలా లేచిన చంద్రం కాళ్ళను రెండు చేతుల్తో చుట్టేసి తలను కాళ్ళకు ఆనించి వెక్కి వెక్కి ఏడవసాగింది.

చంద్రం గాబరాపడ్డాడు. వంగి గౌరి చేతులనుంచి తన కాళ్ళను విడిపించుకోటానికి ప్రయత్నిస్తూ "ఛ - ఏవిఁటిది గౌరీ! మరీ పసిపిల్లలా - అలా కాళ్ళు పట్టుకోకూడదు - లే" అన్నాడు.

"నువ్వు... నువ్వు ఇక్కడనుంచి వెళ్ళొద్దు" అంది గట్టిగా చంద్రం కాళ్ళను చుట్టేస్తూ- వెక్కి వెక్కి ఏడుస్తూ.

"వెళ్ళనులే. ముందు నా కాళ్ళను వదులు" అన్నాడు చంద్రం తన కాళ్లను వదిలించుకుంటూ.

చంద్రం 'వెళ్లను' అనడంతోటే గౌరికి సంతోషం కలిగింది. అంతలోనే అంత దుఃఖాన్ని మర్చిపోయింది. ఏడుస్తున్న పిల్లవాడి చేతిలో మిఠాయి పొట్లం పెట్టినట్లు గౌరి అమాయక హృదయం అంతలో అంత దుఃఖాన్ని ఇట్టే మర్చిపోయింది. కళ్ళు తుడుచుకుంటూ లేచి నిల్చుంది.

"వెళ్ళి ముఖం కడుక్కో" అన్నాడు చంద్రం. బాత్‌రూం వైపు వెళుతున్న గౌరిని జాలిగా చూస్తు నిట్టూర్చాడు.

ఎంత అమాయకం! కల్లాకపటం తెలియని మనస్సు పాపం, ఎంత చెదిరి పోయిందో! ప్రకాశం ఇంత నికృష్టపు పని చేస్తాడని తను ఏనాడూ వూహించలేదు. అన్ని ఆదర్శాలు మాట్లాడే ప్రకాశమే ఇలా ప్రవర్తిస్తే.... కాని, ప్రకాశం గురించి చెడుగా ఆలోచించడం బాధ అనిపించింది చంద్రానికి.

ఒకవేళ ప్రకాశం గౌరిని ప్రేమిస్తున్నాడేమో? అయినా, అలా ప్రవర్తించి వుండకూడదు, ఆమె మనస్సును తెలుసుకోకుండా. గౌరి తనంటే పడిచచ్చిపోతుందని తనకూ తెలుసు. అందుకే ఆ పిల్ల అంటే తను అంత ముభావంగా నటిస్తున్నాడు. ఎలాగయినా గౌరి మనస్సును ప్రకాశంవైపుకు మరలించాలి.

దానికి ఉపాయం ఒకటే. తను త్వరలో వివాహం చేసుకోవాలి. అప్పుడు తనంత తానే మారిపోతుంది. హేమతో తను ఖచ్చితంగా మాట్లాడాలి.

చంద్రం మనస్సు కలతబారింది. ఎంత సర్దుకుందామన్నా ప్రకాశం ప్రవర్తనను సమర్థించుకోలేకుండా వున్నాడు. సగంపైగా రాసిన నవలను తీసుకొని కూర్చున్నాడు.

హేమ కోరినట్లు చంద్రం నవల రాస్తున్నాడు ఇతివృత్తంగా తన జీవితాన్నే తీసుకున్నాడు. హేమ ముందు వెల్లడించలేని భావాలను ఈ విధంగానన్నా హేమకు తెలియపరిచే అవకాశం కలుగుతుందని ఆశించాడు. ఈ నవల హేమ మనస్సులోని అనుమానాలన్నిటికీ సమాధానం చెబుతుందనీ, హేమ తనకు దగ్గరగా రావటానికి సహాయపడుతుందనీ చంద్రం ఆశ.

ఆ నవలద్వారా గౌరికీ తనకూ మధ్యవున్న సంబంధం ఎలాంటిదో, చెయ్యని దొంగతనం తనమీద ఎలా మోపబడిందో, ప్రకాశం తను ఇంతవాడు కావటానికి ఎలా తోడ్పడ్డాడో అంతా వివరంగా రాస్తున్నాడు.

నవల రాయడంలో మునిగిపోయిన చంద్రానికి అలా తను రాయడం మొదలుపెట్టి రెండుగంటలయినట్లు తెలియలేదు. అకస్మాత్తుగా భావప్రవాహానికి ఏదో అడ్డుతగిలినట్లయి కాగితాలూ, కలం టేబిలుమీద పెట్టి యాంత్రికంగా జేబులో సిగరెట్టుతీసి ముట్టించాడు. గట్టిగా దమ్ము పీల్చి వదిలాడు. కొంచెం రిలీఫ్‌గా అనిపించింది. అప్పుడుగాని గౌరి ఎదురు కుర్చీలో కూర్చుని తన ముఖంలోకే రెప్పవెయ్యకుండా చూస్తున్నదని తెలియలేదు. అలా ప్రపంచాన్నే మరిచి ఏదో వింతవస్తువును చూస్తున్నట్లు తన ముఖంలోకే చూస్తున్న గౌరిని చూస్తుంటే చంద్రానికి నవ్వు వచ్చింది. మాటలలోకి దించాలని సరదా కలిగింది.

"ఏమిటి గౌరీ, అలా చూస్తున్నావు? నా ముఖం ఎలా వుందేమిటి?" అన్నాడు చంద్రం సిగరెట్టు పొగను విలాసంగా ఊదుతూ.

గౌరి ఉలిక్కిపడింది. సిగ్గుతో బుగ్గలు జేవురించాయి. తల వంచుకుంది. ఎంత అందంగా వుంది! వయస్సుతోపాటు ఎంత అమాయక హృదయంలో కూడా మధుర భావాలు తలెత్తుతాయి కాబోలు! చంద్రానికి గౌరిని చూస్తుంటే ఇంకా ఇంకా మాట్లాడాలనిపించింది.

"సిగ్గెందుకు చెప్పు, నన్నెందుకలా చూస్తున్నావు?"

"నీవు రాస్తుంటే నీ ముఖం బలేగా వుంటుంది. అలాగే చూడాలనిపిస్తుంది" అనేసి సిగ్గుతో ముఖాన్ని అరచేతుల్లో దాచుకుంది.

"అలా సిగ్గుపడితే ఎట్లా? మరి, నేను అడిగేదానికి సరిగా జవాబు చెప్పు. అలా ఎందుకు చూడాలనిపిస్తుంది?"

"ఏమో!" అంది గౌరి సాలోచనగా.

"మరి, ప్రకాశాన్ని అలా చూడాలనిపించదా?"

"ఉహూఁ!?"

"ఎందుకనో? నాకంటే ప్రకాశం నిజానికి అందమైనవాడు."

గౌరి మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తూ కూర్చుంది. గౌరికి ఆలోచించడం కూడా వచ్చునన్నమాట! అనుకున్నాడు చంద్రం.

"నేను అడిగేవాటికి మరి సరిగా జవాబు చెప్పు. లేకపోతే, నేను బయటకు వెళ్ళిపోతాను." చంద్రం చిరునవ్వుతో అన్నాడు.

గౌరి బెదురుగా చంద్రం ముఖంలోకి చూసింది.

"వెళ్ళనులే మరి, చెప్పు. ప్రకాశాన్ని చూడాలని నీకు ఎందుకు అనిపించదు? ప్రకాశం అంటే నీకు ఇష్టంలేదా?"

"ఇష్టమే." ఒక్క ముక్కలో అయిష్టంగా జవాబిచ్చింది.

"మరి ఇష్టమయితే ప్రకాశం ముఖం ఎందుకు చూస్తూ కూర్చోవాలనిపించదు?"

"ప్రకాశం అంటే నాకు ప్రేమ లేదు. నేను నిన్నే ప్రేమిస్తున్నాను."

చంద్రం విస్మయంగా గౌరి ముఖంలోకి చూశాడు. గౌరి అంత మాట అనేస్తుందనుకుంటే అసలు గౌరిని అలా గుచ్చి గుచ్చి అడక్కనేపోను తను. గౌరి అమాయకత్వానికి బాధపడ్డాడు. గౌరిలోని ఆ భావాన్ని పెరగనివ్వకూడదు అనుకున్నాడు.

"ప్రేమా! ప్రేమంటే ఏమిటి?" అన్నాడు చంద్రం, ఊదిన సిగరెట్టు పొగలోకి చూస్తూ.

ఆశ్చర్యపోవటం ఈసారి గౌరివంతయింది. "నీకు ప్రేమంటే తెలియదా? మరి కథలు రాస్తావుగా?" అంది ఆశ్చర్యంగా కళ్లు తిప్పుతూ.

చంద్రానికి నవ్వు వచ్చింది, బాధా కలిగింది.

"నాకు ప్రేమంటే తెలియదు. నేను రాసే కథల్లో ప్రేమను గురించి రాయను" అన్నాడు చంద్రం.

"మరి నువ్వు హేమను ప్రేమించటంలేదూ?" చంద్రం ముఖంలోకి చూస్తూ ప్రశ్నించింది గౌరి.

చంద్రం ఇరుకులో పడ్డాడు. అవును అని చెబితే గౌరి ముందుకు మాట్లాడదని తెలుసు. గౌరి అమాయక హృదయం ప్రేమ రూపాన్ని ఎలా చిత్రించుకుందో తెలుసుకోవాలనే కుతూహలాన్ని అణచుకోలేకపోయాడు.

"లేదు. నేను ఎవర్నీ ప్రేమించటం లేదు. ప్రేమంటే నాకు తెలియదు. ప్రేమంటే ఏమిటో చెప్పు" అన్నాడు చంద్రం.

గౌరి ముఖం ఆనందంతో వికసించింది. అది చూసి చంద్రం తను అబద్ధం చెప్పి తప్పు చేశానేమోనని బాధపడ్డాడు.

"ప్రేమంటే....ప్రేమే.... ఎలా చెప్పటం...." అంటూ ఆలోచనలో పడిపోయింది గౌరి.

"ప్రేమంటే ఏమిటో తెలియదు. కాని, నువ్వు ప్రేమించేస్తున్నావ్" అన్నాడు చంద్రం గౌరిని ఉడికిస్తున్నట్లు.

చంద్రం ప్రశ్నకు గౌరికి రోషం వచ్చింది.

"ప్రేమించుకొనేవాళ్ళకు ఒకళ్ళకు ఒకళ్ళు అందంగా కనిపిస్తారు. వాళ్ళనే చూస్తూ కూర్చోవాలనిపిస్తుంది. వాళ్ళకు దగ్గిరగా కూర్చొని కబుర్లు చెప్పాలనిపిస్తుంది. కాని, మాటలు దొరకవు. గుండెలు కొట్టుకుంటాయి. వాళ్ళదగ్గర కూర్చుంటే ఆకలి కాదు. వాళ్ళు దూరంగా వెళ్ళిపోతే గుండెల్లో ఏదో గుబులు గుబులుగా వుంటుంది. ఏడవాలనిపిస్తుంది. ఆకురాలిన శబ్దం అయినా వాళ్ళే వస్తున్నట్లు ఉలిక్కిపడతాము. ఇంకా.... చాలా అనిపిస్తుంది. కాని నాకు చెప్పటం రావటం లేదు" అంది గౌరి, ఇంకా ఏదో చెప్పాలని ఆలోచిస్తున్న ముఖంపెట్టి.

చంద్రం గౌరి మాటలు విని విస్తుపోయాడు. ఇన్ని మాటలు, ఇన్ని వూహలు ఎవరు నేర్పించారు ఈ అమాయకురాలికి? బాలభానుని నులివెచ్చని కిరణ స్పర్శకు పులకించటం కమలానికి ఎవరు నేర్పించారు? వసంతుని ఆగమనంతో కోకిలకు పాడటం ఎవరు నేర్పుతున్నారు?

గౌరికి జరగరాని అన్యాయం ఏదో తనవల్ల జరుగుతున్నట్లనిపించింది చంద్రానికి. ఆమెను గాఢంగా గుండెలకు అదుముకోవాలనీ, ఆ గుండెల్లో ఆమెను దాచుకోవాలనీ అనిపించింది. కాని, ఆ గుండెలో గూడు కట్టుకొని ఏనాడో హేమ ఆక్రమించుకుంది. మరొకరికి అక్కడ చోటు లేదు. చంద్రం కళ్ళలో నీరు తిరిగింది. దానిని ఆపుకొనే ప్రయత్నంలో క్రింది పెదవిని కొరుక్కున్నాడు.

గౌరి ముఖంలోకి చూశాడు. ఆమె యింకా ఆలోచిస్తూనే వుంది. ఒక్కసారిగా ఏదో తట్టినట్లు ముఖంపెట్టి "నిన్ను చూస్తుంటే–" అంటూ తన ముఖంలోకి అదోలా చూస్తున్న చంద్రాన్ని చూసి ఆగిపోయింది.

"ఆగిపోయావేం - చెప్పు?" అన్నాడు చంద్రం. చంద్రం స్వరంలో అంత ఆత్మీయతను ఏనాడూ అనుభవించలేదు గౌరి.

గౌరికి ఏదో లోకాలలోకి వెళ్ళిపోయినట్లుంది. నన్ను తను మరిచిపోయి చెప్పసాగింది.

"నిన్ను చూస్తుంటే నాకు ఏమనిపిస్తుందో తెలుసా? నిన్ను నా కళ్ళలో దాచేసుకొని కళ్ళు గట్టిగా మూసుకోవాలనిపిస్తుంది."

"ఎందుకూ?" అన్నాడు కుతూహలంగా.

"అప్పుడు నేను నిన్ను చూస్తుంటాను. నువ్వుకూడా ఎవర్నీ చూడలేవు. నిన్ను ఎవరూ చూడరు...." అలా చెబుతున్న గౌరి కంఠం కొంచెం వణికింది. గౌరి గుండెల వేగం ఆమె మాటల్లోనే చంద్రానికి వినిపించినట్లయింది.

చంద్రం ఆవేశంతో ఆమెను రెండు చేతులలోకి లాక్కున్నాడు. చంద్రం చేతుల్లో ఇమిడిపోయిన గౌరికి ప్రపంచమే స్తంభించిపోయినట్లయింది. చంద్రం గౌరి నుదుటిని తన పెదవులతో మృదువుగా తాకాడు.

మరోక్షణంలో ఉద్రేకంనుంచి బయటపడిన చంద్రం అరచేతిలో పడిన నిప్పుకణాన్ని వదిలినట్లు వదిలేశాడు.

"క్షమించు గౌరీ!" అన్నాడు తను చేసిన తప్పుకు బాధపడుతూ.

ఇంకా స్వప్నలోకంనుంచి పూర్తిగా బయటపడని గౌరికి చంద్రం మాటలు వినిపించలేదు. వినిపించినా అందులో క్షమించాల్సిందేముందో ఆమెకు అర్థమయేది కాదేమో!

"కోపం వచ్చిందా?" అన్నాడు గౌరి మౌనాన్ని అర్థం చేసుకోలేని చంద్రం.

గౌరి విస్మయంగా చంద్రం ముఖంలోకి చూసింది.

"నువ్వంటే నాకు ప్రేమ. నువ్వేంచేసినా నాకు కోపం రాదు!" అంతకంటే ఏం చెప్పాలో తెలియని గౌరి అనేసింది.

చంద్రం సిగరెట్టు ముట్టించి గుప్పు గుప్పున పొగ వదులుతూ, ఆ పొగ మేఘాలలోకి చూస్తున్నాడు. కాని, అతనికి ఏమీ కనిపించటంలేదు.

"నా చిన్నప్పుడు ఒక అబ్బాయిని ప్రేమించాను. ఇప్పుడు నిన్ను ప్రేమిస్తున్నాను. నేను అసలు ఇద్దర్నే ప్రేమించాను!" ఏదో స్వప్నంలో మాట్లాడుతున్నట్లు మాట్లాడుతుంది గౌరి.

చంద్రం ఆశ్చర్యంగా గౌరి ముఖంలోకి చూస్తూ సిగరెట్ తాగుతున్నాడు.

"అప్పుడు నాకు పదేళ్ళుంటాయి. ఒకనాడు ఒక అబ్బాయిని వాళ్ళ పెద్దవాళ్ళు గుంజకు కట్టేశారు. నేను విడిపించాను. అప్పుడు ఆ అబ్బాయి కూడా అచ్చంగా నీలాగే..."

చంద్రం విస్మయానికి అంతులేదు.

"ఊఁ చెప్పు!" ఆత్రకంఠంతో అన్నాడు.

"ఆ అబ్బాయి కూడా.... అచ్చంగా నీలాగే నన్ను ముద్దు పెట్టుకున్నాడు." ఒక్కసారిగా గౌరి బుగ్గల్లో గులాబీలు పూశాయి. కృత్రిమ సభ్యతా, నాగరికతా తెలియని గౌరి తన హృదయాన్ని తేలిగ్గా తెరచిన పుస్తకంలా చంద్రం ముందు వుంచింది.

చంద్రంలోని ప్రతి అణువు కృతజ్ఞతతో నిండిపోయింది. ఆనాడు తన కట్లు విప్పిన ఆ తేలుకొండీజడ చిలిపి పిల్లేనా ఈ గౌరి? మళ్ళీ తిరిగి వచ్చిన క్షణంలోనే తన జీవితంలో ఇలా ప్రవేశించిందా? ఎంత చిత్రం! ప్రకాశం విధి, కర్మ అనే మాటల్ని నమ్మడు. కాని, ఇలా ఎందుకు జరిగిందో ఎవరైనా చెప్పగలరా! ఏ అజ్ఞాతశక్తి ప్రమేయం లేకుండానే ఇలాంటి చిత్రాలు జరుగుతాయా?

గౌరిని రెండు చేతులలోకి తీసుకొని "ఆ అబ్బాయిని నేనే గౌరీ! నీకోసం నన్నేం చేయమంటావో చెప్పు. నీకోసం ఏమయినా చేస్తాను. చివరకు హేమను కూడా వదులుకుంటాను," అని అనాలనిపించింది. కాని, అలా అనలేకపోయాడు. ప్రయత్నంమీద ఉద్రేకాన్ని అణచుకున్నాడు.

"నీకు ఆ అబ్బాయి అంటే ఎక్కువ ఇష్టమా – నేనంటేనా?" అడిగాడు కుతూహలాన్ని అణుచుకోలేక.

గౌరి అయోమయంలో పడింది. క్షణకాలం ముఖం గంభీరంగా పెట్టి ఆలోచించింది. "ఇద్దరంటే సమాన ఇష్టమే" అనేసి, గబుక్కున నాలుక కరుచుకుంది.

"ఎవరైనా ఒకర్నే ప్రేమిస్తారు. ఇద్దర్ని ప్రేమించరు. అలా ఇద్దర్ని ప్రేమిస్తున్నారంటే ఎవర్నీ ప్రేమించటంలేదన్నమాట!" అన్నాడు చంద్రం, గౌరి ముఖంలోకిచూస్తూ. ఆ మాటలంటున్నప్పుడు నిద్రపోతున్న పసిబిడ్డ ముఖంలోకి చూస్తూ కూర్చున్న తల్లి చూపులావుంది చంద్రం చూపు.

గౌరి ముఖం కోపంతో కందిపోయింది. ఏడుపూ, రోషం నేను ముందంటే నేను ముందని కొట్లాడే గొంతుతో అంది – "నేను నిజంగానే చెబుతున్నా – నాకు ఇద్దరూ సమానంగానే ఇష్టం."

"సరే, ఒప్పుకుంటాను, ఇప్పుడు ఆ అబ్బాయి పెద్దవాడయి వుంటాడుకదా! అతను కూడా వచ్చాడనుకో. మరి మా ఇద్దరిలో నీకు ఎవరు కావాలి?" అన్నాడు చంద్రం.

గౌరి ఆలోచనలో పడింది. నిజమే తనకు ఇద్దరూ ఇష్టమే! కాని, తనకు ఎవరు కావాలి, ఏమో తనకు తెలియటంలేదు.

చంద్రానికి ఓ ఆలోచన తట్టింది.

"ప్రకాశమే ఆ అబ్బాయి అనుకో."

"కాదు... కాదు..." గట్టిగా అరిచింది గౌరి.

చంద్రం ఉలిక్కిపడ్డాడు గౌరి ఆవేశానికి ఆశ్చర్యం. మానవుడు ఆర్జించిన జ్ఞానంకంటే కూడా అంతఃకరణ జ్ఞానం గొప్పదేమో!

"ప్రకాశం అంటే ఇష్టం అని నువ్వే చెప్పావుగా?"

"అవును. ప్రకాశం మంచివాడు. అందుకే నాకు ఇష్టం."

చంద్రం ఆశ్చర్యపోయాడు.

"మరి ప్రకాశం మంచివాడయితే ఇందాక అలా ఎందుకు ప్రవర్తించాడు?" అన్నాడు చంద్రం గౌరిని పరీక్షగా చూస్తూ.

గౌరికి అర్థంకాలేదు.

"ప్రకాశం మంచివాడే. ఇందాక నేను తిట్టాను. చొక్కా చింపాను. కాని, పాపం నన్ను ఏమీ అనలేదు," అంది గౌరి బాధపడుతూ.

"ఎందుకలా చేశావ్?" అడిగాడు చంద్రం.

"నిన్ను ఇక్కడనుంచి వెళ్ళిపొమ్మన్నాడని కోపంవచ్చి అలా చేశాను. ప్రకాశానికి కోపం వచ్చిందేమో?" అంది గౌరి దిగులుగా.

చంద్రానికి విషయం అర్థం అయింది. తను ప్రకాశాన్ని ఎంత అపార్థం చేసుకున్నాడు?

"ఎంతపని చేశావు గౌరీ! ప్రకాశం దేవుడులాంటివాడు. నీకు ఆశ్రయం ఇచ్చినవాడు" అన్నాడు బాధపడుతున్న స్వరంతో.

అప్పుడే లోపలకు వచ్చిన ప్రకాశం చంద్రం మాటలు విన్నాడు. ప్రకాశం మనస్సు తేలికపడింది. ప్రకాశాన్ని చూసిన చంద్రం క్షమించమని అడగాలనుకున్నాడు. కాని, ఆ విషయం గురించి మాట్లాడాలనిపించలేదు ఇద్దరిలో ఎవరికీ.

"ఎక్కడకురా వెళ్ళావ్, నీ కోసమే ఎదురుచూస్తున్నాం. పద భోజనం చేద్దాం" అన్నాడు చంద్రం.

"పద వస్తున్నా" అంటూ షర్టు మార్చుకోవటానికి లోపలకు వెళ్ళాడు ప్రకాశం. ఇద్దరకూ భోజనం వడ్డించడానికి గౌరి వంటింట్లోకి వెళ్ళింది.

# 21

"నీ చాతగానితనమే ఇంతవరకు తెచ్చింది." కాంతమ్మ కంఠంలో మాటలు గరగరలాడాయి.

ఆమె ఏ విషయం గురించి మాట్లాడుతుందో తెలుసుకున్న కృష్ణారావు చదువుతున్న పత్రికనుంచి తల పైకి ఎత్తలేదు.

"అప్పు! ఎంత అప్రతిష్ట! కుటుంబాన్ని బజారు కెక్కించినా నీకు చీమ కుట్టినట్టు కూడా లేదాయె. ఒక్కగానొక్క బిడ్డ. దాన్ని పరువు గల కుటుంబంవాళ్ళు చేసుకోవాలా అక్కరలేదా?" కాంతమ్మ కంఠస్థాయి పెరిగింది.

అమ్మా, నాన్నా చూడకుండా స్నేహితుడు రాజాతో బయటకు బయలుదేరిన రజని మెట్లమీదే ఆగిపోయింది. తల్లీ తండ్రీ హాలులో కూర్చొని ఏదో విషయంమీద ఘర్షణ పడుతుండటాన్ని గమనించింది. రాజాను మాట్లాడవద్దని సైగ చేసింది.

అదుపూ, ఆజ్ఞా లేకుండా పెరుగుతున్న రజని తనను ఎంతో పెద్దదిగా వూహించుకోసాగింది. నిండా పదమూడేళ్ళు లేని పసిది – సహాధ్యాయి రాజాతో తల్లి తండ్రికి తెలియకుండా షికార్లు మొదలుపెట్టింది. రాజాకు పదిహేను సంవత్సరాలుంటాయి. తెలిసీ తెలియని భావాలతో అన్నీ తెలిసినవాడిలా నటిస్తాడు. ఇరుగ్గా వుండే పాయింటెడ్ బూట్లు, బిగుతుగా, కాళ్ళకు అతుక్కున్నట్లుండే పాంటూ, బొమ్మల బన్నీను, ముందు జుట్టు ముఖంమీదకు పడుతూ, ఆడపిల్లకు మొగవాడి వేషం వేసినట్లుంటాడు.

చూస్తూనే ఆ కుర్రవాడు వయస్సుకుతగ్గ భావాలు కలవాడులా కనిపించడు. మిడిమిడి జ్ఞానంతో దేన్నో, ఎవర్నో అనుకరించటానికి ప్రయత్నిస్తున్న కృత్రిమత అణువణువునా కనిపిస్తుంది. కాని ముఖంలోని చిన్నతనపు అమాయకత్వం విడిచిపోలేక, తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో పెనుగులాడుతోంది.

రజని, రాజాలు ప్రేమికులు. కాదు - అలా అని వాళ్ళు వూహించుకుంటున్నారు. కాస్సేపు రజని లైలా అయితే, మరి కాస్సేపు అనార్కలి అవుతుంది. స్కూలుకని వెళ్ళిన రజని ఎక్కడకు వెళుతుందో తెలుసుకోవటానికి ఎవరూ ప్రయత్నించలేదు.

కృష్ణారావుకు కొంచెం అనుమానం వచ్చి రజనిని మందలించబోయాడు. కాని కాంతమ్మ కస్సున లేచేసరికి కిక్కురుమనకుండా కూర్చున్నాడు.

మెట్లమీదనే ఆగిపోయిన రజని తల్లీ, తండ్రీ కీచులాటను ఏదో సినిమా చూస్తున్నట్లు కుతూహలంగా వినసాగింది.

"ఇదిగో రాజా! అమ్మా, నాన్నా ఎలా పోట్లాడుకుంటున్నారో చూడు. మనంకూడా ఇవ్వాళ అలా పోట్లాట ఆట ఆడుకుందాం. సరిగా విను" అంది ఉత్సాహంగా రజని.

రాజా ముఖం గంభీరంగా పెట్టి, "ఇవ్వాళ సినిమాకు వెళ్ళాల్సిందే" అన్నాడు.

"ఆహాఁ - చెరువు ఒడ్డుకు వెళ్ళి ఆడుకుందాం."

"నేను రాను" అన్నాడు రాజా ఆడపిల్లలా అలిగిన ముఖంపెట్టి.

"ఒక పందెం వేసుకుందాం" అంది రజని కళ్ళు తిప్పుతూ.

'ఏమిటి' అన్నట్లు చూశాడు రాజా విసుగ్గా.

"అదుగో - అమ్మా, నాన్నా పోట్లాట క్లయిమాక్సుకు వచ్చింది. ఎవరు గెలుస్తారో చెప్పు" అంది రజని రాజాను సవాలు చేస్తున్నట్లు.

రాజా పైపళ్ళతో కింద పెదవిని నొక్కి కొంచెం ఆలోచించి "మీ నాన్నే గెలుస్తాడు" అన్నాడు. మగవాడు గెలవక మరి ఆడది గెలుస్తుందా అన్నట్లుంది రాజా ధోరణి.

"లేదు, నువ్వు ఓడిపోతావు. అమ్మే గెలుస్తుంది. అమ్మ ముందు నాన్న ఎప్పుడూ ఓడిపోతాడు" అంది రజని గర్వంగా.

"నేను ఒప్పుకోను. ఆడవాళ్ళముందు మగవాళ్ళు ఓడిపోవటం ఏమిటి?" అన్నాడు రాజా.

"సరే పందెం! చూస్తుండు అలా" అంది రజని.

ఇద్దరూ శ్రద్ధగా కృష్ణారావు, కాంతమ్మల ఘర్షణ వినసాగారు.

"నన్నేం చెయ్యమంటావు కాంతం! ఆ వార్త చదవగానే వాడికోసం కబురు పంపాను. వాడు వస్తేనా?" అన్నాడు తన అసమర్థతను ఒప్పుకుంటున్నట్లు.

"వాడు రాకపోతే మీరే వెళ్ళండి. తప్పుతుందా, ఓ పదివేలు వాడి ముఖాన పారేసి ఆ ముండతో ఎక్కడికయినా పోయి వూరేగమనండి" అంది కాంతమ్మ.

కృష్ణారావు భార్య ముఖంలోకి అర్థంకానట్లు చూశాడు.

"ఏమిటలా చూస్తారు బెల్లంకొట్టిన రాయిలా? మనం ఈ వూళ్ళో తలెత్తుకు తిరగాలా అక్కరలేదా?" అంది కాంతమ్మ.

"అందుకని లక్షల వ్యాపారంలో భాగస్తుడయిన చంద్రానికి పది వేలు బిచ్చం ఇచ్చి పంపించమంటావా?" కృష్ణారావు గొంతులో కొంత కోపం కనిపించింది.

కాంతమ్మ భర్త తెలివితక్కువ చూసి ఆశ్చర్యం కలిగింది. 'మొదటినుంచీ ఈ మనిషి ధోరణే ఇంత!' అనుకుంది.

"మీ తెలివి తెల్లారినట్టే వుంది. చంద్రం సమభాగస్తుడేమిటీ! ఈ వ్యాపారాన్ని మీరు మీ చేతులమీదుగా పెంచారు."

"అందుకని?"

"అందుకని పది కాకపోతే ఇరవయ్‌వేలు వాడి ముఖాన పారేసి పొమ్మనండి."

కృష్ణారావు కోపంతో లేచి నిల్చున్నాడు.

"చంద్రం నా తమ్ముడు. ఈ ఆస్తి మా తాతగారిది. తరువాత ఎంత పెరిగినా చంద్రం కూడా సమభాగస్తుడే!" కచ్చితంగా అన్నాడు కృష్ణారావు.

కాంతమ్మ కంఠం తారాస్థాయి నందుకుంది. కోపం, ఏడుపూ నేను ముందంటే నేను ముందంటున్నాయి, ఆ గరగరలాడే గొంతులో.

చంద్రాన్ని దుమ్మెత్తిపోసింది. తనకూ తన బిడ్డకు జరుగుతున్న అన్యాయాన్ని ఏకరువు పెట్టసాగింది.

కృష్ణారావు కుర్చీమీద వున్న కండువాను భుజంమీద వేసుకుని గబగబా గారేజికేసి నడిచాడు. మరో క్షణంలో కారు స్టార్టయిన శబ్దం. కాంతమ్మ ముక్కుచీదేస్తూ చంద్రాన్ని శపిస్తూ లోపలకు వెళ్ళిపోయింది.

అంతవరకూ ఊపిరి బిగపట్టి వింటున్న రజనీ, రాజాలు ఒకరి ముఖంలోకి ఒకరు నేనే గెలిచానన్నట్లు చూసుకున్నారు.

"మీ నాన్నే గెలిచాడు. మీ అమ్మ ఏడుస్తూ లోపలకు పోయింది" అన్నాడు రాజా చిరునవ్వును తెచ్చిపెట్టుకుంటూ.

"లేదు, నేనే గెలిచాను. మా నాన్న అమ్మతో గెలవలేనప్పుడల్లా ఇంట్లో నుంచి అలాగే పారిపోతాడు" అంది రజని ధీమాగా.

"నేను ఒప్పుకోను. మీనాన్న మగవాడు. కోపం వచ్చింది. కాబట్టి బయటకు వెళ్ళిపోయాడు" అన్నాడు రాజా మొండిగా.

రజని ముఖం కోపంతో ఎరుపెక్కింది. మూతి సున్నా చుట్టింది.

"అసలు నేను ఇవ్వాళ నీతో రాను పో" అంది బుంగమూతి పెడుతూ.

"సరే, మీ నాన్నే ఓడిపోయాడు, పద, నువ్వు చెప్పినట్లు చెరువు దగ్గర కెళ్ళి ఆడుకుందాం" అన్నాడు రాజా తన ఓటమిని అంగీకరిస్తూ.

రజని ముఖం సూర్యోదయం చూసిన కమలంలా విచ్చుకుంది సంతోషంతో.

ఇద్దరూ చేతులు పట్టుకుని చిన్నగా ఇంట్లోంచి జారుకున్నారు.

# 22

గౌరి కాఫీ తీసుకొచ్చి తాగమని అడిగేంతవరకూ చంద్రం రాస్తున్న నవలలో తనను తాను మర్చిపోయి వున్నాడు. ఆ నవల పూర్తి చేసికాని హేమ దగ్గిరకు వెళ్ళదలచలేదు చంద్రం, అప్పటికే పొద్దు బాగా వాటాలిపోయింది. ప్రకాశం ఎప్పుడు వచ్చాడో కూడా గమనించలేదు.

"ఎంతసేపయింది నువ్వొచ్చి?" అడిగాడు చంద్రం కాఫీ తాగుతూ ప్రకాశాన్ని. ఇంకా చంద్రం రచన మూడ్‌నుంచి బయటపడలేదు. పాత్రలు అల్లిబిల్లిగా తిరుగుతున్నాయి బుర్రలో.

"నేను వచ్చి అర్ధగంటయింది. నువ్వు రాయటంలో పూర్తిగా మునిగిపోయి వున్నావు. అందుకే పలకరించలేదు," అన్నాడు ప్రకాశం గౌరి చేతులో కాఫీగ్లాసు అందుకుంటూ.

చంద్రం బాత్‌రూమ్‌కు వెళ్ళి చల్లటి నీళ్ళతో ముఖం కడుక్కున్నాడు. ఇన్ని నీళ్ళు నడినెత్తిన చల్లుకున్నాడు.

"నేను అలా కొంచెం చల్లగాలిలో తిరుగొస్తాను" అన్నాడు చంద్రం చెప్పులు తొడుక్కుంటూ.

"వెళ్ళిరా, నేనుకూడా వెళుతున్నాను. బహుశా రాత్రికి రాను" అన్నాడు ప్రకాశం.

"అవునుగాని ప్రకాశం! నువ్వీమధ్య తిండికూడా సరిగా తినటం లేదు. ఏమంత తీరని పనులో నాకు అర్థం కావటం లేదు," అన్నాడు చంద్రం.

ప్రకాశం జవాబుగా నవ్వాడు. "మళ్ళీ నీ మూడ్ చెడిపోతుంది. వెళ్ళు, కాస్సేపు అలా తిరిగేసిరా," అన్నాడు.

చంద్రం నడుస్తున్నాడు. అతని ఆలోచనలన్నీ నవల ముగింపు చుట్టూనే తిరుగుతున్నాయి.

కారు హారన్ విని పక్కకు తప్పుకున్న చంద్రం కారులోకి చూశాడు. కృష్ణారావు కారు నడుపుతున్నాడు. పక్కనే గౌనులో వున్న ఓ ఆంగ్లో ఇండియన్ స్త్రీ. కబుర్లు చెబుతూ కారు నడుపుతున్న కృష్ణారావు తన కారుకు అడ్డం నడిచినవాడు చంద్రం అని తెలుసుకోలేదు. చంద్రం అలాగే నిల్చున్నచోట కొయ్యబారిపోయి కారు వెళుతున్నవైపు చూస్తున్నాడు. కారు కనుచూపుకు దూరంకాగానే చంద్రం ఈ లోకంలోకి వచ్చాడు.

తన అన్నకు అలాటి బుద్ధి ఉందని ఏనాడూ ఊహించని చంద్రం మనస్సు కలతబారింది. ఆనాడు గౌరి తన కోసం రావటం చూసి ముఖంలో అంత ఏవగింపు చూపించిన తన అన్న ఇలా ఓ స్త్రీని, ముఖ్యంగా తనదగ్గర పనిచేసే స్త్రీని కారులో పక్కన కూర్చోపెట్టుకొని తిరుగుతున్నాడు. పదిమందికీ తెలియనంతవరకూ, కారుల్లో రహస్యంగా తిరుగుతూ పెద్దమనుషుల్లా చెలామణీ కావచ్చు నన్నమాట! చదువుకొని ఉద్యోగం చేసున్న ఆ ఆడదానికి బుద్ధి ఉండక్కరలేదా? ఆవిడ మాత్రం ఏం చేస్తుందిలే, తన బాస్ రమ్మంటే షికారుకు వెళ్ళి తీరాల్సిందే. లేకపోతే ఉద్యోగం పోతుందనే భయం. ఎంతమంది ఆఫీసర్లు

తమ అధికారాన్ని ఎరగా చూపించి ఎందరి కన్యల జీవితాలను కలుషితం చెయ్యటం లేదు? ఇలాంటి అక్రమాలను అరికట్టే ఉపాయమే లేదా?

చంద్రం చెరువుగట్టు చేరేటప్పటికి మసక చీకట్లు కమ్మాయి. యాథాలాపంగానే చెరువుగట్టున ఉన్న ఓ పెద్ద బండమీద కూర్చున్నాడు. చల్లగాలికి మనస్సుకు కొంత విశ్రాంతి దొరికినట్లనిపించింది.

"బలే! బలే! రాజా, ఊఁ – నువ్వే గెలవాలి!" అంటూ చప్పట్లు కొడుతున్న ఓ ఆడపిల్ల స్వరం వినిపించి చంద్రం ఆశ్చర్యంగా తలతిప్పి చూశాడు.

ఆ మసక చీకట్లో, లంగా ఓణీ వేసుకొని ఉన్న ఒక ఆడపిల్ల కనిపించింది. ఆ అమ్మాయి అటూ ఇటూ కదులుతూ, నేలవైపు చూస్తూ, వంగి వంగి ఎవర్నో హెచ్చరిస్తున్నట్లు కనిపించింది. చంద్రం విస్మయంతో అక్కడ జరుగుతుందేమిటో చూట్టానికి ప్రయత్నించాడు. నేలమీద రెండు మానవాకారాలు పెనుగులాడుతున్నట్లు మసగ్గా కనిపించింది. దిగ్గునలేచి వెళ్ళాడు చంద్రం. ఇద్దరు కుర్రవాళ్ళు నేలమీదపడి పెనుగులాడు తున్నారు. ఆ అమ్మాయి చప్పట్లు చరుస్తూ అందులో ఒక కుర్రాణ్ణి ఉత్సాహ పరుస్తున్నది.

ఆ కుర్రవాడు వయసు పదిహేను, పదహారూ సంవత్సరాలకంటే ఎక్కువ వుండదు. చంద్రం వంగి ఇద్దర్నీ తన రెండుచేతుల్తో లాగి విడదీశాడు. బాలురు లేచి నిల్చుని ఆశ్చర్యంగా చంద్రంవేపు చూశారు. చంద్రాన్ని చూసిన ఆ బాలిక పరుగు లంకించుకుంది.

"ఏయ్ రజనీ! ఆగు, నేనూ వస్తున్నా!" అంటూ రాజా రజని వెనకే పరుగెత్తాడు.

'రజనీ!' చంద్రం తృళ్ళిపడ్డాడు. రెండు అంగల్లో వెళ్ళిరజనిని పట్టుకున్నాడు. ముఖంలోకి చూసి చంద్రం తెల్లపోయాడు. తను చూస్తున్నది భ్రమా, సత్యమా అని తెలుసుకోవటానికి చంద్రానికి కొంత సమయం పట్టింది. రజని గాబరాగా చంద్రం చేతినుంచి తన రెక్కను విడిపించుకోవటానికి పెనుగులాడసాగింది. చంద్రం కోపంతో వణికిపోతున్నాడు.

"ఏయ్! ఎవరు నువ్వు, నా రజనిని పట్టుకుంటావ్?" హాలీవుడ్ హీరోపోజులో నిల్చుని తనను దబాయిస్తున్న రాజాను చూసిన చంద్రం వళ్ళుమర్చిపోయాడు. రజనిచెయ్యి వదలి రాజాను ఆ చంపా ఈ చంపా వాయించసాగాడు కసిగా.

"బాబాయ్! రాజాను కొట్టకు" అంటూ అడ్డం వచ్చిన రజని చెంప ఛెళ్ళుమంది. కళ్ళు తిరిగిన రజని భూమిమీద కూర్చుంది. ఆగంతుకుడు రజని బాబాయి అని తెలుసుకున్న రాజా పారిపోయాడు. అంతవరకూ దూరంగా నిల్చొని తమాషా చూస్తున్న రెండో బాలుడు కూడా కాళ్ళకు బుద్ధి చెప్పాడు, తరవాత రాబోయేది తనవంతేనని తెలుసుకొని.

"పోరా రాస్కెల్! మళ్ళీ రజనితో కన్పించావా – నీ రక్తం కళ్ళ చూస్తాను." గట్టిగా అరిచాడు చంద్రం, పారిపోతున్న రాజాను ఉద్దేశించి. రెండు చేతుల్లో ముఖం దాచుకొని వెక్కివెక్కి ఏడుస్తూ నేలమీద కూలబడివున్న రజని చెయ్యిపట్టుకొని మొరటుగా లాగుతూ "లే. ఇంటికి పద." గర్జించాడు చంద్రం.

"నన్ను వదులు. నా ఇష్టం. నువ్వెవరవు రాజాను కొట్టటానికి?" అంటూ ఏడుస్తూనే చంద్రం చేతినుంచి తన చేతిని లాక్కుంది. విసురుగా గాలిలోకి లేచిన చంద్రం చెయ్యి అలాగే నిలచిపోయింది. రజనిలాటి పిల్లలు భయంతో వినరు. దయతోనే వాళ్ళను మంచిమార్గంలో పెట్టాలి అనుకున్నాడు చంద్రం. అంత కోపాన్ని దిగమింగుకున్నాడు. రజనివైపు ఓ క్షణం చూశాడు. వెక్కి వెక్కి ఏడుస్తున్న రజనిలో ఇంకా పసితనం కొట్టొచ్చినట్లు కనిపిస్తూనే ఉంది.

"తప్పమ్మా! లే, ఇంటికి పోదాం" అన్నాడు చంద్రం, స్వరంలో మృదుత్వాన్ని తెచ్చిపెట్టుకుంటూ. ఆప్యాయంగా రజని తలమీద కుడిచేత్తో నిమురుతూ "ఊఁ లేమ్మా త్వరగా! పొద్దుపోతుంది" అన్నాడు లాలనగా.

రజనికి కొంత ధైర్యం వచ్చింది. విసురుగా లేచి నిల్చుంది. ఓణీ కొంగుతో కళ్ళు తుడుచుకోసాగింది.

"ఏడవకు రజనీ! పద, ఇంటికి వెళదాం" అన్నాడు చంద్రం. రజని మొండిగా అలాగే నిల్చుంది. చంద్రం చెయ్యి పుచ్చుకున్నాడు. రజని చేతిని విడిపించుకుంటూ విసురుగా రెండడుగులు వెనక్కు వేసింది. చంద్రానికి మళ్ళీ కోపం వచ్చింది.

"ఏమిటా మొండితనం? కదలవేం?" అన్నాడు కొంచెం కటువుగా.

"నువ్వేం రానక్కరలేదు. నేనే వెళతాను" అంది రజని మొండిగా.

చంద్రం రజని మొండితనానికి ఆశ్చర్యపోయాడు.

"బయలుదేరతావా లేక ఈడ్చుకుపొమ్మంటావా?" ఈసారి చంద్రం స్వరంలోని తీవ్రతకు రజని కొంచెం భయపడింది.

"అమ్మతో, నాన్నతో చెప్పనంటే వస్తాను." రజని ఏడుపు స్వరంతో అంది.

"అలాగే చెప్పనులే, పద."

"నిజంగా?" రజని స్వరంలో అనుమానం.

"నిజంగా చెప్పను. పదమ్మా, చాలా ప్రొద్దుపోయింది" అన్నాడు చంద్రం, రజనికి నమ్మకం కలిగించేలా ఆప్యాయంగా. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. చంద్రం మనస్సు ఏమీ బాగాలేదు. బాల నేరస్తుల గురించి పరిపరివిధాల ఆలోచించసాగాడు.

ఈ మధ్య బాలనేరస్తుల సంఖ్య బాగా పెరిగిపోతుంది. అవిద్య, బీదతనం, తల్లితండ్రుల నిర్లక్ష్యం, పెద్దవారి ప్రేమానురాగాలకు నోచుకోకపోవటం, ఇవన్నీ పిల్లల్ని పెడత్రోవ పట్టిస్తాయి. దారిద్ర్యంతో సతమతమవుతున్న తల్లితండ్రులు పిల్లల్ని నిర్లక్ష్యం చేస్తారు. మధ్య తరగతికంటే నిమ్న తరగతికి చెందిన వారిలోనూ, పెద్దతరగతి వారిలోనూ బాల నేరస్తులు ఎక్కువగా తయారవుతారు. బాగా ఉన్నవారు అతి గారాబంతో పిల్లల్ని చెడగొడితే, ఏమీ లేనివారు దారిద్ర్యంతో బాధపడుతూ పిల్లలకు అవసరమైన ఆప్యాయతను చూపించలేక చెడగొడుతున్నారు. రజని ఇలా కావటానికి కారణం వదిన అతి గారాబం, అన్నయ్య నిర్లక్ష్యం. అన్నయ్యా, వదినా ఏనాడూ సరసంగా ఉన్నట్లు కనిపించరు. తల్లితండ్రులు పిల్లలముందు చీటికీ మాటికీ పోట్లాడుకోవటం పిల్లల లేత మనస్సుల మీద చాలా చెడు ప్రభావం పడుతుందని ఎందుకు గ్రహించరో!

"బాబాయ్ నాకు కాళ్ళు పీకుతున్నాయ్. రిక్షా ఎక్కుదాం" అంది రజని మెయిన్ రోడ్డుమీదకు రాగానే.

ఇద్దరూ రిక్షాలో కూర్చున్నారు. రజని ఏదో ఆలోచిస్తున్నది చంద్రం గమనించక పోలేదు. ఆ ఆలోచనలు ఆ వయస్సుకు మించినవని ఆమె మొహకవళికలే చెబుతున్నాయి.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు?" చంద్రం మెత్తగా ప్రశ్నించాడు.

రజని జవాబివ్వలేదు.

"రాజాను గురించేనా?"

రజని నుంచి జవాబు లేదు.

"తప్పమ్మా, అలా మగపిల్లలతో తిరక్కూడదు."

"నువ్వు ఆ పిల్లతో తిరగొచ్చు. నాన్నేమో జూలీతో తిరగొచ్చు. నేను మాత్రం రాజాతో తిరక్కూడదేం?" రజని చురుకుగా అన్నమాటలు సూదుల్లా గుచ్చుకున్నాయి చంద్రం మనస్సుకు. క్షణకాలం ఏం జవాబివ్వాలో అర్థం కాలేదు. పదమూడు సంవత్సరాల బాలికముందు అపరాధిలా తలవంచవలసిన పరిస్థితికి బాధపడ్డాడు.

"తప్పమ్మా! నాన్నను గురించి అలాటి మాటలనవచ్చా? నువ్వింకా చిన్నపిల్లవు, అవన్నీ మాట్లాడకూడదు." మృదువుగా మందలించాడు చంద్రం.

రజని జవాబివ్వలేదు.

"మళ్ళీ రాజాతో తిరగవుగదూ?" తల నిమురుతూ ప్రశ్నించాడు చంద్రం.

"రాజా రమ్మని గోల పెడతాడు. తనతో తిరక్కపోతే మరి రాజాకు కోపం వస్తుందేమో!" సాలోచనగా అంది రజని.

"అసలు ఇకనుంచి నువు ఆ రాజాతో మాట్లాడటం మానెయ్."

"రాజాతో మాట్లాడకుండా ఎలా ఉండటం? రాజాతో మాట్లాడకపోతే నాకేమీ తోచదు. నేను రాజాను ప్రేమిస్తున్నాను."

చంద్రం ఉలిక్కిపడ్డాడు. నిండా పదమూడు ఏళ్ళులేని రజని ఏమిటిలా తయారయింది? ఈ రోజుల్లో ఈ 'ప్రేమ' అనే పదానికి ఎంత దుర్గతి పట్టిందో! ఓ క్షణం ఆలోచించి అన్నాడు:

"మంచివాళ్ళను ప్రేమించాలమ్మా! రాజా మంచివాడు కాదు. రౌడీ. చదువూ, సంధ్యలూ లేకుండా పెద్దవాళ్ళకు తెలియకుండా ఊరంతా తిరిగే కుర్రాళ్ళను ప్రేమించకూడదు." అంతకంటే ఇంకెలా చెప్పాలో తెలియలేదు చంద్రానికి. కాని, అతని మాటలు అతనికే నచ్చలేదు.

"మరి, నువ్వు ఆ బజారు పిల్లను ఎందుకు ప్రేమిస్తున్నావు?"

చంద్రం ఓ క్షణం విస్తుబోయి రజని ముఖంలోకి చూశాడు.

"లేదమ్మా, ఆ అమ్మాయి బజారుపిల్లకాదు. మంచిపిల్ల" అన్నాడు.

"మరి అందరూ ఆ పిల్లను బజారుపిల్ల అంటున్నారేం? ఆ పిల్లతో నువ్వు తిరగటం అందరికీ కోపంగా వుందిగా?" ప్రశ్నార్థకంగా చూసింది రజని.

ఇంత చిన్న పిల్లముందు తన ప్రవర్తన గురించి సంజాయిషీ ఇచ్చుకోవాల్సి రావటం చాలా బాధ అనిపించింది చంద్రానికి. కాని, రజనికి ఎలాగయినా అర్థం అయేలా చెప్పాలి!

"ఆ పిల్ల బజారుపిల్ల కాదమ్మా, బీదపిల్ల."

"మరి బీదవాళ్ళతో పెద్దవాళ్ళు స్నేహం చెయ్యవచ్చునా? ప్రేమించవచ్చునా?" రజని చంద్రం మాటల్ని మధ్యలోనే అందుకొని, నిలదీసినట్లు అడిగింది.

"పెద్ద వాళ్ళంటే డబ్బున్నవాళ్ళు కాదమ్మా! బీదవాళ్ళలోనూ పెద్దవాళ్లున్నారు. మంచివాళ్ళంతా పెద్దవాళ్ళే. ఆ అమ్మాయికి తల్లీ, తండ్రీ ఎవరూ లేరు."

"మరి పాపం, ఆ అమ్మాయికి అన్నం అదీ ఎవరు పెడతారు?" జాలిగా ప్రశ్నించింది రజని.

"ఆ అమ్మాయి ఒక అనాధ శరణాలయంలో పెరిగింది. అక్కడ వాళ్లు పెట్టే బాధలు పడలేక పారిపోవటానికి ప్రయత్నించింది. ఎవరో రౌడీలు ఆ అమ్మాయిని పట్టుకున్నారు. అప్పుడు నేను ఆ అమ్మాయిని రక్షించాను." కథలా చెబితేకాని రజనికి అర్థంకాదని చంద్రం గౌరి గురించిన కథ చెబుతున్నట్లు చెప్పసాగాడు.

రజని కళ్ళు పెద్దవి చేసుకొని కుతూహలంగా వింటున్నది.

"ఆఁ - రక్షించి?"

"ఆ తరవాత నా స్నేహితుడు ప్రకాశం ఇంట్లోనే ఉంచాను. నా స్నేహితుడు చాలా మంచివాడు. ఆ అమ్మాయికి చదువు చెప్పిస్తానంటున్నాడు. ఆ అమ్మాయికి ఇష్టం అయితే ప్రకాశం ఆ పిల్లను పెళ్ళికూడా చేసుకుంటాడు."

చంద్రం చివరిమాటలు రజనికి నిరుత్సాహాన్ని కలిగించాయి. క్రమంగా రజనికి ఆ అమ్మాయి అంటే అభిమానం ఏర్పడసాగింది.

"నువ్వు మరి ఆ అమ్మాయిని చేసుకోవూ?"

"ఊహూఁ!"

"నువ్వు ఆ అమ్మాయిని ప్రేమించటంలేదా?"

"లేదు. నేను హేమ పిన్నిని చేసుకుంటాను," అంటూ రజని మొహంలోకి చూశాడు చంద్రం.

రజని మొహం సంతోషంతో విప్పారింది.

అది గమనించిన చంద్రం అన్నాడు– "నువ్వుకూడా హేమ పిన్ని అంత పెద్దదానివయ్యాక ఓ మంచి అబ్బాయిని చూసి ప్రేమించాలి. తెలిసిందా?"

"మరి..." అని ఆగిపోయింది రజని దిగులుగా.

"ఊఁ చెప్పు. రాజా గురించేనా నీ బెంగ? రాజా పెద్ద అయి బాగా చదువుకుంటే అప్పుడు అతన్నే ప్రేమించవచ్చు."

రజనికి చంద్రం మాటలు కొంతవరకు నచ్చాయి. అంగీకారసూచకంగా తల ఆడించింది.

"ఇంతకూ ఆ రాజా ఎవరబ్బాయి?"

"హైకోర్టుజడ్జి రామనాధంగారి అబ్బాయి. పాపం, అమ్మలేదుగా? సవతి అమ్మ! ఎప్పుడూ తిడుతుంది. వాళ్ళ నాన్నకు అబద్ధాలు చెప్పి కొట్టిస్తుంది. రాజాకు వాళ్ళ చిన్నమ్మ మీదా, నాన్న మీదా బలే కోపం. అందుకే వాళ్ళు చెప్పింది చస్తే చెయ్యడు. బడి ఎగగొట్టి చదువుకోకుండా వాళ్ళను ఏడిపిస్తానంటాడు..." రజని చెప్పుకుపోతోంది.

చంద్రం నిట్టూర్పు విడిచాడు. రాజాను, రాజాలాంటి కుర్రవాళ్ళనూ అన్నీ ఉండీ ఆదరణలేక చెడిపోతున్నవాళ్ళను గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు.

# 23

కారు పోర్టికోలోకి వచ్చిన శబ్దం విని కాంతమ్మ విసవిస లాడుతూ వరండాలోకి వచ్చి నిలుచుంది.

"అర్ధరాత్రిదాకా దాన్ని వెంటవేసుకుని ఏ రాజ్యాలు ఏలుతున్నారు?" గర్జించింది కాంతమ్మ.

కారు దిగి డోర్ వెయ్యబోతున్న కృష్ణారావు చెయ్యి అలాగే ఆగిపోయి; తెల్లమొహం వేసి కాంతమ్మ మొహంలోకి చూస్తూ ఉండిపోయాడు.

"ఏమిటలా చూస్తావు? ఏదీ, అది ఇంకా కారు దిగదేం!" కటువుగా వుంది కాంతమ్మ స్వరం.

కృష్ణారావు అయోమయంగా చూశాడు కాంతమ్మ మొహంలోకి. ఆమె చూపుల్ని తట్టుకోలేక అటూ ఇటూ చూస్తూ మొహం ఇబ్బందిగా పెట్టాడు. 'ఇంతలోనే ఆ జూలీని తన కారులో యెక్కించుకొని వెళ్లినట్లు దీనికి యెవరు చెప్పారురా భగవంతుడా?' అనుకుంటూ కృష్ణారావు రాబోయే గాలి దుమారాన్ని ఊహించుకుంటూ గుటకలు మింగసాగాడు.

కాంతమ్మ విసురుగా కారు దగ్గిరకువచ్చి కారులోకి చూసి తెల్లమొహం వేసింది.

కృష్ణారావుకు నవ్వు వచ్చింది. తన భార్య నిజంగానే పిచ్చిది. లేకపోతే దాన్ని కారులో యెక్కించుకొని తను ఇంటికి వస్తాడని ఎలా ఊహించుకుంటుంది?

"ఏదీ అది?"

"ఎవరు?" ఊపిరి బిగబట్టే ప్రయత్నంచేశాడు.

"ఎవరేమిటి? రజని ఎక్కడ?"

"రజనా?" కృష్ణారావు తేలిగ్గా నిట్టూర్చాడు. మళ్ళీ అంతలోనే ఆ ప్రశ్నను అర్థం చేసుకొని తెల్లబోయాడు.

"రజని ఏదని నన్నడుగుతావేం? ఇంట్లో లేదూ?" విస్మయంగా ప్రశ్నించాడు.

"మీకు తెలియకుండా ఇంత పొద్దుపోయిందాకా అది ఎక్కడ తిరుగుతుంది?" నిలదీసి అడిగింది కాంతమ్మ.

"అదే నిన్ను అడుగుతున్నాను. తల్లివి ఇంట్లోవుండి, ఈడొచ్చిన పిల్ల ఎక్కడెక్కడ, తిరుగుతుందో కూడా తెలుసుకోవటం లేదన్నమాట?" భార్యను దబాయించటానికి కారణం దొరికిందే చాలన్నట్లు కచ్చితంగా ప్రశ్నించాడు.

"బలేవారే! నాకేం తెలుసు? ఇంట్లో లేకపోతే మీతోనే వచ్చిందనుకున్నాను." కూతురు ఏమయిపోయిందోననే దిగులుతో నీరసంగా అన్నది కాంతమ్మ.

గేటులో రిక్షా వచ్చి ఆగింది. కాంతమ్మ, కృష్ణారావూ ఆదుర్దాగా చూశారు. రిక్షాలోనుంచి ముందు చంద్రం దిగాడు. ఆ వెనకనే రజని దిగింది. ఆ దృశ్యం చూసిన కాంతమ్మకు మతి పోయినట్లే అయింది. కృష్ణారావుకు కోపంతో వళ్ళు తెలియలేదు. కాంతమ్మ గాలి దుమారంలా గేటు దగ్గిరకు దూసుకు వచ్చింది.

"ఏమయ్యా! నువ్వు అడ్డమైనవాళ్ళతో తిరిగేది కాకుండా ఈడొచ్చిన పిల్లను చెడగొడుతున్నావా?" కాంతమ్మకు కోపంలో మాటలు పెకలలేదు.

"ఏరా! మమ్మల్ని ఇలాగయినా బతకనివ్వదలచుకోలేదా? అర్ధరాత్రిదాకా పసిదాన్ని ఆ అలగా కొంపల్లో తిప్పుతావా?" కోపంతో అరిచాడు కృష్ణారావు.

ఇలా పరిణమిస్తుందని ఊహించని చంద్రం కొయ్యబారి నిల్చుండిపోయాడు.

"ఏరా, మాట్లాడవ్? అసలు దాన్ని ఎక్కడకు తీసుకెళ్ళావ్?" కోపంతో కృష్ణారావు స్వరం వణికింది.

"చివరకు మామీద ఇలా పగ సాధిస్తున్నావా నాయనా? నా బిడ్డను పాడు చెయ్యటానికి కూడా పాల్పడ్డావా? పాపిష్టివాడా?"

"వదినా!" చంద్రం అంతకంటే ఏమీ మాట్లాడలేకపోయాడు.

"నీచుడా! నీ అక్కసు ఇలా తీర్చుకుంటున్నావా? నీ అన్నబిడ్డ నీ బిడ్డ కాదటరా? దాన్ని బజార్లపాలు చెయ్యాలని చూస్తున్నావా?"

"అన్నయ్యా!" బాధగా గట్టిగా అన్నాడు చంద్రం.

"ఎవడ్రా నీకు అన్నయ్య! ఇంత నీచానికి పాల్పడ్డ నీకు నన్ను అన్నయ్యా అని పిలిచే అధికారంకూడా లేదు."

"నేనేం నీచపు పనులు చెయ్యలేదు. నిజం తెలుసుకోకుండా...." నిజం చెప్పబోయి మళ్ళీ రజని మొహంలోకిచూసి ఆగిపోయాడు చంద్రం. రజని బిక్కమొహంవేసి చంద్రం కళ్ళలోకి ఆదుర్దాగా చూసింది. రజనికి ఇచ్చినమాట జ్ఞాపకం వచ్చి ఆగిపోయాడు.

"ఏమిటిరా నిజం? రజనిని బయటకు తీసుకెళ్ళటం నిజంకాదా?"

"రజని క్షేమంకంటే నాకు కావాల్సింది ఏమీలేదు. నీకు కారుల్లో షికారుతోనూ, వదినకు నీతో పోట్లాడటంతోనూ సరిపోతుంది. దాని మంచి చెడ్డలు మీ ప్రవర్తనమీద ఆధారపడి ఉన్నాయని మర్చిపోవద్దు. ఇవ్వాళ సాయంత్రం నిన్ను కారులో...."

కృష్ణారావు మొహంలో రక్తం చుక్కలేదు. వెలవెలబోయి కాంతమ్మవైపూ, చంద్రంవైపు చూశాడు. కాంతమ్మకు అర్థంకాక ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయింది.

"నువ్వు నీ ప్రవర్తన మార్చుకోకపోతే రజని క్షేమం కోసం నేను ఏమయినా చేస్తాను. రజని సరిగా స్కూలుకు వెళుతుందో లేదో కనుక్కుంటూ ఉండండి." గిర్రున తిరిగి వెళ్ళిపోయాడు చంద్రం.

కృష్ణారావు భార్య మొహంలోకి చూడకుండా లోపలకు వెళ్ళాడు. కాంతమ్మకు చంద్రం మాటల్లో ఏదో చాలా లోతు అర్థం ఉన్నట్లనిపించింది. కృష్ణారావును అడిగినా

లాభం లేదని తెలుసు. చిన్నగా రజనిని బుజ్జగించి అన్ని విషయాలూ తెలుసుకుంది. కోపంగా కృష్ణారావు దగ్గిరకు వచ్చి నిల్చుంది.

"ఆ జూలీ ఎవరు?"

కృష్ణారావు ఉలిక్కిపడ్డాడు. కాంతమ్మ ముఖంలో ఏడుపూ, కోపం ముప్పిరి కొంటున్నాయి.

"క్షమించు కాంతం! నీకు నేను ఏ అన్యాయం చెయ్యలేదు. ఈ మధ్య మరీ నువ్వు గొడవ పెడుతుంటే ఎక్కువ సమయం బయట గడిపేవాణ్ణి. మనసు బాగుండక ఆ జూలీతో కాలక్షేపంకోసం కాస్త చనువు పెంచుకున్నమాట నిజమే!" అన్నాడు కృష్ణారావు. కాంతమ్మ దగ్గిర అబద్ధం ఆడి లాభంలేదని తెలుసు.

"నాకు ఇంత అన్యాయం చేస్తారని కలలోకూడా అనుకోలేదు." కాంతమ్మ కళ్ళు తుడుచుకోసాగింది.

"క్షమించు కాంతం! ఇంకెప్పుడూ అలా ప్రవర్తించను."

"మీరు ప్రవర్తించినా చంద్రం ఊరుకుంటాడా ఏం? మీ అంతు కనుక్కోడూ?" కాంతమ్మ స్వరంలో చంద్రం యెడల అభిమానం స్పష్టంగా గోచరించింది. కృష్ణారావు విస్మయంగా నోరు తెరుచుకుని కాంతమ్మ మొహంలోకి చూశాడు.

"ఏమిటలా చూస్తారూ? రజని అంతా చెప్పింది. పాపం, చంద్రం తప్పేమీలేదు. మన రజని బడి ఎగ్గొట్టి ఆ రాజాగాడితో షికార్లు తిరుగుతుందట. అదిచూసి చంద్రం రాజాను కొట్టి, రజనిని ఇంటికి తీసుకొచ్చాడట!"

కృష్ణారావు కాంతమ్మ మొహంలోకి అయోమయంగా చూశాడు.

"ఇవాళ చంద్రం దేవుడిలా అడ్డుపడకపోతే మన రజని ఏమయివుండేదో? మనం ఎన్ని వినాల్సి వచ్చేదో?" అంది కాంతమ్మ.

రజని జరిగిందంతా మళ్ళీ తండ్రికి వల్లించి చెప్పింది. కృష్ణారావు మౌనంగా అంతా విన్నాడు. రజని గౌరి గురించి చంద్రం చెప్పిన విషయాలను కూడా వల్లించింది.

చంద్రాన్ని అర్థం చేసుకోకుండా ఇంటికి వచ్చినప్పుడల్లా అవమానించి నిందించటాన్ని తలచుకొని కాంతమ్మా, కృష్ణారావులు బాధపడ్డారు.

"అయితే, రంగన్న చెప్పిన విషయంకూడా నిజమే అయివుండాలి" అన్నాడు కృష్ణారావు తనలో తను మాట్లాడుకుంటున్నట్లు.

"ఏ విషయం?" కాంతమ్మ ఆదుర్దాగా ప్రశ్నించింది.

"అప్పుడు పోయిన వెయ్యిరూపాయలూ ఆ నాగేంద్రంగాడే కాజేశాడట!"

"వాడి జిమ్మడ! ఎంతవని చేశాడు? బిడ్డను అనుమానించి, ఎంత అవమానపరిచామో?" అంది కాంతమ్మ బాధగా.

కాంతమ్మ మనస్సు ఎంత కఠినమైనదో అంత మెత్తనైనది అనుకున్నాడు కృష్ణారావు.

"మీరు నేను చెప్పినట్లు ఒకటి చేస్తారా?" కాంతమ్మ భర్తను మెత్తగా అడిగింది.

'ఏమిటి?' అన్నట్లు చూశాడు కృష్ణారావు.

"జూలీని... నాగేంద్రంగాడినీ మన కంపెనీలోనుంచి తీసెయ్యాలి."

కృష్ణారావు ఉలిక్కిపడ్డాడు.

"ఏం, అంత ఎగిరిపడుతున్నారు? దాన్ని కంపెనీలో నుంచి తియ్యాలంటే అంత బాధగా వుందా?" కాంతమ్మ యుద్ధానికి నడుం కడుతున్నట్లు ప్రశ్నించింది.

"ఆ... అబ్బే అదికాదు.... వాళ్ళను రేపే ఉద్యోగాల నుంచి తొలగించివేస్తాను" అన్నాడు కృష్ణారావు ఎటో చూస్తూ.

"నిజంగా? ఏది నా మొహంలోకి చూసి చెప్పండి."

"నిజంగానే" అన్నాడు కాని, కాంతమ్మ మొహంలోకి చూడలేదు. ఎటో చూస్తున్నాడు.

"ఇంకొకటి కూడా చెయ్యాలి."

కృష్ణారావు తలెత్తి కాంతమ్మ మొహంలోకి ప్రశ్నార్థకంగాచూశాడు.

"రేపే వెళ్ళి చంద్రాన్ని ఇంటికి పిలుచుకొని వచ్చేయండి."

కృష్ణారావు అర్థంకానట్లు చూశాడు.

"ఏమిటలా చూస్తారు బెల్లంకొట్టిన రాయిలా! రేపు పొద్దున్నే వెళ్ళి చంద్రాన్ని ఎలాగయినా ఒప్పించి పిల్చుకొని రండి."

"వాడు వస్తాడంటావా?" సందేహాన్ని వెలిబుచ్చాడు.

"ఎందుకురాడూ? నేను కూడా వస్తాను. నేను ఒప్పించి తీసుకొస్తానుగా?"

కృష్ణారావు కాంతమ్మలోని మార్పును చిత్రంగా చూశాడు.

"ఏం, అంత ఆశ్చర్యంగా ఉందా? నన్ను అంత రాక్షసి అనుకుంటున్నారా? చంద్రం లేకపోతే నే నేమయిపోయేదాన్నో! నువ్వేమో నాకు తెలియకుండా దాన్ని వేసుకొని తిరిగేవాడివి. ఇదేమో ఆ రాజాగాడితో ఎటో పారిపోయి ఉండేది."

"ఏ మొహం పెట్టుకొని చంద్రం ఎదటకు వెళ్ళమంటావు?" అన్నాడు కృష్ణారావు, కాంతమ్మ ధోరణిని మరోవైపుకు తిప్పే ప్రయత్నంలో.

"మీరు రాకపోతే మానేయండి. నేనూ, రజనీ వెళ్ళి తీసుకొస్తాం!" కాంతమ్మ కంఠంలో నిష్ఠురం.

"నేను మాత్రం ఎందుకురాను? మొహం చెల్లటం లేదన్నాను." అన్నాడు కృష్ణారావు.

గడియారం పన్నెండు కొట్టింది. అందరూ లేచారు. అందరి మనస్సులు చాలా తేలిగ్గా ఉన్నాయి. ముగ్గురూ మూడువిధాల చంద్రం గురించే ఆలోచిస్తూ పడుకున్నారు.

ఆ రాత్రి ఎవరికీ సరిగా నిద్రపట్టలేదు.

బాధలో నిద్రపట్టదు. ఆనందంలోనూ నిద్రపట్టదు. సృష్టి వైచిత్ర్యం!

# 24

ప్రసాదరావు ఎప్పుడూ ఏదో పోగొట్టుకొన్నవాడిలా దిగాలుపడి కూర్చుంటాడు. దేనికోసమో లోలోపలే కుమిలిపోతున్నట్లు కనిపిస్తున్నాడు. చూట్టానికి పెద్ద జబ్బుపడి లేచినవాడిలా ఉన్నాడు.

తండ్రి వాలకం చూస్తున్న హేమకు ఏమీ పాలుపోవటం లేదు. బాధకు కారణం అడిగితే చెప్పడు. ఒంట్లో బాగాలేదని మాత్రం అంటాడు. హేమ బలవంతంమీద ప్రసాదరావును ఇద్దరు, ముగ్గురు డాక్టర్లకు కూడా చూపించింది. కాని, ప్రత్యేకమయిన జబ్బేమీలేదని చెప్పటం జరిగింది. తనను గురించే నాన్న అంత కుమిలిపోతున్నాడని చివరకు హేమ నిర్ధారణ చేసుకుంది. చంద్రం తిరిగిరాగానే నాన్న ఉప్పొంగిపోయాడు. తమ ఇద్దరిమధ్యా నానాటికీ పెరుగుతున్న అగాధాన్ని చూసి కుమిలిపోతున్నాడు. తను ఇక తండ్రి ముందు దిగులుకాని, ఆలోచిస్తున్నట్లుగా కానీ కనిపించకూడదు. చంద్రం అంటే తనకు లక్ష్యం లేనట్లూ, ఇష్టం లేనట్లూ నటించాలి.

హేమ చంద్రం అంటే తన మనస్సులో ఏ ప్రత్యేక భావం లేనట్లే నటించసాగింది. అయినా ప్రసాదరావులో పెద్ద మార్పేమీ కనిపించక కలతపడిపోతోంది.

అనూరాధను కలుసుకున్న నాటినుండి కంటికి కునుకులేని ప్రసాదరావు నీరసంగా తయారయాడు. ఎప్పుడూ గిరిజ గురించిన ఆలోచనలే.

తన బిడ్డ యెక్కడవుందో! కాని, ఆ పేరుగల పిల్లలు లేందే! తన వల్ల అనూరాధ జీవితం నాశనమయింది. కనీసం ఆమె బిడ్డనయినా ఆమెకు చేర్చగలిగితే తను చేసిన పాపానికి కొంత నిష్కృతి ఉంటుంది. ఇటు చూస్తే ఆమె పరిస్థితి ఇలా ఉంది! ఆ చంద్రం మళ్ళీ తిరిగిరాకుండా ఉన్నా బాగుండేది. హేమ అభిమానంగల పిల్ల. అసభ్యకరమైన పనులను వేటినీ భరించలేదు. అనూరాధ విషయం తెలిస్తే అసలే గాయపడి వున్న హేమ హృదయం పగిలిపోతుంది. తనంటే హేమకు యెంతో గౌరవం. తను ఇంత నికృష్టపు పని చేశాడని తెలిస్తే హేమ తనను కూడా క్షమించదు. హేమ తనను అసహ్యించుకోవటం తను భరించలేడు!

అకస్మాత్తుగా గదిలో దీపం వెలిగింది. మంచంమీద పడుకొని ఆలోచిస్తున్న ప్రసాదరావు గాబరాగా కన్నీళ్ళు తుడుచుకున్నాడు. పాలగ్లాసు పట్టుకొని హేమ కొయ్యబొమ్మలా నిల్చుంది ప్రసాదరావుమంచం దగ్గిరగా.

"ఏమ్మా, పాలు తెచ్చావా?" ప్రసాదరావు తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో, లేచి కూర్చుని హేమ చేతిలో గ్లాసు అందుకున్నాడు.

"ఎందుకు నాన్నా ఆ కన్నీరు? మీరు ఏదో మనస్సులో పెట్టుకొని కుమిలి పోతున్నారు. నాతో చెప్పకూడని రహస్యాలు కూడా ఉన్నాయా?" హేమ గద్గదస్వరంతో అన్నది.

"అబ్బే, అదేం లేదమ్మా!"

"నా కంతా తెలుసు నాన్నా! నేనేం పసిపిల్లను కాను."

ప్రసాదరావు బెదురుగా హేమ ముఖంలోకి చూశాడు.

"ఇంతమాత్రానికే అంతగా ఇదయిపోవాలా నాన్నా! ఇప్పుడు అంత పుట్టి మునిగిపోయింది ఏమిటో నాకు అర్థం కావటంలేదు," అంది హేమ తండ్రిని మెత్తని స్వరంతో మందలిస్తున్నట్లు.

ప్రసాదరావు అయోమయంగా హేమ మొహంలోకి చూశాడు. తన ఎదుట మాట్లాడుతుంది హేమయేనా?

"నేను వివాహం చేసుకోలేదనేగా మీ విచారం! మీ యిష్టం వచ్చినవాళ్ళను తీసుకురండి."

ప్రసాదరావు తేలిగ్గా నిట్టూర్చాడు. అనూరాధ విషయం హేమకు తెలిసిపోయిందేమోనని బెదిరిపోయాడు.

"ఏం నాన్నా, మాట్లాడరు! నా మాటమీద నమ్మకం లేదా? మీకు శంకరరావు అంటే చాలా ఇష్టంగదూ! ఒకటి రెండుసార్లు అతని విషయం కూడా నాతో అన్నారు. నేను ఆయన్ను వివాహం చేసుకుంటాను. ముహూర్తం పెట్టించండి." హేమ యాంత్రికంగా అనేసింది. మనస్సులో ఎవరి మీదనో కసి తీర్చుకుంటున్నట్లు అనిపించింది.

ప్రసాదరావు ఓ క్షణం హేమ మొహంలోకి జాలిగా చూశాడు.

"ఎందుకమ్మా, అంత విరక్తి! నీ మనస్సు నాకు తెలియదా? చంద్రం చాలా మంచి కుర్రవాడు. తెలివైనవాడు. కాకపోతే...."

"నాన్నా!" ఆవేశంగా అరిచింది హేమ.

"ఎందుకమ్మా అలా ఉద్రేకపడతావు? చంద్రంతో రేపే మాట్లాడతాను. ఆ వివాహం కాస్తా అయిందనిపిస్తే ఆ చెడు సహవాసాలు వెంటనే మానేస్తాడు. నీకు యిష్టంలేని పని చంద్రం చెయ్యడని నాకు బాగా నమ్మకం ఉంది"

"నాన్నా! చంద్రాన్ని వివాహం చేసుకుంటానని మీతో అన్నానా?" హేమ తీవ్రంగా అంది.

ప్రసాదరావు అర్థంకానట్లు హేమ మొహంలోకి విస్మయంగా చూశాడు ఓ క్షణకాలంపాటు.

"నువ్వు చెప్పాలా తల్లీ! కన్న తండ్రిని, నీ మనస్సును ఆమాత్రం అర్థం చేసుకోలేనా?" అన్నాడు ప్రసాదరావు హేమ మొహంలోనికి పరిశీలనగా చూస్తూ.

హేమ మొహంలో రంగులు మారాయి. కోపం, అసహ్యం ఒకదానికంటే ఒకటి ముందుకు తోసుకురావటానికి ప్రయత్నిస్తున్నాయి.

"మీరు పొరపడుతున్నారు నాన్నా! చంద్రం అంటే నాకు ఇష్టం లేదు... గౌరవం లేదు. చంద్రం అంటే అసలు నాకు అసహ్యం!" ఉద్రేకంగా హిస్టీరియాఫిట్‌లో మాట్లాడినట్లు గబగబా అనేసి, పొంగివస్తున్న దుఃఖాన్ని దిగమింగుకుంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది హేమ చకచక నడుస్తూ.

ప్రసాదరావుకు మతిపోయినట్లయింది. వెర్రిగా హేమ వెళ్ళినవైపే చూస్తూ కూర్చుండిపోయాడు.

# 25

చంద్రం పిచ్చివాడిలా వీధులన్నీ నిరుద్దేశ్యంగా తిరుగుతున్నాడు. ప్రొద్దుపోయినా ఇంటికి వెళ్ళాలనిపించటం లేదు. తను మంచి పని చేసినా ఇతరులముందు అది చెడుగా కనిపించి తను అపరాధిలా నిల్చోవాల్సి వస్తుంది. ఏమిటిదంతా? రజనిని తను చెడుత్రోవల్లో పెట్టటానికి ప్రయత్నిస్తున్నాడా? అన్నయ్యకు అసలు అలాంటి ఊహ యెలా

కలిగిందో! ఇంత దారుణమైన అపవాదా? చెయ్యని దొంగతనం మెడకు తగిలించారు ఆనాడు. కాని, అంతకంటే కూడా ఇది దారుణమైన అపవాదు. ఎవరైనా తన బిడ్డను పెడత్రోవల్లో పెట్టుకుంటారా,? చిన్నప్పటి నుంచీ రజనిని తను ప్రాణప్రదంగా చూసుకొనేవాడే!

అసలు తన జీవితమే ఏదో శాపానికి గురి అయినట్లు అనిపిస్తుంది. అంత సంస్కారం, చదువూ ఉన్న హేమ కూడా తనను అపార్థమే చేసుకుంది. ఒక నిముషం ఆరాధిస్తుంది. మరో నిముషం అసహ్యించుకుంటుంది. ఏవగించుకుంటుంది. ఒక నిముషం నీవే నా జీవిత సర్వస్వానివి అన్నట్లు ప్రవర్తిస్తుంది. మరో నిముషంలో నువ్వు ఎవరవో అన్నట్లు ప్రవర్తిస్తుంది. ఈ హేమను యెలా అర్థం చేసుకోవటం!

ఇంత మంది తనను అపార్థం చేసుకున్నారంటే దానికి బాధ్యుడు తనేనేమో! ప్రకాశం చెప్పినట్లు తను ఉండవలసిన చోటున ఉండకపోవటం వల్లనే ఇన్ని అనర్థాలు వచ్చిపడుతున్నాయేమో! అదీ చూడాలి. రేపే తను తన ఇంటికి వెళ్ళిపోవాలి. ఆ ఇంట్లో తనకు హక్కు ఉంది. కాకపోతే భోజనం బయటనే చెయ్యవచ్చును. రజనిని చెడు సహవాసాల నుంచి కాపాడాలన్నా, అన్నయ్యను జూలీతో తిరక్కుండా చెయ్యాలన్నా తను ఆ ఇంట్లోనే ఉండాలి. ముఖ్యంగా హేమ ప్రేమను దక్కించుకోటానికైనా తను తన ఇంటికి వెళ్ళకతప్పదు.

ఇంటికి వెళ్ళిపోవటానికి నిర్ణయించుకున్న చంద్రం మనస్సు కొంత ఊరట చెందింది.

వెంటనే హేమ దగ్గరకువెళ్ళి తన నిర్ణయాన్ని చెప్పాలనుకున్నాడు. వాచీ చూసుకున్నాడు. తొమ్మిదిన్నర అయింది. ఇంత పొద్దుపోయి వెళ్ళటం బాగా ఉండదు. కాని, తన నిర్ణయాన్ని హేమకు వినిపించకపోతే ఈ రాత్రంతా తనకు నిద్రపట్టదు. ఫోన్‌చేసి చెబితే!

చంద్రం యెదురుగా ఉన్న హోటల్లోకి ఫోన్ చెయ్యటానికి వెళ్లాడు.

"యస్!"

హేమ స్వరాన్ని గుర్తించిన చంద్రం "నేనే హేమా! చంద్రాన్ని" అన్నాడు ఉత్సాహంగా. ఠక్కున రిసీవర్ పెట్టేసిన శబ్దం. చంద్రం మొహంమీద ఎవరో చాచి కొట్టినట్లు కొయ్యబారిపోయాడు.

హేమకు తన పేరు వినటం కూడా ఇష్టంలేదా? తన గొంతును వింటేనే ఆమెకు భరించరాని అసహ్యం కలుగుతుందా? చంద్రం మనస్సును ఏదో క్రూరమృగం నములుతున్నట్లు బాధ కలిగింది.

బహుశా హేమకు తన పేరు వినిపించలేదేమో! రాంగ్ నంబరు అనుకొని పెట్టేసి ఉండవచ్చు. ప్రవాహంలో కొట్టుకుపోయేవాడు గడ్డి పరకకోసం ప్రయత్నించినట్లు చంద్రం తన మనస్సును ఊరడించుకోవటానికి ప్రయత్నించాడు. శక్తిని కూడదీసుకుంటూ మళ్ళీ డయల్ చేశాడు.

ఫోను ఎవరూ యెత్తటంలేదు. చంద్రం కూడా మొండిగా అలాగే రిసీవర్ పట్టుకొని నిల్చున్నాడు.

"ఎవ్!" ఈసారి స్వరం చాలా కటువుగా వినిపించింది.

"నేను హేమా! చంద్రాన్ని." ఈసారి చంద్రం మాటలు చాలా నీరసంగా ఉన్నాయి.

"ఆఁ - అయితే, ఏమంటావు?" నిర్లక్ష్యంగా ఉంది స్వరం.

చంద్రానికి మాటలు కరువయాయి.

"పెట్టేస్తున్నాను."

"హేమా! ఒక ముఖ్యవిషయం చెప్పాలని ఫోన్ చేశాను," నిరుత్సాహంగా అన్నాడు చంద్రం.

"నువ్వు నాతో చెప్పవలసిన ముఖ్య విషయాలు ఉంటాయని నేను అనుకోను. ఇంత పొద్దుపోయి అనవసరంగా నన్ను విసిగించకు."

"హేమా!" చంద్రం హృదయంలోని బాధ ఫోన్‌లో ప్రతిధ్వనించింది.

హేమ రిసీవర్ పెట్టేసింది. చంద్రం చేతిలో రిసీవర్ పట్టుకొని అలాగే నిల్చుండిపోయాడు.

"ఏమిటి అలా నిల్చున్నారు?" హోటలు యజమాని పలకరింపుతో సిగ్గుపడి ఫోన్‌పెట్టేసి బయటకు నడిచాడు.

చంద్రానికి గుండెలో భూగోళమంత ఖాళీ ఏదో గిరగిరా తిరుగుతున్నట్లు ఉంది. 'నువ్వంటే హేమకు అసహ్యం....' నీకు అభిమానం లేదూ?" అని ఎవరో గట్టిగా చెవుల్లో అరుస్తున్నట్లుంది.

చంద్రం ఎలా ఇల్లు చేరాడో, యెంత సమయం పట్టిందో ఆ కాస్త దూరం నడవటానికి, అతనికే తెలియదు. బాగా పొద్దుపోయింది. గూడెం అంతా సద్రుమణిగి ఉంది, గౌరి గడపకు చేరబడి కూర్చుని కునికిపాట్లు పడుతోంది. చంద్రం వచ్చిన అలికిడికి ఉలిక్కిపడి లేచి నిల్చుంది.

ఆమె తన కోసం నిరీక్షిస్తుందని ఆతనికి తెలుసు. మరోనాడయితే చంద్రం మనస్సు కృతజ్ఞతతో, జాలితో నిండిపోయేది. కాని, ఈ రోజు గౌరి తనకోసం ఇంత పొద్దుపోయిందాకా యెదురుచూస్తూ కూర్చోవటం చంద్రానికి చిరాకువేసింది. గౌరిని గమనించనట్లే లోపలకు వెళ్ళిపోయాడు.

ప్రకాశం అప్పటికే గురకపెడుతూ నిద్రపోతున్నాడు. గాఢనిద్రలో ఉన్న ప్రకాశం మొహంలోకి చూస్తూ ఓ క్షణంపాటు నిల్చున్నాడు చంద్రం. ప్రకాశం ఎంత అదృష్టవంతుడో! అందరికీ ప్రకాశంలా బ్రతకగలగటం చాతకాదు. ఏ వస్తువుమీదా ప్రత్యేకమయిన వ్యామోహం లేని మనిషికంటే అదృష్టవంతుడు మరొకడు ఉండడేమో! ప్రకాశానికి తన బాధంటూ లేదు. కాని ప్రతివక్కరి బాధా అతని బాధే. నిజంగా ప్రకాశం చాలా గొప్పవాడు.

ఆలోచిస్తూ పక్కపరచుకుని మేనువాల్చాడు చంద్రం.

"అన్నం పెట్టాను." చిన్నగా జంకుతూ అంది గౌరి మంచం దగ్గిరగానిల్చుని.

గౌరిమీద చంద్రానికి కోపం వచ్చింది. "అక్కర్లేదు, నువ్వెళ్ళి పడుకో." కసురుకున్నాడు. గౌరి మారుమాట్లాడకుండా గిర్రున తిరిగి వెళ్ళిపోయింది.

చంద్రం పక్కమీద అశాంతిగా పొర్లుతున్నాడు. నిద్ర రావటం లేదు. గౌరీ.... హేమా.... గౌరికి తను కావాలి. తనకు హేమ కావాలి. హేమకు తనంటే అసహ్యం, గౌరికి తనంటే ప్రాణం. హేమ తనను ఈసడిస్తుంది. విసుక్కుంటుంది. తను ఆమెచుట్టూ తిరిగి ఆమెచేత అవమానించబడటానికి జంకడు. గౌరి తనను ఆదరిస్తుంది. ఆరాధిస్తుంది. తను ఆమెను ఈసడిస్తాడు. తను యెంత బాధపడుతున్నాడో, ఆ అమాయకురాలు కూడా అంత బాధపడుతూవుండేమో! గౌరికి తను అన్యాయం చెయ్యటంలేదు గదా?

యెవరో వెక్కివెక్కి యేడవటం వినిపించి చటుక్కున లేచాడు చంద్రం.

వంటింట్లో గోడకు చేరపడి గౌరి ఏడుస్తోంది. ఆమె పక్కగా అన్నం పళ్ళెం, మంచినీళ్ళ గ్లాసూ ఉన్నాయి.

ఆ దృశ్యంచూసిన చంద్రం మనస్సు వెల్లువయింది. తన ప్రవర్తనకులో లోపల సిగ్గుపడ్డాడు.

"..... యేమిటి గౌరీ! ఎందుకు యేడుస్తున్నావు? ఇప్పుడు నేను నిన్ను యేమన్నానని?" మెత్తగా అన్నాడు చంద్రం.

కళ్ళు తుడుచుకుంటూ గౌరి లేచి నిల్చుంది. పీట వాల్చి, అన్నం పళ్ళెం పెట్టింది.

"నీ మనస్సును నొప్పించినందుకు సిగ్గుపడుతున్నాను గౌరీ!" పీట మీద కూర్చుంటూ అన్నాడు.

గౌరి మౌనంగా నెయ్యి వడ్డించింది.

"నిన్ను చాలా బాధపెట్టాను గదూ?" జాలిగా అడిగాడు చంద్రం.

కాదన్నట్లు తల ఊపింది.

"మరి యేడ్చావు ఎందుకు?"

"నువ్వు అన్నం తినకుండా పడుకున్నావు. అందుకే-" గౌరి వాచి బరువుగావున్న కనురెప్పల్ని ఎత్తి అమాయకంగా చూసింది చంద్రం మొహంలోకి.

చంద్రం ఏదోగా అయిపోయాడు. నిష్కల్మషమైన గౌరి ప్రేమను భరించలేకపోయాడు. హృదయం తొణికింది. కళ్ళు నిండాయి. తనకు ఊహ తెలిసింతరవాత తనకోసం ఇంత బాధపడే వ్యక్తిని చూడలేదు. తనను తిన్నావా లేదా అని అప్యాయంగా అడిగేవారు లేరు. తను అన్నం తినకుండా పడుకున్నందుకు గౌరి యేడుస్తున్నది! గౌరిని బలంగా హృదయానికి హత్తుకోవాలన్న ఆవేశాన్ని ప్రయత్నంమీద అణచుకున్నాడు చంద్రం. కొన్ని క్షణాలపాటు గౌరిని చూస్తూ కూర్చున్నాడు.

"నువ్వు భోజనం చేశావా గౌరీ?" చంద్రం గొంతు వణికింది. చంద్రంలోని సంచలనాన్ని కొంతవరకు అర్థం చేసుకున్న గౌరి చంద్రం మొహంలోకి చూసింది. చంద్రం కళ్ళలోని ఆత్మీయతకు గౌరి మనస్సు పులకరించింది.

"అన్నం తిన్నావా గౌరీ?" మళ్ళీ అడిగాడు చంద్రం గౌరిని పరిశీలనగా చూస్తూ.

"లేదు."

"అయితే, నువ్వుకూడా వడ్డించుకో. ఇద్దరం కలసి తిందాం!"

గౌరి అందంగా చూస్తూ ఆనందంగా నవ్వింది. "వెన్నెల్లో, అడవిలో, ఓ అడవిమల్లెపువ్వు వికసించింది!" అనిపించింది చంద్రానికి.

# 26

చంద్రం గేటు తీసుకొని లోపల ప్రవేశించేటప్పటికి హేమ, ఇంటిముందున్న తోటలో పచార్లు చేస్తోంది. చేతిలో "ది హ్యూమన్ మైండ్" అనే పుస్తకం ఉంది.

లాన్‌లో కుర్చీలు వేసి ఉన్నాయి. లాన్‌లో ప్రవేశించిన చంద్రాన్ని మామూలుగా తెలిసిన వ్యక్తిని చూసినట్లు - కుర్చీలు వేసి ఉన్న చోటుకు వచ్చింది.

"కూర్చో చంద్రం!" అంది తనొక కుర్చీలో కూర్చుంటూ. ఆమె స్వరంలో విరక్తీ, మొహంలో నిర్లక్ష్యం కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి. కళ్ళలోమాత్రం దాచినా దాగని వెలుగు కనిపిస్తూంది.

చంద్రం కూర్చోలేదు. కళ్ళలో కోపం, మొహంలో అశాంతి, నుదుటుమీద ముడతలు కనిపిస్తున్నాయి. కుడిచేత అరచెయ్యిని మెడమీద పెట్టుకొని మెడ వెనక్కు విరుచుకుంటున్నాడు. చంద్రం హేమవైపు చూడలేదు. ఎటో చూస్తూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. చంద్రం ఎంతో బాధపడుతున్నట్లు చూసిన హేమ సహించలేకపోయింది. కక్షగా చంద్రాన్ని బాధించాలని అనిపిస్తుంది ఒకోసారి. తీరా తన కళ్ళముందు చంద్రం బాధపడుతుంటే చూడలేదు. ఏమిటో తన మనస్సే తనకు అర్థం కావటం లేదు. చంద్రం చెయ్యి పట్టుకొని "కూర్చో చంద్రం! ఎందుకంత బాధపడతావు? నువ్వు బాధపడటం నేను చూడలేను," అని అనాలనిపించింది హేమకు. కాని కేవలం "కూర్చో చంద్రం!" అనిమాత్రం అనగలిగింది. ఈసారి ఆమె స్వరంలో మెత్తదనానికి ఎటో చూస్తున్న చంద్రం హేమ కళ్ళలోకి చూశాడు విస్మయంగా.

"ఏమిటి నువ్వు? నిన్ను ఎలా అర్థం చేసుకోను? అంతలో నిర్లక్ష్యం, అంతలో ఆత్మీయత!" అని అడుగుతున్నట్లున్నాయి - తీక్షణమైన చంద్రం చూపులు. కళ్ళలోకి చొచ్చుకుపోతున్న చంద్రం చూపుల నుంచి హేమ కళ్ళు దించుకుంది, ఒక్కసారిగా చంద్రం హేమ కుర్చీకి చాలా దగ్గిరగా వచ్చి నిల్చొని ఆమె మొహాన్ని రెప్పవెయ్యకుండా చూడసాగాడు. హేమ వింతగా చంద్రం మొహంలోకి చూసింది చంద్రంలో ఉద్రేకం మొదటిసారిగా చూస్తున్న హేమకు గుండెలు దడదడలాడాయి. చంద్రం ఈ రోజు చాలా వింతగా ప్రవర్తిస్తున్నాడు అనుకుంది.

చంద్రం, హేమ కూర్చుని ఉన్న కుర్చీ చేతులమీద చేతులు ఆనించి ముందుకు వంగి హేమ మొహంలోకి అదోలా చూడసాగాడు. హేమకు ఊపిరి ఆడనట్లు ఇరుగ్గా అనిపించింది. ఏదో చిత్రమైన అనుభూతి ఆమెను చుట్టివేసింది. చంద్రం చూపుల్లోని తీక్షణతను తట్టుకోలేక లేచి నిల్చోబోయింది. మరుక్షణంలో తనచుట్టూ చంద్రం చేతులు. విడిపించుకోవటానికి ప్రయత్నించింది. చంద్రం ఆమెను మొరటుగా, బలంగా, ఉబికి వస్తున్న ఉద్వేగంతో గాఢంగా గుండెలకు హత్తుకున్నాడు.

ఈ క్షణంకోసమే హేమ ఎదురుచూసింది. చంద్రంలో ఇలాటి ధైర్యాన్నీ, ఉద్వేగాన్నే ఆమెకు తెలియకుండానే ఆమె కోరుకుంది. ప్రేమతో కూడిన దౌర్జన్యంలో కరిగిపోయిన ఆడది ఉండదేమో? హేమకు ఆ క్షణం సమస్త ప్రకృతీ స్తంభించిపోయినట్లనిపించింది.

"ఇవ్వాళ ఏదో తేలిపోవాలి. నేనంటే నీకు అసహ్యమా? నిజం చెప్పు హేమ! ఒక్కసారి చెప్పు - నే నంటే నీకు అసహ్యం అని... మళ్ళీ నా ముఖాన్ని నీకు చూపించను. నిన్ను బాధించను. దూరంగా.... నీ నుంచి చాలా దూరంగా వెళ్ళిపోతాను-" ఆవేశంతో అన్నాడు చంద్రం, హేమను బలంగా హృదయానికి హత్తుకుంటూ.

ఒక్కసారిగా హేమలోని ఆభిజాత్యం, అభిమానం కరిగి కన్నీరుగా ప్రవహించింది. ఇంతకాలం ప్రేమా, ద్వేషం మధ్య నలిగిపోతున్న ఆమె హృదయం ఏదో అనిర్వచనీయమైన అనుభూతికి గురి అయింది. చంద్రం గుండెల్లో తల దాచుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది.

"ఏడుస్తున్నావా హేమా! నువ్వు బాధపడతావు. నన్ను బాధపెడతావు. ఎందుకు హేమా? నీకేం కావాలో చెప్పు! నన్నేం చెయ్యమంటావో చెప్పు!"

హేమ చంద్రం గుండెలకు కరుచుకుపోయింది. వెక్కి వెక్కి ఏడుస్తూంది.

"చెప్పు హేమా! నేనంటే నీకు ఇష్టమేనా?" లాలనగా అడుగుతూ హేమ కళ్ళు తుడవసాగాడు.

ఉద్రేకంనుంచి కొంతవరకు బయటపడిన హేమ, తనను చంద్రం చేతులనుంచి విడిపించుకోబోయింది. పెనుగులాడతున్న హేమను మరీ గాఢంగా హత్తుకుంటూ అన్నాడు: "నేను వదలను. ముందు నేను అడిగే ప్రశ్నకు సమాధానం కావాలి. నన్ను వివాహం చేసుకోవటం ఇష్టమేనా?"

అంగీకార సూచకంగా తల ఆడించి సిగ్గుతో మల్లెమొగ్గలా ముడుచుకుపోయింది చంద్రం బాహుద్వయంలో.

"నిజంగానా హేమా! నేను అంత అదృష్టవంతుణ్ణా! నాకు ఏదో భయంగా ఉంది. ఏదీ, ఒక్కసారి నా కళ్ళలోకి చూడు చాలు! అర్థం చేసుకోగలను-" చంద్రం స్వరంలోని ఆదుర్దాకు హేమ కరిగిపోయింది.

చంద్రం కళ్ళలోకి చూడటానికి అంతవరకూ అతని గుండెల్లో దాచుకున్న ముఖాన్ని ఎత్తింది. వెంటనే క్రూర మృగాన్ని చూసినట్లు బెదిరిపోతూ చంద్రం చేతుల్ని విడిపించుకొని దూరంగా నిల్చుంది.

ఎవరైనా వచ్చి వుంటారని అర్థం చేసుకున్న చంద్రం వెనక్కు తిరిగి గేటువైపు చూశాడు. గౌరి నిల్చుని వుంది. చంద్రంకు మతిపోయింది. వెర్రివాడిలా ఓ క్షణం కళ్ళప్పగించి చూశాడు. హేమ మొహంలో జుగుప్స, కోపంతో లతలా కంపించి పోతున్నది. అది చూసిన చంద్రానికి గౌరిమీద వళ్ళు తెలియని కోపం వచ్చింది. గేటు దగ్గిరకు దూకుడుగా వచ్చాడు.

"యెందుకొచ్చావు?" గర్జించాడు.

గౌరి తలయెత్తి చూసింది అసలే అమాయకంగా, ఆకర్షణీయంగా ఉండే ఆ పెద్ద పెద్ద సోగకళ్ళను జాలిగా పెట్టి చూసింది. కళ్ళలో నీరు కమ్ముకుంది. గౌరి ముఖంలోకి చూసిన చంద్రం కోపమంతా మంచులా ఇట్టే కరిగిపోయింది.

"ఇక్కడకు ఎందుకు వచ్చావు గౌరీ?" అన్నాడు బాధగా.

అంతవరకూ భయంతో కనుకొనల్లో నిలిచిపోయిన కన్నీరు కట్టలు తెంచుకుంది.

"ఓయ్ పిల్లా! యెందుకొచ్చావు? సిగ్గు లేదూ, మగవాళ్ళను వెతుక్కుంటూ రావటానికి?" హేమ కోపంతో గట్టిగా మందలించింది. గౌరి బెదురుగా చూసింది, చంద్రం దగ్గరగావచ్చి నిల్చుంటూ.

చంద్రం, హేమ మాటలకు తెల్లబోయాడు. హేమ ఇలా అసభ్యంగా కూడా ప్రవర్తించగలదా?

హేమకు తన ప్రవర్తన తనకే ఎబ్బెట్టుగా ఉంది. కాని, గౌరి అంటే ఆమెకు గల అసూయే అందుకు కారణం. చంద్రం తనవాడు. మధ్యలో ఈ బజారుపిల్ల తననుంచి చంద్రాన్ని వేరు చేస్తున్నదనే భావం హేమ ఆభిజాత్యాన్ని బాగా గాయపరచింది.

"ఇంటికి వెళ్ళు గౌరీ! అసలు నువ్వు ఇక్కడకు యెందుకొచ్చావు?" చంద్రం స్వరంలోని ఆప్యాయత హేమ మనస్సుకు తగిలినగాయాన్ని రేపినట్లయింది.

"ప్రకాశం...." గౌరి వెక్కిళ్ళమధ్య యెలాగో అనగలిగింధి.

"ప్రకాశం.... ప్రకాశానికి ఏం జరిగింది?" ఆదుర్దాగా ప్రశ్నించాడు చంద్రం.

"ప్రకాశాన్ని పోలీసులు పట్టుకెళుతున్నారు–" బావురుమన్నది గౌరి.

"పోలీసులు పట్టుకెళ్ళటం ఏమిటి? పద వెళదాం–" ఆదుర్దాగా ముందుకు అడుగు వేయబోతున్న చంద్రం చెయ్యి గట్టిగా పట్టుకుంది హేమ.

చంద్రం ఆశ్చర్యపోయాడు. హేమను చూశాడు. ఏదో చాలా అతినిగూఢమైన ఆజ్ఞను ఇవ్వబోతున్న మహారాణిలా ఠీవిగా నిల్చుంది హేమ. ఆమె నిల్చొనే తీరూ, ముఖంలో తెచ్చిపెట్టుకున్న గాంభీర్యం, నేను ఆ గౌరికంటే ఎంత ఎత్తున ఉన్నానో చూడు అన్నట్లు ఉంది.

"క్షమించు హేమ! ప్రకాశాన్ని పోలీసులు పట్టుకెళుతున్నారట."

"నే విన్నాను. ఇప్పుడు నువ్వు ఎక్కడకూ వెళ్ళటానికి వీల్లేదు."

ఇంతకాలం మరోవిధంగా ప్రవర్తించింది. ఇప్పుడేమిటి ఇంత అధికారం చేస్తూంది! హేమ తనను అలా ఆజ్ఞాపించటం చంద్రానికి కొత్త అనుభూతి కలిగించింది. ఇంతకాలానికి హేమ తనకు చేరువయింది. ఇంతలోకే ఈ అవాంతరం! చంద్రం సందిగ్ధంలో పడ్డాడు.

"నువ్వు తేల్చుకోదలచినట్లే ఇవ్వాళ నేను తేల్చుకోదలచాను. నీకు నేను కావాలో..... ఈ జనం కావాలో తేల్చుకో"

"నేను చెప్పేది విను హేమా!"

"నేనేమీ వినదలచుకోలేదు!" మధ్యలోనే చంద్రం మాటలకు అడ్డువస్తూ ఖచ్చితంగా అన్నది హేమ.

"అదికాదు హేమా! ప్రకాశానికి నేను ఎంతో ఋణపడి వున్నాను. అసలు విషయం ఏమిటో కనుక్కొని ఇప్పుడే వస్తాను."

ఇంతవరకూ వచ్చాక, గౌరిముందు తనమాట చంద్రం కాదనటం హేమ సహించలేకపోయింది.

"ముందు ఆ పిల్లను వెళ్ళిపొమ్మను. తరవాత ఓ గంట ఆగి నువ్వు వెళ్ళవచ్చు" అంది హేమ ఖచ్చితంగా.

"అవివేకంగా మాట్లాడకు హేమా! నన్ను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు. ప్రకాశం కష్టంలో వున్నాడని తెలిసీ నన్ను ఇక్కడ కూర్చోమంటావా?"

హేమ జవాబు చెప్పలేదు. ఉబికివస్తున్న కోపాన్ని కిందిపెదవి కొరుక్కుంటూ అణుచుకోవటానికి ప్రయత్నించసాగింది.

"నువ్వు నా జీవిత సర్వస్వానివి. నువ్వులేని జీవితం నాకు అక్కరలేదు. కాని ప్రకాశం - జీవితంకంటే మనిషికి విలువైనది ప్రపంచంలో ఏదైనా ఉంటే, అంతకంటే ఎక్కువయినవాడు. ప్రేమ, కర్తవ్యం - ప్రేమకోసం మనిషి పాకులాడతాడు. అందులో స్వార్థం ఉంది. ప్రేమను పొంది సుఖించటానికి ప్రయత్నిస్తాడు. నా దృష్టిలో కర్తవ్యం తరవాతదే ప్రేమ. ప్రకాశాన్ని రక్షించటం నా కర్తవ్యం. నన్ను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు హేమా!" చంద్రం హేమ కళ్ళలోకి ప్రాధేయపూర్వకంగా చూశాడు.

హేమ కక్షగా పెదవిని కొరుక్కుంది.

"వెళ్ళు. కాని, మళ్ళీ నీ ముఖం నాకు చూపించకు."

"హేమా! నీకు మతిపోయిందా?"

"అవును, నాకు మతేపోయింది. అదీ ఇవ్వాళే పోయింది. ఇంతకాలం పదిలంగా కాపాడుతున్న మతిని ఓ గంట క్రితమే పోగొట్టుకున్నాను" అంటూ ఉబికివస్తున్నదుఃఖాన్ని దిగమింగుకుంటూ గిర్రున తిరిగి ఇంట్లోకి పరుగెత్తింది. చంద్రం నిస్సహాయంగా హేమ వెళ్ళినవైపే చూస్తూ నిల్చుండిపోయాడు. బాధగా నిట్టూర్చి గౌరితో బయలు దేరాడు.

ఉత్సాహంగా తన పక్కనే నడుస్తున్న గౌరిని చూసి ఆశ్చర్యపోయాడు చంద్రం. ఇంతకుముందు ప్రకాశాన్ని పోలీసులు పట్టుకెళుతున్నారని ఏడ్చింది. మరి ఆ దుఃఖం అంతా ఏమయినట్లు?

"గౌరీ!"

"ఏమిటి?" కలల్లో కరిగిపోతున్న గౌరి ఉత్సాహంగా చంద్రం మొహంలోకి చూసింది.

"ఇందాక ఏడ్చావు, ఎందుకు?"

గౌరి మాట్లాడలేదు.

"ప్రకాశాన్ని పోలీసులు పట్టుకెళ్ళారనేనా?"

కాదన్నట్లు తల ఊపింది గౌరి. చంద్రం ఆశ్చర్యపోయాడు.

"అయితే ఎందుకు, ఏడ్చావు?"

"ఆ పిల్లను నువ్వు అలా కావలించుకుంటే నాకు ఎందుకో ఏడుపు వచ్చింది."

అంత బాధలోనూ చంద్రానికి నవ్వు వచ్చింది. అంతలోనే గౌరి అమాయకత్వానికి జాలివేసింది.

"మరి ఇప్పుడు సంతోషంగా ఉన్నావు?" చంద్రం కుతూహలంగా ప్రశ్నించాడు.

"ఆ అమ్మాయి ఇక నీ మొహం చూడనన్నదిగా?"

నడుస్తున్న చంద్రం ఠక్కున ఆగిపోయాడు. గౌరి ముఖం సంతోషంతో వెలిగిపోవటం చూశాడు. విషాదంగా నవ్వుకున్నాడు.

"ఆ అమ్మాయితో మాట్లాట్టం నీకు ఇష్టంలేదా గౌరీ?" కలలో మాట్లాడుతున్నట్లు ప్రశ్నించాడు చంద్రం నడుస్తూ.

"లేదు." గౌరి అంత నిర్భయంగా, ఖచ్చితమైన జవాబిస్తుందని ఊహించని చంద్రం మౌనంగా నడుస్తున్నాడు. గౌరికి జరుగుతున్న అన్యాయాన్ని గురించి ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

# 27

చంద్రం, గౌరీ పోలీసు స్టేషన్‌కు చేరుకునేప్పటికే ప్రకాశాన్ని రిమాండ్‌లో ఉంచారు. చంద్రం తన పరిచయం ఇచ్చి, జామీనుమీద ప్రకాశాన్ని విడిపించాడు.

ప్రకాశం చంద్రాన్ని చూడగానే హాయిగా నవ్వాడు.

"ఏమిటిది ప్రకాశం? ఎందుకు ఇలా జరిగింది?" ప్రశ్నించాడు చంద్రం.

"పెద్ద విషయం ఏమీలేదు. ఈ మధ్య అగ్ని ప్రమాదాలు జరిగాయని నీకు తెలుసుగా?"

"గుంటూరు, విజయవాడల అగ్నిప్రమాదాల గురించి తెలియని ఆంధ్రుడు కూడా ఉంటాడా? ఈ రెండు పట్నాలకూ ఏదో శాపం ఉన్నట్లనిపిస్తుంది. అయితే, ఆ అగ్ని ప్రమాదాలకూ, నిన్ను అరెస్టు చెయ్యటానికీ సంబంధం ఏమిటి?" కుతూహలంగా అడిగాడు చంద్రం.

"ఆ సందర్భంగా కొందరు రౌడీలను అరెస్టు చేశారు."

"అవును, విన్నాను. అయితే?"

"వాళ్ళంతా దాదాపు నాగేంద్రం గ్రూపువాళ్ళే. వాళ్ళు తప్పు ఒప్పుకున్నారట. నేను చెయ్యమంటే అలా చేశామని చెప్పారట!"

"ఎంత అన్యాయం?"

"అసలు వాళ్ళుకూడా చేసి ఉండరు. కేవలం నన్ను ఇందులో ఇరికించటానికే వాళ్ళు పట్టుబడి ఉంటారు!"

"ఎంత దారుణం? ఇలాంటి కుట్రలుకూడా చేస్తారా?" చంద్రం స్వరంలో బాధ ధ్వనించింది.

"మరి ఏమనుకున్నావు? నీకు ఇంకా ప్రపంచం పోకడ తెలియదు. నువ్వు కథలు రాయటానికి ఊహించుకొనే ఉదాత్తమైన పాత్రలలాగే మనుషులంతా ఉంటారనుకోవటం పొరపాటు. అందుకే ఊహాలోకంనుంచి కిందకు దిగి ఆలోచించటం నేర్చుకోమంటున్నాను."

"మొదలుపెట్టావే!" నవ్వుతూ అన్నాడు చంద్రం.

"ఇంత త్వరగా నీకు ఈ వార్త ఎలా అందిందోయ్?" ప్రకాశం అడిగాడు.

"గౌరి ఉందిగా, మెరుపులా పరిగెత్తుకొచ్చింది–" అన్నాడు చంద్రం. ప్రకాశం మౌనంగా నడుస్తున్న గౌరివైపు చూశాడు. గౌరి అసలు ఈ లోకంలోనే లేదు. అల్లిబిల్లి ఆలోచనల్లో తేలిపోతూ నడుస్తున్నది.

ప్రకాశం బాధగా నిట్టూర్చాడు. చంద్రం ఆశ్చర్యంగా ప్రకాశం ముఖంలోకి చూశాడు. అది గమనించిన ప్రకాశం హాయిగా నవ్వాడు.

చంద్రం ఆశ్చర్యపోయాడు. ప్రకాశం హాయిగా నవ్వగలడు. హాయిగా నిద్రపోగలడు. కాని ఈ నిట్టూర్పు! ఏదో బాధ ఉండి ఉండాలి. ప్రకాశం, గౌరినిగాని ప్రేమించటం లేదు గదా? ఆ భావం చంద్రానికి అంత రుచించలేదు. అంతలోనే తన మనస్సును తనే నిందించుకున్నాడు. తనకు గౌరిమీద ప్రేమ లేదు. కాని, ప్రకాశం ప్రేమిస్తున్నాడేమోననే భావం తనకు ఎందుకు అయిష్టంగా ఉంది? ప్రకాశం విషయంలోనా తనకు అసూయ? తన మనస్సు క్రమంగా గౌరివైపు మొగ్గటం లేదుకదా! లేదు. గౌరి అంటే తనకు కేవలం జాలి మాత్రమే. ప్రకాశానికి గౌరి అంటే ఇష్టం ఉంటే, తను గౌరిని ఒప్పించి వారి వివాహం చేయించటానికి ప్రయత్నిస్తాడు.

చంద్రానికి ఆ రాత్రి అన్నం సహించలేదు. ఆలోచనలతో బుర్రంతా చెదలపుట్టలా ఉంది.

ఆ రాత్రంతా కలత నిద్రతోనే గడిచిపోయింది.

# 28

పొద్దుటే ఇంటిముందు కారు ఆగిన శబ్దం విని ప్రకాశం, చంద్రం ఇద్దరూ వాకిట్లోకి వచ్చారు. కారులోనుంచి కృష్ణారావూ, కాంతమ్మా, రజనీ దిగటం చూసిన చంద్రం తెల్లపోయాడు. రజని పరిగెత్తుకుంటూ వచ్చి చంద్రం చెయ్యి పట్టుకొని గలగలలాడుతూ చెప్పింది–

"బాబాయ్! మరేమో – అమ్మా, నాన్నా నిన్ను తీసుకెళ్ళటానికి వచ్చారు. వాళ్ళకు నేను అన్ని విషయాలూ చెప్పేశాగా!"

"అవును బాబూ! రజని చెప్పేది నిజమే! నిన్న మేము చాలా బాధపెట్టాం." అంది కాంతమ్మా చంద్రం దగ్గిరకువస్తూ.

ప్రకాశం అందర్నీ లోపలకు ఆహ్వానించాడు. చంద్రం కూడా యాంత్రికంగా లోపలకువచ్చి కూర్చున్నాడు. అతనికి తను చూస్తున్నదీ వింటున్నదీ నిజమని నమ్మకం కలగడంలేదు.

మౌనంగా ఉన్న చంద్రం రెండుచేతులూ పట్టుకుంటూ 'మమ్మల్ని క్షమించు చంద్రం!' అంది కాంతమ్మ. చంద్రం తెల్లమొహంవేసి కాంతమ్మ మొహంలోకి చూశాడు. ఆమె నిజమే చెబుతుందనిపించింది. మరీ ఆశ్చర్యపోయాడు.

"ఏరా చంద్రం, మాట్లాడవు? నిన్ను తీసుకెళ్ళటానికి వచ్చాము. అన్నీ మర్చిపోయి మాతో రావాలి," అన్నాడు కృష్ణారావు. చంద్రంకు ఏం జవాబివ్వాలో తోచలేదు.

"పోనియ్, మేము ఉన్న యింట్లో నీకు ఉండటం ఇష్టం లేకపోతే మేమే వేరే వెళతాం. నువ్వు మాత్రం ఆ ఇంట్లోఉండటం తప్పదు" అన్నాడు కృష్ణారావు నిష్ఠురంగా.

"అన్నయ్యా!"

"కాదనకు చంద్రం, వెళ్ళు. పెద్దవాళ్ళను చిన్నబుచ్చకు. అది నీకు మంచిది కాదు." ప్రకాశం అన్నాడు.

కాంతమ్మా, కృష్ణారావూ, ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఇంతకాలం వాళ్ళు ప్రకాశమే చంద్రాన్ని ఇంటికి రానివ్వటంలేదనే అపోహలో ఉన్నారు. వారి అపోహకు లోలోనే సిగ్గుపడ్డారు.

"ప్రకాశం! ఇకనుంచి నువ్వుకూడా మాతోనే ఉండిపోవాలి." కృష్ణారావు అన్నాడు.

చంద్రం ఆశ్చర్యంగా అన్నవైపూ, ఆశగా ప్రకాశం వేపూ చూశాడు. చంద్రం దృష్టిలో కృష్ణారావు ఆ ఒక్క మాటతో ఎంతో ఎత్తు పెరిగాడు.

"మీ సహృదయతకు కృతజ్ఞుణ్ణి, రాకుండా ఎక్కడకు వెళతాను? రోజూ చంద్రం కోసం వస్తూనే ఉంటాను" అన్నాడు ప్రకాశం సవినయంగా.

"మరి బయలుదేరదామా?" చంద్రాన్ని ప్రశ్నించాడు కృష్ణారావు.

"ఇవ్వాళకాదు, రేపు వస్తాను. ఇప్పుడు ప్రకాశం విజయవాడ వెళుతున్నాడు. రేపు మూడుగంటలకు వస్తాడు. రేపు రాత్రికి ఇద్దరం భోజనానికి వస్తాం" అన్నాడు చంద్రం.

"బాబాయ్! గౌరినికూడా తీసుకురావాలి" అంది రజని.

చంద్రం ఉలిక్కిపడ్డాడు.

"అవును చంద్రం! ఆ అమ్మాయినికూడా తీసుకురండి," అంది కాంతమ్మ.

చంద్రం ఆశ్చర్యంనుంచి కోలుకునేలోపలే కృష్ణారావు లేచాడు.

"రేపు రాత్రికి నేనే వచ్చి తీసుకెళతాను" అన్నాడు కృష్ణారావు.

"నువ్వెందుకు, కారు పంపించు చాలు" అన్నాడు చంద్రం.

అందరి మనస్సులూ తేలిగ్గా ఉన్నాయి. కాని ఇంతమంది మనస్సుల తాలూకు బరువూ ఓ అమాయకురాలి లేత మనస్సుమీద వచ్చిపడిన విషయం ఎవరూ గ్రహించలేదు.

అందర్నీ కారువరకూ వెళ్ళి సాగనంపారు ప్రకాశం, చంద్రం.

"ఇవ్వాళ నాకు చాలా సంతోషంగా ఉందిరా చంద్రం!" అన్నాడు ప్రకాశం. చంద్రం జవాబివ్వలేదు.

ప్రకాశం బండికి సమయం అయిందని బయలుదేరి వెళ్ళిపోయాడు.

చంద్రం నవలకు ముగింపు దొరికింది. ప్రొద్దుట ఎనిమిది గంటలకు కూర్చున్న చంద్రం, నవల పూర్తిచేసి లేచేప్పటికి ఒంటిగంట అయింది.

కాగితాలన్నీ సర్దిపెట్టి లేచాడు. అప్పుడుగాని చంద్రానికి గౌరి విషయం జ్ఞాపకం రాలేదు. ఎక్కడా శబ్దం లేదు. ఆశ్చర్యం వేసింది. ఒంటిగంట అయినా అన్నానికి పిలవలేదు; తను నవల రాస్తుంటే గౌరి ఎదురుగా కూర్చుని చూడటం సరదా! ఏమయిందబ్బా? అనుకుంటూ గదినుంచి బయటకు వచ్చాడు చంద్రం. వంటింటి గడపకు చేరబడి శోకమూర్తిలా కూర్చొని వున్న గౌరిని చూశాడు చంద్రం. ముఖం అంతా ఏడ్చి ఏడ్చి వుబ్బివుంది. కళ్ళు యెర్రగా వున్నాయి. కనురెప్పలు బాగా వాచి వున్నాయి.

తను వెళ్ళిపోతున్నాడనా గౌరి దుఃఖం? మనస్సులో యెక్కడో కలుక్కుమంది. ఆమెను ఎలా ఓదార్చటం? ఏమని ఓదార్చటం?

"గౌరీ, భోజనం చేశావా?" మృదువుగా ప్రశ్నించాడు. గౌరి బాగా వాచివున్న కనురెప్పల్ని బరువుగా ఎత్తి ఓ క్షణకాలం చూసి మళ్ళీ వాల్చేసింది.

"యెందుకిలా బాధపడతావు? నేను ఎక్కడకు వెళుతున్నానని? రోజూ వచ్చి నిన్ను చూసి వెళుతుంటాను. వచ్చే నెలలో ట్యుటోరియల్ కాలేజీలో చేర్పిస్తాను. బాగా చదువుకుందువుగాని. ప్రకాశం చాలా మంచివాడు. నిన్ను ఏవిధంగానూ బాధపెట్టడు," అంటూ గౌరి పక్కనే నేలమీద కూర్చున్నాడు చంద్రం.

తన మాటలు తననే వెక్కిరించి నట్లనిపించింది చంద్రానికి గౌరికి కావాల్సింది ఇదేనా? తనకు తెలియదా? తెలుసు! కాని, తను నిస్సహాయుడు, అర్థం చేసుకోనట్లు నటించటానికంటే తను చెయ్యగలిగింది యేమీలేదు. నిజంగా తనేమీ చెయ్యలేడా? అంత సహృదయత తనలో లేదా? కాని, తన హృదయాన్ని యేనాడో హేమకు అర్పించివేశాడు. అక్కడ మరొకరికి స్థానం లేదు.

గౌరి మనస్సుని ఎలాగయినా ప్రకాశంవైపుకు మరలించాలి. తను ఇక్కడ ఉన్నంతకాలం అది సాధ్యపడేది కాదు! ఈ మధ్య ప్రకాశంలో ఏదో మార్పు కనిపించింది. ప్రకాశం గౌరిని ప్రేమిస్తున్నాడనటంలో సందేహం లేదు. కాని, మనస్సులోని బాధను ఒక్కసారి కూడా బయటపెట్టలేదు. లోకం బాధను తన బాధగా స్వీకరించే ప్రకాశం, తన బాధను లోకంమీద రుద్దడు. గౌరికి తనంటే ఇష్టం అని తెలుసు. కాని, ఈర్ష్య అనేది ప్రకాశంలో లేదు. తనే అయితే – తన కళ్ళముందు హేమ మరొకరితో చనువుగా వుండటం సహించగలడా? ఒకోసారి గౌరి విషయంలోనే తనకు అలా అనిపిస్తుంది. తను మామూలు మనిషి. ప్రకాశంలాంటివాళ్ళే మానవాతీతులు.

గౌరి మౌనంగా చంద్రానికి అన్నం వడ్డించింది. గౌరిని అంత ముభావంగా ఎప్పుడూ చూడలేదు ఇప్పుడికిప్పుడే ఎంతో పెద్దదయినట్లు కనిపిస్తుంది.

మల్లెపువ్వుకంటే, స్వచ్ఛమైన శరత్కాలపు వెన్నెలకంటే చల్లనైన, జలపాతంలోని శక్తికంటే ఉత్తేజకరమైన గౌరి అకృత్రిమ ప్రేమను తిరస్కరించి తను తప్పు చేయటం లేదుకదా? గౌరికి జరుగుతున్నది అన్యాయమే. కాని తను చెయ్యగలిగింది ఏమీలేదు. తన మనస్సు ఏనాడో మంచి మల్లె సౌందర్యానికి ఆకర్షించబడి దానిచుట్టూ పరిభ్రమిస్తున్నది. ఇప్పుడు ఆ మనస్సును గంధరహితమైన అడవిమల్లె వైపుకు మరల్చటం సాధ్యపడదు. గౌరిమీద తనకు ఉన్నది కేవలం జాలి మాత్రమే!

గౌరి మనస్సును మరల్చి ఎలాగయినా ప్రకాశాన్ని ఒక ఇంటివాణ్ణి చెయ్యటం తన బాధ్యత.

గౌరికి తను అన్యాయం చేస్తున్నాడేమోననే బాధతో కలతబారిన మనస్సును జోకొట్టటానికి ప్రయత్నిస్తున్నాడు.

చంద్రం భోజనంచేసి లేచాడు. తను ముగించిన నవలను ఎప్పుడెప్పుడు తీసుకెళ్ళి హేమచేత చదివిద్దామా అని ఆదుర్దాగా ఉంది చంద్రానికి.

అతని మనస్సు హేమను గురించిన తలపులతో నిండిపోయింది. అంతలోనే కిందటిరోజు జరిగిన సంఘటన గుర్తొచ్చి గతుక్కుమన్నాడు. నిజంగా హేమ తన ముఖం చూడకపోతే! అంతరాంతరాల్లో ఎక్కడో లోతుగా - చాలా లోతుగా ఏదో గుచ్చుకుంది. అలా ఎన్నటికీ జరగటానికి వీల్లేదు. గౌరితో తనను చూసినప్పుడల్లా హేమ మతిపోయినట్లే ప్రవర్తిస్తుంది. కేవలం అది స్త్రీ సహజమైన అసూయాభావం మాత్రమే. తను వెళితే మళ్ళీ వెళ్ళిపొమ్మంటుందా? అలా జరగదు. నిన్న ఆవేశంలో అలా అన్నది - అంతే! ఈపాటికి తన ప్రవర్తనకు బాధపడుతూ కూడా ఉండవచ్చును. హేమ అంత అవివేకి కాదు. తను ఇంటికి వచ్చేస్తున్నట్లు ఈపాటికి హేమకు తెలిసే ఉంటుంది. దానితో కోపం చాలావరకు తగ్గవచ్చును. తీవ్రంగా ప్రేమించేవాళ్ళే అంత తీవ్రంగానూ ద్వేషించగలరు. ఈ నవల చదివితే హేమ మనస్సును అలుముకుని వున్న అనుమాన మేఘాలు విచ్చుకుపోతాయి.

# 29

చంద్రం వచ్చేటప్పటికి ప్రసాదరావూ హేమా హాల్లో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. చంద్రాన్ని చూడగానే హేమ హృదయం జుగుప్సతోనూ, కోపంతోనూ నిండిపోయింది. ముఖం చూడాలనిపించలేదు. అతని స్వరం వినాలనిపించలేదు. దిగ్గున లేచి త్వరత్వరగా లోపలకు వెళ్ళిపోయింది. ప్రసాదరావు హేమ అలా వెళ్ళిపోవటాన్ని తేలిగ్గానే తీసుకున్నాడు ఏదో చిన్నపాటి తగవు జరిగి వుంటుందనుకున్నాడు.

చంద్రం హేమ ముఖాన్ని స్పష్టంగానే చూశాడు. అంతకంటే స్పష్టంగా ఆమె ముఖంలో కనిపించింది జుగుప్సా భావం. ఏ చెరువు గట్టునో కూర్చొని యధాలాపంగా పక్కనే వున్న రాయి ఎత్తగానే దాంతోపాటు, ఏ లద్దిపురుగో చేతులోకి వస్తే కనిపించే భావమే హేమ ముఖంలో తనను చూడగానే కనిపించింది. హేమ తనను అంత చీదరించుకుంటున్నదా?

చంద్రం అలాగే నిలబడిపోయాడు.

"కూర్చో చంద్రం! అలాగే నిల్చున్నావేం?" అన్నాడు ప్రసాదరావు. హేమ ప్రవర్తనకు ఆయన కూడా కష్టపడుతున్నట్లు ఆ స్వరమే చెప్పక చెబుతుంది.

చంద్రం ఉసూరుమంటూ కుర్చీలో కూర్చున్నాడు. చేతిలోని స్క్రిప్టును టేబుల్‌మీద పెట్టాడు.

"ఏమిటిది చంద్రం?" ప్రసాదరావు అడిగాడు కుతూహలంగా.

"నవల రాశానండీ! మీకూ, హేమకూ చదివి వినిపించాలనే వచ్చాను." నూతిలోనుంచి మాట్లాడుతున్నట్లుంది చంద్రం స్వరం.

ప్రసాదరావు ఉత్సాహంగా నవల ప్రతిని చేతిలోకి తీసుకున్నాడు.

"చదివి వినిపిస్తే బాగుండదు. ముందు నేను చదువుతాను. ఎంతసేపూ! ఆ తరవాత హేమ చదువుతుందిలే. నువ్వు పైకెళ్ళి హేమతో మాట్లాడుతూ ఉండు. సాయంత్రంలోగా నేను దీన్ని పూర్తిచేసేస్తాను."

ప్రసాదరావు చంద్రం జవాబు కూడా వినకుండా నవల ప్రతి చదవటం ప్రారంభించాడు.

చంద్రం ఓ పదినిముషాలు ప్రసాదరావు ఎదురుగా నిర్జీవంగా కూర్చున్నాడు. హేమ దగ్గిరకు వెళ్ళాలంటే ఏదో జంకుగా ఉంది. చీటికి మాటికి చీదరించుకొనేవాళ్ళు చుట్టూ అతను అభిమానం చంపుకొని తిరగటం లేదుగదా! తిరిగి వెళ్ళిపోతే! మళ్ళీ ఎప్పుడూ రాకుండావుంటే!

ప్రేమ, అభిమానం – ఒక్క ఒరలో రెండుకత్తులు ఇమడనట్లు ఒకే హృదయంలో ఇమడవు. హేమది సున్నిత హృదయం. ప్రతిసారీ తనే ఆమె మనస్సును గాయపరుస్తున్నాడు. నిన్నటి తన ప్రవర్తనకు హేమ హృదయం లోతుగా గాయపడి ఉండవచ్చును. గౌరికీ, తనకూ మధ్య వున్న సంబంధాన్ని అపార్థం చేసుకుంటున్న హేమ అలా ప్రవర్తించటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. తను ఆ విషయం ఆమెకు అర్థం అయేలా చెప్పటానికి ప్రయత్నించలేదేమో! అసలు ఆమె అవకాశం ఇస్తేగా?

చంద్రం విసురుగా లేచి నిల్చున్నాడు. మెట్లు ఎక్కబోతూ ఓ క్షణం తటపటాయించాడు. అంతలోనే ఏదో నిర్ణయానికి వచ్చినవాడిలా గబగబా మెట్లు ఎక్కసాగాడు. హేమ గదిలో ప్రవేశించిన చంద్రం విస్మయంతో నిల్చుండిపోయాడు.

హేమ దిండులో తలదూర్చి, బోర్లా పడుకొని వెక్కి వెక్కి ఏడుస్తూంది. ఏమిటీ హేమ? ఒక నిముషం తనను ఏవగించుకుంటుంది, మరో నిముషంలో తనకు బాధ కలిగినందుకు ఏడుస్తుంది. చాలా చిత్రమైన స్వభావం!

మంచం దగ్గిరగా వెళ్ళి నిల్చున్నాడు. తలమీద చెయ్యి వేసి నిమురుతూ "హేమా!" అన్నాడు చంద్రం ఆర్ద్రంగా.

తోకతొక్కిన త్రాచులా ఒక్కసారిగా దిగ్గున లేచి నిల్చుంది హేమ. అంత దుఃఖం చంద్రాన్ని చూడగానే కోపంగా పరిణమించింది. కోపంతో బుసలుకొడుతూ నిల్చుంది.

"హేమా! నిన్నటి నా ప్రవర్తనకు క్షమించు హేమా! నన్ను అర్థం చేసుకోవూ?" మృదువుగా హేమ చేతుల్ని పట్టుకున్నాడు.

"ఛీ – వదులు!" ఏ విషపురుగునో విదిలించినట్లు చంద్రం చేతుల్ని విదిలించింది. చంద్రం చేతుల్ని విడవలేదు సరిగదా, మరీ గట్టిగా పట్టుకున్నాడు.

బాధకంటే కోపం వచ్చింది చంద్రానికి. కసిగా హేమను రెండు బాహువుల్లో బిగించి గుండెలకు అదుముకున్నాడు. ఆ నిముషంలో హేమకు ఏదో పిచ్చి ఆవేశంలో దెయ్యం బలం వచ్చినట్లయింది. చంద్రాన్ని పిచ్చి బలంతో తోసేసింది. తూలి పడబోయిన చంద్రం నిభాయించుకున్నాడు. కాని, నుదురు గోడకు కొట్టుకొని దిమ్మెరపోయాడు. దెబ్బ తగిలిన చోటును అరచేత్తో అదుముకుంటూ హేమ వైపు వెర్రిగా చూశాడు.

"పో ముందు ఇక్కడనుంచి" అంటూ గట్టిగా అరచింది హేమ. అప్పటికే మతిపోయినట్లయిన చంద్రానికి హేమ మాటలు అర్థంకాలేదు. రెండడుగులు ముందుకు వేశాడు.

"అక్కడే ఆగు! నన్ను ముట్టుకున్నావా చూడు, ఏం చేస్తానో!" టేబుల్ మీద వున్న ఫ్లవర్‌వాజ్‌ను చేత్తో తీసుకొని బెదిరింపుగా చూచింది.

చంద్రంలోని చైతన్యం గడ్డకట్టిపోయింది. నిర్జీవ ప్రతిమలా నిల్చొని హేమను చూస్తున్నాడు. కాని, అతని కళ్ళకు ఏమీ. కనిపించటం లేదు.

"వెళతావా లేదా? పోలీసుల్ని పిలిపించి నెట్టించాల్సిన అవసరం తెచ్చుకోకు-" హేమ కోపంతో వణికిపోతోంది.

"ఛీ! అభిమానం పాడూలేని నువ్వూ ఒక మగాడివే-" అఖరకు ఆడది మగవాడిని ఏ మాట అనకూడదో అదే అనేసింది. తీరా అన్న తరవాత హేమకు తప్పుచేసి నట్లనిపించిది. అంతలో కోపం, ఆవేశం తగ్గి, చంద్రం మొహంలోకి చూసింది.

చంద్రం మొహంలో బాధతో నరాలు ఉబికి ఉన్నాయి. రెప్పవాల్చకుండా తననే చూస్తున్న ఆ పెద్దకళ్ళు "ఇక చాలు హేమా! ఇంకేమీ అనకు-" అని ప్రాధేయ పడుతున్నట్లున్నాయి.

చంద్రానికి తను నిల్చున్న భూమి తనను వెక్కిరిస్తున్నట్లనిపించింది. సమస్త ప్రకృతీ స్తంభించిపోయి తనవైపే వింతగా చూస్తున్నట్లనిపించింది. శరీరంలో శక్తి కూడదీసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

ప్రేమించిన హృదయం గాయపడినప్పుడు ఆ ప్రేమ ద్వేషంగా మారుతుంది. ఆ ద్వేషం ప్రతీకారాన్ని కోరుతుంది. ప్రతీకారాన్ని తీర్చుకోగలిగిన ఆ ద్వేషం, పశ్చాత్తాపంగా పరిణమిస్తుంది. పశ్చాత్తాపంలో దగ్ధమైన హృదయంలో మళ్ళీ మొదటి ప్రేమ తల యెత్తుతుంది ఆ ప్రేమలో ఉద్రేకం ఉండదు. ఆవేశం ఉండదు. అసూయా, ద్వేషాలకు తావులేదు. దానికి కేవలం త్యాగం అంటే ఏమిటో తెలుస్తుంది. తను ప్రేమిస్తున్నవాళ్ళు తనకు ఏమి ఇవ్వగలుగుతున్నారు అనేది ఆలోచించదు. తను వారికి ఏమి ఇవ్వగలదు అనే తహ తహ మాత్రమే మిగులుతుంది.

చంద్రం అభిమానంమీద చాలా పెద్ద దెబ్బే తగిలిందని తెలుసుకున్న హేమలోని ద్వేషం పశ్చాత్తాపంగా మారింది. తనమీద తనకే కోపం వచ్చింది. హేమ గోడవైపుకు తిరిగి తలను గోడకు కొట్టుకోసాగింది బాధగా.

చంద్రం కళ్ళకు ఏమీ కనిపించటంలేదు. వినిపించటం లేదుకూడా.

"క్షమించు హేమా! నేను మూర్ఖుణ్ణి. చాలా మొరటుగా ప్రవర్తించాను. నిన్ను చాలా బాధపెట్టాను. అభిమానం లేనివాణ్ణి. సిగ్గు లేకుండా నీ చుట్టూ తిరిగినవాణ్ణి! ఇక ఎన్నటికీ బాధించను. ఇకనుంచి నీకు నా ముఖంకూడా కనిపించదు."

అప్పటికి బాగా వుద్రేకం తగ్గిపోయిన హేమ చంద్రం వేపు తిరిగింది. యేదో మాట్లాడాలని కదలిన హేమ పెదవులు బంధించబడినాయి.

మౌనంగా రెండుచేతులూ యెత్తి హేమకు నమస్కరించాడు చంద్రం. ఆ నమస్కారంలో ఎన్నో భావాలు కనిపించి హేమ మనస్సు తల్లడిల్లిపోయింది.

"నన్ను క్షమించు చంద్రం. నిన్ను నేను ఎంతగా ప్రేమిస్తున్నానో నీకు అర్థంకాదు-" అనాలనుకున్నది, మాటలు పెగల్లేదు.

గిర్రున వెనక్కు తిరిగి ఒక్కొక్క మెట్టూ తనను ఏదో పాతాళంలోకి తీసుకుపోతున్నట్లు దిగిపోతున్న చంద్రాన్ని, హేమ కళ్ళు అప్పగించి చూస్తూ నిల్చుంది. వెనక పరుగెత్తుకెళ్ళి అలా వెళ్ళిపోతున్న చంద్రం కాళ్ళకు చుట్టుకుపోవాలనిపించింది హేమకు. ఆమె శరీరంలో కదిలేశక్తి లేదు.

చంద్రం వెళ్ళిపోయాడు! శాశ్వతంగా వెళ్ళిపోయాడు! మళ్ళీ తన కళ్ళకు కనిపించడు!

హేమ ఒక్కసారిగా మంచం మీద విరుచుకొని పడిపోయింది. గుండెల్ని పగలకొట్టుకొని వస్తూంది దుఃఖం. వెక్కి వెక్కి ఏడుస్తూ అశాంతిగా దిండుమీద కొట్టుకోసాగింది.

నవల చదవటంలో పూర్తిగా లీనమయిపోయిన ప్రసాదరావుకు ఇదేమీ తెలియదు. చంద్రం వెళ్ళిపోవటం అతను గమనించలేదు.

# 30

తనకు వున్న సమస్తమూ, పూచిక పుల్లతోసహా వేసుకొని వస్తున్న ఓడ మునిగిపోయిందని విన్న తర్వాత, ఇంటివైపుకు నడుస్తున్న వ్యాపారస్థుడిలా నడుస్తున్నాడు చంద్రం. దొంగలు దోచిన ఇల్లులా మనస్సు ఖాళీగా వుంది. లోతయిన గాయం తగిలిన వ్యక్తికి వెంటనే బాధ తెలియదు. చంద్రం హృదయం, మెదడూ పూర్తిగా బండబారిపోయినట్లయింది.

తనకోసం ఎదురుచూస్తూ వాకిట్లో నిల్చొనివున్న గౌరిని చూసి అదోలా నవ్వాడు చంద్రం. గౌరి కళ్ళప్పగించి చూసింది. అది నవ్వో మరేదో ఆమెకు అర్థం కాలేదు. చంద్రం అలా నవ్వటం గౌరి ఎప్పుడూ చూడలేదు.

చంద్రం మౌనంగా సామాను సర్దుకుంటున్నాడు. గౌరి కొంచెం దూరంగా నిల్చొని చంద్రాన్ని పరిశీలనగా చూసింది. జరగరాని దేదో జరిగినట్లు అర్థం చేసుకొని భయపడిపోయింది. అలాగే మౌనంగా నిల్చొని చంద్రం సామాను సర్దుకోవటాన్ని చూస్తున్నది. ఏదో ఆలోచన వచ్చినదానిలా అక్కడనుంచి కదిలి దొడ్లోకి వెళ్ళిపోయింది. అక్కడ తాడుమీద ఆరవేసివున్న తన బట్టల్ని మడతపెట్టుకొని లోపలకు తెచ్చింది. మంచంకింద వున్న తన చిన్న ట్రంకుపెట్టెను బయటకు లాగింది. తన సామానంతా ఆ ట్రంకుపెట్టెలోకి సర్దుకోసాగింది.

గౌరి సామాను సర్దుకోవటంచూసి చంద్రం ఆశ్చర్యపోయాడు.

"ఎందుకు గౌరీ, సామాను సర్దుకుంటున్నావు?" చంద్రం స్వరం నిర్లిప్తంగా ఉంది.

గౌరి మాట్లాడకుండా తనపని చేసుకుంటుంది.

"మాట్లాడవేం? ఎక్కడకు వెళతావు? మళ్ళీ ఆ అనాథ శరణాలయానికే వెళతావా?"

గౌరి మాట్లాడకుండా దొడ్లోకి వెళుతుంటే చంద్రం విస్మయంగా చూశాడు. ఓ నిముషంలో చేత్తో తన సబ్బుపెట్టె తీసుకొని గౌరి లోపలకు ప్రవేశించింది. మౌనంగా ఆ సబ్బుపెట్టెను ట్రంకులో పెట్టింది.

"జవాబు చెప్పవేం? శరణాలయానికేనా?" కాస్త విసుగ్గా అడిగాడు చంద్రం.

"కాదు!" ఖచ్చితంగా చెప్పింది గౌరి. ఆమె కంఠంలోని గాంభీర్యానికి విస్తుపోయి చూశాడు చంద్రం.

"మరి యెక్కడికీ ప్రయాణం?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

ఓ క్షణం చంద్రం మొహంలోకి చూసి "తెలియదు," అంది.

చంద్రానికి గౌరి జవాబు అర్థం కాలేదు.

"యెక్కడకు వెళ్ళాలో తెలియకుండానే బయలుదేరుతున్నావా?"

గౌరి జవాబు ఇవ్వలేదు. ఈసారి చంద్రానికి నిజంగానే కోపం వచ్చింది.

'ఏమిటా మొండితనం! ఎక్కడకు వెళుతున్నావంటే చెప్పవేం?' కోపంగా, కొంచెం కటువుగా అడిగాడు.

కనులెత్తి ఓసారి చంద్రం కళ్ళలోకి చూసి మళ్ళీ వాల్చేసుకుంది. 'నీతోనే వస్తున్నాను–" అంది తలవంచుకొనే చిన్నగా.

చంద్రం ఆశ్చర్యానికి అంతులేదు.

"నాతోనా?" కళ్ళు పెద్దవి చేసుకొని ప్రశ్నించాడు.

"అవును. నీతోనే!" స్వరంలో దృఢత్వానికి విస్తుపోయి చూశాడు. గౌరి ముఖంలో అమాయకత్వం కంటే గంభీరత కనిపిస్తుంది. గౌరి మానసికంగా అకస్మాత్తుగా ఓ పది సంవత్సరాలు పెరిగిపోయినట్లు కనిపించింది.

"నాతోనా? నాతో ఎందుకు?" తన ప్రశ్న తనకే అర్థంలేనట్లు వినిపించింది చంద్రానికి.

"నీకు వంటచేసి పెడతాను. ఇంటి పనులన్నీ చేస్తాను. నువ్వేం చెయ్యమంటే అదే చేస్తాను."

చంద్రం మనస్సు కృతజ్ఞతతో నిండిపోయింది. చంద్రం గౌరి గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఎలా నచ్చజెప్పాలో అర్థం కావటం లేదు. పెట్టెకు తాళంవేసి, బయలుదేరటానికి తయారుగా నిల్చున్న గౌరిని చూసిన చంద్రానికి అంత బాధలోనూ నవ్వు వచ్చింది. సృష్టిలోని మరో జీవికి మనిషికి లభ్యంకానిదీ, లభ్యం అయిందీ ఒక్కటే వరం – అది నవ్వగల శక్తి!

"నువ్వు నాతో రావటం నాకు ఇష్టం లేకపోతే?" చంద్రం గౌరిని పరిశీలనగా చూస్తూ ప్రశ్నించాడు.

"అయినా వెళ్ళిపోతాను."

"ఎక్కడకు?"

"చెరువు దగ్గిరకు."

"చెరువు దగ్గిరకా! ఎందుకూ?" విస్మయంగా ప్రశ్నించాడు చంద్రం.

"అందులోపడి చావటానికి."

"గౌరీ!" చంద్రం అంతరాంతరాల్లో నుంచి వచ్చింది ఆ పిలుపు.

గౌరి చిత్రంగా నవ్వింది. "నువ్వులేని జీవితం నా కెందుకు?" అన్నట్లుంది ఆ నవ్వు.

"నీకు కష్టం కలిగించను. నువ్వు చెప్పినట్లు వింటాను. ఏం చెయ్యమంటే అది చేస్తాను" అంది గౌరి అర్థిస్తున్నట్లు.

"గౌరి!" కృతజ్ఞతతో నిండిన హృదయానికి గౌరిని గాఢంగా హత్తుకున్నాడు చంద్రం. గౌరి తలమీద గడ్డాన్ని అశాంతిగా రుద్దుకున్నాడు. ఆ క్షణంకోసమే ఎదురుచూస్తున్నట్లు గౌరి చంద్రం చేతులకు చుట్టుకుపోయింది.

"అయితే, బయలుదేరు వెళదాం!" అన్నాడు మెత్తగా - గోముగా గౌరిని వదిలివేస్తూ.

గౌరీ కళ్ళలో కోటికాంతులు కదిలిపోతూండడం కనిపించింది చంద్రానికి. సంతృప్తిగా నిట్టూర్చాడు.

తను ఆశించిన అందాన్ని పొందలేకపోయాడు. జీవితం తనను అడుగడుగునా దగా చేసింది.

ఓ నిస్సహాయురాలి జీవితానికి ఓ అర్థం కలిగించగలిగితే తన జీవితం సార్థకమయినట్లే. ఒక అంధుణ్ణి, చేతి ఆసరా ఇచ్చి రోడ్డు దాటించటంలో, ఆకలిగొన్నవానికి పట్టెడు అన్నం పెట్టటంలో, త్రోవతప్పి ఏడుస్తున్న పసిబిడ్డను అక్కునచేర్చి ఓదార్చటంలో, కాలుజారిన స్త్రీకి చెయ్యి అందించటంలో కలిగే ఆత్మానందం - కావ్యానందంకంటే కూడా గొప్పదని చాలా తక్కువమందికి తెలుసు. తను ప్రేమించిన వ్యక్తి ప్రేమను స్వీకరించటంలో కూడా అలాంటి ఆనందమే కలుగుతుందనీ, ఆ తాలూకు అనుభూతి మధురాతిమధురమయినదనీ అనిపించింది చంద్రానికి.

పెట్టె చేత్తో పట్టుకొని తనకంటే ముందు త్వరపడుతున్నట్లున్న గౌరిని ఉడికించాలనిపించిది.

"మరి త్రోవలో నీ చిన్నప్పటి స్నేహితుడు కనిపించి తనతో వచ్చేయమంటే, నన్ను వదిలేసి వెళ్ళిపోతావా?"

చంద్రం ప్రశ్న గౌరిని పెద్ద చిక్కులోనే పడేసింది. ఆ పెద్ద పెద్ద కళ్ళను అందంగా తిప్పుతూ ఆలోచించసాగింది.

"ఊహూఁ - కనిపించడుగా!" అంది, అంతకంటే ఏం జవాబు చెప్పాలో తెలియని గౌరి.

"ఒకవేళ కనిపిస్తాడే అనుకో!"

గౌరి తలెత్తి చంద్రం మొహంలోకి చూసింది. చంద్రం అదోలా కళ్ళుపెట్టి తనను చూడటంతో గౌరి కళ్ళు వాలిపోయాయి. గుండెలు మొదటిసారిగా దడదడ కొట్టుకున్నాయి. సిగ్గుతో కొంచెం తలవంచుకున్న గౌరి బుగ్గలలోకి రక్తం చిమ్మటం చూశాడు చంద్రం. గౌరి కూడా చాలా అందమయిందే!

"కనిపించినా గుర్తు తెలియదుగా?" గౌరి కంఠం కొంచెం వణికింది.

"నీకు ఆ శక్తి ఉంది గౌరీ! అకృత్రిమమైన నీ హృదయం ఎక్కడ వున్నా, ఎందరిలో వున్నా, ఏ రూపంలో వున్నా, నీ వస్తువును గుర్తించగలదు" ఆవేశంగా అన్నాడు చంద్రం.

గౌరికి చంద్రం మాటలు అర్థంకాలేదు. చంద్రం మొహంలోకి వింతగా చూసింది.

"అవును గౌరీ! నువ్వు నీ చిన్ననాటి స్నేహితుణ్ణి చూడగానే గుర్తించావు. ఆ అబ్బాయిని నేనే!" అన్నాడు చంద్రం గౌరి కళ్ళలోకి చూస్తూ.

"నిజంగా?" ఒక్కసారిగా గౌరి చంద్రం చేతులలోకి వాలిపోయింది.

"బయలుదేరు వెళదాం. తాళంవేసి తాళంచెవ్వి ఎవరికైనా ఇచ్చిరా!" అన్నాడు చంద్రం అర్థంగా.

గౌరి మెరుపులా క్షణంలో చంద్రం సూట్‌కేసూ, తన పెట్టే వరండాలో పెట్టింది. చంద్రం బెడ్డింగు తీసుకొని వరండాలోకి నడిచాడు. గౌరి ఇంటికి తాళంవేసి, తాళం చెవ్వితో ఆ గూడెం ఇళ్ళలోకి పరుగెత్తింది. అలా వెళుతున్న గౌరిని కుతూహలంగా చూస్తూ నిల్చున్నాడు. గౌరి కనుచూపు మరుగు కాగానే హేమ కళ్ళముందు మెదిలింది. బాధగా నిట్టూర్చాడు.

గౌరి రాజమ్మకు తాళం చెవ్వి ఇచ్చింది. ఆ ఒక్క క్షణంలోనే రాజమ్మకూ, తనకు కనిపించిన వాళ్ళందరకూ – తను చంద్రం బాబుతో బొంబాయి వెళుతున్నానని చెప్పింది. చంద్రం, తనూ పెళ్ళిచేసుకుంటామని కూడా చెప్పింది. విన్నవాళ్ళు ఆ వార్తను జీర్ణించుకొని అర్థం చేసుకొనేలోపల గౌరి అక్కడలేదు.

రిక్షా స్టేషన్ చేరింది. రాత్రి పదకొండు గంటలవరకూ ఉత్తరాది వెళ్ళే బండి ఏదీలేదు. పదకొండు గంటల బండికి టిక్కెట్లు కొన్నాడు చంద్రం.

గౌరి ప్లాట్‌ఫారం మీద తన చిన్న ట్రంకుపెట్టె మీద కూర్చుని చంద్రం తెచ్చి ఇచ్చిన టిఫిన్ తిన్నది. చంద్రం కాఫీమాత్రం తాగి, సిగరెట్ వెలిగించుకొని అటూ ఇటూ అశాంతిగా తిరుగుతున్నాడు. ఆలోచనలతో బుర్ర ఈగలు ముసురుకున్న బెల్లం గడ్డలా ఉంది.

తను ఆశించింది ఏమిటీ? తనకు లభించింది ఏమిటి? ప్రకాశం కర్మ సిద్ధాంతాన్ని నమ్మడు. రెండు గంటల క్రితం గౌరి తన జీవితంలో ఇంత ప్రధానమైన స్థానాన్ని ఆక్రమిస్తుందనుకున్నాడా? ఏదో అదృశ్య శక్తి ప్రమేయం లేకుండానే ఇలాంటివి జరుగుతాయా? బలిసిన గుర్రంలా మనస్సు హేమవైపుకు పరుగెత్తటానికి ప్రయత్నిస్తూంది. చంద్రం బలవంతంగా దాన్ని అదుపులోపెట్టి గౌరివైపు మళ్ళించటానికి ప్రయత్నిస్తూ సతమత మవుతున్నాడు.

# 31

ఏడ్చి ఏడ్చి హేమ మనస్సు కొంత తేలిక అయింది. ముఖం కడుక్కుని కిందకు వచ్చింది. ప్రసాదరావు మధ్యాహ్నం ఏ కుర్చీలో కూర్చుని ఉన్నాడో, ఇప్పుడూ అదే కుర్చీలో కదలక, మెదలక కూర్చుని చాలా ఆదుర్దాగా ఏవో కాగితాలు తిరగేయటం చూసిన హేమకు ఆశ్చర్యం కలిగింది. హేమ తండ్రి దగ్గరగా వెళ్ళి నిల్చుంది. ప్రసాదరావు చేతి నుంచి కాగితాల కట్ట కింద పడిపోయింది. చెక్కిళ్ళు కన్నీటితో తడుస్తూన్నాయి. హేమ ఆశ్చర్యంతో క్రిందపడి ఉన్న కాగితాలకట్ట తీసి చూసింది. అది చంద్రం రాసిన

నవల తాలూకు స్రష్ట అని తెలుసుకుంది. ఇది చదివేనా నాన్న ఏడుస్తున్నారు? హేమకు నవ్వు వచ్చింది.

"అనూ! మన అమ్మాయి దొరికింది-" అంటూ కుర్చీనుంచి లేచి బయటకు నడుస్తున్నాడు ప్రసాదరావు, పీడకలనుంచి లేచి నడుస్తున్నట్లు. హేమ తెల్లబోయి చూసింది. మరుక్షణంలో గబగబా వెళ్ళి తండ్రిని పట్టుకుంది.

"ఏమిటి నాన్నా ఇది? పుస్తకం చదివి అలా అయిపోయారు?" మందలించింది హేమ. ప్రసాదరావు హేమ ముఖంలోకి పిచ్చిగా చూశాడు.

"నాన్నా! నాన్నా!" అంటూ ఏడుపు స్వరంతో పిలుస్తూ తండ్రిని ఊపింది.

ప్రసాదరావు నిద్రనుంచి లేచినట్లు తెప్పరిల్లి పక్కనే ఉన్న బల్లమీద కూలబడ్డాడు.

"భయపడకమ్మా! వెంటనే ఒక టాక్సీకి ఫోనుచెయ్యి-" ఎలాగో అనగలిగాడు.

హేమ, తండ్రికి మళ్ళీ గుండెనొప్పి వచ్చిందేమోనని వణికిపోయింది. ఫోన్ చెయ్యటానికి పరుగెత్తుకెళ్ళింది. తిరిగివచ్చి తండ్రి పక్కనే కూర్చుంది.

"ఎలా ఉంది నాన్నా?" అంది యేడుపు గొంతుతో.

"నాకేం లేదమ్మా! నాకు బాగానే ఉంది!."

నాన్నకు బాగానే ఉందా! యేమీ లేదా! అయితే మరి టాక్సీ దేనికోసం! అలా అయిపోతున్నారేం? హేమ మనస్సులోని వేసుకున్న ప్రశ్నలకు సమాధానం దొరకలేదు. నిర్జీవంగా కూర్చుని వున్న తండ్రిని అయోమయంగా చూస్తూ కూర్చుంది.

టాక్సీ ఎక్కబోయిన ప్రసాదరావు తూలివడబోయాడు. హేమ పట్టుకొని యెక్కించింది. హేమకూడా యెక్కి కూర్చుంది.

"నేను చాలా అర్జంటు పనిమీద వెళుతున్నాను. నువ్వు వెళ్ళి పడుకో తల్లీ!" అన్నాడు ప్రసాదరావు నీరసంగా.

ఇంత రాత్రిపూట నాన్న - అర్జంటు పని ఏమిటి? హేమకు ఏదో భయంగా ఉంది.

"లేదు నాన్నా! నేనూ వస్తాను" అంది.

హేమను ఒప్పించే ఓపికలేని ప్రసాదరావు మౌనం వహించాడు. హేమ మనస్సులో అనేక ప్రశ్నలు లేస్తున్నాయి. తండ్రి పరిస్థితిని అర్థం చేసుకున్న హేమ తన కుతూహలాన్ని మనస్సులోనే అణచుకుంది.

"కృష్ణా టుబాకో కంపెనీ!" ప్రసాదరావు టాక్సీవాడితో చెప్పాడు నీరసంగా. హేమ ఉలిక్కిపడింది. అక్కడకు యెందుకో? చంద్రానికి ఏ అనర్థమూ వాటిల్లలేదు కదా? తనెంత కఠినంగా ప్రవర్తించింది? చంద్రం చేసిన ఆ ఆఖరు నమస్కారంలో ఎంత విరక్తి, యెంత బాధా మిళితమై ఉన్నాయో! ఒకవేళ చంద్రం ఏదైనా అఘాయిత్యం తలపెట్టలేదు కదా? హేమ పెనుగాలిలో లతలా భయంతో కంపించిపోయింది.

కృష్ణా టుబాకో కంపెనీ ముందు టాక్సీ వచ్చి ఆగింది. హేమ గుండెలు దడదడ లాడిపోతున్నాయి.

"చూడు బాబూ! పైన అనూరాధ అనే ఆమె ఉంటుంది. ప్రసాదరావు పిలుస్తున్నాడనీ, అతను మేడమెట్లు యెక్కి వచ్చే పరిస్థితులో లేడనీ చెప్పి పిల్చుకొనిరా!" ప్రసాదరావు టాక్సీ డ్రైవర్‌కి చెప్పాడు.

హేమ ఆశ్చర్యంగా, అయోమయంగా చూసింది. చంద్రం ప్రమేయం ఏమీ లేనట్లు కనిపించటంతో మనస్సు కొంతవరకు కుదుటపడింది.

గాభరాగా అనూరాధ దిగివచ్చి టాక్సీలోకి చూసింది. హేమను చూసి ఒక అడుగు వెనక్కి వేసింది.

"అనూ! త్వరగా ఎక్కు. మన అమ్మాయి దొరికింది. వెళ్ళి తీసుకొద్దాం!" అన్నాడు ప్రసాదరావు ఉత్సాహంగా.

అనూరాధ అనుమానంగా, ఆశ్చర్యంగా చూసింది. ఆమెకు అది కలో నిజమో తెలియనట్లు నిల్చుండిపోయింధి.

"ఆలస్యం చెయ్యకు అనూ! త్వరగా ఎక్కు- నేను చెప్పేది నిజమే! మన అమ్మాయి దొరికింది." ఆవేశంగా అన్నాడు ప్రసాదరావు.

అనూరాధ మరో ప్రశ్న వేయకుండా టాక్సీ ఎక్కింది. ఆ వార్త ఆమెకు అమిత సంతోషాన్నే కలిగించిందో, దుఃఖాన్నే కలిగించిందో హేమకు అర్థంకాలేదు. కాని, ఆమెకు ఏదో ఉద్వేగం చుట్టివేసి ఉక్కిరి బిక్కిరి చేస్తున్నట్లనిపించిది.

హేమకు ఏదో ఓ డిటెక్టివ్ సినిమా చూస్తున్నట్లనిపించింది. ఈ అనూరాధ ఎవరు? నాన్న 'అనూ' అంటూ అంత చనువుగా పిలుస్తున్నాడేమిటి? మన అమ్మాయి దొరికిందంటా డేమిటి? చంద్రం రాసిన నవలలో ఆ అమ్మాయి జాడలు ఎలా దొరికాయి? హేమ పరిపరివిధాల ఆలోచిస్తూ కూర్చుంది.

కొరిటపాడు వెళ్ళి వాకబుచెయ్యగా గౌరీ - చంద్రం ఊరికి వెళ్ళటానికి స్టేషన్‌కు వెళ్ళారని తెలిసింది.

హేమకంతా అయోమయంగా ఉంది. గౌరి నాన్న కూతురా! చంద్రం గౌరిని తీసుకొని ఊరికి వెళ్ళిపోతున్నాడా! బజారుపిల్ల అంటూ తనూ, నాన్నా కూడా ఏవగించుకున్న ఆ బాలిక తనకు చెల్లెలా! బుర్ర ఆలోచించే శక్తిని కూడా కోల్పోయింది.

ఉలక్కుండా పలక్కుండా కూర్చొని ఉన్న అనూరాధను ఊపుతూ "అనూ!" అని పిలిచాడు ప్రసాదరావు భయపడుతూ.

"నేను బాగానే ఉన్నాను. నాకు అంత త్వరగా ఏమీకాదు. చాలా మొండిప్రాణం!" అన్నది అనూరాధ నిర్లిప్తంగా.

టాక్సీ స్టేషన్‌వైపుకు పరుగెడుతున్నది. అందరి మనస్సులూ అంతకంటే వేగంగా పరిగెడుతున్నాయి.

# 32

రైలు స్టేషన్‌లో గడియారం అర్థగంట కొట్టింది. పదిన్నర గంటలయింది. చంద్రానికి ఆ ఊరినుంచి యెప్పుడు బయటపడదామా అని ఉంది. ఆ గుంటూరు పట్నమంతా కుదించుకు పోయినట్లూ, తను నిల్చోటానికి కూడా చోటులేనట్లూ ఇరుగ్గా

అనిపిస్తుంది చంద్రానికి. అలసటతో బెంచీమీద కూర్చుని గౌరివైపు చూశాడు. గౌరి తననే రెప్పవాల్చకుండా తమాషాగా చూస్తుంది. చంద్రం చూపులతో గౌరి చూపులు కలవగానే సిగ్గుతో ఆమె కళ్ళు వాలిపోయాయి. గౌరి కళ్ళలో కదిలిపోతున్న కలలను స్పష్టంగా చూశాడు. ఆ ముఖంలో అంత వెలుగు ఎక్కడనుంచి వచ్చిందో!

గౌరిని తనకు కాబోయే భార్యగా ఊహించుకుంటూ పరిశీలించి చూశాడు. మామూలు వాయిల్ చీరా, కణుం జాకెట్టూ, మెళ్ళో నల్లని పూసలదండ, చేతికి నీలం మట్టిగాజులు, చెవులకు చౌకబారు రాళ్ళపోగులు - హేమ గుర్తుకు వచ్చి గతుక్కుమన్నాడు. అంతలోనే గౌరిని హేమ అలంకరణలతో ఊహించుకొని చూశాడు. హేమకంటే గౌరే అందంగా ఉన్నట్లు కనిపించింది. గౌరితో తన జీవితాన్ని ఊహించుకుని, తమాషా అనుభూతిని పొందసాగాడు. గౌరి మధ్య మధ్య వార చూపులతోనే దీక్షగా చూస్తూ కూర్చున్న చంద్రాన్ని చూస్తూ, సిగ్గుతో మొగ్గలా ముడుచుకుపోతూ ఆ చిన్న పెట్టెమీద ఒదిగి కూర్చుంది.

"ఏమేవ్ గౌరీ! ఎక్కడికీ ప్రయాణం?" గౌరి ఉలిక్కిపడి చూసింది. నాగేంద్రం విషపునవ్వు నవ్వుతూ పక్కగా నిల్చున్నాడు. గౌరికి అసహ్యం వేసింది. తల పక్కకు తిప్పుకుంది.

"చంద్రంబాబుతో లేచిపోతున్నావా?" వెకిలిగా అన్నాడు నాగేంద్రం.

"ఛీ! నాతో మాట్లాడకు" అంది గౌరి అసహ్యించుకుంటూ.

గౌరి దగ్గరగా నాగేంద్రాన్ని చూసిన చంద్రం గబగబా లేచివచ్చాడు.

"ఓహో చంద్రంబాబుగారా! మా గౌరితో ఉడాయిస్తున్నారా బాబూ? ఇంతకంటే మంచిపిట్ట దొరకలా?"

"నోరుముయ్!" చంద్రం కోపంతో వణికిపోయాడు.

"ఇదిగో ఇప్పుడే మూయిస్తా!" అంటూ బొడ్లోని కత్తిదూసి నాగేంద్రం చెయ్యి పైకెత్తాడు వుసిగా. అంతకంటే వుసిగా, మెరుపులా ఇద్దరిమధ్యకూ వచ్చి నిల్చిన గౌరి పొట్టలోకి దిగిపోయింది కత్తి కసిగా. అది చూసి నాగేంద్రం పారిపోయాడు.

"అమ్మా!" అంటూ ఒరిగిపోతున్న గౌరిని పట్టుకొని కూలబడ్డాడు చంద్రం. గౌరి తలను వళ్ళో పెట్టుకొని ఆమె ముఖంలోకి పిచ్చివాడిలా చూస్తున్నాడు.

"చం....ద్రం..." పెదవులు కదిలి ఆగిపోయాయి. చంద్రం ముఖాన్ని చూస్తూ కళ్ళు అలాగే నిలిచిపోయాయి.

వేడి రక్తంతో చంద్రం ఒడి తడిచిపోతూంది.

"గౌరీ! వెళ్ళిపోయావా? నామీద నమ్మకంలేక వెళ్ళిపోయావా?" అంటూ చంద్రం హృదయం ఆక్రోశించింది. పెదవులు కదలలేదు. చుట్టూ మూగిన జనం కూడా చంద్రానికి కనిపించటం లేదు.

గౌరి ముఖాన్ని తనివితీరా చూస్తున్నట్లు కళ్ళు పెద్దవి చేసుకొని వంగి చూస్తూ కూర్చున్నాడు.

"ఇంతసేపూ నీ కళ్ళలో కదిలిపోతున్న కలలు, ఇంతలోనే కరడు కట్టిపోయాయా? జలపాతంలోని శక్తికంటే తీవ్రంగా ఉరకలు తీస్తున్న నీలోని చైతన్యం గడ్డకట్టిపోయిందా?

ఇంతవరకూ నీ అమాయక బుర్రలో అల్లిబిల్లి తిరిగుతున్న తియ్యటి తలపులు ఎలా ఇగిరిపోయాయి? ఒక్క నిముషం విశ్రాంతి ఎరగని నీ శరీరం ఇలా బిగుసుకు పోయిందేం? జీవితాన్ని ఓ పెద్ద కలలా చూపించి వెళ్ళిపోయావా? ఈ జీవితం నీకేం ఇచ్చింది? ఒట్టి చేదును మాత్రం రుచి చూచి వెళ్ళిపోయావా? సమస్త సృష్టిలోనే అతి ఉన్నత స్థానాన్ని ఆక్రమించుకున్న మానవుల క్రూరత్వానికి బలి అయిపోయావా?"

"ఇంతవరకూ ఉన్నదీ, ఇప్పుడు లేనిదీ ఏమిటి? ఇదేనా జీవితం? దీనికోసమేనా మానవుడు ఇన్ని కలలు కంటాడు? చివరకు మిగిలేది ఏమిటి? మృత్యువే నిజం, జీవితం నిజంలా కనిపించి, మురిపించి, మరపించే అబద్ధం – ఒక పెద్ద అబద్ధం మాత్రమే!"

చంద్రం చెంపలమీదుగా కన్నీరు కారుతూ గౌరి ముఖంమీద పడుతోంది. చంద్రం పిచ్చివాడిలా గౌరి ముఖం మీదకు వంగి నొసట ముద్దుపెట్టుకున్నాడు.

ప్రసాదరావు, అనూరాధ, హేమ చుట్టూ ఉన్న జనాన్ని చీల్చుకుంటూ వచ్చారు.

తూలి పడిపోతున్న అనూరాధను హేమ పట్టుకొని కింద కూర్చోపెట్టింది. అనూరాధకు స్పృహ తప్పిందని తెలుసుకొని, ఆమె తలను ఒడిలో పెట్టుకొని స్థంభించిపోయి కూర్చుంది.

"అమ్మా గిరిజా! ఒక్కసారి కళ్లుతెరిచి చూడమ్మా! మీ అమ్మ వచ్చింది!" అంటూ ప్రసాదరావు ఆవేశంతో గిరిజ తలను ఒడిలోకి తీసుకోబోయాడు.

చంద్రం ఇంకా ఈ లోకంలోకి రాలేదు. తననుంచి గౌరిని యెవరో లాక్కుంటున్నారని మాత్రం లీలగా తోచింది. "పొండి! మీరంతా దూరంగా పొండి! నా గౌరిని మీరెవరూ నానుంచి దూరం చెయ్యలేరు–" పిచ్చివాడిలా అరిచాడు చంద్రం, ప్రసాదరావును బలంగా నెట్టివేస్తూ.

"నేను బాబూ! ప్రసాదరావును. గౌరి నా బిడ్డ! అదుగో వాళ్ళ అమ్మ! హేమ పట్టుకొని ఉంది గౌరి తల్లినే. నా బిడ్డను ఒకసారి తనివితీరా నా ఒడిలోకి తీసుకోనియ్ చంద్రం!" కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు ప్రసాదరావు.

హేమ పేరు వినగానే చంద్రం ఈ లోకంలోకి వచ్చాడు. తను ఎక్కడ వుందీ, ఏ పరిస్థితిలో ఉందీ తెలుసుకున్నాడు. శోకమూర్తిలా కూర్చుని ఉన్న హేమ ముఖంలోకి చూసి అదోలా నవ్వాడు. గౌరిని తన ఒడిలోకి లాక్కోవటానికి ప్రయత్నిస్తున్న ప్రసాదరావు చేతుల్ని బలంగా తోసివేశాడు.

"మీరంతా దూరంగా ఉండండి! గౌరిని ముట్టుకోవద్దు. బజారు పిల్లను ముట్టుకుంటే మీ ఔన్నత్యం మంటగలసి పోతుంది."

ఆ మాటలకు ప్రసాదరావు కుమిలి కుమిలి ఏడ్చాడు.

"చూడండి! అన్నెం పున్నెం ఎరుగని ఈ మొహాన్ని ఒక్కసారి కళ్ళు తెరచి చూడండి! ఈ అమాయకురాలు సమాజానికి చీడపురుగా! అందమైన శరీరంమీద మాయని గాయమా? ఈ ముఖం చూడండి – ఎంత అందంగా, మల్లె పువ్వుకంటే నిర్మలంగా వుందో!"

"చంద్రం! గౌరి నా బిడ్డ! నేను పాపిష్టివాణ్ణి." భోరున ఏడ్చాడు ప్రసాదరావు.

అప్పుడే స్పృహ వచ్చిన అనూరాధ మెల్లిగా లేచి కూర్చుంది. గౌరి దగ్గరకు యాంత్రికంగా వచ్చి ముఖంలోకి పిచ్చిదానిలాచూస్తూ కూర్చుంది. చంద్రం వడినుండి తీసుకొని గౌరి తలను తన వడిలో పెట్టుకొని, ముఖాన్ని ముద్దుపెట్టుకుంది. ఆమె కళ్ళలో నీటిచుక్క కూడా లేదు.

"చూడమ్మా! మీ అమ్మా నాన్నా వచ్చారు. ఒకసారి కళ్ళుతెరిచి చూడు!" ప్రసాదరావు ఆక్రోశించాడు.

"కళ్ళు తెరిచి ఒక్కసారి చూడు గౌరీ! ఎవరు వచ్చారో చూడు! నువ్వు చూడగలిగినన్నాళ్ళూ వీళ్ళు కళ్ళుమూసుకొని నిన్ను చూడలేకపోయారు! తీరా నువ్వు కళ్ళు మూసుకున్న తరవాత వీళ్ళంతా కళ్ళు తెరిచి నిన్ను చూట్టానికి వచ్చారు-" చంద్రం పిచ్చివాడిలా నవ్వాడు.

# 33

ఆ రోజు శరణాలయానికి శంకుస్థాపన జరిగింది. శరణాలయం ముందు "గౌరీ అనాధ శరణాలయం" అనే పెద్ద బోర్డు తగిలించబడింది. శంకుస్థాపన అనూరాధచేత చేయించాడు చంద్రం. ఆనాటికి గౌరి చనిపోయి పదిరోజులు. ఆ గూడెంలో ఉండే వాళ్ళందరికీ అన్నదానం, వస్త్రదానం చేశాడు ప్రసాదరావు.

చంద్రం తన ఆస్తినంతా అనాధ శరణాలయానికి రాసి ఇచ్చాడు. దానికి ప్రకాశాన్ని అధికారిగా నిర్ణయించాడు. గౌరి ఆత్మశాంతికి అంతకంటే తను చెయ్యగలిగిందేమీ లేదనుకున్నాడు చంద్రం.

ఎంత కష్టాన్నయినా అవలీలగా నవ్వుతూ కొట్టిపారవేయగల ప్రకాశం, గౌరి మరణవార్త వినగానే కుమిలి కుమిలి ఏడ్చాడు. ఈ పది రోజులనుంచి ప్రకాశంలోని మార్పును చంద్రం గమనించకపోలేదు. ఎప్పుడూ దిగులుగా, మందకొడిగా కనిపిస్తున్నాడు. ప్రకాశం గౌరిని అంతగా ప్రేమించాడని చంద్రానికి తెలియదు.

"నన్ను క్షమించు ప్రకాశం!" అన్నాడు చంద్రం ప్రకాశం పక్కనే కూర్చుంటూ.

"ఎందుకూ?"

"నీ మనస్సును అర్థం చేసుకోవటానికి ప్రయత్నించలేదు. ఆనాడు గౌరిని నేను అలా తీసుకొని వెళ్ళకుండా ఉంటే ఇలా జరిగివుండకపోను-" చంద్రం స్వరం దుఃఖంతో పూడుకుపోయింది.

"సెంటిమెంటల్ ఫూల్!" అంటూ చంద్రం వీపుమీద చరుస్తూ నవ్వటానికి ప్రయత్నించాడు ప్రకాశం. కాని, ప్రకాశం కళ్ళల్లో నీరు కనిపించకుండా ముఖాన్ని మరోపక్కకు త్రిప్పుకున్నాడు.

"నిజంగా నువ్వు చాలా గొప్పవాడివి" చంద్రం అన్నాడు.

"ఏడ్చావులే. కథరాసే భాష మాట్లాడకు. అయితే, నీలో నిర్ణయాన్ని మార్చుకోవన్నమాట! కనీసం ఓసారి హేమను కలుసుకోవటానికి ప్రయత్నించకూడదూ?"

"క్షమించు ప్రకాశం! నేను కొంతకాలంపాటు దేశాలు తిరగాలి. ఇక్కడ ఉండలేను. బహుశా ఏ ఒక్కచోటకూడా ఉండలేనేమో!"

"అయితే, దేవదాసు కావాలని అన్నమాట ఈ ప్రయత్నమంతా?"

ఇద్దరూ నవ్వటానికి ప్రయత్నించారు. కాని, మొహాలు కాంతి హీనంగా ఉన్నాయి.

ఇంతలో ప్రసాదరావూ, అనూరాధా అక్కడకు వచ్చారు.

"అనూరాధ శరణాలయంలోనే ఉండటానికి నిర్ణయించుకుంది-" ప్రసాదరావు దిగులుగా అన్నాడు.

చంద్రం, ప్రకాశం ఆశ్చర్యపోయారు, ప్రసాదరావు చెబుతున్నది సరిగా అర్థంకాక.

అది గమనించిన అనూరాధ "అవును చంద్రం! ఇంతకాలం నా బిడ్డకోసం జీవించాను. ఇప్పుడు నా బిడ్డలాంటి బిడ్డలకోసం జీవిస్తాను. తల్లిదండ్రుల ప్రేమను నోచుకోని అనాథ బిడ్డలలో అనుక్షణం నా బిడ్డను చూసుకుంటూ జీవిస్తాను. ఈ జీవితానికి ఇంతకుమించి ఇంకేమీ అక్కర లేదు-" అంది ప్రశాంత గంభీర స్వరంతో.

ఆమె మాటలకు ప్రకాశం మొహం వికసించింది. "మనం మన శరణాలయాన్ని ఓ ఆదర్శ ఆలయంలా చెయ్యాలి" అన్నాడు ఉత్సాహంగా.

"చంద్రం! ఒక్కసారి నువ్వు హేమను కలుసుకోకూడదూ?" ప్రసాదరావు అడిగాడు.

"క్షమించండి! సాయంకాలం బండికే ప్రయాణం. నా మనస్సేమీ బాగాలేదు. మళ్ళీ తిరిగి వచ్చినప్పుడు తప్పక వస్తాను-" చంద్రం అక్కడనుంచి పని ఉందని గబగబా వెళ్ళిపోయాడు.

అందరూ చూస్తూ ఉండిపోయారు. ప్రకాశం కూడా చిన్నగా లేచి వెళ్ళిపోయాడు.

"ఇక నువ్వు వెళ్లు ప్రసాద్! నేను పిల్లలకు ఏం కావాలో చూసుకోవాలి-" అంటూ ప్రసాదరావు జవాబుకుకూడా ఎదురుచూడకుండా శరణాలయం లోపలకు వెళ్ళిపోయింది అనూరాధ.

ప్రసాదరావు గాఢంగా నిట్టూర్చి తిన్నగా అక్కడనుంచి కన్నీళ్ళతో కదిలిపోయాడు.

# 34

స్టేషన్‌లో రైలు కదలటానికి సిద్ధంగా వుంది చంద్రం మొదటి తరగతి రైలుపెట్టె వాకిలిముందు నిల్చొని వున్నాడు. చుట్టూ కృష్ణారావూ, కాంతమ్మా, రజనీ, ప్రకాశం, ప్రసాదరావూ నిల్చొని వున్నారు. హేమ దూరంగా నిల్చొని దిక్కులు చూస్తున్నది. వెళ్ళేముందు ఓసారి తనివితీరా హేమను చూడాలనుకున్నాడు చంద్రం. మాట్లాడుతూ వున్న చంద్రం కళ్ళు హేమ కోసమే వెతుకున్నాయి. ఎన్నిసార్లు చూసినా హేమ తన వైపు చూడకపోవటం చంద్రం హృదయాన్ని ఎవరో గట్టిగా పిండుతున్నట్లయింది.

హేమ హృదయం ఇంత కఠినమా! మరి ఇక్కడకు రావాల్సిన అవసరం ఏమిటి? ప్రసాదరావు బలవంతంమీద కాదనలేక వచ్చి వుంటుంది. మొహంలో ఎక్కడా కొంచెం కూడా విషాదం కనిపించటంలేదు. పైగా, కొంచెం సంతోషంగానే ఉన్నట్లు కనిపిస్తుంది. తను ఈ వూళ్ళో ఉండటం కూడా హేమకు ఇష్టం లేదా?

చంద్రం హృదయంలో బాధ సుళ్ళు తిరుగుతోంది. ఆ బాధ తాలూకు ఛాయలు ముఖంలో కనిపించకుండా వుండే ప్రయత్నంలో సతమతమవుతున్నాడు.

అందరి ముఖాల్లో విషాదం దాండవిస్తూంది. మనస్సులో అందరికీ చంద్రం ఆఖరు నిముషంలోనైనా మనస్సు మార్చుకుంటే బావుండునని వుంది. కాని అతనిని బలవంతం చేసి ఆపే శక్తి ఎవరిలోనూ లేదని వారందరకీ తెలుసు. చివరికి హేమ చెప్పినా వినడనే నిర్ణయానికి వచ్చి అందరూ మౌనం వహించారు.

రజని వెక్కివెక్కి ఏడుస్తూంది.

"ఎందుకమ్మా ఏడుస్తావు? మళ్ళీ త్వరలోనే వస్తాగా? నీ పెళ్లి నేను లేకుండా జరుగుతుందా?" రజనిని దగ్గరకు తీసుకొని తలమీద నిమురుతూ ఓదార్చాడు చంద్రం.

"చంద్రం!" కృష్ణారావు గొంతు దుఃఖంతో పూడుకుపోయింది.

"ఏం అన్నయ్యా!" వస్తున్న దుఃఖాన్ని దిగమింగుకుంటూ ప్రశ్నించాడు చంద్రం.

"నీ ఆస్తినంతా శరణాలయానికి రాసిచ్చావు. కనుక ఇక్కడ నీకేం లేదనుకోకు. నువ్వు నాకు ముందు కొడుకులాటివాడివి; ఆ తరవాతే తమ్ముడివి. ఈ చేతులతో పెంచాను. రజనితోపాటు నా ఆస్తిలో సగం నీదే. నీకు డబ్బు కావాల్సివచ్చినప్పుడల్లా రాస్తూవుండు. ఎప్పుడు నీ మనస్సుకు కొంచెం శాంతి దొరుకుతుందో అప్పుడు వచ్చేసి మా మనస్సులకు కూడా శాంతిని కలిగించు." కృష్ణారావు గొంతు పూడుకుపోయింది. పైపంచెతో కళ్ళు అద్దుకున్నాడు.

చంద్రం ఉద్రేకంగా అన్నను చుట్టేశాడు.

"టైమయిపోయిందిరా చంద్రం!" ప్రకాశం అన్నాడు.

చంద్రం వదినకు నమస్కరించాడు.

కాంతమ్మ కళ్ళు వాచి ఉన్నాయి.

"బాబూ చంద్రం! నువ్వెక్కడవున్నా కనీసం నెలకొక ఉత్తరం అయినా రాస్తూండు. వీలయినంత త్వరగా వచ్చేయ్. మేమందరం చచ్చిపోయామనుకోకు," అన్నదామె.

"వదినా!" ఉబికి వస్తున్న దుఃఖంతో అన్నాడు చంద్రం.

బండి కూత వేసింది.

నీళ్ళు చిమ్ముతున్న కళ్ళతో ఓ క్షణం ప్రకాశం కళ్ళలోకి చూసి, ఒక్కసారిగా కౌగిలించుకున్నాడు చంద్రం. స్నేహ దేవత సాకారరూపాన్ని ధరించింది.

పెట్టెలోకి ఎక్కబోతూ హేమను ఒక్కసారి చూడాలనీ, కళ్ళతోనే వీడ్కోలు ఇవ్వాలనీ గంపెడంత ఆశతో చంద్రం కళ్ళు హేమకోసం వెతికాయి. ఆమె తన ముఖాన్ని మరోవైపుకు తిప్పుకొని నిల్చొని వుంది. చంద్రం హృదయాన్ని ఏదో క్రూరజంతువు పళ్ళతో నములుతున్నట్లు బాధపడ్డాడు. నిట్టూర్చి పెట్టెలోకి ఎక్కి, కిటికీ దగ్గిరకువచ్చి, తల బైటకుపెట్టి, చివరిసారిగా కళ్ళనీళ్ళతో అందరి దగ్గరా మౌనంగానే శెలవు తీసుకున్నాడు. బయటకు వంగి హేమ కోసం చూశాడు. కనిపించలేదు బండి ప్లాటు ఫారం నుంచి కదిలింది, చంద్రం కళ్ళు హేమకోసం చివరిసారిగా వెతికాయి. బండి ప్లాటుఫారం దాటి వెళ్ళిపోయింది.

చంద్రం బరువు గుండెలతో బెర్తుమీద కూలబడి, అంతలోనే ఉలిక్కిపడి లేచి నిల్చున్నాడు. తను చూస్తున్నది కలో - నిజమో తేల్చుకోలేక అరచేత్తో, నుదురు రుద్దుకున్నాడు.

ఎదురుగా హేమ తలవంచుకుని అపరాధిలా కూర్చుని ఉంది!

"నన్ను క్షమించు చంద్రం! నీ హృదయంలోని స్థానాన్ని చేతులారా పోగొట్టుకున్నాను. కనీసం ఈ పాదాలలోనైనా నాకు ఆశ్రయం కావాలి!" హేమ చంద్రం పాదాలమీదకు ఒరిగిపోయింది. చంద్రం ఈ లోకంలో లేడు. అతనికి ఇదంతా నిజం అనిపించటంలేదు. కొయ్యబారిపోయి నిల్చున్నాడు.

"నన్ను స్వీకరించవా చంద్రం? నన్ను క్షమించలేవా? ఒకమాట చెప్పు, ఇప్పుడే రైల్లోనుంచి దూకి శాశ్వతంగా నీ జీవితంనుంచి వెళ్ళిపోతాను."

చంద్రం వంగి హేమను లేవదీసి మొహంలోకి- "నిజంగా నువ్వు హేమవేనా?" అన్నట్లు చూశాడు.

"నన్ను అలా చూడకు చంద్రం! నిన్ను నేను ఎంతగా ప్రేమిస్తున్నానో నీకు అర్థంకాదు." చంద్రం గుండెలమీద వాలిపోయి వెక్కి వెక్కి ఏడ్వసాగింది హేమ.

చంద్రం హేమను గాఢంగా గుండెలకు హత్తుకొన్నాడు. చంద్రంలో ఆవేశం కట్టలు తెంచుకుంది.

"నేనంటే నీకు అసహ్యం వెయ్యటంలేదూ?" ఆర్ద్రంగా అడిగాడు చంద్రం - హేమ కన్నీళ్ళను తుడుస్తూ.

"అలా అనకు చంద్రం! నిన్ను అసహ్యించుకోవటం అంటే నన్ను నేను హింసించుకోవటమే. నా మనస్సు ఎంత చిత్రహింసను అనుభవించిందో నీకు అర్థంకాదు."

హేమ చేతినుంచి ఓ కాగితం కవరు కిందపడింది. చంద్రం వంగి తీశాడు. బర్తుమీద కూర్చుంటూ "ఏమిటిది హేమా?" అని అడిగాడు.

"తీసి చూడు."

తీసి చూశాడు. తను రాసిన నవల స్క్రిప్టు! చంద్రం ప్రశ్నార్థకంగా హేమ కళ్ళలోకి చూశాడు. హేమ హాయిగా నవ్వింది.

"చదివావా?" యేదో ఆలోచిస్తూ అడిగాడు చంద్రం.

"చదివాను కాబట్టే కళ్ళు తెరిచాను. లేకపోతే, నేను ఏమయిపోయి ఉండేదాన్నో!" చంద్రం పక్కగా కూర్చుంటూ అంది హేమ.

"పేరు ఏం పెట్టమంటావు?"

"అడవిమల్లె!"

చంద్రం ఉలిక్కిపడి హేమ కళ్ళలోకి చూశాడు. ఆమె కళ్ళలో నీరు తిరగటం గమనించాడు. కిటికీనుంచి బయటకు చూశాడు. మనోహరమైన ప్రకృతి సౌందర్యం- దూరంగా కొండలు, దట్టమైన అడవి, వినీలాకాశంలో మబ్బులతో దోబూచూలాడుతున్న చంద్రుడు, పిండారబోసినట్లున్న వెన్నెల.... అన్నింటిలో గౌరి ప్రతిరూపమే గోచరించింది

"మీరంతా మంగళప్రదంగా పూజించే మాంగల్యం నా కంఠానికి ఉరితాడైంది. ప్రతినిమిషం నాకు నరకాన్నే చూపించింది. దాన్ని త్రెంచిపారేశాను. నరకయాతననుంచి విముక్తురాల్నయ్యాను. నేను చేసింది తప్పా?"

# ఉరిత్రాడు

కరుణ గడపలో కాలుపెట్టింది.

ఇంట్లోకి పరుగెత్తి తల్లిని కావిలించుకొని మనసారా ఏడ్వాలనుకుంది. మనసులో బరువును దించేసుకోవాలనుకుంది.

ఆమె లోలోపల కుమిలిపోతూవుంది. గొంతులో దుఃఖం గూడు కట్టుకుంది. గుండెలో ఆవేదన కరుడుకట్టింది. తల్లి చల్లని స్పర్శతో కరుడుకట్టిన ఆ ఆవేదన కరిగి కన్నీరుగా మారాలి. కళ్ళల్లో నదులు పొంగి కట్టలు తెంచుకోవాలి. అప్పుడే ఆ గుండె తేలిక పడుతుంది. మనసుకు శాంతి లభిస్తుంది. శరీరానికి విశ్రాంతి దొరుకుతుంది.

తన బాధ గుర్తించేవారు లేరు. తన జీవితానికి ఆశ్రయం లేదు. సానుభూతి చూపేవారు లేరు. ఉన్న ఆశ్రయం ఊడిపోయింది. నిలబడటానికి చారెడు నేల లేదు. అందుకే కరుణ ఒకనాడు తనదే అయిన, ఇప్పుడు తనదికాని ఆ ఇంటికి వచ్చింది.

కరుణ చేతిలో సూట్‌కేసు వుంది.

ఆమె గడపలోనే నిలబడిపోయింది. అడుగు ముందుకు పడలేదు.

ఆ ఇల్లు తనకు చేతులు చాపి స్వాగతం పలుకుతుందనుకుంది. ఆ ఇల్లు తనను ఓదారుస్తుందనుకుంది.

కాని ఆ ఇల్లు వింతగా కన్పించింది.

కొత్తగా కన్పించింది.

బోసిగా కన్పించింది.

పరాయి ఇల్లులా కన్పించింది.

ఆ ఇల్లు కరుణను వింతగా చూస్తోంది. బోసిగా చూస్తోంది. అపరిచిత వ్యక్తిని చూసినట్టు చూస్తోంది. వింత వ్యక్తిని చూసినట్టు చూస్తోంది.

ఇంటిముందు ఎవరూ లేరు, వసారా ఖాళీగా వుంది.

కుర్చీలు మాత్రం ఉన్నాయ్.

కుర్చీలకు నోరు లేదు. కుర్చీలకు గుండె లేదు. కుర్చీలకు స్పందన లేదు.

అవి అలా వుండటం కరుణకు బాధ కలిగించింది.

పసితనంలో కరుణ వాటిలో చైతన్యాన్ని చూసింది. అవి ఆమెతో ఆడుకున్నాయి. మాట్లాడాయి. అవి ఈ రోజు నిశ్చేతనంగా కన్పిస్తున్నాయి.

కరుణ మనసు కలుక్కుమంది.

కరుణ గడపలోనే వుంది.

ఆమె చేతిలో సూట్‌కేసు వుంది.

గుండెలో గుబులు వుంది.

కరుణ ఇంటిని చూసింది. పరీక్షగా చూసింది.

ఈ ఇంట్లో తాను పుట్టింది. ఈ ఇంట్లోనే పాకింది. నిలబడటం నేర్చుకుంది. మాటలు నేర్చుకుంది. గౌనులో గుజ్జన గూళ్ళు ఆడింది.

ఓణీలో బొమ్మల పెళ్ళిళ్ళు చేసింది ఈ ఇంట్లోనే! తాడుతో స్కిప్పింగ్ ఆట ఆడింది ఇక్కడే.

ఇక్కడే తనకు పెళ్ళి జరిగింది. ఈ ఇల్లు తనది కాదని తెలిసింది. మరో ఇంటికి వెళ్ళింది. అది తన ఇల్లే అనుకుంది. కాని, అదికూడా తన ఇల్లు కాదని తెలుసుకుంది. ఇప్పుడు తనకు ఇల్లు లేదు. అందుకే తనది కాదని తెలిసీ ఈ ఇంటికి వచ్చింది. ఈ ఇల్లు తనకు స్వాగతం పలుకుతుందనే ఆశతో రాలేదు. కాని, రాక తప్పలేదు.

మరో వ్యక్తి, తను ఏనాడూ చూడని వ్యక్తి. భర్తగా తన జీవితంలోకి వచ్చాడు. తనను మసిచేశాడు. నుసిచేశాడు. నిరాశ్రయను చేశాడు. నడిబజార్లో నిల్చోబెట్టాడు.

కరుణ కళ్ళు తుడుచుకుంది.

తనకు ఆదరంలేని ఆ ఇంట్లో అడుగు పెట్టడానికే నిర్ణయించుకుంది. అంతకంటే గత్యంతరం లేదు. ఆ ఇంటిని కాక మరే ఇంటిని ఆశ్రయిస్తుంది? మరెవరు తనను గుండెల్లో దాచుకుంటారు?

కరుణ అడుగు ముందుకు వేసింది.

"కరుణా!"

కేక వినిపించింది.

తన పేరే! తననే!

కాని ఆ కంఠంలో మార్దవం లేదు

సానుభూతి లేదు.

ఆ ధ్వని కరుకుగా వుంది. గద్దించినట్టు వుంది.

కరుణ తలెత్తి చూసింది.

ఎదురుగా, గుమ్మంలో తల్లి నిల్చుని వుంది.

తల్లి తల్లిలా కన్పించలేదు.

ఒక ఆడదానిలా - తరతరాల సంప్రదాయాలను జీర్ణించుకున్న అసంఖ్యాకమైన ఈ పవిత్ర భారతదేశంలోని ఆడవాళ్ళలో ఒక ఆడదానిలా కన్పించింది.

ఆ తర్వాత అలా కాకుండా కన్పించలేదు.

గుడిమీద బొమ్మలా కన్పించింది.

కరుణ నిగ్రహించుకుంది. దుఃఖాన్ని దిగమింగింది.

అయినా కన్నీటి చుక్కలు టప టపా రాలేయి.

కరుణ అడుగు ముందుకు వెయ్యలేదు.

తల్లి గడప దాటలేదు. గడప అవతలే వుంది.

తల్లీ కూతుళ్ళు - ఎదు రెదురుగా - ఒకరి కొకరు పరిచయం లేనట్టు నిల్చున్నారు.

వారి మధ్య ఏ బంధమూ లేనట్టు నిల్చున్నారు.

ఎవరూ మాట్లాడలేదు - క్షణాలు దొర్లాయి - నిముషాలు గడిచాయి.

కరుణకు గొంతు పెగలడం లేదు.

తల్లికి మాట ఒక పట్టాన పెగిలి రావడం లేదు.

"వదిలేసి వచ్చేసినట్టేనా?" ముందు తల్లే మాట్లాడింది. ఆ కంఠంలో మాతృత్వపు మాధుర్యం లేదు. ఆ మాటల్లో సానుభూతి లేదు.

కరుణకు అక్కడినుంచి పారిపోవాలని వుంది. భూమి బద్దలైతే అందులోకి ఇమిడి పోవాలని వుంది.

కాని భూమి బద్దలు కాలేదు, ఆమె అక్కడనుంచి కదల్లేదు.

కరుణకు మెట్లు కన్పించాయి. గబగబా మెట్లెక్కింది.

పెట్టె పడేసింది. కుర్చీలో కూలబడింది.

"చెప్పవేమే? ఏమైంది?" తల్లి అడుగుతూ వుంది.

కరుణ కొంగు ముఖాన కప్పుకొని బావురుమంది. నిండుకుండ బద్దలైంది. ఎంతో కాలంగా గట్లవెనకే నిలిచిన కన్నీరు గట్లు దాటింది.

శారద ఏడుపు విన్నది. పరుగెత్తుకొచ్చింది.

రాతి బొమ్మలా నిలబడి ఉన్న కరుణను శారద చూసింది. దేవతలా వచ్చిన శారదను కరుణ చూసింది.

ఆమె గుండెల్లో వరద పొంగింది. ఉవ్వెత్తుగా లేచింది. శారదను కావిలించుకుంది. పసిపిల్లలా శారదను అంటుకుపోయింది.

శారద కరుణను ఓదార్చింది. కరుణ కన్నీటితో శారద భుజం తడిసిపోయింది. శారద రెండు చేతుల్తోనూ కరుణ ముఖాన్ని తన ముఖం దగ్గరకు తీసుకుంది.

కరుణ ముఖం ఎఱ్ఱవారింది. కళ్ళు ఉబ్బి ఉన్నాయ్.

కరుణ శారద కళ్ళల్లోకి చూసింది.

శారద కళ్ళలో కరుణ కన్పించింది.

"వదినా!" అంటూ మళ్లీ శారదను చుట్టుకుపోయింది. కుమిలి కుమిలి ఏడ్వసాగింది.

ఎంతకాలంగా నిలిచివుందో ఆ దుఃఖం? ఇప్పుడు నిలవడం లేదు.

శారద కరుణ వీపుమీద చెయ్యివేసి నిమురుతూ వుంది. ఓదార్చే ప్రయత్నం చేస్తూంది.

కట్టలు తెగిన చెరువూ, కావాల్సినవారిని చూసిన దుఃఖమూ ఇంకి పోయేదాకా ఆగవు.

తల్లి కరుణ ఏడుపును చూస్తూ నిల్చుంది.

కూతురు ఏడుస్తూంది. గుండె చెరువయేట్టు ఏడుస్తూంది. గుండెలు అవిసిపోయేలా ఏడుస్తూంది.

తల్లి గుండె బద్దలైంది. దుఃఖం పొంగివస్తూంది. అయినా, ఆమె ఏడవడం లేదు. నిగ్రహించుకుంటూ వుంది. ఆమె తల్లి. అయినా ఆమె కర్కశంగా వుంది. కఠినంగా వుంది. కూతురు ఏదో కానిపని చేసిందని ఆమె నమ్మకం - కాదు, భయం! కరుణను వంటరిగా చూసినప్పుడే ఆమె కుప్పకూలింది.

భర్తను వదిలి రావడం మహా పాతకం. పాపం సంగతి ఎలావున్నా లోకులు ఏమంటారు? కాకుల్లా పొడుస్తారు. భర్త ఎటువంటివాడైనా భార్య భరించాలి. భరించలేకపోతే చచ్చిపోవాలి. అంతేగాని, పుట్టింటికి రాకూడదు. ఆడపిల్ల అత్తింటిది కాగానే పుట్టింటితో బంధాలు తెగిపోతాయి. అవిడకు పుట్టిల్లు పరాయి ఇల్లే కావాలి.

కరుణ పరాయి ఇంటికి వచ్చినట్టే అనిపించింది తల్లికి.

నెలవులు తప్పినప్పుడు మిత్రులే శత్రువులౌతారట!

కరుణ నెలవు తప్పి వచ్చిందని తల్లి అభిప్రాయపడింది. జుట్టుకు సంస్కారం చేస్తాం. గోళ్ళను చేతికి వున్నంతవరకు ఇష్టపడతాం. ఆ జుట్టూ, గోళ్ళు, తమ తమ నెలవులు తప్పాక దూరంగా పారేస్తాం, ఆడదాని బతుకూ అంతే! అత్తింటినుంచి తెగ తెంపులు చేసుకుని వచ్చిన ఆడదానిని గౌరవించరు- ఇవీ ఆ తల్లి ఉగ్గుపాలతోపాటు జీర్ణించుకున్న అభిప్రాయాలు.

అల్లుడు మంచివాడు అనే నమ్మకం ఆమెకూ లేదు.

సుబ్బారావు తిరుగుళ్ళు ఆమెకు తెలియనివి కాదు. అయినా, మగ మహారాజులు తిరుగుతారు. కాని, ఆడదాని బతుకు అరిటాకు లాంటిది. మగవాడు తుమ్మముల్లు. ఎలాగయినా అరిటాకుకే నష్టం!

తను మాత్రం పెళ్ళయిన కొత్తలో ఎన్ని బాధలు పడలేదూ? తన భర్త ఎన్ని తిరుగుళ్ళు తిరగలేదు. తనను ఒక మనిషిగా చూశాడా? అయినా తను పెదవి కదిపిందా? నోరు మెదిపిందా? వయసు మళ్ళాక ఆయన స్వభావం మారిపోలేదూ? అప్పుడే తను పుట్టింటికి పోయివుంటే? తన తల్లి తనను గొంతుపిసికి బావిలో పారేసి వుండేది. ఆ భయంతోనే తను అత్త ఇల్లు వదల్లేదు. కరుణకు తనంటే భయం లేదు. లక్ష్యం లేదు. అందుకే బరితెగించింది. మొగుణ్ణి వదిలేసి వచ్చేసింది.

కరుణ ఇంకా ఏడుస్తూనే వుంది. తల్లి వింటూనే వుంది. తల్లి వీధి వాకిలివైపు చూసింది. నలుగురైదుగురు అమ్మలక్కలునిల్చుని వున్నారు. గుసగుసగా చెప్పుకుంటున్నారు.

తల్లికి తల నరికేసి నట్లయింది. కూతురు ఏడుస్తున్నందుకు కాదు - జనం చూస్తున్నందుకు! చప్పున లేచింది. దబ్బున తలుపు మూసింది. గొళ్ళెం పెట్టి వచ్చింది. తలుపేస్తుంటే ఇరుగుపొరుగువాళ్ళు గోడలమీద నుంచి చూడటం కన్పించింది. తనను పూడ్చి పాతరపెట్టి నట్టనిపించింది.

"నలుగురూ చూస్తుంటే ఏడవాలని ఉందేమో? లోపలకు వెళ్ళండి!" కోడలుతో అన్నది.

ఆమె గొంతు జీరపోయింది. దుఃఖం పొంగి వచ్చింది.

శారద కరుణ భుజంమీద చెయ్యివేసి లోపలకు తీసుకెళ్ళింది.

కరుణ దుఃఖం కూడా చాలావరకు తగ్గింది. ఎక్కిళ్లు మాత్రం వస్తున్నాయి

కరుణ ముఖం కడుక్కొని తుడుచుకుంటూంటే మెడ బోసిగా వుండటం చూసింది శారద.

మంగళసూత్రం లేదు!

శారద గుండె దడ దడలాడింది. ఏదో జరగరానిది జరిగినట్టనిపించింది. వేల సంవత్సరాలుగా ఆడదానికి వున్న సూత్రం ఏదో తెగిపోయినట్టు అనిపించింది. మొగుడున్న ఆడదాన్ని సూత్రం లేకుండా ఆమె ఎప్పుడూ చూడలేదు. మంగళసూత్రం మనుగడకు చిహ్నం. మంగళసూత్రం సమాజంలో ఒక గౌరవానికీ, ఒక స్థానానికీ చిహ్నం, మొగుడుంటే చాలు - వాడు ఎలాంటివాడయినా - ఎక్కడవున్నా - ఆడది మంగళసూత్రాన్ని కాపాడుకుంటుంది. తాను ఎలాంటిదయినా మంగళసూత్రం చాటున. బతకాలనుకుంటుంది. ఆ సూత్రం మంగళకరమైంది. మంగళప్రదమైంది. మంత్రాలతో మెడకు కట్టబడింది. అందుకే దాన్ని మంగళసూత్రం అన్నారు.

అటువంటి మంగళసూత్రం లేదు కరుణ మెళ్లో!

శారద ఆశ్చర్యానికి అంతులేదు.

"కరుణా! మెళ్లో మంగళసూత్రం లేదు. చూసుకో!" పొరపాటున జారిపోతే చూసుకోలేదేమో అన్న అర్థంలో అడిగింది.

"పోయిందిలే వదినా!" అతిమామూలుగా అన్నది కరుణ.

శారద విస్మయంగా కరుణ ముఖంలోకి చూసింది.

ఆ ముఖంలో ఎటువంటి భావం లేదు. తువ్వాలు మంచం కోడుమీద వేసినట్టు మాట్లాడింది. అక్కడినుంచి కదిలి వెళ్ళిపోయింది.

కరుణ మంచంమీద కూలబడింది. ఆమెకు తల దువ్వుకోవాలనిపించడం లేదు. అద్దంలో చూసుకోవాలని లేదు. అద్దంలో తను కనిపించనని ఆమె భయం. మరో రూపం కన్పిస్తే తను భరించగలదా అనే సందేహం!

శారద పసుపుకొమ్ము కట్టిన నూలుతాడు తెచ్చింది.

"కరుణా! ఇది కట్టుకో, బోసి మెడతో ఉండరాదు!" తాడు అందించింది.

కరుణ ఆ తాడు అందుకోలేదు.

"వదినా! అది కట్టినవాడే తెంచుకుపోయాడు. ఇంకా ఈ పసుపుకొమ్మూ ఈ తాడూ ఎందుకూ?"

"అలా అనకూడదమ్మా కరుణా! లేనివాళ్ళు ఎలాగూ దీనికి నోచుకోరు. ఉన్నదానివి- పసుపూ కుంకం కాదనకూడదు."

"వదినా! నీ పిచ్చిగాని, కలవని మనసుల్ని ఈ తాళ్ళు కలుపుతాయా? మంగళవాద్యాలు మోగుతూండగా, మంత్రాలు వల్లిస్తూండగా, అగ్నిసాక్షిగా పదిమంది ముందు ఆయన నా మెళ్ళో మాంగల్యం కట్టాడు. ఆ మంత్రాలలో బలంలేదు. ఆ అగ్ని

సాక్ష్యం ఇవ్వలేదు. ఆ తాడులో గట్టితనం లేదు. తాళి కట్టినవాడికే దాని మీద నమ్మకం లేదు. బంగారం కోసం తెంపుకున్నాడు. అతనికి లేని నమ్మకం దానిమీద నాకెందుకు వదినా? వద్దు, నాకాతాడు వద్దు!"

కరుణ వాదంలో బలంవుందో లేదో కాని, ఆమె మాటల్లో బలంవుంది. బరువుంది. ఆ మాటలు ఎక్కడో నేర్చుకున్నవికావు. ఎవరో చెబితే వచ్చినవికావు. స్వానుభవంమీద గుండెల్ని బద్దలు చేసుకుంటూ వచ్చిన మాటలవి. లోకాన్ని చూసి నేర్చుకున్నవి కావు. శాస్త్రాల్లో చెప్పినవి అంతకంటే కాదు.

నడిచిన దారిలో నడవడం సులువు.

శారదకు తెలిసింది నడిచినదారి మాత్రమే. అందుకే ఆమె కరుణతో వాదించలేకపోయింది. ఆమెకు తెలిసిందల్లా ఒక్కటే- అలా వుండకూడదని, అది నమ్మిన వాళ్ళకే ఆమె చెప్పగలదు. "ఎందుకుండకూడదు?" అని ప్రశ్నిస్తే ఆమె జవాబు చెప్పలేదు. ఆ మాటకొస్తే ఆమే కాదు – మంత్రాలు చదివి మంగళసూత్రాలు కట్టించే ఏ శాస్త్రిగారూ చెప్పలేరు. విశ్వాసం! నమ్మకం! అంతే- అవన్నీ నమ్మకాలకు సంకేతాలు మాత్రమే!

కరుణ విశ్వాసం సడలింది. నమ్మకం పోయింది – కాదు – తెగిపోయింది.

తాళిలోని బంగారం కోసం అది కట్టినవాడే తెంపుకొని వెళ్ళిపోయాడు. కట్టినవాడికే దాని మీద విశ్వాసం లేదు. కట్టించుకున్న వాళ్ళ కెందుకుండాలి? బంధం తెగిపోయింది.

మళ్ళీ పసుపుకొమ్ముతో అది అతుకుతుందా? విరిగిన పాలు పెరుగవుతుందా? విరిగిన మనసు మళ్ళీ అతుకుతుందా? అసాధ్యం!

శారదకు ఆ విషయాలు తెలుసుకోవాల్సిన అవసరం రాలేదు. అందుకే కరుణ ప్రశ్నకు సమాధానం తెలియలేదు. కాని వెంటనే సీత, సావిత్రి గుర్తుకు వచ్చారు.

"కష్టాలు కలకాలం వుంటాయా కరుణా? సీతమ్మవారు చెరలు అనుభవించలేదా? సావిత్రి కష్టాలు పడలేదా?" అని అడిగింది శారద. అవి ఆమెకు దొరికిన వరదలో పూచికపుల్ల ఆధారాలు.

"వదినా! ఇది సీతల సావిత్రుల కాలం కాదు. ఆ రాజ్యాలు లేవు. ఆ అడవులు లేవు, ఆ మహత్యాలు లేవు. ఆ శాపాలు లేవు. అవన్నీ కథలు. జీవితం కథ కాదు వదినా! ఆదర్శం వాస్తవం కాదు. నిజంగానే మంత్రాలతో కట్టిన ఆ తాళిబొట్టుకు ఆ ప్రభావం వుంటే మమ్మల్ని కలిపే వుంచేది. పుటుక్కున తెంచేది కాదు. వదినా! నా మనసు బాగా లేదు. కొంచెంసేపు పడుకుంటాను.." అంటూ మంచంమీద పడుకొని కళ్ళు మూసుకుంది కరుణ.

శారదకు ఏం మాట్లాడాలో తోచలేదు.

ఆకాశం కూలిపడుతున్నట్టూ, పర్వతాలు బద్దలవుతున్నట్టూ, మహావృక్షాలు కూకటివ్రేళ్ళతో విరిగి పడుతున్నట్టూ, భూమి కుంగిపోతున్నట్టూ అనిపించింది శారదకు.

శారద అక్కడినుంచి గబగబా బయటికి వెళ్ళిపోయింది.

తల్లి కనకమ్మకు విషయం తెలిసింది. నడుం విరిగినట్టు చతికిలబడిపోయింది. నెత్తి బాదుకుంది.

"నా సంసారం బజారు పాలయిందమ్మో! నా పిల్లల గతి ఏం కానమ్మో! ఆయన అదృష్టవంతుడు! ఏమీ చూడకుండా పోయాడు! ఇవన్నీ చూట్టానికే నేను బతికున్నానురా భగవంతుడా!...." అంటూ శోకాలు ప్రారంభించింది.

కనకమ్మ భోరున ఏడ్వడం లేదు. పెద్దగా ఏడిస్తే నలుగురూ వింటారని భయం. సన్నగా శోకాలు తీస్తూంది.

కరుణ మంగళసూత్రం కట్టుకోలేదని కాదు కనకమ్మ బాధ. కరుణ భర్తను వదిలేసినందుకు కూడా కాదు ఆమె బాధ. వదిలేసి పుట్టింటికి వచ్చినందుకు. మచ్చలేని తన వంశానికి మచ్చ ఏర్పడినందుకు. తను నలుగుర్లో తలెత్తుకు తిరగలేనందుకు. కొడుకు పరువు ప్రతిష్టలకు కళంకం ఏర్పడినందుకు.

కరుణ కళ్ళు మూసుకొని ఏ బావిలో దూకినా కనకమ్మకు ఇంత బాధ కలిగేదికాదు. కూతురు చచ్చిందని ఏడ్చేది. బాధపడేది. సానుభూతి చూపేవారితో 'నా కరుణ పౌరుషం గలదమ్మా! బాధలు భరించలేక నా చిట్టితల్లి నిలువునా ప్రాణం తీసుకుంది. దానికి ఎంత అభిమానం! చెడి పుట్టింటికి రాలేకపోయింది!" అని గర్వంగా చెప్పుకోనేది అంత బాధలోనూ!

కాని ఇది అలా కాదే? జనం కాకుల్లా పొడుస్తారే? తనేం సమాధానం ఇస్తుంది? కూతురు మొగుణ్ణి వదిలేసి వచ్చిందని చెబుతుందా?

తన సంసారాన్ని గురించీ, వంశాన్ని గురించీ గొప్ప గర్వం తల్లి కనకమ్మకు.

"నీది దొడ్డ సంసారమమ్మా!" అని ఎవరైనా అంటే పొంగిపోతుంది. పరువూ ప్రతిష్టా అంటే ప్రాణం అయినా ఇస్తుంది.

భర్త పోయినా సంసారాన్ని గుట్టుగా గుంజుకొచ్చింది. "ఎంతమంది అయితే కనకమ్మ అవుతారు!" అనిపించుకుంది.

కనకమ్మ కళ్లు మండుతున్నయ్. గుండెలు మండుతున్నయ్. కడుపు కాలిపోతోంది.

ఎలాగయినా కరుణను పంపించివెయ్యాలి. నయాన వినకపోతే భయాన అయినా పంపించాలి.

కనకమ్మ దిగ్గున లేచింది. కరుణ వున్న గది ముందుకు వచ్చింది. తలుపులు లోపల్నుంచి వేసివున్నాయ్.

తలుపు తట్టింది కనకమ్మ.

జవాబు లేదు.

తలుపులు పిచ్చిగా బాదడం మొదలుపెట్టింది.

జవాబు లేదు.

తల్లి మనసు కీడు శంకించింది. మంటలు చల్లారాయి. దుఃఖం ముంచుకొచ్చింది. కరుణను పిల్చింది. బతిమాలింది.

జవాబు లేదు. కరుణ తలుపులు తెరవలేదు.

శారద పరుగున వచ్చింది.

ఆమె గుండె దడదడలాడింది.

కరుణ మానసిక పరిస్థితిని కళ్ళారా చూసింది. ఏ అఘాయిత్యం చేసుకుందోనని అనుమానం వచ్చింది.

"కరుణా! కరుణా!" పిచ్చిగా అరుస్తూ తలుపులు బాదింది.

కరుణ జవాబివ్వలేదు. తలుపు తియ్యలేదు.

కనకమ్మ ఏడుస్తూ కూలబడింది.

"నా బిడ్డో!" అంటూ తల బాదుకుంటూ ఏడుస్తూంది.

శారద తత్తరబిత్తరలాడుతూంది. ఏం చెయ్యాలో తోచడం లేదు –

అంతలో విశ్వనాథం ఇంట్లో అడుగు పెట్టాడు. అక్కడి దృశ్యం చూసి ఆశ్చర్యపోయాడు. అయోమయంగా చూస్తూ నిల్చున్నాడు.

శారద భర్త దగ్గరకు వచ్చింది.

"కరుణ వచ్చింది. తలుపు తియ్యడం లేదు. లోపలనుంచి తలుపులు వేసుకుంది." ఆదుర్దాగా అన్నది శారద.

కనకమ్మ కొడుకుని చూసింది. కొడుకుమీద పడి బావురుమని ఏడ్చింది.

"కరుణ గదిలో వుంది బాబూ! ఏం అఘాయిత్యం చేసుకుందో, తలుపు తియ్యడం లేదు." ఏడుస్తూ అంది.

విశ్వనాథం తల్లిని విడిపించుకొని గది ముందుకు దూకాడు.

అతనికేమీ తోచడంలేదు. అంతా అయోమయంగా వుంది.

"అమ్మా కరుణా!" విశ్వం తలుపు తట్టాడు.

తలుపు తెరుచుకుంది.

కరుణ శోకమూర్తిలా నిలబడింది.

జుట్టు చిందర వందరగా వుంది.

కళ్ళు బాగా ఉబ్బి వున్నాయి. కాని, ఆ కళ్ళలో కన్నీరు లేదు. పొడిగా వున్నాయి. ఎర్రగా వున్నాయి.

"చచ్చిపోయేంత పిరికిదాన్ని కాను. మీరేం భయపడకండి. నన్ను కాసేపు వంటరిగా వుండనివ్వండి" అని తలుపు వేసుకుంది కరుణ.

ముగ్గురూ మూసిన తలుపులకేసి చూస్తూ నిల్చున్నారు.

"కరుణ చాలా బాధపడ్తూ వుంది. దాన్ని ఎవరూ ఏమీ అనకండి." భార్యనూ, తల్లినీ ఉద్దేశించి అన్నాడు విశ్వనాథం.

కనకమ్మకు గుండె చెరువయింది. కన్నీరు పెల్లుబికింది.

గతాన్ని నెమరువేసుకుంటూ పడుకుంది.

# 2

శేషయ్య తాసిల్దారుగా పనిచేసేవాడు. బాగానే సంపాదించేవాడు. అయితే అతని సంపాదనలో అధికభాగం గుర్రపు పందాలకూ, చెడు తిరుగుళ్ళకూ అయిపోయేది.

కనకమ్మ భర్తను 'అదేమని' ఏనాడూ అడగలేదు.

అడిగినా ప్రయోజనం ఉండదని ఆమెకు తెలుసు. అయినా అప్పుడప్పుడు భర్తచేత దెబ్బలు తినక తప్పేదికాదు.

ఆ దెబ్బలు ఆమె శరీరానికేగాని మనసుకు ఏనాడూ తగల్లేదు...

భర్త - భరించేవాడు. ఆ మాత్రం కొట్ట తగడా! భర్తకు కొట్టే హక్కు భార్యకు పడే బాధ్యతా ఉన్నాయి.. కనకమ్మ అభిప్రాయాలు - అవి పెద్దలు ఆమెకు చెప్పిన అభిప్రాయాలు.

పెద్దకొడుకు ఇంటర్ రెండో సంవత్సరం చదువుతున్నాడు.

రెండోది ఆడపిల్ల. పేరు కరుణ. స్కూలు ఫైనలు చదువుతూ వుంది.

మూడోది కస్తూరి. తొమ్మిదో క్లాసులో వుంది.

ఆ సంవత్సరమే కనకమ్మకు రారాని కష్టంవచ్చింది. భర్త శేషయ్య యాక్సిడెంట్‌లో చనిపోయాడు.

ఇన్‌సూరెన్స్ నుంచి కూడా శేషయ్య లోన్స్ తీసుకున్నాడు. ఫామిలీ పెన్షన్‌తోనే కుటుంబాన్ని అతికష్టం మీద నెట్టుకొచ్చింది కనకమ్మ.

కొడుకు విశ్వనాథం బి.ఏ. పాసయి, ఉద్యోగ ప్రయత్నాల్లో వున్నాడు.

పెద్ద కూతురు కరుణ స్కూలు ఫైనలు తప్పింది. మళ్ళీ పరీక్షలు రాయలేదు. రెండోకూతురు శ్యామల స్కూలు ఫైనలు పాసయింది. కాని, కాలేజీలో చేరలేదు.

కరుణ కస్తూరి కంటే రెండేళ్ళు పెద్ద. కరుణ బాగా నలుపు. నల్ల రాతిని మలిచిన విగ్రహంలా వుంటుంది. పరీక్షగా చూస్తే చక్కని కనుముక్కు తీరనీ, ఆ ముఖంలో ఎంతో ఆకర్షణ వుందనీ తెలుస్తుంది. ఆమె చిరునవ్వు చల్లని వెన్నెలలా వుంటుంది. నవ్వితే నవరత్నాలు రాలేట్టు వుంటుంది. కాని, ఆమె సాధారణంగా నవ్వదు. గంభీరంగా వుంటుంది.

ఇవన్నీ ఆమెను పరీక్షగా చూసినవాళ్ళకే కన్పిస్తాయి.

కాని, మామూలుగా చూసేకళ్ళకు కొట్టొచ్చినట్టు ఆమె నలుపురంగు మాత్రమే కనిపిస్తుంది. ఆమెలోని అందాలు కన్పించవు.

కస్తూరి తెల్లగా వుంటుంది. మెరిసిపోతూ వుంటుంది. ఆమె కళ్ళు లోతుగా వుంటాయి. ముక్కు తీరుగా వుండదు. నవ్వితే పెద్దగా అందంగా వుండదు. ఆ నవ్వు వెన్నెలలా వుండదు, అయినా ఎప్పుడూ నవ్వుతూనే వుంటుంది.

ఇవన్నీ ఆమెను పరీక్షగా చూసినవాళ్ళకే కనిపిస్తాయి.

కాని, మామూలుగా చూసే కళ్ళకు ఆమె పచ్చటి రంగు మాత్రం కన్పిస్తుంది. ఆమె లోపాలు కన్పించవు.

చాలామంది కస్తూరిని అపరంజి బొమ్మ అంటారు.

తల్లికి మాత్రం ఏపుగా పెరిగిపోతున్న వాళ్ళ శరీరాలు కన్పిస్తున్నాయి. ఆ శరీరాల్లో పిట పిటలాడుతున్న యవ్వనం కన్పిస్తూ వుంది. కనకమ్మ మనసు వాళ్ళను ఎదురుగా చూస్తుంటే తరుక్కుపోతుంది.

తన కూతుళ్ళు అందంగా లేకుండా వున్నా బాగుండేది. ఆ వయసే అటువంటిది. హాయదారి వయసు. మనసు నిండా కోరికలే! బుర్ర నిండా ఆలోచనలే! క్షణిక ఆవేశాలకు లోనై తన కూతుళ్ళు ఏదైనా పొరపాటు పనిచేస్తే ఇంకేమయినా వుందా? తమది మచ్చలేని వంశం! ఏమన్నా జరిగితే తను ఇంత విషంతాగి చావాల్సిందే!

తనకు ఎనిమిదోఏట పెళ్ళయింది. పదకొండు నిండీ నిండక ముందే అత్తింటికి కాపరానికి వచ్చింది. "ఎంతమంది అయితే కనకమ్మలాంటి కోడలు అవుతుంది" అని అనిపించుకుంది.

ఇద్దరు కూతుళ్ళూ గుండెల మీద కుంపట్లలాగున్నారు. తల్లి పెళ్ళిళ్ళు చెయ్యాలని పరితపించిపోతుంది. కాని, చెయ్యలేకపోతూవుంది. రోజు రోజుకూ కట్నాల బెడద ఎక్కువైపోతూవుంది. కొడుక్కు ఇంకా ఉద్యోగం రాలేదు. ఇల్లు గడవటమే అంతంత మాత్రంగా వుంది. పాముల్ని పక్కలో పెట్టుకుని పడుకున్నట్టుంది ఆమె మానసిక స్థితి.

కూతుళ్ళు ఎదురుగా కనిపిస్తే చిర్రెత్తుకొస్తుంది. పగవాళ్ళు ఇంట్లో వున్నట్టు అనిపిస్తూ వుంది. వాళ్ళు పొరపాటుగా కూడా వీధిగుమ్మంలో అడుగుపెట్టకూడదు. వెయ్యి కళ్ళతో కాపాడుతుంది. వాళ్ళు కొంచెం అలంకరించుకుంటే చాలు- పిచ్చి కోపంతో తిడుతుంది.

కరుణ తల్లి మనసు తెలుసుకుని మసలుకుంటుంది.

కస్తూరికి అలంకరణలంటే ఇష్టం. వున్నదాంట్లోనే అందంగా అలంకరించుకోవడానికి ప్రయత్నిస్తుంది. పౌడరు రాసుకుంటుంది. కాటుక పెట్టుకుంటుంది. తల దువ్వుకొని చెవుల మీదుగా వదులు వదులుగా జడ వేసుకుంటుంది.

మనసు బాగున్నరోజు కూతుర్ని చూసుకొని కనకమ్మ మురిసిపోతుంది.

ఆ రోజు కనకమ్మ మనసు బొత్తిగా బాగాలేదు.

కస్తూరి ఎదురుగా కన్పించింది, తల దువ్వుకొని పెరట్లో పూసిన మల్లెపూలు పెట్టుకుంది. కనకమ్మకు వళ్ళు మండిపోయింది.

"ఏమిటా భోగం వేషాలు? పెళ్ళి కావాల్సినదానివి. ఇప్పుడు ఆ పువ్వులు పెట్టుకోకపోతేనేం?" కేకలు వేసింది కనకమ్మ.

కస్తూరికి దుఃఖం వచ్చింది. తల్లిమీద కోపం వచ్చింది.

"పూలు పెట్టుకోవడం కూడా తప్పేనా?" ఎదురు ప్రశ్న వేసింది.

కస్తూరి అప్పుడప్పుడు తల్లికి ఎదురు తిరుగుతుంది. ఎదురు ప్రశ్నలు వేస్తుంది. కరుణ అన్నీ మౌనంగా భరిస్తుంది. తల్లిని అర్థంచేసుకోవడానికి ప్రయత్నిస్తుంది.

"తప్పా- తప్పున్నరా! ముందా పువ్వులు తీసేస్తావా లేదా?" అరిచింది కనకమ్మ.

కస్తూరి తల్లి ముఖంలోకి చూసింది. తల్లి కళ్ళలో చింతనిప్పుల్ని చూసింది.

కస్తూరి కంఠంలో దుఃఖం దూకింది. కళ్ళల్లోకి రోషం పొంగింది. జుట్టు కూడా ఊడి వచ్చేలా పూల చెండులాగి నేలకు కొట్టి అక్కడి నుంచి దొడ్లోకి పారిపోయింది.

బాదం చెట్టు కింద కూర్చుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

కనకమ్మ కూతుర్ని తిట్టింది కానీ, తీరా కూతురు పూలు నేలకు కొట్టి వెళ్ళి పోతుంటే ఏడుపు వచ్చింది.

తను పాపిష్టిది. తన నిస్సహాయతను వాళ్ళమీద చూపిస్తుంది.

కన్నబిడ్డ తల్లో పూలు పెట్టుకుంటే తను సహించలేకపోతూంది.

కనకమ్మకు దుఃఖం వచ్చింది. గదిలోకి పోయి ఏడ్చింది. చనిపోయిన భర్తను తల్చుకొని ఏడ్చింది.

కరుణ ఏడుస్తున్న కస్తూరి దగ్గరకు వచ్చింది, చేతిలో పని వదిలిపెట్టి. "ఎందుకే ఏడుస్తున్నావ్?" అంటూ చెల్లెలి పక్కగా కూర్చుంది.

"ఛీ! వెధవ బతుకు? మంచి బట్టలు లేవు. నగలు లేవు. పూలు పెట్టుకుంటే కూడా తిడుతుంది" అన్నది కస్తూరి బెక్కుతూ.

"వూరుకో! అమ్మకు నీ మీద కోపమా చెప్పు!"

"కోపం లేకపోతే ఎందుకట్లా తిడుతుంది? తల దువ్వుకుంటే కూడా చూడలేదు" అన్నది కస్తూరి కోపంగా.

"అమ్మను అలా అనకూడదు."

"అది అసలు అమ్మే కాదు. అమ్మ అయితే అలా తిడుతుందా?"

"అమ్మకు మన పెళ్ళిళ్ళ గురించి దిగులు. ఎంతో బాధ పడిపోతూంది."

"ఎందుకు దిగులు? చేసెయ్యొచ్చుగా?"

కరుణ దిగులుగా నవ్వింది. చెల్లెలి అమాయకత్వం చూసి నవ్వింది:

"ఎలా చేస్తుందే? కట్నం ఇచ్చే తాహతు లేదు. అమ్మ కుమిలి కుమిలిపోతుంది చూడటంలేదూ?" అన్నది కరుణ.

"కాస్త శుభ్రంగా వుంటే, కాటుక పెట్టుకున్నా సహించలేదు. అదేం అమ్మ?"

"బంగారు బొమ్మలా వున్నావు. అలంకరించుకుంటే ఇక చెప్పనే అక్కర్లేదు. ఎవడైనా నీమీద కన్నేస్తాడనీ, నిన్ను లేపుకుపోతాడనీ అమ్మకు భయం!" అన్నది కరుణ నవ్వుతూ.

"చీ పో! నీకన్నా అందంగా వున్నానా?"

"నాకన్నా అందంగా వున్నావే! నేను నల్లగా మసిబొగ్గులా వుంటాను." కరుణ దిగులుగా అంది.

"అమ్మకు నా పెళ్ళిగురించి కాదు - నీ పెళ్ళిగురించే దిగులు."

కరుణ చెల్లెలి ముఖంలోకి చూసింది.

"నీ పెళ్ళి కానిదే నాకెలా పెళ్ళవుతుందీ?" అన్నది కస్తూరి.

కరుణ మనసు చివుక్కుమంది.

"నేను నల్లగా వుంటాను. నాకు పెళ్లికావడం కష్టమే. అందుకే నేను అసలు పెళ్లే చేసుకోను. నీ పెళ్లే ముందు అవుతుంది" అన్నది కరుణ.

"అమ్మ అందుకు ఒప్పుకుంటుందా ఏం? నీ పెళ్ళి అయిందాకా నాకూ ఈ నరకం తప్పదు," అన్నది కస్తూరి, తప్పంతా కరుణదే అయినట్టు.

కరుణ మనసు కలుక్కుమంది. చెల్లెలి ముఖంలోకి చూస్తూ వుండిపోయింది.

అంతలో తల్లి కేక వినిపించింది.

"ఎక్కడ చచ్చారే? పొయ్యి రాజెయ్యలేదు. అబ్బాయి వచ్చే వేళయింది. ఇంత ఉడకేసి పడేస్తారా లేదా?"

కస్తూరి .కదల్లేదు.

"అమ్మ కోప్పడుతుంది. పద వెళ్దాం!" అన్నది కరుణ.

"నేను రాను, నువ్వెళ్ళు!" విసురుగా అంది కస్తూరి.

కరుణ లేచి వంటింట్లోకి వెళ్ళింది.

విశ్వనాథం ఆఫీసునుంచి వచ్చాడు. రెండు రోజుల క్రితమే ఉద్యోగంలో చేరాడు. యల్. డి. సీ. గా ఒక ఆఫీసులో ఉద్యోగం దొరికింది.

తల్లి కొడుక్కు ఎదురుగా వచ్చింది. కాఫీ అందించింది.

"బాబూ! ఒకసారి మామయ్యగారింటికి వెళ్లివస్తారా! ?"

విశ్వనాథం తల్లి ముఖంలోకి విస్మయంగా చూశాడు.

కనకమ్మకు అన్న చేస్తున్న వ్యాపారం ఏమిటో తెలియదు. కాని, బాగా సంపాదించాడని మాత్రం తెలుసు. రామనాథం హైదరాబాద్‌లో వుంటున్నాడు. పెద్దగా రాకపోకలు లేవు. చెల్లెలి కాపరం గురించి అతను ఏనాడూ పట్టించుకోలేదు. బావమర్ది పోయాడన్న వార్త విని వచ్చాడు ఐదేళ్లనాడు. వెళ్తూ వెళ్తూ ఒక వెయ్యి రూపాయలు ఏడుస్తున్న చెల్లెలి చేతిలో బలవంతంగా పెట్టి వెళ్ళిపోయాడు. అంతే - మళ్లీ రాలేదు.

అంత ఐశ్వర్యంతో తులతూగుతూ తమ గురించి పట్టించుకోని మేనమామ అంటే విశ్వానికి గౌరవం లేదు.

అభిమానవతి అయిన కనకమ్మ ఏనాడూ అన్నను ఆశ్రయించలేదు. అందుకే విశ్వానికి ఆశ్చర్యం కలిగింది.

"ఎందుకమ్మా ఇప్పుడు?"

"ఆడపిల్లలు గలవాళ్ళం, అభిమానపడితే ఎలారా! అన్నయ్యకు ఇద్దరు మగపిల్లలున్నారు. ఒక పిల్లను చేసుకొన్నా కొంత బరువు తగ్గుతుంది."

విశ్వనాథం తల్లిని పిచ్చిదాన్ని చూసినట్టు చూశాడు.

"ఏమిట్రా అలా చూస్తున్నావ్?"

"ఏమిటమ్మా నీ పిచ్చి! మామయ్య అంతస్థు మర్చిపోయావా? ఇంతకాలం మనం చచ్చామో బతికామోకూడా పట్టించుకోని మావయ్య తన కొడుక్కు మన అమ్మాయిని చేసుకుంటాడా?"

"నోరుతెరిచి అడిగితే కాదంటాడా? మామయ్యకు నేనంటే చాలా అభిమానం రా! పనుల్లో తీరక రాడు గాని..."

"నువ్వు అక్కడికి వెళ్ళడం నాకిష్టం లేదమ్మా!" మధ్యలోనే అందుకొని అన్నాడు విశ్వం.

"అయినా ఒకసారి వెళ్ళి వస్తానురా! చూసి చాలా రోజులైంది" అన్నది కనకమ్మ.

"నీ ఇష్టం!" అన్నాడు విశ్వనాథం అయిష్టంగా.

అన్నయ్య స్వభావమే అంత! దూరంగా వుంటే పట్టించుకోడు. ఎదురుగా వుంటే ఎంత ఆదరిస్తాడో! ఒక రక్తం పంచుకు పుట్టినవాళ్ళం! అన్నయ్యకు తనమీద ప్రేమ వుండదా? తను నోరుతెరచి అడిగితే కాదంటాడా? అయినా, తన పిల్లలకేం తక్కువని కాదంటాడు? ఇద్దరూ బొమ్మల్లా వుంటారు. పెద్దది నలుపు. చిన్నది బంగారు బొమ్మలా వుంటుంది. చిన్నదాన్ని ఎవడైనా కళ్ళకద్దుకొని చేసుకుంటాడు. పెద్దదే పెద్ద సమస్య అయికూర్చుంది. అన్నయ్యను తన కొడుక్కు పెద్దదాన్నే చేసుకోమని అడగాలి.

వదిన ఏమంటుందో? వదినకు అతిశయం జాస్తి! కనీసం ఆయన పోయినప్పుడైనా రాలేదు. అన్నయ్య వచ్చాడు. రెండు రోజులున్నాడు. ఎంత ప్రేమగా చూశాడో తనను ఆ రెండు రోజులూ!

కనకమ్మ రిక్షా దిగింది. రిక్షావాడికి డబ్బిచ్చింది.

చిన్న రేకు పెట్టె తీసుకొని లోపలకు నడిచింది. రామనాథం కొత్తగా కట్టుకున్న ఇంటిని మొదటిసారిగా చూసింది.

గేటులోనే నిల్చుండిపోయింది, . ఆ పెద్ద బంగళాను ఆశ్చర్యంగా చూస్తూ.

లోపలకు నడుస్తూ రెండువైపులా వున్న పూలచెట్లను చూస్తూ వుంది.

అన్నయ్యకు ఇంత పెద్ద ఇల్లు వుందా? తన చిన్నప్పుడు సినిమాలో చూసిన బంగళాలా వుంది.

కనకమ్మకు తనకు అర్హతలేని చోటుకు ఎక్కడికో వచ్చినట్టు అన్పించింది.

కారిడార్‌లో కట్టివున్న ఆల్సేషియన్ డాగ్ 'గయ్యి'న లేచింది. కనకమ్మ అదరిపడింది. కాలు ముందుకు పడలేదు.

"ఎవరూ?" అంటూ పనికుర్రాడు నరసిమ్మ బయటికి వచ్చాడు.

కనకమ్మ వేషం చూసీ, చేతిలో వున్న రేకుపెట్టె చూసీ ఏదో యాచించడానికి వచ్చిన మనిషి అనుకున్నాడు నరసిమ్మ.

"ఏయ్! తిన్నగా లోపలకే వచ్చేశావే? పద! పద!" తరుముతున్నట్టే అన్నాడు.

కనకమ్మకు నవ్వొచ్చింది. వీడికి తనెవరో తెలియదు. తెలిస్తే...

"నీకే చెబుతుంది! నడువు బయటికి!"

"ఆ కుక్కను పట్టుకో, రామనాథం లేడా? వుంటే పిలువు, కనకం వచ్చిందని చెప్పి." వాడి ముఖంలోకి చుర చుర చూస్తూ అన్నది.

నరసిమ్మ తగ్గి ప్రశ్నార్థకంగా చూశాడు.

"సుందరి వుందా?" అన్నది.

"లేదమ్మా! ఇద్దరూ లేరు" అన్నాడు వినయంగా నరసిమ్మ.

కనకమ్మ సంతృప్తిగా నవ్వింది.

"ఆ కుక్కను పట్టుకో!"

నరసిమ్మ కుక్కను పట్టుకున్నాడు. కనకమ్మ లోపలకు వెళ్ళింది. నరసిమ్మ లోపలకు వచ్చాడు. వాడికి ఇంకా సందేహంగానే వుంది.

హాల్లోవున్న సోఫాలో కూర్చుంది. పక్కగా రేకుపెట్టె పెట్టింది. ఆ సోఫాలూ, కుర్చీలూ – ఆ భవనం – దేవేంద్రభవనంలా కన్పించింది.

కాళ్ళ కింద వున్న తివాసీని చూసింది. ఎర్రగా వుంది. మెరిసిపోతూ వుంది. మధ్యగా తెల్లటి పద్మం వుంది. ఆ పద్మం మీదే తన కాళ్ళు ఉన్నాయి. తన కాళ్ళ మురికికి ఆ పద్మం మాసిపోతుందనిపించి కాళ్ళు పక్కకు తీసుకుంది.

తలపైన వేలాడుతున్న చాండ్లియర్‌ను చూస్తూ కూర్చుంది. ఆ గాజు ముక్కల్లో కన్పించే రంగుల్ని చూస్తూ కూర్చుంది.

అన్నయ్య ఇంత ధనవంతుడా?

"ఎవర్రా నరసిమ్మా, వచ్చిందీ?" వంటమనిషి కేక పెట్టింది.

"ఎవరో వచ్చిచూడు!" అన్నాడు నరసిమ్మ.

వంటమనిషి రాజమ్మ బయటికి వచ్చింది. దాదాపు పదిహేనేళ్ళుగా రాజమ్మ అ ఇంట్లో పని చేస్తూ వుంది. రాజమ్మకూ ఎవరూ లేరు! ఆ ఇల్లే తన ఇల్లుగా భావించడం నేర్చుకుంది. రామనాథం పిల్లల్ని ఆమే పెంచిందని చెప్పాలి.

చూపు సరిగా ఆనని రాజమ్మ "ఎవరూ?" అంటూ దగ్గరగా వచ్చింది.

"నేను రాజమ్మా, ! కనకాన్ని! అన్నయ్య లేడూ!"

"నువ్వాతల్లీ! ఎంత కాలానికి వచ్చావ్?" అంటూ ఆప్యాయంగా పలకరించింది రాజమ్మ.

"మన అయ్యగారి చెల్లెలురా నరసిమ్మా!" అంతవరకూ అక్కడే ఆమెను నమ్మలేనట్టు నిల్చున్న నరసిమ్మతో చెప్పింది రాజమ్మ.

నరసిమ్మ కళ్ళు పెద్దవిచేసుకొని రాజమ్మను చూశాడు.

"లెగండమ్మా! స్నానం చెయ్యండి. భోజనం చేద్దురు" అన్నది రాజమ్మ.

"ఇప్పుడేం భోజనం రాజమ్మా! కాఫీ ఇవ్వు. స్నానంచేసి కాసేపు పడుకుంటాను. రాత్రంతా నిద్రలేదు" అన్నది కనకమ్మ బడలికగా.

రాజమ్మ కాఫీ తెచ్చి ఇచ్చింది. కాఫీ తాగుతూ హాలంతా కలయజూసింది.

ఇల్లు ఇంద్రభవనంలా వుంది. రాజభవనంలా వుంది.

కాదు – ఇంద్రుడు ఖాళీచేసిన ఇంద్రభవనంలా వుంది.

రాజులేని రాజభవనంలా వుంది.

ఏదో లోపం వుంది. ఏదో వెలితిగా వుంది.

"వదిన కనిపించదేం?"

కనకమ్మ ప్రశ్నకు రాజమ్మ వెంటనే సమాధానం చెప్పలేదు.

"క్లబ్బుకు వెళ్ళారు." చిన్నగా అన్నది.

"ఎప్పు డొస్తుంది?"

"తెలియదు, ఏ అర్ధరాత్రికో వస్తారు."

రాజమ్మ కంఠంలో అపశృతి వుంది.

కనకమ్మ చివ్వన తలెత్తి చూసింది.

"వదిన రోజూ క్లబ్బుకు వెళ్తుందా?"

"ఆఁ."

"రోజూ ఎప్పుడో అర్ధరాత్రికే వస్తుందా?"

"అవును" అన్నట్టు తల ఊపింది రాజమ్మ.

కనకమ్మకు అన్నమీద జాలివేసింది. వదినమీద కోపం వచ్చింది.

"ఆయన నెలకు ఇరవై రోజులు ఊళ్లోనే వుండరు. వున్న పది రోజుల్లో.-ఐదు రోజులు రాత్రిళ్ళు ఇంటికి రారు!" రాజమ్మ కంఠంలో బాధ తొంగిచూసింది.

కనకమ్మ అయోమయంగా చూసింది.

"పిల్లలు?"

"వాళ్ళు హాస్టల్లో వుంటారు. డబ్బు అవసరం అయితే ఇంటికి వస్తారు." ఎవరి దారి వారిదే అన్నట్టు చెప్పింది.

కనకమ్మ మనసు కలచినట్టయింది.

ఇది ఇల్లా? ఎందుకిలా ఒకరి కొకరు సంబంధం లేకుండా బ్రతుకుతున్నారు? వీళ్ళకు ఏం తక్కువని? అసలు వీళ్లకు ఇంత ఇల్లెందుకు?

అన్నీ వుండటం కూడా ఒక సమస్యేనా? ఏ సమస్యలూ లేకపోవడం కూడా జీవితానికి లోపమా?

"స్నానం చెయ్యండమ్మా! ఇదిగో, ఈ పక్కగది గెస్టు రూం. అందులో వుండండి" అంటూ పెట్టె తీసుకెళ్ళి ఆ గదిలో పెట్టింది రాజమ్మ.

కనకమ్మ ఆ గదిలోకి వెళ్ళింది. ఆ గదిలో ఆ రేకుపెట్టె ఇమడటం లేదు. ఆ సామాను మధ్య అది దిష్టిచుక్కలా వుంది.

బాత్‌రూంలోకి వెళ్ళింది. స్నానం చేసింది. మంచంమీద పడుకుంది. పరుపు మెత్తగా వుంది. రాజమ్మ వచ్చి ఫాన్ వేసింది. చల్లని గాలి వస్తూంది. నిద్ర ముంచుకొచ్చింది.

బాగా రాత్రి అయింది.

రాజమ్మ వచ్చి కనకమ్మను లేపింది.

లైట్లు వెలుగుతున్నయ్. పైన పంకా తిరుగుతూంది. బయట కుక్క ఎవర్నో చూసి మొరుగుతోంది. ఎదురుగా రాజమ్మ నిల్చునివుంది. కనకమ్మకు తను ఎక్కడవుందీ తెలిసింది. దిగ్గున లేచి కూర్చుంది.

"అన్నయ్య వచ్చాడా?"

"లేదమ్మా! వస్తారో లేదో! మీరు భోజనం చెయ్యండి, పొద్దుపోయింది" అన్నది రాజమ్మ.

కనకమ్మ భోజనం ముందు కూర్చుంది.

రాజమ్మ కనకమ్మ ఎదురుగా కూర్చుంది.

కనకమ్మకు ఎన్నో అడిగి తెలుసుకోవాలని వుంది. వంటమనిషిని ఇంటిగుట్టు అడగడం మంచిదికాదని ఊరుకుంది.

అంత ఖరీదైన భోజనం ఆమెకు సహించడం లేదు. అంత రుచికరమైన భోజనం ఆమె నోటికి హితకరంగా లేదు. అన్న సంసారాన్ని మరోరకంగా ఊహించుకొని వచ్చింది. మనసంతా ఏదోగా అయింది.

బయట గేటు తెరచిన శబ్దం అయింది. కారు లోపలకు వచ్చిన శబ్దం. డోర్ తెరిచి వేసిన శబ్దం!

"అయ్యగారు వచ్చినట్టున్నారు" అన్నది రాజమ్మ.

వాకిట్లో కుక్క ముందు రెండు కాళ్లూ ఎత్తి పైపైకి ఎగురుతూ వుంది. 'కుయ్ కుయ్' మంటుంది. తన మనసులోని సంతోషాన్ని తెలియజేస్తూవుంది.

"ఊ చాలు! చాలు టైగర్!" అంటూ రామనాథం టైగర్‌ను లాలించాడు. కొంతసేపటికి అది శాంతించింది.

కనకమ్మ లోపలకు వచ్చిన అన్నయ్యను చూసింది. రామనాథం చెల్లెల్ని చూశాడు. నమ్మలేనట్టు చూశాడు ఓ క్షణం. కళ్ళలో మెరుపు కన్పించింది. "ఎప్పుడొచ్చావమ్మా?" ఆప్యాయంగా దగ్గిరకు వచ్చి పలకరించాడు.

అన్నయ్యలో పెద్ద మార్పులేదు. తనే జుట్టంతా నెరిసి ముసలిదానిలా అయింది. అన్నయ్య తనకు తమ్ముడిలా ఉన్నాడు. అన్నయ్యకు తనంటే ప్రేమే! తనమాట కాదనడు. ఒకరక్తం పంచుకు పుట్టినవాళ్ళు. అంతమాత్రం ఆదరించడా?

"నాలుగ్గంటలకు వచ్చాను."

"ఉత్తరం ముక్కయినా రాయలేదేం, స్టేషన్‌కు కారు పంపించేవాణ్ణి" అన్నాడు రామనాథం.

కనకమ్మ అన్న మాటకు పొంగిపోయింది.

రామనాథం వాష్‌బేసిన్‌లో చెయ్యి కడుక్కొచ్చి చెల్లెలి ఎదుటగా డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాడు.

"ఇల్లు కట్టాక ఇదేగా మొదటిసారి రావడం?"

ఇంతకాలానికి కన్పించిన చెల్లెల్ని అన్న వెయ్యాల్సిన మొదటి కుశలప్రశ్న ఇదేనా? కనకమ్మ ముద్ద ఒక్కసారిగా మింగింది.

"అవును" అంది.

"రెండు లక్షలకు పైనే అయింది. ఇల్లంతా చూశావా?"

కనకమ్మ మనసు ఎలాగో అయింది.

"ఇంకా చూళ్లేదు."

రామనాథం తన వ్యాపారం గురించి చెబుతున్నాడు. తను ఎంత బిజీగా వుంటాడో చెబుతున్నాడు.

"నిన్ను చూసి చాలాకాలం అయింది కదూ! ఈ వ్యాపార గొడవల్లో బొత్తిగా తీరిక చిక్కడం లేదు" అన్నాడు.

కనకమ్మ మౌనంగా వింటూవుంది.

"బాగున్నావా?" అని అడగలేదు.

"పిల్లలు ఎలా వున్నారు?" అనలేదు.

"ఇల్లు ఎలా గడుస్తుంది?" అడగలేదు.

అంతస్థులు ఆప్యాయతలకు అడ్డు నిలుస్తాయా? అడిగితే బాధ్యతలు నెత్తిన పడ్తాయనుకుంటున్నాడా?

"పిల్లలు బాగున్నారా?" చివరికి అడిగాడు పొడిపొడిగా.

"బాగానే ఉన్నారు." అంతకంటే పొడిగా వుంది జవాబు.

"విశ్వం ఉద్యోగం చేస్తున్నాడా?"

"చేస్తున్నాడు. వదిన ఇంకా రాలేదేం?" మాట మార్చింది కనకమ్మ.

"వస్తుంది ఎప్పుడో తనకు ఇష్టమైనప్పుడు." ఆ కంఠంలో బాధలేదు. కాని, ఏదో ఉంది.

"పిల్లల్ని హాస్టల్లో ఎందుకు పెట్టావ్?"

"నేను ఊళ్లో ఉండను. మీ వదిన ఇంటిపట్టున ఉండదు. ఆమెకి క్లబ్బులూ, మీటింగులూ – అందుకే వాళ్ళను హాస్టల్లో పెట్టాను. ఇప్పుడేం, చిన్నప్పట్నుంచీ హాస్టల్లోనే ఉంటున్నారు. వాళ్ళకు ఇక్కడ ఉండాలని ఉండదు."

"ఏం చదువుతున్నారు?"

"పెద్దవాడు ఎం.ఏ. సెకండియర్. చిన్నవాడు బి.ఏ. ఫస్ట్‌యియర్!"

లేచి చెయ్యి కడుక్కున్నాడు.

"పడుకో, రేపు మాట్లాడుకుందాం!" అంటూ మేడమెట్లు ఎక్కుతూ ఆగి వెనక్కు చూశాడు. "రాజమ్మా! అమ్మగారికి ఏం కావాలో చూసుకో" అని పైకి వెళ్ళిపోయాడు.

అన్న వెళ్ళినవైపే చూస్తూ నిల్చింది కనకమ్మ.

బయట ఉరుము ఉరిమింది. కనకమ్మ ఉలిక్కిపడింది.

చప్పున లైట్లు ఆరిపోయాయి.

అంధకారం అలుముకుంది.

ఉక్కపోస్తూంది. ఉడుకుతూంది. కనకమ్మ మనసు కూడా ఉడుకుతూంది. ఆమె మనసులో కూడా చీకట్లు కమ్మాయి. ఆశ ఆరిపోయింది. బయట చీకటి. లోపల చీకటి.

రాజమ్మ తడుముకుంటూ వెళ్ళి కాండిల్ తెచ్చి వెలిగించింది.

కనకమ్మ కిటికీ దగ్గరకెళ్ళి నిలబడింది.

ఆకాశం కనిపించడం లేదు. తన బిడ్డలకు భవిష్యత్తు కన్పించడం లేదు. అంధకారం మాత్రమే కన్పిస్తూ వుంది.

అంతా నల్లగా వుంది. గొంగళి కప్పుకుంది రాత్రి.

అంత వెలుగు ఏమైంది? అంధకారం మింగేసింది!.

తనలోని ఆశ ఏమైంది? దాన్ని మనసులో అలుముకున్న చీకటి మింగేసింది.

అది అంధకారం! తమస్సు! చీకటి!

దానికి అన్నిటినీ మింగేసే శక్తి వుంది.

ఉన్నట్టుండి ఆకాశంలో మెరుపు మెరిసింది.

కనకమ్మ కళ్ళు జిగేల్ మన్నాయి.

ఎక్కడో పిడుగు పడింది!

అది ఎవరిమీద పడిందో? తనమీద పడకూడదూ?

ఒక్కసారిగా లైట్లు వెలిగాయి. ముందుకంటే ఎక్కువ వెలుగు వచ్చింది. కనకమ్మ తన గదిలోకి వెళ్ళింది. తలుపులు మూసుకుంది.

మెత్తటి పరుపుమీద పడుకుంది. ముళ్ళు గుచ్చుకుంటునట్టు ఉంది. పడక కుదరడంలేదు.

పైన పంకా తిరుగుతూ వుంది. ఆ పంకాను చూస్తూ పడుకుంది.

తను అన్న ఇంటికి వచ్చింది. పదేళ్ళ తర్వాత వచ్చింది. ఎన్నో చెప్పుకోవాలని వచ్చింది. మనసులో బరువు దించుకోవాలని వచ్చింది. కాని, ఆ బరువు పెరిగింది.

అన్న శ్రీమంతుడు. అన్న ఆదరిస్తాడనుకుంది. అన్న ఊరడిస్తాడనుకుంది. అన్న కొండంత బలాన్ని ఇస్తాడనుకుంది.

కాని, ఏం చేశాడు?

దూరపు చుట్టాన్ని పలకరించినట్టు పరామర్శించాడు.

పిల్లల పెళ్ళిళ్ళ గురించి అడగలేదు. ఇంటి కష్టసుఖాలు అడగలేదు.

రేపు మాట్లాడుతా నన్నాడుగా?

మళ్ళీ ఏవో ఆశ మనసు మూలలో మినుక్కుమంది.

పిల్లలు ఏం చేస్తున్నారో?

విశ్వం మగబిడ్డ. వాడ్నిగురించి తనకేం బెంగలేదు.

ఆడపిల్లలు - వాళ్ళు కూడా మగపిల్లలైతే - ఇంత అభిమానం చంపుకొని పిలవకుండానే అన్న ఇంటికి వచ్చేదా? ముగ్గురు మగపిల్లల తల్లిగా గర్వంగా తలెత్తుకు తిరిగేది గదూ?

వదిన ఇంకా రాలేదు? క్లబ్బుల్లో ఇంత అర్ధరాత్రిదాకా తిరగడం ఏమిటి? రాజమ్మ మాటల్లో ఏదో అర్థం తనకు స్ఫురించింది.

కస్తూరికూడా సుందరిలాగే తయారౌతుందేమో? సుందరి కూడా అందమైంది. కస్తూరికూడా అందమైంది. పెళ్ళయిన కొత్తలో సుందరి షోకులు చూసి అమ్మ విసుక్కునేది. బాధపడేది. కస్తూరికి కూడా అలంకరణలంటే ఇష్టం! నగలంటే మోజు!

కరుణ బుద్ధే వేరు! దానిగురించి తనకే భయంలేదు. తన భయమంతా కస్తూరి గురించే.

కస్తూరి తెల్లగా వుంటుంది. మెరిసిపోతూ వుంటుంది. వయసులో వుండే వగలు అన్నీ దానికి వున్నాయ్.

వయసు పాలపొంగులాంటిది. పొంగి పొయ్యిపాలు అయిందాకా తెలివిరాదు. తీరా పొయ్యిపాలయిం తర్వాత చేసేదేమీ వుండదు.

కస్తూరి కాలు జారినా ఆశ్చర్యం లేదు. తమ వీధిలో వుండే ఆ పరమశివం కూతురు ఏం చేసింది? అదీ అందంగా వుండేది.

కస్తూరికి మొగుడు కావాలి. మంచి బట్టలు కావాలి. నగలు కావాలి. సినిమాలు కావాలి. షికార్లు కావాలి. ఇవేవీ తను ఇవ్వలేకపోతూంది. అందుకని అదే వెతుక్కుంటూ వెళ్ళిపోతే..?

కనకమ్మ వంట్లోకి చలికుదుపు వచ్చింది. వణికిపోయింది.

ఛ! ఏమిటీ తను ఇలా ఆలోచిస్తుంది? తను తల్లి! తల్లి బిడ్డను గురించి ఆలోచించే పద్ధతా ఇది?

కనకమ్మకు దుఃఖం పొర్లింది. ఆపుకోవడానికి ప్రయత్నించలేదు.

తెల్లవారింది. కనకమ్మ లేచింది. కాఫీ తాగింది. స్నానం చేసి వచ్చింది.

"అన్నయ్య ఇంకా లేవలేదా?" రాజమ్మను అడిగింది.

"లేచారు. స్నానం చేస్తున్నారు." రాజమ్మ చెప్పింది.

"రాత్రి వదిన రాలేదా?"

"అర్ధరాత్రి దాటాక వచ్చారు. ఇంకా నిద్ర లేవలేదు" అన్నది రాజమ్మ.

కనకమ్మ అన్నను తల్చుకొని జాలిపడింది.

వదినమీద కోపం వచ్చింది.

రామనాథం ఖద్దరు సిల్కులాల్చీ, పొందూరు ఖద్దరుధోవతీ కట్టుకొని వచ్చాడు.

"ఏమ్మా, టిఫిన్ చేశావా?" అడిగాడు.

"ఇంకా లేదు. మీతో చేస్తానన్నారు" అన్నది రాజమ్మ.

"అరే! ఆలస్యం అయింది. రా కనకం!" ఆప్యాయంగా అన్నాడు.

ఇద్దరూ టేబుల్ ముందు కూర్చున్నారు.

"పిల్లల్ని చూడాలని వుంది అన్నయ్యా!" అన్నది కనకమ్మ.

"వాళ్ళకిప్పుడు పరీక్షలు జరుగుతున్నాయి" అన్నాడు.

"ఆడపిల్లలకు సంబంధాలు వస్తున్నాయా?" లాంఛనంగా అడిగాడు రామనాథం.

"సంబంధాలు ఎక్కడనుంచి వస్తయ్? నేనేం కట్నం యివ్వగలనా ఏమన్నానా?"

"మరీ దిగులు పడకు. పెళ్ళిళ్ళు కాకుండా వుంటాయా? గంతకు తగ్గ బొంత ఎవరో వస్తారు" అన్నాడు రామనాథం.

కనకమ్మ మనసు కలుక్కుమంది.

"పెళ్ళిళ్ళు కుదిరాక ఉత్తరం రాయి. ఏదో కొంత సర్దుతాను పెళ్ళి ఖర్చులకు" అన్నాడు రామనాథం టిఫిన్ తింటూ.

"కస్తూరి చాలా అందంగా వుంటుందన్నయ్యా!" పూర్తిగా ఆశ చంపుకోలేక అన్నది

"ఇద్దరూ అందమైనవాళ్లే. కస్తూరికంటే నాకు కరుణే బాగుంటుంది. కాస్త నలుపు. అంతే! వాళ్ళ అందం చూసే చేసుకుంటారు ఎవరో ఒకరు. ఎందుకమ్మా దిగులు?" అన్నాడు రామనాథం.

కనకమ్మ మనసు కకావికలైంది. ఇంకా ఏం అడుగుతుంది?

టిఫిన్ తిని లేచాడు రామనాథం.

డ్రైవర్ని కేకవేసి కారు తియ్యమని పురమాయించాడు.

"నేను ఇవ్వాళ విజయవాడ వెళ్తున్నాను. సెంట్రల్ మినిష్టర్ వస్తున్నారు. వచ్చే ఎలక్షన్లో నన్ను నిల్చోమంటున్నారు చాలామంది. నేను ఎన్నికయితే మంత్రి అయే అవకాశాలు కూడా వున్నాయ్."

కనకమ్మ వింటూవుంది. రామనాథం చెప్పుకుపోతున్నాడు.

"రెండు రోజుల్లో వస్తాను. వుంటావుగా?" అన్నాడు రామనాథం.

కనకమ్మకు దుఃఖం వస్తోంది. పదేళ్ల తర్వాత వచ్చిన చెల్లెల్ని అన్న "రెండు రోజులు వుంటావుగా?" అన్నాడు.

"లేదు, యివ్వాళే వెళ్తాను."

"ఇవ్వాళే వెళ్లడం ఏమిటి? రాకరాక వచ్చావు, రెండురోజులువుండి వెళ్లమ్మా!" ఆప్యాయంగానే అన్నాడు రామనాథం.

"వీల్లేదన్నయ్యా! నేను లేకుండా ఇంటిదగ్గిర కష్టం!" అతికష్టంమీద వచ్చాయి ఆ మాటలు.

రామనాథం లోపలికివెళ్ళి తిరిగి వచ్చాడు. నోట్లకట్ట అందిస్తూ "ఈ ఐదువందలూ వుంచు. ప్రస్తుతం నా దగ్గిర డబ్బులేదు. పెళ్లిళ్ళు కుదిరాక రాయి" అన్నాడు.

కనకమ్మకు తల నేలకువేసి కొట్టుకోవాలనిపించింది.

"నేను డబ్బుకోసం రాలేదు." గుండెల్ని బద్దలు కొట్టుకుంటూ వచ్చాయి మాటలు.

"ఛ! అదేమిటమ్మా, డబ్బుకోసం వచ్చావన్నానా? తీసుకో!" చెయ్యి చాపాడు రామనాథం.

"వద్దన్నయ్యా! ఇప్పుడు నాకు డబ్బు అక్కర్లేదు. విశ్వం కూడా ఉద్యోగం చేస్తున్నాడు. కూటికి గుడ్డకు జరుగుతూనే వుంది. చాలా రోజులైంది, చూసి పోదామని వచ్చాను." అభిమానపడుతూ అన్నది కనకమ్మ.

ఓ క్షణం కనకమ్మ ముఖంలోకి చూశాడు. ఏమనుకున్నాడో డబ్బు జేబులో పెట్టుకున్నాడు.

"నేను వచ్చిందాకా వుండకూడదూ?"

"లేదు. వెళ్ళాలి." అన్నది కనకమ్మ.

"టైం అవుతుంది. పన్నెండుకంతా విజయవాడలో వుండాలి. డబ్బు అవసరం అయితే, అభిమానపడకు. ఉత్తరం రాయి" అంటూ బయటికి వెళ్ళిపోయాడు రామనాథం.

కనకమ్మ నిల్చున్నచోటే నిలబడిపోయింది. కదిలేశక్తి లేనిదానిలా నిలబడిపోయింది. ఎన్నో ఆశలు పెట్టుకొని అన్న ఇంటికి వచ్చింది.

కొడుకు చెప్పినా వినకుండా వచ్చింది.

ఆమె ఆశల రెక్కలు ఒక్కొక్కటే విరిగిపడుతూ వున్నాయి.

ఆమె ఆశల మొక్కలు కూకటివేళ్ళతో కాలి బుగ్గయిపోయాయి.

అవమానంతో మనసు దహించుకుపోతూవుంది.

తల కొట్టేసినట్టయింది.

తల నరికేసి నట్టయింది.

గదిలోకి వెళ్ళి పరుపుమీద పడుకుంది. నిప్పులమీద పడుకున్నట్టువుంది.

"ఎందుకమ్మా దిగులుపడ్తావ్? నాకు ఇద్దరు కొడుకులున్నారు. ఒక పిల్లను చేసుకుంటాను" అనలేదు అన్నయ్య.

కనీసం "ఇవ్వాళ వెళ్లిపోవడం ఏమిటి? పదిరోజులు వుండు" అనలేదు.

పదేళ్ళ తర్వాత గడపలో కాలుపెట్టిన చెల్లెలికి అన్నయ్య చేసిన మర్యాద ఇది!

అన్నయ్య శ్రీమంతుడు! తను నిష్ఠ దరిద్రురాలు!

కనకమ్మ దిగ్గున లేచింది. రేకులపెట్టె తీసుకుంది. బయటికి వచ్చింది.

"అదేమిటమ్మా, వెళ్ళిపోతున్నారూ!" రాజమ్మ ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"ఇక చాలు! ఈ జన్మకిది చాలు! ఇంకా వుండాలా? ఇంత విషం దొరికితే ఇక్కడే ప్రాణం తీసుకునేదాన్ని? ఈ అవమానం చాలు! ఇప్పుడు మాత్రం బతికున్నానా?" అన్నాను అనుకుంది కనకమ్మ. కాని మాటలు పైకి పెగల్లేదు.

ఎవరితో అంటుంది? వంటమనిషితోనా?!

"ఏమ్మా, మాట్లాడరూ? అప్పుడే వెళ్ళిపోతున్నారేం?"

"వెళ్ళాలి రాజమ్మా! ఇంటిదగ్గర పిల్లలు వంటరిగా వున్నారు" అంది కనకమ్మ.

"వదినగార్ని చూసి వెళ్ళరూ? మరోగంటలో ఆమె నిద్ర లేస్తారనుకుంటా" అన్నది రాజమ్మ, కనకమ్మను జాలిగా చూస్తూ.

అన్నయ్యే పరాయివాడైన ఈ ఇంట్లో వదిన స్వంతం అవుతుందా? రాజమ్మ పిచ్చిది, బాధపడ్తుంది!

పైట కొంగుతో కన్నీరు తుడుచుకుంది కనకమ్మ.

చర చరా సాగిపోయింది.

రాజమ్మ కళ్ళప్పగించి చూస్తూ నిల్చుంది.

కనకమ్మ బయటికి వచ్చింది.

ఆమెను చూసి టైగర్ అరవలేదు.

మొక్కలకు నీళ్ళు పోస్తున్న నరసిమ్మ పక్కకు ఒదిగి నిల్చుని, వినయంగా నమస్కరించాడు.

కనకమ్మ వళ్లు మండిపోయింది.

వాణ్ణి నిలువునా పాతిపెట్టాలనిపించింది–

కళ్ళలో నిప్పులు కురిపిస్తూ చూసింది.

నరసిమ్మ గడగడలాడిపోతూ నిల్చున్నాడు.

కనకమ్మ సాగిపోయింది - చేతిలో రేకుపెట్టెతో - కళ్ళలో కన్నీటితో - గుండెల్లో గునపాలతో - సాగిపోయింది.

# 4

తుప్పు పట్టిన రేకు పెట్టె పట్టుకొని కనకమ్మ లోపలకు వచ్చింది. విశ్వనాథం తల్లిని చూశాడు.

ఆమె చేతిలోవున్న రేకుపెట్టెకంటే నల్లగా వుంది ఆమె ముఖం. వంట్లో నీరసం. కళ్లలో నిరాశ. అర్థం చేసుకున్నాడు.

"మామయ్యా, అత్తయ్యా, పిల్లలూ బాగున్నారా అమ్మా?" అడిగాడు విశ్వనాథం.

"ఆ - బాగానే వున్నారు!" అంది పెట్టె కిందపెడ్తూ.

విశ్వనాథానికి ఇంకేమీ అడగాలనిపించలేదు. తల్లి ఏం చెబుతుందో ఊహించగలడు. ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

కరుణ తల్లికి కాఫీ గ్లాసు అందించింది.

గ్లాసుడు కాఫీ అవు రావురుమని తాగేసింది కనకమ్మ, ఎన్నో రోజులుగా తిండి ముఖం చూడనట్టు.

ఖాళీ గ్లాసు అందిస్తూ కూతుర్ని చూసింది.

తల్లి అలా చూస్తూ ఏం ఆలోచిస్తుందో కరుణకు తెలుసు. గ్లాసు తీసుకొని లోపలకు వెళ్లిపోయింది.

కనకమ్మ కూతురు వెళ్లినవైపే చూస్తూ నిట్టూర్చింది.

బయటినుంచి ఇన్ని పాత వారపత్రికలు పట్టుకొని లోపలకు వస్తున్న కస్తూరిని చూసింది.

కస్తూరి తల్లిని చూసింది.

గతుక్కుమంది. తల్లి ఇంత త్వరగా వస్తుందని ఊహించని కస్తూరి కొంచెం తడబడింది.

కస్తూరి తల దువ్వుకుంది. పూలు పెట్టుకుంది. కాటుక దిద్దుకుంది. నల్లబొట్టు పెట్టుకుంది. నల్లచీర కట్టుకుంది. నల్లజాకెట్ వేసుకుంది. నల్లటి పూసలదండ మెళ్ళో వుంది. చేతులకు నల్లటి మట్టిగాజులు వేసుకుంది.

ఆ నల్ల దుస్తుల్లో మెరిసిపోతూ వుంది. మబ్బులు పట్టిన ఆకాశంలో మెరిసే మెరుపులా వుంది.

కనకమ్మ కళ్ళు పెద్దవి చేసుకొని కూతుర్ని చూసింది. కనుబొమలు చిట్లించుకుంది.

రాబోయే తుపానును ఊహించుకున్న కస్తూరి అక్కడ్నుంచి రెండడుగులు వేసింది లోపలకు వెళ్ళడానికి.

"కస్తూరీ! ఇలారా!" కనకమ్మ కంఠం కటువుగా వుంది.

కస్తూరి వచ్చి తల్లి కెదురుగా తలవంచుకొని నిల్చుంది.

"ఏమిటా వేషం?" గద్దించింది.

కస్తూరికి వళ్ళు మండిపోయింది.

కస్తూరికి ఏడుపు వచ్చింది.

తల్లికేసి చూడలేదు.

"మాట్లాడవేమే?"

"ఏం వేషం వేశానేమిటి? నువ్వు కొనిపెట్టిన చౌకబారు నూలు చీరేగా? చీర కొన్నది కట్టుకోవడానికి కాదూ?"

కనకమ్మ కస్తూరి ముఖంలోకి చూసింది. కస్తూరి కళ్ళలో మొండితనం చూసింది.

"నే నంటుంది చీర సంగతి కాదు!" అంతకంటే ఏమనాలో తోచలేదు కనకమ్మకి.

"మరి? నగలు పెట్టుకున్నానా? పూసలదండా, మట్టిగాజులేగా? పూలు పెట్టుకోవడం. బొట్టుపెట్టుకోవడం కూడా తప్పేనా?"

తన కూతురు తన అదుపుదాటిపోతుంది. కనకమ్మ కళ్ళు నిప్పులు కురిపించాయి.

"ఎక్కడి కెళ్ళావ్?"

"సుజాతా వాళ్లింటి కెళ్ళాను." నిర్లక్ష్యంగా వుంది కస్తూరి కంఠం.

కనకమ్మ ముఖంమీద ఛెళ్ళున తగిలింది.

"అంటే - మగాడిలా వేషం వేసుకొని బజార్లవెంట తిరుగుతుంది, అదేనా?"

"అవును!" నిర్లక్ష్యంగా అని, గిర్రున తిరిగి లోపలకు వెళ్ళిపోయింది కస్తూరి.

కనకమ్మకు వళ్లు తెలియలేదు. చివ్వున లేచింది. గబుక్కున కస్తూరి జడ పట్టుకుంది.

"వదులు నా జడ." కస్తూరి పెనుగులాడింది.

"వదలాలా?" అంటూ జడ పట్టుకొని వంగదీసి, అందిన చోటల్లా పిచ్చిగా కొట్టసాగింది.

కరుణ పరుగెత్తుకొచ్చింది. కస్తూరిని ఆదుకోబోయింది.

కరుణ చెంప ఛెళ్ళుమంది. కరుణ కళ్లలో నీరు తిరిగింది. చూస్తూ నిలబడి పోయింది.

కస్తూరి ఎదురు తిరిగింది. భయంతో ఇంతకాలం అణచుకున్న కసి తలెత్తింది. తల్లిని బలంగా ఒక్క తోపు తోసింది.

పడబోతున్న తల్లిని కరుణ పట్టుకుంది.

కనకమ్మ నిలదొక్కుకుని కూతుర్ని చూసింది.

కస్తూరి పేలటానికి సిద్ధంగా వున్న టైంబాంబులా వుంది.

కనకమ్మ వెర్రిముఖంవేసి చూస్తూ నిల్చుంది.

కస్తూరి ఎదురు తిరుగుతుంది. తన చేతికి అందకుండాపోతుంది. ఎంతకైనా తెగించేదానిలా వుంది!

కస్తూరి కసిగా మెళ్లోవున్న పూలదండ తెంపి నేలకేసి కొట్టింది. పూలచెండు లాగి కనకమ్మమీదకే విసిరింది.

కసిగా గాజులు గోడకేసి పగలగొట్టుకోసాగింది.

కనకమ్మ గబగబా గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకుంది. కుమిలి కుమిలి ఏడ్చింది.

ఛీ! వెధవ బతుకు, తను తల్లేనా? పిల్ల అందంగా అలంకరించుకుంటే కూడా తను చూడలేదు!

నిజంగా తను చూడలేదా? తన బిడ్డలు అందమైనవాళ్లని ఎంత మురిసిపోయేది ఒకప్పుడు? కాని ఇప్పుడు... వాళ్ల అందమే తనను బెదిరిస్తోంది. భయపెస్తోంది.

కస్తూరి అందంగా వుంటుంది. పిటపిటలాడే యవ్వనంలో వుంది. అందంగా అలంకరించుకొని పొరుగిళ్లకు వెళ్తుంది. దానికి మంచి బట్టలంటే మోజు. పెళ్లి చేసుకోవాలని కలలు కంటుంది. ఏదీ తను చెయ్యలేకపోతోంది.

ఆ సుజాత వెర్రి వెర్రి వేషాలు వేస్తుంది. మగపిల్లల్లా ప్యాంట్లు తొడుక్కుని మగపిల్లలతో నవ్వుతూ పేలుతూ బజార్లో నడవటం తను ఎన్నోసార్లు చూసింది. సుజాత ధనవంతుల బిడ్డ. ఎన్ని వేషాలు వేసినా చెల్లిపోతుంది. డబ్బుచూసి ఎవడైనా చేసుకుంటాడు.

దాని అన్నలు ఆకతాయివాళ్లని విన్నది.

కస్తూరి అలంకరించుకొని వాళ్లింటికి వెళ్ళింది. ఎందుకు? ఆ పిల్ల అన్నల్ని ఆకర్షించడానికి కదూ?

తను భయపడినంతా జరిగింది. రెండు రోజులు ఊళ్లో లేకపోయేసరికి ఇళ్ల వెంట బయలుదేరింది.

కరుణకు బుద్ధిలేదు. దాన్ని బయటికి ఎలా వెళ్లనిచ్చింది? విశ్వం ఎందుకు చూస్తూ ఊరుకున్నాడు?

వాళ్ళు చిన్నపిల్లలు. వాళ్లు ఇవన్నీ ఏం ఆలోచిస్తారు?

కరుణ బుద్ధే వేరు. బిడ్డ గడపలోకి కూడా రాదు. బయటికి ముఖం చూపించదు. తన పనేమో తనేమో! ఇంటెడు చాకిరీ ఒక్కతే చేస్తుంది. అయినా తను దాన్ని మరీ తిడుతుంది. అయినా, పెదవి కదపదు. మౌనంగా అన్నీ భరిస్తుంది.

బిడ్డ లోలోపల ఎంత కుమిలిపోతుందో?

తను దరిద్రం అనుభవిస్తుంది. కన్నబిడ్డలకు పెళ్ళి చెయ్యలేని పరిస్థితుల్లో వుంది. అందుకు వాళ్లని తిట్టేం లాభం?

తనుమాత్రం కావాలని తిడుతుందా? మనసు బాగా లేనప్పుడు వాళ్ళు కన్పిస్తే తనకు కోపం వస్తుంది. రోజు రోజుకూ కోపం ఎక్కువైపోతోంది.

ఇవ్వాళ కస్తూరి ఎదురు తిరిగింది.

రేపు కరుణ కూడా ఎదురు తిరుగుతుంది.

కనకమ్మ గుండెలు చిక్కపట్టినై.

కస్తూరి చేతులకు గాజు పెంకులు గుచ్చుకున్నయ్, రక్తం కారుతూంది.

కరుణ తడిగుడ్డతో తుడుస్తూ చెల్లెల్ని ఓదార్చడానికి ప్రయత్నిస్తోంది.

"కస్తూరీ! ఎందుకే బాధపడ్తావ్? అమ్మ సంగతి నీకు తెలియదా, చెప్పు? అమ్మకోపం తెలుసుకొని నువ్వు మసలుకోవాలిగాని ఎదురు తిరగొచ్చా?"

"ఇకనుంచి నన్ను ఏదైనా అంటే ఎదురు తిరుగుతాను... లేకపోతే ఏమిటి, చీర కట్టుకున్నా చూడలేదు" అంది కస్తూరి కసిగా.

"తప్పు అలా అనకే!" అన్నది కరుణ దిగులుగా.

"వెధవ కొంప! నరకంలా వుంది. ఎప్పుడు వదలుతుందో ఈ పీడ!"

కరుణ కస్తూరి కళ్లలోకి చూసింది.

"ఇలాగే అమ్మ తిడ్తూ వుంటే, నన్ను అనుమానిస్తూ వుంటే, చూడు ఏం చేస్తానో!" కస్తూరి అంది.

"ఏం చేస్తావే?" భయంగా అడిగింది కరుణ.

"ఏం చేస్తానా? అమ్మ భయపడే పనే చేస్తాను."

కరుణ కస్తూరి రెండుచేతులూ గట్టిగా పట్టుకుంది. ఒక్కమాట కూడా రాలేదు నోట్లోనుంచి.

"నీకు పెళ్లికాదు. నీకు పెళ్ళయితేగాని నాకు పెళ్లికాదు. ఈ నరకం తప్పదు. ఈ నరకంనుంచి ఎప్పుడో పారిపోతాను."

కరుణ ఒక్కసారిగా కస్తూరి చేతుల్ని వదిలేసింది.

కరుణ నిలువెల్లా వణికిపోయింది.

వెర్రిదానిలా చెల్లెల్ని చూస్తూ నిలబడిపోయింది.

కస్తూరి లేచి విసురుగా అక్కడనుంచి వెళ్ళిపోయింది.

కరుణ స్థాణువులా నిల్చుండిపోయింది.

"నీకు పెళ్ళికాదు. నీ పెళ్లయితేగాని నాకు పెళ్ళికాదు." కస్తూరి కంఠం పెద్దగా కసిగా కరుణ చెవుల్లో విన్పిస్తూవుంది.

# 5

"ఒసేవ్! నువ్వెందుకే షోకులు చేసుకుంటావ్?" తల్లి కస్తూరిమీద కేకలు వేసింది.

"ఏం షోకులు చేసుకుంటున్నా నేమిటి?...కాస్త శుభ్రంగా వుండటం కూడా తప్పేనా?"

తల్లి కస్తూరి ముఖంలోకి చూసింది. మరో మాటంటే ఎదురు తిరగటానికి సిద్ధంగా వున్నట్టు కన్పించింది.

"వాళ్లు వచ్చేసరికి నువ్వు బయట తిరుగుతూ కన్పించకు." కనకమ్మ అన్నది.

కస్తూరి తల్లి ముఖంలోకి నిరసనగా చూసింది.

కనకమ్మ నేరం చేసినట్టు ముఖం తిప్పుకుంది.

"తిరుగుతాను. తప్పక వాళ్ల ముందునుంచి పదిసార్లు తిరుగుతాను. ఆ వచ్చేవాడు అందగాడైతే నేనే చేసుకుంటాను. నన్ను చూశాక నీ పెద్దకూతుర్ని చేసుకోడు." మనసులోనే కసిగా అనుకుంది కస్తూరి.

కరుణ ముస్తాబు అయింది.

"నా బిడ్డకేం- బొమ్మ! కాస్త నలుపనేగాని - దాని కనుముక్కుతీరు ఎవరికుంది?" కరుణను కళ్లారా చూసుకుంటూ మురిసిపోయింది కనకమ్మ.

ఆ రోజు కరుణను చూడటానికి వస్తున్నారు. విశ్వనాథం స్నేహితుడు ఈ సంబంధం తెచ్చాడు. వాళ్ళకు కట్నం అక్కర్లేదట. కొంచెం చదువుకున్న పిల్లా, మంచి సంప్రదాయంగల పిల్లా కావాలట!...

"అమ్మా! వాళ్లు వచ్చేస్తున్నారు."

హడావిడిపడిపోతున్నాడు విశ్వనాథం.

"కస్తూరీ! నువ్వు బయటికి రాకు!..." మరోసారి హెచ్చరించింది కనకమ్మ.

కస్తూరికి పిచ్చి కోపం వచ్చింది. తమాయించుకుంది. మూతి సున్నాచుట్టి వంటింట్లో కూర్చుంది.

పెళ్ళివారు వచ్చారు. పెళ్ళికొడుకుతోపాటు అతని అక్కగారూ, విశ్వనాథం స్నేహితుడూ వచ్చారు.

కుర్రవాడు పొడవుగా అందంగా వున్నాడు. బి.ఏ. పాసయి, వ్యవసాయం చేసుకుంటూ ఇంటిపట్టునే వుంటున్నాడు.

కరుణను తీసుకొచ్చింది కనకమ్మ.

కరుణలోని అందాన్ని చూట్టానికి ప్రత్యేకమైన కళ్ళుకావాలి. ఆ కళ్లు ఆ వచ్చిన వాళ్ళకు లేవు.

కరుణ రంగు చూసి కుర్రవాడి అక్కయ్య ముఖం చిట్లించుకుంది. ఆ కుర్రవాడు ఒకసారి చూసి అదోలా ముఖం పెట్టాడు.

పిల్ల వాళ్లకు నచ్చలేదని గ్రహించాడు విశ్వనాథం.

తల్లిని లోపలకు పిలిచాడు.

"అమ్మా! ఇది చాలా మంచి సంబంధం. కట్నం లేకుండా ఇంత మంచి సంబంధం దొరకడం కష్టం!..." అన్నాడు ఉపోద్ఘాతంలా.

"అవున్రా! పిల్లవాడు బాగున్నాడు. మన కరుణ అదృష్టవంతురాలు!" అన్నది కనకమ్మ అమాయకంగా.

విశ్వనాథం గతుక్కుమని చూశాడు.

"అమ్మాయి వాళ్ళకు నచ్చినట్టేగా?" మళ్ళీ అన్నది కొడుకును చూస్తూ ఏదో సందేహంగా రాగా.

"కరుణ వాళ్ళకు నచ్చినట్టు లేదు."

కనకమ్మ దెబ్బ తిన్నట్టు చూసింది.

"కస్తూరిని చూపిస్తే?' బాధపడ్తూనే అన్నాడు.

కనకమ్మ వెర్రిదానిలా చూసింది.

"ఆలోచించమ్మా! మంచి సంబంధం! ఒక పిల్ల బరువుతీరినా తీరినట్టే!" అన్నాడు విశ్వం.

"బాబూ!"

"బాధపడకమ్మా! ఆలోచించు."

ఓ క్షణం ఆలోచించి "నీ ఇష్టంరా!..." అంది కనకమ్మ బొంగురుపోయిన గొంతుతో.

"అయితే, కస్తూరిని పంపించు, ఫలహారాలు ఇచ్చి!" అంటూ బయటికి వెళ్ళిపోయాడు విశ్వం.

"కస్తూరీ! ఆ ఫలహారాల ప్లేట్లు తీసుకెళ్ళి బయట వాళ్ళకు ఇచ్చిరా!" అంది కనకమ్మ.

కస్తూరి విస్మయంగా తల్లి ముఖంలోకి చూసింది.

"ఆ నల్లచీర కట్టుకో! అది నీకు బాగుంటుంది. కాటుక కూడా పెట్టుకో!" అంది కనకమ్మ.

కస్తూరి చిత్రంగా చూసింది.

"నీకేనే చెప్తుంది!" కనకమ్మ మళ్ళీ అంది కొంచెం విసుగ్గా.

"నేనేం కట్టుకోను. నేను అసలు బయటికే పోను." కసిగా అంది కస్తూరి.

అంతలో విశ్వం లోపలకు వచ్చాడు. చెల్లెలు ముఖంలోకి చూశాడు.

"చెల్లీ, రామ్మా! నువ్వొచ్చి ఆ ఫలహారాలు వాళ్ళకివ్వు... అమ్మ పెద్దది. నువ్విస్తేనే బాగుంటుంది" అన్నాడు విశ్వం.

అన్నమాట కాదనలేక ఫలహారాల ప్లేటు తీసుకొని లేచింది కస్తూరి.

"ఆ చీర మార్చుకోమని చెప్పరా!" అంది కనకమ్మ.

"అక్కర్లేదమ్మా! కస్తూరి ఏం కట్టుకున్నా బాగానే వుంటుంది."

అన్న మాటలకు కస్తూరి పొంగిపోయింది. ఫలహారాల ప్లేట్లు తీసుకొని బయటికి వచ్చింది.

అందరి కళ్ళూ జిగేల్‌మన్నాయి. పెళ్ళికొడుకు కళ్లార్పకుండా చూస్తున్నాడు. పెళ్ళికొడుకు అక్కయ్య కళ్ళు పెద్దవిచేసుకొని చూసింది.

"ఈ అమ్మాయి ఎవరూ?" విశ్వాన్ని అడిగింది.

"మా రెండో చెల్లెలు" అన్నాడు విశ్వం.

కరుణకు అర్థం అయింది. చిన్నగా లేచి లోపలకు వెళ్ళిపోయింది.

లోపలకు వస్తున్న కరుణను చూడలేకపోయింది కనకమ్మ. మనసంతా ఎలాగో అయిపోయింది.

కస్తూరి చలాకీగా ఇంట్లోకీ, బయటకీ తిరుగుతూంది. పెళ్ళివారికి కాఫీలూ, మంచినీళ్ళూ అందిస్తూంది.

పెళ్ళికొడుకు కళ్ళు అమె చుట్టూనే తిరుగుతున్నాయి.

ఊరికి వెళ్ళి ఉత్తరం రాస్తామని చెప్పి పెళ్ళివారు వెళ్లిపోయారు. రెండు రోజుల తర్వాత ఉత్తరం వచ్చింది. కస్తూరిని ఇస్తే పెళ్ళికి ఒప్పుకుంటామని రాశారు.

విశ్వం ఉత్సాహంగా ఆ విషయం తల్లితో చెప్పాడు.

"పెద్దదాన్ని అలా పెట్టి చిన్నదానికి పెళ్ళి ఎలా చేస్తాంరా!" అంది తల్లి బెంగగా.

"ముందు కస్తూరికి పెళ్ళి అయిపోతే, కరుణకు చిన్నగా చూడొచ్చు. అప్పో సప్పో చేసి కొద్దిగా కట్నం ఇచ్చి అయినా చెయ్యొచ్చు. మళ్ళీ కస్తూరికి ఇంత మంచి సంబంధం దొరకదు" అన్నాడు విశ్వం.

అన్నాడే కాని విశ్వం కూడా కరుణను తల్చుకొని బాధపడ్తూనే వున్నాడు.

"అది బాధపడుతుందేమోరా!"

"కరుణ మంచిదమ్మా! సర్దుకుపోతుంది. మన పరిస్థితుల్ని అర్థం చేసుకోగలదు."

"అలాగే కానియ్!" కళ్ళు ఒత్తుకుంది కనకమ్మ.

కరుణ మనసులో ఏముందో ఎవరికీ అంతుపట్టలేదు. పైకిమాత్రం ఎప్పటిలాగే కన్పిస్తూంది. పనులు చేస్తూంది.

కనకమ్మ కరుణ ముందు నేరం చేసినట్టు ఫీలవుతుంది.

విశ్వనాథం కూడా తప్పుకు తిరుగుతున్నాడు.

కనకమ్మ కరుణను విసుక్కోవడం మానేసింది.

విశ్వనాథం కరుణను చూసినప్పుడల్లా "మా కరుణ కొంచెం నలుపే కాని, చాలా అందమైంది. దాని అందం మీలాంటివాళ్ళు చూడలేరు. పెద్దపిల్ల వుండగా చిన్నదానికి పెళ్ళి చెయ్యం అనేవాణ్ణి - నాకే కట్నం ఇవ్వగల తాహతు వుంటే!" అనుకొనేవాడు మనసులోనే.

ఇప్పుడో? మొయ్యలేని బరువు నెత్తిమీద వుంది. ఆ బరువులో కొంత దించుతామని ఒక చెయ్యి ముందుకు వచ్చింది. దాన్ని కాదనే ఆత్మబలం విశ్వానికి లేదు.

బరువు మోసేవాడికే తెలుస్తుంది దాని బాధ.

కస్తూరి చాలా ఉత్సాహంగా వుంది. గర్వంగా వుంది. రోజూ ఉన్న దాంట్లోనే చక్కగా ముస్తాబు అవుతుంది. తల్లి ఏమీ అనడంలేదు.

"అక్కా! పూలజడ వెయ్యవే!" మల్లెపూలు గ్లాసులో పోసుకొని తెచ్చింది కస్తూరి కరుణ దగ్గిరకు.

"అమ్మ..." సందేహంగా అన్నది కరుణ భయపడుతూ.

"అమ్మే వేయించుకోమంది" అన్నది కస్తూరి.

కరుణ కస్తూరికి పూలజడ కుట్టింది.

"ఎంత బాగున్నావే కస్తూరీ! మా మర్దిగారుచూస్తే..." నవ్వుతూ బుగ్గ చిదిమింది కరుణ.

కస్తూరి అక్క కళ్ళలోకి గుచ్చిచూసింది.

"ఏమిటే?"

"అక్కా! నీకు నామీద కోపంగా లేదా?"

"నీమీద నాకు కోపమా! ఎందుకే?" కరుణ నవ్వుతూ అన్నది.

"అదే...అదే...మరి...నిన్ను చూట్టానికి వచ్చిన అబ్బాయి నన్ను చేసుకుంటాననంటే నీకు ఏమీ అన్పించడంలేదూ?" కస్తూరి అక్క ముఖంలోకి చూస్తూ అన్నది.

కరుణ ఓ క్షణం మౌనంగా వుండిపోయింది. ముఖం గంభీరంగా మారింది.

"అతను చాలా అందమైనవాడు. అతనికి నువ్వే తగినభార్యవు. నాకు కోపంగా లేదు. మా చెల్లికి అందమైన భర్త వస్తున్నందుకు సంతోషంగా వుంది."

"ఆ మాటకొస్తే నువ్వే అందంగా వుంటావు అక్కా!..." ఆర్ద్రకంఠంతో అన్నది కస్తూరి.

"నీ మొహం! నల్లగా వుంటాను. నేను అందంగా వుండటం ఏమిటి? వెళ్ళు, జడ అమ్మకు చూపించు." మాట మార్చింది కరుణ.

అక్క చాలా చిత్రమైంది. ఎవరిమీదా కోపం రాదు. మిన్నువిరిగి మీదపడ్డా తొణకదు. దేనినయినా భరిస్తుంది. ·నిండుకుండలా తొణకదు.

అదే తనైతే? తనను చూడటానికి వచ్చిన యువకుడు తన చెల్లెల్ని చేసుకుంటానంటే? అమ్మా, అన్నయ్యా అందుకు అంగీకరిస్తే?...

తన పెళ్ళి కాకుండా తన చెల్లెలి పెళ్ళికి ముహూర్తాలు పెట్టేస్తే - తనేం చేసేది?

అవమానంతో ఆత్మహత్య చేసుకునేది. లేకపోతే కసితో అందర్నీ ఏడిపించడానికి ఇంటినుంచి పారిపోయేది.

అక్క నిజంగా మంచిది.

అక్క దేవత!

పదేపదే మనసులో అనుకుంది కస్తూరి.

# 6

కస్తూరి పెళ్ళి అయిపోయింది సుబ్బారావుతో.

పెళ్ళి జరుగుతున్నంతసేపూ కరుణను బయటికి రానివ్వలేదు.

పెద్దపిల్లకు చెయ్యకుండా చిన్నదానికి చేస్తున్నందుకు అందరూ పెళ్ళి పందిట్లోనే గుసగుసలాడారు.

కొందరు ఆడవాళ్ళు కనకమ్మను అడిగేశారు.

కొందరు వృద్ధులు విశ్వాన్ని నిలదీశారు.

కనకమ్మగానీ, విశ్వంగానీ ఒక్కరికీ సమాధానం ఇవ్వలేదు.

కన్నీటి పొరలు చూపులకు అడ్డుపడుతూవుంటే కనకమ్మ పెళ్ళితంతు సరిగా చూడలేకపోయింది. ఆ కళ్ళకు ఇంట్లో ఓ మూల కూర్చున్న కరుణే కన్పించింది.

విశ్వనాథం కూడా మొహం చిన్నబుచ్చుకొనే తిరిగాడు.

పెళ్ళి పందిట్లో ఏ ఇద్దరు చిన్నగా మాట్లాడుకుంటున్నా కనకమ్మ మనసు అవమానంతో దహించుకుపోయింది.

కస్తూరి అత్తవారింటికి వెళ్ళిపోయింది. అందరూ ఏడుస్తున్నా కస్తూరికి ఏడుపు రాలేదు.

చుట్టాలూ పక్కాలూ అందరూ వెళ్ళిపోయారు.

ఇల్లు చిన్నబోతూ వుంది.

చీకటిపడింది.

కరుణ మంచంమీద పడుకొని వుంది.

కరుణ దీపం వెలిగించలేదు.

కనకమ్మ వసారాలో గోడకు ఆనుకొని కూర్చుంది. కూతురు వెళ్ళిపోయినందుకు బాధ. పెద్దపిల్లకు పెళ్ళి చెయ్యకుండా చిన్నదానికి చేసినందుకు అవేదన. కుమిలిపోతూ కూర్చుంది!

"ఎందుకమ్మా చీకట్లో కూర్చున్నావ్?" విశ్వం వచ్చి లైటు వేశాడు.

కనకమ్మ చివ్వున తలెత్తి చూసింది.

"ఎందుకమ్మా అంత దిగులు? ఆడపిల్లలు ఎప్పటికైనా వెళ్ళవలసినవాళ్ళేగా?"

"అదికాదు విశ్వం!" కనకమ్మ గొంతులో దుఃఖం గరగరలాడింది.

"కరుణ గురించేనా? దిగులుపడకమ్మా! త్వరలోనే కరుణకూ చేస్తానుగా! అవసరం అయితే ఇల్లు తాకట్టుపెట్టి కట్నం ఇద్దాం! చిన్నగా తాకట్టు విడిపించుకోవచ్చు" అన్నాడు విశ్వం.

కనకమ్మ కళ్ళు వత్తుకుంది.

"కరుణ ఏదమ్మా?" అడిగాడు విశ్వం.

"ఏమోరా! లోపలే ఉన్నట్టుంది."

"అమ్మా! కరుణ మనసు నొచ్చుకునేలా ఏమీ అనకు" అన్నాడు విశ్వం.

"దానిమీద నాకు పగ(త్రా?" కనకమ్మ బాధగా అంది.

"అందుక్కాదమ్మా - ఇప్పటికే దాని మనసు ముక్కలైంది. పైకి ఎంత నిభాయించుకున్నా లోలోపల ఎంత కుమిలిపోతోందో?" విశ్వం ఆర్ద్రంగా అన్నాడు.

కనకమ్మ కరుణ పడుకొనివున్న గదిలోకి వెళ్ళింది.

లైటు వేసింది. కరుణ మంచంమీద కళ్ళు మూసుకొని పడుకొని ఉంది.

"అమ్మా కరుణా!"

కరుణ ఉలిక్కిపడి లేచి కూర్చుంది. తల్లిని చూసింది. పుట్టెడు దిగులుతో నిల్చున్న తల్లిని చూసింది. కరుణ మంచం దిగింది.

"ఏమ్మా?"

"నన్ను క్షమించు తల్లీ! పాపిష్టిదాన్ని...నీకు..." ఆపై మాటలు గొంతులోనే ఉంగిడి చుట్టుకుపోయినయ్.

"అదేమిటమ్మా! నేను నిన్ను క్షమించడం ఏమిటి? నువ్వు నన్నేం చేశావని?" ఆశ్చర్యంగా అన్నది కరుణ.

"ఇంకా ఏంచెయ్యాలి తల్లీ!..." అంటూ కరుణను కౌగలించుకొని కుమిలి కుమిలి ఏడ్చింది కనకమ్మ.

కరుణ గాభరాపడిపోయింది.

"అమ్మా, నామాట నమ్ముతావా?" ఆగి తల్లిముఖంలోకి చూసింది.

గంభీరంగా తనకు తనే చెప్పుకుంటున్నట్లు మళ్ళీ అంది-

"నువ్వు అనుకుంటున్నట్టు నేను బాధపడటం లేదమ్మా! చెల్లి పెళ్ళి అయినందుకు నాకు ఎంతో సంతోషంగా ఉంది. అది తీరా వెళ్ళిపోతే దిగులుగా వుంది. అందుకే... అంతేనమ్మా... అంతే!"

"కరుణా!" తల్లికూతుర్ని గుండెలకు హత్తుకుంది.

కరుణకు దుఃఖం కట్టలు తెంచుకుంది. తల్లిగుండెల్లో తలదూర్చి వెక్కి వెక్కి ఏడ్చింది.

ఎందుకు అంత దుఃఖం వచ్చిందో కరుణకే తెలియదు.

కనకమ్మ కరుణ తల నిమురుతూ ఓదార్చింది.

# 7

"ఎందుకు విశ్వం, అంతదిగులుగా వున్నావ్?" శారద అడిగింది.

"నీ గురించే!" అన్నాడు వెంటనే విశ్వం.

"నా గురించా? అబద్ధం!"

"నిజంగా నీ గురించే! అంటే నీ పెళ్ళిగురించి." శారద కళ్ళల్లోకి లోతుగా చూస్తూ అన్నాడు విశ్వనాథం.

"అదేం కాదు. నా పెళ్ళిగురించి దిగులెందుకూ? నీ చెల్లెలు గురించి. నాకు తెలియదు అనుకోకు."

"నా చెల్లెలి గురించయినా, నీ గురించి అయినట్టేగా?"

"అదెట్లా?" విస్మయంగా అడిగింది శారద.

"నా చెల్లెలు పెళ్ళయితేగాని నా పెళ్ళి కాదు. నా పెళ్ళయితే కాని నీ పెళ్ళికాదు" అన్నాడు విశ్వం ఆలోచిస్తూ.

"ఛీ ఫో! నువ్వు మరీనూ!" సిగ్గుపడిపోయింది శారద.

"శారదా! నిజం చెప్పు, నీకు బాధగా లేదూ?"

"నాకేం బాధగా లేదు" అన్నది శారద.

"శారదా!"

"ఏమిటి?" అన్నట్టు చూసింది.

"ఇవ్వాళ మా ఇంటికి వస్తావా?"

"ఎందుకూ?" అన్నది శారద ఆశ్చర్యంగా చూస్తూ.

"మా అమ్మగారికి కాబోయే కోడల్ని చూపించాలని!" కొంటెగా చూస్తూ అన్నాడు విశ్వం.

"బాబోయ్!" భయపడుతున్నట్టు నటించింది.

"ఎందుకంత భయం?"

"మీ అమ్మగారికి నచ్చకపోతే?"

"నచ్చకపోతే నిన్ను పెళ్ళి చేసుకోవడం మానేస్తాను!" శారదను ఉడికించడానికి అన్నాడు.

"అయితే నేను రాను!"

"ఎప్పటికైనా రావాల్సినదానివేగా?"

"పెళ్ళయాక వేరే సంగతి. ఏ రిజిస్టర్ మారేజో చేసుకుంటే సరిపోయె!" అంది నవ్వుతూ.

ఇద్దరూ కలిసి ఇంటికి వచ్చారు.

గుమ్మంలోనే ఎదురైన కనకమ్మ శారదను ఆశ్చర్యంగా చూసింది.

"మా అమ్మ!" శారదకు కనకమ్మను పరిచయం చేశాడు విశ్వం.

"ఎవర్రా ఆ అమ్మాయి?" అడిగింది కనకమ్మ.

"ఆమెనే అడుగు!" అంటూ శారదముఖంలోకి చూశాడు.

శారద సిగ్గుతో తల వంచుకుంది.

"నీ పేరేమిటమ్మా?"

"శారద! మా ఆఫీసులోనే పని చేస్తుంది." విశ్వం పరిచయం చేశాడు.

కనకమ్మకు అర్థం అయింది. పిల్ల లక్షణంగా వుంది అనుకుంది. మనసులోని సంతోషాన్ని పైకి కన్పించనీయలేదు.

"కూర్చోమ్మా! ఏ ఊరు? ఎవరమ్మాయివి?" ఆరా తీసింది, శారద ముఖంలోకి చూస్తూ.

శారద తడబడింది.

"ఈ ఊరు కాదు. శారదకు తల్లిదండ్రులు లేరు. నీకు తెలియదులే" అన్నాడు విశ్వం.

"మన కులమేనా?" అడిగింది కనకమ్మ.

శారద గాభరాగా విశ్వం ముఖంలోకి చూసింది.

"కరుణ ఏదమ్మా?" అడిగాడు విశ్వం మాటమారుస్తూ.

కనకమ్మకు సందేహం కలిగింది. తమ కులం కాదేమో! అయినా, తను ఆ అమ్మాయిముందు అడగడం ఏమిటి? తనలో తనే అనుకుంది కనకమ్మ.

"వంటింట్లో ఉంది" అని చెప్పి, "కరుణా!" అంటూ కేక పెట్టింది కనకమ్మ.

"మా కరుణ ఎప్పుడూ ఏదో చేస్తూనే ఉంటుంది" అన్నాడు విశ్వం.

"మంచి పనిమంతురాలేనమ్మా! అయితే ఏం లాభం!" ఏదో చెప్పబోయి కరుణనుచూసి ఆగిపోయింది కనకమ్మ.

కరుణ గడపలోనే ఆగి శారదను చూసింది.

"మా చెల్లి కరుణ!" పరిచయం చేశాడు శారదకు.

కరుణను కన్నార్పకుండా చూస్తూ "ఎంత అందంగా వుందో! మలచిన ప్రతిమలా ఉంది" అన్నది శారద.

ఆ మాటలు వింటూ కరుణ నిజంగా చెక్కిన శిలాశిల్పంలా నిలబడిపోయింది.

కనకమ్మ పొంగిపోయింది.

"నా బిడ్డకేం తల్లీ, కొంచెం నలుపనేగాని! దాని అందం అందరికళ్ళకూ కన్పించేదికాదు!" అన్నది కనకమ్మ.

"వారు ఎవరు అన్నయ్యా?" కరుణ అడిగింది.

"శారద...నీ కాబోయే వదిన..." తల్లి ముఖంలోకి చూశాడు విశ్వం.

తల్లికి సూటిగా చెప్పలేక అలా చెప్పాడు. తల్లిభావాలు ఎలా ఉంటాయోనని ముఖంలోకి చూశాడు. కనకమ్మ ముఖంలో ఎటువంటి మార్పు కన్పించలేదు. అంతకు ముందే ఆ విషయం తెలిసినట్టే తాపీగా విని ఊరుకుంది.

"నిజంగానా అన్నయ్యా!" కరుణ సంతోషంగా అన్నది.

విశ్వం నవ్వాడు సమాధానంగా.

శారద ఏం మాట్లాడాలో తోచనిదానిలా కూర్చుంది.

శారద చామనచాయగా ఉన్నా ఎంతో కళగా ఉంది. నవ్వుతుంటే వాణిశ్రీ చెల్లెలులా ఉంది అనుకుంది కరుణ.

కనకమ్మ ఆలోచనలు మరోవిధంగా ఉన్నాయ్. ఆ పిల్లకు తల్లిదండ్రులు లేరా? తమ కులమేనా? ఉద్యోగం చేస్తుంది అంటే, వెనకాముందూ ఎవరూ, ఏమీ లేదన్నమాటే! తన కొడుక్కు కట్నం వస్తుందనీ, ఆ కట్నం డబ్బుతో కరుణపెళ్ళి చెయ్యాలని ఇంతకాలంగా ఆశలు పెంచుకుంది. విశ్వం తనభార్యను తనే ఎంచుకున్నాడు. కరుణ పెళ్ళి ఎలా కావాలి? చెల్లెలిపెళ్ళి అయినందుకే అందరూ గుసగుసలాడారు. కరుణకు పెళ్ళికాకుండా మగపిల్లవాడికి కూడా పెళ్ళయితే ఇంకేమయినా ఉందా? ఇక అసలు దానికి పెళ్ళి అవుతుందా?

కనకమ్మ ఆలోచనలు పరిపరివిధాల పోయాయి.

కరుణ శారదకు కాఫీ ఇచ్చింది. ఎన్నో విషయాలు అడిగింది.

"మా అన్నయ్యా, నువ్వూ ప్రేమించుకుంటున్నారా?" చిన్నగా కుతూహలంతో అడిగింది కరుణ.

"మీ అన్నయ్యనే అడుగు." కొంటెగా చూస్తూ అంది శారద.

శారద లేచింది. "వెళ్ళొస్తాను" అంటూ కనకమ్మకు నమస్కరించింది.

"మంచిదమ్మా!" అన్నది కనకమ్మ పూర్తిగా ఆలోచనలనుంచి బయటపడకుండానే.

వాకిలివరకూ వచ్చిన కరుణతో "వస్తాను కరుణా!" అన్నది శారద.

"పెళ్ళెప్పుడు?" అడిగింది కరుణ.

"నీ పెళ్ళికాకుండా నా పెళ్ళెలా అవుతుంది?" నవ్వుతూనే అన్నది శారద.

కరుణ ముఖం చిన్నబోయింది.

శారదను బస్ ఎక్కించడానికి విశ్వంకూడా బయలుదేరాడు. ఇద్దరూ వెళ్తుంటే చూస్తూ నిల్చుంది కరుణ.

తన పెళ్ళి కానిదే అన్నయ్య పెళ్ళి చేసుకోడా? తను అందరికీ సమస్యగానే తయారైంది. అందరికీ బరువుగా వుంది. కరుణ మనసు ఎలాగో వుంది. చేదు చేదుగా వుంది. దిగులు దిగులుగా వుంది.

"ఏరా విశ్వం, మాట మాత్రం చెప్పకుండా నీ పెళ్ళి నువ్వే కుదుర్చుకున్నావా?" శారదను బస్ ఎక్కించి తిరిగి వచ్చిన విశ్వాన్ని నిలదీసింది కనకమ్మ.

విశ్వం మనసు చివుక్కుమంది.

"కుదుర్చుకోవడం కాదమ్మా! ఆ అమ్మాయి మా ఆఫీసులోనే పని చేస్తోంది. చాలా మంచిది. నేనంటే చాలా అభిమానం - నాకూ..." నీళ్ళు నమిలాడు విశ్వం.

కనకమ్మ ఆలోచిస్తూ కూర్చుంది.

"నీకు చూపించాలనే తీసుకొచ్చానమ్మా!" అన్నాడు విశ్వం నేరస్తుడిలా తల దించుకొని.

తన కొడుకు అందరిలాంటివాడు కాడు. తనంటే చాలా అభిమానం.

"ఆ అమ్మాయి నీకు నచ్చలేదా అమ్మా?"

"నచ్చకేంరా? అందంగానే వుంది."

"మంచి మనసు..."

"అవును, వినయ విధేయతలుగల పిల్లలాగే వుంది."

"అయితే, నీకు అభ్యంతరం లేదుగా నేను ఆ అమ్మాయిని చేసుకుంటే?" ఉత్సాహంగా అడిగాడు విశ్వనాథం.

కనకమ్మ మాట్లాడలేదు.

"ఏమ్మా, నీకు ఇష్టంలేదా?"

కనకమ్మ కొడుకు ముఖంలోకి చూసింది. అతని ముఖంలో ఆతృత చూసింది. కళ్ళలో ఆరాటం చూసింది.

"ఏమ్మా?"

"మన కులమేనా ఆ అమ్మాయిది?" అడిగింది కనకమ్మ.

విశ్వం గతుక్కుమన్నాడు. వెంటనే ఏం చెప్పాలో తోచలేదు. తల వంచుకున్నాడు.

"ఏరా విశ్వం, చెప్పవేంరా?"

"మన కులం కాదమ్మా!"

కనకమ్మ ఉలిక్కిపడి కొడుకు ముఖంలోకి చూసింది.

"ఏమిటమ్మా అలా చూస్తావ్? ఈ రోజుల్లోకూడా కులాల పట్టింపు ఏమిటమ్మా?"

"ఇదేమిట్రా నాయనా? మన ఇంటా వంటా లేని పని!" బాధగా అంది కనకమ్మ.

"ఆ అమ్మాయిది మనకంటే పెద్దకులమేనమ్మా!" అన్నాడు విశ్వం.

"పెద్దా చిన్నా అని కాదురా! కులమింటి పిల్లను చేసుకోవాలిగాని ఇదేం బుద్ధిరా నీకు?"

విశ్వం సమాధానం ఇవ్వలేదు.

"ఏరా మాట్లాడవు?"

"నేను ఆ అమ్మాయికి మాట ఇచ్చానమ్మా! నేను ఆ అమ్మాయినే చేసుకుంటాను!" ఖచ్చితంగా అన్నాడు విశ్వం.

తల్లి చివ్వున తలెత్తి కొడుకు ముఖంలోకి చూసింది.

విశ్వం మంచివాడే! తనను ఏనాడూ కష్టపెట్టలేదు. కాని, ఒక్కసారి ఏదైనా నిర్ణయించుకుంటే - అంతే! ఆ నిర్ణయాన్ని ఎవరికోసం మార్చుకోడు!

మగబిడ్డ, వాడికేం పర్వాలేదు. కాని, పెళ్ళి కావాల్సిన పిల్ల ఇంట్లో వుంది. ఇప్పటికే దాని పెళ్ళి ఒక సమస్యగా మారింది. అది తన మెడకు గుదిబండలా వుంది

"నువ్వు కులంకాని పిల్లను చేసుకుంటే కరుణకు పెళ్లి ఎలా అవుతుందిరా? దాన్ని అలా వుంచి చిన్నదానికి చేసినందుకే కుళ్లిపోతున్నాను. ఇక నువ్వుకూడా కులంకాని కులంలో చేసుకుంటే లోకుల ముందు తలెత్తుకు తిరగ్గలనా? దానికి పెళ్ళయేనా? కరుణ బాధ చూడగలనా?"

"అమ్మా! నేను అంత స్వార్థపరుణ్ణి అనుకున్నావా? ముందు కరుణ పెళ్ళిచేసే నేను చేసుకుంటానమ్మా!"

"బాబూ!" తేలికపడింది కనకమ్మ గుండె.

"అవునమ్మా! శారద కూడా ఆ మాటే అన్నదమ్మా!"

కరుణ రావడంతో ఆ సంభాషణ ఆగింది.

కనకమ్మ లోపలకు వెళ్ళిపోయింది.

"అన్నయ్యా!"

"ఏమిటమ్మా?" ఆప్యాయంగా చూస్తూ అన్నాడు విశ్వం.

"మీ రిద్దరూ ప్రేమించుకున్నారా?"

విశ్వానికి ఏం సమాధానం ఇవ్వాలో తెలియలేదు. ప్రశ్న వేసింది తన చెల్లెలు. పెళ్ళి కాకుండా ఇంట్లో వున్న చెల్లెలు! మనసు ఎలాగో అయింది. కరుణ ముఖంలోకి జాలిగా చూశాడు.

"అమ్మదొంగా! అందుకే అన్నమాట ఈ మధ్య రోజూ ఆలస్యంగా వస్తున్నావు?" నవ్వుతూ అన్నది కరుణ.

విశ్వం చెల్లెలి ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు.

"వదిన మంచిది అన్నయ్యా!" మళ్లీ కరుణే అన్నది.

"మంచివాళ్ళకు అందరూ మంచివాళ్లుగానే కన్పిస్తారు" అన్నాడు విశ్వం చిరునవ్వుతో.

"మంచిది కాకపోతే నువ్వెందుకు ప్రేమిస్తావేమిటి?" అమాయకంగా అన్నది కరుణ.

"కరుణా!" తల్లి కేక విన్పించి కరుణ లోపలకు వెళ్ళింది.

కరుణ హృదయం అమృతం! దాని భర్త సుఖపడ్తాడు. ఎలాంటివాడు దొరుకుతాడో? ఆలోచిస్తూ కుర్చీలో వెనక్కువాలి కళ్ళు మూసుకున్నాడు విశ్వం.

# 8

అందరూ హడావిడిగా వున్నారు. కనకమ్మ పొయ్యి దగ్గిర కూర్చుని ఫలహారాలు తయారుచేస్తూంది.

విశ్వం ఇంట్లోకి బయటికి తరుగుతున్నాడు. అతను శెలవు పెట్టాడు. శారద కూడా శెలవు పెట్టింది.

శారద కరుణను ముస్తాబు చేసింది. "ఎంత బాగున్నావో తెలుసా?" ఎదురుగా నిల్చుని అన్నది శారద.

"అన్నీ అబద్ధాలు. నేనేం బాగా వుండను. నల్లగా వుంటాను" అన్నది కరుణ.

"నలుపైతేనేం? పార్వతి నలుపు కాదూ?"

"ఏ పార్వతి?" అమాయకంగా అడిగింది కరుణ.

"ఆ పార్వతే...ఆదిశక్తి పార్వతి - త్రిమూర్తుల భార్యల్లో పార్వతే అందమైందట. నువ్వు పార్వతీదేవిలా నిండుగా అందంగా వున్నావ్!" అన్నది శారద.

కరుణ ముఖంలో సంతోషం లేదు.

"కరుణా! ఎందుకమ్మా దిగులు?" ఆప్యాయంగా అడిగింది శారద.

"వదినా! ఈ సంబంధం కూడా తప్పిపోతే - వాళ్ళకు నేను నచ్చకపోతే...?" దిగులుతో వాక్యాన్ని పూర్తిచెయ్యలేకపోయింది కరుణ.

"ఛ! ఏమిటమ్మా ఆ మాటలు? నువ్వు నచ్చకపోవడం ఏమిటి? ఎంత అందంగా కన్పిస్తున్నావో నీకేంతెలుసు?" అన్నది శారద.

కరుణ నవ్వింది. దిగులుగా నవ్వింది. బరువుగా నవ్వింది. విరక్తిగా నవ్వింది.

అమ్మకు తను రొమ్ములమీది కుంపటిలా వుంది. అన్నయ్యకు తను బరువుగా వుంది. శారద జీవితానికి తను అడ్డుగా వుంది. శారద ఎంత మంచిదో!

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావ్? ఉత్సాహంగా వుండాలి" అన్నది శారద.

కరుణ మళ్ళీ నవ్వింది. అదే నవ్వు నవ్వింది.

పెళ్ళికొడుకు బి.ఏ. పాసయి, గుమాస్తాగా ఏదో ఆఫీసులో గుంటూర్లో పనిచేస్తున్నాడు. ఈ సంబంధం కస్తూరి భర్త సుబ్బారావు తెచ్చాడు. అతను సుబ్బారావుకి దూరపు బంధువు. క్లాసుమేట్.

కనకమ్మ ఫలహారాలు సిద్ధంచేసి లేచింది.

"అమ్మా! వాళ్ళు వచ్చేశారు. శారదా! కరుణ తయారుగా వుందా?" విశ్వనాథం హడావిడి చేశాడు.

పెళ్ళికొడుకు పేరు రాఘవరావు. మరో స్నేహితుడితో వచ్చాడు. సుబ్బారావు రాలేనని రాశాడు.

పెళ్ళికొడుకును చూసి శారద పెదవి విరిచింది. ఆమెకు అతని రూపం నచ్చలేదు. అతని చూపులు అంతకన్నా నచ్చలేదు. ముఖం చూడగానే మంచివాడనే అభిప్రాయం కలగలేదు. ఆ మాటే విశ్వంతో అన్నది.

"నీ మొహం! చూడగానే మంచో చెడో ఎలా తెలుస్తుంది?" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"మొరటుమనిషిలా కన్పిస్తున్నాడు" అన్నది శారద.

"నలుపనా? మనమ్మాయి నలుపుకాదా?" అన్నాడు విశ్వం.

"నలుపని కాదు. నలుపులో ఎంతమంది అందంగా వుండేవాళ్లు లేరు? మగవాళ్ళకు పర్సనాలిటీ వుండాలి. రంగుకాదు ప్రధానం!" అన్నది శారద.

"అంటే నాలాగ?" కొంటెగా చూస్తూ అన్నాడు.

"మీరు పెద్ద అందగాళ్లేం కాదు."

"కాకపోబట్టే నా వెంబడి పడి ప్రేమించావ్!"

"ఉష్! మీ అమ్మగారు వస్తున్నారు" అన్నది శారద.

"ఆఁ శారదా! చూడూ, కరుణను తీసుకురా!" తడబడుతూ అన్నాడు విశ్వం.

శారద నవ్వుకుంటూ కరుణ దగ్గిరకు వెళ్ళింది.

కరుణ తలెత్తి పెళ్ళికొడుకుని చూడలేదు. ఆమె ధోరణి తనకు ఎవరైనా ఒకటే అన్నట్టుంది.

పెళ్ళికొడుకు ఆ ఎర్రటి కళ్ళలో కాంక్ష నింపుకొని కరుణను చూస్తూ వుంటే శారదకు ఎబ్బెట్టుగా అన్పించింది.

ఫలహారాలు ముగిశాయి, అందరూ లేచారు. విశ్వం లేచి వాళ్ళతో బయటికి వెళ్ళాడు.

"మా వాడికి మీ అమ్మాయి నచ్చింది, ముహూర్తాలు పెట్టించండి" అన్నాడు. పెళ్ళికొడుకు స్నేహితుడు.

"కట్నం విషయం కూడా ఇప్పుడే తేల్చుకుంటే బాగుంటుంది" అన్నాడు విశ్వనాథం.

"సుబ్బారావు రాయలేదూ?" అడిగాడు రాఘవరావు.

"పది వేలు అడుగుతున్నారని రాశాడు. కాని, మేము అంత ఇచ్చుకోలేం" అన్నాడు విశ్వం.

"మా వాడికి ఇరవై వేలు ఇస్తామంటున్నారు. కానీ వీడికి ఆ పిల్ల నచ్చలేదు" అన్నాడు రాఘవరావు స్నేహితుడు.

"కావచ్చు. కాని, మేం ఐదువేల కన్నా ఇవ్వలేం." ఖచ్చితంగా అన్నాడు విశ్వనాథం.

"వాడికి పిల్ల నచ్చింది. కట్నం గురించి పెద్దగా పట్టింపులేదు. ఐనా, ఐదు వేలు చాలా తక్కువ. ఏడువేలన్నా ఇవ్వండి" అన్నాడు అతని స్నేహితుడు.

చివరకు ఆరువేలకు కుదిరింది. ఆడపిల్ల పుట్టింట్లో అమ్మకానికి కొట్లో పెట్టిన బొమ్మలాంటిది. కాదు – బొమ్మకంటే హీనమైంది. కొట్లో బొమ్మను అమ్మితే అమ్మినవాడికి లాభం వుంటుంది. కాని, ఇక్కడ అలాకాదు. ఆడపిల్లను డబ్బు ఇచ్చి అమ్మాలి!

దారుణం! అనుకున్నాడు విశ్వనాథం.

కనకమ్మకు గుండెలమీద బరువు దించినట్టు అయింది. కాని, మరో దిగులు పట్టుకుంది. ఆరువేలు ఎక్కడ్నుంచి తేవాలి? ఆరు వేలు కట్నంకింద ఇస్తే మరి పెళ్ళి ఖర్చులూ – లాంఛనాల సంగతేమిటి?

"ఎంత లేదన్నా ఇప్పుడు పదివేలు కావాలి. కస్తూరి పెళ్ళికి చేసిన అప్పు ఇంకా అలాగే వుంది. ఎక్కడ్నుంచి తెస్తావురా?" అన్నది కనకమ్మ దిగులుగా.

"ఇల్లు తాకట్టు పెడ్తాను."

కనకమ్మ బాధగా కొడుకు ముఖంలోకి చూసింది.

"తప్పదమ్మా!" అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

"నీకు అతను నచ్చాడా కరుణా? నిజం చెప్పు" అన్నది శారద.

"నేను అసలు చూస్తేగా నచ్చడానికీ నచ్చకపోవడానికీ?" కరుణ అతి మామూలుగా అన్నది.

శారద ఆశ్చర్యంగా కరుణ ముఖంలోకి చూసింది.

"అసలు అతన్ని చూడలేదా? అంటే, నీకు ఈ పెళ్ళి ఇష్టంలేదా?"

"ఎందుకు ఇష్టంలేదూ?"

శారదకు కరుణ ధోరణి అర్థం కాలేదు.

"మరి అతన్ని ఎందుకు చూడలేదూ?"

"నా పెళ్ళికి కావాల్సింది వరుడు నాకు నచ్చడం కాదు – అతనికి నేను నచ్చడం!" అన్నది కరుణ.

"అదేమిటి?"

"ఆలోచిస్తే నీకే అర్థం అవుతుంది. ఇక నన్నేమీ అడక్కు" అన్నది కరుణ.

ముహూర్తాలు పెట్టుకున్నారు. పెళ్ళి ఇంకా పదిహేను రోజులుంది.

"అమ్మా! ఈ పెళ్ళి చెయ్యడానికి వీల్లేదు. మా అమ్మాయిని యివ్వనని రాసేస్తాను!" ఆఫీసునుంచి వస్తూనే అన్నాడు విశ్వం.

తల్లి కొడుకు ముఖంలోకి వింతగా చూసింది. విశ్వానికి పిచ్చి పట్టలేదు గదా అనుకుంది.

"నా స్నేహితుడు ఒకడు ఉత్తరం రాశాడు. ఆ రాఘవరావు పనిచేసే ఆఫీసులోనే పనిచేస్తున్నాడట. అతనికి నా చెల్లెల్ని ఇస్తున్నట్టు మొన్ననే తెలిసిందట."

"ఏం రాశాడురా?" ఆతృతతో అడిగింది కనకమ్మ.

"అతను మంచివాడు కాడట. అన్నీ చెడ్డ అలవాట్లేనట. చాలా వింతమనిషట!" అన్నాడు విశ్వం.

కనకమ్మ కాళ్ళకు భూమి. తగలడంలేదు. ఓపికలేనిదానిలా బల్లమీద కూలబడింది.

"తీరా ముహూర్తాలు పెట్టుకున్నాక ఇదేమిటిరా బాబూ?"

"ముహూర్తాలు పెట్టుకున్నామని కరుణ గొంతు తెలిసి కొయ్యమంటావా అమ్మా?"

మగవాడికి మంచీ చెడూ ఏమిటి? మగవాడికి ఎన్నో అలవాట్లుంటాయి. బయట తిరిగేవాడు. ఆ మాటకొస్తే తన భర్తకు ఎన్ని చెడ్డ అలవాట్లు వుండేవి కావు? తను కాపరం చెయ్యలేదూ? పిల్లల్ని కనలేదూ?

"కుదరక కుదరక ఒక సంబంధం కుదిరింది. తీరా ముహూర్తాలు పెట్టుకున్నాక ఆగిపోతే మళ్ళీ దానికి పెళ్ళవుతుందా? ఇదేం ఖర్మంరా!"

"ఆరువేలు కట్నం ఇచ్చి అలాంటి త్రాష్టుడికా ఇవ్వడం? మరో సంబంధం చూస్తాను. నువ్వు గొడవ చెయ్యకు." విసుగ్గా అన్నాడు విశ్వం.

తలుపు చాటున నిల్చుని కరుణ వాళ్ళ సంభాషణ విన్నది.

"అన్నయ్యా!" అంటూ ముందుకు వచ్చింది.

"భయపడకమ్మా! త్వరలోనే ఇంతకంటే మంచి సంబంధం తెస్తానుగా?" అన్నాడు విశ్వనాథం.

"నేను అతన్నే చేసుకుంటాను!"

"అమ్మా కరుణా!"

"అవు నన్నయ్యా!"

"నువ్వు ఆ మాట మనస్ఫూర్తిగా అంటున్నావా కరుణా?" చెల్లెలి ముఖంలోకి లోతుగా చూస్తూ అడిగాడు విశ్వం ఆశ్చర్యంగా.

"ఆఁ- మనస్ఫూర్తిగానే అంటున్నాను. నేను అతన్నే చేసుకుంటాను!" పాఠం అప్పగించినట్టు అనేసి గిర్రున తిరిగి లోపలకు వెళ్ళిపోయింది కరుణ.

కనకమ్మ గుండెల నిండుగా గాలి పీల్చుకుంది.

అన్నయ్యకు తనంటే ప్రేమ. శారద చాలా మంచిది. వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటున్నారు. తన పెళ్ళయితేగాని వాళ్ళపెళ్ళి కాదు.

తన పెళ్ళి అందరికీ సమస్యే అయింది. అన్నయ్య ఇల్లు తాకట్టు పెట్టాడు. ముహూర్తాలు పెట్టుకున్నారు. ఈ పెళ్ళి ఆగిపోతే అమ్మకు పిచ్చి ఎక్కుతుంది.

కరుణ పెళ్ళయింది. కనకమ్మ సంతోషానికి అంతేలేదు. పెళ్ళికి కస్తూరీ, కస్తూరి భర్త సుబ్బారావూ వచ్చారు.

శారద కరుణనే కనిపెట్టుకొని వుంది. కస్తూరికి శారద నచ్చలేదు.

స్వభావంలో కరుణకూ కస్తూరికీ చాలా భేదంవుంది అనుకుంది శారద. ఆ మాటే విశ్వంతో అంటే - నవ్వి ఊరుకున్నాడు.

కరుణ అత్తవారింటికి వెళ్ళిపోయింది.

కరుణ శారదను చుట్టుకొని ఏడుస్తూవుంటే కస్తూరికి వళ్ళు మండిపోయింది.

చాలాకాలానికి కనకమ్మ ఆ రాత్రి ఆదమర్చి నిద్రపోయింది.

# 9

సంవత్సరం తిరక్కుండా కరుణ పుట్టింటికి చేరింది. అత్తగారింటి నుంచి తొలిసారి పుట్టింటికి వచ్చే అందరు ఆడపిల్లల్లా రాలేదు. అందుకే ఆ ఇల్లు ఆమెను చేతులు చాచి ఆహ్వానించలేదు.

కనకమ్మ కరుణ ఎదురుపడితే తప్పుకు తిరుగుతూ వుంది. మాటల్లోని కరుకుదనం మనసులోకి తెచ్చుకోలేకపోయింది. మనసులోని మెత్తదనం కళ్ళల్లో కన్పిస్తుందని ఆమెభయం.

తను ఆప్యాయంగా మాట్లాడితే కరుణ పుట్టింట్లోనే వుండిపోతుందని కనకమ్మ భయం.

రాత్రంతా నిద్రలేని కరుణ తెల్లవారి కాఫీతాగి పడుకుంది. మధ్యాహ్నం భోజనానికి పిలవడానికి శారద ఆ గదిలోకి వెళ్ళింది. ఆ రోజు శారద ఆఫీసుకు వెళ్ళలేదు. కరుణ వళ్ళు తెలియకుండా నిద్రపోతూంది. ఒక కాలుమీద చీర పైకి తొలిగివుంది. నల్లటి వాతలు రెండు కన్పించి శారద విస్మయం చెందింది.

"కరుణా! కరుణా!" కుదిపి లేపింది శారద.

కరుణ చివ్వున లేచి కూర్చుంది.

ఆ వాతల్ని గురించి ప్రశ్నించింది. కరుణ వెంటనే సమాధానం చెప్పలేదు.

శారద బలవంతపెట్టింది. కరుణ చీర తొలగించి చూపించింది. రెండుకాళ్ళమీద తొడలవరకు వాతలు ఉన్నాయి. నల్లటి గుండ్రటి మచ్చలుకూడా వున్నాయి. వీపు చూపించింది. అక్కడా నల్లటి కాలిన మచ్చలున్నాయ్.

శారదకు మతిపోయినట్టే అయింది.

"ఏమిటవి? ఆ మచ్చలూ, వాతలూ ఎలా పడ్డాయి?" అడిగింది శారద.

కరుణ నవ్వింది.

"అలా నవ్వకు కరుణా! ఏం జరిగిందో చెప్పు."

కరుణ తల వంచుకుంది. జవాబు చెప్పలేదు.

"చెప్పవా? చెప్పకపోతే నామీద ఒట్టే!"

"వదినా! ఏంచెప్పను వదినా?" కరుణ కంఠం వణికింది.

"ఆ నల్లటి గుండ్రటి మచ్చలు ఏమిటి?"

"సిగరెట్‌తో కాల్చిన మచ్చలు!"

శారద పిచ్చిదానిలా చూసింది కరుణ ముఖంలోకి.

"మరి ఆ వాతలు?" బలవంతంగా గొంతు పెగల్చుకుని అడిగింది శారద.

"అట్లకాడ కాల్చిపెట్టిన వాతలు!" కరుణ కంఠం గరగరలాడింది.

శారద బుర్ర గిర్రున తిరిగింది.

"అంత దుర్మార్గుడా?" తనకు తనే చెప్పుకుంటున్నట్టు అడిగింది శారద చిన్నగా.

కరుణ నవ్వింది.

"ప్లీజ్, కరుణా! అలా నవ్వకు. కావాలంటే ఏడువు. గుండెలు విచ్చిపోయేలా ఏడువు. మనసారా ఏడువు. కాని, అలా నవ్వకు. ఆ నవ్వును చూడలేను." ఆవేదనగా అన్నది శారద.

"వదినా!" ఆ పైమాటలు కరుణ కంఠంనుంచి పెగల్లేదు.

"కరుణా! అసలు ఏమి జరిగిందో చెప్పమ్మా? అతను అలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడు?"

కరుణ మాట్లాడలేదు.

"నా దగ్గిర చెప్పడానికి కూడా సందేహమేనా కరుణా! పోనీ, మీ అమ్మగారికి చెప్పు."

"వదినా! నా కష్టసుఖాలు నీకుకాక ఎవరికి చెప్పుకుంటాను? అమ్మవూ, వదినవూ కూడా నువ్వే! నువ్వు నన్ను ఆదరిస్తావనే ఆశతోనే ఈ ఇంటికి వచ్చాను వదినా!"

"అయితే నిజం చెప్పు. అతను ఎందుకు అంత క్రూరంగా ప్రవర్తించాడు?"

"తేలు ఎందుకు కుడుతుంది? పాము ఎందుకు కాటేస్తుంది? పులి ఎందుకు మనిషిని చంపుతుంది? చెప్పు వదినా!" సూటిగా శారద ముఖంలోకి చూసింది.

శారదకు వెన్నెముకలో ఏదో జరజర పాకుతున్నట్టు అనిపించింది. ఆమెకు ఎప్పుడో చదివిన ఇంగ్లీషు నవల గుర్తువచ్చింది.

అందులో హీరో మనదేశంలో జమీందారులాంటివాడు. అతను ఆడవాళ్ళ శరీరాన్ని బ్లేడుతో కోసి, సిగరెట్లతో కాల్చి నానా రకాలుగా హింసపెట్టేవాడు. వారు బాధపడుతుంటే అతనికి సంతోషం కలిగేది. సంతృప్తి కలిగేది. ఆ పుస్తకం పేరూ, ఆ వ్యక్తి పేరూ తనకు సరిగా గుర్తులేదు. కాని, అతని పేరుమీదే శాడిజం అనేమాట పుట్టింది.

బహుశా రాఘవరావుకూడా శాడిస్టు అయివుండాలి. అలాంటివాళ్ళు ఉంటారని తను విన్నది. కాని నమ్మకం కలిగేదికాదు.

"వదినా, ఏమిటి ఆలోచిస్తున్నావు? నా కథ వినాలని లేదా? అడిగావుగా?"

శారదగుండె ఎవరో పిండేస్తున్నట్టు విలవిలలాడింది.

"నీ కథ నాకు అర్థమయింది. నీలాంటివారి కథలన్నీ ఒకటిగానే ఉంటాయి. భారత స్త్రీ పవిత్ర గాథల్తో ఆకాశం ప్రతిధ్వనించి ఉండవచ్చును. పాతాళం కంపించి వుండవచ్చు. కాని, ఆమె కళ్ళలో శ్రావణమేఘాలు మాత్రం ఏనాడూ విచ్చిపోలేదు. హిమాలయ పర్వతాన్ని తలవంచేలా చేసే ఆమె గౌరవాన్నీ, సముద్రపు లోతును సవాలు చెయ్యగల ఆమె సహనాన్నీ చరిత్ర కన్నీళ్ళతోనే రచించింది. ఇప్పటికీ అదే జరుగుతూ ఉంది. ఇంకెంతకాలం జరుగుతుందో తెలియదు. పురుషుడు ఆమె చేసిన ప్రతి త్యాగాన్నీ ఆమె బలహీనతగా తలచి స్వీకరించాడు." తనలో తనే అనుకుంది శారద.

"ఏం వదినా, మాట్లాడవ్?"

"చెప్పమ్మా, వింటాను." ఎలాగో అనగలిగింది శారద.

"ఆయనకు అన్ని చెడుఅలవాట్లూ ఉన్నాయ్ వదినా! కట్నం డబ్బు అయిపోయేంతవరకూ, అప్పుడప్పుడు శారీరకంగా హింసించినా కొంతవరకు బాగానే చూశాడు. అంటే – ఆ డబ్బు అయిపోయేంతవరకూ వెల చెల్లించి కొన్న శరీరాన్ని హింసించాడనుకుంటాను. నా జోలికి వచ్చేవాడు కాదు. ఏ అర్ధరాత్రికో ఇల్లు చేరేవాడు. బాగా తాగి వస్తూనే నిద్రపోయేవాడు. ఎప్పుడైనా చేతిలో డబ్బులేక ఇంటికి త్వరగా వస్తే నా ప్రాణాలు గజగజలాడిపోయేవి."

ఆగింది కరుణ. శారద జాలిగా చూసింది.

"అతను పశువుకంటే హీనంగా ప్రవర్తిస్తాడు. సిగరెట్‌తో కాలుస్తాడు. ఇంకా...ఇంకా...అనేక రకాలుగా హింసిస్తాడు. భరించాను కొంతకాలం. మరీ భరించలేక ఎదురు తిరిగితే కాళ్ళు చేతులూ కట్టి అట్లకాడతో వాతలు పెట్టాడు."

"పర్వెర్టెడ్! శాడిస్టు! పశువు!" కోపంగా అన్నది శారద.

"ఒకోసారి చచ్చిపోవాలనిపించేది. ఒకటి రెండుసార్లు ప్రయత్నించికూడా ప్రాణాలు తీసుకోలేకపోయాను. జీవితంమీద మమకారాన్ని చంపుకోలేకపోయాను!" వదినముఖంలోకి చూస్తూ "ఏడుస్తున్నావా వదినా?" అన్నది కరుణ.

"అబ్బే లేదు" అంటూ కన్నీళ్ళు తుడుచుకుంది శారద.

"నేను నల్లగా ఉంటానట!"

"అతడు మహా అందగాడు కదూ?" కసిగా అన్నది శారద.

"మగవాడి అందం గురించి ఎవరు ఆలోచిస్తారు వదినా? నన్ను బయటికి వెంట తీసుకెళ్ళటానికి సిగ్గుపడేవాడు. కొత్తలో రెండుసార్లు సినిమాకు తీసుకెళ్ళాడు. తెలిసినవాళ్ళెవరైనా కన్పిస్తే నాకూ తనకూ ఏమీ సంబంధం లేనట్టూ, నాపాటికి నేనూ, అతనిపాటికి అతనూ రోడ్డుమీద వెళ్తున్నట్టూ, దూరంగా నడిచేవాడు.

అంతే మళ్ళీ ఎప్పుడూ ఎక్కడికీ తీసుకెళ్ళలేదు.

నాకూ అతనితో బయటికి వెళ్ళాలని ఉండేదికాదు. కట్నం డబ్బు అయిపోయింది. నెలజీతం వారంరోజులకే పూర్తి అయేది. అప్పులు కొంతకాలం చేశాడు. ఆ తర్వాత నా వంటిమీద ఉన్న ఒక్కొక్క నగా తీసుకున్నాడు."

"నువ్వెందు కిచ్చావ్?"

"నేను ఇచ్చే ప్రశ్నేలేదు. తీసుకెళ్ళేవాడు. ఒకటి రెండుసార్లు ఎదురుతిరిగాను. అతను బలవంతుడు. నేనేంచెయ్యగలను వదినా?"

మగవాడు బలవంతుడు. ఆదిమకాలంలోనే స్త్రీ దీన్ని గ్రహించింది. పురుషుని శారీరక బలానికి తలవంచింది. అతనితో ఘర్షణపడి అతన్ని లొంగదీసుకోవడం సాధ్యం కాదని గ్రహించింది. అందుకే తల్లో పువ్వులు పెట్టుకొనీ, చెవులకు లేత ఆకుల్ని ధరించీ, రకరకాల అలంకరణలతో అందంగా తయారైంది. పశుబలాన్ని శారీరక సౌందర్యంతో లొంగదీసుకోడానికి ప్రయత్నించింది.

అంతటితోనే – ప్రేయసి కావడంతోనే – ఆమె కర్తవ్యం పూర్తికాలేదు. మాతృత్వ భారాన్ని వహించింది. బలవంతులైన కొడుకుల్ని కని, భర్త గౌరవాన్ని పొందింది; ప్రేయసినుంచి భార్య, భార్య నుంచి తల్లిగా మారింది.

గంగాజలం మదిరకంటే అన్ని విధాలా శ్రేష్ఠమైంది అని పురుషుడికి తెలుసు. కాని, తనను తాను విస్మరింప చేసుకోవాలనుకునే వ్యక్తి గంగాజలాన్ని వదిలి మదిరనే సేవిస్తాడు.

స్త్రీ భార్యగా, గృహలక్ష్మిగా, తన పిల్లలకు తల్లిగా పురుషుడి కామదాహాన్ని పూర్తిగా తీర్చలేకపోయింది. అందుకే కొంతమంది స్త్రీలను ఈ పదవులనుంచి దూరంగా వుంచాడు పురుషుడు.

ఈ స్త్రీలే స్వర్గంలో అప్సరసలుగా, ఈ లోకంలో వారకాంతలుగా పిలువబడుతున్నారు.

అప్సరసల సృష్టి ఋగ్వేదంలోనే జరిగింది. అప్సరసలు స్పెషల్ క్లాసు దేవతలు. వారు గంధర్వుల్ని ప్రేమిస్తారు. హాయిగా, మత్తెక్కించేలా నవ్వుతారు. సతీవద బ్రాహ్మణంలో అప్సరసల్ని ఆటకూ, పాటకూ, అందానికీ ప్రతినిధులుగా నిలిపారు. పురాణాలలో ఇంద్రుడు ఆ అప్సరసల్ని తన కార్యసాధన కోసం పురుషుల దగ్గరకు పంపించిన సంఘటనలు ఎన్నో కన్పిస్తాయి. దక్షిణ భారతదేశంలోని దేవాలయాల్లోని దేవదాసీలకూ ఈ అప్సరసలకూ పోలికలు కన్పిస్తాయి.

దీనికంతకూ కారణం నారీ దౌర్బల్యమే. స్త్రీకి పొగడ్తలంటే చాలా ఇష్టం. స్త్రీ శారీరక దౌర్బల్యాన్ని సౌకుమార్యం అంటూ పొగిడాడు పురుషుడు. ఆ పొగడ్తలతో మైమరచిన స్త్రీ ఆ సౌకుమార్యాన్ని ఇంకా ఇంకా పెంచుకోవడానికి ప్రయత్నించింది. అది లేకపోవడం స్త్రీత్వానికి లోపం అనుకుంది. ఆ దౌర్బల్యమే స్త్రీకి శాపంగా పరిణమించిందని గుర్తించలేకపోయింది.

అదే ఈ నాటి కరుణ కథగా మారింది.

కాల ప్రవాహంలో ఎన్నో సామ్రాజ్యాలు కొట్టుకుపోయాయి. అనేక సంస్కృతులూ జాతులూ కాలగర్భంలో కలిసిపోయాయి. అసంభవాలు అనుకున్నవి సంభవాలు అయాయి. కాని, ఈ పవిత్ర భారతదేశంలో స్త్రీ జీవితంలో మాత్రం చెప్పుకోతగ్గ మార్పు లేమీ రాలేదు.

అత్తవారింటికి వెళ్ళిన ఆడపిల్లకు ఆ స్థానంతప్ప పుట్టింటికి వస్తే ఆశ్రయం లభించదు. ఆదరణ లభించదు. ఎందుకు ఇలా జరగాలి అని ఎప్పుడూ ఏ స్త్రీ ప్రశ్నించలేదు.

'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అన్నది శాస్త్రం. స్త్రీ నిజమే కాబోలు అనుకుంది. పసితనంలో తండ్రి రక్షణ, యవ్వనంలో భర్త రక్షణ, వృద్ధాప్యంలో కొడుకు రక్షణ ఆడదానికి అవసరం అన్నది శాస్త్రం. స్త్రీ నమ్మింది. భర్త చనిపోతే స్త్రీ భర్తతోపాటు చస్తేగాని పుణ్యం రాదన్నారు. ఆమె అదీ నమ్మింది. భర్తలేని స్త్రీ అలంకరించుకోకూడ దన్నారు. వికృతరూపంలో ఉండాలన్నారు. ఆమె అదికూడా నమ్మింది.

భర్త అనే పదానికి అర్థం భరించేవాడు. ఇతర దేశాలలోని ఏ భాషకు సంబంధించిన (భర్త) పదానికి ఈ అర్థం లేదు.

కరుణ శాస్త్రాలు చదవలేదు. ఆమెకూడా మొదట్లో అన్నీ నమ్మింది. అనుభవం ఆమెకు ఎన్నో నేర్పింది. ఆమె నమ్మకాలు పూర్తిగా మారిపోయాయి.

"ఒకరోజు ఏమైందో తెలుసా వదినా?" అంటూ శారద ముఖంలోకి చూసింది.

"చెప్పమ్మా!" అన్నది శారద.

"ఆయన చిన్నప్పటి స్నేహితుణ్ణి భోజనానికి పిల్చారు. ఆ ఊళ్ళో ఉండేవాడు కాదు. నన్ను ఆయనకు పరిచయం చెయ్యలేదు. కాని 'మీ ఆవిడ ఏదిరా?' అని అడగటం నాకు విన్పించింది. ఆయన సమాధానం నాకు విన్పించలేదు. నేను వినకూడదనే చిన్నగా చెప్పినట్టున్నారు.

వడ్డించి లోపలకు వెళ్తూ విన్నాను.

"ఎవర్రా ఆవిడ?" ఆ స్నేహితుడి ప్రశ్న.

"మా వంటమనిషి!" తగ్గుస్వరంతో ఆయన సమాధానం.

నేను ఒక్కక్షణం స్థాణువులా గడపలోనే నిలబడిపోయాను.

"మొత్తంమీద అదృష్టవంతుడివిరా! పెళ్లాం పుట్టింటికి వెళ్ళినా అందమైన పనిమనిషినే పెట్టివెళ్ళింది." అతను వెకిలిగా తన మాటకు తనే మురిసిపోతూ గొల్లున నవ్వాడు.

ఆయన ఏమన్నాడో నేను వినలేదు. కాదు - నాకు విన్పించలేదు. గడప పట్టుకొని నిలదొక్కుకున్నాను.

మళ్ళీ వాళ్ళ ముందుకు వచ్చి వడ్డిస్తూవుంటే జుగుప్సతో నా మనసు మండిపోయింది. అసహ్యంతో నా వళ్ళు కాలిపోయింది.

ఆయన స్నేహితుడు చూసే వెకిలిచూపులు నా శరీరానికీ మనసుకూ కూడా ములుకుల్లా గుచ్చుకున్నాయి.

నా భర్త తన పెళ్ళాన్ని స్నేహితునితో వంటమనిషి అని చెప్పడానికి జంకడు. తన పెళ్ళాన్ని చూసి పరాయి మగవాడు వెకిలిగా మాట్లాడితే బాధపడడు.

అటువంటి మొగుడితో ఇంతకాలం కాపరం చేశాను వదినా!" అంటూ ఆగి శారద ముఖంలోకి చూసింది.

"బ్రూట్!" శారద కసిగా అన్నది.

"అప్పుడు నాకేమనిపించిందో తెలుసా? భూదేవి బద్దలు కావాలనీ, అందులోకి నేను ఇమిడిపోవాలనీ, మళ్ళీ ఆయన మొఖం నా కళ్ళకు కన్పించకూడదనీ అనిపించింది. కాని, భూదేవి బద్దలు కాలేదు. నేను అతని ముఖం చూడక తప్పలేదు.

ఆ రాత్రి ఆయన చెయ్యి నా వంటిమీద పడగానే నాలోని ప్రతి జీవాణువూ ఎదురు తిరిగింది. నాగినిలా 'బుస్'న లేచాను.

నా రూపం చూసి ఆయన ఒక్క క్షణం దిమ్మెరపోయారు. ఆడది మగవాడిమీద తిరగబడింది! భార్య భర్తమీద తిరగబడింది! అది ఆయనకు కొత్త. ఊహించని విషయం. అందుకే ఓ క్షణం తెల్లముఖం వేశాడు.

"నా గురించి మీ స్నేహితుడితో ఏం చెప్పారు?" అడిగాను కోపంగా

ఓ క్షణం నా ముఖంలోకి చూసి "అదా! అయితే విన్నావన్నమాట!" నిర్లక్ష్యంగా అన్నాడు.

"సిగ్గులేదూ, పరాయి మగవాడితో పెళ్ళాన్ని వంటమనిషి అని చెప్పడానికి?" కసి కక్కాను.

"నిన్ను పెళ్ళాం అని చెప్పుకోడానికి సిగ్గువేసేగా అట్లా చెప్పుకున్నా!" వెకిలిగా అన్నాడు అతను.

రెండు మేకపోతుల్ని ఒకేసారి మింగి. జీర్ణించుకోవడానికి చెట్టును చుట్టుకుంటున్న కొండచిలువలా కన్పించాడు. పసిబిడ్డను నోట కరుచుకు వెళ్తున్న తోడేలులా కన్పించాడు. అనేక జతల కాళ్ళతో నున్నటి తెల్లటిగచ్చుమీద పాకుతున్న నల్లటి పురుగులా కన్పించాడు. వళ్ళు అసహ్యంతో జలదరించింది.

అతనికి ఆడదంటే గౌరవంలేదు.

అతనిదృష్టిలో ఆడదానికీ వంటిమీద వేసుకునే షర్టుకూ భేదం లేదు.

అతని అభిప్రాయంలో-

ఆడది బానిస.

పిల్లల్ని కనే యంత్రం.

వంట మనిషి.

బట్టలు ఉతికే పనిమనిషి.

అతని కోర్కెలు తీర్చే రక్తమాంసాలుగల బొమ్మ!

ఆ రాత్రి ఎదురు తిరిగాను. నానాహింసా పెట్టాడు. సిగరెట్‌తో కాల్చాడు. అది మామూలే. సంతోషంగా వున్నప్పుడు కూడా కాలుస్తాడు. అలా కాలిస్తేగానీ, నేను బాధతో కేకలు పెడ్తుంటేగానీ అతనికి ఆనందంగా వుండదు. కాని, ఆ రోజు ఎదురుతిరిగాను. అందుకే కాళ్ళూ చేతులూ కట్టి వాతలు పెట్టాడు.

నేను బాధతో విలవిలలాడుతూ వుంటే వికృతంగా నవ్వాడు."

"మనిషి ఇంత దారుణంగా ప్రవర్తిస్తాడా?" శారద తనకు తనే ప్రశ్న వేసుకున్నట్టు అన్నది.

కరుణ శారద ముఖంలోకి చూసింది.

"చాలామంది నమ్మరు వదినా, ఇటువంటి మగవాళ్ళు కూడా వుంటారంటే."

"అవునమ్మా! అనుభవించిన ఆడదానికే తెలుస్తుంది, అందరికీ ఎలా తెలుస్తుంది?" అన్నది శారద బాధగా చూస్తూ.

"ఇంత నరకం అనుభవించావా కరుణా?" మళ్ళీ శారదే ఆర్ద్రంగా అన్నది.

కరుణ నవ్వింది.

మోనాలిసా నవ్వుకైనా నిర్వచనం ఇవ్వవచ్చునేమోగాని, ఆ నవ్వుకు నిర్వచనం ఎవరూ ఇవ్వలేరు. చూసిన మనసు అనుభవించాల్సిందే. ఆ స్థితిలోనే పడిపోయింది శారద.

"ఈ సంవత్సరం రోజుల్లో వెయ్యిసంవత్సరాలు బతికాను. ఏడు జన్మల దుఃఖం అనుభవించాను." ఒక్కక్షణం ఆగి నిట్టూర్చింది కరుణ.

"మొన్న రాత్రి ఏదైనా నగ ఇవ్వమని అడిగాడు. ఇంకా నా దగ్గిర ఏముంది, అన్నీ మీరే వలిచేశారుగా అన్నాను. మాంగల్యం ఇవ్వమన్నాడు.

నేను బెదిరిపోయాను. ఉగ్గుపాలతో రంగరించి పోసిన సాంప్రదాయాల నమ్మకం నా నరనరంలో జీర్ణించుకొని వుంది. ఆయన అలా అడగటం అమంగళకరంగా భావించాను. భర్త బ్రతికి వుండగా మాంగల్యం తీసెయ్యడం నా ఊహకు అందని విషయం. నిలువెల్లా వణికిపోయాను.

అగ్ని సాక్షిగా కట్టిన మాంగల్యం, అతి పవిత్రమైన మాంగల్యం, ఆ మాంగళ్యాన్ని నా మెళ్లో కట్టించడానికి అమ్మ ఎంత ఆవేదన పడిందో నాకు తెలుసు - అన్నయ్యా, నువ్వూ ఎంత ఆరాటపడ్డారో తెలుసు. అది - ఆ మాంగల్యం ఆడదాని సౌభాగ్యం, ఆడదాని జీవితం అంటారు. అది ఒకప్పుడు భర్తకు తప్ప పర పరుషుడికి కన్పించేది కాదట!.

ప్రతి ఆడదీ, ఎన్ని బాధలుపడ్డా, మాంగల్యం మెళ్ళో వుండగా చచ్చిపోవాలని కోరుకుంటుంది. చెట్టంత భర్త ఎదురుగా వుండగా అందుకే నా మాంగల్యాన్ని తియ్యలేకపోయాను. ఇవ్వనన్నాను. దెబ్బలు భరించాను. జుగుప్స కలిగించే తిట్లు భరించాను. అయినా ఇవ్వనన్నాను.

చివరకు ఆయన బలవంతంగా తెంపుకున్నాడు. పుటుక్కున తెగింది. తెగింది దారం కాదు - నా మనసు, నా నమ్మకాలు!

ఆ తాడు - తను కట్టిన తాడు - తానే పుటుక్కున తెంపుకొని వెళ్ళిపోయాడు.

అంతవరకూ వున్న బంధం ఏదో తెగిపోయినట్టు అనిపించింది.

ఏ బంధంతో పెద్దలందరూ మమ్మల్ని కలిసి బతకండి అని ఒక చోటుకు చేర్చారో ఆ బంధం తెగింది. కాదు - ఆయనే ఆ బంధాన్ని తెంచాడు.

కట్టినవాడికి లేని గౌరవం ఆ మాంగల్యం మీద నా కెందుకు వుండాలి? నాకు విముక్తి లభించింది. నేను ఇప్పుడు విముక్తురాల్ని అనుకొనే ఇక్కడికి వచ్చేశాను.

ఇది నేను పుట్టిన ఇల్లు, నేను పెరిగిన ఇల్లు, నేను మాటలు నేర్చింది ఈ ఇంట్లోనే. భవిష్యత్తు గురించి కలలు కన్నది ఈ ఇంట్లోనే. ఈ ఇల్లు నన్ను తన గుండెల్లో దాచుకుంటుంది అనుకున్నాను. నన్ను ఓదారుస్తుంది అనుకున్నాను. అందుకే ఇక్కడకు వచ్చాను వదినా!

కాని, తీరా వచ్చాక నేను రాకూడని చోటుకు వచ్చానని తెలుసుకున్నాను!"

"ఏమిటి కరుణా, ఆ మాటలు? నువ్వు రావాల్సిన చోటుకే వచ్చావు. ఇక్కడికి రాక మరెక్కడి వెళ్లావమ్మా!" అంటూ గుండెలకు హత్తుకుంది కరుణను శారద.

# 10

రాత్రి శారద భర్తతో అన్ని విషయాలూ చెప్పింది.

విశ్వనాథానికి పిచ్చికోపం వచ్చింది.

"రాస్కెల్! పశువు!" పళ్ళు కొరికారు.

"కరుణలాంటి పిల్లకు రావాల్సిన కష్టం కాదు. అసలు ఆ పెళ్ళి మీరు చెయ్యాల్సింది కాదు. తెలిసి తెలిసి కరుణ గొంతు కోసేశారు" అన్నది శారద.

"నేనేం చెయ్యను? కరుణే చేసుకుంటానంటే?" అసహాయంగా చూశాడు.

"కరుణ ఎందుకు ఒప్పుకుందో ఆలోచించారా? తన పెళ్ళి అందరికీ సమస్యగా మారిందనే భావంతో ఆ నిర్ణయానికి వచ్చింది. ఇప్పుడు ఆ విషయం తర్కించి లాభంలేదు. ముందు ఏం చెయ్యాలో ఆలోచించండి."

"అమ్మకు తప్పంతా కరుణదిగానే కన్పిస్తుంది. ఎలాగయినా నచ్చజెప్పి మళ్ళీ భర్త దగ్గిరకు పంపించమని ఒకటే గొడవ చేస్తుంది" అన్నాడు విశ్వం.

"ఆడది ఎన్ని బాధల్నయినా భరించాలి. అంతేగాని, భర్తను విడిచి రావడం ఏమిటి? బతక గలిగినంతకాలం బతకాలి. బతకలేనప్పుడు చావాలి. అంతేగాని, పుట్టింటికి రావడం ఏమిటి..."

"శారదా?" విశ్వనాథం కోపంగా అరిచాడు.

"అని నేను అనడం లేదు. మీ అమ్మగారి అభిప్రాయాలు చెప్తున్నాను. అంతకంటే ఆమె ఆలోచించలేదు. ఆమె నమ్మకాలు అవి. ఇప్పుడు మారాలంటే ఎలా మార్తాయి?"

"అందుకని కరుణను మళ్ళీ ఆ నరకంలోకి పంపించమంటావా?" తీవ్రంగా అడిగాడు విశ్వనాథం.

శారద భర్తను చూసింది.

"బతకలేకపోతే ఆత్మహత్య చేసుకోమని చెప్పమంటావా?" విశ్వం కంఠం వణికింది.

"కరుణ ఆత్మహత్య చేసుకొనేటంత పిరికిదికాదు. ఆ మాట తనే అన్నదిగా! ఆమె మనసు ఎంత మెత్తనిదో అంత కఠినమైందికూడా. కరుణ మానసికంగా బాగా పెరిగింది. జీవితం నుంచి ఆమె చాలా నేర్చుకుంది. అందుకే ఆమె ప్రశ్నలకు ఇంత చదువుకున్న నేనూ సమాధానాలు ఇవ్వలేకపోతున్నాను. ఆమె మాటల్లో బలం వుంది. నిజం వుంది. ఆమె అన్నమాటలు వింటే మీకే ఆశ్చర్యం వేస్తుంది."

"ఏమన్నది?"

శారద చెప్పింది, విని విశ్వం ఆలోచనలో పడ్డాడు.

"కరుణ మనకు బరువుకాదు. మన దగ్గిరే వుంచుకుందాం" అన్నాడు విశ్వనాథం భార్య ముఖంలోకి చూస్తూ.

"అది నిజమే కాని, కరుణ ఎంతకాలం యిలా ఇతరుల దయాధర్మాలమీద ఆధారపడి ఉంటుంది?"

"మనం పరాయివాళ్లమా?"

"కాదు, ఆమె మనకు భారం కాదు. కాని, ఆమె ఎంతోకాలం అలా అనుకోలేక పోవచ్చుగా?"

"ఇన్నింటికీ నువ్వనే దేమిటి? అమ్మ చెప్పినట్టు కరుణను ఇంట్లో నుంచి తరిమి వెయ్యమంటావా?"

శారద చివ్వున తలెత్తి భర్త ముఖంలోకి చూసింది.

"నన్ను నువ్వు అర్థం చేసుకుంది ఇంతేనా?" అన్నట్టు చూసింది.

విశ్వనాథం ముఖం ఇబ్బందిగా పెట్టాడు.

"కరుణను ఇంట్లో నుంచి వెళ్ళగొట్టమని నేను అంటానా? ఇదేనా మీరు నన్ను అర్థం చేసుకుంది?"

"నువ్వు నన్నేం చెయ్యమంటున్నావో నాకు అర్థం కావడంలేదు."

"కరుణ మెట్రిక్ తప్పింది. మళ్ళీ పరీక్షకు కూర్చోమని చెబుదాం. ఆ తర్వాత కాలేజీలో చదివిద్దాం. బి.ఏ. పాసయాక ఏ ట్రైనింగుకో పంపిస్తే తన బతుకు తను బతుకుతుంది."

"నువ్వెంత మంచిదానివి శారదా!"

"ఏమిటా సినిమా డైలాగు?" పకపక నవ్వింది శారద.

# 11

రెండోరోజు సాయంత్రం ఆఫీసునుంచి వస్తూ విశ్వనాథం మెట్రిక్ పుస్తకాలు కొనుక్కొని వచ్చాడు.

"కరుణా! కరుణా!" కేకలుపెట్టాడు లోపలకువస్తూనే.

"ఏమిటన్నయ్యా?" కళ్లు తుడుచుకుంటూ బయటికి వచ్చింది కరుణ.

"ఏడుస్తున్నావా చెల్లీ?" విశ్వం కంఠం ఆర్ద్రతతో నిండిపోయింది.

"లేదు – ఏడవటం లేదు!" ముఖం తిప్పుకొని అన్నది కరుణ.

"ఏదీ, ఇటు చూడు!"

కళ్ళు తుడుచుకొని అన్నవైపు తిరిగింది.

"ఆ కళ్ళు చూసుకో ఎలా వుబ్బివున్నాయో! నేనే నీ గొంతుకోశానమ్మా!"

"అన్నయ్యా! నువ్వేం చేశావ్? నేనే చేసుకుంటా నన్నానుగా?"

"నువ్వు చిన్నపిల్లవు. ఆవేశంలోనో – మరే ఉద్దేశంతోనో అన్నావు. అదే చాలు అన్నట్టు నేను బరువు దించేసుకున్నాను."

"అన్నయ్యా! నువ్వెందుకు బాధపడ్తావ్! నేనే అదృష్టహీనురాల్ని. నా దురదృష్టానికి ఎవరేం చేస్తారు?" అంటూ వేదాంతిలా నవ్వింది.

వసారాలో కూర్చుని బియ్యం బాగు చేస్తున్న కనకమ్మ అన్నీ విన్నది. మనసు ఎలాగో అయింది.

ఆ పాపంలో భాగం తనకే ఎక్కువ, పిల్ల పెళ్ళి ఎప్పుడౌతుందా అనే ఆరాటపడింది. పిల్ల సుఖం గురించి ఆలోచించలేదు.

కష్టమో సుఖమో భర్తతో వుండాలిగాని పుట్టింటికి వచ్చెయ్యడం ఏమిటి?

"జరిగిందేదో జరిగింది. ఇక నువ్వు వాడిదగ్గిరకు వెళ్లకు."

కనకమ్మ ఉలిక్కిపడింది ఎవరో ఈడ్చి తన్నినట్టు.

విశ్వం ఏమిటి అంటున్నాడు? చెల్లెల్ని మొగుడి దగ్గరకు వెళ్లొద్దు అంటున్నాడు.

అది అసలే మొండికి తిరిగింది దానికి భర్తంటే భక్తి లేదు. మాంగల్యం అంటే గౌరవం లేదు. మొండిమెడతో - తెంచేసినదానిలా తిరుగుతూంది.

దానికి తోడు వీడు ఒకడు. దాన్ని సమర్థిస్తున్నాడు. విశ్వానికి పిచ్చెక్కింది. కాదు- పెళ్లాం వాడి తల్లోకి పిచ్చి ఎక్కించింది.

శారదకేం? ఎన్నయినా చెబుతుంది? ప్రేమించి పెళ్ళి చేసుకుంది. కులంకాని వాణ్ణి చేసుకుంది. పెద్ద లెవరికీ చెప్పకుండా రిజిష్టరు పెళ్ళి చేసుకుంది. ఆవిడకు వంశం అంటే, సాంప్రదాయం అంటే ఏమిటో తెలియదు.

తన వంశం మచ్చలేని వంశం. విశ్వం కులంకాని పిల్లను చేసుకున్నందుకే తనెంతో కుంగిపోయింది. ఇప్పుడు చెల్లెలికి మొగుణ్ణి వదిలెయ్యమని చెబుతున్నాడు.

"ఇవి తీసుకో!"

"ఏమిటన్నయ్యా?"

"చూడు!"

"పుస్తకాలా?" ఆశ్చర్యంగా అడిగింది కరుణ.

"శారద చెప్పలేదా?"

"ఏదీ, నేనూ ఇప్పుడేగా ఆఫీసునుంచి వచ్చాను" అన్నది శారద.

"మెట్రిక్ పరీక్షకు చదువు. మార్చిలో పరీక్ష రాయొచ్చు. వదిన నీకు సహాయం చేస్తుంది."

కరుణ చూస్తూ నిల్చుంది.

"అవునమ్మా! ఆ తర్వాత కాలేజీలో చేరి చదువుకో!" అన్నది శారద

కనకమ్మకు గుండెలు చిక్కబట్టినై.

"ఒక డిగ్రీ చేతిలో వుంటే ఎందుకైనా మంచిది" అన్నాడు విశ్వం.

"ఎందుకు కరుణా, అలా చూస్తున్నావ్? నువ్వు మాకు బరువు అని మేం అనుకోవడం లేదు. ఊరికే కూర్చుంటే నీకేం తోస్తుంది చెప్పు? ఏదో వ్యాపకం వుండాలిగా?" అన్నది శారద.

"వదినా! నేను తప్పక చదువుకుంటాను." ఉత్సాహంగా అన్నది కరుణ.

కనకమ్మ గుండెలు దడదడలాడాయి.

అంటే, ఇది శాశ్వతంగా మొగుణ్ణి వదిలేసినట్టేనా?

కనకమ్మ చివ్వున లేచింది. చేతిలో వున్న చేట కిందపెట్టి. సుడిగాలిలా రివ్వున లోపలకు వచ్చింది.

"ఏమిట్రా విశ్వం? నేను ఇంకా బతికే వున్నానని మర్చిపోయావా?" కోపంగా అరిచింది.

"ఏమిటమ్మా నువ్వనేది?"

"లేకపోతే ఏమిట్రా? దాన్ని మొగుడి దగ్గిరకు వెళ్లొద్దంటావా? చదివిస్తావా? నీకు ఇదేం బుద్ధిరా? పండంటి సంసారం..."

"అమ్మా!...పండంటి సంసారమా అది? తెలుసుకోకుండా మాట్లాడకు. కరుణ చదువుకోవాలి. ఆ తర్వాత దానికి ఇష్టం అయితే - అతనిలో మార్పువస్తే - ఆ సంసారం కుదుటపడితే - నాకూ సంతోషమే. ఇప్పుడు మాత్రం నువ్వేం చెప్పకు." విసురుగా అని అక్కడనుంచి విస విసా వెళ్ళిపోయాడు విశ్వనాథం.

"తల్లీ! శారదమ్మ తల్లీ! ఇదంతా నువ్వు చేస్తున్న నిర్వాకమే తల్లీ!"

"అవునత్తయ్యా! నేనే చేస్తున్నాను."

"సిగ్గులేదూ అలా చెప్పడానికి?"

"సిగ్గెందుకూ? నేనేం చెడ్డపని చెయ్యడం లేదే?"

"ఊరుకో వదినా!" అంటూ వదినచెయ్యి పట్టుకొని లోపలకు తీసుకెళ్ళింది కరుణ.

"నా కర్మ! నా రాత!" తల బాదుకుంటూ శోకాలు తీసింది కనకమ్మ.

# 12

శారదా, విశ్వం ఆఫీసుకు వెళ్ళాక కనకమ్మ కరుణకు నీతిబోధలు చేసింది.

కరుణ పెదవి కదపకుండా అన్నీ విన్నది. ఒక్క ప్రశ్నకూ సమాధానం ఇవ్వకుండా లేచి వెళ్ళిపోయింది.

కరుణ మెట్రిక్‌పుస్తకాలు శ్రద్ధగా చదువుతూవుంది. కరుణ చేతిలో పుస్తకం చూస్తే కనకమ్మకు గంగెర్లు పుట్టుకొస్తున్నాయ్. ఎన్నోసార్లు కరుణ చేతిలో పుస్తకం లాగి నేలకేసి కొట్టింది. పిచ్చిగా తిట్టింది. కరుణ మౌనంగా వుండిపోయింది.

కనకమ్మ కరుణతో మాట్లాడటం మానేసింది. శారదతో కూడా తనుగా మాట్లాడదు. అడిగినదానికి ముభావంగా సమాధానం చెబుతుంది.

అవసరం అనుకుంటే విశ్వంతో మాట్లాడుతుంది.

ఆ ఇంట్లో తనంటే ఎవరికీ లక్ష్యం లేదు. గౌరవం లేదు. ఖాతరు లేదు. తనంటూ ఒక మనిషి వున్నట్లు గమనింపే లేదు.

"ఛీ! ఎంత మురికి బతుకై పోయింది!" అందరూ వినేలాగ ఎన్నోసార్లు అనుకుంది.

అయినా ఎవరూ పట్టించుకోలేదు.

కనకమ్మ వసారాలో గోడకు చేరబడి కూర్చుని ఆలోచిస్తూ వుంది.

"ఏంచేస్తున్నావు వదినా?"

కనకమ్మ చివ్వున తలెత్తి చూసింది.

పక్కింటి కాంతమ్మ కన్పించింది.

"రా వదినా! భోజనాలు అయ్యాయా?" ఆ సమయంలో కాంతమ్మ రావడం కనకమ్మకు ఇష్టం లేదు. అయినా మర్యాదకు పలకరించింది.

"ఇప్పుడే తిన్నాను" అంటూ కాంతమ్మ చూపులు లోపలకు సారించింది.

కాంతమ్మ చూపులు లోపల దేనికోసం గాలిస్తున్నాయో కనకమ్మకు అర్థం కాకపోలేదు.

కనకమ్మ కనుబొమలు ముడిపడ్డాయి.

"కరుణ వెళ్ళిపోయిందా వదినా?" లోపలకు చూస్తూనే అడిగింది కాంతమ్మ.

"ఇంకా లేదు." సాధ్యమైనంత మామూలుగా అన్నది కనకమ్మ.

"వదినా! ఒకటి అడగుతాను - ఏమీ అనుకోవుగదూ?" కనకమ్మకు దగ్గిరగా కూర్చుంటూ అన్నది కాంతమ్మ.

కాంతమ్మ ఏం అడుగుతుందో కనకమ్మకు తెలుసు. మాట్లాడలేదు.

"నేను నమ్మలేదనుకో, అందరూ అనుకుంటున్నారు."

కనకమ్మ విసుగ్గా చూసింది.

"కరుణ మొగుణ్ణి వదిలేసిందటగా?" అన్నది కాంతమ్మ గొంతు తగ్గించింది.

కనకమ్మకు తల కొట్టేసినట్టయింది.

ఇటువంటి మాటలు వినాల్సి వస్తుందనే ఆమె భయమంతా!

"ఎవతి కూసిందా కూత? అందరికీ ఆడపిల్లలు వున్నారు!" కస్సున లేచింది

"అయ్యో! అదేమిటి వదినా, నామీద కస్సుమంటావ్? అందరూ అనుకుంటుంటేనూ..."

కనకమ్మ గుండె భగ్గుమంది.

"లొసుగులు రాకుండానే వుండాలిగాని - వచ్చాక పదిమంది అనుకోకుండా వుంటారా?" కనకమ్మ గుండెలో మండుతున్న అగ్నికి మరో కట్టె అంటించింది కాంతమ్మ.

కనకమ్మ గుండెలో జ్వాలలు లేచాయి.

"లోకులు కాకులు. వాగుతారు. ఎవరి లొసుగులు వాళ్ళు చూసుకుంటే మరొకర్ని అనలేరు."

"అంత కోపమెందుకే కనకమ్మ తల్లీ! అయినా, నాకెందుకులే. కరుణ మెళ్ళో మంగళసూత్రం కూడా లేదట. అందరూ అనుకుంటున్నారు. ఇలాంటివి దాస్తే దాగేవా ఏమిటి? వస్తాను" అంటూ లేచి, కనకమ్మను అగ్ని గుండంలోకి తోసి, కాంతమ్మ వెళ్ళిపోయింది.

కనకమ్మ వెర్రిదానిలా చూస్తూ కూర్చుంది.

కనకమ్మ మనసు రగిలిపోతూ వుంది. వళ్ళు దహించుకుపోతూ వుంది. కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయ్.

లేచి లోపలకు వచ్చింది. దారం పేనింది. పసుపు రాసింది. దానికి పసుపుకొమ్ము కట్టింది. కరుణ ముందుకు వచ్చింది.

కరుణ తలవంచుకొని లెఖ్ఖలు చేసుకుంటూ చాపమీద కూర్చుని వుంది.

"కరుణా!" గట్టిగా అరిచింది కనకమ్మ.

కరుణ అటువంటి అరుపులకు అలవాటు పడింది. తలకూడా ఎత్తలేదు.

"కరుణా!" మళ్ళీ అరిచింది కనకమ్మ.

కరుణ తాపీగా తల ఎత్తింది.

కనకమ్మను చూసింది.

కనకమ్మ చేతిలో పసుపుతాడు చూసింది.

కనకమ్మనూ, పసుపుతాడునూ మార్చి మార్చి చూసింది. మళ్ళీ తల వంచుకొని తన పని చూసుకో సాగింది.

"ఏమిటే ఆ నిర్లక్ష్యం?" అంటూ కరుణ ముందున్న పుస్తకాలు లాక్కొని దూరంగా గిరాటు వేసింది.

కరుణ లేచి నిల్చుంది. తల్లిని చూసింది. తల్లి చేతిలో వున్న పసుపుతాడును చూసింది. దూరంగా అస్తవ్యస్తంగా పడివున్న పుస్తకాలను చూసింది.

ఒక అడుగు ముందుకు వేసింది.

"ఏమిటా నిర్లక్ష్యం?" అడ్డగా నిల్చుంది కనకమ్మ.

"ఏమిటి?" కళ్ళతోనే అడిగింది కరుణ.

"ఇదిగో, ఇది కట్టుకో!" పసుపుతాడు వున్న చేతిని ముందుకు జాపింది.

కరుణ అందుకోలేదు. నిర్లక్ష్యంగా చూసింది.

"తీసుకోవేమే?"

"ఎందుకూ అది?"

"కట్టుకో!"

"ఎందుకు కట్టుకోవాలి?" తాపీగానే వుంది కరుణ కంఠం.

కనకమ్మకు మతి పోతోంది. ఎందుకు కట్టుకోవాలా? అదికూడా ఒక ప్రశ్నేనా? దానికి ఏం సమాధానం ఇవ్వాలో తెలియలేదు.

"ఎంతకు తెగించావే? మొగుడు వుండగానే ముండమోపిలా మొండి మెడతో సిగ్గులేకుండా తిరుగుతూ, పైగా ఎందుకు కట్టుకోవాలంటావా?" కనకమ్మ బుసలు కొట్టింది.

కరుణ నవ్వింది. వేదాంతిలా నవ్వింది.

"ఛీ! నా కడుపున చెడబుట్టావ్? వెధవ బతుకు బతక్కపోతేనేం? ముక్కు మూసుకుంటే మూడు నిముషాలు పట్టదు."

కరుణ మళ్లీ నవ్వింది.

కనకమ్మ కోపంతో పిచ్చిదానిలా రెచ్చిపోయింది.

"తెగించావే! అందుకే నవ్వొస్తుంది."

"అమ్మా! నువ్వెన్ని సార్లు 'చావు' అని తిట్టి పోసినా నేను చావడానికి సిద్ధంగా లేను."

"ఛీ! మురికి బతుకు బతకడంకంటే చావడమే మేలు!" అన్నది కనకమ్మ.

"నా ఇష్టంతో నేను పుట్టలేదు. నేను కోరితే లభించిన జీవితం కాదు ఇది. అందుకే చావదల్చుకోలేదు." కటువుగా అన్నది కరుణ.

కనకమ్మ కరుణ ముఖంలోకి వెర్రిచూపులు చూసింది.

"నీకేదో అయిందే! ఏ దెయ్యమో పట్టింది. గట్టిగా ఒక్కమాట మాట్లాడేదానివి కాదు. ఎన్ని మాటలు అంటున్నావే?" అన్నది కనకమ్మ.

"నాకే దెయ్యమూ పట్టలేదు. జీవితం నుంచే ఈ మాటలు నేర్చుకున్నాను" అంటూ కరుణ ముందుకు రెండు అడుగులు వేసింది.

"ఆగు!" అంటూ కనకమ్మ కరుణ రెక్క పట్టుకుంది.

"ఏమిటి?" విసుగ్గా అన్నది కరుణ.

"ఇది కట్టుకుంటావా లేదా?"

"ఎందుకు కట్టుకోవాలో చెప్పమన్నానుగా?" అంది కరుణ.

"ఎందుకా?...నలుగురూ నవ్వుతున్నారే! నువ్వే మంగళసూత్రం తెంపి మొగుడి ముఖాన కొట్టి వచ్చావంటున్నారే!" కనకమ్మ కంఠంలో కోపం, దుఃఖం ఉంగిడి చుట్టుకుపోయాయి.

"కొంతకాలం వుంటే అంతపనీ చేసే, దాన్నేమో!... కాని, అతను నాకు ఆ అవకాశం ఇవ్వకుండా తనే తెంపుకున్నాడు" అన్నది కరుణ కరకుగా.

"పాపిష్టిదానా! ఎంతకు తెగించావే?"

పిచ్చికోపంతో కనకమ్మ కరుణ జుట్టు పట్టుకొని ఆ చెంపా ఈ చెంపా పిచ్చిగా వాయించసాగింది. కనకమ్మ చేతిలో పసుపుతాడు కింద పడిపోయింది.

కరుణ పెనుగులాడలేదు. శరీరం అప్పజెప్పి ఊరుకుంది.

"అమ్మా!..." విశ్వం కేకకు కనకమ్మ కరుణ జుట్టు వదిలేసింది.

కనకమ్మ కొడుకు మొహంలోకి చూడలేనట్టు గబగబా దొడ్లోకి వెళ్ళిపోయింది.

కరుణ అన్నను చూసింది. అన్నవెనక ప్రతిమలా నిలబడ్డ వదినను చూసింది.

"వదినా!" అంటూ శారదను చుట్టుకుపోయింది కరుణ.

"కరుణా! అలా వళ్ళు అప్పగించి నిల్చున్నావేం? అమ్మ మరీ ఘోరంగా ప్రవర్తిస్తుంటే. ఒకరోజు ఎదురు తిరుగు, మళ్ళీ నీ జోలికి రాదు." విశ్వం బాధగా అన్నాడు.

"కొట్టనియ్ అన్నయ్యా!...అలాగైనా ఆమె కసి తీరుతుందేమో!" అన్నది కరుణ.

"ఆమెకు నీమీద కసి లేదమ్మా! ఆమెను అర్థం చేసుకో!" అన్నది శారద.

"ఏమిటి అర్థం చేసుకొనేది? పశువును బాదినట్టు బాదుతుంటేను...తనంత అయిన ఆడపిల్లమీద చెయ్యి చేసుకోవడం ఏమిటి? అమ్మకు గట్టిగా చెప్పేస్తాను, ఇంకెప్పుడూ కరుణ మీద చెయ్యి చేసుకోవద్దని!" కోపంగా దొడ్లోకి వెళ్ళబోతున్న విశ్వాన్ని ఆపి – "అన్నయ్యా! ఇప్పుడు అమ్మను ఏమీ అనకు. ఈ కోపంలో ఏదైనా అఘాయిత్యం చేసుకుంటే..." అన్న కరుణ మాటలకు ఆగి, ఆలోచనలో పడ్డాడు.

# 13

కరుణ పుట్టింటికి వచ్చి ఆరు నెలలు దాటి పోయింది. పరీక్షలకు శ్రద్ధగా చదువుతూ వుంది.

కనకమ్మకు కరుణ ఇంట్లో తిరుగుతూ వుంటే నాగుబాము గుండెమీద పడగ విప్పినట్టు వుంది.

రాఘవరావు కరుణను నిందిస్తూ, బావమర్దిని నిందిస్తూ రెండు ఉత్తరాలు రాశాడు. కరుణను పంపించమని రాశాడు. విశ్వనాథం ఉత్తరాలు చదువుకొని కసిగా చించి పారేశాడు. ఆ విషయం కరుణకు చెప్పలేదు. తల్లికి చెప్పలేదు. భార్యకు చెప్పాడు.

తనవల్ల పొరపాటు జరిగిందనీ, మళ్లీ అటువంటిది జరగదనీ హామీ ఇస్తూ కరుణను పంపించమని మరో ఉత్తరం రాశాడు రాఘవరావు. భార్యకు ఆ ఉత్తరం చూపించాడు. శారద ఉత్తరం చింపి అవతల పారేసింది చదవకుండానే.

విశ్వం ఒక్క ఉత్తరానికీ సమాధానం ఇవ్వలేదు.

ఆ రోజు విశ్వానికి బావమర్ది సుబ్బారావు నుంచి ఉత్తరం వచ్చింది. ఉత్తరం చదువుకున్న విశ్వం ముఖం నల్లబడింది.

"ఏమిటండీ ఆ ఉత్తరం? ఎవరు రాశారు? ఆ రాఘవరావేనా?" అడిగింది.

"నువ్వే చూడు!" అంటూ ఉత్తరం అందించాడు విశ్వం.

శారద ఉత్తరం విప్పింది. కింద సంతకం చూసింది. ఆదుర్దాగా ఉత్తరం చదవసాగింది:

"బావగారికి!-

నమస్కారాలు! ఇక్కడ అందరం కులాసాగానే వున్నాం. మీ చెల్లెలికి మూడో నెల.

అసలు విషయం. ఆ మధ్య రాఘవరావు వచ్చాడు. మనిషి చాలా దిగులుగా వున్నాడు. కరుణ అతనితో పోట్లాడి వెళ్ళిపోయిందట. వదినగారు అలాంటివారు అనుకోలేదు. చాలా నిదానంగా కన్పించేది.

రాఘవరావు మూడు ఉత్తరాలు రాసినా నువ్వు సమాధానం ఇవ్వలేదట. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది.

అతను నన్ను నానామాటలు అన్నాడు. ఈ పెళ్ళిచేసి అతని జీవితాన్ని నాశనం చేశానన్నాడు. నవ్వులపాలు చేశానన్నాడు. నేను నేరస్తుడిలా తల వంచుకోవాల్సివచ్చింది.

కరుణకు తెలియకపోతే నీకు తెలియక్కర్లేదా? ఆడపిల్ల మూర్ఖంగా ప్రవర్తిస్తే నచ్చచెప్పుకోవాల్సింది పోయి, ఇంట్లో పెట్టుకు కూర్చుంటారా? అతని కాళ్లా వేళ్లా బడి క్షమాపణ చెప్పుకోవడం పోయి, అతను రాసిన ఉత్తరాలకు సమాధనం కూడా ఇవ్వక పోవడం ఆశ్చర్యంగానే వుంది.

నీకు తెలియకపోతే అత్తగారి బుద్ధి ఏమైంది?

అవున్లే - మీరిద్దరూ ఆఫీసుకు వెళ్తారాయె! అత్తగారికి ఓపికపోయింది. కరుణ పనిమంతురాలు. జీతం భత్యం లేని పనిమనిషి దొరికింది.

ఛీ! ఛీ! ఇంత స్వార్ధమా? అన్న చెల్లెలి కాపరం చెడగొట్టడం ఎక్కడైనా విన్నామా?... ఇది నీకు పుట్టిన బుద్ధా? లేక నీ భార్య నిర్వాకమా?

వెంటనే కరుణను పంపించండి. ఆ తర్వాత బాధపడి లాభం లేదు.

మీ వంశం మంచిది అనే ఉద్దేశంతోనే పెద్దగా కట్నం రాకపోయినా నీ చెల్లెల్ని చేసుకున్నాను.

రేపు అందరూ 'నీ వదిన మొగుణ్ణి వదిలేసిందటగా?' అని నిలదీసి అడిగితే ఏ ముఖంతో బయట తిరగాలి?

ఇంతవరకూ ఈ విషయం మా అక్కయ్యకూ, అమ్మకూ తెలియదు. తెలిసిన మరుక్షణం కస్తూరి బతుకు ఏమౌతుందో ఆలోచించు.

చెల్లెలి కాపురం చక్కదిద్దాల్సినవాడివి ఇలా చెయ్యడం బాగా లేదు.

చెప్పాల్సింది చెప్పాను. ఆ తర్వాత నీ ఇష్టం!

ఈ ఉత్తరం మీ చెల్లెలికి చూపించే పోస్టు చేస్తున్నాను.

ఇట్లు
సుబ్బారావు."

ఉత్తరం చదవడం ముగించి భర్త ముఖంలోకి చూసింద శారద.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

"ఆ ఉత్తరం కరుణకు చూపించు."

శారద విస్మయంగా చూసింది.

"కరుణకు చూపించాలా! ఎందుకూ?"

"ఏమంటుందో చూపించు!"

"కరుణ సంగతి మీకు తెలియదు. ఈ ఉత్తరం చూపిస్తే ఏమనుకుంటుంది? మనం ఆమెను వెళ్ళమని చెబుతున్నట్టు అర్థం చేసుకోదూ?"

"అందుకు కాదు..." అంటూ ఆగిపోయాడు విశ్వనాథం.

"ఎందుకైనా కాన్వండి. ఆమె అలా భావించే ఆస్కారం వుంది. పైగా తనవల్ల మనకు నిందలు వస్తున్నాయంటే బాధపడుతుంది. మళ్ళీ ఆ నరకంలోకి వెళ్ళడానికి సిద్ధమౌతుంది. మీరెందుకు చూపించమంటున్నారో నాకు అర్థం కావడం లేదు" అన్నది శారద.

"మనం కరుణను జీతం భత్యం లేని పనిమనిషిగా ఉపయోగించుకుంటున్నామంటే నీకు బాధగా లేదూ?"

"అందుకని, కరుణను పంపించేస్తామంటారా?"

"రాఘవరావు నిజంగా మారాడేమో?"

"రాఘవరావు లాంటి మనుషులు మారరు. అంతా నాటకం!" అన్నది శారద.

"ఇప్పుడు ఏం చేద్దామంటావ్?"

"ఎప్పటిలాగే చెయ్యండి."

"అంటే?"

"ఈ ఉత్తరంకూడా చింపెయ్యండి."

"కస్తూరి విషయంలో బెదిరించాడుగా!"

"వట్టొట్టి బెదిరింపులే! పెళ్ళాన్ని ఒదులుకుంటాడా ఏం?... పైగా, కస్తూరికి ఉత్తరం చూపించానన్నాడు. ఇద్దరూ ఆలోచించే రాసి వుంటారు. కోపం వచ్చినా సరే ఒక మాట అనాలని వుంది."

"ఏమిటి?"

"కరుణకూ కస్తూరికీ స్వభావంలో చాలా తేడా ఉంది... కస్తూరి కొంచెం ..." ఆగిపోయింది శారద.

విశ్వనాథం ఆవలిస్తూ పక్కకు తిరిగి పడుకున్నాడు.

# 14

"ఎక్కడినుంచిరా విశ్వం ఆ టెలిగ్రాం?..." కనకమ్మ భయపడుతూ అడిగింది.

"సుబ్బారావు ఇచ్చాడు."

కనకమ్మ గుండె వేగంగా కొట్టుకోసాగింది.

"ఏమయిందిరా నాయనా! కస్తూరి ఎలా వుంది? అసలే వట్టి మనిషి కూడా కాదు!" ఆతృతగా అడిగింది.

"భయపడాల్సిందేమీ లేదులే! కస్తూరి వస్తుందట. స్టేషన్‌కు వెళ్ళి రిసీవ్ చేసుకోమని ఇచ్చాడు" అన్నాడు విశ్వనాథం.

"కస్తూరి వస్తుందా? ఎందుకు? ఏమైంది?"

పాలతో మూతి కాల్చుకున్నవాడు మజ్జిగ ఊది తాగుతాడు. కనకమ్మ మనసు అనేక శంకల్ని ఊహించి వణికిపోయింది.

విశ్వానికీ శారదకీ కూడా కస్తూరి అలా అనుకోకుండా రావడానికి కారణం అర్థం కాలేదు.

"పలకవేంరా?" కనకమ్మ గాభరా పడిపోతూంది.

"నాకేం తెలుసూ?" అనాలనుకున్నాడు విశ్వం.

"ఊరికే వస్తుందిలే! చాలా రోజులైందని నేనే పంపించమని రాశాను" అన్నాడు.

ఊపిరి బిగబట్టివున్న కనకమ్మ గుండెల నిండుగా గాలి పీల్చుకుంది.

"ఎప్పుడొస్తుందీ?" ఉత్సాహంగా అడిగింది.

"సాయంకాలం నాలుగు గంటల బండికి. నేను ఆఫీసు నుంచి స్టేషన్‌కు వెళ్ళి తీసుకొస్తాలే!" అంటూ లోపలకు వెళ్ళాడు విశ్వం.

"కస్తూరి ఎందుకు వస్తున్నట్టూ?" భోజనం వడ్డిస్తూ శారద విశ్వాన్ని అడిగింది.

"నాకు మాత్రం ఏం తెలుసూ? అన్నంత పనీ చేశాడేమోనని భయంగా వుంది."

"అలాంటి భయమేమీ అక్కర్లేదులెండి. భార్య వస్తుందని టెలిగ్రాం ఇచ్చాడుగా? వాళ్ళిద్దరూ కలిసే ఏదో ప్లాను వేశారనిపిస్తుంది" అన్నది శారద సాలోచనగా.

"అంటే?"

"ఇప్పుడే చెప్పలేను. చూద్దాంగా!" అన్నది శారద.

చెల్లెలు వస్తున్నదని విన్న కరుణ సంతోషించింది.

కస్తూరికి ఎన్నో చెప్పుకోవాలనుకుంది. చిన్నప్పటి ఆటలూ, పాటలూ గుర్తు చేసుకుంటూ కూర్చుంది. చదువు మీదకు మనసు పోవడం లేదు.

కనకమ్మ హడావిడిగా వుంది. లోపలకూ బయటికీ తిరుగుతూ వుంది. చిన్న కూతురికోసం ఎదురుచూస్తూ వుంది. అత్తవారింటి నుంచి వస్తున్న కూతురికోసం ఆ తల్లి ఎదురు చూస్తూవుంది. ప్రతి నిముషం ఎదురుచూస్తూ వుంది.

తనూ అత్తవారింటినుంచే వచ్చింది. పైగా, మొదటిసారిగా వచ్చింది. తను సంతోషంగా రాలేదు. బాధగా వచ్చింది.

సంతోషంతో కాకపోయినా సానుభూతితో – ఆవేదనతో తనను తల్లి గుండెల్లో దాచుకుంటుందని వచ్చింది. తల్లి చేతుల్లో వాలిపోయి తనివితీరా ఏడవాలని వచ్చింది.

గంపెడాశతో గడపలో కాలు పెట్టింది.

వాకిట్లో రిక్షా ఆగిన శబ్దం అయింది.

కనకమ్మ వడివడిగా, హడావిడిగా బయటకు వెళ్ళింది.

కరుణ పుస్తకం కిందపడేసి పరుగుతీసింది. కాని, గడప వెనకే నిలబడిపోయింది. వీధిలోకి మొహం చూపించే అర్హత తనకు లేదని తల్లి భావం. అందుకే ఆగిపోయింది.

రెండు చేతులూ ముందుకు చాపి దగ్గిరకు తీసుకుంటూ "రా తల్లీ, రా!..." ఆప్యాయంగా వళ్ళంతా నిమురుతూ ఆహ్వానించింది తల్లి.

"ఎంత చిక్కిపోయావమ్మా!" అన్నదిమళ్ళీ కనకమ్మ.

వాస్తవానికి కస్తూరి చిక్కలేదు. కాస్త నునుపెక్కిందనే చెప్పాలి. కన్నకడుపు తీపి అలా అన్పిస్తుంది.

ప్రతి తల్లీ తన వాత్సల్యానికి దూరంగా వున్న తన బిడ్డ చిక్కిపోయినట్టే భావిస్తుంది.

"బాగానే వున్నానమ్మా!" అన్నది కస్తూరి.

"పద తల్లీ!" తల్లి కూతుర్ని ఇంట్లోకి ఆహ్వానించింది. లోపలకు వస్తూ కరుణను చూసింది కస్తూరి.

"బాగున్నావా కస్తూరీ?"

కరుణ ఆప్యాయంగా కస్తూరి చెయ్యి పట్టుకుంది.

"ఆc!" అంటూ చెయ్యి లాక్కుని లోపలకు వెళ్ళిపోయింది కస్తూరి తల్లి వెనక.

కరుణ మనసు చివుక్కుమంది. కళ్ళల్లో గిర్రున నీరు తిరిగింది.

పెట్టె పట్టుకొని లోపలకు వస్తూ ఆ దృశ్యం చూశాడు విశ్వం. కరుణ ముఖంలోకి జాలిగా చూశాడు.

"లోపలకు పదమ్మా! ఎందుకు ఇక్కడే నిల్చున్నావ్?..." మెత్తగా అన్నాడు విశ్వం.

కరుణ లోపలకు వెళ్లింది. వంటింట్లోకి వెళ్ళిపోయింది.

శారద ఇంకా ఆఫీసునుంచి రాలేదు.

రెండు కాఫీలు పెట్టి, కస్తూరికీ, విశ్వానికీ ఇచ్చింది కరుణ. ఎదురుగా నిల్చుంది. కస్తూరి పలకరిస్తుందని ఆశించింది. కస్తూరి ముభావంగా కాఫీ తాగుతూ కూర్చుంది.

అంతలో శారద వచ్చింది. "బాగున్నావా కస్తూరీ?" నవ్వుతూ పలకరించింది.

"అదేబాగు! ఇలా ఉన్నాను" అన్నది కస్తూరి పొడిపొడిగా.

శారద ఓ క్షణం కస్తూరి ముఖంలోకి చూసి లోపలకు వెళ్ళిపోయింది. ఆమె కాళ్లూ చేతులూ కడుక్కుని వచ్చేసరికి కరుణ కాఫీ కప్పు అందించింది.

కస్తూరి అదోలా చూసింది శారదవైపూ, కరుణవైపూ మార్చి మార్చి.

శారదకు సుబ్బారావు వ్రాసిన ఉత్తరంలోని మాటలు గుర్తొచ్చాయి. మనసు ఎలాగో అయింది.

"మీ ఆయన రాలేదేమే అమ్మాయ్!" కనకమ్మ కస్తూరిని అడిగింది.

"నేను వచ్చాగా, చాలదూ? మన సంబడం చూడటానికి ఆయన కూడా రావాలా?" తీవ్రంగా ఉంది కస్తూరి కంఠం.

"ఏమిటే ఆ మాటలు?" తల్లి నొచ్చుకుంది.

శారద విశ్వం ముఖంలోకి చూసింది. విశ్వం కరుణను చూశాడు. కరుణ గిరున తిరిగి లోపలకు వెళ్ళిపోయింది.

"పదమ్మా, స్నానంచేద్దువుగాని" అంటూ కనకమ్మ దొడ్లోకి వెళ్ళింది.

కస్తూరి తల్లి వెనకే వెళ్ళింది.

"కస్తూరి ధోరణి నాకు అర్థం కావడంలేదు" అన్నది శారద.

విశ్వం సమాధానం చెప్పకుండా బయటికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి భోజనాలదగ్గిర కస్తూరి సూటీపోటీగా మాట్లాడుతూ ఉంటే ఎవరూ మాట్లాడలేదు.

కనకమ్మ వడ్డిస్తూ ఉంది. విశ్వం, శారదా, కస్తూరీ భోజనం చేస్తున్నారు. కరుణను శారద తమతో కూర్చోమని బలవంతం చేసింది. కరుణ కూర్చోలేదు. వంటింటి గడపలో కూర్చుంది.

"మీ అత్తయ్యా వాళ్లూ బాగున్నారా?" కనకమ్మ కస్తూరిని అడిగింది.

"ఇంతవరకు బాగానే వున్నారు."

"ఏమిటే నీ ధోరణి?"

"ఉన్నమాటే అంటున్నాను. అసలు సంగతి తెలిస్తే మా అత్తయ్య ఒక్క క్షణం నన్ను ఇంట్లో ఉండనివ్వదు."

"ఏమిటే తల్లీ నువ్వనేది?" కనకమ్మ భయపడిపోయింది.

"అక్కయ్య మొగుణ్ణి వదిలేసిందని ఇంకా మా అత్తయ్యకు తెలియదు. మన వంశం మంచిదని నన్ను చేసుకున్నారు. ఆ విషయం తెలిసిన తెల్లవారి నా కాపరం ఏమౌతుందో నాకే తెలియదు."

"కస్తూరీ! ఏమిటా మాటలు?" విసురుగా అన్నాడు విశ్వం.

"కరుణ అంటే అన్నయ్యకూ వదినకూ ఇష్టం. అందుకే మొగుణ్ణి వదిలేసివచ్చినా ఇంట్లో పెట్టుకున్నారు. నా గతేంకాను?"

"అయ్యో, నా కొంపకు ఏదో శని పట్టుకుందర్రా!" కనకమ్మ అందుకుంది.

"అమ్మా! నువ్వూరుకో. ఏమిటి కస్తూరీ, నీ ధోరణి నాకేం అర్థం కావడంలేదు" అన్నాడు విశ్వం.

"నేను తెలుగే మాట్లాడుతున్నా. మావారు వీధిలో తలెత్తుకు తిరగలేకపోతున్నారు" అన్నది కస్తూరి.

ఆరిందాలా కస్తూరి మాట్లాడుతూ ఉంటే విశ్వం, శారదా తెల్లముఖాలు వేశారు.

కనకమ్మ 'నా ఖర్మ' అని నొసలు బాదుకుంది.

కరుణ చివ్వున లేచి కస్తూరి ముందుకొచ్చి నిలబడింది.

"నేనేం కానిపనులు చెయ్యలేదు. నా మొగుణ్ణి నేను వదిలేస్తే నీ మొగుడి ముఖాని కేమయిందట?" విసురుగా అన్నది కరుణ.

కరుణ అంత కటువుగా, ధైర్యంగా మాట్లాడటం ఏనాడూ చూడని కస్తూరి అవాక్కయి కూర్చుండిపోయింది. మరుక్షణం ముఖం రోషంతో కందిపోయింది.

"మొగుణ్ణి వదిలెయ్యడం కానిపని..."

"కస్తూరీ!" గట్టిగా అరిచాడు విశ్వం.

కరుణ గిర్రున తిరిగి బయటికి వెళ్ళిపోయింది.

"ఎందుకన్నయ్యా, నామీద అరుస్తావ్? ఆ అరుపులు దానిమీద అరిస్తే అది ఇలా చేస్తుందా? చాలా ధైర్యం వచ్చినట్టే ఉంది. అక్కయ్య పూర్తిగా మారిపోయింది. నీ అండ చూసుకునే..."

"ఏమిటమ్మా ఆ మాటలు, పెద్దా చిన్నా లేకుండా?" అందుకుంది శారద.

వదిన ముఖంలోకి రుసరుసలాడుతూ చూసింది కస్తూరి

"అసలు సంగతి తెలుసుకోకుండా ఎందుకు కరుణను అవమానిస్తావ్?" మళ్ళీ శారదే అన్నది.

"తెలుసుకున్నాను కాబట్టే అంటున్నాను."

"ఊరుకోండర్రా!" తల్లి అన్నది.

"ఏమిటి తెలుసుకొన్నది?" విశ్వం విసురుగా అడిగాడు.

"బావగారు రెండుసార్లు మా ఇంటికి వచ్చారు. అంతా చెప్పారు, పాపం! అతను ఎంత బాధపడుతున్నాడో మీకేం తెలుసు?

ఈ పెళ్ళి చేసినందుకు మా వార్ని అనరాని మాటలు అన్నాడు. మా అత్తయ్యా, వదినా ఎక్కడ వింటారోనని వణికిపోయాను. నువ్వన్నా చెప్పకూడదా అమ్మా?" తల్లిని అడిగింది.

"అయ్యో తల్లీ! నా మాట ఎవరు వింటారే? ముసలి ముండను. నోరు పిసుక్కుని పడివుంటున్నాను."

"అక్కయ్య మూలంగా నా సంసారంకూడా బండల పాలయ్యేట్టుంది" అన్నది కస్తూరి.

"అయ్యో తల్లీ! ఏమిటే ఆ మాటలు?" కనకమ్మ ఏడుస్తూ అన్నది.

"కస్తూరీ! నోటికి వచ్చినట్టు మాట్లాడకు. ఆ పశువు కరుణను నానా హింసలు పెడ్తున్నాడు. మెళ్ళో తాళికూడా తెంచుకొని వెళ్ళగొట్టాడు. అయినా, నీ సంసారానికీ కరుణ భర్తను వదిలెయ్యడానికీ సంబంధం ఏమిటి?" విశ్వం కోపంగా అన్నాడు.

"అదేమిటో అయన్నే అడుగు. రెండు రోజుల్లో ఇద్దరూ వస్తారుగా?" అన్నది కస్తూరి.

"ఇద్దరెవరు?" శారద అడిగింది.

"బావగారూ, ఆయనా!"

"నిజంగా?" కనకమ్మ అడిగింది.

"నిజంగానే! తేల్చుకోడానికి వస్తున్నారు!"

"ఎంత చల్లటిమాట చెప్పావే తల్లీ! ప్రజలముఖం చూడలేక కుళ్ళిచస్తున్నాను. ఒరేయ్ విశ్వం! అతనువస్తే దాన్ని పంపించననకు!"

"అది వెళ్తానంటే నేను వద్దు అనను."

"వెళ్ళకేం చేస్తుంది? ఎవరికోసం వెళ్తుందేం? చూడు శారదా! వాళ్ళు వచ్చేసరికి మొండిమెడతో ఉంటే బాగుండదు. కాస్త ఆ పసుపుతాడు కట్టుకోమని చెప్పు."

"నేను మొదటిరోజే చెప్పాగా? మీరే చెప్పండి!" శారద పొడిపొడిగా అన్నది.

"అదీ అయిందిగా! ఒరేయ్ విశ్వం! నాయనా! నువ్వన్నా చెప్పరా!" తల్లీ ప్రాధేయపడ్తూ అన్నది.

"నేను చెప్పను. వస్తున్నాడుగా? తెంపుకున్నవాణ్ణే మళ్ళీ అందరి ముందూ కట్టమను!" కంచంలో చెయ్యి కడుక్కుని లేచి వెళ్ళిపోయాడు విశ్వం.

"అయ్యో! అదేమిట్రా, అన్నం వదిలేసి లేచావ్!"

"మంగళసూత్రం కూడా కట్టుకోను అంటుందా?" శారద కేసీ నిరసనగా చూస్తూ అడిగింది కస్తూరి.

శారద సమాధానం ఇవ్వలేదు. భోజనం అయిందనిపించింది. కంచం తీసుకొని వెళ్ళిపోయింది.

"అమ్మా! అక్కయ్యను అసలు వదినా, అన్నయ్యే చెడగొడ్తున్నారు."

"ఉష్! వింటారు, చిన్నగా" అన్నది కనకమ్మ.

"విననియ్! ఏం భయమా?"

కనకమ్మ కళ్ళు వత్తుకుంది.

"అక్కయ్యకు అంతధైర్యం ఎలా వచ్చిందమ్మా?"

"అంతా నా ఖర్మ! వెధవ బతుకు, నాకు చావు రాకుండా వుంది. ఆ మహానుభావుడు, ఏమీ ఎరక్కుండా వెళ్ళిపోయాడు!" భర్తను తల్చుకుంటూ ముక్కు చీదేసింది కనకమ్మ.

"కరుణా! ఇక్కడ కూర్చున్నావా? పద, భోజనం చెయ్!" దొడ్లో బాదంచెట్టుకింద కూర్చునివున్న కరుణ దగ్గిరకు వచ్చి శారద అన్నది.

"నాకు ఆకలిగా లేదు వదినా!"

"బాధపడ్తున్నావా? ఇవన్నీ మామూలేగా! ధైర్యంగా ఎదుర్కోవాలి" అన్నది శారద.

"కస్తూరి – నా చెల్లెలు – నా తర్వాత పుట్టింది – నేను ఎత్తుకు మోసిన పిల్ల – నాచేత జడ వేయించుకున్నది – నన్ను హేళన చేస్తుంది. నన్ను చిన్న చూపు చూస్తుంది వదినా!" కరుణ కంఠం రుద్ధమైంది.

"కస్తూరి చిన్నపిల్ల. ఆ మొగుడు బాగా ఆమె తలకు ఎక్కించి పంపించినట్టు ఉన్నాడు. మరొకటి విన్నావా? రెండు రోజుల్లో మీ ఆయన్ను తీసుకొని సుబ్బారావు వస్తున్నాడట."

కరుణ బెదిరిపోయింది. నిలువెల్లా వణికిపోయింది. వదిన కళ్ళలోకి దెబ్బతిన్న లేడిలా చూసింది.

"కరుణా!"

"వదినా! మళ్ళీ నన్ను ఆ నరకంలోకి..."

"నీ ఇష్టంలేకుండా నిన్ను ఎవరూ పంపించలేరు కరుణా! భయపడకు. మీ అన్నయ్య ఈ విషయంలో గట్టిగానే ఉన్నారు."

"వదినా!" అంటూ కరుణ శారదను చుట్టుకుపోయింది.

# 15

"అమ్మా! ఏమిటే ఎప్పుడు చూసినా అక్కయ్య పుస్తకాలు ముందేసు క్కూర్చుంటుందీ?" అక్క వినేలా తల్లిని అడిగింది కస్తూరి.

"నా రాత! ఏం చెప్పమంటావ్? పరీక్షకు కూర్చుంటుందట! ఆ తర్వాత కాలేజీలో చదువుతుందట!" అన్నది తల్లి.

కస్తూరి విస్మయంగా తల్లిముఖంలోకి చూసింది. కస్తూరి హృదయంలో ఈర్ష్య తేలుపిల్లలా కొండీ ఎత్తింది. అక్కయ్యను అన్నయ్య చదివిస్తాడా! వదినకుకూడా అదంటే ఎందుకో అంత అభిమానం?

"మొగుణ్ణి వదిలేసి ఊళ్ళేలుతుందన్నమాట!" అన్నది కస్తూరి.

"ఊరుకోవే!" తల్లికి కూడా కస్తూరి మాటలు అంతగా రుచించడం లేదు.

"కస్తూరీ!"

చివ్వున తలెత్తి చూసింది.

కరుణ ఎదురుగా కన్పించింది. కరుణ కళ్ళు చింతనిప్పులు కురిపిస్తున్నాయ్! కరుణ రూపం చూసి కస్తూరి కొంచెం జంకింది.

"నిన్నటినుంచి చూస్తున్నాను. ఏమిటే, నీ ఇష్టం వచ్చినట్టు వాగుతున్నావ్?"

ప్రక్కనే ఉన్న తల్లివైపు తిరిగి "అమ్మా! నీకు ఇద్దరు కూతుళ్ళు. అందులో కరుణ చచ్చిపోయింది. చచ్చిన కూతుర్ని బతికున్న కూతురు దగ్గిర ఎందుకమ్మా నిందిస్తావ్? చిన్నచూపు చూస్తావ్?" అన్నది కరుణ.

కనకమ్మ గుండె చెరువైంది. "అమ్మా, కరుణా! ఏమిటే ఆ మాటలు?" అనాలనుకుంది. కాని, అనలేదు. అక్కడనుంచి లేచి లోపలకు వెళ్ళిపోయింది.

"కస్తూరీ! నేను ఇంతకుముందు నువ్వెరిగిన కరుణను కాదు. గుర్తుంచుకో! అనవసరంగా నా పేరెత్తకు!" అనేసి గిర్రున వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది కరుణ.

కస్తూరికి ఉడుకుబోతుతనం వచ్చింది. కోపం మింగేసి కూర్చుంది.

కరుణ గదిలోకి వెళ్ళి తలుపేసుకుంది. మంచానికి అడ్డంపడ్డది.

ఏడవాలని ఉంది. కాని, ఏడుపు రావడంలేదు.

తను ఏం చేసిందని తన చెల్లెలి దృష్టిలో కూడా చులకనైంది? భర్త ఎటువంటివాడైనా, అతనితో బతుకు ఎంత నరకప్రాయమైనా - చెప్పుకింద తేలులా పడి ఉండాల్సిందేనా?

పెళ్ళాన్ని వదిలేసిన మగవాణ్ణి ఎవరూ చిన్నచూపు చూడరేం? మొగుడు వదిలేసిన ఆడదాన్ని మాత్రం ఎందుకు హీనంగా చూస్తారు?

మరిది అతన్ని తీసుకొస్తాడట. ఏం అల్లరి చేస్తారో?

అమ్మ ఎంత గొడవ చేస్తుందో! అన్నయ్య ఏమంటాడో? ఒకవేళ అన్నయ్య వెళ్ళమంటే?

కరుణ నిలువెల్లా వణికిపోయింది.

ఏమైనా సరే, తను వెళ్ళదు. మళ్ళీ అతని ముఖం చూడదు. తనను వదిన ఆదరిస్తుంది. అన్నయ్యకుకూడా తనంటే ఎంతో ప్రేమ, సానుభూతి.

కరుణ భర్తవెంట 'వెళ్లనుగాక వెళ్ళను' అనే దృఢనిశ్చయం చేసుకుంది.

మళ్ళీ కస్తూరి కరుణ వినేలా ఏమీ అనలేదు. కరుణ ఎదురుపడితే ముఖం తిప్పుకుంటుంది.

అమ్మా, చిన్నకూతురూ, ఒకచోట కూర్చొని గుసగుసలాడటం చూస్తూనే ఉంది కరుణ.

కన్నతల్లికీ తోడబుట్టిన చెల్లెలికీ తను పరాయిదైపోయింది. శత్రువైపోయింది. పరాయివాళ్లమీద చెప్పుకుంటున్నట్టు తనమీద చెప్పుకుంటున్నారు!

కరుణ ఆలోచిస్తూ కళ్ళు మూసుకుంది.

ఆదివారం విశ్వం, శారదకూడా ఇంటిదగ్గరే ఉన్నారు. వాకిట్లోకి వచ్చిన అల్లుళ్లను చూసి కనకమ్మ హడావిడిపడిపోతూ, "ఒరేయ్ విశ్వం!" అంటూ కేకలు పెట్టింది.

విశ్వం బయటికివచ్చి బావమర్దుల్ని సాదరంగా ఆహ్వానించాడు. శారద కాఫీ ఇచ్చింది. స్నానాలు చేసి ఇద్దరూ టిఫెన్ చేసి కూర్చున్నారు.

ఎవరూ హాయిగా మాట్లాడటం లేదు.

రేగబోయే తుపానును తల్చుకుంటూ కనకమ్మ ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకున్నట్టు కూర్చుంది.

రాఘవరావూ, సుబ్బారావూ ముఖాముఖాలు చూసుకున్నారు.

"వదిన కన్పించలేదు!" సుబ్బారావే అన్నాడు.

"వంటింట్లో ఉందేమో!" అన్నాడు విశ్వం.

సుబ్బారావు అదోలా నవ్వాడు. అతను ఉత్తరంలో రాసిన మాటలు గుర్తొచ్చి విశ్వం మనసు చివుక్కుమంది.

"శారదా, కరుణా వంట చేస్తున్నట్టున్నారు" అన్నాడు విశ్వం.

"నా ఉత్తరాలకు సమాధానం ఇవ్వలేదేం?" అడిగాడు రాఘవరావు.

అల్లుడు ఉత్తరాలు రాశాడా? మరి తనకు చెప్పలేదేం విశ్వం? అనుకుంది కనకమ్మ.

"అవసరం అనిపించలేదు" అన్నాడు విశ్వం పొడిపొడిగా.

రాఘవరావు సుబ్బారావు ముఖంలోకి చూచాడు. విశ్వం జవాబుకు సుబ్బారావుకు కోపం వచ్చింది.

"అంటే – కరుణను పంపించడం నీకు ఇష్టం లేదన్నమాట?" పెద్దగా అన్నాడు.

శారద బయటికివచ్చి కూర్చుంది. కరుణ అదురుతున్న గుండెలతో తలుపుచాటుగా, ఎవరికీ కన్పించకుండా ఊపిరి బిగపట్టుకొని కూర్చుంది.

"నా ఇష్టం ఏముంది? కరుణ వెళ్తానంటే నేను వద్దు అనను" అన్నాడు విశ్వం.

"మగవాడు కొంచెం తొందరపడ్డాడే అనుకోండి, అంతమాత్రానికి సంసారాలు నాశనం చేసుకుంటారా?"

"కొంచెం తొందరపడ్డాడా?" అంటూ విశ్వం రాఘవరావు ముఖంలోకి చూశాడు.

రాఘవరావు తలవంచుకున్నాడు.

"ఆ రోజు డబ్బు చాలా అవసరం అయిందట, మళ్ళీ చేయిస్తాను, మాంగల్యం ఇవ్వమని అడిగాడట. ఇవ్వనని వదిన ఎదురుతిరిగితే కోపంతో మాంగల్యం తెంచుకున్నాడట . మాటా మాటా పెరిగి ఆవేశంలో మగవాడు ఏదో చేశాడే అనుకోండి, అంతమాత్రానికే వదిన ఇల్లు వదిలి వచ్చెయడం ఏమీ బాగా లేదు" అన్నాడు సుబ్బారావు.

కస్తూరి గర్వంగా శారద ముఖంలోకి చూసింది. శారద ఉబికివస్తున్న కోపాన్ని అణుచుకుంటూ కూర్చుంది.

"వంటిమీద నగలన్నీ అమ్మేశాడు, మాంగల్యంకూడా తెంచుకుపోయాడు. అటువంటివాడు పెళ్ళాన్ని ఎలా పోషిస్తాడు?" విసురుగా అన్నాడు విశ్వం.

కనకమ్మ భయంగా కొడుకును చూసింది. కస్తూరి కోపంగా అన్న ముఖంలోకి చూసింది.

రాఘవరావు పశ్చాత్తాప పడుతున్నట్టు ముఖం చిన్నబుచ్చుకొని కూర్చున్నాడు.

"ఏం, సంవత్సరం రోజులు పోషించలేదా?"

"పోషించాడు. ఆరువేల కట్నం డబ్బూ, ఐదువేల ఖరీదు చేసే నగలూ కరిగించి పోషించాడు!" కోపంగా అన్నాడు విశ్వం.

"పొరపాటయింది. ఇకముందు అలా జరగదు. నా జీతం చాలు - పెళ్ళాన్ని పోషించుకోవడానికి" అన్నాడు రాఘవరావు బాధపడ్తున్నట్టు.

"మగవాడు కాస్త ఉద్రేకపడితే ఆడది మొగుణ్ణి వదిలెయ్యాల్సిందేనా? ఇలా అయితే ప్రపంచంలో ఏ మొగుడూ పెళ్ళాం కాపరాలు చెయ్యలేరు!" అన్నాడు సుబ్బారావు.

"అందరు మగవాళ్లూ రాఘవరావులా ప్రవర్తిస్తే అంతే జరుగుతుంది."

"బాబూ, విశ్వం!" తల్లి అందుకుంది.

"నువ్వు మాట్లాడకమ్మా! మేం మాట్లాడుతున్నాంగా?" తల్లిని గద్దించాడు విశ్వం.

"ఇన్నిటికీ ఏమంటారు?" రెట్టిస్తూ అడిగాడు సుబ్బారావు.

"అదే నేనూ అడుగుతున్నాను" అన్నాడు విశ్వం.

"అదికూడా చెప్పాలా? అతను భార్యను తీసుకెళ్ళడానికి వచ్చాడు. పంపిస్తారా లేదా?"

"నేను పంపించడం ఏమిటి?"

"అంటే?"

"అది ప్రాణంలేని బొమ్మకాదు. కరుణకు ఇష్టం అయితే నేను అడ్డు చెప్పను" అన్నాడు విశ్వం.

"కరుణకు ఇష్టం కాకపోతే ఇంట్లో పెట్టుకుంటావా?" సుబ్బారావు కోపంగా అడిగాడు.

"దానికి ఇష్టంలేని పని నేను చెయ్యమనను. నేను ఇంట్లో పెట్టుకోవడం ఏమిటి? నేను పుట్టినట్టే అదీ ఈ ఇంట్లోనే పుట్టింది. దానికి ఇక్కడ వుండే అధికారం వుంది."

శారద భర్త ముఖంలోకి సంతృప్తిగా చూసింది.

అన్నమాటలకు కస్తూరికి వళ్ళుమండిపోయింది.

కనకమ్మ లోలోపల ఉడికిపోతూవుంది.

"ఆడదానికి పెళ్ళయాక పుట్టింట్లో అధికారం వుండదు."

"అత్త ఇంట్లో స్థానం లేకపోతే మరెక్కడి కెళ్తుంది?"

సుబ్బారావు మాటలు పూర్తి అయీ కాకుండానే అన్నాడు విశ్వం.

"మీ వంశం మంచిదనీ, కరుణ బుద్ధిమంతురాలనీ చెప్పి ఈ సంబంధం కుదిర్చాను."

"ఇప్పుడు మా కరుణ బుద్ధికేమయింది? అది అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ బుద్ధిమంతురాలే?" విశ్వం కోపాన్ని అణచుకుంటూ అన్నాడు.

సుబ్బారావు బావమర్ది ముఖంలోకి ఈసడింపుగా చూశాడు.

"అవును, చాలా బుద్ధిమంతురాలు. అందుకే మొగుణ్ణి వదిలేసింది."

"సుబ్బారావ్!" విశ్వం కోపంతో రెచ్చిపోయాడు.

కనకమ్మ భయంతో బిగుసుకుపోయింది.

"అబద్ధం! అతనే మాంగల్యం తెంపుకొని బయటికి నెట్టి తలుపులు వేసుకున్నాడు. ఏమయ్యా, మాట్లాడవ్! నేనన్నది నిజం కాదా?" రాఘవరావును రెట్టించాడు విశ్వం.

రాఘవరావు తల వంచుకున్నాడు.

"మాట్లాడవేం?" సుబ్బారావు రాఘవరావును హెచ్చరించాడు.

"నిజమే. కాని, మళ్ళీ తలుపులు తెరిచి చూశాను. అప్పటికే వెళ్ళిపోయింది."

సుబ్బారావుకు వళ్ళు మండిపోయింది. తను రాఘవరావు కోసం అబద్ధం ఆడాడు. అతను నిజం చెప్పాడు. చివరకి తన పరువు తీశాడు!

"మరి నాకు అలా చెప్పావేం?" కోపంగా అన్నాడు సుబ్బారావు.

రాఘవరావు మాట్లాడలేదు. అసలు సుబ్బారావుతో ఏం చెప్పాడో జ్ఞాపకం లేదు రాఘవరావుకు.

"ఏదో జరిగింది. కోపంలో ఏదో చేశాడు. మొగుడూ పెళ్ళాల మధ్య ఎన్నో వుంటాయి. ఇప్పుడు తీసుకెళ్తానంటున్నాడుగా?"

"పొరపాటు చేశానని ఒప్పుకుంటున్నాను. మళ్ళీ అలా జరగదు" అన్నాడు రాఘవరావు నేరస్తుడిలా తలవంచుకొని.

రాఘవరావు గురించి శారదద్వారా విన్న విషయాలు గుర్తొచ్చాయి. అతన్ని చూస్తుంటేనే అసహ్యం వేస్తూ వుంది. అంతా నక్క వినయం. ఆ వాతల సంగతి అడిగితే? ఇంకా... ఇంకా... ఎన్నో విషయాలు వున్నాయి. పశువులా ప్రవర్తిస్తాడు. కాని, అవన్నీ ఎలా అడగడం?

"ఒరేయ్ విశ్వం, పంపిస్తానని చెప్పరా!" తల్లి ఏడుస్తూ అన్నది.

"నువ్వు మాట్లాడకు!" కసురుకున్నాడు విశ్వనాథం.

"శారదా! కరుణ వెళుతుందేమో అడుగు" అన్నాడు విశ్వం.

శారద లోపలకి వెళ్ళింది. అందరూ టైంబాంబు ముందు కూర్చున్నట్టు కూర్చున్నారు.

తలుపు చాటుగా కూర్చున్న కరుణను చూసింది. జీవంలేని ప్రతిమలా కూర్చుని వుంది.

శారదను చూసి లేచి ఒక్కసారిగా రెండు చేతులూ పట్టుకుంది కరుణ. కరుణ చేతులు చల్లగా వున్నాయ్. ముఖంనిండా చమట్లు పట్టాయ్.

"వదినా!" కంఠంలో ఆ మాట గరగరలాడింది.

శారద కరుణను చూసింది. కరుణ కళ్ళలో భయం చూసింది.

"భయపడకు కరుణా! నీకు ఇష్టం లేకుండా నిన్ను ఈ ఇంట్లోనుంచి ఎవరూ తీసుకెళ్ళలేరు" అన్నది శారద.

కరుణ కళ్ళలోకి జీవం వచ్చింది. శారద బయటికి వచ్చింది.

అందరి కళ్ళూ శారదకేసి తిరిగాయి.

"కరుణ వెళ్ళనంటుంది" అన్నది శారద.

"ఆవిడ వెళ్ళనంటుందని మాకూ తెలుసు. నువ్వు పంపిస్తావా లేదా అని అడగటానికే వచ్చాం!" అన్నాడు సుబ్బారావు విశ్వనాథంతో.

"చాలాసార్లు చెప్పాను. మళ్ళీ చెప్తున్నాను. అది వెళ్తానంటే నేను అడ్డు చెప్పను, వెళ్ళనంటే వెళ్ళమనీ చెప్పను."

"ఒరేయ్ విశ్వం! దాన్ని పంపించరా నాయనా!" ఏడుస్తూ అన్నది తల్లి.

"అదే మాటా?" సుబ్బారావు కోపంగా అడిగాడు.

"నేను చెప్పేది అదే!"

"నీ చెల్లెలి కాపరం కుదుటపడటం అసలు నీకే ఇష్టం లేదు."

"సుబ్బారావ్!" పిచ్చికోపంతో లేచి నిల్చున్నాడు విశ్వం.

"మగవాడు పశువులా ప్రవర్తిస్తే ఆడది ఎంతకని ఓర్చుకుంటుంది? కరుణలాంటి పిల్ల ఎదురు తిరిగిందంటే అది ఎంత నరకం అనుభవించిందో నేను ఊహించుకోగలను." మళ్ళీ విశ్వనాథం అన్నాడు, "వాడు – వాడు – పర్వర్టెడ్ ఫెలో!" అనాలనుకున్నాడు. కాని, అనలేకపోయాడు అంతమంది మధ్యలో.

"ఆయనమీద కేకలు వేస్తావేంరా అన్నయ్యా?" కస్తూరి సాగదీసింది.

శారదకు మాట్లాడాలని వుంది. దులిపెయ్యాలని వుంది. కాని, తను కల్పించుకోకూడదని ఆమెకు తెలుసు. అందుకే కోపాన్ని బలవంతాన అణచుకుంది.

"అయితే, మేం వెళ్తున్నాం. ఇద్దరు చెల్లెళ్ళనూ ఇంట్లోనే వుంచుకో!" లేచి నిల్చున్నాడు సుబ్బారావ్.

విశ్వం దిమ్మరపోయాడు. శారద విస్మయంగా సుబ్బారావును చూసింది. కనకమ్మ ప్రాణాలు ఎగిరిపోయిన శవంలా బిగుసుకుపోయింది.

"యేవండీ!" ఏడుపు గొంతుతో అన్నది కస్తూరి.

"సుబ్బారావ్! ఏమిటి నువ్వనేది?" విశ్వం కొంత తేరుకొని అన్నాడు.

"విను! బాగా విను! మీ వంశం మంచిదని మీ చెల్లెల్ని కానీకట్నం తీసుకోకుండా చేసుకున్నాను. ఇవ్వాళ అక్క చేసిన పనే రేపు చెల్లెలూ చేస్తుంది. అంతవరకూ రాకుండా ఇప్పుడే వదిలేస్తున్నాను" అన్నాడు సుబ్బారావ్.

"యేవండీ! ఏమిటండీ ఆ మాటలు?" ఏడుస్తూ అన్నది కస్తూరి.

శారద అయోమయంలో పడిపోయింది.

"నేనేం చేద్దున్రో దేవుడా! ఈ కొంపకు శని చుట్టుకుందర్రో!" శోకాలు మొదలు పెట్టింది కనకమ్మ. కరుణను తిడుతూ ఏడవసాగింది.

"అయ్యో! నా కాపరం కూలిపోయిందర్రో! ఒసే అక్కయ్యా, ఇప్పుడైనా నీ కళ్ళు చల్లబడ్డాయా?" మరోపక్క కస్తూరి ఏడుపు.

విశ్వం ముఖంలో నెత్తురుచుక్కలేదు.

"సుబ్బారావ్! తొందరపడకు," విశ్వం సుబ్బారావు చేతులు పట్టుకున్నాడు.

సుబ్బారావు కోపంగా తన చేతులు లాక్కున్నాడు.

"తొందరపడలేదు. బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను.

మా వంశంలో ఏడుతరాలు వెదికినా మొగుడొదిలేసినవాళ్ళుగానీ, మొగుడ్ని వదిలేసిన వాళ్ళుగాని కనిపించరు."

రాఘవరావు బుద్ధిమంతుడిలా, నోట్లో నాలుకలేనివాడిలా నిల్చున్నాడు.

అందరూ కొంతసేపు మౌనంగా వుండిపోయారు.

"అయ్యో నా కాపరం - ఏమండీ! - నాకోసం కాకపోయినా... మనకు పుట్టబోయే బిడ్డకోసమైనా - నా జీవితం నాశనం చెయ్యకండీ" అంటూ పెద్ద పెట్టున ఏడవసాగింది కస్తూరి.

"ఎవరి జీవితమూ నాశనం కానక్కర్లేదు!"

అందరూ ఒక్కసారిగా కరుణను చూశారు. ఓ క్షణం ఎవరూ మాట్లాడలేదు.

చేతిలో సూట్‌కేసుతో కరుణ నిల్చుని వుంది!

"అక్కా!" ముందు కస్తూరి అన్నది సంతోషంగా.

కరుణ కస్తూరి ముఖంలోకి చూస్తూ నవ్వింది.

"ఏం చెల్లీ! ఇప్పుడు సంతోషంగా వుందా? నావల్ల నీ కాపరం చెడిపోతుందని భయపడకు, హాయిగా వుండు!"

కస్తూరి కరుణ ముఖంలోకి చూడలేకపోయింది.

కస్తూరీ, సుబ్బారావూ కూడబలుక్కుని ఆడిన నాటకం అని శారదకు అనుమానంగానే ఉంది.

"కరుణా, ఏమిటిది? బాగా ఆలోచించుకో!"

"శారదా! నువ్వు అవతలకు పో! అసలు నీవల్లే ఇదంతా..." కనకమ్మ కస్సున లేచింది.

"అమ్మా! వదినను ఏమీ అనకు. వదిన దేవత!" అన్నది కరుణ.

"హు! దేవత!" గొణుక్కుంది కస్తూరి.

"కరుణా!" విశ్వం బాధగా పిల్చాడు.

"అన్నయ్యా! నాకోసం బాధపడకు. ఇప్పటికే నువ్వూ, వదినా నాకోసం ఎన్నో మాటలు పడ్డారు. నన్ను క్షమించు అన్నయ్యా!" అంటూ పాదాలపైకి వంగుతున్న కరుణను రెండు చేతులతో పైకి ఎత్తాడు విశ్వం.

"అమ్మా కరుణా! నువ్వు మనస్ఫూర్తిగా వెళ్తున్నావా?" విశ్వం కంఠం రుద్ధమైంది.

"నాకు మనసంటూ ఒకటి మిగిల్తేగదూ మనస్ఫూర్తిగా వెళ్ళడానికి!" అన్నది కరుణ.

విశ్వం కళ్ళలో నీరు తిరిగింది.

"నేను ఇక్కడవుంటే ఇన్ని అనర్థాలు కలుగుతాయని ఊహించలేదు. అమ్మ తలెత్తి నలుగురిలో తిరగలేదు. ఈ వంశానికి - మచ్చలేని వంశానికి - నేను ఒక మచ్చగా కన్పిస్తున్నాను. నా చెల్లెలి అత్తగారి వంశానికి కూడా నావల్ల మచ్చ ఏర్పడింది. చెల్లెలి జీవితమే కాకుండా - చెల్లెలికి పుట్టబోయే బిడ్డ జీవితంకూడా నా జీవితంతో పెనవేసుకొని వున్నదని నాకు తెలియదు. ఉండాల్సిన పని లేదని తెలుసు. కాని ఎందుకు నా

జీవితంతో ముడిపెడ్తున్నారో నేను అర్థం చేసుకోగలను. ఏది ఏమైనా నేను వెళ్ళడానికే నిశ్చయించుకున్నాను!" తాపీగా, గంభీరంగా అన్నది కరుణ.

"అమ్మా కరుణా! నువ్వు నా బిడ్డవు తల్లీ!" అంటూ కనకమ్మ సంతోషంతో కూతుర్ని కౌగిలించుకుంది.

కరుణ నవ్వింది. మోనాలిసాలా నవ్వింది.

"నిజంగా నేను నీ బిడ్డనా అమ్మా?"

కరుణ కంఠంలో ఏం వినిపించిందో కనకమ్మ తలదించుకుంది.

"వదినా!" వదిన గుండెల్లో తలదాచుకొని బావురుమంది కరుణ.

శారదకు కూడా దుఃఖం ఆగలేదు.

కరుణ కన్నీళ్ళు తుడుచుకుంటూ "అన్నయ్యా! వదినా, వస్తాను" అంటూ రెండడుగులు ముందుకు వేసింది.

"భోజనాల సమయం అయింది. భోజనం చేసి వెళ్ళండి" అన్నది కనకమ్మ.

"అవును. వంటకూడా అయింది. భోజనం చెయ్యండి. ఇవ్వాళే వెళ్ళకపోతేనేం? రెండు రోజులు ఉండి వెళ్ళొచ్చుగా?" అన్నది శారద.

"లేదండీ, ఇవ్వాళే వెళ్ళాలి. నాకు శెలవుకూడా లేదు" అన్నాడు రాఘవరావు.

"భోజనంచేసి వెళ్ళొచ్చుగా?" పొడిపొడిగా అన్నాడు విశ్వం.

"శారదా! త్వరగా వడ్డించు" అన్నది కనకమ్మ.

శారద లోపలకు వెళ్ళింది. కనకమ్మా, కస్తూరీ కూడా లోపలకు వెళ్ళారు.

కరుణ లోపలకు వెళ్ళలేదు. ఓ క్షణం ఆలోచిస్తూ నిల్చుంది. వరండాలోకి వచ్చి పెట్టెముందు పెట్టుకొని, నిలబడటానికి ఓపికలేనిదానిలా కూర్చుంది.

"ఏమిటమ్మా, ఇక్కడ కూర్చున్నావ్? లోపలకు రా!" శారద బయటికి వచ్చి పిల్చింది.

"వదినా! నేను భోజనం చెయ్యను. నన్ను లోపలకు పిలవకు, నీకు పుణ్యం ఉంటుంది."

కరుణ మానసిక స్థితిని అర్థం చేసుకున్న శారద లోపలకు వెళ్ళిపోయింది.

కనకమ్మ వరండాలోకి వచ్చింది. కూతుర్ని చూసింది. కడుపు తరుక్కుపోయింది.

"లోపలకు రామ్మా!" అన్నది.

"అక్కర్లేదు. వెళ్తాం!" అన్నది కరుణ.

"కరుణా! నామీద కోపంగా ఉందా తల్లీ? ఆడదానికి పుట్టింట్లో స్థానం వుండదమ్మా! నెలవులు తప్పిన ఆడదానికి సమాజంలో గౌరవం వుండదు. భర్త ఎటువంటివాడైనా ఆడదాని బతుకు అతనితోనే ముడిపడి వుండాలి." కనకమ్మ కంఠంలో బాధ ఉంది. కళ్ళలో కన్నీరు వుంది.

"ఇది కట్టుకో తల్లీ!"

కరుణ కళ్లెత్తి చూసింది.

కనకమ్మ ముందుకు చాచిన చేతిలో వున్న పసుపుతాడు చూసింది.

కరుణ ముఖం రోషంతో ఎర్రబడింది.

"నా మాట విను తల్లీ!" బతిమాలింది తల్లి.

కరుణ విషాదంగా నవ్వింది.

"నా చేతిమీదగా నా గొంతుకు ఉరితాడు నేనే తగిలించుకోలేను. అదేదో నువ్వే చేయ్" అన్నది కరుణ.

కనకమ్మ పసుపుకొమ్ము కట్టిన తాడు కరుణ మెళ్ళోవేసి సంతృప్తిగా నిట్టూర్చింది.

"ఇప్పుడు సంతోషంగా వుందా అమ్మా?" అన్నది కరుణ.

భోజనాలు అయాయి. రాఘవరావు బయలుదేరాడు. శారద కరుణకు బొట్టుపెడ్తూ మెళ్ళో ఉన్న తాడు చూసింది.

కరుణ వేదాంతిలా నవ్వుతూ "మళ్ళీ మాంగల్యం కట్టుకున్నాను, చూశావా వదినా!" అన్నది.

శారద కళ్ళలో నీరు తిరిగింది.

వెళ్ళిపోతున్న కూతుర్ని కౌగలించుకొని కనకమ్మ ఏడ్చింది.

కరుణ కళ్ళలో తడిలేదు. పెదవులమీద పొడినవ్వుమాత్రం ఉంది.

విశ్వం స్టేషన్‌కు వెళ్ళి ఇద్దర్నీ బండి ఎక్కించి వచ్చాడు.

దిగులుగా పడుకున్న విశ్వం దగ్గిరకు శారద వచ్చింది.

"కరుణ మంచిపని చెయ్యలేదండీ! కస్తూరీ, సుబ్బారావూ కలబలుక్కునే ఆ నాటకం ఆడారనిపిస్తుంది. కరుణ పాపం అదంతా నిజం అని నమ్మింది."

"ఇప్పటికైనా వాళ్ళిద్దరూ బాగా ఉంటే మనకు అంతకంటే కావాల్సిందేముంది? ఆ రాఘవరావు పశ్చాత్తాపపడుతున్నట్టే కన్పిస్తున్నాడు" అన్నాడు విశ్వం.

"అంతా నటన! పర్వెర్టెడ్. శాడిస్టు! అతను మారడం ఏమిటి?" అన్నది శారద.

"చూద్దాంగా!"

"ఏం చూస్తాం? ఈసారి కరుణ ఆ ఇల్లు వదిలి బయటికి వస్తే ఈ ఇంటికి మాత్రం రాదు!" అన్నది శారద.

విశ్వం శారద ముఖంలోకి చూశాడు.

"కరుణకు అభిమానం జాస్తి." మళ్ళీ శారదే అన్నది.

"ఇక్కడికిరాక ఎక్కడి కెళ్తుంది?"

"ఎక్కడికైనా వెళ్తుంది – ఇక్కడికి మాత్రం రాదు! మనం కరుణను పంపించకుండా వుండాల్సింది."

"తనే వెళ్తానంటే ఎలా వద్దు అనడం? ఇప్పటికే నేరం మనదే అంటున్నారుగా?" అన్నాడు విశ్వం.

"ఏమో! మనం చేసింది అంత మంచి పని కాదనిపిస్తుందండీ? అక్కడ ఎంతో కాలం కరుణ వుండగలుగుతుందనుకోను."

విశ్వం పక్కకు తిరిగి కళ్ళు మూసుకొని పడుకున్నాడు.

# 16

నెల తిరక్కుండానే కరుణ పుట్టింటి గడపలో కాలు పెట్టింది.

ఆమె చేతిలో సూట్‌కేసు వుంది.

గుండెలో బరువుంది.

కాని, ఆ బరువు దించుకోవాలని రాలేదు. ఆ ఇల్లు అహ్వానిస్తుందని ఆశించి రాలేదు.

తల్లిని కౌగలించుకొని మనసారా ఏడ్వాలని కూడా రాలేదు.

లోలోపల కుమిలిపోతూ రాలేదు.

నిలువెల్లా కాలిపోతూ వచ్చింది. మండిపోతూ వచ్చింది. ఆ మంటల్ని చల్లార్చుకోవాలని ఆమెకు లేదు. ఇంకా ఇంకా మండాలనీ, ఆ మంటల్లో ప్రపంచాన్నే బుగ్గి చెయ్యాలనీ వుంది.

ఆ ఇంట్లో తనకు స్థానం వుండదని తెలిసే వచ్చింది.

ఆ తల్లి గుండెలో తడి లేదని కూడా తెలుసు.

వీధి తలుపులు తీసివున్నాయి. ఆ ఇల్లు తనను పలకరిస్తున్నట్టు అన్పించింది కరుణకు.

"మంచి పనే చేశావ్!" అన్నట్టు అనిపించింది.

మరో అడుగు ముందుకు వేసింది.

గడపలో లోపలివైపు తల్లి నిలువుగా నిల్చుని కన్పించింది. ఎదురుగా పడగ విప్పి బుసలు కొడ్తున్న తాచుపామును చూసినట్టు బిగుసుకుపోయి నిల్చుంది కనకమ్మ.

కరుణ తల్లి ముఖంలోకి చూసింది.

"అమ్మా!" కరుణ కంఠంలో బేలతనం లేదు.

కనకమ్మకు ఆ పిలుపు విన్పించలేదు. కరుణ రూపం కదిలిపోయిన ఫోటోగ్రాఫులా కన్పిస్తూవుంది.

"అమ్మా!"

కనకమ్మ ఉలిక్కిపడింది.

కరుణను చూసింది. బోసిగా వున్న ఆమె మెడ చూసింది.

మళ్ళీ తెంపుకున్నాడా?

"ఎవరత్తయ్యా, వచ్చిందీ?" లోపలనుంచి కోడలి కంఠం.

శారద కరుణను చూడకూడదు.

"అమ్మా!"

కనకమ్మ ఒక్కసారిగా భళ్ళున తలుపు మూసింది కరుణ ముఖంమీద.

కరుణ మూసిన తలుపులకేసి చూసింది. బాధ కలగలేదు. నవ్వొచ్చింది.

"పిచ్చి అమ్మ! ఆ ఇంట్లో ఇంత చోటు ఇవ్వమని ప్రాధేయపడటానికి మళ్ళీ వచ్చా ననుకుంటోంది." తనలో తనే నవ్వుకుంది.

తలుపుకు తల ఆన్చి లోపల ఎవరో ఏడుస్తున్నారు.

ఇంకెవరు? తన తల్లి. తనను కన్నతల్లి. తనను పెంచిన తల్లి. తన మెళ్ళో మూడు ముళ్ళూ వేయించడానికి అహర్నిశలూ ఆవేదన పడిన తల్లి. పెళ్ళిచేసి గుండెలమీద బరువు దించుకున్నట్టు తేలిగ్గా గాలి పీల్చుకున్న తల్లి.

ఆ తల్లి ఏడుస్తూంది.

ఎందుకు?

తనను ఇంట్లోకి పిలవలేని తన నిస్సహాయతకు ఏడుస్తూందా?

లేక తన నూరేళ్ళ జీవితం బండల పాలైనందుకా?

కాదు... కాదు... తన కూతుర్ని భర్త వదిలేశాడు. సంఘం ఏమంటుంది? ఇరుగూ పొరుగూ ఏమంటారు? తన వంశం, గౌరవం ఏమౌతాయి?

అందుకే తన తల్లి ఏడుస్తూంది.

"ఎవరొచ్చారత్తయ్యా? అరే, అదేమిటి? తలుపులువేసి ఏడుస్తున్నారేం?" ఆశ్చర్యంతో కూడిన వదిన కంఠం కరుణకు విన్పించింది.

ఆ కంఠాన్ని – ఆ కంఠంలోని ఆర్ద్రతను కోటికంఠాల మధ్య పలికినా కరుణ గుర్తించగలదు.

కనకమ్మ భోరున ఏడుస్తూంది.

"ఏమిటత్తయ్యా? ఏం జరిగింది? కరుణ వచ్చిందా? తలుపు తియ్యనియ్యండి."

"వద్దు వద్దు, తలుపు తియ్యకు!"

"ఏమిటత్తయ్యా, మీ పట్టుదలా మీరూనూ!" విసుగ్గా అన్నది శారద.

"దాని ముఖం నేను చూడను."

"చిన్న పిల్లలా మాట్లాడకండి. తలుపు తియ్యనివ్వండి." శారద గడియమీద చెయ్యి వేసింది.

"ఆగు!" పెద్దగా అరిచింది కనకమ్మ.

"అత్తయ్యా! ఏమిటిది?"

"విను. అది లోపలకు వస్తే నేను బయటికి వెళ్ళిపోతాను. మళ్ళీ ఈ గడపలో కాలు పెట్టను. నా శవంకూడా మీకు దొరక్కుండా ఛస్తాను."

"అత్తయ్యా!"

"అవును! అది ఈ ఇంట్లో వుంటే నేను వుండను. బాగా ఆలోచించుకొని తలుపుతియ్" అంటూ కనకమ్మ తలుపు ముందునుంచి తప్పుకుంది.

"అత్తయ్యా! ఉద్రేకంలో మీరేం మాట్లాడుతున్నారో కొంచెం ఆలోచించండి."

"ఆలోచించాను. బాగా ఆలోచించాను. తలుపు తీస్తావో మానుతావో – ఇక నీ ఇష్టం!" అన్నది కనకమ్మ.

"మీ మాటలూ, పట్టుదలా నాకు అర్థం కావడం లేదు. ఈ వయసులో మీ రెక్కడికెళ్తారు? కరుణ వయసులో వుంది. వయసులో వున్న ఆడపిల్లలకు ఆశ్రయం లేకపోతే ఏమౌతుంది!"

"చావమను, చస్తే ఒక ఏడుపు ఏడ్చి ఊరుకుంటాను."

"అత్తయ్యా! ఒక్కసారి తలుపుతీసి అసలు ఏం జరిగిందో తెలుసుకుంటాను. ఆ తర్వాత మీ ఇష్టప్రకారమే చేస్తాను" అంటూ శారద అత్త ముఖంలోకి చూసింది.

కనకమ్మ మాట్లాడలేదు.

"తియ్యమంటారా?"

కరుణకు అంతా వినిపిస్తూనే వుంది.

ఆమెకు వింతగా లేదు.

శారద తలుపు తెరిచి కరుణను చూసింది.

కరుణ శారదను చూసింది. కాని, ఆత్రంగా ఆమె గుండెల మీద వాలిపోయి ఏడవలేదు.

శారదను చూసి నవ్వింది.

"కరుణా, ప్లీజ్! అలా నవ్వకు, కావాలంటే ఏడ్వు" అన్నది శారద కరుణ చెయ్యి పట్టుకొని.

కరుణ మళ్ళీ నవ్వింది.

"ఏడవగలగడంకూడా ఒక అదృష్టమే వదినా! మనసుకు కొంతవరకే కష్టసుఖాలకు కదిలే శక్తి వుంటుంది. ఏడవాలంటే మనసుకు అనుభవించే శక్తి వుండాలి. గుండెలో తడి వుండాలి. కళ్లలో చెమ్మ వుండాలి."

"రా కరుణా, లోపలకు."

కనకమ్మ నిప్పులుకక్కుతూ శారదనూ, కరుణనూ చూసింది.

"నేను లోపలకువస్తే మీ అత్తగారు బయటికి వెళ్ళిపోతారు. వద్దులే వదినా! వాకిట్లోనుంచే వీడ్కోలు తీసుకుంటాను. కేవలం నిన్నూ అన్నయ్యనూ చివరిసారిగా చూసివెళ్దాం అని వచ్చాను."

"కరుణా!" శారద బాధగా అన్నది.

"అన్నయ్య లేడా వదినా?"

"లేరమ్మా! నిన్ననే ఆఫీసరుతో క్యాంపుకెళ్ళారు. ఎల్లుండి వస్తారు. మీ అన్నయ్య వచ్చేంతవరకూ తొందరపడకు కరుణా! లోపలకు రా!" అన్నది శారద.

"లోపలకు వద్దులే వదినా? ఇక్కడ నిల్చునే నీతో రెండు మాటలు చెప్పి వెళ్తాను."

"ఏమిటమ్మా ఆ మాటలు? అసలు ఇంతకూ ఏం జరిగింది?" కరుణ చెయ్యి పట్టుకొని అడిగింది శారద.

కరుణ ఓ క్షణం ఆలోచనలో పడింది.

శారద దృష్టి కరుణ బోసిమెడమీద పడింది.

"కరుణా! మళ్ళీ ఆ దుర్మార్గుడు తాళి తెంపుకున్నాడా?" ఆవేశంగా అడిగింది.

కరుణ అదోలా నవ్వింది.

"చెప్పు కరుణా!" ఇనుమడించిన ఆవేశంతో అడిగింది శారద.

"లేదు వదినా, అతను తెంపుకోలేదు."

"మరి?" ఆశ్చర్యంగా అడిగింది శారద.

కరుణ వెంటనే సమాధానం ఇవ్వలేదు.

"చెప్పు కరుణా, ఏమైంది?"

"నేనే తెంపి అతని ముఖంమీద కొట్టి వచ్చేశాను." అతి మామూలుగా అన్నది కరుణ.

శారద తెల్లముఖంవేసి చూసింది.

కనకమ్మ ఉలిక్కిపడింది.

"ఏమిటే కూశావ్! నా కడుపున చెడబుట్టావ్! మంగళసూత్రం తెంచి మొగుడి ముఖంమీద కొట్టానని చెప్తున్నావా? ఎంతకు తెగించావే?" కనకమ్మ దాదాపు పిచ్చిదే అయింది.

"మీరు వుండండి అత్తయ్యా!" అత్తను విసుక్కుంది శారద.

"కరుణా! ఏమిటి నువ్వంటున్నది నిజమేనా?" అని అడిగింది.

"నిజమే వదినా! ఈసారి అతను తెంపుకోలేదు. అతను ఎందుకు తెంపుకుంటాడు? బంగారం లేదుగా? పసుపు కొమ్ముతో కట్టుకున్న మాంగల్యం తెంపుకుంటే అతనికేం వస్తుంది?" అతి తాపీగా అన్నది కరుణ.

శారద కరుణ ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది.

"అందుకని నేనే తెంచి అతని ముఖం మీద కొట్టివచ్చాను" అన్నది కరుణ.

"కరుణా!" అని మాత్రం అనగలిగింది శారద.

"ఎంత పనిచేశావే నీ ఏళ్ళు నేలకరవ! ఛీ! నా కడుపున చెడపుట్టావ్. అంతపని చేసి మళ్ళీ ముఖం చూపించడానికి వచ్చావా? సిగ్గుమాలినదానా?" కనకమ్మ కరుణ ఆ చెంపా ఈ చెంపా పిచ్చిగా వాయించసాగింది.

కరుణ ఉలక్కుండా పలక్కుండా నిల్చుంది.

శారద కనకమ్మను దూరంగా లాగింది.

"ఏమిటత్తయ్యా కరుణ అసలే బాధలో ఉంటే..." కోపంతో అన్నది శారద.

"అది చావనన్నా చచ్చింది కాదు, ఒక ఏడుపు ఏడ్చి ఊరుకుందును!" ఆవేశంతో రొప్పుతూ అన్నది కనకమ్మ.

"అమ్మా!" కరుణ ఉద్రేకపడకుండా పిల్చింది.

"ఛీ! ఎవరే నీకు అమ్మ? అలా పిలవకు." గట్టిగా అరిచింది కనకమ్మ.

"అమ్మా అని నిన్ను కన్నతల్లిగా పిలువలేదు. నీలో ఆ మాతృప్రేమ ఏనాడో చచ్చిపోయిందని నాకూ తెలుసు. ఆడదానివనీ, వయసులో నాకంటే పెద్దదానివనీ 'అమ్మా' అన్నాను – అంతే! నీకు యిష్టం లేకపోతే 'కనకమ్మా!' అనే పిలుస్తానులే." అతి మామూలుగా – ఉద్రేకం ఏమాత్రంలేని కంఠంతో అన్నది కరుణ.

కనకమ్మ దిమ్మెరపోయింది.

కరుణను కళ్ళు పెద్దవి చేసుకొని చూడసాగింది.

ఇది కరుణేనా? తనబిడ్డ కరుణేనా? కాదు – కాదు... కరుణ ప్రేతంగా మారింది- లేకపోతే కరుణ అట్లా మాట్లాడటం ఏమిట?

శారదకూడా కళ్ళు పెద్దవిచేసుకొని కరుణను చూడసాగింది.

"ఎందుకు వదినా, అలా చూస్తావ్?" కరుణ నవ్వింది.

మొనాలిసాలా నవ్వింది.

ఆ నవ్వులో దుఃఖమే ఉందో, విరక్తే ఉందో, సంతోషమే ఉందో శారదకు అంతుపట్టలేదు.

"కరుణా, ఏమిటమ్మా ఇది? అసలు ఏం జరిగిందో చెప్పవూ?" శారద కరుణ రెండుచేతులూ పట్టుకుంది.

"వదినా, ఒకటి అడుగుతా చెప్పు?"

"ఏమిటమ్మా?" శారదకు దుఃఖం వస్తూంది.

"నిరపరాధి కంఠానికి ఉరితాడు తగిలించారు! ఆ తాడు అతని కంఠానికి ప్రతి నిముషం బిగిసిపోతూవుంది. ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. అతని చేతులు బంధించిలేవు. ఆ తాడును అతను తెంపుకోగలడు. అటువంటప్పుడు ఆ వ్యక్తి ఏం చేస్తాడు – చెప్పు వదినా?" అంటూ శారద ముఖంలోకి చూసింది కరుణ.

శారద స్థాణువులా నిల్చుంది చూస్తూ

"చెప్పు వదినా! ఆ సమయంలో ఆ వ్యక్తి ఏం చేస్తాడు?"

"ఆ వ్యక్తి ఆ తాడును తెంపి తనను రక్షించుకుంటాడు – ఆ దారుణ యాతననుంచి."

"నేనూ అదే చేశాను వదినా! అది అమ్మకు అర్థం కాదు. నువ్వైనా చెప్పు వదినా! నేను చేసింది తప్పంటావా?"

శారద కరుణ ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది.

"మీరంతా మంగళప్రదంగా పూజించే మాంగల్యం నా కంఠానికి ఉరితాడైంది. ప్రతి నిముషం నాకు నరకాన్నే చూపించింది. దాన్ని తెంచిపారేశాను. నరకయాతననుంచి విముక్తురాల్నయాను. నేను చేసింది తప్పా? చెప్పవేం వదినా?"

"తప్పు కాదమ్మా! నువ్వు తప్పు చెయ్యలేదు. నువ్వు మంచిపనే చేశావ్ కరుణా!" ఆవేశంతో శారద కరుణను రెండు చేతులతో చుట్టేసింది.

కరుణ బాధతో కెవ్వున కేకవేసింది.

శారద తృళ్ళిపడి "ఏమిటమ్మా, ఏమైంది?" అని అడిగింది.

కరుణ మాట్లాడలేదు.

శారదకు ఏదో ఆలోచన వచ్చి నిలువెల్లా వణికిపోయింది.

"ఏదీ, వీపు చూపించు!"

"ఏం చూస్తావు వదినా?" వేదాంతిలా నవ్వింది కరుణ.

కరుణ శారదను వెనక్కుతిప్పింది. జాకెట్ పైకెత్తి చూసింది.

నల్లటివాతలు, సిగరెట్ కాల్చిపెట్టిన చుక్కలు - పాతవికాదు. పాతవి మచ్చలుగా మారాయి.

"చూడత్తయ్యా! ఆ దుర్మార్గుడు ఏంచేశాడో?" అన్నది శారద.

కనకమ్మ తెల్లపోయింది. ఆ వాతలు చూసి నోట మాట రాలేదు. నిలువెల్లా కంపించిపోయింది.

"వాడు మనిషికాదు - పశువు, పిశాచి! ఛీ ఛీ!" శారద ఛీత్కారం చేసింది.

"శెలవిప్పించు వదినా!"

"కరుణా! ఏమిటమ్మా ఇది? పద, లోపలకు."

"వద్దు వదినా! నన్ను లోపలకు పిలవకు. నేను లోపలకు వస్తే అమ్మ బయటికి వెళ్ళిపోతుంది. ఈ వయసులో ఆమె బయటికి వెళ్ళి ఎలా బతుకుతుంది?" అన్నది కరుణ తల్లి ముఖంలోకి జాలిగా చూస్తూ.

"అమ్మా కరుణా!" కనకమ్మ ఆక్రోశించింది.

కరుణ తల్లి ముఖంలోకి చూసింది. తల్లి అంతరాంతరాల్లో ఏదో కరుగుతున్నట్టు అనిపించింది.

"అమ్మా! నన్ను అలా పిలవకు. మళ్ళీ నాలో ఆశలు రేకెత్తించకు" అన్నది కరుణ.

"కరుణా, లోపలకు రా!" శారద కరుణ చెయ్యి పట్టుకుంది.

"వద్దు వదినా! నాకు ఈ ఇంట్లో స్థానం లేదు. అసలు అందుకోసం రాలేదు. నేను ఈ ఇంట్లోవుంటే చెల్లెల్ని మొగుడు వదిలేస్తాడు" అంటూ తల్లి ముఖంలోకి చూసింది కరుణ.

కనకమ్మ కళ్ళలో భయం కన్పించింది.

కరుణ తనలో తనే నవ్వుకుంది.

"వదినా! పునర్జన్మంటూ ఉందో లేదో తెలియదు. ఉంటే నువ్వూ, అన్నయ్యా నాకు తల్లితండ్రులు కావాలని కోరుకుంటున్నాను."

"కరుణా!" శారద నిలువెల్లా కంపించిపోయింది.

"ఏమిటమ్మా ఆ మాటలు?" మళ్ళీ వణుకుతున్న కంఠంతో అన్నది.

"ఎందుకు వదినా, బాధపడ్తావ్! అన్నయ్యకు చెప్పు. నేను చేసింది తప్పైతే క్షమించమని చెప్పు!"

"మీ అన్నయ్య వచ్చిందాకైనా వుండు. రా కరుణా! లోపలకు రా!" ప్రాధేయపడుతూ అన్నది శారద.

"నన్ను క్షమించు వదినా! నేను వెళ్తున్నాను."

"ఎక్కడికి వెళ్తావ్!"

"ఈ విశాల ప్రపంచంలో నాకు బారెడు చోటు దొరకదా వదినా?"

"ఎలా బతుకుదా మనుకుంటున్నావ్?" శారద అడిగింది.

"నాలాంటివాళ్ళంతా ఎలా బతుకుతున్నారు వదినా?"

"నీకు తెలియదమ్మా! వయసులో ఉన్నావ్! ఈ ప్రపంచం నిన్ను గౌరవంగా బతకనివ్వదు. నీలా నీడలేని ఆడవాళ్ళు ఎలా బతుకుతున్నారో నీకు తెలియదు."

"తెలుసు!"

"తెలిస్తే ఇలా వెళ్ళవు. నీలాంటి ఆడవాళ్ళకు ఈ సంఘంలో రక్షణ లేదు. బతకలేవు."

"బతుకుతాను వదినా! నేను చచ్చిపోను. నేను ఏంచేసయినా బతుకుతాను. చివరకు ఒళ్ళు అమ్ముకొని అయినా..."

"కరుణా!" గావుకేక పెట్టింది కనకమ్మ.

"కరుణా!" రెండు చేతులతో కరుణను పట్టుకుంది శారద.

"అవును వదినా! నా ఒళ్ళు అమ్మి నాకు తాళి కట్టినవాడిని పోషించడంకంటే నన్ను నేను పోషించుకోవడం నీచమా?"

"కరుణా! ఏమిటి నువ్వంటున్నది? నువ్వు చెబుతుంది నిజమా?"

"నిజమే చెప్తున్నాను వదినా! అతనికి డబ్బు కావాలి. ఆ డబ్బు ఎలాగయినా పొందటమే అతని లక్ష్యం. నిన్నరాత్రి ఒక స్నేహితుణ్ణి - కాదు, అలా చెప్పి ఎవరో ఆఫీసర్ని ఇంటికి భోజనానికి పిల్చాడు. భోజనాలయాక నా భర్త అని పిలవబడేవాడు- నన్ను అతనితో ఒంటరిగా వదిలేసి సిగరెట్లు తెచ్చేనెపంతో బయటికి వెళ్ళిపోయాడు."

ఆగి కనకమ్మనూ, శారదనూ మార్చి మార్చి చూసింది కరుణ.

ఇద్దరూ జీవంలేని బొమ్మల్లా నిలబడి వున్నారు.

"అతను నన్ను బలవంతం చెయ్యబోయాడు. అసలు విషయం చెప్పాడు. మూడువందలు యిచ్చాడట. చూశావా వదినా! నా వెల మూడువందల రూపాయలు. అమ్మ ఇంకా వంశం, గౌరవం అంటూంది." ఆగి ఊపిరి పీల్చుకుంది కరుణ.

శారద పిచ్చిచూపులు చూస్తూ నిల్చుంది.

"అతన్ని అవమానించాను. చేతికందింది తీసుకొని కొట్టాను. అతను కోపంతో వెళ్ళిపోయాడు. వింటున్నావా వదినా?"

"పశువు! మీ అన్నయ్యను రానియ్! అతని అంతు తేల్చుకుందాం!" పళ్ళు కొరికింది శారద.

"ఏం తేల్చుకుంటాడు అన్నయ్య?. భర్త అలా ప్రవర్తిస్తాడంటే ఎవరు నమ్ముతారు? నేను అతనికి లొంగలేదని ఆ రాత్రంతా నానా హింసా పెట్టాడు."

కనకమ్మకు మాటరావడం లేదు. నిర్జీవంగా నిల్చుని ఉంది.

"చివరకు ఆ తాడు తెంపి అతనిమీద కొట్టి వచ్చేశాను."

"మంచిపనే చేశావ్! పదమ్మా లోపలకు."

"వద్దు వదినా! నన్ను పిలవకు. మీకు చెప్పిపోదామనే వచ్చాను. నా బతుకు నేను బతుకుతాను. నేను వెళ్ళిపోతున్నాను. మళ్ళీ ఈ జన్మకు నా ముఖం మీకెవరికీ చూపించను. వస్తాను" అంటూ కరుణ గబగబా మెట్లు దిగింది.

"కరుణా!" శారద పిల్చాననుకుంది. గొంతులోనుంచి మాటలు పెగల్లేదు.

"కరుణా!"

కనకమ్మగావు కేకపెట్టి విరుచుకుపడిపోయింది.

వెళ్ళిపోతున్న కరుణకు ఆ కేక విన్పించింది.

కాని, వెనక్కు తిరిగిచూడలేదు.

పెట్టె చేతితో పట్టుకొని వడివడిగా నడిచి వెళ్ళిపోయింది.

శారద స్థాణువుగా నిలబడిపోయింది.



"ఇంకా నీకు ఈ వ్యవస్థమీద నమ్మకం ఉన్నట్టుంది. భవిష్యత్తుమీద ఇంకా ఆశలు వున్నట్టున్నాయ్. సరే! నేను వెళ్తాను. ఎప్పుడైనా నా అవసరం వుందనుకుంటే కన్పించు."

# ముందుమాట

అన్నీ వున్న ఈ దేశంలో ఏమీలేనివాళ్ళే ఎక్కువమంది వున్నారు.

ఎందుకు వున్నారు?

ఈ ప్రశ్నకు చరిత్ర సమాధానం చెప్తే, ఇంకా అలా వుండటానికి ఎందుకు ఒప్పుకుంటున్నారనే ప్రశ్నకు-జనాభా లెక్కల్లోకి కూడా రానివాళ్ళను కలుపుకొని-అరవైకోట్ల మంది సమాధానం చెప్పాలి.

పేవ్‌మెంటుమీద దిక్కులేని చావు చచ్చిన ముసలివగ్గు వెలుగారిన చూపుల్లో కన్నతల్లినీ, నిండీనిండని వయసులోనే పతితలైన అనాథల కమిలిన చెక్కిళ్ళ నీడల్లో తన చెల్లెల్నీ చూడగలిగిన అభాగ్యుడూ, నిరుద్యోగీ, అయిన చంద్రం ఆ ప్రశ్నకు సమాధానాన్వేషణలోనే ఆహుతి అయిపోయాడని చెప్పడమేకాక, ఆస్తికవాదాన్నీ, పలాయనవాదాన్నీ ఉగ్గుపాలతోనే రంగరించి పోసే ఈ 'నైతిక' సమాజంలో మనిషి నిలబడి, ఎదురు తిరిగితే ఏమౌతుందనే మరో ప్రశ్నను మీ ముందు వుంచడం జరిగింది ఈ నవలలో.

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాల్సింది మీరే!

మీరే!

కలల్లో కూడా కౌంటర్ రివల్యూషన్‌నే చూసే ఈనాటి సామాజిక జీవి, ఎందుకు, ఏ పరిస్థితుల్లో విప్లవోన్ముఖుడు అవుతున్నాడో, వెన్నెల ఎప్పుడు మండుతుందో చెప్పడానికి ఈ చిన్న నవలలో ప్రయత్నించడం జరిగింది.

**- రచయిత్రి**

# వెన్నెల మండుతోంది

నదుల్లో నీరు వుంది. అడవుల్లో సంపద వుంది. గనుల్లో రత్నాలు ఉన్నాయ్. బంగారం వుంది. దేశంలో సహజ సంపదలెన్నో ఉన్నాయి; అయినా -

ఈ సువిశాల దేశంలో బోలెడంత నేల వుంది - కాని చారెడు నేల లేనివాళ్ళు చాలా మంది వున్నారు. నదుల్లో నీరుంది - కాని అధిక భాగం సముద్రం పాలవుతోంది. అడవుల్లో సంపద వుంది - కాని అది ఆదిమ వాసులకు అందటం లేదు. గనుల్లో రత్నాలూ, బంగారం వున్నాయ్ - కాని వాటిని దాచిపెట్టే ఇనుప పెట్టెలు కూడా చాలా వున్నాయ్.

దేశంలో మేధావులు వున్నారు. కండపుష్టి కలవాళ్ళూ ఉన్నారు.

రాళ్ళు కొట్టే వాళ్ళున్నారు. భవనాలు కట్టే వాళ్ళున్నారు. ఫ్యాక్టరీలలో సరుకు తయారుచేసే వాళ్ళున్నారు. పొలం దున్నేవాళ్ళున్నారు. రోడ్లు వేసే వాళ్ళున్నారు.

అంటే - చెమట కార్చే వాళ్ళు అనేక మంది వున్నారు. ఆ చెమట ఫలితాన్ని అనుభవించే వాళ్ళు కూడా - కొద్ది మందే కావచ్చు - వాళ్ళూ వున్నారు.

ఉదయం నుంచి సాయంత్రం వరకూ, రెక్కలు ముక్కలు చేసుకొని, ఎముకల్ని పిండి చేసుకొని, చెమట ఓడ్చినా, కడుపు నిండక పోవడానికి కారణం తెల్లవాడే అనుకున్నాడు సామాన్యుడు.

తెల్లవాడు పోతే తనను కొల్లగొట్టే వాడు వుండడనీ, ఒంటినిండా బట్టా, కడుపునిండా తిండీ దొరుకుతుందనీ నమ్మాడు సామాన్యుడు.

తెల్లవాడు వెళ్ళిపోయాడు. అధికారం నల్లవాడికి ఇచ్చేసి మరీ వెళ్ళిపోయాడు. ప్రభుత్వం కుబుసం మార్చింది.

అది చూసి 'ఇక మన కష్టాలు తీరినట్టే' అనుకుంటూ తేలిగ్గా నిట్టూర్చాడు సామాన్యుడు.

నల్లవాడి రాజ్యంలో దేశంలో అనేక మార్పులు వచ్చాయి. అనేక ప్రణాళికలు అమలులోకి వచ్చాయి. పెద్ద పెద్ద డామ్‌లు కట్టారు. పరిశ్రమలు నెలకొల్పారు. షిప్పులు తయారు చేశారు. విమానాలు తయారు చేశారు. చిన్న కార్లు తయారు చేసే పథకం కూడా వేశారు.

అయితే -

చెమటోడ్చే వాడి జీవితంలో మార్పు రాలేదు. వాడి జీవితం రోజు రోజుకూ అధ్వాన్నం అవుతూంది.

రోడ్ల పక్కన, వంతెనల మీద, గ్రామాల్లో, పట్టణాల్లో, ఇండ్లలో, వీధుల్లో, జనం పని కోసం, పట్టెడు కూటికోసం పడిగాపులు కాస్తున్నారు. ఎంగిలి ఆకుల కోసం చెత్త కుండీల దగ్గిర కుక్కల్తో కాట్లాడుతున్నారు.

స్కూళ్ళనుంచీ, కాలేజీలనుంచీ, లక్షలాది యువకులు విద్యావంతులై డిగ్రీలు తీసుకొని, జీవన ప్రాంగణంలో అడుగు పెడ్తున్నారు. ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీల ముందూ, ఆఫీసుల వరండాల్లో, పాలకుల పంచల్లో, బారులు తీరి, భుక్తికోసం, కొండంత ఆశలతో రోజుల కొద్దీ – నెలల కొద్దీ – సంవత్సరాల కొద్దీ .... ఎదురు చూస్తున్నారు.

పల్లెసీమల నుంచి బారులు తీరి కుటుంబాలకు కుటుంబాలే పట్నాలకు తరలి వస్తున్నాయ్.

అలా వచ్చినవాళ్ళు పేవ్‌మెంట్ల మీద కాపురాలు చేస్తున్నారు. బస్ స్టాండుల్లో బిచ్చ మెత్తుతున్నారు. చేతనయిన వాళ్ళు జేబులు కొడ్తున్నారు.... దొంగతనాలు చేస్తున్నారు.

చదువుకున్న వాడూ, చదువులేని వాడూ, అందరూ కలిసి పని కోసం, శరీరంలో ప్రతి అణువూ కదిల్చి, దేశంలోని ప్రతి అంగుళం గాలిస్తున్నారు.

ఇటువంటి దేశంలో, ఈ సామాజిక వ్యవస్థలో, ఈ పరిస్థితుల్లో, తరతరాల మధ్యతరగతి కుటుంబానికి వారసుడు అయిన –

ఒకానొక యువకుడు – పేరు చంద్రశేఖరం – తండ్రి మిగిల్చిపోయిన ఇల్లు కూడా అమ్ముకొని డిగ్రీ సంపాదించిన చంద్రశేఖరం – ఒక ఇరుకు వీధిలో ట్రాన్స్‌పోర్టు కంపెనీముందు కూర్చునివున్నాడు. లారీలోకి సామాన్లు ఎక్కిస్తున్న ఇద్దరు మనుష్యుల్నీ, వారి పనినీ అజమాయిషీ చేస్తున్న సూటువాలాను పరీక్షగా చూస్తూ కూర్చున్నాడు....

ఆ ఇద్దరూ బరువు ఎత్తలేక సతమత మవుతున్నారు.

చంద్రం లేచివెళ్ళి చెయ్యి అందించి సహాయం చేశాడు.

"చదువుకున్న వాడిలా వున్నావ్?" సూటువాలా ప్రశంసాపూర్వకంగా చూస్తూ చంద్రాన్ని ప్రశ్నించాడు.

"అవునండీ!.... బి. ఏ. పాసయాను" అన్నాడు చంద్రం సూటువాలా కేసి ఆశగా చూస్తూ.

"అయితే, నిరుద్యోగి వన్న మాట!"

"అవునండీ! మీరేదయినా పని ఇప్పిస్తే...."

"పనా? ఈ రోజుల్లో పని ఇప్పించడం.... అందులో చదువుకున్న వాళ్ళకు...నా బోటి వాళ్ళకు సాధ్యమా? సరే, వస్తా.... థ్యాంక్స్!" అని వెళ్ళి లారీ ఎక్కి కూర్చున్నాడు.

లారీ దుమ్ము రేపుకుంటూ వెళ్ళిపోయింది.

ఆ దుమ్ములోకి చూస్తూ నిల్చుండి పోయాడు చంద్రం.

చంద్రం కదిలాడు. నడక సాగించాడు. ఎక్కడికి? ఏమో! అతనికే తెలియదు.

నగరం నడిబొడ్డు మీద నడుస్తున్నాడు. వాహనాల హడావిడి. జనం తొక్కిసలాట. రకరకాల షాపులు దాటాడు. సినిమా హాలులు దాటాడు. హోటళ్ళు దాటాడు. అన్ని చోట్లా జనమే! అందరూ బిజీగా వున్నట్టే కన్పిస్తున్నారు.

బస్స్టాండు చేరుకున్న చంద్రం దృష్టి జనం మూక మీద పడింది. యాంత్రికంగా అటు వైపు నడిచాడు.

ఒక వ్యక్తిని నలుగురైదుగురు కలసి తంతున్నారు. వాడు కేకలు పెడ్తున్నాడు. చుట్టూ మూగిన వాళ్ళు వింతగా, అదేదో సినీమాలో స్టంట్‌లా చూస్తూ ఆనందిస్తున్నారు. కొందరు ఆతన్నే వాళ్ళకు ప్రోత్సాహం ఇస్తున్నారు.

"తన్నండి వెధవను! మళ్ళీ చూస్తే చదువుకున్న వాడిలా వేషం వీడూనూ!" రిమ్‌లెస్ కళ్ళ జోడు సర్దుకుంటూ అన్నాడు ఒక యువకుడు.

"ఈ రోజుల్లో దొంగ ఎవరో - దొర ఎవరో తెలియడం లేదు" అన్నది ఓ ఖద్దరు సిల్కు లాల్చీ.

"ఆ మధ్య మా బామ్మర్ది పర్సు కూడా కొట్టేశారు" అన్నది ఓ టెర్లిన్ షర్టు.

"నాలుగు రోజులు కాలేదు. నా స్నేహితుడి జేబు కత్తిరించారు" అన్నది ఓ ట్వీడ్ పాంట్.

తలొక మాటా అంటున్నారు. అన్ని జేబులూ వాడే కొట్టేసినట్టు మాట్లాడుతున్నారు.

చంద్రం జనాన్ని తోసుకుంటూ ముందుకు వెళ్ళి నిలబడ్డాడు.

ఒక యువకుడు నోటి నుంచి కారుతున్న రక్తం తుడుచుకుంటూ "కొట్టకండి! కొట్టకండి! ప్లీజ్! చచ్చిపోతాను" అంటున్నాడు దీనంగా.

"అమ్మనా.... ఇంగ్లీషు మాట్లాడుతున్నాడు!"

మళ్ళీ 'ఫట్! ఫట్!' ముఖం మీదా, వీపు మీదా దెబ్బలు పడ్తున్నాయ్....

చంద్రం ఆ వ్యక్తిని చూశాడు. దిమ్మెర పోయాడు. స్థాణువులా నిలబడి పోయాడు.

మళ్ళీ దెబ్బలు. "అగండి! చచ్చేట్టున్నాడు! కొట్టకండి!...." అరుపులు.

అనంతం! తన క్లాసుమేట్ అనంతం! బి. ఏ. పాసయాడు - జేబులు కొడ్తున్నాడా?

చంద్రం ఒక్క ఊపున ముందుకు వెళ్ళాడు. గాలిలో లేచిన ఒక చేతిని పట్టుకుంటూ "కొట్టకండి! వాడు దొంగ కాదు. గ్రాడ్యుయేట్! మీరు పొరపాటు పడివుంటారు" అన్నాడు ఆదుర్దాగా.

"వీడెవడ్రోయ్! జేబు కొడ్తుండగా కళ్ళారా చూసి ఘట్టుకొన్న వాణ్ణి దొంగ కాదంటున్నాడు!"

"వీడూ ఆ ముఠాలో వాడిలాగే కన్పిస్తున్నాడు!"

"అవును, ఆ వేషం వాడూ.... తన్నండి గాడ్దికొడుకుని."

ఆ మాటలు పూర్తి అయీ కాకుండానే చంద్రం శరీరం మీద అనేక చేతులు భరతనాట్యం చెయ్య సాగాయి.

"జేబులు కొట్టడానికేనా, చదువుకుంది?"

"పైగా గ్రాడ్యుయేట్ గ్రాడ్యుయేట్!"

అసలే నీరసంగా వున్న చంద్రం ఆ దెబ్బలకు తట్టుకోలేక పడిపోయాడు. కళ్ళు చీకట్లు కమ్మాయ్.

"చస్తాడేమో వెధవ! పదండి. పోలీసులు వస్తే కోర్టు చుట్టూ తిరగలేక చావాలి..." రిమ్‌లెస్ కళ్ళు జోడు సర్దుకుంటూ అన్నాడో పెద్దమనిషి.

అందరూ తప్పుకున్నారు.

అనంతం చంద్రం పక్కగా కూర్చుని ముఖంలోకి చూశాడు.

"అరే! చంద్రం, నువ్వా? లే!" అంటూ కదిపాడు. చంద్రానికి స్పృహ లేదు.

అనంతం పరిగెత్తుకెళ్ళి ఎదురుగా వున్న టీ స్టాల్ నుంచి ఓ గ్లాసుడు నీళ్ళు తెచ్చాడు. ముఖం మీద చల్లి పేపర్తో విసిరాడు.

చంద్రం కళ్ళు తెరిచాడు.

"ఎలా వుంది?" లేవదీసి కూర్చోబెడ్తూ అన్నాడు అనంతం.

"బాగానే వుంది." నీరసంగా అన్నాడు చంద్రం.

చంద్రాన్ని ఎదురుగా వున్న టీ స్టాల్‌లోకి తీసుకెళ్ళి టిఫిన్, టీ ఇప్పించాడు.

చంద్రం కడుపులో మంట చల్లారింది. ఓపిక వచ్చింది.

ఇద్దరూ వెళ్ళి దూరంగా వున్న తూము మీద కూర్చున్నారు ఇద్దరికీ ఎన్నో మాట్లాడాలని వుంది. ఇద్దరూ మౌనంగానే కూర్చున్నారు.....

"అన్ని దెబ్బలు తిన్నా నువ్వు పడిపోలేదు! నేను నాలుగు తగిలేసరికి అన్ను పట్టిపోయాను."

"నాకు అలవాటయింది!"

"అనంతం! బి. ఏ చదివి నువ్వు చేస్తున్న పని ఇదా? ఇంత దిగజారి పోయావా?"

"నేను దిగజారి పోలేదు... నన్ను వాళ్ళే దిగజార్చారు!" అన్నాడు అనంతం ఉద్రేకంగా.

"వాళ్ళెవరు?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు చంద్రం.

"వాళ్ళే – నన్ను కొట్టిన వాళ్ళు – పర్సులు జేబుల్లో పెట్టుకొని తిరిగే వాళ్ళు – నాలుగు సంవత్సరాలు కాలేజీలో చదివాక పనికి రాని కాగితం ఒకటి చేతి కిచ్చి బయటకి పంపించిన వాళ్ళు – సిఫార్సులు వుంటే గాని ఉద్యోగాలు ఇవ్వని వాళ్ళు – అందరూ నన్ను దిగజార్చారు."

చంద్రం ఆశ్చర్యంగా అనంతం ముఖంలోకి చూశాడు.

"నాకూ నిజాయితీతో బతకాలనే వుంది. పదిమంది మధ్య గౌరవంగా బతకాలనే వుంది. అష్ట కష్టాలూ పడి చదువుకున్నాను. మా అమ్మ వంటపనిచేసి నన్ను చదివించింది. ఎందుకు? చదివి ప్రయోజకుణ్ణి అవుతాననుకుంది. పెద్ద ఉద్యోగం వస్తుందనుకొంది, తన కష్టాలు గట్టెక్కుతాయి అనుకుంది, చెల్లెలికి పెళ్ళి చేస్తాను అనుకుంది. తమ్ముళ్ళను చదివిస్తాను అనుకుంది. నేనూ అలాగే అనుకున్నాను." ఉద్రేకంలో మాటలు పెగలక ఓ క్షణం ఆగిపోయాడు అనంతం.

చంద్రం అనంతం ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు. అనంతం ఏదో మంత్రం చదువుతున్నట్టుంది చంద్రానికి.

"కాలేజీనుంచి బయటికి వచ్చిన నాకు నిరుద్యోగ సమస్య ఎదురైంది. ఉద్యోగలక్ష్మి, అండలున్న వాళ్ళ మెడల్లోనే పూల దండలు వెయ్యడం చూశాను! అర్హతలు అక్కర్లేదు, నిజాయితీ అక్కర్లేదు! తిరిగాను. చెప్పులు అరిగిపోయేలా తిరిగాను. కాళ్ళు పడిపోయేలా తిరిగాను. మనసు విరిగి పోయేంతవరకూ తిరిగాను. తిరిగి తిరిగి ఇంటికి వచ్చిన నన్ను నాలుగు జతల కళ్ళు ఆత్రంగా 'ఏమైంది? ఇవ్వాళైనా ఉద్యోగం దొరికిందా?' అంటూ ప్రశ్నించేవి. తల్లీ, చెల్లీ, ఇద్దరు తమ్ముళ్ళు నామీద ఆధారపడి వున్నారు. అమ్మకు ఇప్పుడు వంటచేసే ఓపిక కూడా లేదు. మంచం పట్టింది. ఎముకల్లో మూలుగు చచ్చింది. కళ్ళలో జీవం చచ్చింది. నిరాశతో ఇంటికి తిరిగి వచ్చిన నన్ను గాజు గోళీల్లా వున్న ఆ కళ్ళు ఎన్నో ప్రశ్నలు వేసేవి. ఆ కళ్ళలో వెలుగు చూడా లనుకున్నాను. నా తమ్ముళ్ళను చదివించా లనుకున్నాను. ఓణీలు లేక, చిరిగిన బట్టల్లో పొంగి వస్తున్న యవ్వనాన్ని దాచుకోలేక ఒక మూల కూర్చుని, అన్న ముందుకూ తమ్ముళ్ళముందుకూ రావడానికి కూడా సిగ్గుపడుతూ, కుమిలిపోతున్న చెల్లాయికి వంటినిండా బట్టలు ఇవ్వడం నా బాధ్యత అనుకున్నాను. ఇవన్నీ చెయ్యాలంటే డబ్బు కావాలి. పాల పొంగులాంటి యవ్వనం పొయ్యి పాలు కాకముందే నా చెల్లెలికి పెళ్ళి చెయ్యాలంటే డబ్బు కావాలి. తనకు పెళ్ళికాదు – 'అదే అన్నకు తన పెళ్ళి చేసే శక్తి లేదు–' అవి తెలుసుకున్న రోజున నా చెల్లెలు ఏం చేసినా చెయ్యొచ్చు. ప్రలోభాలు చూపిన వాడితో ఇల్లు విడిచి లేచి పోవచ్చు! ఆ తర్వాత వాడు నడిబజార్లో వదిలేస్తే – ఓ పూట కూటికోసం, పడుపు వృత్తిని చేపట్టవచ్చు! నా తమ్ముళ్ళు కడుపులో పేగులు 'కిర కిర' చుట్టుకు పోతూవుంటే, ఆకలికి తట్టుకోలేక దొంగలుగా మారొచ్చు. వాళ్ళు అలా కాకుండా వుండాలంటే నేను డబ్బు సంపాదించాలి. అందుకే జేబులు కొడ్తున్నాను. అప్పుడప్పుడు తన్నులు తింటున్నాను. పోలీసుల చేతుల్లోపడి వాళ్ళ చేతులు తడిచేసి తప్పించు కుంటున్నాను. నా తమ్ముళ్ళు చదువుతున్నారు. చెల్లెలికి పెళ్ళి చెయ్యాలి" అంటూ చెల్లెలి పెళ్ళిగురించిన ఆలోచనల్లోకి జారి పోయాడు అనంతం.

చంద్రం అంతా విన్నాడు. అనంతం ముఖంలోకి అయోమయంగా చూశాడు.

"దద్దమ్మ! దద్దమ్మ! తిండి పెట్టటంచేత కాదుకాని కొడ్తున్నాడు!" చెల్లెలి మాటలు చంద్రం చెవుల్లో గింగురు మన్నాయ్.

నిజంగా తను దద్దమ్మే! తల్లినీ, ఒక చెల్లినీ పోషించలేక ఇంటినుంచి పారిపోయిన దద్దమ్మ! అనంతం చెప్పినట్టు తన చెల్లెలు – ప్రలోభాలకు గురై – హే భగవాన్!

ఆ రోజు తను లక్ష్మిని కృష్ణతో సినిమాలో చూశాడు. ఆ చీరకూడా వాడే కొని ఇచ్చి వుంటాడు. ఏం ఆశలు చూపిస్తున్నాడో! చివరకు తన చెల్లెలు....

చంద్రం వళ్ళంతా చెమటలు పడ్తున్నాయ్.

"చంద్రం! ఏమిటి అలా అయిపోతున్నావ్? చెమట్లు పడ్తున్నాయేం?" అనంతం ఆతృతగా అడిగాడు.

"అబ్బే! ఏం లేదు. కొంచెం గిడ్డీగా అనిపించింది" అంటూ ముఖాన పట్టిన చెమట తుడుచుకున్నాడు చంద్రం.

"ఇక నీ సంగతి చెప్పు! ఏం చేస్తున్నావ్?"

"ఏమీ చెయ్యడం లేదు." దిగాలుగా అన్నాడు చంద్రం.

అనంతం అర్థం అయినట్టు జాలిగా చంద్రం ముఖంలోకి చూశాడు.

"ఈ రోజుల్లో నీతీ నిజాయితీ అని కూర్చుంటే బ్రతకలేం! ఏదో చెయ్యాలి. చాలా ఎండెక్కింది, పద భోజనం చేద్దాం!" అన్నాడు అనంతం.

"నీ దగ్గిర డబ్బులున్నయ్యా?"

అనంతం సమాధానంగా చిరునవ్వు నవ్వాడు.

చంద్రాన్ని తీసుకొని అనంతం దగ్గర్లోవున్న ఓ భోజన హోటల్‌కు తీసుకెళ్ళాడు.

క్యాషియర్ అనంతాన్ని చూసి నవ్వుతూ పలకరించాడు. సర్వర్సుకూడా చనువుగా మాట్లాడుతున్నారు.

భోజనం చేసి డబ్బు చెల్లించకుండా బయటికి వచ్చిన అనంతాన్ని ఆశ్చర్యంగా చూశాడు చంద్రం.

"డబ్బులు ఇవ్వలేదేం?" కుతూహలంగా ప్రశ్నించాడు చంద్రం.

"ఖాతా వుందిలే. డబ్బు దొరికినప్పుడు ఇస్తూ వుంటాను –"

అనంతం వాచీ చూసుకున్నాడు.

"నాతో వస్తావా?"

"ఎక్కడికి?"

"సినిమా హాలుకు."

"నాకు సినిమా చూడాలని లేదు." అన్నాడు చంద్రం.

"సినిమాకు కాదు – సినిమా హాలుకు?"

"ఎందుకూ?" అడిగాడు చంద్రం అమాయకంగా.

"ఇవ్వాళ 'తిలోత్తమ'లో కొత్త సినిమా రిలీజ్. జనం తొక్కుకు చస్తారు. మంచి ఛాన్స్ ఏదైనా తగలొచ్చు."

చంద్రానికి అర్థం అయింది.

"జేబులు కొట్టటానికా?" అన్నాడు భయపడిపోతూ.

"ఇంకా నీకు ఈ వ్యవస్థమీద నమ్మకం వున్నట్టుంది. భవిష్యత్తుమీద ఇంకా ఆశలు వున్నట్టున్నాయ్. సరే, నేను వెళ్తాను. ఎప్పుడైనా నా అవసరం వుందనుకుంటే కన్పించు" అంటూ అనంతం వెళ్ళిపోయాడు హడావిడిగా.

చంద్రం అనంతం కన్పించేతవరకూ చూస్తూ నిల్చున్నాడు. "అనంతం దద్దమ్మకాదు. ఎలాగయినా తను బ్రతికి నలుగుర్ని బతికించ గలడు" అనుకున్నాడు.

# 2

చంద్రం కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్నాడు.

రోడ్డు పక్కగా జనం మూగివున్నారు. చంద్రం జనం మధ్యకు వెళ్ళి నిలబడ్డాడు.

ఒకడు చేతిలో కొన్ని పుస్తకాలు పట్టుకొని డ్రామా ఫక్కీలో డైలాగ్స్ చెబుతున్నాడు:

"చదవండి బాబూ! చదవండి! చదివి తెలుసుకోండి! అనందించండి! ఒకసారి మొదలు పెట్టి చూడండి. ఇక అన్నం నీళ్ళూ అక్కర్లేదు. చదివి తెలుసుకోండి. విశ్వనాథం ఏమైనాడు? ఎక్కడి కెళ్ళాడు? అలా ఇల్లు విడిచి వెళ్ళిపోయిన విశ్వం రైల్లో ఎక్కాడా? రైలు పట్టాల పక్కన నడుస్తున్నాడా? రైలు కింద తల పెట్టాడా? లేక ఎక్కిన రైలు బోల్తా కొట్టిందా? చదివి తెలుసుకోండి!

"ఇంకా.... రమణి ఏమైంది? రాజారావుతో లేచి పోయిందా? పోతే, రాజారావు మోసం చేశాడా? ఆమె చివరకు ఏమైంది? సస్పెన్స్! థ్రిల్! చదివి తెలుసుకోండి.

"ఇంకా.... శృంగార రహస్యాలు తెలుసుకోండి! వాత్స్యాయనుడు కూడా చెప్పని చిట్కాలు – కామసూత్రాలు –

'సందులో సుందరి! చదివి తెలుసుకోండి. కొనండి బాబూ కొనండి. ఒక్కపూట భోజనం ఖరీదు. ఒక రోజు సిగరెట్ల ఖరీదు." అంటూ పుస్తకాలు అమ్ముతున్నాడు భూషణం.

పుస్తకాలు బాగానే అమ్ముడు పోతున్నాయ్.

"అయ్యా! తెలుసుకో! విశ్వనాథం... తల్లినీ తమ్ముణ్ణీ వదిలి ఇంటినుంచి పారిపోయిన విశ్వనాథం – ఏమైనాడో తెలుసుకో!" అంటూ భూషణం చంద్రం ముఖం మీదకు పుస్తకం పెడుతూ "అరే! చంద్రం! నువ్వా?" అన్నాడు ఆశ్చర్యంగా.

భూషణం చంద్రం చదివిన కాలేజీలో చదివాడు. చంద్రం కంటే ఒక సంవత్సరం సీనియర్.

"భూషణం! ఏమిటిది?"

"బ్రతుకు తెరువు" నవ్వాడు భూషణం.

భూషణం చేతిలో వున్న కొన్ని పుస్తకాలు అందుకొని చూశాడు. వాటిపేర్లూ, అట్టలమీద బొమ్మలూ చూసి ముఖం చిట్లించుకున్నాడు చంద్రం.

"ఉద్యోగం దొరకలేదు. ఉద్యోగం దొరక్కుండానే నాన్న నాకు పెళ్లి చేశాడు. మరి పెళ్ళాన్నీ పిల్లల్నీ పోషించాలిగా?" అన్నాడు భూషణం.

చంద్రం ఆలోచనలో పడ్డాడు.

"నా సంగతి వదిలెయ్! నువ్వేం చేస్తున్నావ్?" చంద్రాన్ని ఎగాదిగా చూస్తూ అడిగాడు భూషణం.

చంద్రం సమాధానం ఇవ్వలేదు. భూషణం అర్థం చేసుకున్నాడు.

"లాభంలేదు బ్రదర్! ఉద్యోగాలు మనలాంటి వాళ్ళకు దొరకవు. ఏదో బ్రతుకుతెరువు నేర్చుకోవాలిగా?" అన్నాడు భూషణం.

"ఆ చెక్కపెట్టెలో ఏమున్నాయ్?"

"మందులు!"

"ఏ మందులూ?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు చంద్రం.

"నీకు అర్థం కాదులే. పద, కాఫీ తాగుదాం!" అంటూ కాఫీ హోటల్‌కు దారి తీశాడు భూషణం.

భూషణం - అనంతం - అనంతం కంటే భూషణమే నయం.

"నువ్వుకూడా ఏదో ఒక బ్రతుకుతెరువు నేర్చుకో. కావాలంటే పుస్తకాలు మా ఏజెంటుకు చెప్పి పెట్టుబడిలేకుండా ఇప్పిస్తా!" అన్నాడు భూషణం.

చంద్రం చివ్వున తలెత్తి చూశాడు.

తనకు భూషణంలా మాటల గారడీ చెయ్యడం వస్తుందా?... రాదు! తనకు అలాంటి పనులు చేత కాదు. కాలేజీలో భూషణం డ్రామాల్లో నటించే వాడు. తనుకు చచ్చేంత సిగ్గుగా వుండేది. పది మంది మధ్య నిలబడి నాలుగు మాటలు ధారాళంగా చెప్పలేడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్!"

"నాకు నీలా పుస్తకాలు అమ్మడం, జనాన్ని ఆకర్షించడం చేత కాదు భూషణం!" అన్నాడు చంద్రం.

హోటల్లో చంద్రం అనంతం గురించి చెప్పాడు. భూషణం చంద్రం అనుకున్నట్టు పెద్దగా ఆశ్చర్య పోలేదు. మామూలు విషయంలా విని ఊరుకున్నాడు.

భూషణం పుస్తకాల అమ్మకంలో పడిపోయాడు. చంద్రం ఆలోచిస్తూ పేవ్‌మెంటు మీద నడుస్తున్నాడు.

"అయ్యా, దిగులు పడకండి. మీకు ఉద్యోగం కావాలా?"

చంద్రం ఠక్కున ఆగిపోయాడు. పక్కకు చూశాడు.

"రండి బాబూ రండి! మీ భవిష్యత్తు ఏమిటో తెలుసుకోండి. ఇరవై పైసలు మాత్రమే - ఒక్క సిగరెట్ ఖరీదు; అర కప్పు టీ ఖరీదు. రండి బాబూ, రండి! మీకు ఉద్యోగం ఎప్పుడు వస్తుందో తెలుసుకోవాలని లేదా? మీకు వివాహం ఎప్పుడవుతుందో...." అంటూ చంద్రం ముఖంలోకి చూసి నోరు తెరిచి ఆగిపోయాడు.

ముందు రామచిలకల పంజరం. చాప మీద మాసి నలిగి వున్న కాగితం మడతలు. అట్ట మీద హస్తం గీచిన స్టాండు. ఆ పక్కనే తిరుమలై కూర్చుని వున్నాడు.

"ఒరేయ్ చంద్రం! నువ్వుటరా?" లేచి నిల్చుని విస్మయంతో ప్రశ్నించాడు తిరుమలై.

తిరుమలై చంద్రం క్లాసుమేట్. చాలా తెలివైనవాడు. చాలా కలుపుగోలుగా వుండేవాడు. జోక్స్ కట్‌చేస్తూ అందర్నీ కడుపుబ్బ నవ్వించే వాడు. ఎవరి జేబులో డబ్బులు వున్నా ఖర్చు చేయించగలిగే వాడు.

"ఏమిట్రా అలా చూస్తావ్?" తిరుమలై చంద్రం భుజం మీద చెయ్యి వేస్తూ అన్నాడు.

"చివరకు నీ చదువూ, తెలివి తేటలూ ఇందుకు వుపయోగ పడ్డాయా?..." దిగులుగా, బరువుగా, తనకు తానే చెప్పుకుంటున్నట్టు అన్నాడు చంద్రం.

"కోటి విద్యలూ కూటి కొరకే అన్నారుగా మన పెద్దవాళ్ళు? ఉద్యోగం కోసం తిరిగి తిరిగి విసుగు వచ్చేసింది. ఉద్యోగం దొరుకుతుందనే ఆశ చచ్చిపోయింది. ఏం చెయ్యమంటావ్ చెప్పు?"

"అది సరేరా! నువ్వు జ్యోతిష్యం ఎప్పుడు నేర్చుకున్నావ్?" ఆశ్చర్యంగా అడిగాడు చంద్రం.

తిరుమలై నవ్వాడు.

"నాకు జ్యోతిష్యం రాదురా! ఏదో నోటికి వచ్చింది చెప్పడం ప్రారంభిస్తాను. తర్వాత వాళ్ళే అందిస్తారు. వాళ్ళు వేసే ప్రశ్నల్ని పట్టుకొని ముందుకు సాగుతాను."

"మరి ఆ చిలక శాస్త్రం?"

"అది మరీ తేలిక. నేనే కాగితాల మీద కొన్ని వాక్యాలు రాసి ఆ కార్డులు తయారు చేశాను. చిలకను వదిలేస్తే ముక్కుతో ఏదో ఒక కార్డు లాగుతుంది. అది చదివి వినిపిస్తాను. కొందరు సంతోషంగా వెళ్తారు. కొందరు విచారంగా వెళ్తారు. మొత్తం మీద రోజుకు ఎంత లేదన్నా ఓ ఐదు రూపాయలు సంపాదిస్తాను. అందుకయ్యే ఖర్చు పది పైసలు - చిలక తిండి - అంతే!...." అన్నాడు తిరుమలై.

"ఇది మోసం కాదా?"

"ఏది మోసం? అర్హతలు చూడకుండా ఉద్యోగాలు ఇవ్వడం మోసం కాదా? ముందే ఉద్యోగం ఎవరి కివ్వాలో నిర్ణయించుకొని ఇంటర్వ్యూలకు పిలవడం మోసం కాదా? ఎన్ని మోసాలు చెయ్యందే ఒక్కొక్కడు లక్షలు సంపాదిస్తున్నాడు? నేనేం చేస్తున్నాను - పొట్టకు ఇంత తిండి సంపాదించుకుంటున్నాను!" అని, "అయ్యా! రండి! రండి, మీ భవిష్యత్తు తెలుసుకోండి!" అంటూ పక్కగా వెళ్తున్న ఓ పల్లెటూరి అసామిని పిల్చాడు.

అతను ఒక అడుగు ముందుకు వేసి, మళ్ళీ వెనక్కు తిరిగి, ఓ క్షణం ఆలోచించి, తిరుమలై ముందుకు వచ్చి కూర్చున్నాడు. ఇరవై పైసలు ముందు పడేశాడు. తిరుమలై చిలకను వదిలాడు. అది ముక్కుతో ఒక కాగితం మడత ముందుకు లాగి, చటుక్కున తిరిగి పంజరంలోకి వెళ్ళింది. తిరుమలై చదివి వినిపిస్తున్నాడు. అతను శ్రద్ధగా వింటున్నాడు. మరో ఇద్దరు వచ్చి తిరుమలై ముందు కూర్చున్నారు. తిరుమలై బిజీగా వున్నాడు. చంద్రం అతనికి చెప్పకుండానే అక్కడినుంచి బయలుదేరాడు. చాలా దూరం నడిచాడు.

"రండి బాబూ రండి! ఆపద మొక్కుల వాడు - ఒక్క పదిపైసలు! పది పైసలకు వెంకన్న పటం! శ్రీనివాసుల పటం! కలియుగ భగవంతుని పటం! ఇది మీకు అదృష్టాన్ని ఇస్తుంది. పది పైసలు మాత్రమే! రేపు సాయంత్రం ఇక్కడే లాటరీ తియ్యబడుతుంది. మీ అదృష్టాన్ని పరీక్షించుకోండి."

చంద్రం జనంలోకి వెళ్ళినిలబడ్డాడు. జుట్టు ముడి ఆచారి వెంకటేశ్వరస్వామి నామాలకంటే పెద్దవే పెట్టుకున్నాడు. నిలువెత్తు వెంకటేశ్వరస్వామి పటాన్ని చాప మీద పెట్టాడు. చాలా మంది పది పైసలు ఇస్తున్నారు. ఆచారి టికెట్లు చింపి ఇస్తున్నాడు.

చంద్రం చూస్తూ నిలబడ్డాడు.

ఆచారి చంద్రంతో పాటు స్కూల్లో చదివాడు. యస్. యస్. సి. తర్వాత ఏమైనాడో తెలియదు. మళ్ళీ ఇక్కడ ఈ రూపంలో కన్పించాడు.

"దొంగ వెధవను తన్నండి! పట్టుకోండి! వీడు లాటరీ అని చెప్పి డబ్బు వసూలు చేస్తాడు. మళ్ళీ కన్పించడు." అప్పుడే జనాన్ని తోసుకొని వచ్చిన ఓ బుర్ర మీసాల ఆసామీ అన్నాడు.

"తన్నండి! తన్నండి!" దబదబ దెబ్బలు పడ్తున్నాయ్.

"పాపం! కొట్టకండి! ఏదో బ్రతుకుతెరువు కోసం!" అంటూ చంద్రం ముందుకు వచ్చాడు.

ఆచారి వెంకటేశ్వరస్వామి పటాన్ని చంద్రం చేతికి ఇచ్చి పరుగు లంకించుకున్నాడు.

జనం చంద్రాన్ని కొట్ట సాగారు. చంద్రం కూడా పరుగు లంకించుకున్నాడు.

"పట్టుకోండి! పట్టుకోండి!" అంటూ జనం వెంట పడ్డారు.

కొంత దూరం పరిగెత్తి చేతిలో వున్న వెంకటేశ్వరస్వామి పటాన్ని కింద పడేసి పరిగెత్త సాగాడు.

ఆపద మొక్కుల వాడ్ని అవతల పారేశాక గాని చంద్రం ఆపదలో నుంచి బయట పడలేదు. చంద్రాన్ని వదిలేసి పటం చుట్టూ చేరారు జనం.

ఆ రాత్రి సత్రంలో పడుకున్న చంద్రానికి నిద్ర పట్టలేదు.... అనంతం – భూషణం – తిరుమలై – ఆచారి – అందరూ కళ్ళల్లో కన్పిస్తున్నారు.

అందరూ ఏదో చేస్తున్నారు. తనకే ఏం చేత కావటం లేదు. తను అసమర్థుడు.

తను అలాంటి పనులు చెయ్యలేడు. కాని కాయకష్టం చేయొచ్చుగా? ఏదో నిర్ణయానికి వచ్చిన చంద్రం తెలతెల వారుతుండగా నిద్రలోకి జారిపోయాడు.

# 3

మిట్ట మధ్యాహ్నం. ఎండ మండి పోతూంది. భూమి కాలిపోతూంది. వేడి గాలి ఈ చెవులో నుంచి ఆ చెవులోకి పోతూంది. కుక్కలు నాలుకలు చాపి రొప్పుతూ నీడ వెతుక్కుంటున్నాయి.... వీధుల్లో జనం అక్కడో మనిషి, ఇక్కడో మనిషి కన్పిస్తున్నారు.

షావుకారు రామనాధంగారు కొత్తగా కట్టిస్తున్న మూడంతస్తుల మేడనూ, కడుతున్న కూలి వాళ్ళనూ చూస్తూ నిల్చున్నాడు.

చంద్రం కాళ్ళు మార్చుకుంటూ నిలబడి దీక్షగా చూస్తున్నాడు. సిమెంటు తట్టలు చకచకా అంచల వారీగా మూడో అంతస్తుకు చేరుతున్నాయ్. తాళ్ళతో కట్టిన బొంగుల మీద నిలబడి, తట్టలు అందుకుంటున్న వాళ్ళను చూస్తుంటే, నేలమీద నిలబడ్డ చంద్రానికి కళ్ళు తిరిగినట్టయింది. తను వాటి మీదకు ఎక్కలేడు. కింద పారతో తీసి తట్టలోకి సిమెంటు పొయ్యగలడు. కాని ఆ పని ఆడవాళ్ళు చాలా చురుగ్గా చేస్తున్నారు.

కారు ఎక్కబోతూ రామనాధంగారు చంద్రాన్ని చూసి ఆగారు...

చంద్రం ఆశగా రామనాధంగారి దగ్గరకెళ్ళి నిలబడ్డాడు.

"ఏం కావాలి?"

"పని..." నాలుక పిడచ కట్టుకు 'పోతూ వుంటే అన్నాడు చంద్రం.

"ఏం పనిచేస్తావ్?" ఆశ్చర్యంగా అడిగారు రామనాధంగారు.

"ఏదైనా సరే!"

"చదువుకున్న వాడిలా వున్నావ్?"

"అవునండీ! బి. ఏ. పాసయాను."

"నా దగ్గిర ఉద్యోగాలు ఏమీ లేవు."

"ఉద్యోగం అక్కర్లేదు. ఆ పని ఇప్పించండి!" అంటూ తట్టలు మోసే వాళ్ళ కేసి చూపించాడు.

రామనాధంగారికి నవ్వొచ్చింది.

"ఆ పని నువ్వేం చేస్తావ్? వెళ్ళి, ఎక్కడైనా ఉద్యోగం చూసుకో! పైగా, ఇవ్వాళ కూలీలు అందరూ వచ్చారు" అంటూ వెళ్ళి కార్లో కూర్చున్నారు రామనాధంగారు.

కారు వెళ్ళిపోతుంటే చూస్తూ నిల్చున్నాడు చంద్రం.

❀ ❀ ❀

చంద్రం ఎండలో రాళ్ళు కొడ్తున్నాడు. చేతులు బొబ్బలు ఎక్కాయ్. సుత్తి పట్టుకోలేక పోతున్నాడు. కళ్ళు తిరుగుతున్నాయ్. కళ్ళ ముందు చీకట్లు కమ్మాయ్.

మళ్ళీ కళ్ళు తెరిచేసరికి ఎవరో మంచినీళ్ళు అందించారు.

"నేను చెప్పలా, నీకు ఈ పని చేతకాదని? ఇదుగా, ఈ కూలీ తీసుకొని వెళ్ళి పో!...." అంటూ మేస్త్రీ ఒక రూపాయి చేతిలో పెట్టాడు.

❀ ❀ ❀

లోడు చేసిన లారీ సిద్ధంగా వుంది. డ్రైవర్ సీటులో కూర్చుని స్టార్టు చెయ్యడానికి తయారుగా వున్నాడు.

చంద్రం రెక్కపట్టుకొని లారీలోకి పంపిస్తూ మేనేజరు, "నేను చెప్పిందంతా అర్థమైందా? ఈ పని స్వయంగా చేశావంటే నీకు మంచి భవిష్యత్తు వుంది జాగ్రత్త మరి! విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్!" అంటూ డోర్ వేశాడు.

డ్రైవర్ కేసి అర్థయుక్తంగా చూశాడు మేనేజరు.

అర్థం అయినట్లు కళ్ళతోనే జవాబిచ్చాడు డ్రైవరు.

లారీ స్టార్టు అయింది.

"ఒక్క ట్రిప్‌కు వందరూపాయలా? నువ్వెంతకాలం నుంచి ఈ పని చేస్తున్నావ్?" చంద్రం డ్రైవర్ని అడిగాడు.

"పని సవ్యంగా జరిగితే బాస్ ఇంకా ఎక్కువే ఇస్తాడు. ఇటు వంటి ట్రిప్పులు నెలకు రెండు మూడైనా దొరుకుతాయ్!" అన్నాడు డ్రైవర్.

"లారీలో వున్న సరుకులు ఏమిటి?" సందేహంగా అడిగాడు చంద్రం.

"అది మనకు అనవసరం. మన పని అల్లా 27వ మైలురాయి దగ్గిర లారీలో సామాన్ల మధ్యవున్న ఆ రెండు పెట్టెల్నీ కిందకు దించడం! ఆ తర్వాత విజయవాడుకు మిగతా సామాన్లు చేర్చటం – అంతే!"

"ఆ రెండు పెట్టెలూ మధ్యలో దించడం ఎందుకూ?"

"చెప్పానుగా – అదంతా మనం అడక్కూడదని! తెలుసుకోవడానికి ప్రయత్నించకూడదు, విజయవాడలో సామాను దించి మన డబ్బు మనం తీసుకుంటాం. అంతవరకే మనం చెయ్యాల్సింది" అన్నాడు డ్రైవర్.

చంద్రానికి ఇందులో ఏదో మోసం వుందనిపించింది.

"ఇటువంటి పనులు చెయ్యడం నాకు ఇష్టం లేదు" అన్నాడు చంద్రం.

"నాకుమాత్రం ఇష్టమా? నేనూ పూజారి కొడుకునే! మెట్రిక్ పాసయాను. ఉద్యోగం దొరకలేదు. అవసరంకొద్దీ ఈ పనులు చేస్తున్నాను. సంతోషంగా చెయ్యడం లేదు" అన్నాడు డ్రైవర్.

"నువ్వు మెట్రిక్ పాసయావా? పూజారి కొడుకువా?" చంద్రం విస్మయంతో ప్రశ్నించాడు.

డ్రైవర్ వెంటనే సమాధానంగా చిరునవ్వు నవ్వాడు.

మళ్ళీ ఏదో అడగబోయిన చంద్రం లారీలో మరోకంఠం వినిపించి ఉలిక్కిపడ్డాడు.

డ్రైవర్ డాష్‌బోర్డులో వున్న వైర్‌లెస్ సెట్ మీట నొక్కి 'ఎస్ బాస్' అన్నాడు.

చంద్రం కళ్ళు పెద్దవిచేసుకొని డ్రైవర్ ముఖంలోకి చూశాడు.

"2249 జీప్ మిమ్మల్ని వెంబడిస్తూవుంది, పది నిముషాల్లో లెవల్ క్రాసింగ్ దాటిపోవాలి" అంటూ వైర్‌లెస్‌లో విన్పించింది.

వెంటనే డ్రైవర్ రివాల్వర్ తీసి చంద్రం చేతికి ఇస్తూ "వెనక జీప్ కన్పిస్తుందేమో చూడు" అన్నాడు.

చంద్రం నిలువెల్లా వణికిపోయాడు. రివాల్వర్ అందుకోలేదు.

"నా కోసం నా తల్లీ నా చెల్లెలూ ఇంటిదగ్గర ఎదురుచూస్తూ వుంటారు. ఇటువంటి ప్రమాదాల్లో ఇరుక్కోవడం నా కిష్టం లేదు' అన్నాడు చంద్రం.

"నీకు తల్లీ చెల్లెలూ మాత్రమే వున్నారు. నాకు పెళ్ళాం బిడ్డలుకూడా వున్నారు" అన్నాడు డ్రైవర్.

"కానీ...."

"కానీ లేదు అర్ధణా లేదు. ఇప్పుడు తప్పించుకోలేం. అటు పోలీసులకు దొరికితే జైలుకు పోతాం. ఇటు పని పూర్తి కాకపోతే బాస్ ప్రాణాలే తీసేస్తాడు! అందుకే పోలీసులు అటకాయించేలోగా మనం లెవల్ క్రాస్ దాటిపోవాలి. లేకపోతే ఏం జరుగుతుందో తెలుసా?" డ్రైవర్ చంద్రం గుండెలకేసి తుపాకి చూపించాడు.

చంద్రం చమటలు కక్కుతూ వెనక్కు చూశాడు. ఏమీ కన్పించలేదు, దూరంనుంచి రైలు కూత విన్పిస్తూంది.

రోడ్డుకు ఇరువైపులా తుప్పపొదలూ, చిట్టడవీ – దూరంగా వెన్నెల్లో మెరుస్తూ కొండలూ కన్పిస్తున్నాయి.

లారీ స్పీడు తగ్గింది. నడిరోడ్డుమీద రెండెడ్లబండి అడ్డం వచ్చింది. డ్రైవర్ గట్టిగా హారన్ కొడుతున్నాడు.

వెనక దూరంనుంచి రెండు లైట్లు కన్పిస్తున్నాయ్.

చంద్రం లారీలోనుంచి దూకాడు. రోడ్డుమీదనుంచి తుప్ప పొదల్లోకి దొర్లాడు.

బండి తప్పుకోగానే లారీ వేగంగా లెవల్ క్రాసింగ్ దాటి పోయింది.

చంద్రం లేచి, ప్రాణభయంతో తుప్పలు దాటి, సరివిచెట్ల మధ్య నుంచి పరుగులు తీసి, చెరువు గట్టూ, గుట్టలూ - పుట్టలూ దాటి, పరిగెత్తి పరిగెత్తి నాలుగురోడ్ల కూడలి చేరుకున్నాడు.

శోషవచ్చి క్రాస్‌రోడ్స్ మధ్య దిమ్మెమీదవున్న స్థంభం పట్టుకొని, జారి కూలబడి పోయాడు.

నాలుక ఎండిపోతూ వుంది!

చెవుల్లో హోరు!

శరీరం పట్టుతప్పిపోతూవుంది!

మెడ వెనక్కు విరుచుకుంటున్న చంద్రం కళ్ళకు ఒకవైపున "మహారాజపురం" అనే బోర్డు కన్పించింది.....

❀ ❀ ❀

ఓ భద్రగజం తొండంతో పూలహారం పట్టుకొని కోటముందు నుంచి బయలుదేరింది.

మంత్రులూ, సామంతులూ, పెద్దలూ-పిన్నలూ-అనేక మంది, ఒకర్నొకరు తోసుకుంటూ ముందుకు వస్తున్నారు, ప్రతివాడూ ఆ దండ తన మెళ్ళోనే పడుతుందనే ఆశతో గజంముందుకు వస్తున్నాడు.

జనాన్ని తోసుకొని వింతచూస్తున్న చంద్రం మెడలో భద్రగజం పూలహారం వేసింది.

ఆ దేశపురాజుకి సంతానం లేదు. మరణించిన రాజుగారికోరిక ప్రకారం, భద్రగజం మాలవేసిన వాడికే పట్టాభిషేకం చెయ్యాలని నిర్ణయించబడింది.

ఆ గజం చంద్రం మెడలో పూలహారం వేసింది!

"మహారాజుకూ జై, మహారాజపుర సామ్రాజ్యానికీ జై!" దిక్కులు పిక్కటిల్లేలా జయజయధ్వానాలు విన్పించసాగాయి.

మంత్రులూ, సామంతులూ. చంద్రం చుట్టూ మూగారు. ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నారు.

భద్రగజం అమాంతంగా తొండాంతో చంద్రాన్ని ఎత్తి అంబారీలో కూర్చోబెట్టుకుంది.

మరణించిన మహారాజుగారి కోర్కెప్రకారం చంద్రాన్ని సింహాసనంమీద ఆసీనుణ్ణి చేశారు మంత్రులు.

మహామంత్రి చంద్రం తలమీద కిరీటాన్ని అలంకరింపజేసి "చంద్రహాస చక్రవర్తికీ జై!" అన్నాడు.

జయజయ ధ్వానాల మధ్య చంద్రహాస చక్రవర్తి ఠీవిగా కూర్చున్నాడు.

మహామంత్రి దర్బారు తీర్చివున్న వారందర్నీ పరిచయం చేశాడు.

అంతలో బయటినుంచి హాహాకారాలు విన్పించాయి. దర్బారులో వున్నవాళ్ళంతా కలవరపడ్డారు.

"ఏమిటది మహామంత్రీ!" చంద్రహాసమహారాజు ప్రశ్నించారు.

"ఆ - ఏముందీ! అపరాధుల్ని మన భటులు దండిస్తున్నారు ప్రభూ!" అన్నాడు మహామంత్రి.

"సేనాపతీ! ఆ అపరాధుల్ని ప్రవేశపెట్టు. మేము స్వయంగా విని తీర్పు చెబుతాం!" అన్నాడు చంద్రహాసమహారాజు.

"చిత్తం!" అంటూ సేనాపతి లేచి బయటికి వెళ్ళాడు. సభలో అందరూ గంభీరంగా కూర్చునివున్నారు.

కొద్ది క్షణాల్లో దాదాపు ఓ పదిమంది నిందితులను సైనికులు బరబరా లాక్కొచ్చి మహారాజుముందు నిలబెట్టారు.

చంద్రహాస మహారాజు నిందితుల వీపులు చిట్లివుండటం చూశాడు. మహామంత్రికేసి చురచురా చూశాడు.

"ఇటువంటి అపరాధుల్ని కోట ముందున్న చెట్టుకు కట్టి, ప్రజల ముందు, నలభై కొరడా దెబ్బలు కొట్టాలి. ఇది ఈ రాజ్యంలోని న్యాయం. అందుకే వీళ్ళంతా కేకలు పెడ్తున్నారు" అన్నాడు మహామంత్రి.

మహారాజు నిందితుల్ని పరిశీలనగా చూశాడు. అందరికంటే చిన్నవాడైన ఓ పదేళ్ళ కుర్రవాణ్ణి ముందుకు పిల్చాడు.

"నువ్వుచేసిన అపరాధం ఏమిటి?"

"అన్నం దొంగతనం చేశాను."

"ఎందుకూ?"

"ఆకలయింది, రెండు రోజుల నుంచి ఏమీ తినలేదు" అన్నాడు ఆ కుర్రవాడు ఏడుస్తూ.

"నువ్వేం చేశావ్?" ఓ యువకునివైపుకు తిరిగి ప్రశ్నించాడు మహారాజు.

"రాజభటులు చేస్తున్న దారుణమైన అన్యాయాలను ప్రజల దృష్టికి తెచ్చాను. వాళ్ళను చూసి భయపడవద్దన్నాను. అవసరం అయితే తిరగబడమన్నాను. న్యాయంకోసం ప్రాణాలను సహితం ఇవ్వడానికి సిద్ధంగా వుండమని బోధించాను."

"ఎందుకలా చేశావ్!"

"ఎందుకా? మీ భటులు చేసే దౌర్జన్యాలూ, దారుణాలూ చూడలేక! ఇళ్ళమీద పడి దోచుకు తింటున్నారు. వయసులోవున్న అందమైన ఆడపిల్ల కన్పిస్తే చాలు- తోడేళ్ళలాగ-" ఆ యువకుడు ఆవేశంతో ఊగిపోతున్నాడు.

చదువు సంధ్యలు లేక మొరటుగా వున్న మరో యువకుడ్ని "నువ్వేం చేశావ్?" అని ప్రశ్నించాడు మహారాజు.

"నేను మా యజమానిమీద్ద తిరగబడ్డాను. చెరణాకోలతో బాగా కొట్టాను ప్రభూ!"

"ఎందుకు?"

"పది సంవత్సరాలు వారింట్లో పాలేరుగా పని చేశాను, నమ్మకంగా పని చేశాను. పశువులా పని చేశాను, కుక్కలా విశ్వాసంతో పని చేశాను, మా చిన్నమ్మగారి మెళ్ళో గొలుసు పోయిందట. అది నేనే తీసేనన్నారు. తియ్యలేదని మొరపెట్టుకున్నాను. కాళ్ళు పట్టుకున్నాను. అయినా నమ్మలేదు, 'దెబ్బలకు కాని దెయ్యం పలకదు' అంటూ మా యజమాని నన్ను చెరణాకోలతో గొడ్డును బాదినట్టు బాదాడు. దొంగతనం అంట గట్టినందుకే బాధ పడుతున్న నన్ను రక్తం కారేలా బాదాడు. దాంతో నాకు పిచ్చికోపం వచ్చింది. అందుకే ఎదురు తిరిగాను ప్రభూ! రక్షించండి ప్రభూ!" అన్నాడు.

ఒక వృద్ధుణ్ణి ఉద్దేశించి "నువ్వేం తప్పు చేశావ్?" అని అడిగాడు రాజు.

"నేనా? ఒక చిన్న పిల్ల మెళ్ళో బంగారు గొలుసు దొంగిలించాను."

"ఎందుకు చేశావ్?"

"నాకు ఒకే కొడుకు. వయసులోవున్న నా కొడుకు జబ్బు పడ్డాడు. నేనూ, నా పెళ్ళాం, వాడి పిల్లలూ, వాడి పెళ్ళాం, అందరం వాడి సంపాదన మీదే ఆధారపడి బతుకుతున్నాం. డాక్టరు మందులు రాసి ఇచ్చాడు. కొనడానికి డబ్బులేదు, ఎక్కడా అప్పు పుట్టలేదు. జనరల్ ఆసుపత్రిలో మందులు లేవు, వున్నా మా బోటివాళ్ళకు అవి వాడరు. ఏం చెయ్యాలో తోచలేదు. దిగులుగా ఒక చెట్టుకింద కూర్చున్నాను. పిల్లలు ఆడుకుంటున్నారు. ఒక చిన్న పిల్లను ఓ పదేళ్ళ పిల్ల నా పక్కగా కూర్చోబెట్టి ఆటల్లో మునిగిపోయింది. చిన్నగా ఆ పిల్లను ఆడించినట్టే ఆడించి మెళ్ళో గొలుసు తీసుకొని వెళ్ళి పోయాను. ఆ గొలుసు కంసాలిదగ్గిర అమ్ముతూ వుండగా మీ భటులు చూశారు. పట్టుకున్నారు."

రాజుగారు ఆలోచనలో పడ్డారు. మంత్రులూ, సామంతులూ రాజుగారు వెయ్యబోయే శిక్షలు వినడానికి కుతూహల పడుతున్నారు.

"వీళ్ళందర్నీ వదిలెయ్యండి!" ఆజ్ఞాపించాడు రాజు.

భటులు తెల్ల ముఖాలు వేశారు.

మంత్రులూ, సామంతులూ రాజును వెర్రివాణ్ణి చూసినట్టు చూశారు.

అందర్నీ వదిలేశారు.

మరునాడు రాజుగారు ఒక శాసనం ప్రకటించారు నిండు కొలువులో-

"దొంగల్ని శిక్షించి ప్రయోజనం లేదు. మనుషుల్ని దొంగల్ని చేస్తున్న బీదతనాన్ని నిర్మూలించాలి. ప్రతి వాడికీ పని చూపించాలి. ప్రతి వాడికీ ఉద్యోగం చేసే హక్కు వుంది. ఈ రాజ్యంలో నిరుద్యోగులు వుండటానికి వీల్లేదు. ఈ రాజ్యంలో సోమరి పోతులకు స్థానం లేదు. పనిచెయ్యని వాణ్ణీ, రెండోవాడి శ్రమను అనుభవించేవాణ్ణీ శిక్షించాలి. సైనికులు ప్రజల్ని పీడించడానికి వీల్లేదు. వృద్ధులకు వృద్ధాప్య వేతనాలు ఇవ్వాలి.

వారికోసం విశ్రాంతి గృహాలు స్థాపించాలి, అనాధ పిల్లలకు శరణాలయాలు స్థాపించాలి. పడుపువృత్తిని నిర్మూలించాలి."

రాజశాసనం విని దర్బారులో వున్నవాళ్ళంతా వెర్రి చూపులు చూశారు.

మహామంత్రి ఏదో చెప్పబోతూ వుంటే రాజు వారించాడు.

"వెంటనే నా శాసనం అమలులోకి రావాలి!" ఆజ్ఞాపించాడు.

చంద్రహాస మహారాజు సభ చాలించి అంతఃపురానికి బయలు దేరాడు.

తల్లి శాంతమ్మ, చెల్లెలు లక్ష్మీదేవితో రాజుగారు ఆసీనులైవున్నారు.

"చెల్లెమ్మా! నీ కోర్కె ఏమిటమ్మా!" మహారాజు చెల్లెల్ని అడిగాడు.

"నాకు నాట్యం నేర్చుకోవాలని వుంది అన్నయ్యా!" గారాబాలుపోతూ అన్నది లక్ష్మీదేవి.

"మంచిది చెల్లీ, అలాగే చేయిస్తాం! అమ్మా, నీ కోర్కెక ఏమిటి?"

"బాబూ! ప్రతి శనివారం బీదలకు చాటలతో బియ్యం పెట్టాలనీ, వస్త్రదానం చెయ్యాలనీ వుంది."

"అలాగే జరుగుతుంది."

రాజుగారు మహా మంత్రికి కబురు పంపించారు. మహామంత్రి విచ్చేసి రాజుగారి ముందు చేతులు కట్టుకొని వినయంగా నిలబడ్డాడు.

"మహా మంత్రీ! దేశంలోవున్న గొప్ప నాట్యాచార్యుల్ని పిలిపించు, చెల్లెలు నాట్యం నేర్చుకుంటుందట."

"చిత్తం!"

"ప్రతి శనివారం, అన్న వస్త్రదానాలు చేస్తారు అమ్మగారు."

ఓ క్షణం వింతగా రాజు ముఖంలోకి చూసి "అలాగే ప్రభూ!"

అన్నాడు మహా మంత్రి.

"ప్రభూ!" మళ్ళీ మంత్రే గాబరా పడిపోతూ అన్నాడు.

"ఏమిటి?"

"చిత్రపురి రాజుగారు తమతో వియ్య మందాలని అభిలషిస్తున్నారు. వారి మంత్రినీ, పురోహితుణ్ణీ. కానుకలతో పంపించారు. తమ శెలవు అయితే వారిని ప్రవేశ పెడ్తాను," అన్నాడు మంత్రి.

"అలాగే ప్రవేశ పెట్టు!"

చిత్రపురి రాజ్య మహా మంత్రీ, పురోహితుడూ ప్రవేశించి చంద్రహాస మహారాజుకు అభివందనం చేశారు.

రాజభటులు అమూల్య కానుకలు తెచ్చి రాజుగారి ముందు వుంచారు.

"రాజా! మా రాజుగారి కుమార్తె అపురూప సౌందర్యవతి, లావణ్యరాశి. గుణశీల, అమెను తమకిచ్చి వివాహం జరిపించాలని మా రాజుగారి అభిలాష" అన్నాడు పురోహితుడు.

రాజు ఓ క్షణం ఆలోచించి రాజమాత ముఖంలోకి చూశాడు. రాజమాత ముఖంలో విచారరేఖలు కన్పించాయి.

"మీ రాజుగార్ని నన్ను క్షమించ వలసిందిగా చెప్పండి. నా వివాహం ఏనాడో మా పేరయ్యమామ కూతురు సరస్వతితో జరగాలని పెద్దలు నిర్ణయించారు. ఈ కానుకల్ని స్వీకరించలేను. దయచేసి తీసుకెళ్ళండి" అన్నాడు రాజు.

రాజమాత ముఖం వికసించింది.

పేరయ్యనూ, అతని కూతుర్నీ సకల రాజ లాంఛనాలతో తీసుకు రావలసిందిగా మంత్రిని ఆజ్ఞాపించాడు మహారాజు.

మంత్రి రాజు ముఖంలోకి చిత్రంగా చూస్తూ వుండిపోయాడు.

"ఏమిటలా చూస్తావ్? నేను చెప్పినట్టు చెయ్!"

"చిత్తం ప్రభూ!" అంటూ మంత్రి వెళ్ళిపోయాడు.

శాంతమ్మ ఆనందోద్వేగంతో కొడుకుని కౌగలించుకుంది.

వీధుల్లో, దుకాణాల్లో, రచ్చ బండలమీద, జనం రాజుగారి ధర్మబుద్ధిని గురించి కథలు కథలుగా చెప్పు కుంటున్నారు.

దొంగలుగా బ్రతికి ఈనాడు గౌరవంగా పనిచేసుకుంటూ వున్న వారి గురించి మాట్లాడుకుంటున్నారు.

వృద్ధులకూ, అనాథలకూ, కల్పించబడిన సౌకర్యాలను గురించి చర్చించు కుంటున్నారు.

రాజభటులు లాక్కెళుతున్న సోమరి పోతుల్ని చూసి జనం అసహ్యించు కుంటున్నారు. వారిని జలగలను చూసినట్టు చూస్తున్నారు.

రాజభటులు పేరయ్యను పట్టుకొని రాజదర్బారుకు లాక్కు వెళుతున్నారు.

పేరయ్య ఎదురు తిరుగుతున్నాడు. బూతులు తిడుతున్నాడు, రాజు తన మేనల్లుడనీ, అతనితో చెప్పి తనను అవమానించిన వాళ్ళను కోట చెట్టుకు కట్టించి తలక్రిందులుగా వేలాడ దీయిస్తాననీ బెదిరిస్తున్నాడు. అయినా, రాజభటులు లక్ష్య పెట్టకుండా లాక్కు వెళుతున్నారు.

రాజభటులు పేరయ్యను రాజుగారి ముందు హాజరు పెట్టారు.

"చూడరా! వీళ్ళకెంత ధైర్యమో! నీ మామ నన్నైనా చూడకుండా...."

"ఆపు! మాట్లాడకు!" అంటూ పేరయ్యను గదమాయించి, "ఏం చేశాడు?" అని భటుల్ని ప్రశ్నించాడు రాజు.

"ఈ పేరయ్య చేసేవన్నీ లిటిగేషన్ పనులే ప్రభూ! మీ పేరు చెప్పుకొని అందర్నీ భయపెట్టి సోమరిగా బతుకుతున్నాడు. ధనిక భూస్వాముల మధ్య లిటిగేషన్స్ పెట్టి డబ్బు గుంజుతున్నాడు" అన్నాడు ఒక భటుడు.

రాజు పేరయ్య ముఖంలోకి ఏవగింపుగా చూశాడు.

"చూడరా బాబూ–"

"ఆపు! మామవనే కనికరంతో సైనికులతో శిక్ష అమలు జరిపించకుండా నేనే జరుపుతాను" అంటూ సింహాసనం దిగాడు రాజు.

భటుడి చేతిలో వున్న కొరడా తీసుకొని నాలుగు దెబ్బలు వేశాడు.

"నా రాజ్యంలో కష్టపడేవాడికే స్థానం!" అంటూ కొరడా దూరంగా విసిరివేశాడు.

రాజభటులవైపు తిరిగి "ఇతని ఆస్తిని స్వాధీనం చేసుకోండి. ఏదైనా పని చూపండి. పని చెయ్యకపోతే దేశంనుంచి బహిష్కరించండి" అన్నాడు.

పేరయ్య కొర కొరచూస్తూ, పళ్ళు కొరుక్కుంటూ వెళ్ళిపోయాడు.

ఒక రోజు రాజుగారు దర్బారు తీర్చివున్నారు.

మహామంత్రి రాజ్యపాలన గురించిన భోగట్టా ఇస్తున్నాడు.

"ఖజానాలోని డబ్బంతా అయిపోయింది. ప్రభూ! ఇంకా అయితే రాజ్యపాలనే స్థంభించిపోయే భయంవుంది. ఇక ఎంతో కాలం రాజభటులకు జీతాలు కూడా ఇచ్చే పరిస్థితులో లేము" అన్నాడు.

"అందుకు ఏం చెయ్యాలంటావ్?"

"మళ్ళీ పాతరాజ్యంగాన్నే ప్రవేశపెట్టాలి."

"వీల్లేదు."

"మహారాజా! ప్రజల్లో తిరుగుబాటు చిహ్నాలు కూడా కన్పిస్తున్నాయి" అన్నాడు సేనాపతి లేచి.

"పొరుగు రాజైన చిత్రపురి రాజ్యాధీశుడు మనమీద దండెత్తే సన్నాహాలలో వున్నట్టు మన చారులద్వారా తెలియవస్తున్నది." అన్నాడు సేనాధిపతి.

"ఇన్నిటికీ మీరు ఏం చెప్ప దల్చుకున్నారు?"

"మంత్రిగారు శెలవిచ్చినట్టు పాత రాజ్యాంగాన్ని..."

"వీల్లేదు."

"ధనాగారంలో డబ్బు లేదు." నసిగాడు కొత్వాల్.

రాజు ఆలోచనలో పడ్డాడు. మహామంత్రీ, సేనాపతీ ఆతృతగా రాజు ముఖంలోకి చూస్తున్నారు.

మహా మంత్రి నుంచి, కోట ఊడ్చేవారి వరకు, ఎవరెవరికి ఎంతెంత జీతాలు ఇస్తున్నారో అడిగి తెలుసుకున్నాడు రాజు.

ఒక నిర్ణయానికి వచ్చాడు.

"నా రాజ్యంలో పనులు చేసేవారి జీతాల్లో ఇంత వ్యత్యాసం వుండకూడదు. అందరికంటే కింద జీతగాడికీ, అందరికంటే పెద్ద జీతగాడికీ; ఇచ్చే జీతాలలో రెండు వందల రూపాయలకు మించిన వ్యత్యాసం వుండటానికి వీల్లేదు. రేపే ఆర్థిక శాస్త్రవేత్తలతో సంప్రదించి జీతాలు నిర్ణయిస్తాను."

రాజుగారి మాటలు దర్బారులో వున్నవారికి కొరడా దెబ్బల్లా తగిలాయి. కంకర రాళ్ళలా తగిలాయి. కీళ్ళమీద లాఠీ దెబ్బల్లా తగిలాయి. ఎవరికీ నోరు తెరిచే సాహసం లేదు. ఒకరి ముఖాల్లోకి ఒకరు చూసుకున్నారు.

"వ్యక్తిగత ఆస్తుల్ని జప్తు చెయ్యండి. అందరికీ పనులు కల్పించండి. వారి వారి అర్హతలను బట్టి పనులు నిర్ణయించండి. ప్రజలందరికీ సమానావకాశాలు కల్పించండి."

"ప్రభూ! అలా అయితే ప్రజలు తిరుగుబాటు...."

"చెయ్యరు. ప్రజలు నామీద తిరుగుబాటు లేవదియ్యరని నా నమ్మకం. అంతగా చేసినా నష్టపోయేది ప్రజలే, ప్రజల్లో ఆ చైతన్యాన్ని కలిగించండి. నాకు వారంరోజుల్లో ఎవరెవరికి ఎంతెంత ఆస్తివుందో, ఆ వివరాలు కావాలి. వివరాలు సేకరించండి వెంటనే. మీరంతా కూడా మీ మీ ఆస్తుల వివరాలు ఇవ్వండి. అబద్ధపు లెక్కలు ఇచ్చిన వాడికి మరణశిక్ష తప్పదు," అని రాజుగారు లేచి నిలబడ్డారు.

అందరూ లేచి నిలబడ్డారు.

రాజుగారు అందర్నీ ఓసారి పరికించి చూసి లోపలకు వెళ్ళిపోయారు.

అర్థరాత్రి రాజుగారు నిద్రపోతున్నారు.

మహామంత్రీ, సేనా నాయకుడూ, మరి కొంతమంది ధనిక భూస్వాములూ ముసుగులు వేసుకొని రాజు నిద్రపోతున్న గదిలో ప్రవేశించారు.

ముసుగు మనుషులు కత్తులు దూసి రాజును చుట్టు ముట్టారు.

నిద్రనుంచి మేల్కున్న రాజు అందర్నీ తప్పించుకొని తల్లీ, చెల్లెలూ నిద్రిస్తున్న గదిలోకి వచ్చాడు.

వాళ్ళను లేపి, రాజప్రాసాదంలోని రహస్య ద్వారం నుంచి బయటపడ్డాడు రాజు.

దాహంతో గొంతు ఎండి పోతూవుంది.

నదిలోకి దిగి దోసిట్లోకి నీరు తీసుకున్నాడు, నోటి దగ్గరకు దోసిలి వచ్చిందో లేదో, రాజు కంఠానికి ఓ కత్తి విసురుగా వచ్చి గుచ్చుకుంది.

దోసిట్లో నీళ్ళు నదిలోకి పడిపోయాయి. కుడిచెయ్యి కత్తి మీద పడింది. కత్తి లాగుతూ ఎదురుగా నిల్చున్న జానాన్ని చూశాడు.

ముందు వరసలో మహా మంత్రీ, సేనా నాయకుడూ వున్నారు. వాళ్ళిద్దరిమధ్యా పేరయ్య నిల్చుని వున్నాడు.

"నువ్వు కూడానా మామయ్యా! యూ టూ బ్రూటస్" అన్నాడు రాజు.

అందరూ వెకిలిగా, పెద్దగా నవ్వారు.

దారుణ బాధతో కత్తి లాగివెయ్యడానికి పెనుగులాడుతున్నాడు.

కత్తి చేతిలోకి వచ్చింది. రక్తం కాలువలు కడుతూంది. బట్టలన్నీ రక్తంతో తడిసి పోతున్నాయి....

ఒక్కసారిగా చంద్రం కళ్ళు తెరిపిళ్ళు పడ్డాయి.

తనను చూసుకున్నాడు. ఒళ్ళంతా చెమటలు పట్టివుంది. లారీలోనుంచి దూకినప్పుడూ, తుప్పల్లోనుంచి పరిగెత్తినప్పుడూ తగిలిన గాయాలనుంచి కారిన రక్తంతో బట్టలు తడిగా వున్నాయి.

పొడారి పోతున్న పెదవుల్ని నాలుకతో తడుపుకుంటూ అతి కష్టంగా తల ఎత్తాడు. మరో రోడ్డువైపు చూశాడు. ఇటుపోతే?

"ఉక్కుపురి" (ఇండస్ట్రియల్ టౌన్‌షిప్) అనే బోర్డు కన్పించింది....

ఒక పెద్ద బంగళా ముందు, విమానంలా వున్నకారు రాజహంసలా ఠీవిగా వచ్చి ఆగింది.

గూర్ఖా సలాంకొట్టి గేటు తీస్తున్నాడు.

గేటు దగ్గిర నిల్చునివున్న చంద్రం, కార్లో వ్యక్తిని చూసి అప్రయత్నంగా "నాన్నా!" అన్నాడు.

కార్లో వ్యక్తి గిర్రున తిరిగి చూశాడు.

ఉద్రేకంతో కారుకేసి రెండడుగులు వేసిన చంద్రం ఆగిపోయి ఆశ్చర్యంగా ఆ వ్యక్తి ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు.

కారులో వ్యక్తి కారుదిగి చంద్రం దగ్గిరకు వచ్చాడు.

"ఎవరు నాయనా నువ్వు?" ఆప్యాయంగా అడిగాడు.

"నేను....నేను.... నా పేరు చంద్రం.... నాకు ఏదైనా ఉద్యోగం...."

"అది సరే! నన్ను చూడగానే 'నాన్నా' అని పిల్చావేం?"

"మీలో మా నాన్న పోలికలుంటేనూ...." చంద్రం సిగ్గుపడి పోయాడు.

"నాలో మీ నాన్న పోలికలు వున్నయ్యా? మీ నాన్న పేరేమిటి బాబూ?" అని అడిగాడాయన.

"గుర్నాథం!"

"నువ్వు గుర్నాథం కొడుకువా బాబూ?" అంటూ ఒక్కసారిగా ఉద్రేకంతో చంద్రాన్ని కౌగిలించుకున్నాడాయన.

చంద్రానికి అంతా అయోమయంగా వుంది.

ఆ వ్యక్తి చంద్రాన్ని వదిలి కళ్ళు తుడుచుకున్నాడు.

"నేను గుర్నాథం తమ్ముణ్ణి. నీ బాబాయిని. నా పేరు ఒకప్పుడు రామనాథం. ఇప్పుడు అందరూ సింహాజీ అంటారు. పదబాబూ, ఇంట్లోకి వెళ్దాం!" డ్రైవర్‌తో కారు షెడ్‌లో పెట్టమని చెప్పి, చంద్రంతో ఇంటికేసి నడక సాగించాడు సింహాజీ.

"చిన్నప్పుడు అకతాయిగా తిరిగేవాణ్ణి. చదువంటే శ్రద్ధ వుండేదికాదు. ఇల్లు విడిచి పారిపోయాను. ఆ తర్వాత ఎన్నెన్నో పనులు చేశాను. బోలెడంత ఆస్తి సంపాదించాను. ఎలా సంపాదించానో తర్వాత చెబుతాను. ఈ రోజు నేను ఒక పెద్ద మిల్లుకి యజమానిని. అన్నయ్య ఎక్కడున్నాడో తెలుసుకోవాలని ప్రయత్నించాను. కాని నాకు వివరాలు తెలియలేదు. నాన్న బాగున్నాడా బాబూ?" చంద్రం పక్కగా నడుస్తూ చెప్పుకు పోతున్నాడు సింహాజీ.

"చనిపోయాడు." గద్గద స్వరంతో సమాధానం ఇచ్చాడు చంద్రం.

సింహాజీ అన్న మరణవార్తవిని చాలా బాధపడ్డాడు.

మేడమెట్లు ఎక్కుతూనే నౌకర్లను హడావిడిగా పిల్చి-

"అబ్బాయి వచ్చాడు. వేడినీళ్ళు సిద్ధంగా వుంచండి. పై గది .... ఆ ఏ. సీ రూం ఖాళీచేసి అబ్బాయికి ఇవ్వండి." అంటూ ఆజ్ఞలు జారీ చేశాడు.

డ్రాయింగ్ రూంలో సింహాజీ, చంద్రం కూర్చుని వున్నారు.

సింహాజీ తన గత జీవితం గురించి వివరంగా చెప్పాడు.

"బాబూ, చంద్రం! ఈ రోజు నా మనసు ఎంతో తేలిగ్గా వుంది. నాకు పిల్లలు లేరు, మీ పిన్నికూడా ఈ మధ్యనే చనిపోయింది. ఈ వయసులో ఆ భగవంతుడే నిన్ను నా దగ్గిరకు పంపించాడు."

"బాబాయ్!"

"బాబాయ్! ఎంత చల్లని పిలుపు! ఎంత కాలానికి ఒక ఆత్మీయుణ్ణి కలుసుకున్నాను!...." సింహాజీ ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయి పోతున్నాడు.

"నిజంగా నేను అదృష్టవంతుణ్ణి!" అన్నాడు సింహాజీ.

"బాబాయ్... అమ్మా చెల్లీ...."

"దిగులుపడకు బాబూ! నేను స్వయంగా కారు తీసుకెళ్ళి వాళ్ళను తీసుకొస్తాను. పద, భోజనంచేసి మన ఫ్యాక్టరీకి వెళ్దాం!" అంటూ సింహాజీ లేచాడు.

సింహాజీ చంద్రాన్ని ఆఫీసుకు తీసుకెళ్ళాడు. అందరికీ పరిచయం చేశాడు. తన వారసుడనీ, ఇకనుంచి ఆఫీసు విషయాలన్నీ అతనే చూసుకుంటాడనీ చెప్పాడు. ఫ్యాక్టరీ అంతా తిప్పి చూపించాడు.

ఫ్యాక్టరీనుంచి బయటకి వస్తున్న సింహాజీకి ఎదురుగా కార్మిక నాయకుడు వచ్చి నిలబడ్డాడు.

"సమ్మె విషయంలో ఏం ఆలోచించారు?" అని అడిగాడు కార్మిక నాయకుడు.

"ఇవ్వాళ్టినుంచి ఆ విషయాలన్నీ మా అబ్బాయి చంద్రం చూసుకుంటాడు. అతనితో మాట్లాడండి" అన్నాడు సింహాజీ కార్మిక నాయకుడికి చంద్రాన్ని చూపిస్తూ.

సింహాజీ ఆఫీసులోకి వెళ్ళిపోయాడు.

చంద్రం కార్మిక నాయకుడితో మాట్లాడి విషయాలు తెలుసుకున్నాడు.

"ఆఫీసు రికార్డులు కూడా ఒకసారి చూస్తాను. నా నిర్ణయాన్ని రేపు బహిరంగ సభలో చెప్తాను. ఇక మీరు వెళ్ళండి" అని చెప్పి ఆఫీసులోకి వెళ్ళాడు చంద్రం.

మేనేజర్ని పిల్చి రికార్డులు తెప్పించుకున్నాడు.

రికార్డులు తెచ్చి బల్లమీద పెడ్తూ - "ఈ కార్మికుల కోర్కెలు రోజు రోజుకూ పెరిగిపోతున్నాయ్. అందుకే మిల్లు యజమానుల సంఘం 'లాకవుట్' చెయ్యాలని నిర్ణయం తీసుకుంది" అన్నాడు మేనేజర్.

"సరే! మీరు వెళ్ళొచ్చు." అంటూ రికార్డులు తెరిచాడు చంద్రం.

బహిరంగసభ!

కార్మికులు వేల సంఖ్యలో కూర్చుని వున్నారు.

ముందుగా మిల్లు యజమానుల ప్రతినిధి లేచి మైకు ముందుకు వచ్చాడు.

"కార్మికుల కోర్కెలు నానాటికీ పెరిగి పోతున్నాయ్. వారి కోర్కెల్ని వెంటనే తీర్చకపోతే సమ్మె చేస్తాం అంటూ బెదిరిస్తున్నారు. మేము ఆ బెదిరింపులను ఎదుర్కోవటానికి సిద్ధంగానే వున్నాం. కాని, వారి అనుచితమైన డిమాండ్లను మేము అంగీకరించలేం. అందుకే 'లాకవుట్' చెయ్యడానికి నిర్ణయం జరిగింది."

జనంలో కేకలూ, అరుపులూ విన్పించాయి. కార్మికులు కొందరు లేచి ఉద్రేకంతో కేకలు వేస్తున్నారు.

"సమ్మె చేస్తాం! మీ బెదిరింపులకు భయపడం! న్యాయసమ్మతమైన మా హక్కుల్ని మేము సంపాదించుకుంటాం!" అంటూ కేకలు విన్పిస్తున్నాయి.

చంద్రంలేచి మైకు ముందుకు వచ్చాడు.

"సోదరులారా! శాంతించండి! నా నిర్ణయం శాంతంగా వినండి. నా మిల్లు గేట్లు తెరిచే వుంటాయ్ - నేను 'లాకవుట్'లో పాల్గొనడంలేదు. మీ కోరికలు న్యాయసమ్మత మైనవి అని నేను నమ్ముతున్నాను."

జనంలోనుంచి కరతాళధ్వనులు మిన్ను ముట్టాయ్.

మిల్లు యజమానుల ప్రతినిధీ, వాళ్ళ తాలుకు వ్యక్తులూ 'వాకవుట్' చేశారు.

కార్మికులంతా చంద్రం చుట్టూ చేరారు.

కొందరు చంద్రాన్ని అమాంతం ఎత్తి "చంద్రం బాబుకూ జై!" అంటూ జయ జయధ్వానాలు చేశారు.

డైనింగ్ టేబుల్ ముందు సింహాజీ, శాంతమ్మా, చంద్రం కూర్చుని వున్నారు.

లక్ష్మీ సరస్వతులు వడ్డిస్తున్నారు.

సింహాజీ సంతోషంగా వున్నాడు. చంద్రం తీసుకున్న నిర్ణయం బాగుందని ప్రశంసించాడు.

అదే సమయంలో మిల్లు యజమానుల ప్రతినిధులు వచ్చారు. చంద్రంతో ఘర్షణకు దిగారు. బెదిరించారు. సింహాజీని కూడా "నీ మిల్లు ఎలా నడుస్తుందో చూస్తాం!" అంటూ బెదిరించి వెళ్ళారు.

చంద్రం ఉలిక్కిపడి నిద్రలేచి కూర్చున్నాడు.

ఇల్లు తగలబడి పోతూవుంది.

చుట్టూ మంటలు కమ్ముకొస్తున్నాయి.

జ్వాలలు నాలుకలు చాస్తున్నాయి.

చంద్రం మంచం మీదనుంచి దూకి తల్లీ, చెల్లెలూ వున్న గదివైపు పరుగు తీశాడు. గడపలో అడుగు పెట్టగానే కాలుతున్న దర్వాజా చంద్రం వెన్నుమీద పడింది.

"అబ్బా!" అంటూ చంద్రం కళ్ళు తెరిచాడు.

తృళ్ళిపడి లేచి నిలబడ్డాడు. అంతలో వంట్లో సత్తువ లేనట్టు కూలబడ్డాడు.

మూడోరోడ్డు కేసిచూశాడు.

మసక మసగ్గా "ఢిల్లీ" అనే అక్షరాలు బోర్డుమీద కన్పించాయి....

❀ ❀ ❀

ఆఫీసు మేనేజరు చుట్టూ గుమాస్తాలూ, సూపర్నెంట్లూ చేరారు. అందరూ గుస గుసలు ఆడుతున్నారు. కొందరు గాభరాపడ్తున్నారు. కొందరికి కొత్త ఆఫీసరు

వచ్చినందుకు సంతోషంగా వుంది. ఆఫీసరు గురించి కుతూహలంతో కొందరు వింటూ వుంటే కొందరు తాము సేకరించిన భోగట్టా వినిపిస్తున్నారు.

"యల్. డి. సి. ఉద్యోగం కొరకు ఇంటర్వ్యూకు మన ఆఫీసుకు వచ్చాట్ట. బాగా గుర్తు రావడంలేదు" అన్నాడు మేనేజరు ఆలోచిస్తూ.

"మీరే ముందు ఇంటర్వ్యూ చేసి వుంటారు" అన్నాడు "ఒకడు వచ్చే ఆఫీసరు మీ పని పడ్తాడులే" అనే అర్థం వచ్చేలాగ.

"మీరు అతన్ని ఏదో అనేవుంటారు." మరో గుమస్తా అన్నాడు.

అంతలో ఫ్యూన్ పరిగెత్తుకుంటూ వచ్చి "అయ్యగారు పిలుస్తున్నారు" అని చెప్పి, గిర్రున తిరిగి వచ్చినంత వేగంగా వెళ్ళిపోయాడు.

ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. నిన్నేనంటే నిన్నేనని అనుకోసాగారు.

"మేనేజరు గార్నే అయివుండాలి. వచ్చీ రాగానే మనల్నెందుకు పిలుస్తాడు?" అన్నాడు ఒక సెక్షన్ సూపర్నెంటు.

"నన్ను కాదేమో? మీలో ఎవర్నయినా పిల్చి వుండొచ్చుగా?" నీరసపడి పోతూ అన్నాడు మేనేజరు.

మేనేజరుకు భయంగానే వుంది. ఇంటర్వ్యూకు వచ్చినప్పుడు తను అతన్ని ఏదో అనే వుంటాడు. తన నోరు మంచిదికాదు అంటారు అందరూ. తన నోటి దురుసుతనమే అప్పుడప్పుడు పీకలమీదకు తెస్తుంది.

"అఫీసరుగారు పిలుస్తున్నారంటే రారేమండీ?" ఫ్యూన్ మళ్ళీ వచ్చి మేనేజర్‌తో అన్నాడు.

మేనేజరు తృళ్ళిపడి పరుగులాంటి నడకతో ఆఫీసర్ రూం కేసి నడిచాడు.

అందరూ ముఖ ముఖాలు చూసుకొని నవ్వుకుంటున్నారు.

మేనేజరు రాంమూర్తి ఊడిపోతున్న గోచీని పెట్టుకుంటూ గాభరాగా ఆఫీసర్ రూంలో అడుగు పెడ్తూ గుమ్మం తగిలి పడబోయి నిలదొక్కు కున్నాడు.

అతని గాభరాచూసి చంద్రానికి నవ్వొచ్చింది. "వెధవ! ఆ రోజు ఇంటర్వ్యూకి వచ్చినప్పుడు తనను ఒక పురుగులా చూశాడు. కసిరి కొట్టాడు. అంతా సీటు మహిమ."

ఐ. ఏ. యస్. చంద్రశేఖరం ముందు వణికిపోతూ నిల్చున్నాడు రాంమూర్తి.

"ఆ లైసెన్స్ అప్లికేషన్ తాలుకు ఫైలు పంపించు."

"సర్!" అంటూ వెనక్కు తిరిగి, గడపదాటాక, జుట్టువిప్పి ముడివేసుకుంటూ ధీమాగా ఆఫీసులోకి అడుగుపెట్టాడు.

అతన్ని చూసి అందరూ ఆశ్చర్య పోయారు.

రాంమూర్తి గాభరాలో గోచీ విప్పి పెట్టుకుంటాడు. ఏదైనా సాధించినప్పుడూ, సంతోషంగా వున్నప్పుడూ జుట్టువిప్పి ముడేసుకుంటాడు.

"అఫీసరు ఏమన్నాడు?"

"ఎలా వున్నాడు?"

"నిన్ను గుర్తించాడా?"

అనేక ప్రశ్నలు.

"ఓ గుర్తించాడు. కుర్చీ చూపించాడు. చాలా గౌరవంగా మాట్లాడాడు" అంటూ ఏదేదో చెప్పాడు రాంమూర్తి.

సరిగ్గా అయిదు గంటలకు లేచి బయటికి వచ్చాడు చంద్రం.

బల్లలముందు కూర్చునివున్న వాళ్ళు లేచి నిలబడ్డారు.

"ఐదింటికి అందరూ వెళ్ళిపోండి. అయిదు తర్వాత స్పెషల్ వర్క్ వుంటేగాని ఎవరూ వుండటానికి వీల్లేదు. వళ్లొంచి పనిచేస్తే. ఆఫీసు అవర్స్‌లో ఎంత పనైనా చెయ్యొచ్చును" అంటూ చంద్రం చక చకా, ఠీవిగా నడుస్తూవెళ్ళి పోయాడు.

అదొక పెద్ద బంగళా. ఖరీదైన సోఫాలూ, కుర్చీలు వున్నాయ్. కింద ఎర్రటి కార్పెట్ పరిచివుంది. కార్పెట్ మధ్య తెల్లని పద్మం వుంది.

చంద్రం పెళ్ళి పెద్దలతో మాట్లాడుతున్నాడు. శాంతమ్మ పెళ్ళికొడుకు తల్లితో మాట్లాడుతూ వుంది.

సరస్వతి లక్ష్మిని ముస్తాబుచేసి తీసుకొని వచ్చింది. లక్ష్మి సిగ్గుపడుతూ వచ్చి కూర్చుంది. క్రీగంటితో పెళ్ళి కొడుకుని చూసింది అది చూసి చంద్రం నవ్వుకున్నాడు.

ఫలహారాలు అయాయి.

"అమ్మాయి మాకు నచ్చింది. ముహూర్తం పెట్టించండి" అన్నాడు పెళ్ళికుమారుడి తండ్రి చంద్రంతో.

"కట్నం విషయంకూడా ఇప్పుడే మాట్లాడు కోవడం మంచిది" అన్నాడు చంద్రం.

"మా అబ్బాయికి కట్నం తీసుకోవటం ఇష్టం లేదు. మీ సంబంధం కావాలని వచ్చాం. మీతో వియ్యమందటమే మా భాగ్యంగా భావిస్తున్నాం" అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి.

శాంతమ్మ ముఖం సంతోషంతో చేటంత అయింది.

పెళ్ళికొడుకు మరోసారి పెళ్ళి కూతురి కేసి చూసి నిల్చున్నాడు.

చంద్రం ఆఫీసులో మేనేజర్‌తో ఏదో ఫైలు విషయం చర్చిస్తున్నాడు. అంతలో ఫోన్ మ్రోగింది.

ఫోన్ తీసుకొని "యస్. చంద్రశేఖర్ హియర్!" అన్నాడు.

"లేదండీ! సారీ! ఆ పని నేను చెయ్యలేను. ఇటువంటి విషయాల్లో నన్ను సహకరించమని అడక్కండి."

చంద్రం ముఖం చిట్లించుకుంటూ "అసలు ఆ సీక్రెట్ విషయాలు మీకెట్లా తెలిశాయ్?" అని మేనేజర్ ముఖంలోకి చూశాడు.

మేనేజర్ వణికిపోతూ నిల్చున్నాడు.

"సారీ! నేనేమీ చెయ్యలేను." విసురుగా ఫోన్ పెట్టి కోపంగా రాంమూర్తి ముఖంలోకి చూశాడు.

"ఆఫీసు విషయాలు బయటకి ఎట్లా పోతున్నాయ్? ఆ ఫైలు నీకూ, నాకూ మధ్యేగా తిరుగుతోంది?"

"ఏమోసార్! నాకేమి తెలియదు."

"నీ నక్క వినయాలు నాదగ్గిరకాదు. జాగ్రత్త! మరో సారి ఇటువంటి బుద్ధి తక్కువ పని చేశావంటే....."

"సార్!"

"వెళ్ళు!"

వాకిలివరకూ వంగి వంగి వచ్చిన రాంమూర్తి, గడపదాటగానే నిటారుగా నిల్చుని, గోచీని విసురుగా విప్పి, మళ్ళీ పెట్టుకుంటూ తన గదిలోకి వెళ్ళాడు.

"ఏం జరిగింది?" కొందరు ప్రశ్నించారు.

"టెంపర్ పోతున్నాడు టెంపర్! కొండతో ఢీ కొంటున్నాడు, ఛైర్మెన్ తల్చుకుంటే శంకరగిరి మాన్యాలు పట్టించగలడు, ఆ మాటే అనేసి వచ్చాను" అన్నాడు రాంమూర్తి.

రాంమూర్తి మాటలు ఎవరూ నమ్మలేదు.

చంద్రానికి రెండో రోజు అదేవిషయం గురించి ఛైర్మెన్ నుంచి ఫోన్ వచ్చింది. చంద్రం నిర్మొహమాటంగా ఆ పని చెయ్యలేనని చెప్పి ఫోన్ పెట్టేశాడు.

ఆఫీసులో ఛైర్మెన్‌కూ, ఆఫీసరుకూ పడటం లేదని గుసగుసలు ప్రారంభం అయ్యాయి.

"మహా నీలుగుతున్నాడు. ఇంకా ప్రొబేషన్ అన్నా పూర్తి కాలేదు. ఛైర్మెన్ తల్చుకుంటే ఉద్యోగమే పీకేయిస్తాడు" అన్నాడు రాంమూర్తి.

"ఐ. ఏ. యస్. వాళ్ళ ఉద్యోగం పీకేయించడం అంత తేలికా?" ఒకప్పుడు ఐ.ఏ.యస్. పరీక్షకు కూర్చుని సెలెక్టు కాకపోగా, గుమాస్తాగా చేరిన రాజు అన్నాడు.

"చూస్తావ్‌గా!" అన్నాడు రాంమూర్తి.

వివాహ మండపం.

పెళ్ళిపందిరి కోలాహలంగా వుంది. అతిథుల్ని ఆహ్వానిస్తున్నాడు చంద్రం. సరస్వతి హడావిడిగా తిరుగుతూవుంది.

వధూవరులను మండపంలో కూర్చోపెట్టారు.

చంద్రం, పెళ్ళికొడుకు తండ్రితో మాట్లాడుతూ వున్నాడు. అదరా బాదరాగా వచ్చిన రాంమూర్తి చంద్రానికి ఒక సీల్డ్‌కవర్ అందించాడు "అర్జెంట్. కాన్ఫిడెన్షియల్." అని ఆ కవరుపైన రాసివుంది. చంద్రం ఆత్రంగా విప్పి చదివాడు. ముఖం వెలా తెలా పోయింది.

"ఏమిటది?" ఏమైంది?" పెళ్ళికొడుకు తండ్రి అడిగాడు.

"ఎవరో గిట్టని వాళ్ళు అయ్యగారిమీద లేని పోనివి కల్పించారు. గవర్నమెంటు వెంటనే అయ్యగారిని కంపెల్‌సరీ లీవులో వెళ్ళమని ఉత్తర్వు చేసింది."

చంద్రం రాంమూర్తి ముఖంలోకి చూశాడు.

"గవర్నమెంటులో కాన్ఫిడెన్షియల్ అంటారు గాని - అసలు విషయం - అసలు వ్యక్తికి తెలియకముందే చుట్టూవాళ్ళకు తెలిసిపోతుంది" అన్నాడు రాంమూర్తి.

"ఏమిటి? ఏమైంది!" పెళ్ళికొడుకు తండ్రి రాంమూర్తిని ఆతృతగా అడిగాడు.

"అయ్యగారిమీద కంప్లైంట్సు వచ్చాయ్.. డిసిప్లినరీ యాక్షన్ తీసుకోవడానికి సమయం పడ్తుందని వెంటనే లీవులో వెళ్ళవలసిందిగా గవర్నమెంటు ఆర్డరు జారీచేసింది."

"రాంమూర్తీ!" చంద్రం దాదాపు అరిచినట్టే అన్నాడు.

పెళ్ళికొడుకు తండ్రి పెళ్ళిమండపం దగ్గరకు వెళ్ళాడు.

"ఒరే! అబ్బాయ్! లే! వెళ్దాం పద! మన కీ సంబంధం అక్కర్లేదు" అంటూ కొడుకు రెక్క పట్టుకొని లేవదీశాడు.

లక్ష్మి వణికిపోతూ దీనంగా పెళ్ళికొడుకు ముఖంలోకి చూసింది. పెళ్ళికొడుకు వెర్రిముఖం వేశాడు.

జనం విస్తుబోయి చూస్తున్నారు. శాంతమ్మ విరుచుకు పడిపోయింది.

చంద్రం పరుగెత్తుకెళ్ళి "ఏమిటండీ ఇది?" అన్నాడు.

"నువ్వేదో పెద్ద ఉద్యోగం చేస్తున్నావనీ, మా వాడికి మంచి ఉద్యోగం ఇప్పించి, అండగా వుంటావని కట్నంలేకుండా ఈ సంబంధానికి ఒప్పుకున్నాం. నీకే ఉద్యోగం పోతుంటే ఇక మావాడి కేం చూస్తావ్? పదరా! అలా కొయ్యలా నిలబడావేం?"

"నా ఉద్యోగం ఎక్కడికి పోతుందండీ! ఆ కంప్లైంట్సు నిజం కావు." చంద్రం పెళ్ళికొడుకు తండ్రి రెండుచేతులూ పట్టుకొని ప్రాధేయపడుతూ అన్నాడు.

పెళ్ళికొడుకు తండ్రి చేతులు విడిపించుకొని, కొడుకుని లాక్కుని వెళ్ళిపోయాడు.

చంద్రం లక్ష్మికేసి చూశాడు. లక్ష్మి కుమిలి కుమిలి ఏడుస్తూ వుంది.

"చెల్లీ! లక్ష్మీ!" అంటూ చంద్రం చెల్లెల్ని రెండు చేతుల్తో పట్టుకొన్నాడు....

చౌరాస్తాలో వున్న స్థంభాన్ని కౌగలించుకొని ఊపుతున్న చంద్రం కళ్ళు తెరుచుకున్నాయ్.

ఆకాశం ఉరిమి ఉరిమి వర్షిస్తూంది.

వానజల్లుతో చంద్రం దాహం, తాపం కొంతవరకు చల్లారింది. నాలుగో రోడ్డుకేసి చూశాడు.

"హైదరాబాద్!" అనే బోర్డు కన్పించింది.

ఆ రోడ్డే తన రోడ్డు.

ఆ రోడ్డునుంచే తను పరుగెత్తుకొచ్చాడు. పారిపోయి వచ్చాడు.

ఆ రోడ్డులోనే వాస్తవం తనకోసం ఎదురుచూస్తూవుంది. అదే తన రోడ్డు. తను వెళ్ళాల్సిన రోడ్డు. ఆ రోడ్డున వెళ్తేనే తన తల్లీ. చెల్లెలూ తనకోసం ఎదురుచూస్తూ కన్పిస్తారు. అదే నిజం. అదే వాస్తవం.

వాస్తవంనుంచి ఎక్కడికి పారిపోవాలనుకున్నాడు? కలల్లోకా? ఆ కలల్లోనూ ప్రమాదాలే ఎదురైనాయి!

అమ్మా - చెల్లీ ఏమైనారో?

చంద్రం వచ్చిన రోడ్డునే పరుగెత్తుతున్నాడు. కాళ్ళలోకి బలం తెచ్చుకొని పరుగులు తీస్తున్నాడు.

# 4

చంద్రం ఇంటిముందుకు వచ్చి ఆగిపోయాడు. ఆ ఇల్లు ఎప్పటిలా లేదు. బోసిగా వుంది. అది తనను ఆహ్వానించడం లేదు.

చంద్రం పిచ్చివాడిలా ఇల్లంతా తిరిగాడు. తల్లి కన్పించలేదు. చెల్లెలు కన్పించలేదు.

ఇంటిలోని ప్రతి వస్తూవూ చంద్రం ముఖంలోకి జాలిగా చూస్తున్నది.

పేరయ్య ఇంటికి పరుగు తీశాడు.

ఇంటిముందు పందిరి వేసివుంది. మంగళ వాద్యాలు మోగుతున్నాయ్.

పందిరి గుంజకు ఆనుకొని నిల్చున్నాడు చంద్రం. తల వంచుకొని కూర్చున్న పెళ్ళికూతుర్ని చూస్తున్నాడు. వివాహమండపంలో సరస్వతిని పెళ్ళికూతురుగా చూస్తున్నాడు. ఆ పెళ్ళికొడుకు.... తను వుండవలసిన స్థానంలో....

ఆ రోజు శ్రావణ మంగళవారం.

సరస్వతి నోము నోచుకుని, ముత్తైదువులా ముస్తాబై గిన్నెలో పిండివంటలు పెట్టుకొని గుర్నాథం ఇంటికి వచ్చింది.

శాంతమ్మకోసం వెతుక్కుంటూ చంద్రం గదిలోకి వచ్చింది. చంద్రం శ్రద్ధగా చదువుకుంటున్నాడు.

సరస్వతి చంద్రాన్ని చూస్తూ నిలబడింది.

చంద్రం కదిలాడు. సరస్వతి గాభరాగా బయటికి వెళ్తూ తలుపు రెక్కకు కొట్టుకుంది.

చంద్రం గిర్రున తిరిగిచూశాడు.

"శాంతమ్మత్తా! శాంతమ్మత్తా!" అంటూ వంటగదిలోకి వెళ్ళిపోయింది.

చంద్రం తనలో తను నవ్వుకున్నాడు.

మళ్ళీ చదువులో మునిగిపోయాడు.

అంతలోకి లక్ష్మివచ్చి చంద్రం గదిముందు నిల్చుంది.

"ఏమిటీ అల్లరి! నన్ను చదువుకోనివ్వవా ఏం? వుండు, నాన్నతో చెప్తాను" అన్నాడు చంద్రం.

లక్ష్మి వెర్రిదానిలా చూచింది.

"ఇప్పుడు నేనేం అల్లరి చేశానూ? ఏదో ఒక వంకతో నాతో పోట్లాటకు తయారుగా ఉంటావ్! వుండు, అమ్మతో చెప్తాను" అంటూ లక్ష్మి వంటగదిలోకి వెళ్ళింది.

శాంతమ్మపక్కన కూర్చునివున్న సరస్వతిని చూసి "ఇదా సంగతి?" అంటూ అర్థయుక్తంగా నవ్వింది.

సరస్వతి సిగ్గుపడిపోయింది.

సరస్వతి తెచ్చిన పిండి వంటల్ని రెండు ప్లేట్లలో పెట్టింది శాంతమ్మ. ఒకటి కూతురుకి ఇచ్చి, రెండోది సరస్వతికి అందించింది.

"నా కెందు కత్తయ్యా! నేను ఇంటిదగ్గిర తినే వచ్చాను." శాంతమ్మ అభిప్రాయాన్ని అర్థం చేసుకోక అన్నది సరస్వతి.

శాంతమ్మ ముసిముసిగా నవ్వింది.

"పిచ్చిపిల్లా, నీకు కాదే! నువ్వు ఎవరికోసం తెచ్చావో వాళ్ళ కిచ్చిరా!" అన్నది నవ్వుతూ.

"అమ్మ బాబోయ్!" అంటూ చేతుల్లో ముఖం దాచుకొని కిసుక్కున నవ్వింది సరస్వతి.

శాంతమ్మ సరస్వతిని మురిపెంగా చూసుకుంటూ నవ్వింది.

"సిగ్గంతా ఇప్పుడే ఖర్చుచెయ్యకు. పెళ్ళినాటికి దాచుకో!" అన్నది లక్ష్మి సరస్వతిని ఆటలు పట్టిస్తూ.

"చూడత్తయ్యా!" గుణుస్తూ అన్నది సరస్వతి.

"నువ్వూరుకోవే!" కూతుర్ని అని, "ఆ ప్లేటు బావకు ఇచ్చిరా తల్లీ!" అన్నది సరస్వతితో.

"ఊఁ- తీసుకెళ్ళు. అన్నయ్య నీ కోసమే ఎదురుచూస్తూ కూర్చున్నాడు. మహా చిరాకు పడిపోతున్నాడు పాపం!" అన్నది లక్ష్మి.

"నువ్వే ఇచ్చిరా! నేను వెళ్ళను బాబూ!"

"ఇది మరీ బాగుంది! నామీద కస్సుబుస్సు మంటున్నాడు. నువ్విస్తేనే సంతృప్తిగా తింటాడు" అన్నది లక్ష్మి.

శాంతమ్మ బలవంతంమీద ప్లేటు తీసుకొని ఒక అడుగు వేసి, ఆగీ "నువ్వుకూడా రా లక్ష్మీ!" అన్నది సరస్వతి.

"మధ్యలో నే నెందుకూ, పానకంలో పుడకలాగ!" సాగదీసింది లక్ష్మి.

సరస్వతి అలాగే నిలబడిపోయింది.

"సరే పదా!" అన్నది లక్ష్మి.

సరస్వతి చంద్రం గదివరకూ వచ్చి వాకిట్లోనే ఆగిపోయింది. లక్ష్మి ఎంత ముందుకు తోసినా కదల్లేదు. సరస్వతి చేతిలో ప్లేటు తీసుకొని లక్ష్మి గదిలోకి వెళ్ళింది.

మళ్ళీ తలుపు రెక్కకు కొట్టుకుంది. చంద్రం తిరిగి చూశాడు. సరస్వతి తడబడుతూ తలుపుచాటుకు వెళ్ళింది.

"ఏమిటీ అల్లరి? మళ్ళీ వచ్చావా?" చంద్రం లక్ష్మిజడ పట్టుకున్నాడు.

"నేనేం అల్లరి చెయ్యడంలేదు. నీ ఉడుకుబోతుతనం ఎందుకో నాకు తెలుసులే!" వెక్కిరిస్తూ అన్నది లక్ష్మి.

చేతిలో ప్లేటు టేబుల్‌మీద పెట్టింది.

"నా జడ వదలు."

"నాన్నా! నాన్నా!" లక్ష్మి జడ వదలకుండానే కేకలు పెట్టాడు చంద్రం.

"ఏమిట్రా?" అంటూ గుర్నాథం వచ్చాడు.

"చూడు నాన్నా, లక్ష్మి నన్ను చదువుకోనివ్వకుండా అల్లరి చేస్తూవుంది." ఫిర్యాదు చేశాడు చంద్రం.

"అబ్బ వదులు!" అంటూ చంద్రంచేతినుంచి జడ లాక్కుంది లక్ష్మి.

"ఏమిటమ్మా ఈ అల్లరి, అన్నయ్యను చదువుకోనివ్వకుండా?" అన్నాడు గుర్నాథం.

"అల్లరిచేస్తుంది నేనుకాదు. ఎవరో చూడు! ఇటు రా!" అంటూ తలుపు లాగింది.

అప్పటికే సరస్వతి బయటకి పరుగుతీసింది. శాంతమ్మ వెనక, ఏమీ ఎరుగనట్టే కూర్చుంది.

"మరీ చిన్నపిల్లవై పోతున్నావ్? అన్నయ్యకు పరీక్షలు దగ్గిర కొచ్చాయ్! అల్లరిచెయ్యకు, వెళ్ళు" గుర్నాథం కూతుర్ని మందలించాడు.

లక్ష్మి ముఖం చిన్నపుచ్చుకుంది.

"తిక్క కుదిరిందా?" అన్నట్టు చంద్రం చెల్లెలి ముఖంలోకి చూశాడు.

లక్ష్మి రుసరుస లాడుతూ తల్లి దగ్గిరకు వెళ్ళింది.

"ఏయ్ దొంగా! చేసే అల్లరిచేసి, ఏమీ ఎరగనట్టు అమ్మ చాటున దాక్కున్నావా?" అంటూ లక్ష్మి సరస్వతికి చక్కలిగింతలు పెట్టింది.

సరస్వతి పకపక నవ్వుతూ పారిపోయింది.

సరస్వతి విప్పారిన ముఖంతో ఇంటికి వస్తుంటే పేరయ్య వసారాలో కూర్చుని చూశాడు.

"ఏమంటున్నాడే నీ బావ?" అడిగాడు పేరయ్య కూతుర్ని.

"భాగోతం చదువుకుంటున్నాడు" అన్నది సరస్వతి.

పేరయ్య విరగబడి నవ్వాడు.

సరస్వతి తండ్రి ముఖంలోకి విస్మయంగా చూస్తూ నిల్చుంది.

"అప్పుడే అంత వైరాగ్యం వచ్చిందా? సన్యాసుల్లో కలిసి పోతాడా ఏం కొంపదీసి?" అన్నాడు పేరయ్య నవ్వుతూ.

"ఎవరండీ సన్యాసుల్లో కలిసి పోయేదీ?" పేరయ్య భార్య కాంతమ్మ బయటికి వచ్చింది కొంగుకు చెయ్యి తుడుచుకుంటూ.

"ఇంకెవరు? నీ అల్లుడు! భాగోతం చదువుతున్నాడట!" అన్నాడు పేరయ్య.

"నేను చెప్పింది గుర్నాథం మామయ్య గురించి." సిగ్గుపడి పోతూ అన్నది సరస్వతి.

"ఓసి నీ ఇల్లు బంగారంగానూ!" పేరయ్య కడుపు పట్టుకొని నవ్వాడు.

"నీ బావ ఏం చేస్తున్నాడే అంటే నా బావ గురించి చెప్తుంది నీ కూతురు! చూడవే?" అన్నాడు భార్యతో.

"ఫో నాన్నా! నువ్వు మరీనూ!" సిగ్గుపడిపోతూ లోపలకు పరిగెత్తింది సరస్వతి.

ఒక్కసారిగా మంగళవాద్యాలు మోగాయి. పెళ్ళికొడుకు మంగళసూత్రం తీసుకొని నిలబడ్డాడు.

సరస్వతి తల ఎత్తి ఎవరికోసమో పందిరి కలయజూసింది.

దూరంగా గుంజకు ఆనుకొని నిల్చునివున్న చంద్రంమీద ఓ క్షణం కళ్ళు నిల్చాయి. మళ్ళీ తల దించుకుంది.

సూత్రధారణ అయిపోయింది.

సరస్వతి పరాయిమనిషి అయిపోయింది.

"ఒరేయ్ చంద్రం! నువ్వటరా? ఎప్పుడొచ్చావ్? ఏమిటా వేషం నువ్వూనూ?" అన్నాడు పేరయ్య.

"అమ్మా, చెల్లీ ఎక్కడున్నారు మామయ్యా?" ఆదుర్దాగా ప్రశ్నించాడు.

పేరయ్య మాట్లాడలేదు. దిక్కులు చూడసాగాడు.

"చెప్పవేం మామయ్యా?"

"ఏమోరా చంద్రం! నువ్వెళ్ళిన కొద్దిరోజులకే లక్ష్మి కన్పించకుండా పోయింది. అనేక పుకార్లు పుట్టాయి. నేను నమ్మలేదనుకో. అమ్మను నా దగ్గిరకు తీసుకొద్దామనుకుంటూ వుండగానే ఆమెకూడా చెప్పా పెట్టకుండా ఎటో వెళ్ళిపోయిందిరా!" లేని బాధను కంఠంలోకి తెచ్చుకుంటూ అన్నాడు పేరయ్య.

చంద్రం స్థాణువులా బిగుసుకు పోయాడు.

ఎక్కడకు వెళ్ళిందో ఏమవస్థలు పడ్తుందో? "ఇక్కడే నిల్చున్నావేంరా! రా లోపలకు," అన్నాడు పేరయ్య.

చంద్రం కదిలాడు. కీ ఇచ్చిన బొమ్మలా బయటికి నడిచాడు. నడుస్తున్నాడు. తారు రోడ్డుమీద ఒక్కొక్క అడుగే లెక్కపెడుతున్నట్టు వేస్తున్నాడు.

సుఖదుఃఖాలకు అతీతంగా వుంది మనసు. ఆలోచించే స్థితిలో లేదు.

మానవుడి మనసు సుఖాన్నిగానీ దుఃఖాన్నిగానీ ఒక హద్దు వరకే అనుభవించగలదు.

చంద్రం నడుస్తున్నాడు. ఎక్కడికి? ఏమో? ఈ ప్రయాణానికి ఓ గమ్యం వుందా?

వర్తమానం వెనక్కు తిరిగి గతంలోకి చూసింది.

# 5

ఆ రోజు గుర్నాథం ఆఫీసుకు వెళ్ళేందుకు హడావిడిగా తయారౌతున్నాడు.

వెలిసిపోయి, బొంతరేగి, మాసికలున్న నల్లకోటు తొడుక్కున్నాడు. ఉంగటం తెగిపోయిన చెప్పులు తొడుక్కున్నాడు.

"ఇదుగో! నిన్నే! టైం అయిపోయింది!" అలవాటు ప్రకారం భార్యను కేకపెట్టాడు.

"ఇదో వచ్చే!" అంటూ శాంతమ్మ టిఫిన్ డబ్బా తెచ్చి అందించింది.

టిఫిన్ బాక్స్ అందుకొని, ఉంగటం తెగిన కుడికాలు ఈడ్చుకుంటూ, గడపవరకూ వెళ్ళిన గుర్నాథం – ఏదో గుర్తొచ్చిన వాడిలా ఠక్కున ఆగిపోయాడు.

వెనక్కు తిరిగొచ్చి టిఫిన్ డబ్బా భార్యకు అందించాడు.

"టిఫెన్ తీసుకెళ్ళరా?" ఆశ్చర్యంగా అడిగింది భార్య శాంతమ్మ.

శాంతమ్మకు గత ఇరవై ఎనిమిదేళ్ళగా భర్త ఆఫీసుకు వెళుతుంటే టిఫిన్‌బాక్స్ అందించడం అలవాటు.

"ఇవ్వాళ దీని అవసరం లేదేమో?" అంటూ మంచంమీద కూర్చున్నాడు.

"ఆఫీసుకు వెళ్ళరా? వంట్లో బాగాలేదా?" ఆదుర్దాగా ప్రశ్నించింది శాంతమ్మ.

గుర్నాథం వేదాంతిలా నవ్వబోయాడు. నవ్వాననుకున్నాడు. కాని నవ్వలేదు.

"ఆఫీసుకే వెళ్తున్నాను. కాని టిఫెన్ అవసరంలేదు. ముప్ఫయ్ ఏళ్ళ అలవాటు. గానుగెద్దు, గానుగచుట్టూ తిరిగి తిరిగి, కొట్టంలో కట్టేశాకకూడా కట్టుగొయ్య చుట్టూ తల ఊపుతూ తిరుగుతుంది అంటారు. అలాగే నేనూ టిఫిన్ అడిగాను" అన్నాడు గుర్నాథం.

శాంతమ్మకు అర్థం కాలేదు. భర్త ముఖంలోకి అయోమయంగా చూసింది.

"ఇవ్వాళ మా ఆఫీసులో పార్టీ వుంటుందిలే. టిఫిన్ తీసుకెళ్ళే అవసరంలేదు" అంటూ లేచి బయటికి వెళ్ళిపోయాడు గుర్నాథం.

గుర్నాథం శాంతమ్మకు ఆ రోజు కొత్తగా కన్పించాడు. అతని మాటలుకూడా కొత్తగానే వున్నాయ్. వెళ్ళిపోతున్న భర్తవైపు చూస్తూ నిట్టూర్చింది శాంతమ్మ.

ఆ రోజు ఆఫ్టర్ నూనే గుర్నాథం రిటైర్ అయ్యాడు. ఆఫీసు వాళ్ళంతా పార్టీ ఇచ్చారు.

అందరూ గుర్నాథం మంచితనాన్నీ, నిజాయితీనీ పొగిడేశారు.

ఆఫీసరుకూడా గుర్నాథం వినయ విధేయతల గురించీ, పనితనం గురించీ పొగిడేశాడు. అటువంటి నిజాయితీగల ఒక ఉద్యోగి రిటైర్ కావడం నిజంగా ఆ శాఖకే తీరనిలోటు అనికూడా మాట్లాడాడు ఆఫీసరు.

గుర్నాథం తలవంచుకొని అంతా వింటున్నాడు.

కృతజ్ఞతలు తెలుపుకోవలసిన సమయం వచ్చింది. కాని గొంతు పెగల్లేదు.

కళ్ళల్లో నీరు ఉబికి వచ్చింది.

ఈనాడు ఆఫీసరు తనను పొగుడుతున్నాడు. పని మంతుడు అంటున్నాడు.

నిజాయితీ కలవాడు అంటున్నాడు, ఆ మాటలే తను సర్వీసులో వుండగా ఏ ఒక్క ఆఫీసరు చెప్పినా తన శరీరంలో ఇంకా ఏనుగంత బలం వుండేది. మనసులో సంతృప్తి వుండేది. తనలో ఆత్మవిశ్వాసం వుండేది. తను ప్రమోషన్లుకూడా పెద్దగా ఆశించలేదు. తన నిజాయితీనీ, పనితనాన్నీ ఆఫీసర్లు గుర్తించి ఒక్క మంచిమాట, సానుభూతితో కూడిన మాట అనాలని ముప్ఫైయ్ ఏళ్ళు ఎదురుచూశాడు. కాని తనకు లభించినవి ఏమిటి? అవమానాలూ, తిట్లూనూ! బానిస భావం తన రక్తంలో రక్తమై ప్రవహిస్తూంది. తన నరనరంలో జీర్ణించుకుపోయింది.

శరీరంలో శక్తి లేదు. ఆత్మలో ఆత్మవిశ్వాసం లేదు. మనసులో సంతృప్తి లేదు. ఏభై ఐదేళ్ళకే డైభ్భైఏళ్ళ నీరసం తనలో ప్రవేశించింది.

ఇప్పుడు ఆఫీసరు తనను పొగుడుతున్నాడు.

ఈ చాకిరీకి – ఈ ముప్పై ఐదేళ్ళ చాకిరీకి – ప్రతిఫలంగా తనకు మిగిలిందేమిటి?

తన వంటిమీద వున్న పాత చింకి కోటు.

సంసారం గడవక ఇల్లు తాకట్టుపెట్టి తెచ్చిన అప్పు!

నెలకు దాధాపు నూరు రూపాయల పెన్షన్!

అందరి దగ్గిరా కన్నీటితో సెలవు తీసుకున్నాడు గుర్నాథం.

ఆఫీసు చివరి గడపమీద ఆగి వెనక్కు తిరిగి చూశాడు.

ఈనాటినుంచి తనకూ ఆఫీసుకు ఎటువంటి సంబంధం వుండదు. పనిమీద వస్తే విజిటర్స్ కూర్చునే కుర్చీలో కూర్చోవాలి. ముప్పయ్ ఏళ్ళు, తన జీవత కాలంలోని ఎక్కువ భాగాన్ని ఆ ఆఫీసులోనే గడిపాడు! కాని రేపటినుంచి ఆ ఆఫీసుకు తను పరాయివాడు! పట్టు తప్పి పోతున్న కాళ్ళను బలంగా భూమిమీద మోపి నడవడానికి ప్రయత్నిస్తున్నాడు మాజీ తహసీల్ ఆఫీసు హెడ్‌క్లార్క్.

ఎల్. డి. సీ.గా ఉద్యోగంలో చేరిన గుర్నాథం హెడ్ క్లార్క్‌గా రిటైర్ అయ్యాడు.

ఇప్పుడు గుర్నాథం మాజీ యన్. జీ. ఓ.

# 6

కోటుతీసి భార్యకు ఇస్తూ "కొయ్యపెట్టె అడుగున పడెయ్. ఇక దీనితో అవసరంలేదు" అన్నాడు గుర్నాథం.

శాంతమ్మ భర్త ముఖంలోకి లోతుగా చూసింది.

నిన్నటికంటే ఈ రోజు ఎంతో పెద్దవాడై పోయినట్టు అన్పించింది.

"ఏమిటే అలా చూస్తావ్ ? ఇవ్వాళ రిటైర్ అయాను. ఆఫీసు నుంచి రోజూ లేటుగా వస్తున్నానని ఇరవై ఎనిమిదేళ్ళుగా రోజూ బాధ పడ్డావ్. ఇక నుంచి అంతా విశ్రాంతే! ఇంట్లో నుంచి బయటికి వెళ్ళాల్సిన పనే వుండదు. ఇరవై నాలుగ్గంటలూ నీ ఎదురుగానే వుంటాను."

శాంతమ్మకు తను నిల్చున్న భూమి ఊబిగా మారినట్టూ, తను అందులోకి దిగి పోతున్నట్టూ అన్పించింది.

"పిచ్చిదానా! ఎందుకే బాధ పడ్తావ్? పుట్టిన ప్రతివాడూ చావక తప్పదు. ఉద్యోగంలో చేరిన ప్రతివాడూ ఏదో ఒకరోజు రిటైర్ కాకా తప్పదు" అన్నాడు గుర్నాథం మంచం వాల్చుకొని కూర్చుంటూ.

"ఫించన ఎంత వస్తుందీ?....." దిగులు పడిపోతూ అన్నది శాంతమ్మ.

"ఆ వస్తుంది - అంతా కలిసి నూట పది!"

"ఇప్పుడు నాలుగొంధలు వస్తుంటేనే అంతంత మాత్రంగా ఉంది. వంద రూపాయల్లో ఎట్లా బతకాలో ఏమో!" తనకు తానే చెప్పుకుంటున్నట్టు అన్నది.

"ఎలాగో గడపాలి మరి! మన చంద్రం చదువు పూర్తయి, వాడికి మంచి ఉద్యోగం వస్తే మన కష్టాలు గట్టెక్కుతాయ్."

"పిల్ల ఎదిగి కూర్చుంది. దాని మెళ్ళో ఆ మూడు ముళ్ళూ ఎట్లా వేయిస్తామో ఏమో! కట్న కానుకలు ఇచ్చుకో లేని వాళ్ళం!"

"ఎందుకే దిగులు? అప్పుడే దానికేం వయసు మీరి పోయిందని? అబ్బాయి చదువు పూర్తయితే ఆఫీసరు అవుతాడు. చెల్లెలి పెళ్ళి వాడే చేస్తాడు" అన్నాడు గుర్నాథం.

పేరయ్య గాలి దుమారంలా దూసుకొచ్చాడు.

"రా! అన్నయ్యా!" శాంతమ్మ ఆహ్వానించింది.

పేరయ్య శాంతమ్మకు బంధువు. అన్న వరస అవుతాడు.

"రిటైర్ అయ్యావంటగా!" అడిగాడు పేరయ్య.

"అవును!"

"గ్రాట్యూటీ, ప్రావిడెంటు ఫండూ వచ్చాయా?"

"వస్తాయి కొన్ని నెలల్లో."

"ఇంకేం? ఆ డబ్బు రాగానే చంద్రానికీ, లక్ష్మికీ పెళ్ళిళ్ళు చేసెయ్!"

"వాడి పెళ్ళికి ఇప్పుడప్పుడే ఏం తొందర?.... వాడి చదువు పూర్తి కావాలి" అన్నాడు గుర్నాథం చిరునవ్వుతో.

"ఇంకా ఏం చదువు? ఏదో ఉద్యోగం చూసుకో మనక?" అన్నాడు పేరయ్య.

"పి. యు. సి. చదివిన వాడికి ఉద్యోగం ఏమొస్తుంది?"

"నువ్వు చదివింది మెట్రిక్యులేషనేగా? వాణ్ణీ ఏదో ఆఫీసులో వేయించు."

"వాడిచేత గుమస్తా గిరి చేయించమంటావా? నా వారసత్వం వాడికి ఇవ్వమంటావా?" బాధగా అన్నాడు గుర్నాథం.

"లేకపోతే ఏం చేస్తావయ్యా? ఏం పెట్టి చదివిస్తావ్ పెద్ద చదువులు?" విసురుగా అన్నాడు పేరయ్య.

శాంతమ్మ పేరయ్య ముఖంలోకి దిగులుగా చూసింది.

"ఎలాగయినా వాణ్ణి చదివిస్తాను. వాడు నాలా బానిస బతుకు బతక్కూడదు. మా చంద్రం తెలివైన వాడు."

"ఇంకేం, చదివించు. ఉన్నాయ్‌గా మడులూ మాణ్యాలూ! అమ్మి చదివించు!" అన్నాడు పేరయ్య వ్యంగ్యంగా.

"చూస్తుండు చదివిస్తానో లేదో!" రోషంగా అన్నాడు గుర్నాథం.

"చదివించు! చదివించు!.... " అంటూ పేరయ్య లేచి రుసరుసలాడుతూ వెళ్ళిపోయాడు.

పేరయ్య గడపలో నుంచే "కాంతం! కాంతం!" అంటూ కేకలు పెట్టాడు.

కాంతమ్మ వంటింట్లో నుంచి వచ్చింది.

"ఆ కొయ్య పెట్లో వున్న దస్త్రం ఇట్లా పట్టుకురా!"

"అమ్మాయ్ సరసూ! ఆ కొయ్య పెట్లో వున్న దస్త్రం తెచ్చి నాన్న కివ్వమ్మా!" కాంతమ్మ కూతిరికి పురమాయించింది.

సరస్వతి పాత గుడ్డలో చుట్టి వున్న దస్తా వేజులు తెచ్చి తండ్రి ముందు పెట్టింది.

పేరయ్య కంటే ముందే వచ్చి, వసారాలో అరుగుమీద కూర్చుని వున్న ఆసామి సరస్వతిని ఎగా దిగా చూశాడు.

"ఏం పేరయ్యా! లగ్నాలు పెట్టుకున్నారా?" ఆ ఆసామి అడిగాడు సరస్వతి మీదనుంచి చూపులు మరల్చకుండానే.

సరస్వతి సిగ్గు పడుతూ లోపలకు వెళ్ళిపోయింది.

"ఏదీ! నీ బేరం తేల్తే నాలుగు రాళ్ళు రాల్తాయ్! పెళ్ళి ఖర్చుల కైనా వస్తాయ్ అనుకుంటే నువ్వేమో బేరం కుదర నివ్వవాయె! లిటిగేషన్ తగిలించి నానుస్తున్నావు మరి!...." అన్నాడు పేరయ్య దస్త్రం విప్పి దస్తావేజులు బయటికి తీస్తూ.

"చూడు పేరయ్యా! ఎలాగైనా ఆ ఇళ్ళస్థలం బేరం ఖాయం చెయ్యి." ప్రాధేయ పూర్వకంగా అన్నాడు ఆ ఆసామి.

"నేను ఏనాడో ఖాయం చేశాను. నువ్వే నానుస్తున్నావ్."

"గజం పన్నెండు రూపాయలు మరీ ఎక్కువ. పదికి దిగమని అడుగు."

"అసలు అతను పద్నానుగు కంటే కిందికి దిగి రానన్నాడు. కిందా పైనా పెట్టి పన్నెండుకి ఖాయం చేశాను. మళ్ళీ నువ్వు పది అంటూ నానుస్తున్నావ్. ఇంతకంటే నేనేం చెయ్యలేను. ఆ తర్వాత నీ ఇష్టం!"

"మరీ అట్లా బిగిసిపోకు! పదకొండుకు దిగుతాడేమో చూడు. నేను మళ్ళీ రేపొస్తాను" అంటూ ఆసామి వెళ్ళిపోయాడు.

సరస్వతి ముఖం చూసి కాంతమ్మ సంతోషంగా భర్త దగ్గిరకు వచ్చి "ఆయన ఒప్పుకున్నాడా?" అన్నది.

పేరయ్య భార్య ముఖంలోకి గర్వంగా చూశాడు. చిరునవ్వు నవ్వాడు.

"ఒప్పుకోవడమా? కాళ్ళా వేళ్ళా పడితే ఒప్పుకున్నాడు. ఒక పట్టాన దిగి వచ్చాడా?...." దస్తావేజులు మూట కడ్తూ అన్నాడు పేరయ్య.

"రత్నం లాంటి కుర్రాడు. నా తల్లి అదృష్టం!" కాంతమ్మ మురిసిపోతూ అన్నది.

పేరయ్య ఉంగిడి పడ్డ గొడ్డులా భార్య మొహంలోకి చూశాడు.

"నేను చెప్పేది పిల్ల బేరం గురించి కాదే – స్థలం బేరం!" అన్నాడు.

"బాగానే వుంది సంబడం! ఇంతకూ పిల్ల విషయం ఏం చేశారు?"

"అదీ మాట్లాడాను. గుర్నాధం ఏదో నసుకుతున్నాడు... నువ్వేం దిగులు పడకు. చూస్తాగా – ఈ పేరయ్యను కాదని ఎక్కడ కెల్తాడో?"

కాంతమ్మ ఉత్సాహం నీరుకారి పోయింది.

"ఊ! పద! పద! భోజనం వడ్డించు! అవతల బోల్డంత వ్యవహారం వుంది. ఈ ఆసామి ఆ పెద్దమనిషిని కలుసుకొనే లోపలే మనం అతన్ని మడతలో చుట్టాలి." తొందర పెట్టాడు పేరయ్య.

"అమ్మాయి పెళ్ళి సంగతి ఏమైందో చెప్పరేం?"

"నీ నస పాడుగానూ! చెప్పానుగదే! ముందు అన్నం పెట్టు! అవతల వ్యవహారం చెడిపోతుంది ఆలస్యం అయితే!" విసుక్కున్నాడు పేరయ్య.

కాంతమ్మ సణుక్కుంటూ వంటింట్లోకి వెళ్ళింది.

భార్య వెనకే వెళ్ళాడు పేరయ్య వ్యవహారం గురించి ఆలోచిస్తూ.

# 7

గుర్నాథం చేతినిండా ప్యాకెట్లతో ఇంట్లోకి వచ్చాడు.

"ఇదుగో! నిన్నే! ఎక్కడున్నావ్?" భార్యను పిల్చాడు.

"ఏమిటో చాలా తెచ్చినట్టున్నారు. డబ్బెక్కడిదీ?" అడిగింది శాంతమ్మ ఆశ్చర్యంగా.

"ప్రావిడెంటు ఫండో! ప్రావిడెంటుఫండో అన్నావుగదే! అది ఇవ్వాళే చేతికొచ్చింది."

సామాన్లు భార్యకు అందించాడు గుర్నాథం.

శాంతమ్మ సామాన్లు అందుకుంటూ "ఎంతొచ్చిందండీ!" అన్నది సంతోషంగా.

"నా జీవితంలో నేను చెయ్యగలిగిందీ, మీకు ఇవ్వగలిగిందీ ఇదేనే!" తన ధోరణిలో అన్నాడు గుర్నాథం.

శాంతమ్మ మనసు చివుక్కుమంది.

"అమ్మాయెక్కడా?" అడిగాడు గుర్నాథం.

"పనేముందీ? పత్రికలు ముందేసుకు కూర్చుంది" అని, "అమ్మాయ్ లక్ష్మీ! నాన్న పిలుస్తున్నారే!" కూతుర్ని కేకవేసింది.

పడకగదిలో, పాతకాలపు పందిరిమంచంమీద కూర్చుని పాత పత్రికల పఠనంలో మునిగిపోయివున్న లక్ష్మి తల్లి పిలుపు వినిపించుకోలేదు.

"నిన్నేనే పిలుస్తుంది! పలకవేం?" గట్టిగా కేకపెట్టింది శాంతమ్మ.

అయినా, ఒక పట్టాన మంచం దిగలేదు లక్ష్మి. పత్రికల్లో నుంచి తల ఎత్తలేదు.

మూడో కేకకు విసుగ్గా మంచంమీద నుంచి దూకింది. అతుకులు వేసివున్న పరికిణీ సర్దుకుంటూ, మరో చేత్తో పాత వారపత్రిక పట్టుకొని, గారాలుపోతూ, విసుక్కుంటూ, తపతపా అడుగులువేస్తూ వచ్చిన లక్ష్మి ముఖం, తల్లిదండ్రుల మధ్యవున్న ప్యాకెట్లను చూసి విప్పారింది.

గుర్నాథం కూతుర్ని నిండారా చూసుకుంటూ ఒక ప్యాకెట్ అందించాడు.

లక్ష్మి ఉత్సాహంగా అందుకొని ప్యాకెట్ విప్పి చూసింది. కళ్ళు మిలమిల లాడాయి.

జరీ అంచు ముదురాకు పచ్చ పట్టు పరికిణీ, లేతాకుపచ్చ జార్జెట్ ఓణీ, తెల్ల పట్టు జాకెట్, తను ఎన్నో రోజులుగా అడుగుతున్న బట్టలు నాన్న తెచ్చాడు.

లక్ష్మి వాటిని చేతుల్లోకి తీసుకుంది. వాటి మెత్తదనం తాలూకు అనుభూతి హృదయం అంచుల్ని తాకుతూ వుంటే పరవశించి పోయింది.

ఆనందోద్రేకంతో తండ్రిని కౌగలించుకుంది.

"పిచ్చితల్లి!" గుర్నాథం కూతురి తల నిమురుతూ ఆర్ద్రంగా అన్నాడు.

అంతవరకూ కళ్ళప్పగించి తండ్రి కూతుళ్ళను చూస్తున్న శాంతమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి.

లక్ష్మి బట్టలు మడతలు విప్పి చూసుకుంటూ వుండగా చంద్రం లోపలకు వచ్చాడు.

లక్ష్మినీ, లక్ష్మి చేతుల్లోవున్న బట్టల్నీ, తల్లికి ఎదురుగా వున్న ప్యాకెట్లనూ ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు.

"ఎలా వున్నాయ్‌రా అన్నయ్యా?" లక్ష్మి బట్టలు చూపిస్తూ అడిగింది.

"బాగానే వున్నాయ్! కాని...."

"ఇలా రా బాబూ!" తండ్రి కొడుకుని దగ్గరకు పిల్చాడు.

"ఇదుగో బాబూ!" గుర్నాథం కొడుక్కు కొత్తకలం అందించాడు.

చంద్రం ఉత్సాహంగా పెన్ అందుకున్నాడు. పెన్నుమీద వున్న పేరు చదివి తండ్రి ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

"బంగారం పెన్నే?" శాంతమ్మ ఆశ్చర్యపోతూ అన్నది.

"బంగారం కాకపోయినా పాతిక రూపాయలదాకా అయింది" అన్నాడు గుర్నాథం.

"ఇప్పుడింత పెట్టి ఇది కొనకపోతేనేం? మీ పెన్నుందిగా? మీకు దాంతో ఇక పనికూడా లేదాయె!" అన్నది శాంతమ్మ.

గుర్నాథం కళ్ళలో నీడలు పారుకాడాయి.

"నా పెన్నా? బానిసత్వానికి చిహ్నం అయిన నా పెన్ – ఏనాడూ స్వాతంత్ర్యం అంటే ఎలా వుంటుందో ఎరగని నా పెన్. ఆత్మాభిమానం అంటే ఏమిటో ఎరగని నా పెన్ – వాడికి నా వారసత్వంగా ఇవ్వలేనే? వాడు బాగా చదివి పెద్ద ఆఫీసరవుతాడు, నాలాగా వాడు ఆత్మను చంపుకొని బతకక్కూడదు." అవేదనతో అన్నాడు గుర్నాథం.

ఒక్కక్షణం ఆగి మళ్ళీ అన్నాడు –

"నా కొడుకు పెద్ద చదువులు చదివి, పై అంతస్థులకు పాకి, పదిమందిచేత గౌరవించబడాలి. నా కొడుక్కు నా వారసత్వం రాకూడదు. రాదు. వాడు పదిమందిని పోషించగలడు."

తండ్రిమాటలు వింటూ నిల్చున్న చంద్రం చేతిలో కలం బిగిసిపోయింది. ముఖంలో ఏదో నిర్ణయం కన్పించింది. వడివడిగా లోపలకు వెళ్ళిపోయాడు.

అలా వెళ్ళిపోతున్న కొడుకుని చూస్తున్న గుర్నాథం కళ్ళల్లో వెలుగులు కదిలాయి.

"ఇది నీకు," అంటూ ఓ ప్యాకెట్ భార్యకు అందించాడు.

శాంతమ్మ ప్యాకెట్ విప్పింది. ప్యాకెట్‌లో కంచి పట్టుచీర చూసి నిర్ఘాంతపోయింది.

భార్య ముఖంలో సంతోషం చూడాలని ఆశించిన గుర్నాథానికి నిరాశే కలిగింది.

"ఏమిటే అట్లా చూస్తావ్? నచ్చలేదా?"

"ఇప్పుడు నా కెందుకీ చీర?"

"ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడు తెస్తానే? నువ్వు కాపరానికి వచ్చిన కొత్తలో కంచి పట్టుచీర కావాలని ఎన్నోసార్లు అడిగావు. ఆ విషయం నువ్వు మర్చిపోయావు. కాని నేను మర్చిపోలేదు. పాతిక సంవత్సరాల కాలంలో ఒక పట్టుచీర పెళ్ళానికి కొనలేని నా అసమర్థతను నేను మర్చిపోలేదు." గుర్నాథం గొంతుకు ఏదో అడ్డుపడింది.

శాంతమ్మ విస్మయంగా భర్త ముఖంలోకి చూసింది.

"ప్రావిడెంటు ఫండ్‌లో అప్పులు పోగా మిగిలిన డబ్బుతో ఈ వస్తువులు కొన్నాను. ఇవిగో తీసుకో. ఇంకా కొద్దిగా డబ్బు మిగిలింది." అంటూ భార్య చేతికి కొంత డబ్బు అందించాడు.

శాంతమ్మ గుండెల్లో గుబులు ముసురుకుంది.

మూడో ప్యాకెట్ విప్పింది. అందులో చంద్రానికి బట్టలు వున్నాయ్.

"అయ్యో! మీకు పంచెలు తెచ్చుకోలేదేమండీ?"

"నాకెందుకే, ఇంట్లో పడి వుండేవాడికి? ఏది కట్టుకున్నా తెల్లారిపోతుంది. నేను కూడా తెచ్చుకుంటే, ఇంతకాలంగా నిన్ను ఊరిస్తున్న ఆ ప్రావిడెంటు ఫండు తాలూకు డబ్బు ఆ మాత్రం కూడా నీ చేతికి వచ్చేది కాదు" అన్నాడు.

శాంతమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి.

"పింఛనూ. ప్రావిడంటు ఫండూ కాక ఇంకేదో వస్తుందన్నారు. అదెప్పుడు వస్తుందండీ?" ఎంతకాలం ఈ డబ్బుతో ఇల్లు గడుస్తుందన్నట్టు చూస్తూ అడిగింది శాంతమ్మ.

"గ్రాట్యూటీయా? వస్తుంది. కాని, ఇంకా కొంతకాలం పడ్తుంది. కాగితాలు కదలాలి. పెన్‌షన్ రావడానికికూడా కొన్ని నెలలు పట్టొచ్చు" అన్నాడు గుర్నాథం.

చేతిలో బట్టల ప్యాకెట్ పట్టుకొని పరుగులుతీస్తూ బయటికి వెళ్ళింది లక్ష్మి.

"ఎక్కడికే అమ్మాయ్ వెళ్తుందీ?" కూతురు వెళ్ళిన వైపు చూస్తూ అడిగాడు గుర్నాథం.

"పక్కింటికి. పరమశివంగారి అమ్మాయికి తన బట్టలు చూపించడానికి వెళ్ళింది. పిచ్చిపిల్ల!" శాంతమ్మ అన్నది.

# 8

పరమశివం లక్షాధికారి. వ్యాపారస్థుడు, అతని కూతురు వనజ లక్ష్మికి స్నేహితురాలు.

వనజ తమ్ముడు మురళికి లక్ష్మి దగ్గిర మాలిమి. లక్ష్మికి కూడా వాడంటే ప్రాణం.

రికార్డ్ మ్యూజిక్ వింటూ కూర్చున్న వనజ లక్ష్మిని కూర్చోమని సైగ చేసింది.

"ఆ చేతిలో ప్యాకెట్ ఏమిటి?" అని వనజ అడుగుతుందని ఆశించింది లక్ష్మి.

వనజ అడగ లేదు. లక్ష్మి మనసు చివుక్కుమంది.

మురళి వచ్చాడు. లక్ష్మి మురళిని దగ్గరకు తీసుకుంది.

"ఇందులో ఏముందో చెప్పుకో చూద్దాం!" అన్నది లక్ష్మి వనజకేసి చూస్తూ.

వనజ తిరిగిచూడలేదు. మ్యూజిక్ శ్రద్ధగా వింటూవుంది.

"అందులో.... మిఠాయిలూ...." అంటూ మురళి ప్యాకెట్ అందుకో బోయాడు.

"కాదు, ఓడిపోయావ్. ఇంత పెద్ద ప్యాకెట్లో ఎక్కడన్నా మిఠాయిలుంటాయేమిటి? వనజ వినాలని పెద్దగా అన్నది లక్ష్మి.

అయినా వనజ పట్టించుకోలేదు.

లక్ష్మికి వనజమీద కోపం వచ్చింది.

"వట్టి కుళ్ళుబుద్ధి" అనుకుంది.

"అయితే, బిస్కట్లూ!" అన్నాడు ఆ రహస్యమేదో తనకు తెలిసిపోయినట్టు ముఖంపెట్టి.

"కాదు."

"ఏంటో నువ్వే చెప్పు."

"నేను చెప్పను నువ్వే కనుక్కోవాలి."

వనజ వెనక్కు తిరిగి చూసింది.

"ఏమిటోయ్ ఆ ప్యాకెట్టూ?" పెద్ద కుతూహలం లేదు ఆమె ప్రశ్నలో.

అయినా లక్ష్మి ముఖం విప్పారింది.

"బట్టలు. నీకు చూపించాలనే తెచ్చాను." ఉత్సాహంగా అది లక్ష్మి.

వనజ ప్యాకెట్‌విప్పి ఖరీదైన బట్టలు చూసి ఆశ్చర్యపోయింది.

"బాగున్నాయా?"

"చాలా బాగున్నయ్. ఎవరు తెచ్చారూ?"

"మా నాన్న!"

అప్పుడే గదిలోకి వచ్చిన కృష్ణ జారిపోయిన లక్ష్మి ఓణీకేసి చూస్తూ "నువ్వు ఫ్రాక్ వేసుకుంటే చాలా బాగుంటావ్!" అన్నాడు.

లక్ష్మి బుగ్గలు జేవురించాయ్ సిగ్గుపడిపోయిది.

"ఏమిటి విశేషం? ఇవ్వాళ మెరిసిపోతున్నాయ్?" అన్నాడు కృష్ణ లక్ష్మి ముఖంలోకి చూస్తూ.

లక్ష్మి వనజ చేతుల్లో వున్న బట్టలకేసి సాభిప్రాయంగా చూసింది.

"అదా సంగతి? కొత్తబట్టలు కొనుక్కున్నావన్న మాట! చాలా బాగున్నాయ్!" అన్నాడు కృష్ణ

"నిజంగా బాగున్నాయా?" కళ్ళు మిలమిల లాడిస్తూ అడిగింది లక్ష్మి.

"చాలా బాగున్నాయ్. నువ్వు కుట్టుకుంటే ఇంకా బాగుంటాయ్!"

లక్ష్మి మనసు ఉప్పొంగిపోయింది.

"కుట్టించుకోలేదేం?" వనజ అడిగింది.

"నాన్న ఇప్పుడే కొనుక్కొచ్చారు." బట్టలు ప్యాక్ చేసుకుంటూ అన్నది లక్ష్మి.

# 9

తొలకరి వానలు ప్రారంభం అయాయి.

గుర్నాథం నులకమంచం పట్టెమీద కూర్చొని, ముందుకు వంగి, చేతులు మోకాళ్ళమీద ఆనించి, ఆయాసపడ్తున్నాడు. శాంతమ్మ వక్కలు రాస్తున్నది.

లక్ష్మి ఉత్సాహంగా "నాన్నా! నాన్నా!" అంటూ పరుగెత్తుకొచ్చింది.

గుర్నాథం అతి కష్టంమీద కూతురి ముఖంలోకి చూశాడు. లోతుకుపోయిన అతని కళ్ళలో మృత్యువు పరచిన నీడలు కదులుతున్నాయ్ కళ్ళకింద చర్మం ఎండిపోయిన చెట్టు బెరడులా వుంది.

"అన్నయ్య పాసయ్యాడు నాన్నా!"

గుర్నాథంలో ఉబికిన సంతోషాన్ని దగ్గుతెర వెనక్కు నెట్టింది. ఉక్కిరి బిక్కిరై పోయాడు.

చేత్తో పేపరు పట్టుకొనివచ్చి చంద్రం తండ్రిముందు వినయంగా నిల్చున్నాడు.

"క్లాసు వచ్చిందా?" తలఎత్తకుండానే ఆయాసపడ్తూ అడిగాడు గుర్నాథం.

"ఆc- ఫస్ట్‌రాంక్ వచ్చింది నాన్నా!" అన్నాడు చంద్రం ఉత్సాహంగా.

శాంతమ్మ కళ్ళనుంచి ఆనందబాష్పాలు దొర్లాయి.

గుర్నాథం తలెత్తి కొడుకుని నిండారా చూసుకున్నాడు. కళ్ళలో నీరు తిరిగింది.

"మంచిది నాయనా! ఏదన్నా ఉద్యోగం చూసుకో" అంటూ వుండగా మళ్ళీ దగ్గుతెర వచ్చింది.

చంద్రం నెత్తిమీద పిడుగు పడింది. స్తంభించిపోయి నిల్చున్నాడు.

ఆ భయంకరమైన నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ, గుండెలు అవిసిపోయేలా గుర్నాథం "ఖళ్ళు ఖళ్ళు"న దగ్గుతూ ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు.

చంద్రం తేరుకుని తండ్రివీపు రాస్తూ నిల్చున్నాడు.

శాంతమ్మ మట్టిబొచ్చలో బూడిదవేసి తెచ్చి మంచం పక్కగా పెట్టింది.

గుర్నాథం ఖళ్ళు ఖళ్ళున దగ్గి, కఫం తెంచుకొని బూడిదలో ఊశాడు.

కఫంతో పాటుపడ్డ ఎర్రజీర చూసి "అయ్యో! రక్తంకూడా పడుతుంది." దాదాపు ఏడుస్తూనే అన్నది శాంతమ్మ.

గుర్నాథం తేరుకున్నాడు.

"నాన్నా!"

"ఏం బాబూ!" కొడుకు ఏం చెప్పాలనుకుంటున్నాడో అర్థం అయింది గుర్నాథానికి.

"మా ప్రిన్స్‌పాల్ నన్నెంతో పొగడేశారు. కాలేజీకే పేరు తెస్తానన్నారు నాన్నా!"

"మా నాయనే!" అంటూ శాంతమ్మ మురిసిపోయింది.

గుర్నాథం ఆలోచనలో పడ్డాడు.

"మా ప్రిన్స్‌పాల్ నన్ను ఇంజనీరింగు చదవమన్నాడు నాన్నా! బాగా పేరు సంపాదించుకుంటావన్నాడు."

గుర్నాథం కళ్ళల్లో విశ్వేశ్వరయ్య బొమ్మ కదిలింది.

పెద్ద పెద్ద ఆనకట్టలూ, ప్రభుత్వ భవనాలూ సూపర్ వైజ్ చేస్తూ చంద్రం కన్పించాడు.

దగ్గుతెర వచ్చింది. ఆకాశంలో రెక్కలు విప్పుకొని ఎగురుతున్న గుర్నాథం తను కూర్చుంది కుక్కి నులకమంచం అని తెలుసుకున్నాడు.

కొడుకు ముఖంలోకి చూశాడు.

"దిగులుపడకు బాబూ! అప్లికేషన్ తెప్పించుకో" అన్నాడు గుర్నాథం.

చంద్రం ముఖం వికసించింది. సంతోషంగా బయటికి వెళ్ళాడు.

క్షణాలమీద కొడుకు ఇంజనీర్ అయినట్టే మురిసిపోయింది శాంతమ్మ.

"అబ్బాయ్ ఇంజనీరైతే జీతం ఎంతొస్తుందండీ?"

"జీతమా? బాగానే వుంటుంది."

యల్. డి. సీ., యూ. డీ. సీ స్కేల్సును నిముషాల్లో చెప్పగల గుర్నాథానికి ఇంజనీర్ల, స్కేల్సు గురించి తెలియదు.

"పైన చాలా ముడుతుందనుకుంటానూ?" శాంతమ్మ అడిగింది.

"ఛ! ఛ! అవేం మాటలే? అబ్బాయి లంచాలు పడ్తాడా? వాడు నా కొడుకే! నీతిగా, నిజాయితీగా వుండి గొప్ప పేరు తెచ్చుకుంటాడు!" కలల్లో కరిగిపోతూ అన్నాడు గుర్నాథం.

అక్కడే నిల్చుని తల్లిదండ్రులు సంభాషణలు వింటున్న లక్ష్మి తన అన్న ఇంజనీరు అయిపోయినట్టే భావించింది.

అన్నయ్య ఇంజనీరు అవుతాడు. బోల్డంత జీతం. తనుకూడా వనజలా మంచి బట్టలు వేసుకోవచ్చు. తనను అందరూ ఇంజనీరుగారి చెల్లెలు అంటారు! తనకేగదా డబ్బుందని ఆ వనజకు మహా టెంపర్ ఈ శుభవార్త వనజకు చెప్పాలి. అమ్మాయి ముఖం ఎలా వుంటుందో చూడాలి.

ఆ వార్త వనజ చెవిలో వెయ్యడానికి లక్ష్మి బయటికి పరుగు తీసింది.

అంతా విని "బాగానే వుంది కాని, ఏం పెట్టి చదివిస్తావయ్యా?" అన్నాడు పేరయ్య.

గాలిలో ఎగురుతున్న గుర్నాథం దంపతులు ఒక్కసారిగా నేలమీద పడ్డారు.

"ఇల్లు అమ్మేస్తాను!" అన్నాడు గుర్నాథం.

శాంతమ్మ తృళ్ళిపడి భర్త ముఖంలోకి చూసింది.

"అమ్మేయ్! అమ్మేసి పెళ్ళికావల్సిన ఆడపిల్లనూ పెళ్ళాన్నీ నడి బజార్లో నిల్చోబెట్టు."

ఉలిక్కిపడ్డాడు గుర్నాథం. "బావా!" అన్నాడు దెబ్బతిన్నట్టు.

"లేకపోతే ఏంటయ్యా! ఇల్లు అమ్ముతావ్ – బాగానే వుంది. ఈ బోడి ఇంటిమీద మహావస్తే ఎంత వస్తుంది? దాంతోనే ఇంజనీరింగ్ అయిపోతుందనుకుంటున్నావా?

మనం వెనకబడిన తరగతులవాళ్ళంకూడా కాదు - స్కాలర్‌షిప్ వగైరా వస్తాయనుకోడానికి!"

గుర్నాథం కళ్ళముందు వాస్తవం వచ్చి నిల్చుంది. వెక్కిరిస్తోంది. విరగబడి నవ్వుతోంది. పిచ్చిగా నవ్వుతూ వుంది.

మరోమాట మాట్లాడకుండా, కుక్కి మంచంలో పడుకొని కళ్ళు మూసుకున్నాడు గుర్నాథం.

పేరయ్య గొణుక్కుంటూ అంగలు పంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

శాంతమ్మ దిగులుగా గోడకు చేరబడింది.

# 10

"చూస్తానుగా, ఇంజనీర్‌గా చేస్తాడట - ఇంజనీర్! పొట్టకూటికి గతిలేదు ఇంజనీరింగు చదివిస్తాట్ట!" తనలో తనే అరుచుకుంటూ వచ్చిన పేరయ్య దెబ్బతిన్న పులిలా వసారాలో కూర్చున్నాడు.

"నాన్నగారు వచ్చినట్టున్నారు. నువ్వేం దిగులు పడకు. పని సాధించుకొనే వచ్చివుంటారు" అన్నది కాంతమ్మ కూతురు సరస్వతితో. కూతుర్ని ఓదార్చి భర్త దగ్గిరకు వచ్చింది.

భర్త వాలకం చూసి గతుక్కు మంది.

"అసలు మీ అమ్మా కూతుళ్ళకు బుద్ధిలేదు." ఎదురుగా నిల్చున్న భార్యమీద విరుచుకు పడ్డాడు పేరయ్య.

"భాగానే వుంది సంబడం! మమ్మల్నంటారేం?" కాంతమ్మ సాగదీసింది.

"లేకపోతే ఏంటే! బోడి సంబంధం! ఆ మాత్రం దొరకనట్టు నా ప్రాణాలు తీస్తున్నారు."

"ఇంతకూ ఏం జరిగిందో చెప్పరాదూ?"

"ఇంజనీరింగ్ చదివిస్తాడట! కొడుక్కు ఇప్పుడప్పుడే పెళ్ళి చెయ్యడట."

"నిజంగా?" అల్లుడు ఇంజనీరు అవుతాడని సంబరం పడిపోతూ అన్నది కాంతమ్మ.

"ఏమిటేవ్, అంత పొంగి పోతున్నావ్?"

"అల్లుడు ఇంజనీరవుతాడంటే మీకు మాత్రం సంతోషంగా లేదూ - ఏదో పైకి 'ధూంధాం' అంటారు గానీ..."

"నీ తెలివి తెల్లారినట్టే వుంది. వాడు ఇంజనీరైతే నీ కూతుర్ని చేసుకుంటాడా ఏం?"

"ఎందుకు చేసుకోడూ? అది పుట్టిన రోజునుంచే వాడి పెళ్ళాం అనుకుంటున్నాం కదండీ!"

"ఓసి పిచ్చిదానా! వాడు ఇంజనీరైతే లక్షలు కట్నంగా ఇచ్చి పిల్లనిస్తారే! వాళ్ళు ఇప్పుడే చెట్టెక్కి కూర్చున్నట్టు మాట్లాడుతున్నారు."

"ముందే పెళ్ళి చేసేస్తే?"

"కొడుకు ఇంజనీరు అయిందాకా పెళ్ళి చెయ్యడట గుర్నాథం!" కసిగా అన్నాడు పేరయ్య.

"మరి ఎలాగండీ?" దిగులుగా అడిగింది కాంతమ్మ.

"చూస్తాండు. అంతకంటే మంచి సంబంధం తెస్తాను."

"అదికాదు... అమ్మాయ్..." సందేహించింది చెప్పడానికి కాంతమ్మ.

"ఊc- అమ్మాయ్? ఏమిటి?" గాండ్రు మన్నాడు పేరయ్య.

"అమ్మాయి చంద్రాన్నే చేసుకుంటా నంటుంది."

"అంటుంది అంటుంది! పిచ్చివాగుడు మాని మూల కూర్చోండి." పేరయ్య కస్సున లేచాడు.

కాంతమ్మ కిక్కురు మనకుండా లోపలకు వెళ్ళిపోయింది.

అంతవరకూ తలుపుచాటున నిల్చుని తల్లిదండ్రుల సంభాషణ వింటున్న సరస్వతికి దుఃఖం పొర్లు కొచ్చింది.

చంద్రం బావ ఇంజనీరు అయినా కాకపోయినా తనను కాదనడు. మాట్లాడడు కాని తనంటే ప్రేమే! చంద్రం బావే తన భర్త!

మనసులో పదే పదే అనుకుంది సరస్వతి.

# 11

గడపలో కూర్చుని నవల చదువుకుంటున్న సరస్వతి లోపలకు వచ్చిన చంద్రాన్ని చూసి తుర్రున పారిపోయింది.

"అమ్మా! అమ్మా! బావ వచ్చాడే?" గాభరాపడి పోతూ తల్లితో చెప్పింది.

కాంతమ్మ గబ గబా బయటికి వచ్చింది.

"రా బాబూ! రా! కూర్చో!" ఆప్యాయంగా ఆహ్వానించింది.

"మామయ్య లేడా?" కూర్చుంటూ అడిగాడు చంద్రం.

అప్పుడే భోజనంచేసి, వక్క పలుకు నములుతూ బయటికి వచ్చాడు పేరయ్య.

"నువ్వు నా దగ్గిరకు రాక ఎక్కడికి పోతావురా!" అన్నట్టు చంద్రాన్ని చూస్తూ నవ్వాడు.

"ఏరా చంద్రం, ఇంజనీరింగు చదువుతా నంటున్నావట?"

"అవును మామయ్యా!"

"అప్లికేషన్ పెట్టావా?"

"ఇంకా లేదు." ముక్తసరిగా అన్నాడు చంద్రం.

"ఏదో పనిమీద వచ్చినట్టున్నావ్?"

"నాన్న నీ దగ్గిరకెళ్ళి ఓ ఇరవై రూపాయలు తెమ్మన్నాడు. పెన్షన్ రాగానే ఇస్తాడట." అభిమానపడుతూ అన్నాడు చంద్రం.

"ఏమిటోయ్, ప్రతిదానికి పెన్‌షెన్ వచ్చాక అంటాడు మీ నాన్న? ఇప్పటికే నాలుగైదు వందలు ఇవ్వాలి. కొంపదీసి అప్లికేషన్ కూడా పెన్షన్‌వచ్చాక పెట్టమంటున్నాడా?" ఎగతాళిగా అడిగాడు పేరయ్య.

చంద్రానికి తలకొట్టేసి నట్టయింది. ఏం చెప్పాలో తెలియ లేదు.

"చూడు చంద్రం! మీ నాన్న మతి సరిగా లేదు. నువ్వు తెలివైనవాడివి. మీ నాన్న నిన్ను ఇంజనీరుగా చూడాలని ఆశ పడ్తున్నాడు. కలలు కంటున్నాడు. నేల విడిచిన సాము చెయ్యాలని చూస్తున్నాడు. నువ్వైనా వాస్తవం తెలుసుకో. ఇరవై రూపాయలు అప్పు తీసుకొని పెన్‌షెన్‌వస్తే గాని తీర్చలేనివాడు కొడుకుని ఇంజనీరింగ్ ఏం పెట్టి చదివిస్తాడు? నువ్వైనా గాలిలో నిలబడటానికి ప్రయత్నించక, నేలమీద కాళ్ళు నిలదొక్కు కోవడానికి ప్రయత్నించు," అంటూ చంద్రం ముఖంలోకి చూశాడు పేరయ్య.

చంద్రం ముఖం వెలవెలా పోతూంది.

మళ్ళీ అందుకున్నాడు పేరయ్య – "ఇంజనీరింగు చదవడం మాటలా? మీ నాన్న ఎక్కడ్నుంచి తెచ్చి చదివిస్తాడను కుంటున్నావ్? ఇల్లు అమ్ముతా నంటున్నాడు. ఆ ఇంటిమీద ఎంత వస్తుంది? ఆరేళ్ళు ఇంజనీరింగు చదివాక ఉద్యోగం వస్తుందనే గ్యారంటీ ఏమిటి? రోజూ వినడంలేదూ... ఇంజనీర్లు ఉద్యోగాలు లేక ఆఫీసుల చుట్టూ తిరుగు తున్నారని? ఉన్న కొంప కాస్తా అమ్మేసి ఆ నీడకూడా లేకుండా చేస్తావా? చెల్లెలి పెళ్ళి ఎప్పుడు చేస్తావ్? నువ్వు ఇంజనీరు అయ్యాకా?" అని ఆగి, చంద్రం ముఖంలోకి చూస్తూ మళ్ళీ అన్నాడు" పిచ్చి ఊహలు వదిలేసి ఏదో ఉద్యోగం చూసుకో. నాలుగు రాళ్ళు సంపాదించి కుటుంబాన్ని ఆదుకో."

చంద్రం అభిమానం దెబ్బ తిన్నది.

లేచి నిల్చున్నాడు.

డబ్బు ఇస్తానంటాడేమోనని ఓ క్షణం నిల్చున్నాడు. మళ్ళీ నోరు తెరిచి అడగాలని పించలేదు.

"ఇప్పుడు నా దగ్గిర అంత డబ్బులేదు. కావాలంటే ఈ ఐదు రూపాయలూ తీసుకెళ్ళు." అంటూ ఐదురూపాయల నోటు ఇవ్వబోయాడు పేరయ్య.

"వద్దులే మామయ్యా! ఇంకెక్కడైనా తీసుకుంటాలే" అంటూ నోటు అందుకోకుండానే విస విసా నడిచి వెళ్ళిపోయాడు.

చంద్రం మనసు కలత చెందింది.

పేరయ్య మాటలు చెవుల్లో వినిపిస్తున్నాయి.

ఇంటికి వచ్చిన చంద్రం కాళ్ళు గడపలోనే ఆగిపోయాయి.

"రేపటికి బియ్యం లేవు. పక్కింటి పున్నమ్మగార్ని ఓ పదిరూపాయలు అడిగాను. ఇవ్వాళ శుక్రవారం అన్నది."

తల్లి మాటలు చంద్రం విన్నాడు.

"ఛీ! వెధవ జన్మ" అనుకుంటూ గిర్రున వెనక్కు తిరిగాడు చంద్రం.

నెత్తి మాడుతూవుంది. అడుగులు బరువుగా పడ్తున్నాయ్. చంద్రం తారు రోడ్డుమీద నడుస్తున్నాడు.

చంద్రం కాలేజీమేట్స్ సత్యం, నిత్యానందం స్కూటర్ మీద వెళ్తూ ఆగారు.

"ఒరేయ్ చంద్రం!" కేక వేశాడు నిత్యానందం.

చంద్రం నిలబడ్డాడు.

"కంగ్రాచ్యులేషన్స్! రిజల్ట్సు వచ్చాక ఇదేగా కన్పించడం?" అన్నాడు సత్యం దగ్గరకు వచ్చి.

"థాంక్సు!"

"ఏం చెయ్యాలను కుంటున్నావ్? ఉద్యోగం చూసుకుంటున్నావా?" అడిగాడు నిత్యానందం.

"ఇంజనీరింగు చదవాలను కుంటున్నాను."

ఇద్దరూ చంద్రం ముఖంలోకి తమాషాగా చూశారు.

చంద్రం గతుక్కు మన్నాడు.

"మరి అప్లికేషన్ పెట్టావా? రేపే లాస్ట్‌డేట్ అనుకుంటా!" అన్నాడు నిత్యానందం.

"ఇంకా లేదు. ఓ పది రూపాయలుంటే ఇవ్వండి. అప్లికేషన్ ఫారం తీసుకోవాలి యూనివర్సిటీకి వెళ్ళి" అన్నాడు చంద్రం

"అప్లికేషన్ ఫారానికి డబ్బు లేనివాడివి, ఇంజనీరింగు ఎలా చదువుతావోయ్?" అన్నాడు సత్యం.

చంద్రం నడుంమీద ఈడ్చి తన్నినట్టు అయింది. గట్టి దెబ్బే తగిలింది.

నిత్యానందం జేబులోనుంచి తీసి పది రూపాయల నోటు ఇవ్వబోయాడు. కాని చంద్రం అందుకోకుండా విసురుగా వెళ్ళిపోయాడు.

అందరూ అదే మాట! నిజమే! అప్లికేషన్ ఫారానికి డబ్బులు లేనివాడు ఇంజనీరింగు ఎలా చదువుతాడు? తెల్లవారితే ఇంట్లో బియ్యం లేనివాడు ఇంజనీరింగు ఎలా చదువుతాడు! ఒకరు చెబితేగాని ఆ విషయం తన కెందుకు తెలియడంలేదు.

తనకు తెలియవా తన పరిస్థితులు? తెలుసు! అయినా తను వాస్తవంనుంచి పారిపోవాలని చూస్తున్నాడు. అది మాత్రం తనను విడిచి పెట్టడంలేదు. అడు గడుక్కూ ఎదురుగా వచ్చి నిల్చుంటుంది. ఎంతకాలం దాన్ని గుర్తించనట్టు నటించగలడు – దాన్ని తప్పించుకో గలడు?

చంద్రం మనసంతా కసి కసిగా వుంది. జీవితం మీద కసిగా వుంది. అమ్మ మీద కసి –. నాన్న మీద కసి – తన బీదతనం మీద కసి....

ఓ బిల్డింగ్ ముందు పొడవాటి క్యూ చూసి చంద్రం ఆగి పోయాడు.

బోర్డు చూశాడు.

ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజి. క్యూలో నిల్చున్న వాళ్ళను చూశాడు. అందరూ యువకులే! వాళ్ళకు మాత్రం తనలా చదవాలని ఆశలు లేవూ? ఎందుకుండవూ? కాని, వాళ్ళు తనలా వాస్తవాన్ని గుర్తించని వాళ్ళు కాదు. ఎవరి మొహాల్లోనూ ఉత్సాహం లేదు జీవం లేదు. క్యూలో నిలబడ్డారు. ఉద్యోగాల కోసం క్యూలో నిలబడ్డారు.

చంద్రం యాంత్రికంగా వెళ్ళి క్యూలో నిలబడ్డాడు.

# 12

లక్ష్మి చదివేసిన పాత పత్రికల్ని తిరిగి ఇచ్చెయ్యడానికి వనజ గదిలోకి వచ్చింది.

వనజ కూనిరాగాలు తీస్తూ, నిలువుటద్దం ముందు కూర్చుని ముస్తాబు అవుతూంది.

ఆ రోజు లక్ష్మి చాలా సంతోషంగా వుంది. మనసులోని మాట వనజకు చెప్పాలని వుంది.

"లక్ష్మీ! కాస్త కుచ్చిళ్ళు సరిచెయ్" అన్నది వనజ.

లక్ష్మి వంగి వనజ చీర కుచ్చిళ్ళు సరి చేసింది.

వనజ నిలువుటద్దం ముందు వెనక్కూ, ముందుకూ అడుగులు వేస్తూ చీర కట్టుకోవడం కుదిరిందో లేదో చూసుకుంటూ వుంది.

అన్నయ్య ఇంజనీరైతే తను కూడా ఇలాంటి చీర కొనుక్కోవాలి. ఎంత బాగుందో!

"మల్లెపూలు పెట్టు. లోపలి పాయ తీసి పెట్టు." లక్ష్మి చేతికి పూలచెండు ఇచ్చి వనజ అన్నది.

"మా అన్నయ్య ఇంజనీరు కాబోతున్నాడు - తెలుసా?" వనజ తల్లో పూలు సర్దుతూ అన్నది లక్ష్మి.

"మీ అన్నయ్య ఇంజనీరా?..." ఇంకేదో అడగబోతూ నిత్యానందం లోపలకు రావడం చూసి సిగ్గు పడింది.

"చెప్పూ! ఆగి పోయావేం? మీ అన్నయ్య ఇంజనీరు కాబోతున్నాడా?" వనజను ప్రశ్నించాడు నిత్యానందం.

నిత్యానందం తన వెనకే వచ్చిన కృష్ణను చూడలేదు. పి. యూ. సి. మూడోసారి తప్పి, పాసయిన కృష్ణ గతుక్కుమన్నాడు.

"కాదు - మా అన్నయ్య!" అన్నది లక్ష్మి.

"ఓహో మీ అన్నయ్యా! ఇంజనీరు కాబోతున్నాడా?....." అంటూ అదోలా నవ్వాడు నిత్యానందం.

"అయితే, లక్ష్మి పార్టీ ఇవ్వాలి' అన్నది వనజ.

"అవును, ఇవ్వాల్సిందే!...." ఒకేసారి కృష్ణా, నిత్యానందం అన్నారు.

లక్ష్మి తెల్ల ముఖం వేసింది.

"నేను ఇవ్వాళ ఇచ్చే పార్టీతో లక్ష్మి పార్టీకూడా కలిపేద్దాం!" అన్నాడు కృష్ణ.

"అయితే, ఖర్చు ఫిఫ్టీ ఫిఫ్టీ" అన్నది వనజ.

"నా దగ్గిర డబ్బుల్లేవు." బిక్క మొహం వేసింది. లక్ష్మి.

"పెట్టుబడి నేను పెడ్తాలే!" అన్నాడు కృష్ణ.

"అయితే సరే!" లక్ష్మి ఉత్సాహంగా అన్నది.

లక్ష్మి మురళిని ముస్తాబు చేసింది.

అందరూ హోటలుకెళ్ళి, అక్కణ్ణుంచి సినిమాకు వెళ్ళారు.

సినిమాలో వనజ పక్కన నిత్యానందం, లక్ష్మి పక్కన కృష్ణా కూర్చున్నారు.

వాళ్ళంతా టిప్‌టాప్‌గా తయారై వున్నారు. లక్ష్మి తను కట్టుకున్న బట్టలను చూసుకుంటూ ముడుచుకు పోసాగింది.

కృష్ణ మధ్య మధ్య లక్ష్మి మీదకు వంగి ఏదోదో మాట్లాడుతున్నాడు అలా వంగినప్పుడు కృష్ణ భుజం లక్ష్మి భుజాన్ని తాకుతూ వుంది. జోక్స్ కట్ చేస్తున్నాడు.

లక్ష్మికి ఏదో ఏదోగా వుంది. హాయి హాయిగా వుంది. దిగులు దిగులుగా వుంది. ఆనందంగా వుంది. విచారంగా వుంది.

ఏదో అనిర్వచనీయమైన అనుభూతి మనసును చుట్టేస్తూ వుంది.

లక్ష్మి మనసు సినిమామీద లేదు. ఊహాలోకంలో విహరిస్తూ వుంది. ఆ లోకంలో ....లక్ష్మి .... కృష్ణా ... లక్ష్మి చదివే నవల్లోని హీరో కృష్ణే – హీరోయిన్ లక్ష్మి. లక్ష్మి చూస్తున్న సినిమాలో హీరో కృష్ణే .... హీరోయిన్ లక్ష్మి.

కృష్ణా – లక్ష్మి.... తన్మయత్వంలో వున్న లక్ష్మి లైట్లు వెలగ్గానే ఉలిక్కి పడి లేచి నిల్చుంది.

# 13

"ఒరేయ్ చంద్రం!....." తల్లి పెట్టిన గావుకేక విని చదువుతున్న పుస్తకం పడేసి బయటికి పరిగెత్తుకొచ్చాడు చంద్రం.

వాకిట్లో రిక్షా ఆగి వుంది. తండ్రి రిక్షా దిగలేక పోతున్నాడు. తల్లి దింపలేక పోతూ వుంది.

చంద్రం గబుక్కున వెళ్ళి తూలి పడిపోతున్న తండ్రిని పట్టుకున్నాడు. శాంతమ్మా, చంద్రం గుర్నాథం చెరో రెక్కా పట్టుకొని నడిపించుకొచ్చి మంచం మీద పడుకోబెట్టారు.

శాంతమ్మ పక్కన కూర్చుని తాటాకు విసనకర్రతో విసురుతూంది....

చంద్రం రిక్షావాడికి డబ్బులిచ్చి లోపలకు వచ్చాడు.

"వద్దంటూనే వున్నా, పింఛనంటూ వెళ్ళారు...." అన్నది శాంతమ్మ.

"నాకు చెప్పకూడదూ? నేను నాన్నతో వెళ్ళే వాణ్ణిగా? ఇంకా నయం, దార్లో ఎక్కడా పడిపోలేదు" అన్నాడు చంద్రం.

"నేను విసురుతాను. నువ్వు హార్లిక్సు కలిపి తీసుకురామ్మా!" అన్నాడు తల్లి చేతిలో విసనకర్ర తీసుకుంటూ.

హార్లిక్స్ తాగాడు గుర్నాథం. కొంచెం సేపటికి తేరుకున్నాడు.

"ఎలా వుంది నాన్నా?"

"బాగానే వుంది రా!"

"పింఛను దొరికిందా?" శాంతమ్మ అడిగింది.

"ఆఁ! మూడు నెలల పెన్షన్! మూడు వందల ముప్పై వచ్చింది" అన్నాడు గుర్నాథం.

చంద్రం ముభావంగా వుండిపోయాడు.

"బాబూ చంద్రం! ఎందుకురా పిచ్చి సన్యాసీ, దిగులు పడ్తావ్? అప్లికేషన్ పెట్టటానికి ఇవ్వాళ ఆఖరు రోజనుకుంటాను. రేపైతే లేట్ ఫీజు కట్టాలి. లే! త్వరగా తయారై వెళ్ళు..." అన్నాడు గుర్నాథం.

చంద్రం మాట్లాడలేదు.

గుర్నాథం కొడుకు ముఖంలోకి చూశాడు.

కొడుకు ముఖంలో ఏ భావమూ కనిపించలేదు. నిర్లిప్తంగా కన్పించాడు.

"ఎందుకురా అలా వున్నావ్? లే? ఇదుగో డబ్బు! నీకెంత కావాలో తీసుకో!...." అన్నాడు బనీన్ జేబులో డబ్బు తీసి అందిస్తూ.

చంద్రం చెయ్యి చాపలేదు.

"వద్దు నాన్నా! నేను ఇంజనీరింగ్ చదవదల్చుకోలేదు." ఖచ్చితంగా అన్నాడు చంద్రం.

గుర్నాథం కొడుకు ముఖంలోకి అయోమయంగా చూశాడు.

"అదేమిట్రా! నిన్నటి వరకూ చదువుతానన్నావుగా?"

"అవును, అన్నాను. నిన్నటివరకూ కళ్ళు మూసుకొని వాస్తవాన్ని చూడకూడదనుకున్నాను. కాని, అది నేను చూసినా చూడక పోయినా నన్ను వదల్దని తెలుసుకున్నాను. కళ్ళు తెరిచాను."

"ఏమిట్రా నువ్వనేదీ?" గుర్నాథం కంఠం జీర పోయింది.

"అవును నాన్నా! వాస్తవం నుంచి పారిపోవాలనుకోవడం కంటే వెర్రితనం మరొకటి వుండదు. నేను నిలబడవలసింది గాలిలో కాదు - నేల మీద. అది ఎంత కఠోరంగా వున్నా, నా కాళ్ళను గాయపర్చినా నేను నిలబడవలసింది ఆ నేల మీదే నాన్నా!"

"బాబూ!"

"నేను ఇంజనీరింగ్ చదవను - కాదు, చదవలేను. అప్లికేషన్ ఫారానికే డబ్బులేని నేను ఇంజనీర్ను కావాలనుకోవడం ఎంత తెలివితక్కువో అర్థం చేసుకున్నాను. నేల విడిచి సాము చేస్తూ, నలుగుర్నీ నవ్వించే విదూషకుడిగా బతకడం నాకు ఇష్టం లేదు."

"ఏమిట్రా ఆ మాటలు? ఏమైందిరా బాబూ?"

"ఎందుకు నాన్నా బాధ పడ్తావ్? మనలాంటి వాళ్ళ ఆశలూ, ఆశయాలూ, ఎండమావుల్లో నీరు లాంటివే! అందని దానికి ఎగిరి భంగ పడటం కంటే, అందిన దాంతో రాజీ పడటం మంచిది." నిర్లిప్తంగా చెప్పుకు పోతున్నాడు చంద్రం.

చంద్రం కంఠంలో ఆవేశం లేదు. ముఖంలో ఉద్వేగం లేదు. కళ్ళలో ఉద్రేకం లేదు. ఏదో నిర్లిప్తత, నిర్వేదం అణువణువునా వ్యాపించి వున్నాయి.

"నిన్ననే ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజిలో పేరు రిజిష్టరు చేయించుకున్నాను."

"బాబూ! ఉద్యోగం చేస్తావా? బి ఏ. లూ, ఎం ఏ, లూ ఉద్యోగాలు లేక బాధపడ్తున్న ఈ రోజుల్లో నీకేం మంచి ఉద్యోగం వస్తుందిరా!"

"ప్రయత్నిస్తే ఎక్కడైనా యల్.డి.సీ. ఉద్యోగం దొరక్క పోదుగా?"

"యల్.డీ.సీ. గా చేర్తావా? ఏది జరక్కూడదని ఇంత కాలం అనుకున్నానో అదే జరగబోతుందా? నా వారసత్వం నీకు రాకూడ దనుకున్నానురా చంద్రం!"

"పిచ్చి నాన్నా! నీ వారసత్వం నీ కొడుక్కు రాక మరెవరికి వస్తుంది? నేను నీ వారసుణ్ణికాక మరెవరికో ఎలా వారసుణ్ణవుతానూ?"

చంద్రం గిర్రున తిరిగి విసురుగా గదిలోకి వెళ్ళిపోయాడు.

అలా వెళ్ళిపోతున్న కొడుకుని చూస్తూ శాంతమ్మ కళ్ళు వత్తుకుంది.

గుర్నాథం కుడిచేత్తో ఎడంవైపు గుండె వత్తుకున్నాడు.

ఆ రాత్రి పడుకున్న గుర్నాథం తెల్లవారి లేవలేదు.

భవబంధాల్ని తెంచుకొని శాశ్వత శాంతిని ఆశ్రయించాడు.

మూడు నెలల పెన్షన్ మాత్రమే తీసుకున్న మాజీ ఎన్. జీ. ఓ. గుర్నాథం ఇకలేడు.

# 14

గుర్నాథం చనిపోయి నెల రోజులు గడిచిపోయాయి.

మనిషి చచ్చిపోతాడు. దగ్గరివాళ్ళు ఏడుస్తారు, ఆ ఏడ్చినవాళ్ళూ ఒకరోజు చచ్చిపోతారు.

ఒక మనిషి చచ్చిపోతే (ఎంత గొప్పవాడైనా) ప్రపంచం ఆగిపోదు. ఏ ఒక్క పనీ ఆగిపోదు. కొందరు చచ్చిపోతే పేపర్లలో మొదటి పేజీల్లో వేస్తారు. రేడియోల్లో చెప్తారు. కొందరు చచ్చిపోతే పేపర్లలో వేస్తారు కాని, మొదటి పేజీల్లో కాదు – ఏదో ఒక మూల నాలుగులైన్లు వేస్తారు.

గుర్నాథంలాంటి వాళ్ళు చచ్చిపోతే అనుకొనేవాళ్ళు కూడా వుండరు.

చంద్రం ఊరిబయట తూముమీద, మాసిన బట్టల్తో, రేగిన జుట్టుతో మునగతీసుకొని కూర్చున్నాడు.

కాలేజీలు తెరిచారు.

కుర్రవాళ్ళు పుస్తకాలు పట్టుకొని కాలేజీలకు వెళ్తూవుంటే చూస్తూ కూర్చున్నాడు. దిగులుగా చూస్తున్నాడు. తన దురదృష్టాన్ని తల్చుకొని కుంగిపోతున్నాడు.

ఉద్యోగం కూడా వచ్చేలా లేదు ఎంప్లాయిమెంటులో రిజిష్టరు చేశాడు. కాని తనకంటే ముందు, ఎన్నో సంవత్సరాల ముందు రిజిష్టరు చేయించుకున్నవాళ్ళు ఎంతమందో ఉన్నారట. వాళ్ళందరికీ ఉద్యోగాలు దొరికితేగాని తన పేరు ఇంటర్వ్యూకు పంపించరు.

కేవలం ఇంటర్వ్యూకు వెళ్ళే అర్హత సంపాదించుకోవడానికే ఎన్నేళ్ళు పడుతుందో? అంతవరకూ తనేం చెయ్యాలి?

"చంద్రం! నువ్వా? ఏమిటలా వున్నావ్? కాలేజీలో చేరలేదా?"

చంద్రాన్ని చూసి కారు దిగివచ్చి పలకరించాడు ప్రిన్సిపాల్ శర్మ.

చంద్రం తన పరిస్థితుల గురించి చెప్పాడు.

శర్మ చాలా బాధపడ్డాడు.

"మరీ అంతగా కుంగిపోకు. తెలివైనవాడివి. పైకి రావాల్సిన వాడివి." అన్నాడు శర్మ.

చంద్రం పేలవంగా నవ్వాడు.

"పైకి రావడానికి తెలివెందుకు సార్? డబ్బుండాలి - డబ్బు!" తనకు తానే చెప్పుకుంటున్నట్టు అన్నాడు చంద్రం.

"కష్టాలు వచ్చినప్పుడే ఎలాగయినా మనసు దిటవువర్చుకోవాలి. కనీసం గ్రాడ్యుయేషన్ అయినా పూర్తిచెయ్. మెట్రిక్యులేట్స్ యస్.యస్.యల్.సి వాళ్ళూ లక్షలమంది ఉద్యోగాలు లేకుండా బాధపడ్తున్నారు. నీకు ఉద్యోగం రావడానికి కనీసం రెండేళ్ళయినా పట్టొచ్చు. టైం వృధా చేసుకోకుండా కనీసం గ్రాడ్యుయేషన్ పూర్తిచేసుకో. కాంపిటీటివ్ ఎగ్జామ్స్ రాస్తే ఐ. ఏ. యస్ కావచ్చు. కనీసం డైరెక్టు ఆర్. డీ. ఓ. గానైనా సెలెక్టు కావచ్చును" అన్నాడు ప్రిన్సిపాల్ శర్మ.

"ఇంత ఆలస్యంగా సీటు దొరుకుతుందా సార్?"

"బి. ఏ. హిస్టరీ గ్రూప్‌లో ఇంకా కొన్ని సీట్లున్నాయ్, అప్లయ్ చెయ్యి. ప్రయత్నిస్తాను."

"అలాగే సార్! రేపు కాలేజీకి వచ్చి మిమ్మల్ని కలుస్తాను."

"తప్పకరా!" శర్మ కారెక్కి వెళ్ళిపోయాడు.

లోతు తెలియని బావిలోకి పడిపోతున్నవాడికి వర చేతికి అందినట్టు అయింది.

అవును, తను బి. ఏ. చదువుతాడు. మూడేళ్లేగా? పెద్ద ఖర్చు మాత్రం ఏముంది? ఉద్యోగం చేస్తూ ఐ. ఏ. యస్.కి అపియర్ కావచ్చు.

కాని, ఈ మూడు సంవత్సరాలు గడిచేది ఎట్లా? పుస్తకాలకూ, కాలేజీ ఫీజులకూ.... ఇల్లు అమ్మితే? ఇల్లు అమ్మి ఎక్కడ వుండాలి? ఇంటిమీద అప్పుతెస్తే? అవును, అప్పు తీసుకోవచ్చు. ఆ తర్వాత తను ఉద్యోగంలో చేరాక అప్పు తీర్చేయవచ్చు.

చంద్రం ఇంటికి వచ్చాడు. తల్లికి తన ఉద్దేశ్యం చెప్పాడు.

తల్లి సంతోషంగా అంగీకరించింది.

ఇల్లు తాకట్టుపెట్టి ఆరువేలు తెచ్చి బ్యాంకులో వేశాడు.

"ఈ ఆరువేలతోనే ఈ మూడేళ్ళూ గడపాలమ్మా! జాగ్రత్తగా వాడుకోవాలి, నా చదువు పూర్తయిందాకా!" అన్నాడు చంద్రం.

"అలాగే బాబూ!" అన్నది శాంతమ్మ.

# 15

పేరయ్య చిరాగ్గా ఇంట్లోకి వచ్చాడు.

ఎదురుగా భార్యా కూతురూ కన్పించారు.

"బొత్తిగా బుద్ధి లేదు."

ఇద్దరూ తెల్లబోయి చూశారు.

"ఇన్నేళ్ళొచ్చినా కొంచెంకూడా బుద్ధిలేదు," మళ్ళీ అన్నాడు.

కాంతమ్మకు ఒళ్ళు మండిపోయింది.

"అది లేకపోబట్టే నీతో ఇన్నేళ్ళ నుంచి కాపరం చేస్తున్నాను" అన్నది.

పేరయ్యకు తిక్కరేగింది.

"నీకు నిజంగా బుద్ధిలేదే!" అన్నాడు.

"అదే నేనూ అంటున్నా!"

"అంటావ్, అంటావ్! ఎందుకనవూ? నీ నోటికి బొత్తిగా సుద్దీ బద్దీ లేకుండా పోతోంది రాను రానూ!"

"సంగతేంటో చెప్పకుండా నా మీద విరుసుకు పడ్తావేం?"

"మరి లేకపోతే ఏమిటే? వాడికి బుద్ధి లేదంటుంటే నువ్వు నోరు పారేసుకుంటావేం?"

"ఎవర్నీ, చంద్రాన్నేనా మీరంటుంది?"

"అవును, వాణ్ణే! వాడికి బుద్ధిలేదు సరే! ఆ తల్లికి, ఇన్నేళ్ళు వచ్చాయ్, వుండక్కర్లా? పెళ్ళి కావాల్సిన పిల్లను ఇంట్లో పెట్టుకొని ఇల్లు తాకట్టు పెట్టారట!"

"పిల్లకు పెళ్ళి కుదిరిందేమో?"

"పెళ్ళా పెటాకులా? ఆ దబ్బుతో వాడు బి.ఏ. చదువుతాడట. బి.ఏ. చదివి ఏం చేస్తాడో? బి. ఏ లు చదివినవాళ్ళు బియ్యం గింజలు లేక బాధపడ్తున్నారు ఇప్పుడే. మూడేళ్ళ తర్వాత బి. ఏ. పాసవగానే ఉద్యోగ లక్ష్మి పూలహారంతో ఎదురొస్తుందను కుంటున్నాడు పిచ్చి వెధవ!" కసిగా అన్నాడు పేరయ్య.

సరస్వతి బిక్క మొహం వేసింది.

కాంతమ్మ మనసు చివుక్కుమంది.

"చవటకు పిల్లను ఇవ్వాలనుకోవడం నాదే తప్పు!"

"బంగారంలాంటి కుర్రాణ్ణి పట్టుకొని ఏమిటా మాటలు?" కాంతమ్మ విసుక్కుంది.

"ఏదో ఉద్యోగం చూసుకొని నాలుగురాళ్లు సంపాదించుకోక, బి. ఏ. చదువుతాడట, వాజమ్మ!"

"పెద్ద చదువు చదివితే మంచిదేగా?" అన్నది సరస్వతి.

"అసలు మీ ఇద్దరికీ బుద్ధిలేదే? పద, పద! ఆకలేస్తుంది. భోజనం వడ్డించు" అంటూ పైపంచె కుర్చీమీద వేశాడు పేరయ్య.

బావ బి. ఏ. పాసవుతాడు. నాన్న ఎప్పుడూ నాలుగురాళ్ళో అంటాడు. కాని, బావ బి. ఏ పాసయి, పెద్ద ఉద్యోగస్తుడే అవుతాడు. బావ ఆఫీసరు.... తను ఆఫీసరు భార్య.... సరస్వతి కలల్లో తేలిపోతూ కూర్చుంది.

# 16

మూడు సంవత్సరాలు గడిచాయ్.

దేశంలో చాలా మార్పులు వచ్చాయ్.

లక్షరూపాయలు వున్నవాడు కోటిరూపాయలు సంపాదించాడు.

అండ వున్నవాడు ఎం. ఎల్. ఏ అయ్యాడు.

ఎం. ఎల్. ఎ.గా వున్నవాడు మంత్రి అయ్యాడు.

మంత్రి కేంద్రమంత్రి అయ్యాడు.

పది ఎకరాల పొలం వున్నవాడు దాన్ని పదిహేనుకు పెంచుకున్నాడు.

రెండెకరాలు వున్నవాడు ఏమీ లేనివాడయ్యాడు.

దేశంలో అభివృద్ధి పథకాలతోపాటు మోసం, దగా, లిటిగేషన్స్ పెరిగాయి.

చంద్రం ఇల్లు తాకట్టుపెట్టి తెచ్చిన డబ్బు అయిపోయింది. డిగ్రీ చేతికి వచ్చింది.

డిగ్రీ తీసుకొని తండ్రి ఫోటోముందు నిల్చుని నమస్కరించాడు.

"ఆయనే వుంటే ఇవ్వాళ ఎంత సంతోషించేవారో?" అనుకుంది శాంతమ్మ.

లక్ష్మి ఆనందానికి పట్టపగ్గాలు లేవు.

"అన్నయ్యా! నువ్వు పెద్ద ఆఫీసరైతే నా కేమిస్తావ్?"

బి. ఏ. పాసయినంత మాత్రాన తను పెద్ద ఆఫీసరు కాలేదని తెలుసు చంద్రానికి. చెల్లెలి అమాయకత్వం మీద జాలివేసింది.

తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో "మంచి మొగుణ్ణి తెస్తాను" అన్నాడు.

"పో అన్నయ్యా, నువ్వు మరీనూ!" గుణిసింది లక్ష్మి.

శాంతమ్మ హాయిగా నవ్వుకుంది. ఎంతోకాలానికి మళ్ళీ ఇవ్వాళ నవ్వింది శాంతమ్మ.

తను అనుభవించిన కష్టాలను నెమరవేసుకొని నిట్టూర్చింది.

ఇక తన కష్టాలు గట్టెక్కినట్టే! తన బిడ్డ పెద్ద ఆఫీసరవబోతున్నాడు. లక్ష్మికి పెళ్ళి చెయ్యాలి. ఆఫీసరు చెల్లెల్ని చేసుకోవడానికి మంచికుర్రాళ్ళే వెతుక్కుంటూ వస్తారు.

"అమ్మా! ఆకలేస్తుంది, అన్నం పెట్టు" అన్నాడు చంద్రం.

ఆకాశంలో పక్షిలా ఎగురుతున్న శాంతమ్మను ఎవరో బలవంతంగా నేలమీదకు తోసేసినట్టు అనిపించింది.

అప్పు తెచ్చిన బియ్యంతో వండిన అన్నం కొడుక్కూ కూతురికీ పెట్టింది. చింతపండు చారూ, రెండు పచ్చళ్ళూ ముందు పెట్టింది. పచ్చడి ముద్దలు గొంతుకు చుట్టుకుపోతూ వుంటే బలవంతంగా మింగుతున్న కొడుకుని చూస్తుంటే శాంతమ్మ గుండెలు తరుక్కుపోయాయి. ఇంత నేతిచుక్కకు నోచుకోని బ్రతుకులు!

ఇంకెంతకాలం! పడ్డంతకాలం పడబోముగా?

"బాబూ!"

"ఏంటమ్మా?" అని అనగానే పచ్చడిముద్ద గొంతుకు అడ్డంపడి పొలమారి ఉక్కిరిబిక్కిరై పోయాడు చంద్రం.

శాంతమ్మ కంగారు పడిపోయింది.

"ఏమిటమ్మా, చెప్పబోయావ్!" తేరుకుని అడిగాడు చంద్రం.

"త్వరగా ఉద్యోగంలో చేరుబాబూ!"

తల్లి అమాయకత్వంమీద జాలివేసింది.

పిచ్చి అమ్మ! ఉద్యోగంలో చేరడం తన చేతిలోనే వుందనుకుంటుంది. తన కెప్పుడు ఇష్టమయితే అప్పుడే వెళ్ళి కుర్చీలో కూర్చోవచ్చు అనుకుంటుంది.

చంద్రానికి అన్నం తినబుద్ధి కావడంలేదు. బలవంతంగా ముద్దలు మింగుతున్నాడు.

"మాట్లాడవేం అన్నయ్యా! ఉద్యోగంలో ఎప్పుడు చేర్తావ్?" లక్ష్మి అడిగింది.

"త్వరలోనే చేర్తాలే!" ఎలాగో అనగలిగాడు చంద్రం.

ఈ మూడు సంవత్సరాల కాలంలో పేరయ్య అంతస్తులో కూడా మార్పు వచ్చింది.

పేరయ్య ఇల్లు పచ్చ పచ్చగా వుంది. వరండాలో బెంచీలు పోయి కుర్చీలు వచ్చాయి. సోఫాలు వచ్చాయి. ముతక నేత పంచలు పోయి పొందూరు ఖద్దరు ధోవతులు వచ్చాయి. జరీ అంచు కండువాలు వచ్చాయి. ఖద్దరు సిల్కు లాల్చీలు వచ్చాయి.

కాంతమ్మ గుంటూరు నేతచీరలు వదిలేసి వెంకటగిరి చీరెలు కడ్తుంది. సరస్వతికి ఇష్టంలేకపోయినా సిల్కు చీరెలే కడ్తుంది.

కాంతమ్మ భర్తకు తెలియకుండా శాంతమ్మకు అప్పుడప్పుడు బియ్యం. పప్పులూ ఇచ్చి సహాయం చేస్తూంది.

"మా అమ్మాయికి మంచి సంబంధం చూడవయ్యా!" అన్నాడు పేరయ్య, ఏదో వ్యవహారం మాట్లాడటానికి వచ్చిన పెద్దమనిషితో.

"మీ మేనల్లుడు ఉన్నాడుగా? పిల్లవాడు లక్షణంగా ఉంటాడు. బి. ఏ. కూడా పాసయినట్టున్నాడు" అన్నాడు ఆ పెద్దమనిషి.

"ఆఁ- ఎందుకయ్యా ఈ బి. ఏ. లూ, ఏం. ఏ. లూనూ? ఉద్యోగాలు దొరికిననాటి మాట! వెనకటి రోజుల్లో వరాన్వేషణ కాలేజీల్లో. ఇప్పుడు నాలుగురాళ్ళు తెచ్చుకునేవాణ్ణి చూసి ఇవ్వాలి, ఈ రోజుల్లో ఉద్యోగం చేస్తున్నవాడికి పిల్లనివ్వడమే తెలివైనపని. కాస్త మంచి కుర్రవాళ్ళెవరైనా వుంటే చూడు!" అన్నాడు పేరయ్య.

కాఫీ కప్పులతో వచ్చిన కాంతమ్మ భర్త మాటలు వింది. లోలోపల బాధపడింది.

"ఈ మనిషితత్వం ఎంత సంపాదించినా మారదు!" అనుకుంది.

తలుపుచాటున నిల్చుని తండ్రి మాటలు విన్న సరస్వతికి ఏడుపే వచ్చింది.

"అమ్మా!" అంటూ లోపలకు వచ్చిన తల్లిని చుట్టుకొని భోరుమంది.

"ఊరుకో తల్లీ! మీ నాన్న మనస్తత్వం మనకు తెలిసిందేగా? డబ్బో డబ్బో అని పడిచస్తాడు!" కాంతమ్మ కూతుర్ని ఓదార్చింది.

ఆ వచ్చిన పెద్దమనిషి వెళ్ళిపోయాడు. పేరయ్య లోపలకు వచ్చి తల్లీ కూతుళ్ళను మార్చి మార్చి చూశాడు.

"చంద్రం బి. ఏ. పాసయాడటగా?" విషయంలోకి దించుతూ కాంతమ్మ ప్రశ్నించింది.

"అయితే, ఇంకా ఆలస్యం ఎందుకూ? ముహూర్తాలు పెట్టించండి." మళ్ళీ తనే అంది

"ఆ విషయం ఎత్తొద్దని నీకు చెప్పానా? బి. ఏ. పాసు కాగానే సరిపోయిందా! ఉద్యోగం పాడూ లేనివాడికి నా కూతుర్ని ఇవ్వను." ఖచ్చితంగా అన్నాడు పేరయ్య.

"ఉద్యోగం చిన్నగా అదే వస్తుంది. మనకు ఏం తక్కువ? ఒక్కగాను ఒక్కబిడ్డ, దాని మనసు తెలుసుకోకుండా...."

"నువ్వు నోరుమూసుకుంటావా? ఉద్యోగం దొరకడం మాటలనుకున్నావా? కూర్చునితింటే కొండలైనా కరిగిపోతాయి."

"ఇంతకీ మీ రనేదేమిటి?"

"అమ్మాయికి మంచి సంబంధం, మన హోదాకు తగిన సంబంధం చూస్తాను. నువ్వే దాన్ని పాడుచేస్తున్నావు. నోరుమూసుకు పడివుండండి" అంటూ పేరయ్య పైపంచ దులిపి, భుజంమీద వేసుకొని బయటికి వెళ్ళిపోయాడు.

సరస్వతి గుండెలో పుట్టెడు దిగులు పుట్టుకొచ్చింది.

# 17

ఆ రోజు మురళి పుట్టిన రోజు.

పండగ ఏర్పాట్లు చేస్తున్నారు. అంతా హడావిడిగా ఉంది.

అన్నయ్య బి. ఏ. పాసయాడనీ, ఇంక పెద్ద ఉద్యోగంలో చేరడమే ఆలస్యం అనీ చెప్పటానికి వచ్చిన లక్ష్మి, అందరూ హడావిడిగా వుండటంవల్ల చెప్పలేక పోయింది.

సమయం చూసి చిన్నగా వనజతో అన్నది. వనజ వినీ, విననట్టే ఊరుకుంది.

లక్ష్మి మనసు చివుక్కుమంది.

"కుళ్ళుబుద్ధి! వాళ్ళే గొప్పగా వుండాలని కాబోలు?" అనుకుంది లక్ష్మి.

"అక్కా!" అంటూ మురళివచ్చి లక్ష్మిని చుట్టుకున్నాడు.

లక్ష్మి మురళిని ముద్దు పెట్టుకుంది.

"మురళీ! మా అన్నయ్య బి. ఏ. పాసయ్యాడు" అన్నది లక్ష్మి.

మురళికి లక్ష్మి ఉత్సాహాన్ని అర్థంచేసుకొనే వయసు లేదు.

"ఇవ్వాళ నా పుట్టినరోజు పండగ" అన్నాడు కళ్ళూ చేతులూ తిప్పుతూ.

"మురళీ! పద పద. అందరూ వచ్చేవేళయింది. కాళ్ళూ చేతులూ కడుక్కొని కొత్తబట్టలు వేసుకో!" అన్నది వనజ.

"నాకు లక్ష్మి అక్కే బట్టలు వెయ్యాలి, తలదువ్వాలి" అన్నాడు వాడు. లక్ష్మి మురళిని తయారుచేసింది.

ఈ లోపల వనజ చక్కగా ముస్తాబై వచ్చింది. లక్ష్మి వనజను కళ్ళు పెద్దవి చేసుకొని చూసింది.

"ఆ నెక్లెస్ ఎప్పుడు చేయించుకున్నావ్?" అడిగింది లక్ష్మి.

"కంసాలి నిన్ననే తెచ్చి ఇచ్చాడు, బాగుందా?"

"చాలా బాగుంది" అన్నది లక్ష్మి.

అన్నయ్యకు ఉద్యోగం రాగానే తనూ అటువంటి నెక్లెసే చేయించుకోవాలి. ముందే చెప్పకుండా నెక్లెసు పెట్టుకొని వనజ దగ్గిరకు రావాలి. వనజ అడిగేంతవరకూ తను చెప్పనేచెప్పదు! అప్పుడు చూడాలి వనజ ముఖం!

"అక్కా! నువ్వుకూడా కొత్తచీర కట్టుకోవూ?" అన్నాడు మురళి.

లక్ష్మి ఉలిక్కిపడింది. తన చీరకేసి చూసుకుంది. బొంతరేగిన నీలిరంగు ముతక నేతచీర.

గుడ్లనీరు గుడ్ల కుక్కుకుంటూ "నేను తయారయే వచ్చాను మురళీ!" అన్నది.

"ఈ చీర ఏం బాగాలేదు. పాత చీర! కొత్తది కట్టుకో!" అన్నాడు మురళి.

"పద పద. హాల్లోకి వెళ్దాం" అన్నది వనజ మురళిచెయ్యి పట్టుకొని లాగుతూ.

"ఊహూఁ! నా పుట్టినరోజు అందరూ కొత్తబట్టలు వేసుకోవాలి. లక్ష్మి అక్కకూడా కొత్తచీర కట్టుకోవాలి!" మారాం చేశాడు మురళి.

లక్ష్మి మనసు కలతబారింది. దుఃఖం వచ్చేస్తుంది. తనమీద తనకే జాలి వేస్తుంది. తన బీదతనంమీద కోపం వస్తూంది.

మురళి మాటలకు వనజా, కృష్ణా ముఖముఖాలు చూసుకున్నారు.

వనజ బీరువా తెరిచి ఒక ఫారెన్ నైలెక్స్ చీర తీసి ఇస్తూ "ఇది కట్టుకో లక్ష్మీ!" అన్నది.

"వద్దు వనజా! ఇది బాగానే వుంది." వనజ చేతిలో చీర కేసి ఆశగా చూస్తూ అన్నది లక్ష్మి.

"పర్వాలేదు, కట్టుకోవోయ్!" అన్నది వనజ.

కట్టుకోవాలని వున్నా సందేహిస్తూ నిలబడింది లక్ష్మి.

"తీసుకో లక్ష్మీ! ఆ రంగు నీకు చాలా బాగుంటుంది" అన్నాడు కృష్ణ, లక్ష్మి కళ్ళలోకి లోతుగా చూస్తూ.

లక్ష్మి చీర తీసుకుంది. కట్టుకొని అద్దం ముందు నిల్చుంది. జాకెట్ ఆ చీరమీద వెలా తెలా పోతోంది. భుజంమీదగా పైట తీసి కప్పుకుంది. తన ప్రతిబింబాన్ని చూసుకుంటూ మురిసి పోయింది.

అన్నయ్య ఉద్యోగంలో చేరగానే అచ్చం ఇలాంటి చీరే కొనుక్కోవాలి. మాచింగ్ బ్లౌజ్ వేసుకుంటే ఇంకా అందంగా వుంటుంది.

"బలే వున్నావ్ లక్ష్మీ!" వెనగ్గా వచ్చి నిలబడి అన్నాడు కృష్ణ.

లక్ష్మి చెంపలు కెంపురంగు పులుము కున్నాయి.

లక్ష్మికి ఎలాగో వుంది. పరిగెత్తాలని వుంది. ఆడాలని వుంది, పాడాలని వుంది. గాలిలో పిట్టలా ఎగరాలని వుంది. ఇంకా.... ఏమేమోగా వుంది.

"ఎలా వున్నావో చెప్పనా?"

లక్ష్మి కను రెప్పలు టప టపలాడిస్తూ చూసింది.

"రాధలా వున్నావ్!"

"ఏ రాధ?" అమాయకంగా అడిగింది లక్ష్మి.

"ఆ రాధే... కృష్ణుని ప్రియురాలు రాధ!" అన్నాడు కృష్ణ దగ్గరగా వచ్చి నిల్చుని.

లక్ష్మి ఆనంద పారవశ్యంలో తనను తనే మర్చిపోయింది.

"ఇంకా ఇక్కడే వున్నారేం? త్వరగా రండి!" వనజ వచ్చి అన్నది.

లక్ష్మి తడబడింది. వనజ వెనకే వెళ్ళిపోయింది.

లక్ష్మి మనసు అక్కడలేదు. ఎక్కడో - బృందావనంలో విహరిస్తూ వుంది.

"ఆ రాధే.... కృష్ణుని ప్రియురాలు రాధ!" కృష్ణ కంఠం లక్ష్మి చెవుల్లో గుస గుసలాడుతూ వుంది.

"అంటే - తనను కృష్ణ...." ఆకస్మాత్తుగా ఆ ఉపమానంలో ఏదో అపశృతి వున్నట్టు తోచింది.

రాధ కృష్ణునికి ప్రేయసి మాత్రమే. భార్య కాదు. జీవితమంతా కృష్ణునికోసం ఎదురు చూస్తూనే గడిపింది. తను రాధకాదు. మరి? రుక్మిణి! కాదు - కాదు - సత్యభామ! తను సత్యభామ. కృష్ణుడికి సత్యభామ అంటేనే ఎక్కువ ప్రేమ!

ఫన్‌క్షన్ అయాక మురళిని తీసుకొని వనజా, నిత్యానందం, కృష్ణా, లక్ష్మి పబ్లిక్ గార్డెన్‌కు వెళ్ళారు.

కొత్త సిల్కు చీరలో లక్ష్మి వారిమధ్య హాయిగా కూర్చుంది. ఇంతకుముందు వుండే కాంప్లెక్సు ఇప్పుడు లేదు. అంటే - వేషంలో కూడా మనిషికి ఆత్మ విశ్వాసం పెరుగుతుందన్నమాట! లక్ష్మి కొత్త ప్రపంచంలో విహరిస్తూ వుంది.

అదే సమయంలో సరస్వతి శాంతమ్మ పక్కన చేరి, చంద్రం ఉద్యోగం గురించి అడిగింది.

"చంద్రం ఆ ప్రయత్నంలోనే వున్నాడమ్మా!" అన్నది శాంతమ్మ.

"ఏమో నత్తయ్యా! నా కెందుకో భయంగా వుంది," అన్నది సరస్వతి దిగులుగా.

"భయం మెందుకే పిచ్చిపిల్లా! వాడు బి.ఏ. పాసయాడు. త్వరలో మంచి ఉద్యోగంలో చేరబోతున్నాడు." ఉద్యోగంలో చేరడంలో చంద్రానిదే ఆలస్యం అన్నట్టు అన్నది శాంతమ్మ.

"వంట అయిందా అత్తయ్యా?"

"ఇంకా చెయ్యలేదమ్మా! అబ్బాయి ఎక్కడ కెళ్ళాడో ఏమో?" మాట మార్చింది శాంతమ్మ.

అంతలో చేటలో బియ్యం పట్టుకొని పనిపిల్ల వచ్చింది.

"రావమ్మ గోరు రెండు రోజుల్లో తిరిగి ఇచ్చెయ్య మన్నారు" అన్నది పనిపిల్ల చేట శాంతమ్మకు అందిస్తూ.

శాంతమ్మ కుక్కిన పేనులా చేట అందుకుంది. సరస్వతి ముఖంలోకి చూడలేక పోయింది. బియ్యం తీసుకొని వంటింట్లోకి వెళ్ళి పోయింది.

సరస్వతి అలా వెళ్తున్న శాంతమ్మను దిగులుగా చూసింది. లేచి వంటింట్లోకి వెళ్ళింది.

"అత్తయ్యా! ఇవ్వాళ వంట నేను చేస్తాను. నా చేతి వంట రుచి చూపిస్తాను బావకు" అన్నది సరస్వతి.

"నీ కెందుకమ్మా కష్టం?"

"కష్టాని కేముంది అత్తయ్యా?" అంటూ వంట ప్రయత్నంలోకి దిగింది సరస్వతి.

లక్ష్మి ఫారెన్ నైలెక్స్ చీరలో మెరిసిపోతూ, అంతవరకూ మధుర అనుభూతుల్ని నెమరు వేసుకుంటూ, ఉషారుగా, కలల్లో తేలిపోతూ ఇంట్లో అడుగు పెట్టింది.

శాంతమ్మ కూతుర్ని చూసి నిర్ఘాంత పోయింది.

"ఏమిటమ్మా, అట్లా చూస్తావ్? ఈ చీరలో నేను చాలా బాగున్నాను కదూ?" లక్ష్మి అమాయకంగా ప్రశ్నించింది.

లక్ష్మి కంఠం విని సరస్వతి బయటికి వచ్చింది. లక్ష్మిని చూస్తూ నిల్చుంది.

శాంతమ్మ పెదవులు కోపంతో వణుకుతున్నాయి.

"ఎక్కడిదే ఆ చీర?" దాదాపు అరిచినట్టే అన్నదామె.

తల్లికి అంత కోపం ఎందుకు రావాలో లక్ష్మికి అర్థం కాలేదు.

"వనజ ఇచ్చింది."

"సిగ్గులేదూ? ఊళ్ళోవాళ్ళ చీరెలు ముష్టెత్తు కుంటావా?" రెచ్చిపోతూ అన్నది శాంతమ్మ.

"నేనేం ముష్టెత్తుకోలేదు. ఎంతో బలవంతం చేస్తే కట్టుకున్నాను. రేపు ఇచ్చేస్తాలే!" నిర్లక్ష్యంగా సమాధానం చెప్పి లోపలకు వెళ్ళిపోయింది లక్ష్మి.

శాంతమ్మ కళ్ళప్పగించి చూస్తూ నిల్చుంది.

సరస్వతి లక్ష్మి వెనకే వెళ్ళింది.

"పెద్ద వాళ్ళకు ఇష్టం లేనిపనులు మనం చెయ్య కూడదు లక్ష్మీ! వాళ్ళను బాధ పెట్టటం మంచిదికాదు" అన్నది సరస్వతి

లక్ష్మి గిర్రున వెనక్కు తిరిగింది.

"ఇప్పుడు నేను అంత కానిపనేం చేశానని అమ్మ అంత కోపం తెచ్చుకుంది?"

"అత్తయ్యకు అభిమానం ఎక్కువ."

"కొని పెట్టడం చేతకాదు కాని, అభిమానం అంట అభిమానం – ఎందుకో ఈ చేతగాని అభిమానాలు?"

లక్ష్మి సరస్వతితో వాదనకు దిగింది. సరస్వతి వెనక్కు తిరిగి శాంతమ్మ దగ్గిరకు వచ్చి "నేను వెళ్తున్నా నత్తయ్యా!" అన్నది.

"వెళ్ళి రామ్మా!" అన్నది శాంతమ్మ, ఆలోచనల నుంచి పూర్తిగా బయట పడకుండానే.

పొద్దుపోయి హడావిడిగా లోపలకు వెళ్తున్న కూతుర్ని చూశాడు వసారాలో కూర్చునివున్న పేరయ్య.

"ఇలా రా!" కూతుర్ని పిల్చాడు.

"ఏమిటి నాన్నా?" జంకుతూనే అన్నది సరస్వతి.

"ఎక్కడి కెళ్ళావ్?"

"అత్తయ్య గారింటికి!"

"వెళ్ళొద్దన్నానా?" గాండ్రించాడు తండ్రి.

సరస్వతి బిక్కమొహం వేసి నిలబడి పోయింది.

"ఎందుకండీ, గొంతు చించుకుంటారూ? అది పరాయి ఇంటి కెళ్ళిందనీ?" అన్నది కాంతమ్మ.

"నువ్వు నోరు మూస్తావా?"

"మాటకు ముందు నా మీద విరుచుకు పడ్తారేం? గొణుక్కుంది కాంతమ్మ.

"ఈ రోజునుంచి గడపదాటు చెప్తాను. కాళ్ళిరగ్గొడ్తాను. బొత్తిగా భయం భక్తీ లేకుండా ఛస్తున్నారు." ఇద్దర్నీ కలిపి తిట్టసాగాడు పేరయ్య.

సరస్వతి ఏడుపు వస్తుంటే లోపలకు పరుగు తీసింది.

# 18

చంద్రం డిగ్రీ తీసుకొని ఆరు నెలలు అయింది. రోజూ ఎంప్లాయ్‌మెంటు ఎక్ఛేంజి చుట్టూ తిరుగుతూనే వున్నాడు.

ఇంట్లో పరిస్థితి నానాటికీ దిగజారి పోతూంది. అప్పులు కూడా పుట్టడం లేదు. నెలలో సగంరోజులు పస్తులు పడుకోవాల్సి వస్తూంది. ఇంట్లో వున్న వంట సామానంతా మార్వాడీ కొట్లోకి చేరింది.

చంద్రంతోపాటు రిజిష్టర్ చేసుకున్న వాళ్ళకు కొందరికి ఇంటర్వ్యూలు వస్తున్నాయి, కొందరికి ఉద్యోగాలు కూడా వచ్చాయి. చంద్రం పేరు ఒక్కసారి కూడా ఇంటర్వ్యూకు పంపడం జరగలేదు.

ఎంప్లాయిమెంటు ఆఫీసర్ని అదేమాట అడిగాడు. ఆ ఆఫీసరు విసుక్కున్నాడు. రెండోసారి కసురుకున్నాడు. మూడోసారి అడిగినప్పుడు ఆ ఆఫీసరు కస్సున లేచాడు.

"నీ కంటే ముందే రిజిష్టరు చేసుకున్నవాళ్ళు ఇంకా చాలా మంది వున్నారు." అన్నాడు.

చంద్రానికి కోపం వచ్చింది. కాని కోపం దిగ మింగుకున్నాడు. ముఖం వేలాడ వేసుకొని వస్తున్న చంద్రం, "మీ పేరు తెలుసుకో వచ్చునా?" అని ఎవరో అంటే ఆగి వెనక్కు చూశాడు.

"చంద్రం!"

"మీరు చాలా అమాయకుల్లా వున్నారు" అన్నాడు ఆ యువకుడు.

చంద్రం అర్థం కానట్టు చూశాడు.

"ఇప్పుడు మీరు ఆ ఆఫీసరుతో మాట్లాడుతూంటే విన్నాను. ఏం లేదు. అతని చెయ్యి తడి చెయ్యండి- మీకు ఇంటర్వ్యూలకు వెళ్ళే అర్హత వస్తుంది."

చంద్రం విస్మయంగా ఆ యువకుడి ముఖంలోకి చూశాడు. అతని మాటలు నమ్మాలనిపించలేదు. ఉద్యోగాల కొరకు లంచాలు ఇవ్వాలని విన్నాడు కాని, పేరును ఇంటర్వ్యూల లిస్టులోకి ఎక్కించడానికి కూడా లంచం ఇవ్వాల్సి వుంటుందని తను వినలేదు.

"అతను లంచం తీసుకుంటాడా? చాలా మంచివాడిలా కన్పిస్తాడే!" అన్నాడు చంద్రం.

ఆ యువకుడు చంద్రం ముఖంలోకి జాలిగా చూశాడు.

"నువ్వు రిజిస్టర్ చేయించి ఎంత కాలం అయింది?"

"బి. ఏ. రాయగానే చేయించాను. దాదాపు ఎనిమిది నెలలవుతుంది" అన్నాడు చంద్రం.

"నేను చేయించి ఇంకా మూడు నెలలు కూడా కాలేదు... ఇవ్వాళ ఇంటర్వ్యూకు వెళ్తున్నాను. అర్థం అయిందా?" అన్నాడు ఆ యువకుడు.

"మీరు లంచం ఇచ్చారా?"

ఆ యువకుడు అదోలా నవ్వాడు.

"ఎంత ఇవ్వాలండీ?"

"కనీసం రెండు వందలైనా ఇవ్వాలి."

"రెండు వందలే!" చంద్రం నోరు తెరిచాడు.

"రెండు వంద లిచ్చేస్తే ఉద్యోగం వస్తుందా?" మళ్ళీ ఆశగా అడిగాడు.

"ఎంత పిచ్చి వాడివయ్యా! ఉద్యోగం రాదు. ఉద్యోగం కొరకు ఇంటర్వ్యూలకు వెళ్ళే అర్హత వస్తుంది. వస్తాను. టైం అయిపోయింది. విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్" అంటూ ఆ యువకుడు వడివడిగా వెళ్ళిపోయాడు.

రెండు వందలు! ఎక్కడ్నుంచి తేవాలి? అయినా, ఉద్యోగం వస్తుందనే గ్యారంటీ లేదు. ఇంటర్వ్యూలు జరపడం కూడా ఒక ఫార్సేనట. ముందే ఎవడికో ఆ ఉద్యోగం ఇవ్వడానికి నిర్ణయం జరిగి వుంటుందట. తన అదృష్టం బాగుంటే, మంచి ఆఫీసరు తటస్థపడితే, తన పరిస్థితి చెప్పుకుంటే ఉద్యోగం రావచ్చు. కాని, ఇంటర్వ్యూలే రావడం లేదాయే!

ఆలోచిస్తూ ఇంట్లో అడుగు పెట్టిన చంద్రానికి కొడుకు కోసం గంపెడాశతో ఎదురు చూస్తున్న తల్లి కన్పించింది.

అమ్మ రోజూ తన కోసం ఎదురు చూస్తూనే వుంటుంది. ఏరోజు కారోజు తను ఉద్యోగంలో చేరానని చెప్తాడని ఎదురుచూస్తూనే వుంది.

లక్ష్మికి కూడా తన మీద కోపంగా వుంది. సరైన బట్టలు లేవు. తిండి లేదు. తను కావాలనే ఉద్యోగంలో చేరడం లేదనుకుంటున్నది పిచ్చిది!

ఆ రోజు కూడా, రోజూ లాగే ఏదో అడగబోయి, కొడుకు ముఖం చూసి మానుకుంది శాంతమ్మ.

"అమ్మా! రెండు వందలు కావాలి" అన్నాడు చంద్రం.

"రెండు వందలా?" నోరు తెరిచేసింది శాంతమ్మ.

"అవునమ్మా! రెండు వందలుంటే గాని ఉద్యోగం రాదు" అంటూ లోపలకు వెళ్ళిపోయి మంచం మీద పడుకున్నాడు చంద్రం..

శాంతమ్మ ఆలోచనలో పడింది. ఇంట్లో ఖరీదైన వస్తువు ఒక్కటీ లేదు. లేదా? శాంతమ్మ గబగబా లేచి వెళ్ళి పెట్టె తెరిచింది. పాత బట్టల్ని చిందర వందరగా పడేసింది. బట్టల కింద ట్రంకు పెట్టెలో మెరుస్తూ కన్పించాయి మాంగల్యాలు!

తెచ్చి కొడుకు చేతిలో పెట్టి, ఒక్క క్షణం అక్కడ నిల్చోకుండా గిర్రున తిరిగి వెళ్ళిపోయింది.

చంద్రం చేతిలో వున్న మాంగల్యాలను చూశాడు. తండ్రి కళ్ళకు కట్టినట్టయింది.

"నాన్నా! చివరికి నువ్వు లేకపోయినా, నీ గుర్తుగా అమ్మ పెట్టెలో అపురూపంగా దాచుకున్న మాంగల్యాలను అమ్మి, ఉద్యోగం కోసం లంచం ఇవ్వబోతున్నాను." మనసులోనే అనుకున్నాడు.

మథన పడ్డాడు ఆ రాత్రంతా.

రెండో రోజు ఉదయం ఆ మాంగల్యాలు అమ్మాడు. ఆఫీసరుకు ముడుపు చెల్లించుకున్నాడు. మిగిలిన డబ్బు తెచ్చి తల్లి చేతిలో పోశాడు.

శాంతమ్మ చంద్రం అనుకున్నంత బాధ పడలేదు. డబ్బు తీసుకుంది.

కొడుకుకు ఉద్యోగం వచ్చినట్టే భావించింది. సంతృప్తిగా నిట్టూర్చింది.

వారం రోజులు తిరక్కుండానే పోస్టుమాన్ కవరు తీసుకొని "చంద్రం – బి. ఏ." అంటూ వాకిలి ముందు నిలబడ్డాడు.

చంద్రం ఆత్రంగా కవరు చించి చదువుకున్నాడు.

"ఉద్యోగం వచ్చిందా నాయనా?....." అన్నది శాంతమ్మ సంతోషంగా.

"రేపు ఇంటర్వ్యూకు వెళ్ళాలి" అన్నాడు చంద్రం.

అదేదో అర్థం కాని శాంతమ్మ 'రేపు ఉద్యోగానికి వెళ్ళాలి' అన్నాడు అనుకుంది. భర్త ఫోటో దగ్గిరకు వెళ్ళి నమస్కరిస్తూ, "ఇక మా కష్టాలు తీరినట్టే! అబ్బాయి ఆఫీసరు కాబోతున్నాడు... మీరు చూసి సంతోషించే అదృష్టం లేకపోయింది." పైకే ఏదేదో అంటూ వుంటే చంద్రం అక్కడ నిలబడలేక పోయాడు.

రాగి డబ్బు మూట కట్టి వేంకటేశ్వర స్వామికి ముడుపు కట్టింది. చంద్రం తల నీలాలు ఇస్తానని మొక్కుకుంది.

చంద్రం ఎంప్లాయ్‌మెంటు ఎక్ఛేంజికి వెళ్ళేసరికి మరో నలుగురు సిద్ధంగా వున్నారు. వారిలో ఒక యువతి కూడా వుంది.

నలుగురూ ఇంటర్వ్యూకు బయలుదేరారు. ఆ యువతి రిక్షా ఎక్కి వెళ్ళిపోయింది.

ఒక ఆఫీసులో యల్. డి. సీ పోస్టు ఖాళీగా వుందట.

నామాలు పెట్టుకున్న వాడు చాలా గౌరవ గలవాడిగా కన్పించాడు. ఆ యువతి అందంగా చలాకీగా వుండి, వయ్యారంగా నడుస్తూంది. మరొకడు టిప్‌టాప్‌గా డ్రెస్

చేసుకొని వున్నాడు. వాడు తనకు ఆ ఉద్యోగం వచ్చినా రాకపోయినా ఒకటే అ
ప్రవర్తిస్తున్నాడు. ఏదో సర్దాగా ఇంటర్వ్యూకు వెళ్తున్నట్టు కన్పిస్తున్నాడు.

మిగతా ఇద్దర్నీ చూసి చంద్రం, వాళ్ళూ తన లాంటి వాళ్ళే అనుకున్నాడు. వాళ్ళు భయం భయంగా వున్నారు. దిగులుగా వున్నారు. చొరవగా మాట్లాడ్డం చేత కాని వాళ్ళు. మాసి పోయిన దుస్తుల్లో వున్నారు.

అందరూ ఆఫీసుకు వెళ్ళారు.

టెర్లిన్ సూటు వాడు చాలా గర్వంగా కన్పిస్తున్నాడు... ధీమాగా కన్పిస్తున్నాడు. ఎవరితోనూ మాట్లాడటం లేదు. అందరికీ దూరంగా కూర్చున్నాడు. "వాడికి ఏ మంత్రి రికమెండేషనో వున్నట్టుంది" అనుకున్నాడు చంద్రం.

నామాలవాణ్ణి చూశాడు. వాడూ ఉత్సాహంగానే వున్నాడు. ఆఫీసరుగారి రూం ముందు వున్న ప్యూన్‌ని దూరంగా తీసుకెళ్ళి ఏదో మాట్లాడుతున్నాడు.

"వీడి చొరవా వీడూ - చూస్తుంటే ఈ ఉద్యోగం వీడే కొట్టేసేట్టు వున్నాడు" అనుకున్నాడు చంద్రం.

దూరంగా కుర్చీలో కూర్చుని వున్న యువతి కేసి చూశాడు. ఆమె బ్యాగ్‌లో నుంచి అద్దం తీసింది. ముఖం చూసుకుంటూ ముంగురులు సరి చేసుకుంది. నాలుకతో పెదవులు తడుపుకుంది.... మళ్ళీ అద్దం బ్యాగ్‌లో పెట్టింది. ఆ ఆఫీసులో పనిచేసే వాడెవడో ఆఫీసరు రూంలోకి ఫైల్ తీసుకొని వెళ్తూ ఆ యువతి దగ్గిర ఆగాడు. ఏదో అన్నాడు. ఆవిడ విలాసంగా నవ్వింది. ఆ నవ్వులో ఏదో కరెంటు వుంది. ఈ ఉద్యోగం ఆవిడకే వస్తుందేమో?

మరి ఆ టెర్లిన్ సూట్ వాలా? ఆ నామాల వాడూ? అందరూ ధీమాగానే వున్నారేం?

మిగతా ఇద్దరి కేసి చూశాడు చంద్రం. వాళ్ళు ఊపిరి తీసుకోవడానికి కూడా భయపడ్తున్నట్టు కూర్చుని వున్నారు. వాళ్ళూ తన లాంటి వాళ్ళే!

వాళ్ళ ముగ్గుర్నీ చూస్తుంటే చంద్రానికి చెమట పడ్తూ వుంది! ఆఫీసరు ఏం ప్రశ్నలు వేస్తాడో? ఎక్కడో ఇంటర్వ్యూలో "నువ్వెక్కొచ్చిన మెట్లు ఎన్ని?" అని ప్రశ్నించారట. చేసే ఉద్యోగానికీ, చదివిన చదువుకూ, ఇంటర్వ్యూలో అడిగే ప్రశ్నలకూ ఎక్కడా సంబంధం వుండదు. తను ప్రశ్నలకు సరిగా సమాధానాలు చెప్పలేక పోతే? ఈ ఉద్యోగం తనకు రాకపోతే? అమ్మకు ముఖం ఎలా చూపించడం?

ముందు టెర్లిన్ సూటు వాడ్ని పిల్చారు. అర్ధ గంటయినా వాడు బయటికి రాడు.

నామాల వాడు గొణుక్కున్నాడు.

టెర్లిన్ సూటువాలా బయటికి వచ్చాడు. టకటక బూట్ల శబ్దం చేసుకుంటూ వెళ్ళిపోయాడు. వాడికే ఆ ఉద్యోగం ఖాయం అని చెప్పారేమో! అలా ఎందుకు చెప్తారు? వాడి పొగరు చూసి ఉద్యోగం ఇస్తారా?.... ఇవ్వరు! వాడికి ఈ ఉద్యోగం చస్తే రాదు! ఒకడు పోయాడు.

భయపడుతూ కూర్చున్న వాళ్ళలో ఖాకీ పాంటు వేసుకున్న వాణ్ణి పిల్చారు. పది నిముషాలకే వాడు బయటికి వచ్చాడు. ముఖంలో రక్తం చుక్కలేదు. బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

వీడికీ ఉద్యోగం రాదు. ఇద్దరు పోయారు.

ఆ పిల్లకు పిలుపు వచ్చింది. బ్యాగ్ ఊపుకుంటూ వయ్యారంగా లోపలకు వెళ్తుంటే గుర్రుగా చూశాడు నామాలవాడు.

ఐదు నిమిషాలు - పది నిమిషాలు - పదిహేను నిముషాలు - నామాలవాడు మాటిమాటికి వాచీ చూసుకుంటున్నాడు.

"ఇంతసేపు ఏం చేస్తుందో లోపల? ఈ ఆడవాళ్ళు ఇంటర్వ్యూలకు వస్తే మన పని హుళక్కే!" అన్నాడు నామాలవాడు.

"అంతేనంటారా?" అన్నాడు చంద్రం, ఎక్కడికో అగాధంలోకి జారి పోతున్నట్టు.

"చూశారుగా ఆవిడ వేషం – ఆ టక్కులూ – ఆ నడకలూ! చిరునవ్వు విసిరిందంటే ఆ ఆఫీసరుగాడు ఐసయిపోతాడు. మొగవాళ్ళకే ఉద్యోగాలు దొరక్క చస్తుంటే ఈ ఆడవాళ్ళకు ఉద్యోగాలు ఎందుకో?"

"అవసరం లేకపోతే వాళ్ళుమాత్రం ఉద్యోగాలకు ఎందుకొస్తారు? ఆ అమ్మాయికికూడా ఉద్యోగం అవసరమేనేమో? ఇంటికి పెద్దపిల్ల కావచ్చు. తండ్రి లేకపోవచ్చు. ఆమె మీదే ఆ కుటుంబం ఆధారపడి వుండి వుండొచ్చు!" అన్నాడు చంద్రం.

"ఆమె వేషం చూస్తుంటే బాధ్యతలు తలమీద వున్నదానిలా వుందా?" అక్కసుగా అన్నాడు నామాలవాడు.

అంతలో బ్యాగ్ ఊపుకుంటూ వచ్చింది ఆ యువతి. నామాలవాడి ముఖంలోకి గర్వంగా చూసింది. బ్యాగ్ వూపుకుంటూ వెళ్ళిపోయింది.

ఈ ఉద్యోగం ఈమెకే వచ్చేలా వుంది! చెప్పలేం. ఆఫీసరు మంచివాడైతే ఆమెకిస్తాడా? నామాలవాడు అన్నట్టే ఆమెకు ఈ ఉద్యోగం ఏమంత అవసరం వున్నట్టు కన్పించడంలేదు. ఆ గుమాస్తా గాడిని చూసి నవ్వినట్టే ఆ ఆఫీసర్ని చూసీ నవ్విందేమో? అలా నవ్వితే చస్తే ఇవ్వడు!.

నామాలవాడు లోపలకు వెళ్ళాడు.

వీడు ఎంతసేపటికీ రాడేం? ఏదో వాగుతూ వుండివుంటాడు. వాడి అధికప్రసంగంచూసి ఆఫీసరు ఉద్యోగం ఇస్తాడా? చస్తే ఇవ్వడు!.

నామాలవాడు ముఖం చిన్నచేసుకొని పదిహేను నిమిషాల్లో బయటికివచ్చాడు. గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

ష్యూర్! వీడికీ ఉద్యోగం రానట్టే!

మరొకడు లోపలకు వెళ్ళాడు. ఐదు నిముషాల్లో బయటికి వచ్చి కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయాడు.

వీడికి ఎటూ రాదని తనుముందే అనుకున్నాడు.

తనకు ఛాన్స్‌లేక పోలేదు, వినయంగా సమాధానాలు చెప్పాలి. తన పరిస్థితి వివరించి చెప్పాలి. తనకు ఈ ఉద్యోగం ఎంత అవసరమో చెప్పాలి!

"చంద్రశేఖర్!" ప్యూన్ కేకవేశాడు.

చంద్రం ఉలిక్కిపడి లేచి నిల్చున్నాడు. తన కాళ్ళు వణుకుతున్నాయేం? కళ్ళు తిరుగుతున్నట్టుందే? తను వాళ్ళముందు మూర్ఛపోతే?

చంద్రం అరచేతుల్తో పట్టిన చెమట తుడుచుకుంటూ, ఎవరో బలవంతంగా తోసినట్టు లోపలకు వెళ్ళాడు. లోపల ఎదురుగా ఇద్దరు వ్యక్తులు కన్పించారు. ఎవరికి ముందుగా నమస్కరించాడో తెలియలేదు.

"కూర్చోండి!" అన్న వ్యక్తికి నమస్కరించి కూర్చున్నాడు చంద్రం. మరి కాసేపు నిల్చుంటే పడిపోతానేమో అనిపించింది.

ఏవేవో ప్రశ్నలు విన్పిస్తున్నాయి. చంద్రం నంగి నంగిగా అన్నిటికీ సమాధానాలు చెప్పాడు.

"ఆల్‌రైట్! ఇక నువ్వెళ్ళవచ్చు."

లాగి తన్నిన బంతిలా బయటికి వచ్చి పడ్డాడు. గుండెలనిండా గాలి పీల్చుకున్నాడు.

తను చెప్పదలచుకున్నది ఒక్కటీ చెప్పలేదు, తనకీ ఉద్యోగం వస్తుందా?

శాంతమ్మ ఆందోళన పడ్తున్న సరస్వతిని బుజ్జగిస్తూ "అబ్బాయికి ఉద్యోగం వచ్చింది. ఇవ్వాళ ఆఫీసుకు వెళ్ళాడు" అన్నది.

అప్పుడే లోపలకువస్తూ ఆ మాటలు విన్నాడు చంద్రం. గతుక్కుమన్నాడు.

"ఉద్యోగంలో చేరావా నాయనా?"

తల్లి అమాయకత్వం మీద చంద్రానికి కోపం వచ్చింది, జాలి కూడా కలిగింది.

"ఇంకా లేదు" అంటూ విసవిసా లోపలకు వెళ్ళిపోయాడు.

సరస్వతి విచారంగా లేచి వెళ్ళిపోయింది.

శాంతమ్మ దిగులుగా ఆలోచిస్తూ కూర్చుంది.

ఆ ఉద్యోగం టెర్లిన్ సూటువాలాకే వచ్చిందని తెలిసింది చంద్రానికి.

చంద్రం ఇంటర్వ్యూలకు వెళ్తూనే వున్నాడు. కాని, ఎక్కడా ఉద్యోగం దొరకడంలేదు.

దిగులుగా ఇంటి ముఖంపట్టిన చంద్రాన్ని రామం ఎదురై, కాఫీ హోటల్‌కు తీసుకెళ్ళాడు. అక్కడ్నుంచి సినిమాకు వెళ్ళారు.

ఇంటర్ వెల్‌లో లైట్లు వెలగ్గానే, అంతవరకూ తన ముందు సీట్లలో కూర్చుని వసపిట్టలా వాగుతున్న వాళ్ళెవరా అని చూశాడు.

చంద్రం నెత్తిమీద సుత్తిదెబ్బ తగిలినట్టు దిమ్మెరపోయాడు.

లేచి విసవిసా బయటికి వెళ్ళిపోయాడు.

ఇంటికివచ్చి లోపలకూ బయటకూ కోపంగా తిరుగుతున్న చంద్రాన్ని శాంతమ్మ వింతగా చూసింది.

ఏడు గంటలకు లక్ష్మి వచ్చింది. చేతిలో ప్యాకెట్ వుంది. లక్ష్మి ఉత్సాహంగా వుంది. కళ్ళు వెలిగిపోతున్నాయ్.

"ఏమిటా ప్యాకెట్?" గర్జించాడు చంద్రం.

లక్ష్మి బెదిరిపోయింది.

శాంతమ్మ విప్పి చూసింది.

టెర్లిన్ చీర!

"ఎక్కడిదే?" అడిగింది శాంతమ్మ కోపంగా.

"వనజ పుట్టినరోజు! నాకు ప్రెజెంటు చేసింది" అంది జంకుతూనే లక్ష్మి.

చంద్రం పిచ్చికోపంతో ఆ చంపా ఈ చంపా వాయించసాగాడు.

శాంతమ్మ అడ్డం పోయింది.

"వనజ కొనిచ్చిందా? నిజం చెప్పు! నువ్వెక్కడ్నుంచి వస్తున్నావో నాకు తెలుసు" అంటూ మళ్ళీ చెయ్యెత్తాడు.

"ఎవరో ఒకరు కొనిచ్చారు. నీకు కొనివ్వడం చేతకాదు. దద్దమ్మవు. ఉద్యోగం సంపాదించుకోవడం చేతగాని దద్దమ్మవు!"

"లక్ష్మీ!" శాంతమ్మ గట్టిగా అరిచింది.

లేచిన చంద్రం చెయ్యి గాలిలోనే ఆగిపోయింది.

"దద్దమ్మ కొడ్తున్నాడు. నా బట్టలు చూడు, ఎట్లా చిరిగిపోయాయో? కూడు పెట్టడం చేతకాదు కాని కొడ్తున్నాడు. పెద్ద మొగాడిలా!"

చంద్రం నిర్ఘాంతపోయి నిల్చున్నాడు.

శాంతమ్మ లక్ష్మి రెక్కపట్టుకొని లోపలకు ఈడ్చుకుపోయింది.

వెళ్తున్న చెల్లెలి బట్టలు చూశాడు. సిగ్గుతో తలవంచుకున్నాడు.

"ఎందుకురా, దాన్ని అన్ని దెబ్బలు కొట్టావ్?" శాంతమ్మ బాధగా ప్రశ్నించింది.

చంద్రం కృష్ణనూ, లక్ష్మినీ సినిమాహాల్లో చూసినట్టు చెప్పాడు.

శాంతమ్మకు మతిపోయినంత పనైంది. లక్ష్మిని పిచ్చిగా బాదింది.

లక్ష్మి ఎదురు తిరిగింది. కృష్ణ తనను ప్రేమిస్తున్నాడనీ పెళ్ళి చేసుకుంటాడనీ చెప్పింది. శాంతమ్మ తలబాదుకుని ఏడ్చింది.

చంద్రం అర్ధరాత్రిదాకా మంచం మీద అటూ ఇటూ దొర్లుతూ పడుకున్నాడు.

"దద్దమ్మా! దద్దమ్మా! నా బట్టలు చూడు ఎలా చిరిగిపోయాయో?" చెల్లెలి కంఠం చెవులో మారుమోగుతుంది.

అవును, తను దద్దమ్మే! తల్లికి అన్నం పెట్టలేనివాడు, చెల్లెలికి చీర కొనివ్వలేనివాడు! వయసులో వున్న చెల్లెలికి వంటినిండా బట్టలు ఇవ్వలేని తనకు కొట్టే అధికారం ఏముంది?

తను ఉద్యోగం సంపాదించాలి. తను ప్రయోజకుడు కావాలి.

అంతవరకూ తన తల్లికీ, చెల్లెలికీ ముఖం చూపించలేడు.

మంచం దిగాడు. తల్లీ చెల్లెలూ చాపమీద నిద్రపోతున్నారు. లక్ష్మి నిద్రలో నవ్వుతూంది. జీవితంలో అందని దేన్నో కలలో అందుకుంటుందేమో! ఓ క్షణం నిల్చుని చూశాడు.

చిన్నగా తలుపుతీసి చీకట్లో కలిసిపోయాడు.

# 19

శాంతమ్మ కుక్కి మంచంలో మునగతీసుకొని పడుకొని వుంది.

లక్ష్మి రెండు మోకాళ్ళ మధ్య తల ఇరికించి కూర్చుని వుంది.

తలుపు చప్పుడైంది.

శాంతమ్మ దిగ్గున లేచింది. "వచ్చావా నాయనా? వారం రోజులైందిరా, నువ్వు వెళ్ళిపోయి. కళ్ళే పోయాయి, ఎదురు చూసి చూసి" అంటూ మంచం దిగి, సరస్వతిని ఎదురుగా చూసి కుప్పకూలిపోయింది.

సరస్వతి దిగులుగా చూస్తూ నిల్చుంది.

"నువ్వా తల్లీ? రా కూర్చో!" అన్నది.

సరస్వతి ఇరవై రూపాయలు ఇస్తూ "అమ్మ ఇవ్వమన్నది" అని చెప్పింది.

"ఎందుకు తల్లీ! మా కష్టాలు ఒకనాటితో తీరేవా?" అన్నది శాంతమ్మ.

"భోజనం అయిందా అత్తయ్యా?...." లక్ష్మి కేసి చూస్తూ అన్నది.

"ఆ పొట్లం ఏమిటమ్మా?"

"అమ్మ ఈ చీరెలు ఇవ్వమంది" అంటూ నాలుగు సగబడ కట్టిన చీరెలు అందించింది సరస్వతి.

"లక్ష్మీ! లే ... ఎందుకలా కూర్చున్నావ్?" అంటూ వెళ్ళి లక్ష్మి పక్కగా కూర్చుంది సరస్వతి.

లక్ష్మి భోరున ఏడ్చింది.

శాంతమ్మకు ఏడుపు రావడం లేదు. కళ్ళలో తడి ఆరిపోయింది. కళ్ళు చెమ్మగిల్లడం మానేసి చాలా కాలం అయింది.

# 20

కృష్ణతో ముందు సీట్లో కూర్చున్న లక్ష్మిని పేరయ్య చూశాడు....

లక్ష్మి పేరయ్యను చూడలేదు.

పేరయ్య వడివడిగా శాంతమ్మ దగ్గిరకు వచ్చాడు.

లక్ష్మి సంగతి చెప్పాడు.

"ఆడపిల్ల! కాస్త అదుపులో పెట్టు" అన్నాడు.

శాంతమ్మ పిచ్చిదానిలా చూస్తూ కూర్చుండి పోయింది.

నోట మాట రావడం లేదు.

మెదడులో ఏవేవో చిటపట పేలుతున్నాయ్.

గుండెలో ఏదో తగలబడి పోతూ వుంది.

శాంతమ్మను ఆ స్థితిలో వదిలేసి చిన్నగా తప్పుకున్నాడు పేరయ్య.

శాంతమ్మ పిచ్చిదానిలా బయటికి వస్తూ గడప తగిలి పడిపోయింది.

కళ్ళజోడు అల్లంత దూరాన పడి పగిలి పోయింది.

లేచి కూర్చుని కళ్ళజోడు కోసం రెండు చేతులూ చాపి, నేలమీద తడుముతూ "బాబూ, చంద్రం! ఎక్కడి పోయావురా?..." అంటూ భోరున ఏడ్చింది.

అప్పుడే వచ్చిన సరస్వతి "ఊరుకో అత్తయ్యా!" అన్నది తను కూడా ఏడుస్తూ.

"లక్ష్మి ఎక్కడి కెళ్ళిందో తెలుసా తల్లీ?"

"తెలీదత్తయ్యా! ఎక్కడి కెళ్తుందీ? వనజా వాళ్ళింటికి వెళ్ళి వుంటుంది" అన్నది సరస్వతి.

"అవును, ఎక్కడి కెళ్తుందీ? వనజా వాళ్ళింటికెళ్ళి వుంటుంది." తనకు తానే చెప్పుకుంటున్నట్టు అన్నది శాంతమ్మ.

సరస్వతికి ఆమె కంఠంలో ఏ భావం తోచిందో - ఆశ్చర్యంగా అత్త ముఖంలోకి చూసింది.

లక్ష్మి వనజ ఇంటికే వెళ్ళి వుంటుంది! పేరయ్య కావాలనే కల్పించి చెప్పాడు- దుర్మార్గుడు! ఎందుకో పగబట్టి సాధిస్తున్నాడు. పేరయ్య అబద్ధం చెప్పాడు. లక్ష్మి అటువంటిదికాదు, అన్నెం పున్నెం తెలియని బిడ్డమీద అపవాదులు వేస్తున్నాడు. లక్ష్మి తన బిడ్డ - తన రక్తమాంసాలు పంచుకొని పుట్టిన బిడ్డ - చెడు మార్గంలో నడవదు.....

"లక్ష్మి ఎక్కడి కెళ్తుందత్తయ్యా, అంతగా ఆలోచిస్తున్నావ్?"

"లేదు తల్లీ! లక్ష్మి ఎక్కడకూ వెళ్ళదు, అది నా బిడ్డ!"

ఆమె ధోరణి వింతగా తోచింది సరస్వతికి.

"నా కళ్ళజోడు ఎక్కడ పడిందో చూడు తల్లీ!"

"అయ్యో, కళ్ళజోడు పగిలి పోయిందత్తయ్యా!" గాజు ముక్కలు ఏరుతూ అన్నది సరస్వతి.

"అయ్యో భగవంతుడా! నా రెండు కళ్ళు పొడిచేశావ్. నా చంద్రాన్ని నాకు దూరంచేసి, ఇప్పుడు ఆ కాస్తచూపుకూడా తీసేసుకున్నావా? ఈ జన్మకు మళ్ళీ కళ్ళజోడు కొనుక్కోగలనా? ప్రపంచాన్ని చూడగలనా?"

"దిగులు పడకత్తయ్యా! రేపు అమ్మని డబ్బడిగి తీసుకొని నీకు చత్వారం జోడు నేను తెప్పించి ఇస్తాగా!"

"తల్లీ! ఏనాటి రుణమమ్మా ఇది? మీ అమ్మకు వున్నమాత్రం అభిమానం అన్నయ్యకు లేదు" అన్నది శాంతమ్మ.

"దిగులు పడకు అత్తయ్యా! బావ తిరిగివస్తాడు."

"ఏమో తల్లీ!"

"తప్పక వస్తాడు. ఉద్యోగం సంపాదించుకొని వస్తాడు."

"ఎంత చల్లనిమాట అన్నావమ్మా!"

లక్ష్మి వచ్చింది.

జాకెట్ చిరిగిపోయి వుంది.

జుట్టు రేగిపోయి వుంది.

గాజులు పగిలి, చేతుల నుంచి రక్తం కారుతూ వుంది.

పిచ్చి చూపులు చూస్తూ నిల్చుంది.

"లక్ష్మీ! లక్ష్మీ! ఏమైంది?" కొయ్యలా నిలబడి వున్న లక్ష్మిని ఊపుతూ అడిగింది సరస్వతి.

లక్ష్మి బేలగా చూస్తూ నిల్చుంది.

"లక్ష్మి వచ్చిందా? లక్ష్మీ! ఏమైంది తల్లీ? ఇలా రా!" శాంతమ్మ రెండు చేతులూ ముందుకు చాచింది.

లక్ష్మి కదిలింది.

మాటాపలుకూ లేకుండా లోపలకు వెళ్ళిపోయింది.

నిద్రలో నడుస్తున్నట్లు నడుస్తూ వెళ్ళిపోయింది.

సరస్వతి అయోమయంగా చూస్తూ నిల్చుంది.

"లక్ష్మీ! మాట్లాడవేమే? ఇలారా!"

"లక్ష్మి లోపలకు వెళ్ళిపోయిందత్తయ్యా! లక్ష్మి అదోలా వుంది. నాకు భయం వేస్తూంది."

"ఏమిటమ్మా? లక్ష్మికి ఏమైంది?"

"ఏమో అత్తయ్యా!" జుట్టంతా రేగిపోయింది. గాజులు పగిలి పోయాయి. జాకెట్ చిరిగింది. ఈ లోకంలో వున్న మనిషిలా లేదు."

"లక్ష్మీ!" ఆడపులిలా కేక పెట్టింది శాంతమ్మ.

# 21

చంద్రం తల్లికోసం, చెల్లెలికోసం పట్నంలో అంగుళం అంగుళం గాలిస్తున్నాడు. పిచ్చివాడిలా తిరుగుతున్నాడు.

సత్రాలు వెదికాడు.

పేవ్‌మెంట్‌మీద బతికే జనంలో వెదికాడు.

కూలీల మధ్య వెదికాడు.

బస్‌స్టాండుల్లో, సినిమాహాలుల దగ్గిర వుండే బిచ్చగాళ్ళ మధ్య వెతికాడు.

ఎక్కడా కన్పించలేదు.

ఎక్కడకు వెళ్ళారు? ఎక్కడకు వెళ్తారు? ఎవరున్నారని వెళ్తారు? ఆత్మహత్య చేసుకున్నారేమో? చంద్రానికి ఆలోచించే ఓపిక కూడా లేకుండా పోయింది.

నడుస్తున్నాడు. ఎక్కడికో ఆ ప్రయాణం? తెలియదు.

ఎంతవరకు ఆ ప్రయాణం?

కాళ్ళున్నంత వరకు. కాదు-

ఆ కాళ్ళలో సత్తువ వున్నంత వరకు!

ఒక కాఫీ హోటల్ ముందు ఆగాడు.

పోలీసు వాన్ ఆగివుంది. ఆ వాన్‌చుట్టూ జనం వున్నారు.

చంద్రం జనం పైగా తలెత్తిచూశాడు.

వాన్‌లో ఆడపిల్లలు కన్పించారు.

"ఏమిట,! ఏమైంది?" ఒక కంఠం కుతూహలంగా.

"లాడ్జిమీద రైడ్ చేశారు." రెండో కంఠం.

"నలుగురు ముండలు దొరికారు." మూడో కంఠం.

"మరీ మన సమాజం కుళ్ళిపోయింది. మంచి కుటుంబాల వాళ్ళుకూడా లాడ్జీలకు ఎక్కుతున్నారు." మరో కంఠం.

చంద్రం ఉలిక్కిపడ్డాడు.

వాన్‌లోవున్న ఆడపిల్ల కేసి చూశాడు.

అప్పటికే వాన్ కదిలివెళుతూ, దూరంగా కన్పించింది.

ఆ ఆడవాళ్ళ ముఖాలు దూరంగా కన్పిస్తున్నాయి. ఆ ముఖాల్లో ఒక ముఖం.... ఆ ముఖం తనకు బాగా తెలిసిన ముఖం – ఎంత మందిలో వున్నా గుర్తించగల ఆ ముఖం... లక్ష్మిదే! తను పొరపాటు పడటంలేదు!

అవును లక్ష్మి! లక్ష్మి– తన చెల్లెలు! పోలీసువాన్‌లో తన చెల్లెలు! లాడ్జిలో పట్టుకున్నారు తన చెల్లెల్ని!

"లక్ష్మీ! లక్ష్మి," అంటూ పరుగుతీశాడు చంద్రం.

"ఎవరతను?" జనంలో నుంచి ఒక కంఠం.

"ఎవరో పాపం! పిచ్చివాడై వుంటాడు."

"చిన్నవాడే! చదువుకున్నవాడిలా కూడా కన్పిస్తున్నాడు."

చంద్రం పరుగెత్తుతున్నాడు.

కోర్టులో!... బోనులో ఒక అమ్మాయి నిల్చునివుంది.

"నీ పేరేమిటి?" లాయర్ ప్రశ్న.

"లక్ష్మి."

"మీ నాన్న పేరు?"

"గుర్నాథం."

"మీ అమ్మ?"

"శాంతమ్మ."

"అన్నదమ్ములు లేరా?"

"ఒక అన్న వున్నాడు."

"పేరు?"

"చంద్రం."

"ఏం చేస్తున్నాడు?"

"తెలియదు. మమ్మల్ని వదిలేసి పారిపోయాడు. మా అన్నయ్య వట్టి దద్దమ్మ!"

"అయ్యో, పరిగెత్తుతూ పడిపోయాడు!"

చంద్రం చుట్టూ జనం చేరారు.

ముఖంమీద నీళ్ళు కొట్టి సోడా తాగించారు.

కొంతసేపటికి చంద్రం తేరుకుని లేచి కూర్చున్నాడు.

తనెక్కడున్నాడు? పడిపోయాడా? మూర్ఛపోయాడా? కోర్టు వరకూ చేరుకో లేదా?

లేచి నిల్చున్నాడు. చుట్టూ జనం ఏవేవో ప్రశ్నలు వేస్తున్నారు. ఒక్కటీ వినిపించడంలేదు. వినిపించినా వారేభాష మాట్లాడుతున్నారో అర్థం కావడంలేదు.

అక్కడనుంచి కదిలాడు. నడుస్తున్నాడు. కోర్టుకేసి నడుస్తున్నాడు.

కోర్టు చేరుకున్నాడు.

బోనులో ఒక అమ్మాయి తలవంచుకొని నిల్చుని వుంది.

లక్ష్మికాదు. బెంచీమీద కూర్చొని వున్న మిగతా ముగ్గుర్నీ చూశాడు. వారిలో లక్ష్మిలేదు.

"నీ పేరు?" బోనులో నిల్చున్న అమ్మాయిని లాయర్ ప్రశ్నించాడు.

"సావిత్రి."

కోర్టులో నవ్వులు. నవ్వుల మధ్యనుంచి "వీళ్ళదుంపతెగ వీళ్ళందరూ పతివ్రతలపేర్లే పెట్టుకుంటారు" అంది ఓ కంఠం. మళ్ళీ నవ్వులు.

చంద్రం చుట్టూ చూశాడు.

లాయర్ కూడా ముసిముసిగా నవ్వుకుంటున్నాడు.

"నీ కెవరూ లేరా?"

"లేరు." తల వంచుకుని సమాధానం చెప్పింది.

ఇంకా ఏవేవో భరించరాని ప్రశ్నలు.

చంద్రం నిలువెల్లా కంపించిపోతున్నాడు.

ఇది పవిత్ర భారతదేశం! ఇక్కడ స్త్రీని గౌరవించినట్టు ఏ దేశంలోనూ గౌరవించరు! "యత్ర నార్యస్తు పూజ్యంతే తత్రరమంతే దేవతా!' అన్న దేశం మనది. స్త్రీని మాతృమూర్తి అన్నారు. గృహ లక్ష్మి అన్నారు. అన్నపూర్ణ అన్నారు. ఇంకా ఏదేదో అన్నారు.

మరి ఇంతమంది మగవాళ్ళ మధ్యలో నిలబెట్టి ఆ ఆడపిల్లను అలాంటి ప్రశ్నలు వేస్తున్నాడేం ఆ లాయరు? ఆడదాన్ని అడగరాని ప్రశ్నలు. ఆ ప్రశ్నలు విని మానవత్వమే సిగ్గుపడుతుంది. ఇదా మన పవిత్ర భారతదేశం? ఆ లాయర్ అటువంటి ప్రశ్నలు వెయ్యాల్సింది ఒక నిస్సహాయురాల్నా? ఆమెను ఆ స్థితికి జార్చిన సంఘాన్నికదా అతను ప్రశ్నించవలసింది?

ఆ అమ్మాయి ఎవరు? లక్ష్మికాదు. లక్ష్మిలాంటి ఒక అమ్మాయి. తన చెల్లెలు కాదు. కాని, తనలాంటి ఓ అన్నకు చెల్లెలు.

తన చెల్లెలులాంటి చెల్లెలు.

వాళ్ళంతా ఎవరో ఒక అన్నకు చెల్లెళ్ళే! తన చెల్లెలులాంటి చెల్లెళ్ళు. రోజూ ఇలా బోనులో నిల్చుంటూనే వున్నారు!

ఎందుకు?

తన చెల్లెలు లక్ష్మికూడా ఒకరోజు ఇలాగే బోనులో నిల్చుని సమాధానాలు ఇస్తుంది!

చంద్రం ఏడుస్తున్నాడు. ఆడపిల్లలా ఏడుస్తున్నాడు.

చెంపలమీదుగా నీరు కారిపోతూవుంది.

"అందులో ఎవరైనా మీ వాళ్ళున్నారా?" ఆ ప్రశ్నకు చంద్రం ఉలిక్కిపడి కళ్ళు తుడుచుకున్నాడు.

"వున్నారు" అన్నాడు.

"అందులో ఎవరు?"

"అందరూ! వాళ్ళందరూ నా వాళ్ళే! నా చెల్లెళ్ళే!" అని విసురుగా బయటికి వెళ్ళిపోతున్న చంద్రాన్ని వింతగా చూశాడు ఆ పెద్ద మనిషి.

"పాపం, పిచ్చివాడేమో!" పైకే అనేశాడు ఆ పెద్దమనిషి, వెళ్ళిపోతున్న చంద్రంకేసి చూస్తూ.

తన చెల్లెలు లక్ష్మి ఏమైంది? ఆమెకూడా ఒక రోజు ఏదో లాడ్జిలో... హే భగవాన్!.... భగవంతుడున్నాడా? లేడు లేడు! కొందరు మోసగాళ్ళు సృష్టించిన ఆ భగవంతుడు.....

"అయ్యా, ఆగండి! ఓ క్షణం ఇటు చూడండి."

చంద్రం ఆగాడు.

పక్కకు చూశాడు.

పేవ్ మెంటుమీద శవం!

శవంనిండా గుడ్డ కప్పివుంది.

ఆడో మగో తెలియడం లేదు.

"మీకు తోచింది ఇచ్చి పుణ్యం కట్టుకోండి."

చంద్రం తలెత్తిచూశాడు. ఇద్దరు యువకులు, మాసినదుస్తుల్లో వున్నారు.

"దిక్కులేని ముసలమ్మ. పాపం, బాగా బతికినమనిషిలా ఉంది."

వాళ్ళ మాటలకు ఉలిక్కిపడ్డాడు చంద్రం.

"మనలాంటి బిడ్డల్నికన్న మనిషి."

చంద్రం వెన్నెముకలో ఏదో జరజర పాకింది.

"నీలాంటి నాలాంటి బిడ్డను కన్నతల్లి. దిక్కులేని చావు చచ్చింది. దహన సంస్కారాలు చేసేవాళ్ళు లేరు. అందుకే బాబూ.... పుణ్యం కట్టుకోండి. మీకు తోచింది ఇవ్వండి."

ఆ దారినే పోతున్న ఓ పెద్దమనిషి ఆగి జేబులోనుంచి ఓ పది పైసలు బిళ్ళ పరచివున్న బట్టమీదకు విసిరి కొంత పుణ్యం సంపాదించుకున్నాననే సంతృప్తితో ముందుకు కదిలాడు.

దిక్కులేని ఆడది!
వయసు మళ్ళిన ఆడది!
తనలాంటి బిడ్డల్నికన్న ఓ తల్లి!
బాగా బతికిన మనిషి!
దిక్కులేని చావు చచ్చింది!
ఎవరు? ఎవరా ఆడది?
ఎవరు? ఎవరి తల్లి?
ఎవరితల్లి అయితేనేం? ఒక తల్లి! తనలాంటిబిడ్డను కన్న ఓ తల్లి!
ఆమె- ఆమె ఒకవేళ తన తల్లి కాదు కదా?
చంద్రం నిలువెల్లా వణికిపోయాడు.
తన తల్లి దిక్కులేని చావు చచ్చిపోయిందా?
కుక్క చావు చచ్చిపోయిందా?
దహన సంస్కారాలు చేసేవాళ్ళు లేకుండా చచ్చిపోయిందా?
రెండడుగులు ముందుకు వేశాడు.
శవంమీదకు వంగాడు.

"ఏమిటి బాబూ, చూస్తున్నారు? శవం లేదనా? మేం అబద్ధం చెబుతున్నామనా, మీ అనుమానం? తీసిచూడండి, ఆ తల్లిని చూడండి" అన్నాడు డబ్బులు అడుగుతున్న వాడు.

చంద్రం పైన కప్పినగుడ్డ పట్టుకోబోయాడు.
చటుక్కున ఎవరో లాగేసినట్టు చెయ్యి వెనక్కు తీసుకున్నాడు.
కాదు... కాదు... తన తల్లి కాదు. ఒక అడుగు వెనక్కు వేశాడు.
తన తల్లే అయితే....?
ఆగిపోయాడు.
తన తల్లే అయితే? అయితే, తను ఏం చెయ్యగలడు?
ఆమెకు దహన సంస్కారాలు చెయ్యగలడా?
వాళ్ళలాగ తను డబ్బు అడుక్కోగలడా?
తనచేత కాదు. అదికూడా తనకు చేతకాదు!
తను దద్దమ్మ! దద్దమ్మ!
తల్లికి దహన సంస్కారాలు చెయ్యలేనివాడు!
తనేమిటి ఇలా ఆలోచిస్తున్నాడు? ఆమె తన తల్లి కాదు.
కాని... కాని... ఆమె ఒక తల్లి!
తనలాంటి కొడుకుని కన్న ఒక తల్లి!
తన తల్లిలాంటి మరో తల్లి!
చంద్రం గిర్రున వెనక్కు తిరిగాడు.

పరుగు తీశాడు.

"పాపం, పిచ్చివాడు!" అన్నాడు, అలా పరుగుతీస్తూ వెళ్తున్న చంద్రాన్ని చూస్తూ డబ్బు అడుక్కుంటున్నవాడు.

# 22

రాత్రి పన్నెండు దాటుతూ ఉంది.

నగరం నిర్మానుష్యంగా ఉంది.

చంద్రం గోడకు ఆనుకొని పేవ్‌మెంట్ మీద కూర్చుని ఉన్నాడు. కడుపులో పేగులు కిరకిర చుట్టుకుపోతున్నాయి. గుండెలో తాటాకు మంటలు లేస్తున్నాయి.

ఏమిటి ఈ బాధ? తన తల్లి చచ్చిపోయిందనా? దహన సంస్కారాలు చేసేవాళ్ళుకూడా లేక చచ్చిపోయిందనా?

కాదు!

తన చెల్లెలు లక్ష్మి లాడ్జిలో అరెస్టు అయిందనా? కోర్టులో పది మంది ముందు తలవంచుకొని నిల్చుని లాయరు వేస్తున్న అసహ్యకరమైన ప్రశ్నలకు సమాధానం ఇస్తున్నదనా?!

కాదు!

మరి ఏమిటిది? ఏమిటీ దారుణ బాధ!

ఆకలి! ఆకలిబాధ! ప్రపంచంలోని అన్ని బాధలకంటే భయంకరమైన బాధ.

ఈ బాధ భరించలేకే తల్లి పిల్లను అమ్ముకుంటుంది.

ఇందుకే ఆడది శీలం అమ్ముకుంటుంది.

ఈ బాధ భరించలేకే మనిషి ఆత్మహత్య చేసుకుంటున్నాడు.

వార్తాపత్రికల్లో ఆకలిబాధను భరించలేక ఎన్నో కుటుంబాలు ఆత్మహత్యలు చేసుకున్నాయని తను ఎన్నోసార్లు చదివాడు.

అప్పుడు తను నిజంగా ఆకలి అంత బాధాకరమా అని ఆశ్చర్య పోయాడు. తను అన్నం తిని మూడురోజులైంది.

"ఎవరక్కడ?"

చంద్రం తలెత్తి చూశాడు.

ఇద్దరు కుర్రాళ్ళు చేతుల్లో బక్కెట్లూ, బ్రష్షులూ పట్టుకొని నిల్చున్నారు.

"ఎవరు నువ్వు?"

తను ఎవరు అని అడుగుతున్నారు! అవును, తనెవరు? తను ఒక మనిషి! ఈ భారతదేశంలో వున్న కోట్లజనంలో ఒకడు!

చంద్రం పలకలేదు. చూస్తూ వుండిపోయాడు. మాట్లాడాలని లేదు. కళ్ళు మూసుకుపోతున్నాయి బాధ సహించలేకుండా ఉన్నాడు.

ఒక కుర్రాడు బక్కెటూ, బ్రష్షూ వదిలిపెట్టి చంద్రం పక్కన కూర్చుని పలకరించాడు.

"ఆకలిగా వుందా?" అడిగాడు ఆ కుర్రాడు.

చంద్రం ఆ కుర్రాడి కళ్ళలోకి చూశాడు.

"ఏమిటి అలా చూస్తావ్? నీకు ఆకలిగా వుందని నా కెలా తెలిసిందనేనా?" నవ్వుతూ అడిగాడు ఆ కుర్రాడు.

అవును, నిజమే! ఎవరూ తన ఆకలి ఈ మూడురోజులుగా గుర్తించలేదు. ఆకలిగా వుందా అని అడగలేదు.

"ఆకలి ఎలా వుంటుందో నాకు తెలుసు! అది ఎక్కడవున్నా యిట్టే గుర్తు పట్టేస్తాను" అన్నాడు ఆ కుర్రవాడు.

చంద్రానికి మాట్లాడే ఓపికలేదు.

"అవును!" అన్నట్టు తలఊపాడు చంద్రం.

"ఒరేయ్! త్వరగా వెళ్ళి, ఆ టీ స్టాల్‌నుంచి రెండు బన్నులు పట్టుకురా! ఒక టీకూడా తీసుకురా!" అన్నాడు ఆ కుర్రాడు రెండో వాడితో.

రెండోవాడు బక్కెట్టూ బ్రష్షూ కిందపెట్టి టీస్టాలుకేసి పరుగు తీశాడు.

"చంద్రం కళ్ళతోనే కృతజ్ఞత తెలుపుకున్నాడు.

అర్థం అయిందన్నట్టు ఆ కుర్రవాడు నవ్వాడు.

ఐదు నిముషాల్లో రెండో కుర్రవాడు బన్నులూ, టీ తీసుకొచ్చాడు.

చంద్రం ఆవురావురుమని తింటూవుంటే ఆ ఇద్దరూ చూస్తూ కూర్చున్నారు. చంద్రం బన్నులు తిని, టీ తాగాడు. ఐదు నిమిషాలు గోడకు ఆనుకొని కళ్ళు మూసుకున్నాడు. కడుపులో జంతువు శాంతించింది. కదలకుండా పడుకుంది.

చంద్రం కళ్ళు తెరిచాడు. కొంచెం ఓపిక వచ్చింది.

"థ్యాంక్స్!" అన్నాడు.

"చదువుకున్నావా?"

"అవును, బి. ఏ. పాసయాను."

"ఉద్యోగం దొరకలేదు."

"అవును."

"మేం పని ఇప్పిస్తాం, చేస్తావా?"

"నిజంగా ఇప్పిస్తారా? ఏంపని? నీ పేరేమిటి?"

"నీ పేరు మేం అడిగామా?"

"లేదు."

"నువ్వుకూడా మా పేర్లు అడక్కూడదు. మేం ఇద్దరం సంవత్సరం నుంచి కలిసివుంటున్నాం. మా ఇద్దర్లో ఏ ఒక్కరికీ మా అసలు పేర్లేమిటో తెలియదు. వేరే పేర్లు – మా నాయకుడు పెట్టిన పేర్లతోనే పిల్చుకుంటాం. నువ్వూ మాలో చేరితే నీకూ ఓ కొత్తపేరు పెడ్తాం" అన్నాడు మొదటి కుర్రాడు.

చంద్రం అయోమయంగా చూశాడు.

"ఇన్నిటికీ నీకు పని కావాలా, వద్దా?" అన్నాడు ఆ కుర్రవాడు.

"కావాలి... ఏంపని చెయ్యమంటారో చెప్పండి." చంద్రం లేచి నిల్చున్నాడు!

"ప్రత్యేకం ఫలానా పని అటూ వుండదు. ఎప్పుడు ఏది అవసరమైతే అదే చెయ్యాలి. జీతం వుండదు. మేం తిన్నప్పుడు నువ్వు తింటావ్. మేం వస్తుంటే నువ్వా వుంటావ్. ఇష్టమేనా?"

"ఇష్టమే!"

"అయితే, నువ్వు మాలో ఒకడివిగా వుంటావ్ ఇవ్వాల్టినుంచి. ఇప్పుడు నువ్వు చెయ్యాల్సిన పని చెప్తాను. నీకే అర్థం అవుతుంది – మేము ఎవరిమో, ఏం చేస్తుంటామో!"

"ఏం చెయ్యాలో చెప్పండి!" చంద్రం ఉత్సాహంగా అడిగాడు.

"ఆ బక్కెట్టూ, బ్రష్షూ తీసుకో!"

చంద్రం అర్థంకానట్టు చూశాడు.

"చూడు, ఈ కాగితంలో వున్న నినాదాలు గోడలమీద రాయాలి."

చంద్రం కాగితం అందుకున్నాడు. చదువుకున్నాడు. మళ్ళీ మళ్ళీ చదివాడు.

"విప్లవం వర్ధిల్లాలి!"

"ఈ బూర్జువా సమాజాన్ని సమూలంగా ధ్వంసం చేయాలి!"

"పోలీసు దౌర్జన్యం నశించాలి!"

"మనిషి మనిషిగా బతకాలంటే ఒకటే మార్గం – అదే విప్లవ మార్గం! సాయుధ విప్లవం వర్ధిల్లాలి!!"

చంద్రానికి అర్థం అయింది.

ఓ క్షణం ఆలోచించాడు.

మెదడులోకి వెచ్చటి రక్తం చిమ్మింది. కళ్ళు ఎర్రబడ్డాయి.

శరీరంలోకి కొత్త శక్తి ఏదో ప్రవేశించింది.

బక్కెట్టూ బ్రష్షూ తీసుకున్నాడు.

ఇద్దరు కుర్రాళ్ళూ ఒకరిముఖంలోకి ఒకరు చూసుకొని ఉల్లాసంగా నవ్వుకున్నారు.

"ఈ క్షణంనుంచి నీ పేరు సూర్యం! కామ్రేడ్ సూర్యం! చూడు కామ్రేడ్, జాగ్రత్తగా విను. ఇదుగో గ్రెనేడ్! ఆత్మరక్షణకు, శత్రు సంహారానికి ఇదే ఆయుధం! మేం ఆ పక్క సందుల్లోని గోడల మీదా రాస్తాం, ఈ గోడమీద నువ్వు రాసి మమ్మల్ని వచ్చి కల్సుకో!" అంటూ వాళ్ళిద్దరూ చెరోవైపుకు వెళ్ళిపోయారు.

చంద్రం గబగబా రాస్తున్నాడు.

ఆవేశంగా రాస్తున్నాడు.

గోడ బారుగా అన్ని నినాదాలు రాశాడు. దూరంగా నిల్చుని చదువుకున్నాడు. మరోసారి వాటికేసి చూశాడు.

ఆ నినాదాల మధ్యగా ఏదో వెలుగు కన్పించింది! ఆ వెలుగునే చూస్తూ నిల్చున్నాడు.

చంద్రం కళ్ళకు ఆ వెలుగులో కొత్త ప్రపంచం కన్పించింది.

ఆ ప్రపంచంలో ఆడవాళ్ళూ మగవాళ్ళూ, పిల్లలూ వృద్ధులూ అందరూ ఉల్లాసంగా కన్పిస్తున్నారు. ఉత్సాహంగా పనులు చేసుకుంటున్నారు.

అందరూ ఆరోగ్యంగా కన్పిస్తున్నారు.

అందరూ ఏదో ఒక పని చేస్తున్నారు.

అందరూ ఆనందంగా అందంగా వున్నారు. మానవత్వంలోని సౌందర్యమంతా అక్కడే కన్పిస్తూ వుంది. అందరూ వెలుగులోనే తిరుగుతున్నారు.

అక్కడ – ఆ ప్రపంచంలో చీకటిని వెతుక్కునే గుబ్బిలల్లాంటి మనుషులు లేరు.

ఇతరుల రక్తం పీలుస్తూ ఉబ్బిపోయి నల్లగా అసహ్యంగా, జుగుప్సాకరంగా బ్రతికే జలగలు లేవు. ఎప్పుడైనా ఎక్కడైనా ఒక జలగ కన్పిస్తే– దానిమీద సున్నం చేసి, తాగిన రక్తాన్ని కక్కిస్తున్నారు.

తన చెల్లెలూ, తన చెల్లెలులాంటి చెల్లెళ్ళు అక్కడ కడుపు కోసం వళ్ళు అమ్ముకోవడం లేదు.

తన తల్లీ, తన తల్లిలాంటి తల్లులూ దిక్కులేకుండా కుక్కచావు చావడం లేదు.

రోడ్లపక్కన దిక్కులేని శవాలు లేవు. ఆకలిబాధతో ఆత్మహత్యలు చేసుకొనేవాళ్ళు లేరు.

అక్కడ – ఆ ప్రపంచంలో వెలుగువైపుకు వెళ్తున్న మనిషిని చీకట్లోనుంచి వెంటబడి కాల్చే ఎర్రటోపీలు లేవు.....

హెడ్‌లైట్సు! కళ్ళు మిరుమిట్లు గొలిపే కాంతి!

జీపులు ఆగిన శబ్దం!

"కామ్రేడ్, తప్పుకో!" పరుగెత్తుతూనే చెప్పారు ఆ కుర్రవాళ్ళు.

ఎక్కడికి తప్పుకోవాలి?

ఎందుకు తప్పుకోవాలి?

క్షణంలో సగంసేపు ఆలోచన!

ఎక్కడికి,

ఎందుకు?

తుపాకి పేలింది!

నడిరోడ్డుమీద హాండ్ గ్రెనెడ్ బద్దలయింది!

ఆ ఎర్రటి వెలుగులోకి చూస్తూ అతను అక్కడే నిలబడాడు.

అయితే, అతను ఇప్పుడు ఇతరుల వెలుగుతో ప్రకాశిస్తున్న చంద్రుడు కాదు!

అంతకంటే అసలే కాదు–దద్దమ్మ చంద్రం!

అతను ఇప్పుడు అక్షయ కోటి కిరణాలతో స్వయంప్రకాశమానుడైన సూర్యుడు!

కామ్రేడ్ సూర్యం!

1987లో తెలుగు విశ్వవిద్యాలయం

అవార్డు పొందిన నవల

# మరో దయ్యం కథ

మొదటి ముద్రణ: మే, 1984.

# మరో దయ్యం కథ

ప్యాసెంజరులో ప్రయాణం ఎంత దారుణంగా ఉంటుందో అందరికీ తెలిసిన విషయమే. దాదాపు రైల్లో ఎక్కి నాలుగు గంటలు దాటింది. ప్రతి చిన్న స్టేషన్‌లోనూ ఆగుతూ పోతోంది.

"ఇది ఏ స్టేషనూ?" వెనక్కువాలి అంతవరకూ కునికిపాట్లు పడ్తున్నాను. బండి ఆగగానే కళ్ళు తెరిచి టైం చూసుకున్నాను. ఇంకా ఆరు కాలేదు. ఎండాకాలం కావడంవల్ల బండి ఆగినప్పుడల్లా ఉక్కపోస్తూంది. ఇంకా నాలుగుగంటల ప్రయాణం చెయ్యాలి ఈ బండిలో.

"ఇదేస్టేషన్?" అని విసుగ్గా అడిగాను, నాపక్కన ఉన్న వయసు మళ్ళినాయనను.

"నక్కలపాలెం!" అన్నాడు ఆ పెద్దమనిషి.

"గాజులపాలెం ఎన్ని గంటలకు వెళ్తుంది?" మళ్ళీ అడిగాను.

అతను నా ముఖంలోకి చూశాడు.

"నువ్వు గాజులపాలెం వెళ్ళాలా బాబూ? ఎవరింటికీ?"

ఈ పెద్దమనిషి ఊరు గాజులపాలెం కాబోలు! ఇతని ద్వారా కొన్ని వివరాలు తెలుసుకోవచ్చు. రాత్రి పదిగంటలకు ప్రయాణం చెయ్యటం - అదీ నడిచి ఆరు కిలోమీటర్లు వెళ్ళాలంటే - ఎంతకాదన్నా భయంగానే ఉంది. అవసరం అయితే ఈ రాత్రికి ఈ పెద్దమనిషి ఇంట్లోనే తలదాచుకుంటే సరి. కాని, అతడు రాత్రికే రమ్మన్నాడు. ఎందుకో?

"మీది గాజులపాలెమా?" ఆశగా అడిగాను.

"కాదు."

"ఎక్కడ్దాకా వెళ్ళాలి!"

"తుమ్మలపాలెం. వచ్చే స్టేషన్‌లో దిగి, ఒక మైలు నడవాలి." ఆ పెద్దమనిషి చెప్పాడు.

"మరి గాజులపాలెంలో మీ బంధువులెవరైనా ఉన్నారా!" మిణుకు మిణుకుమనే ఆశతో అడిగాను.

"మా వేలువిడిచిన మేనమామది ఆ ఊరే. అయితే, ఇప్పుడు ఆ కుటుంబం వాళ్ళెవరూ అక్కడ లేరు."

నాకు వళ్ళు మండిపోయింది. ఇంతమాత్రానికే ఎవరింటికెళ్ళాలని ఎందుకడగాలో? చాలామందికి ఇదే జబ్బు. అనవసరమైన ప్రశ్నలు వేస్తారు. ముఖ్యంగా ఇలాంటి ప్రయాణాల్లో.

పక్క స్టేషన్‌లో ఆ పెద్దమనిషి దిగిపోయాడు. ఒక్కసారిగా జనం వచ్చిపడ్డారు. వాళ్ళతోపాటు తట్టలూ, బుట్టలూ, వలలూ, పారలూ మొదలైన సామాన్లు. ఒకడు నిక్కరు మాత్రమే వేసుకున్నవాడు దాదాపు నా వళ్ళోనే కూర్చున్నాడు. నల్లటి శరీరం. బలమైన శరీరం నుండి ఓడుతున్న ఖర్మజలం. వాసన. అనేక శరీరాలనుంచి వస్తున్న వాసనలు మిళితమైన చిత్రమైన వాసన. ఏదో వాసన. నాకు తల తిరిగినట్లయింది. మధ్యలో అడుక్కునేవాళ్ళ గోల ఒకటి.

ఛా! ఎందుకొచ్చిన కర్మ! ఈ ప్రయాణం ఎందుకు చేస్తున్నట్టు? నామీద నాకే కోపం వస్తోంది.

జేబులో ఉన్న టెలిగ్రాం బయటికి తీశాను. అప్పటికే ఓ పాతికసార్లు చదివిన టెలిగ్రాం మళ్ళీ చదవసాగాను:

"మీరు మంచి రచయిత. మీరు పూర్వజన్మలనూ, ఆత్మలనూ, దయ్యాలనూ, భూతాలనూ నమ్మరని నాకు తెలుసు. మీకు తెలియనివి లేవనుకోవడం కూడా ఒక రకమైన మూర్ఖత్వమే. అజ్ఞానమే. మీరు హేతువాది అని నాకు తెలుసు. అయినా, రచయితగా కొత్త విషయాలనూ, అనుభవాలనూ, ఇతరులనుంచి తెలుసుకోవడం మీ బాధ్యతగా నేను భావిస్తున్నాను. నా పేరు భైరవమూర్తి. ఈ దుమ్ములగూడెంలో ఒకప్పుడు తిరుగులేని ఆసామిగా చలామణీ అయ్యాను. ఇప్పుడు నా వయసు తొంభయ్ రెండు ఏళ్ళు. నా పొలాల్లోనే ఒక ముసలమ్మ హత్య జరిగింది. ఆ హత్యకు సంబంధం ఉందనుకున్న మరో ముగ్గురి శవాలు కూడా మా పొలాల్లోనే దొరికాయి. ఇది జరిగి నలభై ఏళ్ళు గడిచాయి. పోలీసువాళ్ళకు ఈ కేసు అంతుపట్టలేదు. చివరకు ఇటీవలే ఆ కేసును క్లోజ్ చేసుకొన్నారు. ఆ హత్యా రహస్యం నాకు తెలుసు. ఇంకా మీరు నమ్మని, ఊహించని ఎన్నో విషయాలను మీ అనుభవంలోకి తేగలను. నేను కొద్దిరోజుల్లోనే వెళ్ళిపోతున్నాను. అందుకే మీరు ఈ ఉత్తరం చూడగానే బయలుదేరి రండి. బండి గాజులపాలెం వచ్చేసరికి 10 గంటలు అవుతుంది. అరు కిలోమీటర్లు మాత్రమే నడవాల్సి ఉంటుంది. ఎంత చిన్నగా నడిచినా రెండున్నరగంటల్లో రాగలరు. ఎలాగయినా తెల్లవారు ఝాము నాలుగు గంటలకు ముందే ఇక్కడకు మీరు చేరాలి. మీరు నమ్మని ఎన్నో విషయాలను మీకు చూపిస్తాను: మీ దృక్పథమే మారుతుంది. నవలకు మంచి ఇతివృత్తం! వెంటనే బయలుదేరండి. ఇట్లు – భైరవమూర్తి."

చదివి ముగించి మడతపెట్టి జేబులో పెట్టుకొన్నాను. ఏడు గంటలైంది. వేడి తగ్గింది. బండి వెళ్తున్నప్పుడు చల్లటిగాలి శరీరానికి సోకుతోంది. కొంత హాయిగా అన్పించింది. బండి చాలావరకు ఖాళీ అయింది. కళ్ళు మూసుకొని వెనక్కు వాలాను. కునుకు పట్టింది.

అదిరిపడి, ఇంతెత్తున ఎగిరి, మళ్ళీ ఎలా కూర్చుని ఉన్నానో అదే పోజులో సీటులో కూర్చోబడ్డాను.

బ్రహ్మాండం బద్దలైపోతున్నట్టు ధ్వని. గూబల్ని అదరకొడుతోంది ఆ శబ్దం. కొండలమీదనుంచి రైలు దొర్లిపోతున్నట్టు అన్పించింది. భయపడటానికి బుర్ర పనిచేస్తేగా!

కొద్ది నిముషాల తర్వాత గుండె కుదుటపడింది.

ఇది యాక్సిడెంట్‌కాదు. రైలు దొర్లడంలేదు. అలాంటిది జరిగితే ఇంతసేపు ఇలా కూర్చోగలనా!

అప్పటికి దాదాపు అందరూ పక్క ఊళ్ళల్లో దిగిపోయారు.

నా పెట్టెలో ఉన్నవాళ్ళు నలుగురే. వాళ్ళను చూశాను. వాళ్ళంతా ఆ శబ్దాన్నిగానీ, బండి ఊపునుగానీ పట్టించుకున్నట్టుగా కన్పించలేదు. ఇది వాళ్ళకు మామూలులా అన్పించింది.

చిన్నగా కిటికీ చెక్కలు ఎత్తాను.

అంతా చీకటి. కటిక చీకటి. ఏమీ కన్పించడం లేదు. బండి ఒక టనల్ గుండా పోతోందని అర్థం చేసుకున్నాను. అపాయం తప్పినందుకు గుండెలనిండా గాలి పీల్చుకొని వదిలాను.

ప్యాసెంజరు బండి టనల్ నుంచి బయటపడి, పల్లం నుంచి ఎత్తుకు ఎక్కుతోంది.

నల్లమల అడవుల్లో, కొండల అంచుల్ని చుట్టుకొంటూ కొండ చిలువలా పోతోంది రైలు. కిటికీ నుంచి బయటకు చూస్తుంటే మనసు బిక్కుబిక్కుమనసాగింది.

ఒక చిన్న స్టేషన్‌లో బండి ఆగింది. స్టేషన్ ఆ చీకట్లో కన్పించడం లేదు. చిన్న దీపం ఎక్కడో మినుకు మినుకుమంటూ కన్పిస్తోంది.

నా పెట్టెలో ఉన్నవాళ్ళంతా దిగిపోతున్నారు.

"ఇదే స్టేషన్? గాజులపాలెమా?" చివరగా దిగుతున్న ఆడ మనిషిని అడిగాను.

"కాదు. తోకపల్లి. గాజులపాలెం వచ్చేస్టేషన్!" అని దిగేసింది ఆ ఆడకూతురు.

బండి పొగవదుల్తూ బయలుదేరింది. బిక్కు బిక్కుమంటూ ఒక్కడ్నే కూర్చున్నాను. బయటికి చూడాలంటే భయంగా ఉంది. చిమ్మ చీకట్లో కన్పించే రకరకాల చెట్లూ చేమలూ, అనేక రూపాల్లో కన్పిస్తున్నాయి.

ఈ కొండలలో, అరణ్యాలమధ్య, ఈ మార్గం ప్లాను ఏ ఇంజనీరు వేశాడో? ఎంతమంది కూలీలు రాత్రింబవళ్ళు పనిచేశారో? అనాదినుండీ మానవుడు ప్రకృతిమీద విజయాన్ని సాధించడానికి పోరాడుతూనే ఉన్నాడు. ఆ పోరాటంనుంచి ఉద్భవించిందే ఈ నాగరికత, విజ్ఞానం.

ఆలోచనల్లో ఉన్న నేను రైలు ఆగడాన్ని గమనించలేదు.

"గాజులపాలెం! గాజులపాలెం!" అని పోర్టరు హెచ్చరించాడు.

నేను చివ్వున లేచి సూట్‌కేసు చేత్తో పట్టుకుని బండి దిగాను. ప్లాట్‌ఫారం అంతకిందకు ఉందని ఊహించని నేను బొక్కబోర్లాపడ్డాను. పెట్టె అల్లంతదూరంలో పడింది. పెద్దగా దెబ్బలు తగల్లేదు. చివుక్కున లేచి నిల్చున్నాను. ఎవరూ చూడలేదుగదా అని చుట్టూ కలియజూచాను. అప్పటికే బండి బయలుదేరింది.

గార్డు పెట్టె ముందునుంచి పోతున్నప్పుడు అతను చెయ్యి ఊపాడు. పలకరింపుగా నవ్వాడేమో! కన్పించలేదు.

ప్లాట్‌ఫారం మీద ఎవరూ లేరు. నాతోపాటు వేరే పెట్టెల్లోనుంచి దిగినవాళ్ళు స్టేషన్‌బయటికి వెళ్ళిపోయారు. టికెట్లు తీసుకొని స్టేషన్ మాస్టర్ వెళ్ళిపోయాడు.

నాకు ఏం చేయాలో తోచక నిలబడి ఆలోచిస్తున్నాను. దుమ్మలగూడెం దారి ఎటో తెలియదు. ప్లాట్‌ఫారం చివర్లో వెలుగుతున్న ఆ చిన్న దీపాన్ని కూడా ఆర్పేశాడు పోర్టరు.

"ఎందుకోయ్ అదికూడా ఆర్పుతావ్?" అరిచాను.

కాని వాడు వినిపించుకోలేదు. పట్టాలకు అడ్డంగా దాటి వెళ్ళిపోయాడు. వాడి ఇల్లు - ఇల్లేమిటి? ఇల్లులాంటిదేదో ఆ పట్టాలకు అవతల ఉండి ఉండాలి.

రోగ్! వెళ్ళేవాడు వెళ్ళక ఆ కాస్త దీపం ఆర్పడం ఎందుకూ? అడిగేవాడెవడు? చూడబోతే ప్రతి సంవత్సరం రైలుటికెట్ రేట్లు పెరుగుతూనే ఉన్నాయి.

అంతకుముందే స్టేషన్‌మాస్టర్ తన గది మూసేసి వెళ్ళిపోయాడు. అంతా నిర్మానుష్యంగా ఉంది. స్టేషన్‌మాస్టర్ గదికి ఆనుకొని చిన్న షెడ్‌లో మినుకు మినుకు మంటూ దీపం ఉంది. అక్కడ ఎవరయినా లేకపోతారా అనే ఆశతో అటు నడిచాను. రెండు విరిగిపోయిన బల్లలు బోసిగా నా ముఖంలోకి చూశాయి. అక్కడ కూర్చోవాలనిపించలేదు.

ఎటు వెళ్ళాలి? ఎలా వెళ్ళాలి?

మరోసారి ప్లాట్‌ఫారం మీద అటూ ఇటూ తిరిగాను.

చూపు ఆనినంతదూరం చూడటానికి ప్రయత్నించాను. వాతావరణం నల్లముసుగు వేసుకున్న ముస్లిం స్త్రీలా ఉంది. ఒకే నలుపు. అల్లంత దూరంలో జువ్వి చెట్లు జుట్టు విరబోసుకున్న దయ్యాల్లా ఉన్నాయి.

అనేక కీచురాళ్ళ ధ్వనులు. చీకట్లో జుట్లు విరబోసుకొని ఉన్న దయ్యాలే బీభత్సంగా ఏడుస్తున్నట్లున్న భయంకరమైన ధ్వనులు. విసుగూ, విరామం లేని ధ్వనులు.

నేను కాళ్ళు గట్టిగా నేలకు తన్నిపట్టి నిల్చున్నాను. ఏదో భయం గుండెల్లో - కాళ్ళల్లో వణుకు.

నాకు బుద్ధిలేదు. ఎవడో ఇచ్చిన టెలిగ్రాం చూసి బయలుదేరడం ఏమిటి?

పైగా వాడెవడో రాత్రికిరాత్రి తెల్లవారకుండానే రమ్మనడం, నేను అందుకు సిద్ధం అయి బయలుదేరడం నా బుద్ధిహీనతకు నిదర్శనం. ఛ! ఇదేమిటి, నేనింత పిరిగ్గా ఆలోచిస్తున్నాను! బి.ఏ చదివే రోజుల్లోనే తోటి విద్యార్థులతో పందెంవేసి వంటరిగా అర్ధరాత్రిపూట శ్మశానానికి వెళ్ళి, అక్కడున్న తుమ్మచెట్టుకు కర్చీఫు కట్టివచ్చాను! నాకు భయమేమిటి? నా మనసుకు నేనే ధైర్యం చెప్పుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. కాని దారి తెలియదే? దయ్యాల భయం, భూతాల భయం లేదు. ఇకపోతే ఏ దొంగలైనా దారికాస్తూ ఉంటారనే నా భయం. కనీసం ఆ భైరవమూర్తికి స్టేషన్‌కు ఎవర్నయినా పంపించమని టెలిగ్రాం ఇచ్చి బయలుదేరితే బాగుండేది. ఏదో శబ్దం అయినట్టుగా అన్పించింది.

తలెత్తి తిన్నగా చూశాను. తల విరబోసుకున్న దయ్యాలలా కన్పిస్తున్న ఒక చెట్టు నీడలో ఒక ఆకారం కదలడం చూశాను. నాకు వెన్నెముకలోకి ఏదో జరజరా పాకినట్టుగా అన్పించింది.

అక్కడేం లేదు. అంతా నా భ్రమ. అంతేగాని దయ్యాలూ భూతాలూ లేవు. అవన్నీ మానవ కల్పితాలే. హేతువాదాన్ని జీర్ణించుకున్న నా బుద్ధి నా మనసును జోకొట్టడానికి ప్రయత్నిస్తోంది. జారిపోతున్న గుండెను ఎగదోసుకొంటున్నాను.

కాళ్ళు నిలదొక్కుకొని అటుకేసి చూశాను.

ఆ ఆకారం నా వైపే వస్తోంది. మనసు బుద్ధిని నోరు మూయించింది. స్పష్టంగా కన్పిస్తోంది. ఇది భ్రమ కాదు. ఆరు అడుగుల ఎత్తు ఆకారం చీకట్లో నాకేసి నడవడం భ్రమకాదు. అదుగో, మరీ దగ్గరౌతూంది. ఎవరది? ఎవరో మనిషి అయుండాలి.

అవును, ఎవడో నాకేసే వస్తున్నాడు. మనిషే, దయ్యం కాదు.

కుడికాలును బాగా పైకెత్తి, నేలమీద ఉన్న ఏ విషపు పురుగునో తొక్కుతున్నట్టుగా బలంగా పాదాన్ని నేలమీద మోపుతూ నడుస్తున్నాడు.

అతడు దగ్గరగా వచ్చాడు.

తలగుడ్డను తీసి విప్పి భుజంమీద వేసుకుంటూ నాకేసి చూశాడు.

మనిషి ఆరడుగులు రెండంగుళాలైనా ఉంటాడు. ఎత్తుకు తగిన లావు, జుట్టు తెల్లబడింది. ముఖం చూస్తే అరవై దాటినవాడిలాగే ఉన్నాడు. అయినా శరీరంలో జవసత్త్వాలు ఏమాత్రం సడలలేదు. గుబురుగా అల్లుకుపోయిన కనుబొమల కింద కళ్ళు లోతుగా ఉన్నాయి. అయినా అవి వింతగా వెలుగుతున్నాయి. ఎంతోకాలంగా, తమనుతాము కాల్చుకుంటూ, చీకట్లో తిరిగే మిణుగురు పురుగుల్లా ఉన్నాయి అతని కళ్ళు.

మనిషే! కాని ఆ కళ్ళు మాత్రం మామూలు మనిషి కళ్ళలా లేవు. కణకణలాడుతున్నాయి. ఆ కళ్ళు చూస్తుంటే నాకు గుండె గుబగుబలాడింది. భయాన్ని ముఖంలో కన్పించకుండా తొక్కిపట్టి "ఎవరు నువ్వు?" బింకంగా అడిగాను.

అతడు మాట్లాడకుండా నా చేతిలోని సూట్‌కేసు తీసుకున్నాడు. నేను తేరుకునే లోపుగానే ప్రయాణీకుల షెడ్ కేసి నడిచాడు. నేనూ అతడ్ని యాంత్రికంగా అనుసరించాను. అతను నా సూట్‌కేసును ఒక బెంచీ మీద పెట్టి దాని పక్కనే కూర్చున్నాడు.

నాకు వళ్ళుమండింది. ఏమిటీ జబర్దస్తీ? నా చేతిలోని సూటుకేసును తీసుకొని పక్కన పెట్టుకొని దర్జాగా కూర్చున్నాడు.

"కూర్చోండి బాబూ!"

బోడి మర్యాద. అసలు వీడి ఉద్దేశ్యం ఏమిటి? దొంగకాని కాదుకదా? అయివుండాలి. లేకపోతే ఈ రాత్రిపూట చీకట్లో చెట్లమధ్య ఏం చేస్తున్నట్టు? తనలాంటి వంటరి ప్రయాణీకులకోసం ఎదురు చూస్తుంటాడన్నమాట! ఇక్కడ వాడిని ఎదిరించగల వాళ్ళెవరూ లేరు. అందుకే అంత ధైర్యంగా పెట్టెతీసుకొని పక్కన పెట్టుకొని తాపీగా కూర్చున్నాడు. పైగా నన్ను కూడా కూర్చోమంటున్నాడు.

"ఏంటి బాబుగారూ ఆలోచిస్తున్నారు? నన్ను భైరవమూర్తిగారు పంపించారు."

నేను చివ్వున తలెత్తి చూశాను. అతను చిరునవ్వు నవ్వాడు. నిగూఢంగా అన్పించింది ఆ నవ్వు.

"భైరవమూర్తి పంపించాడా? అతనిచ్చిన టెలిగ్రాంలో నిన్ను పంపిస్తానని రాయలేదే?" సందేహంగా చూస్తూ అడిగాను.

"అవునట! మీరు ఈ చీకట్లో వంటరిగా నడిచి దుమ్మలగూడెం వెళ్ళడానికి భయపడ్తారేమోనని నన్ను పంపించారు."

"నీ పేరు?"

"భూతరాజు."

నేను తృళ్ళిపడ్డాను. అతన్ని పరిశీలనగా చూశాను. కారణం - అంతకుముందే ఆ పేరు ఎక్కడో విన్నాను. కాదు, చదివాను. అదేదో మిస్టరీ క్యారెక్టరని నాకు గుర్తు. ఎక్కడ చదివాను? ఆఁ గుర్తొచ్చింది. 'నల్లకుక్క'లో చదివాను. అవును. నరేంద్ర రచించిన 'నల్లకుక్క' అనే డిటెక్టివ్ నవల్లో చదివాను. అది మరపురాని క్యారెక్టర్.

తలెత్తి అతన్ని పరిశీలనగా చూశాను. వీడి దుంపతెగ! రూపం కూడా అలాగే ఉంది. ప్రవర్తనా అంతే! ఆ పోతరాజు చచ్చి భూతంగామారి భూతరాజుగా రాలేదుకదా?

నా ఆలోచనకు నాకే నవ్వొచ్చింది.

"ఏంటి బాబుగారూ, మీలో మీరు నవ్వుకుంటున్నారు?"

నా ఆలోచనల దారం పుటుక్కున తెగింది.

"నిన్ను భైరవమూర్తి పంపించాడా?"

"అవును." క్లుప్తంగా ఉంది అతని సమాధానం. ఆ సమాధానం ఇచ్చేప్పుడు దూరంగా దేన్నో చూస్తున్నట్టుగా ఉన్నాడు. కళ్ళు నాకేసి తిప్పలేదు.

"అయితే పద, కూర్చున్నావేం?"

అతడు సమాధానం ఇవ్వలేదు. ఏదో ఆలోచిస్తున్నాడు.

"దుమ్మలగూడెం ఇక్కడకెంతదూరం?"

"ఎంతదూరం అయితే ఏంలే బాబూ! ఈ రాత్రికి ఇక్కడే ఉండి, తెల్లారి బండికి తిరిగెళ్ళిపోండి. ఇక్కడనుంచి బస్సులు కూడా ఉన్నాయ్. విజయవాడ కెళ్ళి అక్కడ్నుంచి హైదరాబాద్ వెళ్ళవచ్చు."

నాకు ఒళ్ళు మండిపోయింది. వీడు తనను ఎలాగయినా తిప్పి పంపాలని ప్రయత్నిస్తున్నాడు. వీడ్ని భైరవమూర్తి పంపించలేదు. బహుశా భైరవమూర్తి తన టెలిగ్రాంలో ఉదహరించిన హత్యానేరంలో ఒక అపరాధి అయివుండాలి. అందుకే నన్ను వెనక్కు పంపించాలని చూస్తున్నాడు స్కౌండ్రల్!

"నేను దుమ్మలగూడెం వెళ్ళాలి. నువ్వొస్తే రా, లేదా ఇక్కడే పడుకో!" అంటూ పెట్టె తీసుకొని బయటికి వచ్చి చీకట్లో ప్లాట్‌ఫారం అంచున నిల్చున్నాను.

భూతరాజు సలహా పాటించటం మంచిదేమో అనిపించింది ఆ చీకట్లోకి చూస్తూంటే. నా పరిస్థితి అయోమయంగా ఉంది.

కాని, భూతరాజు నా వెనకే వచ్చి "మరోసారి ఆలోచించండి!" అన్నాడు.

నేను గిర్రున తిరిగి అతడి ముఖంలోకి చూశాను. చీకట్లో మెరుస్తున్న ఆ కళ్ళు చూస్తుంటే భయంగా అనిపించింది. అలా చీకట్లో మెరిసేది జంతువుల కళ్ళు మాత్రమే. మనిషి కళ్ళు మెరవడం నాకు తెలియదు. ఎవరూ ఎప్పుడూ చెప్పలేదుకూడా. దయ్యాల కళ్ళు మెరుస్తాయేమో? అతని పాదాలకేసి చూశాను. మామూలుగానే ఉన్నాయి. మనిషే-దయ్యం కాదు! దయ్యాలకి పాదాలు వెనక్కు తిరిగి ఉంటాయంటారు! ఇదేమిటి నేను ఇలా ఆలోచిస్తున్నాను? నేను దయ్యాల్ని నమ్మడం ఏమిటి? నాన్‌సెన్స్!

వీడ్ని నిజంగా భైరవమూర్తే పంపించాడా? మరి వెళ్ళొద్దంటాడేం? వీడు దొంగ అయి ఉండాలి ఇక్కడే పడుకోమని చిన్నగా తన పెట్టె పట్టుకెళ్ళాలని చూస్తున్నాడు. కాని, దొంగయితే ఇక్కడ ఉండమని ఎందుకంటాడు? దార్లో అయినా నా పెట్టె లాక్కెళ్ళొచ్చుగా?

ఇతన్ని భైరవమూర్తి పంపించి ఉండడు. వీడు ఆ కేసుకు సంబంధించినవాడై ఉంటాడు. వీడి మాట వినకపోతే నన్ను చంపుతాడేమో? ఎంత దారుణం!

నాకు వెన్నెముకలో ఏదో పాకినట్టుగా వళ్ళు ఝల్లుమంది.

అతడు నా పక్కగా నిల్చుని గుచ్చిగుచ్చి చూస్తున్నాడు. అతని చూపులు నాకు సూదుల్లా గుచ్చుకొంటున్నాయి.

తల తిప్పి చూశాను. ఆ ఆకారం చూస్తూంటే నాకు గుండెల్లో అదురు పుట్టుకొస్తోంది. చీకట్లో మెరిసే ఆ కళ్ళతో చూస్తూ, ముసలిసింహంలా ఉన్న అతన్ని ఆ సమయంలో, ఆ పరిసరాల్లో చూస్తూంటే ఎంత ధైర్యస్తుడికయినా గుండెలు జారిపోకమానవు.

మా ఇద్దరి మధ్యా నిశ్శబ్దం భరించరానిదిగా ఉంది.

"నీ పేరేమిటి?"

"చెప్పానుగా భూతరాజని!"

"నిన్నెవరు పంపించారు?"

"అదేటి బాబూ! అదీ చెప్పాను - భైరవమూర్తేనని..."

"మరయితే వెళ్ళవద్దని ఎందుకంటున్నావ్?" తీవ్రంగా అన్నాను.

భూతరాజు చీకట్లోకి చూస్తున్నాడు. నా ప్రశ్నకు సమాధానం ఇవ్వలేదు.

"మాట్లాడవేం?" ధైర్యాన్ని కూడదీసుకుంటూ గట్టిగా అడిగాను.

అతడు తల తిప్పలేదు, మాట్లాడలేదు.

"అసలు ఆ భైరవమూర్తి ఎవరు? నువ్వెవరు? ఏమిటీ నాటకం?" భయాన్ని దాచుకుంటూ గొంతు పెద్దది చేశాను.

"నాటకం కాదు బాబూ! మీ మంచికోరే చెప్తున్నాను."

"నీ సంగతి చెప్పు? నువ్వెవరు? ఎక్కడుంటావ్? ఏం చేస్తుంటావ్?"

"నేనెవర్నో చెబితే మీరు మరీ బెదిరిపోతారు! మీరు తెల్లవారేంతవరకూ ఇక్కడే ఉండి తిరిగెళ్ళండి."

వీడెవడో చెబితే బెదిరిపోతానా? అంటే వీడు... నా బుర్రలో నలికిలపాము కదిలినట్టుగా అయింది. తల విదిలించుకున్నాను.

"ఇదుగో భూతరాజూ! ఏమైనాసరే నేను దుమ్ములగూడెం వెళ్ళి తీరాల్సిందే! అలా కాదంటావా- నన్నెందుకెళ్ళద్దంటున్నావో స్పష్టంగా చెప్పు." విసుగ్గా అన్నాను.

"సరే, మీ ఇష్టం! బయలుదేరండి" అంటూ నా చేతిలోని పెట్టె అందుకొని ముందుకు నడకసాగించాడు.

అతని వెనకే నేను నడుస్తున్నాను ఆ చీకట్లో, ఆ చెట్లమధ్యనుంచి. వాడిముఖం ముందుకు ఉన్నా, నాకెందుకో వాడు మర్మగర్భంగా నవ్వుకుంటున్నట్టుగా తోచింది.

ఇద్దరం మౌనంగా నడుస్తున్నాం.

చుట్టూ చీకటి! పైగా కీచురాళ్ళతోపాటు, అనేక పురుగుల అరుపులు బీభత్సంగా వినిపిస్తున్నాయి.

"భూతరాజూ!" నా మనసులో నిముషనిముషానికి పెరుగుతున్న భయాన్ని పారదోలడానికే అతడ్ని పలకరించాను.

"అయ్యా!" వెనక్కు తిరక్కుండానే అన్నాడు.

"కొంచెం చిన్నగా నడువు" అన్నాను.

అతడు నడక వేగం తగ్గించాడు.

"మీ అయ్యగార్ని గురించి ఏదన్నా చెప్పు భూతరాజూ!"

"ఏం చెప్పమంటారు?"

"అదే - నన్నెందుకు పిలి..." ఇంతెత్తున ఎగిరిపడ్డాను. కెవ్వున అరిచాను. చెట్టుమీదనుంచి ఏదో పడింది. 'దబ్' మని శబ్దం అయింది. ఆ మరుక్షణమే ఆకులు గలగలమన్నాయి. నా శరీరం వణుకుతోంది.

భూతరాజు కిందకువంగి చీకట్లో దేన్నో తీసుకొని దూరంగా విసిరాడు. అప్పటికి నా కళ్ళు చీకటికి అలవాటు పడ్డాయి. వస్తువులు స్పష్టంగా కన్పించకపోయినా మసగ్గా కన్పిస్తున్నాయి. భూతరాజు విసిరేసిన వస్తువు పొడవుగా ఉంది.

"ఏమిటిది?" నా నోరు ఎండిపోతున్నది.

"పాము!" తాపీగా చెప్పాడతను.

"పామా?" నా గొంతులో పాము చుట్టుకున్నట్టే అయింది. మాట స్పష్టంగా రాలేదు.

"భయం లేదు బాబూ! ఇక్కడ, ఈ చెట్లమీద ఇల్లాంటివి మామూలుగా తిరుగుతూనే ఉంటాయి - పక్షుల గుడ్ల కోసం."

"అలా చేతిలోకి తీసుకున్నావు గదా, అది కరిస్తే?"

"కరచినా నాకేం కాదు."

"అంటే, అది విషపుపాము కాదా?"

"ఎందుక్కాదూ?"

"మరి?"

"నాకు పాము విషం ఎక్కదు బాబూ!"

మరోప్రశ్న వెయ్యాలనిపించలేదు. ప్రశ్నించినకొద్దీ చిక్కుముడి పీటముడిలా అయిపోతున్నది.

"ఏదో అన్నారు బాబూ!"

"నేనేమీ అనలేదే?"

"ఏదో అడిగారుగా? ఆఁ- గుర్తొచ్చింది. భైరవమూర్తి నిన్నెందుకు రమ్మని టెలిగ్రాం ఇచ్చారని అడగబోయారు గదూ?"

నేను మాట్లాడలేదు. ఆ ప్రశ్నకు ఇంకెంత భయంకరమైన సమాధానం ఇస్తాడోననే భయం కలిగింది. అయినా వీడు ఊరుకుంటాడా?

"ఆయన కిది అలవాటే బాబూ!"

"ఏది?" వద్దనుకుంటూనే యాంత్రికంగా అడిగాను.

"అదే బాబూ! రెండుమూడు నెలలకోసారి ఎవరికో టెలిగ్రాం ఇచ్చి రప్పించడం."

"అందువల్ల అతనికి వచ్చేలాభం?"

"అదే నాకూ తెలవడంలేదు. ప్రతివాడ్ని నేనే భైరవమూర్తి ఇంటికి తీసుకెళ్తున్నాను. అలా వచ్చిన ప్రతివాడూ తెల్లారేసరికి చచ్చిపడి ఉంటాడు!"

నడుస్తున్న నేను ఠక్కున ఆగిపోయాను, ఏదో బంధం కాళ్ళకు అడ్డంపడ్డట్టయి.

వాడు ఆగకుండా ముందుకు పోతున్నాడు. వాడ్ని పిలవాలంటే నోరు మెదపలేకపోతున్నాను. నా కాళ్ళల్లోని సత్తువంతా భూమి లాగేస్తున్నట్టుగా అన్పిస్తోంది. అడుగు ముందుకు పడటం లేదు.

పది గజాలు వెళ్ళిన భూతరాజు వెనక్కు తిరిగొచ్చాడు.

"ఏం బాబూ ఆగిపోయారు? భయం వేస్తోందా? అందుకే మిమ్మల్ని తిరిగి వెళ్ళిపొమ్మన్నాను."

అప్పుడు నాకు అర్థం అయింది. వీడు నన్ను మొదటినుంచి వెనక్కు తిప్పి పంపించే ప్రయత్నంలోనే ఉన్నాడు.

"నాకు భయంలేదు, పద. ఆ భైరవమూర్తి వ్యవహారం ఏదో తేల్చుకుంటాను" అన్నాను చాలా ధైర్యంగా.

వాడు ముందు నడుస్తున్నాడు.

నా బుర్ర చురుగ్గా పనిచేస్తోంది.

స్కౌండ్రల్! వీడే ఆ హంతకుడు. ఎలాగయినా నన్ను బెదరగొట్టి వెనక్కు పంపించేయాలని చూస్తున్నాడు.

వీడి మాటలు విని నా గుండెలు జారిపోతాయనుకొన్నాడు. అసలు వీడ్ని ఆ భైరవమూర్తి పంపించి ఉండడు. వీడు ఎలాగో నేను ఇవ్వాళ వస్తున్నట్టు పసిగట్టాడు. టెలిగ్రాఫ్ ఆఫీసులో ఎవడో వీడికి తెలిసినవాడు ఉండి ఉంటాడు. కథలల్లుతున్నాడు - కథలు! వీడితో మంచిగానే ఉండాలి. లేకపోతే ఈ చీకట్లో వీడు ఏమైనా చెయ్యగలడు. చూట్టానికి ముసలివాడేగాని నాకంటే బలంగానే ఉన్నాడు.

భూతరాజు నడుస్తున్నవాడు ఠక్కున ఆగిపోయాడు.

నా ఆలోచనలకు కూడా సడన్ బ్రేక్ పడింది.

"ఎందుకు ఆగావ్? పద!" అన్నాను.

అప్పటికి మందంగా వెన్నెల భూమి మీదకు జారుతోంది. చెట్లూ, చెట్లకింద ఆకులూ, కాలిబాటా కనిపిస్తున్నాయి మసక మసగ్గా.

భూతరాజు నిల్చుని దూరంగా చూస్తూ, చెవులు రిక్కించుకొని ఏదో వింటున్నట్టుగా నిలబడ్డాడు.

"ఏమిటీ? ఏమైంది?"

"అదుగో! అదుగో బాబూ! మీకు వినిపించడంలేదా?" అన్నాడు తల తిప్పకుండానే శ్రద్ధగా వింటూ.

"ఏమిటి? ఏం వినిపిస్తోంది?" బిత్తరపోయి అడిగాను.

దూరంగా ఉన్న చెట్లకేసి చూపిస్తూ "బాగా వినండి బాబూ!"

"నాకేం వినిపించటం లేదే?"

"అదేంటి బాబూ, అంత దీనంగా ఏడుపు వినిపిస్తుంటేనూ?"

"ఏడుపా?" నా పెదవులు తడారిపోయాయి.

"అవును, ఏడుపే! ఆడదాని ఏడుపు!"

"ఆఁ... ఆడదాని ఏడుపా? నాకు వినిపించడంలేదే?"

"సరిగ్గా వినండి బాబూ! అదే ఏడుపు! ఆ మహాతల్లి ఏడుపు!"

"ఉష్! భూతరాజూ! నీకేదో భ్రమ కలిగింది. అంతే! లేకపోతే ఈ చీకట్లో, ఈ అరణ్యంలోకి వచ్చి ఏ ఆడది ఏడుస్తుంది? పద!" అన్నాను.

వాడు మౌనంగా అలాగే నిల్చున్నాడు కొద్దిక్షణాలు. తర్వాత "హమ్మయ్య!" అంటూ గట్టిగా నిట్టూర్చాడు.

నేను అతడి ముఖంలో మారుతున్న భావాల్ని చూడటానికి ప్రయత్నించాను. కాని ఆ మసక వెలుగులో నాకేమీ కన్పించలేదు.

"ఇప్పుడు ఆగిపోయింది. బహుశా భైరవమూర్తి ఇంటివెనక ఉన్న మర్రిచెట్టు మీదకు వెళ్ళిపోయి వుంటుంది."

నాకు మతి పోయినట్టే అయింది. ఏదో భయం గుండెల్లో బయలుదేరి శరీరంలోకి, నవనాడుల్లోకి పాకుతోంది.

"ఏమిటా పిచ్చిమాటలు?" నా గొంతు కీచుమంది.

"పిచ్చిమాటలు కాదుబాబూ! నిజమే! ఆ మహాతల్లి ఆత్మహత్య చేసుకొంది. చనిపోయి నలభై ఏళ్ళయినా ఇంకా మోక్షం రాలేదు. ఇలా విలపిస్తూ తిరుగుతూనే ఉంది."

"చచ్చిపోయి తిరగడమేమిటి?"

"అదే బాబూ! కటిక చావు చచ్చింది కదా? దయ్యం అయి....."

❀ ❀ ❀ ❀

"ఏమిటా రాతలు? రెండు దాటింది."

శివప్రసాద్ తృళ్ళిపడ్డాడు.

చేతిలోని కలం ఎగిరి కిందపడింది.

"ఏమిటలా ఎగిరిపడ్డారు?" కృష్ణవేణి ప్రసాద్ నొసటి మీద చెయ్యి వేసింది.

"వళ్ళు కాలిపోతోంది. రెండురోజుల్నుంచి తిండిలేదు. రాసింది చాల్లే పడుకోండి" అన్నది భార్య ప్రసాద్‌తో.

ప్రసాద్ బద్ధకంగా లేచి వెళ్ళి మంచంమీద పడుకున్నాడు. వళ్ళంతా నొప్పులు. రాస్తుంటే తెలియలేదు. నిద్రపోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

# 2

శివప్రసాద్ మంచం మీద అటూ ఇటూ కదులుతున్నాడు. ఎంత ప్రయత్నించినా నిద్రరావడంలేదు. రెండురోజులనుంచి జ్వరం. పైగా అతను రాస్తున్న నవలలోని పాత్రలు బుర్రలో అల్లరి చేస్తున్నాయి.

ఏమైనా సరే, ఈ నవల వీలయినంత త్వరగా ముగించాలి. కనీసం ఇదైనా ఆ పత్రిక ఎడిటర్‌కి నచ్చితేనే..., లేకపోతే? శివప్రసాద్ గతంలోకి వెళ్ళి ఆలోచించసాగాడు.

పాతికేళ్ళగా తను మేథను కరిగిస్తూ, శరీరంలోని ఒక్కొక్క రక్తపుబొట్టునే వెచ్చిస్తూ రచనలు చేశాడు. ఈనాడు తన రచనలు పాఠకులకు నచ్చడంలేదు. ఒకనాడు తన రచనలతో వేలకువేలు సంపాదించిన ప్రకాశకులు కూడా తనను చూడగానే ముఖం చాటేస్తున్నారు.

పాపం! వాళ్ళుమాత్రం ఏం చేస్తారు?

తనే ఈనాటి ట్రెండును అనుకరించలేకపోతున్నాడు.

ఈ పాతికేళ్ళలో తను సంపాదించుకొన్నది ఏమీ లేదు. తిండికీ బట్టకూ, పిల్లల చదువులకూ ఇబ్బంది పడకుండా గడిచింది. కాని గత ఐదేళ్ళుగా దరిద్రం తన నట్టింట్లో చేరింది.

తను ఇంతకాలం ఇది రాయను, అది రాయనంటూ భీష్మించుకొని కూర్చున్నాడు. ఫలితం ఏమైంది?

చిన్నకొడుకు రమేశ్ చెడు సహవాసాలు పట్టాడు. తనచేత దెబ్బలు తినలేక ఇల్లు విడిచి పారిపోయి సంవత్సరం దాటింది. వాడు అలా కావడానికి కారణం తనే – తనే!

తన భార్యను తను ఏం సుఖపెట్టగలిగాడు? భూదేవిలాంటి సహనశీలి. అందువల్లనే తను ఇంతవరకూ బతికున్నాడు.

వయసులో ఉన్న ఆడపిల్లకు తనంటే గౌరవం లేదు. ఎలా ఉంటుంది? ఆ వయసులో ఉండే పిల్ల మనస్తత్వం తనకు తెలుసు. వాళ్ళకోరికల గురించి తను ఊహించగలడు. ఆ వయసులో ఉన్న ఆడపిల్లలు ఎంతమంది కోరికలు తీరక పెడమార్గాలను పట్టారో తను రాశాడు. దారిద్ర్యంలో పుట్టి, దారిద్ర్యంలో పెరిగి, కోరికలు తీరాక ఎంతమంది ఎలా కునారిల్లిపోతున్నారో రాశాడు.

తను కన్న బిడ్డలకు ఏమివ్వగలుగుతున్నాడు?

తిండికి కూడా అంతంత మాత్రంగానే ఉంది.

కృష్ణవేణి ఎలా సంభాళించుకొస్తుందో తను ఆలోచించడు. ఆలోచించినా తనేం చెయ్యలేనని తనకు తెలుసు.

ఒకడు పోయాడు. మిగిలింది ఒక కొడుకూ, ఒక కూతురూ, భార్య. వాళ్లకు ఇంత తిండి పెట్టలేని దద్దమ్మ తను.

తన భార్య తన పుట్టింటివారు పెట్టిన నగలన్నీ అమ్మింది. ఇంట్లో ఉన్న సామానుకూడా ఒక్కొక్కటే బజారుకు చేరింది.

మరీ ఐదేళ్ళుగా తెలుగు సాహిత్యపు విలువలు పూర్తిగా మారిపోయాయి. ఈ వయసులో తను ఆ ట్రెండును అనుకరించాలంటే తన ఆత్మను చంపుకోవాలి.

తన ఆత్మను చంపుకొని ప్రేమకథ రాశాడు. బ్రహ్మాండంగా రాశాననుకొన్నాడు. తన మీద ఆధారపడిన వాళ్లను నిలువునా చంపడంకంటే తన ఆత్మను చంపుకోవడమే మంచిదని మనసుకు సర్ది చెప్పుకొన్నాడు.

ఆ ప్రేమకథ ముగింపు తన ధోరణిలోనే నచ్చలేదు. చివరకు ఒక ప్రకాశకుడిచ్చిన సలహా మేరకు ముగింపు మార్చాడు. పుస్తకం వచ్చింది. కాని తనకు ప్రతిఫలంగా ఐదువందలు రూపాయలే వచ్చాయి!

"నీ ప్రేమ. కథలు ఎవరిక్కావాలయ్యా? మానసికంగా శారీరకంగా ఎండిపోయిన నువ్వు రసవత్తరమైన ప్రేమ కథలు ఎక్కడ రాయగలవు గాని, ఓ మాంచి మాంత్రికుడి కథ రాయి!" అన్నాడు ఓ పత్రికాధిపతి.

"మాంత్రికుడి కథా?" తను తెల్లముఖం వేశాడు.

"అయితే, ఒక మంచి సస్పెన్సు కథ రాయి" అన్నాడు.

తనకు తల తిరిగిపోయింది. చూస్తూ ఉండిపోయాడు.

"అయితే, దయ్యాలకథ రాయి – మంచి సస్పెన్సుతో" అన్నాడు.

తను తలవంచుకొని ఇంటికి తిరిగొచ్చాడు.

తనకు అన్నం వడ్డిస్తున్న తన భార్యను చూచాడు. నలభై నిండని ఆమె, బతుకు భారంతో వంగిపోయింది.

"నిన్న బియ్యం అయిపోయినయ్ అన్నావ్?" తల ఎత్తకుండానే తను కృష్ణవేణిని ప్రశ్నించాడు.

"పక్కింటి పిన్నిగారిదగ్గర ఓ కిలో అప్పు తీసుకొన్నాను." తలవంచుకొనే సమాధానం చెప్పింది ఆమె.

చేట తీసుకొని బియ్యం అప్పుకోసం పక్కింటికి వెళ్ళే ఇల్లాలి మానసికవ్యథ గురించి ఏనాడో తను ఒక నవలలో రాశాడు. ఆమె సమాధానం వినీ, అన్నం తిన్నాడు. ఎలా తిన్నాడో ఆ అన్నం! తినక ఏంచేస్తాడు! అది ఆకలి చేయించే గారడీ!

అన్నం తిని లేచివస్తుంటే చిరుగులు కన్పించకుండా, ఓణీ సర్దుకుంటూ కూతురు ఎదురైంది. ఆ పిల్లను పలకరించే ధైర్యం తనకు లేదు.

పెద్దవాడు బి.ఏ. ఫైనల్ వరకూ ఎలాగో వచ్చాడు.

"నాన్నా!"

తను త్రుళ్ళిపడ్డాడు.

వాడు ఏమడుగుతాడో తనకు తెలుసు.

"నాన్నా! పరీక్ష ఫీజు కట్టాలి."

"ఎవర్నయినా నీ స్నేహితుడ్ని అప్పు అడగరా! ఇప్పటికిప్పుడు నాన్న దగ్గర డబ్బు ఎక్కడ్నుంచి వస్తుంది?" తన భార్య కృష్ణవేణి తనను ఆదుకొంది.

"ఛీ! ఎంతసేపూ అడుక్కొనే బతుకే! పెంచలేనివాళ్ళు కనడం ఎందుకో?" అంటూ వాడు బయటికి వెళ్ళిపోయాడు.

తను అక్కడ నిలబడలేకపోయాడు.

తనకు తన భార్య ముఖం చూసే సాహసం లేదు.

ఆమె తన వెనకే వచ్చింది.

"మీరు మరీ అంత బాధపడితే ఎలా? చిన్న సన్నాసి. ఉద్రేకం ఎక్కువ. ఏదో వాగుతాడు. పట్టించుకోకండి." తన కుర్చీ పక్కగా వచ్చి నిల్చుని లాలనగా అన్నది.

తనకు భోరున ఏడవాలనిపించింది.

కాని ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని, రంగు వెలిసిపోయిన మట్టి గాజుల్ని పైకీ కిందకూ జరుపుతూ ఉండిపోయాడు తను.

ఆ రాత్రి ఎంత ప్రయత్నించినా తనకు నిద్ర రాలేదు.

ఏదో చెయ్యాలి. తనమీద ఆధారపడి ఉన్నవాళ్లను ఇలా హింసించడం అపరాధం కాదా?

"అందుకని?"

పైకిలేచి ఏదో అనబోతున్న అంతరాత్మ గొంతు కసిగా పిసికేశాడు. దాన్ని కసిగా కొట్టికొట్టి చంపేశాడు తను.

చాలాసేపు ఆలోచించాడు.

ఒక్క థీమూ తనకు తట్టి చావలేదు.

తెలతెల వారుతుండగా మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. మనసు సంతృప్తి చెందింది. నిద్రతో కనురెప్పలు మూతలుపడ్డాయి.

తెల్లవారి చాలా ఆలస్యంగా మెలకువ వచ్చింది.

కృష్ణవేణి ఇచ్చిన కాఫీతాగి, స్నానంచేసి ఆదరా బాదరాగా బయలుదేరాడు.

కృష్ణవేణి ఎదురొచ్చింది. ఏదో అడగాలని వచ్చినట్టు, ఆమె చెప్పకుండానే తనకు తెలిసింది.

"ఇప్పుడే వస్తా!" అంటూ ఆమె ముఖంలోకి చూడకుండానే తను బయటికి వెళ్ళాడు.

ఎండలో రెండు కిలోమీటర్లు నడిచి 'వెలుగు – చీకటి' పత్రికాఫీసు చేరుకున్నాడు.

ఎడిటర్ సుందర్రావు తలెత్తి తనను చూచాడు, కూర్చోమనలేదు. ఒకప్పుడు తను కన్పిస్తేచాలు – వంగివంగి నమస్కారాలు చేసేవాడు. ఇప్పుడు అతనికి తనంటే గౌరవం లేకకాదు – తన కథలు వెయ్యమని అడుగుతాడనే భయం. అందుకే ఆ నిర్లక్ష్యం.

అతను కూర్చోమనకుండానే తను కూర్చున్నాడు.

అతను నొసలు చిట్లించాడు.

"మీరు మొన్న దయ్యంకథ రాయమన్నారుగా?"

అతను నోరుతెరిచి తనకేసి చూశాడు.

"ఏమిటలా చూస్తారు? చాలా గొప్ప సస్పెన్సు నవల అవుతుంది. అది కల్పన కాదు. నా జీవితంలో జరిగిన ఒక అనుభవాన్ని తీసుకొని రాయాలనుకొంటున్నాను. పాఠకులు పిచ్చిగా చదువుతారని నా నమ్మకం."

సుందర్రావు ముఖం విప్పారింది!

"నిజంగా అది మీ జీవితంలో జరిగిందా?"

"అవును!"

"మరి మీరు దయ్యాలను నమ్ముతారా?"

"నమ్మడమేమిటండీ, వాటిని చూశాను - మాట్లాడాను - చాలా భయంకరమైన ఎక్స్‌పీరియన్స్! ఇప్పటికీ తల్చుకుంటే నాకు జుట్టు పీక్కోవాలనిపిస్తుంది" అన్నాడు తను.

అతను తన ముఖంలోకి సందేహంగా చూచాడు.

"ఏమిటలా చూస్తారు? నమ్మకం కుదరడం లేదా?"

"మీరు హేతువాదులనుకుంటాను. రాడికల్స్ ఇలాంటివి నమ్ముతారా?"

"అది వేరు. నాకు నమ్మకం ఉంది కాని, కొన్ని భయపెట్టే నమ్మకాలను సాహిత్యంలో చొప్పించి ప్రజల్ని భయపెట్టకూడదని నా భావం అంతే-!"

"అయితే, మీరు ఇంతకాలం రాసిందీ - చెప్పిందీ..."

"సుందర్రావుగారూ! రైటర్స్ రాసేవన్నీ నిజాయితీతోనూ, తను నమ్మినవే రాస్తారనుకోవడం మీ అమాయకత్వాన్ని తెలియజేస్తుంది. అసలు సంగతి చెప్పండి! రాయమంటారా?"

"తప్పక రాయండి. ముఖ్యంగా మీవంటి రచయిత, పాతికేళ్ల తర్వాత దయ్యాల కథ రాశారంటే మామూలు పాఠకులే కాకుండా, ఇలాంటివాటిని తిరస్కారంగా చూసే మేధావులు కూడా చదువుతారు."

తను లేచి నిలబడ్డాడు. కనీసం ఓ రెండువందలు అడ్వాన్సు అడగాలనుకొన్నాడు, కాని నోరు ఎత్తి అడగలేకపోయాడు.

"ప్రసాద్‌గారూ, ఓ రెండు నిముషాలుండండి!" అంటూ ఎడిటర్ లేచి పబ్లిషర్ గదిలోకి వెళ్ళాడు.

దాదాపు అర్ధగంటకు తిరిగొచ్చాడు.

"ఈ అయిదువందలు ఉంచండి. మీరన్నట్టు పాఠకుల్ని పిచ్చివాళ్లను చేస్తే - మొత్తం ఐదువేలు ఇవ్వడానికి మా పబ్లిషర్‌గారు అంగీకరించారు. లేదా, మరో అయిదువందలు మాత్రమే ఇస్తాం. మీరు మీ అనుభవాన్ని మాంచి సస్పెన్సుతో రాయండి."

అయిదువందలు అందుకొన్నాడు తను.

గిర్రున వెనక్కు తిరిగి ఇంటికేసి నడకసాగించాడు.

చాలా ఉసిగా కసిగా నడుస్తున్నాడు.

కళ్లు చెమ్మగిల్లుతున్నాయి.

ఎన్నేళ్లయిందో ఐదువందలు జేబులోపెట్టుకొని!

కృష్ణవేణికి సంతోషంతో గుండె ఆగిపోతే?

అసలే బలహీనంగా ఉంది.

అనేక ఆలోచనలు. బుర్ర చెదలపుట్టలా ఉంది.

చిత్రమైన అనుభూతి! అది సంతోషమా? కాదు. బాధా? కాదు. కసా? ఏమో? ఎవరిమీద కసి?

తమాషా అనుభూతి!

మహా రచయితకూడా మాటల్లో వ్యక్తం చెయ్యలేని అనుభూతి! ఉగాది పచ్చడిలాంటి అనుభూతి! ఉగాది పచ్చడి రుచి ఎలా ఉందంటే ఖచ్చితంగా చెప్పగలమా?

ఇంట్లో ఆ రోజంతా పండగే!

తన కూతురు కమల తనతో ఏదో అంటోంది.

తన కొడుకు సూర్యం తన భవిష్యత్తు ప్లాన్సు గురించి చెబుతున్నాడు.

కృష్ణవేణి ముఖంలో సంతృప్తి!

తనే వేగిపోతున్నాడు. బుర్ర వేడెక్కిపోయింది.

కథ మొదలుపెట్టాడు.

ఆ రోజే జ్వరం వచ్చింది.

రెండు రోజులనుంచి రాస్తున్నాడు.

ఎంతో రాయలేకపోయాడు. ఆ కథ ఆలోచిస్తుంటేనే జ్వరం వస్తోంది.

త్వరగా ముగించాలి.

శివప్రసాద్ చివ్వునలేచి మంచంమీద కూర్చున్నాడు. చిన్నగా మంచం దిగాడు. అందరూ మంచినిద్రలో ఉన్నారు.

టేబుల్ లైట్ ఆన్‌చేసి, అంతవరకూ రాసినకథ చదవసాగాడు. చివరి వాక్యం చదివాడు.

"అదే బాబూ! కటికచావు చచ్చిందికదా? దయ్యం అయి...."

# 3

అప్పటికి నాకు భూతరాజు ధోరణి అర్థం అయింది. అంతకుముందున్న భయం పూర్తిగా పోయింది. వీడు, ఈ భూతరాజుగాడు నన్ను ఎలాగయినా భయపెట్టి వెనక్కు పంపించాలని చూస్తున్నాడని తెలుసుకొన్నాను.

ఇద్దరం నడుస్తున్నాం. 12-30 దాటింది. మసక వెన్నెల ఆకుల సందులనుంచి జారుతోంది.

నేను ఒక చెట్టు దగ్గరకువచ్చి ఆకస్మాత్తుగా ఆగిపోయాను.

భూతరాజు పది గజాలు ముందువెళ్ళి వెనక్కు చూచాడు. నేను నిలబడిపోవడం చూసి వెనక్కు వచ్చాడు.

"ఏం బాబూ, నిలబడ్డారు?"

నేను దూరంగా ఏదో వింటున్నట్టుగా నటించాను. మాట్లాడలేదు.

"బాబూ! నిలబడిపోయారేంటి?"

"భూతరాజూ, విన్నావా?" అన్నాను అతడికేసి ఓరగాచూస్తూ.

"ఏమిటి బాబూ?"

"అదే – ఆ దయ్యం ఏడవడం?"

భూతరాజు ముఖంలోకి చూశాను. అతడి ముఖంలో ఎలాంటి భయం కన్పించలేదు.

"నాకేమీ విన్పించడంలేదు. మీకు విన్పిస్తుంది కాబోలు! అదేబాబూ, దయ్యాలు చేసే మాయ. ఇంకా నేను, అది దుమ్మలగూడెం మర్రిచెట్టు మీదికెళ్ళిపోయిందనుకొన్నాను. దాని సిగతరగ! ఇంకా ఇక్కడే ఉందన్నమాట! దాని ఏడుపు ఒక క్షణం ఇక్కడ విన్పిస్తుంది. మరో క్షణం కొన్ని మైళ్లదూరంలో విన్పిస్తుంది. ఒకేచోట ఉన్న ఇద్దర్లో ఒకళ్ళకి వినిపిస్తుంది. మరొకళ్లకి వినిపించదు. నువ్వు భైరవమూర్తి దగ్గరకెళ్తున్నట్టు అది ఇప్పుడే పసికట్టిందనుకొంటా!"

"ఇక ఆపు!" గట్టిగా అరిచాను.

నేను భూతరాజును భయపెట్టాలని ఉట్టినే అన్నాను. వాడు భయపడలేదు. పైగా వాడిమాటలు వింటుంటే నాకు రక్తం గడ్డ కడ్తున్నట్టు అయిపోతున్నది. ఈ భూతరాజు భూతాలకు రాజులాగే ఉన్నాడనిపించింది.

నేను నడక సాగించాను.

ఇద్దరం మౌనంగా నడుస్తున్నాం.

కూడదీసుకొన్న ధైర్యంతో నడుస్తున్నానేగాని నా గుండెల్లో ఏవేవో వింతభయాలు కదలసాగాయి.

ఇరుకైన కంకరరోడ్డు తుప్పపొదల మధ్యనుంచి పాములా తిరిగిపోతూంది.

రోడ్డుకు ఇరువైపులా కొద్దిగజాల దూరంలోనే అడవి ప్రారంభం అయి, చూపు కందినంతవరకూ దట్టంగా అలుముకుపోయి, ఆకాశంలో కలిసిపోయినట్టుగా కన్పిస్తోంది. మధ్యమధ్య కొండలు చిన్నవీ పెద్దవీ, బారులు తీర్చి దూరంగా కన్పిస్తున్నాయి. ఆ మసక వెన్నెల్లో అడవీ, కొండలూ, ఆకాశం ఒకదానికొకటి హత్తుకుపోయి, ఏది ఎక్కడ ప్రారంభం అయిందో, ఎక్కడ అంతం అయిందో తెలియడం లేదు.

కొండల్లో నుంచి వస్తున్న ఈదరగాలి ఆ కొండలు ఈలలు వేస్తున్నట్టుగా అన్పిస్తోంది. ఆ ఈలలూ, కీచురాళ్ల అరుపులూ కలిసి, ఎన్నో కంఠాలు ఒకసారిగా ఏడుస్తున్నట్టు భయంకరంగా విన్పిస్తున్నాయి.

గుండెల్ని జలదరింప జేస్తున్న ఆ శబ్దాలతోపాటు ముందునడుస్తున్న భూతరాజు కిర్రుచెప్పులు చేస్తున్న శబ్దం ఒకటి!

ఈ శబ్దాలన్నీ కలిసి మృత్యుదేవతకు స్వాగతం పాడుతున్నాయా అన్పించింది నాకు.

భూతరాజు నా ముందు పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ కొంచెంగా వంగి నడుస్తున్నాడు.

భూతరాజు చెప్పింది నిజమేనేమో?

ఆ వాతావరణంలో, ఆ సమయంలో నిజానికీ అబద్ధానికీ ఉన్న దూరం చాలా తక్కువ అన్పించింది.

వెన్నెలదుప్పటిని చంద్రుడు ప్రకృతిమీదకు విసిరాడు. దూరంగా ఉన్న వస్తువులు ఇప్పుడు స్పష్టంగానే కన్పిస్తున్నాయి.

తల పైకెత్తి చూచాను. తెల్లటి మబ్బుల్లోనుంచి పుచ్చపువ్వులాంటి వెలుగు కిందకు జారుతూన్నట్టుంది. ఆ వెలుగుమధ్య చందమామ పరుగులు తీస్తున్నాడు.

తల కిందకు దించాను.

నేలంతా విచ్చిన మల్లెపూలు విరజిమ్మినట్టుగా ఉంది.

తల పక్కకు తిప్పాను. కొండ చరియల్లో బొండు మల్లెలు కుప్పలు పోసినట్టుగా ఉంది.

తల రెండోపక్కకు తిప్పిచూచాను.

అడవంతా వెన్నెల. ఆ వెన్నెల్లో చెట్లూ పుట్టలూ తళతళలాడుతున్నాయి.

నా మనసులో అంతవరకూ గూడుకట్టుకున్న చీకటి కరిగిపోయి వెన్నెల వ్యాపించింది. అంతవరకూ ఉన్న భయం చాలావరకు పోయింది.

నా ఎదురుగా నడుస్తున్న భూతరాజు నీడ రోడ్డుపక్కగా, పొడవుగా అతనితోపాటు ముందుకు సాగిపోతోంది.

అతడు ముందుకుపోతున్నాడు.

అతన్ని అనుసరిస్తున్న నా కాళ్లు అకస్మాత్తుగా ఆగిపోయాయి.

"భూతరాజూ! అటెక్కడికి?" అన్నాను ఠక్కున ఆగి.

"ఇటే మనం వెళ్ళాలి" అంటూ భూతరాజు కాలిబాటమీదే నిలబడ్డాడు.

"మరి ఈ రోడ్డు ఎక్కడికిపోతుంది?" రోడ్డుమీదే నిలబడి అడిగాను.

"అది దుమ్మలగూడెం పోతుంది."

నేను తృళ్లిపడ్డాను.

"మనం వెళ్తున్నది దుమ్మలగూడెం కాదా?" అన్నాను.

"అవును, మనం వెళ్ళేది దుమ్మలగూడెమే!"

నాకు వళ్ళు మండిపోయింది. వీడు డిటెక్టివ్ నవలలు బాగా చదువుతాడులా వుంది. ప్రతి మాటలోనూ సస్పెన్స్ ఏడుస్తున్నాడు.

"మరి అటెందుకు వెళ్తున్నావ్?"

"ఇది దగ్గరిదారి." క్లుప్తంగా అన్నాడు.

"నో! నో! నేను ఆ దారిని రాను. దూరం అయినా పర్వాలేదు. ఈ రోడ్డునే వెళ్దాం."

"వద్దు బాబూ! నా మాట వినండి. ఎందుకు చెప్తున్నానో ఆలోచించండి."

"ఏమిటి వినేది? రోడ్డునే పోదాం పద!"

"ఎందుకు చెప్తున్నానో, పెద్దవాడ్ని చెప్తున్నాను. కాదనకండి. ఆ దారిన వెళ్ళడం ప్రమాదం." భూతరాజు అడ్డదారినే వెళ్ళడానికి నిశ్చయించుకొన్నవాడిలా అన్నాడు.

దొంగవెధవ! మళ్ళీ ఏదో ఎత్తు వేస్తున్నాడు. ఎలాగయినా నేను దుమ్మలగూడెం వెళ్ళకుండా చెయ్యడానికి ప్రయత్నం చేస్తున్నాడు. తప్పుదారి పట్టిస్తున్నాడు. ఇంతవరకూ ఎలాగో వాడి ఎత్తులను తప్పించుకున్నాను. ఇది వాడి చివరి ప్రయత్నం. ఇందులోనుంచి బయటపడితే చాలు.

వెన్నెల కాస్తోంది. రోడ్డునే వెళ్తే ఇంకెంతో దూరం ఉండదు దుమ్మలగూడెం.

"నువ్వెళితేవెళ్ళు అటు. నేను ఇటు వెళ్తాను" అన్నాను.

అనడమే కాదు, నడక సాగించాను. పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ గబగబా నడుస్తున్నాను.

వాడక్కడే ఆగిపోయినట్టున్నాడు దొంగవెధవ!

వాడిని చిత్తుచేశానన్న సంతృప్తితో ముందుకు నడుస్తున్నాను.

కొంతదూరం వెళ్ళేసరికి నాకు వెనక ఎవరో వస్తున్నట్టుగా అన్పించి, ఆగి వెనక్కు మెడ తిప్పి చూచాను.

భూతరాజు కన్పించాడు!

"బాబూ! నా మాట వినండి. మిమ్మల్ని భద్రంగా దుమ్మలగూడెం చేర్చే బాధ్యతను పూర్తి చెయ్యనివ్వండి. అది ప్రమాదకరమైన మార్గం. నా మాట వినండి."

నాకు వళ్ళు మండిపోయింది.

వాడికి సమాధానం ఇవ్వడంకూడా అనవసరం అనుకొన్నాను.

ముందుకు చకచక నడవసాగాను.

ఇక లాభం లేదన్నట్టుగా భూతరాజు నా వెనకే నడవసాగాడు. వాడు వెనక నడవడం నాకు ఇష్టంలేదు. వెనకనుంచి ఏ రాయి తీసుకొని నెత్తి బద్దలుకొట్టినా కొడ్తాడు. అందుకే నేను ఆగాను. అతడ్ని ముందు నడవమన్నాను. అతను ఓ క్షణం ఆలోచిస్తూ నిలబడ్డాడు.

"ఏమిటాలోచిస్తున్నావు?"

"ఆఁ– ఏం లేదు!" అంటూ ముందుకు నడవసాగాడు.

మళ్లీ ఇద్దరం మౌనంగా నడుస్తున్నాం.

నాకు భూతరాజును పలకరించాలని ఉంది.

కాని వాడు నడిచే ఊపు చూస్తుంటే పలకరించినా పలికేలా లేడు.

టైం చూసుకొన్నాను.

రెండు గంటలైంది.

భూతరాజు అకస్మాతుగా ఆగాడు.

మళ్లీ ఏదో వింటున్నట్టుగా నిల్చున్నాడు.

నాకు వళ్లు మండిపోయింది. ఈ వెధవ ఇంకా ట్రిక్స్ చేస్తూనే ఉన్నాడు.

"ఏమిటి భూతరాజూ? మళ్లీ ఆ ఆడదాని ఏడుపు విన్పిస్తోందా?"

అతడు పలుకలేదు.

"పలకవేం?"

"వినండి బాబూ!" వాడి కంఠం అదోలా పలికింది.

"ఏమిటి? ఆ ఏడుపేనా?"

"కాదు."

"మరి మగవాడి ఏడుపా?"

"ఉహు!"

"సరిగ్గా చెప్పు!"

"గుర్రంబండి చప్పుడు, గుర్రాల డెక్కల చప్పుడు విన్పిస్తోందా?"

"లేదే!"

"సరిగ్గా వినండి." భూతరాజు ఈసారి నిజంగా భయపడుతున్నట్టే అన్నాడు.

నాకు దూరంనుంచి గుర్రపు డెక్కల శబ్దం విన్పించింది. "అవును భూతరాజూ! గుర్రంబండి వస్తోంది. ఖాళీబండి అయితే దుమ్మలగూడెం ఆ బండిలోనే వెళ్లొచ్చును" అంటూ భూతరాజు ముఖంలోకి చూసి తెల్లముఖం వేశాను.

భూతరాజు ముఖంలో భయం. ఆ ముఖంమీద చమట్లు పడుతున్నాయి.

"వద్దుబాబూ! ఆ బండి ఎక్కొద్దు. తొరగా రండి ఆ దోవన వెళ్దాం." ఖంగారుగా అన్నాడు.

నేను వినలేదు. గుర్రపుడెక్కల చప్పుడు దగ్గరౌతోంది.

భూతరాజులో ఖంగారుకూడా ఎక్కువైంది.

"రండిబాబూ!" అంటూ భూతరాజు వెనక్కు తిరిగి గబగబా నడక సాగించాడు.

నేను అలాగే నిల్చున్నాను.

వాడు నేను వస్తున్నదీ లేనిదీకూడా చూచుకోకుండా గబగబా వెళ్ళిపోతున్నాడు.

నేను తలతిప్పి ముందుకు చూశాను.

వెన్నెల్లో తెల్లటి గుర్రం కాళ్లు తమాషాగా డ్యాన్సు చేస్తున్నాయి. నాకు గుర్రాలంటే ఇష్టం. అవి పరుగెత్తడం చూస్తూ ఈ ప్రపంచాన్నే మర్చిపోతాను.

తలతిప్పి వెనక్కు చూచాను.

భూతరాజు కన్పించలేదు.

నా ఆశ్చర్యానికి అంతులేదు.

ఇంత త్వరగా అడ్డదారి పట్టాడా? ఏ చెట్లచాటునో దాక్కొని ఉంటాడు. నేను ఊహించింది నిజమే. వాడు నన్ను దుమ్మలగూడెం వెళ్ళకుండా చెయ్యడానికే వచ్చాడు. అతడి చివరి ప్రయత్నంకూడా విఫలమైంది. ఈ రోడ్డుమీద నన్ను ఖతం చేసేవాడు.

అందుకే వెనక వెనక నడవసాగాడు. వాడిలో దురుద్దేశ్యం లేకపోతే ఈ బండిని చూసి ఎందుకు పారిపోతాడు?

బండి దగ్గరగా వచ్చింది. అది ఖాళీబండి!

"ఏయ్, బండబ్బాయ్!" పిల్చాను.

బండి ఆగింది. బండిలోనుండి ఓ యువకుడు దిగాడు. గళ్ల లుంగీ, ఖాకీషర్టు. తలకు బ్రౌన్ మఫ్లర్, అతను భూతరాజులా భయంకరంగా లేడు. అందంగా ఉన్నాడు. సజ్జనుడిలా ఉన్నాడు.

"ఏం బాబూ, ఎక్కడికెళ్లాలి? ఈ ఏళప్పుడు వంటరిగా నడుస్తున్నారేం?" అన్నాడు బండివాడు.

"దుమ్మలగూడెం వెళ్ళాలి. బండి కడ్తావా?"

"దుమ్మలగూడెం ఎవరింటి కెళ్ళాలి?"

"భైరవమూర్తింటికి!"

అకస్మాత్తుగా బండివాడి ముఖకవళికలు మారిపోయాయి. ముఖంలో కండరాలు బిగుసుకున్నాయి. దవడ ఎముకలు పైకీ కిందకూ కదిలాయి. కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి.

అతని రూపం చూస్తుంటే నాకు భయం వేసింది.

వీడూ ఆ హత్య కేసులో ఉన్నాడేమో? భూతరాజే నయం. వీడు ఈ క్షణంలోనే నన్ను చంపేలాగున్నాడు. నా గుండెలో గుబులు పుట్టుకొచ్చింది.

"నీకిష్టం లేకపోతే వద్దులే. నడిచే వెళ్తాను" అని అతన్ని తప్పించుకొని వెళ్ళబోయాను. అతను దగ్గరకొచ్చి నా దారికి అడ్డంగా నిల్చున్నాడు.

"అదేమిటి బాబూ! బండి కావాలన్నారుగా, ఎక్కండి."

"నేను ఎక్కను!"

"ఏం బాబూ?"

"నిన్ను చూస్తుంటే నీ బండి ఎక్కాలని లేదు!" అన్నాను మొండికెత్తినట్టు.

"ఏంబాబూ! నేనంత దుర్మార్గుడిలా కన్పిస్తున్నానా? భూతరాజుకంటే మంచివాడ్నే!"

నేను తృళ్లిపడ్డాను. బండివాడి ముఖంలోకి చూచాను.

అతను నన్నే చూస్తున్నాడు.

"ఆ దొంగవెధవ భూతరాజును నమ్మి, వాడివెంట ఇంతదూరం వచ్చారే!"

"భూతరాజును నువ్వు చూశావా?"

"ఆ సంగతి నాకు తెలుసు. నా గుర్రపు డెక్కల చప్పుడు విని పారిపోయాడు కదూ?"

"అది నీకెలా తెలుసు?"

"చెప్తాను, ముందు మీరు బండి ఎక్కండి" అన్నాడు.

నేను బండి ఎక్కి కూర్చున్నాను. ఆ గుర్రానికి కళ్లెంకూడా లేదు! నేను ఎక్కగానే అతనూ ఎక్కాడు.

"ముందుకు రండి బాబూ! వెనుక బరువెక్కువైంది."

నేను ముందుకు జరిగాను.

గుర్రం బయలుదేరింది.

"నీ గుర్రానికి కళ్లెం ఏదీ?"

వాడు అదోలా నవ్వాడు.

"నవ్వుతావేం?"

"ఆ భూతరాజు మాటలు విని మీకు అన్నిటిమీదా అనుమానం వస్తోన్నట్టుంది. ఈ గుర్రం నేను చెప్పినట్టు వింటుంది. ఆ భయం మీకేమీ అక్కర్లేదు!" అన్నాడు.

బండి నడుస్తోంది.

ఇద్దరి మధ్యా ఏకాంతం భరించరానిదిగా ఉంది.

"నీ పేరేమిటి?"

"రహమాన్!"

"భూతరాజు ఇంతవరకు నాతో వచ్చాడని నీకెలా తెలుసు?"

"అతను మాట్లాడిందల్లా విన్నాను."

నేను ఒక్కసారిగా వెనక్కు జరిగాను.

"ఎందుకు బాబూ, అంత భయం! నేను మిమ్మల్నేం చెయ్యను. వాడినుంచి రక్షించడానికే వచ్చాను."

"వాడూ అలాగే అన్నాడు!"

"వాడు అలాగే అంటాడు. వాడు అడ్డదారినే వెళ్దామన్నాడు కదూ?"

నేను అయోమయంగా చూశాను.

"నాకెలా తెలిసిందనేగా మీభయం? నేను దయ్యాలను చూడగలను. వాళ్ల మాటల్ని వినగలను."

"భూ.... భూతరా.... జు.... ద...." మాటలు పెగల్డంలేదు.

"అవును బాబూ, వాడు దయ్యం. మనిషికాడు. వాడు చచ్చి నలభై ఏళ్లయింది. వాడు చేసిన పాపాలు పరిపక్వం చెందలేదు. ఇంకా ఇలా తిరుగుతూనే ఉన్నాడు."

"అబద్ధం!" గట్టిగా అరిచాను.

"నిజమే! నేనే వాడ్ని చంపాను. ఇప్పటికీ వాడికి నేనంటే భయమే."

"అబద్ధం!" గట్టిగా అరిచాను.

"దిగిపోతారా? అయితే వెళ్ళండి. నేను వెళ్ళగానే మళ్ళీ వాడు వస్తాడు. ఇప్పటికే వాడు మూడు గంటల్నుంచి ఈ అరణ్యంలో తిప్పాడు. తిన్నగా వెళ్తే ఈపాటికి మీరు దుమ్మలగూడెం చేరేవారు."

నా తల తిరిగిపోతోంది.

భూతరాజు దయ్యమా?

వీడు? వీడుకూడా దయ్యమేనేమో?

అవును - వీడు పిశాచే!

లేకపోతే భూతరాజు మాటలు ఎలా విన్నాడు?

బాబోయ్! తోడేలు బోనులోనుంచి సింహం బోనులో పడ్డానులా ఉంది. నేను బండిలోనుంచి దూకలేను. దూకితే ఏ కాలో చెయ్యో విరగడం ఖాయం.

"అయితే నువ్వు దయ్యానివే!"

వాడు పకపక నవ్వాడు.

"మీ వరస బాగుంది బాబూ! అంత భయం అయితే దిగి వెళ్ళిపొండి."

బండి ఆగింది.

వీడిమాటలు గుర్రానికికూడా అర్థం అవుతున్నాయా?

"నువ్వు దయ్యంకాకపోతే వాడి మాటలు ఎలావిన్నావ్?" బండి దిగకుండానే అడిగాను.

"అదాబాబూ మీ సందేహం? నాకు ఆ శక్తి ఉందని చెప్పాగా? వాడ్ని చంపాక నేను ఉత్తరదేశం పారిపోయాను. కాశీకి చేరాను. అక్కడొక యోగి తటస్థపడ్డాడు. అతను నన్ను చూడగానే నేను ఇంటినుంచి ఎలా పారిపోయివచ్చానో చెప్పాడు. నాకు ఆశ్చర్యం వేసింది. అతనికి శుశ్రూష చేస్తూ పదేళ్లు అక్కడే ఉండిపోయాను. తను సమాధిలోకి వెళ్ళిపోతూ నాకు ఏం కావాలో కోరుకోమన్నాడు. నేను దయ్యాలను చూసే శక్తీ, వాళ్ల మాటలు ఎంతదూరంలో ఉన్నా వినగలిగే శక్తిని ఇవ్వమన్నాను. ఎందుకో తెలుసా బాబూ? భూతరాజును చంపినా నా కసితీరలేదు. వాడు దయ్యం అయి ఈ ప్రాంతాల్లోనే తిరగడం అంతకుముందే నాకు అంజనంలో చూపించాడు" అని చెప్పి "పద" అన్నాడు.

గుర్రం పరుగు మొదలుపెట్టింది.

"భూతరాజును నువ్వు చంపినప్పుడు వాడి వయసెంత?"

"అరవయ్ ఏళ్లు."

"ఇప్పుడూ వాడు అరవై ఏళ్లవాడిలాగే కన్పిస్తున్నాడుగా?" నాకు పిచ్చెక్కే లాగుంది. జుట్టు పీక్కోవాలని బండిలోనుండి దూకి పారిపోవాలని ఉంది.

"అరవయ్యో పడిలో చచ్చిపోయి దయ్యం అయ్యాడు. మనిషి ఏ వయసులో చచ్చిపోతే, దయ్యం అదే వయసులో, పాపపరిహారం అయి, ఊర్ధ్వలోకాలకు వెళ్ళేంతవరకు అలాగే ఉంటుంది."

నాకు గొంతు ఎండిపోతున్నది.

"దాహం!" గొంతు పెగల్చుకొని అన్నాను.

రెహమాన్ నీళ్లసీసా ఇచ్చాడు. నీళ్లు గటగట తాగేశాను. అప్పటికి కొంత సేద తీరినట్టయింది. చల్లని గాలి వీస్తోంది. ప్రాణం కాస్త కుదటపడినట్టు అయింది. బుర్ర చురుగ్గా పనిచెయ్యసాగింది.

ఖాళీసీసా అందిస్తున్నప్పుడు నాకో ఆలోచన వచ్చింది. అడగ్గానే నీళ్లసీసా ఎలా ఇవ్వగలిగాడు? ఇంతవరకు ఆ చిన్నబండిలో నాకు నీళ్ళసీసా కన్పించలేదు. భూతరాజు దయ్యం అయితే వీడూ దయ్యమే!

రహమాన్ ఖాళీసీసాను బండి తడికకు కట్టి ఉన్న చిన్న సంచిలో పెట్టాడు.

అమ్మయ్య!'

సీసా ఇక్కడుందన్నమాట! ఛ! తను ప్రతిదానికీ భయపడే పిరికివాడివైపోయాను.

"రహమాన్! నీవయసెంత?"

"ముప్పయ్ ఆరు."

నేను మరోసారి అదిరిపడ్డాను.

"నీ వయస్సు ముప్పయ్ ఆరైతే నువ్వు నలభైసంవత్సరాల క్రితం భూతరాజును ఎలా చంపావు?"

"అదా మీ సందేహం? యోగి గురించి చెప్పాగా? అతడే ఇరవైరోజులు ఏవేవో మూలికలు తినిపించాడు. మరో ఏభైఏళ్లదాకా నీ వయసు ఆగిపోతుందని చెప్పాడు. మరో పదేళ్లు నేను బతుకుతాను. భూతరాజుమీద కసి తీర్చుకుంటాను." కసిగా అన్నాడు.

దయ్యంమీద మనిషి కసి తీర్చుకోవడం ఏమిటి? వీడికి పిచ్చేమో!

వీడుకూడా కట్టుకథలే చెప్తున్నాడు.

అయితే రహమాన్! నన్ను దారితప్పించి ఏంచెయ్యాలనుకొన్నాడు?

"ఆ దారిలో ఒక పొలంలో పెద్ద నుయ్యి ఉంది. దాంట్లోకి తోసి చంపాలని అతని ప్రయత్నం. అలా చేసిన తర్వాత వాడి ఆత్మకు విముక్తి లభిస్తుంది. అది వాడికి కలగకుండా చేస్తున్నాను. అందుకే నేను మీలాంటివాళ్లను రక్షించి తీసుకెళ్తూ ఉంటాను."

"అసలు నీకు భూతరాజు మీద అంతకోపం ఎందుకూ?"

"వాడు నా చెల్లెల్ని మోసం చేశాడు, పెళ్లి చేసుకుంటానని నమ్మించి. నా చెల్లెలు గర్భవతి అయింది. వాడు పెళ్లి చేసుకోనని ఖచ్చితంగా చెప్పేశాడు. నా చెల్లెలు ఊళ్లో మంచినీళ్ల బావిలో పడి చచ్చిపోయింది. చచ్చిపోతూ తన చావుకు కారణం రాసింది. భూతరాజు తనను మోసం చేశాడనీ, వాడిమీద ప్రతీకారం తీర్చుకొని తన ఆత్మకు శాంతి కలిగించమని కోరింది."

ఆగి, ఏదో వింటున్నట్టు చెవులు రిక్కించాడు.

వీడు కూడా ఏదో ఏడ్పు విన్పిస్తుందని చెప్తాడు కాబోలు!

"ఊఁ. చెప్పు, ఆగిపోయావేం?"

"అప్పటినుంచి నేను పగబట్టాను. భైరవమూర్తి దగ్గర అతని కుడిభుజంగా ఉండే భూతరాజును చంపడం సామాన్యమైన విషయం కాదు. నా చెల్లెలు చనిపోవడానికి కారణం నాకు తెలియనట్టే నటించాను. భూతరాజుతో స్నేహం చేశాను.

నమ్మించి మోసం చేశాను. ఏదో పనిమీద స్టేషన్‌కు వెళ్దాం రమ్మన్నాను. వాడు నమ్మి నాతో వచ్చాడు. చాలా పొద్దుపోయేదాకా స్టేషన్‌లోనే ఉన్నాం. ప్యాసెంజరుకు నా స్నేహితుడొకడు వస్తాడని చెప్పాను."

"వచ్చాడా?" అన్నాను యాంత్రికంగా.

"ఎలా వస్తాడూ?"

"ఏం?"

"అసలు వచ్చేవాళ్లంటూ ఎవరూ లేరు. అతన్ని పొద్దుపోయేంతవరకూ స్టేషన్‌లో ఉంచాలని నా ప్లాన్. ప్యాసెంజరు వెళ్ళిపోయాక ఇద్దరం దుమ్మలగూడెం బయలుదేరాం."

"మీది దుమ్మలగూడెమా?"

"అవును." ముక్తసరిగా అని, చెప్పసాగాడు:

"వాడు – ఆ భూతరాజుగాడు నిన్ను రోడ్డు వదిలి దగ్గర బాటలో వెళ్దామంటూ ఆ కాలిబాటకు రమ్మని ఎందుకు బలవంతం చేశాడనుకొన్నావ్?"

"ఆ దారి అడ్డదారని చెప్పాడు. దుమ్మలగూడెం త్వరగా వెళ్ళొచ్చన్నాడు."

"ఆ దారి దుమ్మలగూడెం పోదు. ఆ రాత్రి – అదే నేను అతడ్ని చంపదల్చుకొన్న రాత్రి – అతడితో అలాగే చెప్పాను. అతను నమ్మాడు. ఆ దారినవెళ్తే ఒక కిలోమీటర్ తర్వాత ఒక పాడుబడ్డ దేవాలయం, దానికి ముందొక పూడిక తియ్యని బావి ఉన్నాయని నాకు తెలుసు. ఆ దారిన మానవమాత్రుడు ప్రయాణం చెయ్యడు రాత్రిపూట. బావిదగ్గరకు రాగానే నాకు దాహం వేస్తోందనీ, ఎలాగయినా నీళ్లు చేదడానికి అవకాశం ఉంటుందేమో చూద్దామనీ తీసుకెళ్ళాను. ఇద్దరం తొంగి చూస్తున్నాం, నేను ఒక్కసారిగా అతడ్ని ముందుకు తోశాను. అనుమానం లేనందువల్లా, ఒక్కసారిగా తొయ్యడంవల్లా అతను ఆ బావిలో పడిపోయాడు. అతను నాకంటే బలవంతుడు. రెండోకంటికి తెలియకుండా వాడ్ని చంపడం అసాధ్యం అని నాకు తెలుసు. వాడు దయ్యం అయ్యాడు. అశాంతిగా తిరుగుతున్నాడు. రోజూ స్టేషన్‌కు మానవాకారంలో వస్తాడు. నీలాంటివాడ్ని దొరకబుచ్చుకొని, కబుర్లు చెప్పి అడ్డతోవన తీసుకెళ్ళి బావిలో తోసేస్తాడు!"

"అలా చెయ్యడంవల్ల లాభం?" పెదవులు నాలికతో తడుపుకొని అడిగాను.

"దయ్యానికి లాభం ఏమిటి? దయ్యపు చేష్ట! తను పడిన ఆ బావిలో ఎవర్నయినా తోసేసిన కొద్దిరోజులు వాడు చాలా సంతృప్తిగా, ఉత్సాహంగా ఉంటాడు. అందుకే వాడికి ఆ అవకాశం రాకుండా నేను అడ్డుపడి, వాడి వలలో పడినవాళ్లను రక్షిస్తుంటాను" అంటూ నిట్టూర్పు విడిచాడు రహమాన్.

నా బుర్ర మొద్దుబారిపోయింది.

నవలకు హత్యా సంబంధమైన రహస్య వివరాలను సేకరించడానికి బయలుదేరిన నేను దయ్యాల మధ్య ఇరుక్కున్నానా?

ఒకవైపు భయంతో నా నవనాడులూ బిగుసుకుపోతున్నాయి. అయినా వాడి బారినుండి బయటపడ్డాననే సంతోషం మరోవైపు.

"ఇంకా నయమే. బావిలో తోసేస్తున్నాడు – తల పగలగొట్టి మెదడు తినకుండా!" ఆ దృశ్యం ఊహించుకొని వణికిపోయాను.

"ఛ! అదేంటి సార్! మావాళ్లు అలా చెయ్యరే?"

నేను తృళ్లిపడ్డాను. వీడు మావాళ్లంటున్నాడేమిటి?

"అవి నాకు కన్పిస్తాయి. నాతో మాట్లాడతాయి. వాటితో నాకున్న అనుబంధంతోనే మావాళ్లు అన్నాను సార్!"

వీడు నా మనసును తెరిచిన పుస్తకాన్ని చదివినంత తేలిగ్గా చదివేస్తున్నాడు. నా ఊహల్నీ భయాల్నీ ఇట్టే పసిగడ్తున్నాడు. వీడికి నిజంగానే అతీతశక్తులు ఉన్నట్టున్నాయి. సందేహం లేదు. వీడు సామాన్యుడు కాదు. అవును, దయ్యాలకు మనుషులు భయపడాలిగాని మనుషులకు దయ్యాలు భయపడటం ఏమిటి? నాన్‌సెన్స్! వీడు కోతలు కోస్తున్నాడు.

"దయ్యాలు కూడా మనుషులకు భయపడ్తాయి!"

నేను తుళ్లిపడ్డాను. మళ్లీ నా మనసులో రేగిన ప్రశ్నలకు వీడు సమాధానం ఇచ్చాడు.

"అందరు మనుష్యులకూ కాదు, కొందరికే. అతీతశక్తుల్ని సంపాదించుకొన్న వాళ్లకు. దయ్యాలను మేము మా చెప్పుచేతుల్లో ఉంచుకొని, వాటిచేత ఎన్నో పనులు చేయిస్తాం. ఆ భూతరాజుగాడ్ని నేను అలాగే ఏడిపిస్తున్నాను. ఈ ప్రాంతాల్లో తిరిగే రౌడీ దయ్యాలన్నీ నా అదుపులో ఉన్నాయి. వాటిద్వారానే వాడిని పీడిస్తున్నాను."

"ఏమిటో నాకంతా అయోమయంగా ఉంది."

"అదేంటి బాబూ! మీరు రచయిత గదా? ఈమధ్య రచయితలు ఈ విషయాలు వివరంగా రాస్తున్నారుగా! పైగా దయ్యాలమీద రిసెర్చిచేసి, వాస్తవాలనే రాస్తున్నామని కూడా చెబుతున్నారుగా? మీరు చదవలేదా?"

"నేను అలాంటి ట్రాష్ చదవను."

రహమాన్ అదోలా నవ్వాడు. పిచ్చివాడ్ని చూసి తెలివైనవాడు నవ్వే నవ్వు అది. దయ్యాల కథలు రాస్తూ సరదాకు రాశానని చెప్పడం కూడా కాదు. వాస్తవాలూ, నేను చూసి అనుభవించినవని కూడా రాస్తున్నారా? ఇంతకంటే ద్రోహం మరొకటి లేదు.

"దయ్యాలు కూడా మనుషుల్లాగే ప్రవర్తిస్తాయి బాబూ! జీవితంలో మంచిగా బ్రతికినవాడు దయ్యం అయికూడా మంచిగానే ఉంటాడు. అలాంటివాడు విముక్తికోసం ఎదురుచూస్తూ బాధపడుతూ ఉంటాడేగాని మరొకర్ని పీడించడు. రౌడీగా బతికినవాడు, ఇతర్లను పీడించి బతికినవాడు, దయ్యం అయికూడా పీడిస్తాడు."

"రహమాన్! ఆగు. నీవాగుడంతా నేను నమ్మను" అన్నాను కోపంగా.

రహమాన్ ముఖం పక్కకు తిప్పుకొన్నాడు. మౌనంగా ఉండిపోయాడు. ఆ మౌనం మరీ భయంకరంగా అన్పించింది. వీడితో తర్కించి కోపం తెప్పించడం నాకే హాని! అనవసరంగా చిక్కుల్లో పడ్డాను.

మళ్ళీ వీడితో వాదించి కొత్త చిక్కులు కొనితెచ్చుకోవడం మరీ బుద్ధిలేనితనమే అవుతుంది.

ఎలాగయినా వాడి కోపం తగ్గించి మళ్ళీ మాటల్లో పెట్టాలి. లేకపోతే ఏంచేసినా చెయ్యగలడు.

"రహమాన్!"

"అయ్యా!" గుర్రుగా అన్నాడు.

"కోపం వచ్చిందా?"

వాడు మాట్లాడలేదు.

"అసలు విషయం - నేను ఆత్మల్ని నమ్మను, దయ్యాల్నీ భూతాల్నే కాదు - దేవుడ్ని కూడా నమ్మను. అందువల్లనే అప్పుడప్పుడు నీ మాటలకు అడ్డొస్తున్నాను. ఫర్వాలేదు చెప్పు."

"నమ్మనివాళ్ళకు చెప్పి నమ్మించాల్సిన పని నాకేం లేదు. త్వరలోనే మీరు అనుభవించబోతున్నారు. అప్పుడు నమ్మక ఏంచేస్తారు? ఈ లోపల నాకెందుకీ కంఠ శోష!"

"నా విషయం, నా నమ్మకాల గురించి చెప్పాను. అంతే! నేను ఓపెన్ మైండుతోనే ఉన్నాను. ఎవరైనా రుజువు చేసినా, నా అనుభవంలోకి వచ్చినా నమ్మక ఏంచేస్తాను? చెప్పు." మృదువుగా అడిగాను.

వాడు మాట్లాడలేదు.

"మంచివాడు దయ్యం ఎందుకవుతాడు? మంచివాళ్ల కోసం స్వర్గద్వారాలు బార్లాగా తెరిచి వుంటాయని మా శాస్త్రాల్లో చెప్పారుగా?" అన్నాను, ప్రశ్న వేస్తేగాని వాడు మాటల్లోకి దిగడని.

"మంచివాడు అకాల మరణం చెందితే దయ్యం అవుతాడు. అతడికి నిర్దేశించిన జీవితం పూర్తి అయేంతవరకూ అతనికి ఊర్ధ్వ లోకాల్లోకి ప్రవేశం ఉండదు. అంతవరకూ దయ్యం రూపంలో ఈ లోకంలోనే తిరుగుతూ ఉంటాడు. ఈ విషయం కూడా రచయిత్రిగా మారిన ఓ రచయిత చెప్పాడు."

నాకు మళ్ళీ పిచ్చికోపం వచ్చింది.

"ఇలాంటి విషయాలు అనుభవించి రాశామనేవాళ్లను సైకియాట్రిస్టు దగ్గరకు పంపించాలి. పాపం! వాళ్లు కావాలని అబద్ధాలు రాస్తున్నారనుకోను. అలాంటి హల్యూసినేషన్స్‌కు గురి అయి, అది వాస్తవంగా భావించి రాస్తున్నారు. నీకూ అలాంటి పిచ్చే ఉన్నట్టుంది. భూతరాజు దయ్యం కాదు - మనిషే! నీలాంటి మనిషే!" అన్నాను ఉద్రేకంగా.

వాడు అదోలా నా ముఖంలోకి చూశాడు.

వాడి చూపులు నా వళ్ళంతా ముళ్ళులా గుచ్చుకున్నాయి.

నాలో నేనే చెంపలు వేసుకున్నాను.

వెధవ బుద్ధి!

ఊరికే వినకూడదూ?

మరో గంటకు ఊళ్లోకి చేరతాం.

అంతవరకూ వాడు చెప్పేదాన్ని వింటే సరిపోలా?

బండి ఏదో చెట్టు కిందగా పోతోంది.

నేను ఉన్నట్టుండి కెవ్వున అరిచాను.

బండి టాపుమీదకు ఏదో దూకింది.

నేను అరుస్తూ బండిలోనుంచి నాకు తెలియకుండానే దూకాను. వెలికిలా పడ్డాను. నా గుండెలమీదకు ఏదో ఆకారం ఎక్కి కూర్చుంది. అంతవరకే నాకు తెలుసు.

ఇదంతా క్షణంలో సగంసేపులో జరిగింది.

ఆ తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు.

కళ్ళు తెరిచాను.

పైన మబ్బుల మధ్యనుంచి చందమామ పరుగులు తీస్తున్నాడు.

నేను ఎక్కడున్నాను?

ఏమైంది నాకు?

రాత్రినుంచి జరిగిన విషయాలు గుర్తొచ్చాయి.

ఏదో బండి టాపుమీద పడటం, నేను కింద పడటం, నా గుండెల మీద ఏదో ఆకారం కూర్చోవడం లీలగా కళ్ళలో కదిలింది.

మళ్లీ భయంతో వళ్ళంతా బిగుసుకుపోయింది.

మళ్లీ కళ్లు మూసుకున్నాను.

"కళ్లు తెరవండి!" "బాబూగారూ!"

"నేనున్నాను. మీకేం భయంలేదు. కళ్లు తెరవండి."

నేను కళ్లు తెరిచాను.

నా మీదకు వంగి ఉన్న రహమాన్ ముఖం కన్పించింది.

రహమాన్ నా చెయ్యి పట్టుకొని కూర్చోబెట్టాడు.

నేను చుట్టూ ఉన్న పరిసరాలను తల తిప్పిచూశాను.

చెట్టు మొదట్లో క్రీనీడలో మళ్ళీ ఏదో ఆకారం కన్పించింది.

మళ్లీ పిచ్చిగా అరచి రహమాన్‌ను గట్టిగా పట్టుకొన్నాను.

"అదేం చెయ్యదు బాబూ! నేనున్నానుగా? కళ్ళు తెరవండి. ఒరే హనుమాన్! ఇలా వచ్చి బాబుగారికి దణ్ణంపెట్టి వెళ్ళిపో! మళ్లీ కన్పించకు" అంటున్నాడు రహమాన్.

"వద్దు, వద్దు పిలవకు." అన్నాను నిలువునా వణికిపోతూ.

"అలాగే బాబూ! ఒరేయ్, ఇక నువ్వెళ్లిపో!" అన్నాడు రహమాన్.

"బాబూ! కళ్ళు తెరవండి" అన్నాడు నాతో.

కళ్ళు తెరచిచూచాను. చెట్టుకేసి భయం భయంగా చూచాను. అక్కడేమీలేదు.

రహమాన్ నీళ్ల బాటిల్ అందిస్తూ "తాగండి బాబూ!" అన్నాడు.

రెండు చేతులతో బాటిల్ అందుకొని గటగట తాగేశాను.

మనసు కొంత కుదుటపడింది.

ఖాళీ బాటిల్ ఇస్తుండగా నాకు అంతకుముందే నీళ్ళన్నీ తాగేశానన్న విషయం గుర్తొచ్చింది. మళ్ళీ ఈ నీళ్లు ఎక్కడ్నుంచి వచ్చాయ్?

"రహమాన్! ఈ నీళ్ళెక్కడివీ?"

రహమాన్ మర్మగర్భంగా నవ్వాడు.

మధ్యలో వీడొకడు దాపరించాడు. హాయిగా ఆ భూతరాజుతో వెళ్ళినా బాగుండేది – ఈ ప్రతి నిముషం చస్తూ బతికేకంటే ఒక్కసారే చచ్చేవాడ్ని. వీడు చిత్రహింస పెట్టి చంపడానికి ప్రయత్నిస్తున్నాడు.

"చెప్పవేం?" రెట్టించాను.

"వద్దులెండి బాబూ! ఇప్పటికే భయపడిపోయారు."

"ఫర్వాలేదు చెప్పు." చావుకు తెగించినట్టుగా అన్నాను.

"ఆ కోతిగాడే క్షణాలమీద ఎగిరెళ్లి తెచ్చాడు" అన్నాడు అదోలా నా ముఖంలోకిచూస్తూ.

నేను వెర్రిచూపులు చూశాను.

"కోతులు కూడా దయ్యాలవుతయ్యా?" నా గొంతు కీచుమంది.

రహమాన్ నవ్వాడు.

"వాడు కోతికాదు. పన్నెండేళ్లప్పుడు లారీకింద పడి చచ్చిపోయాడు. చిన్న సన్నాసిగా కోతి వేషాలేస్తుంటాడు. మీరు ఈ చెట్టు కిందగా వెళ్తున్నప్పుడే దయ్యాలను నమ్మను అన్నారు. అది ఆ కోతి వెధవ విన్నాడు. కోతిరూపంతో బండిమీద దూకాడు."

నా బుర్ర బండబారిపోతున్నది.

"ఒసే రంగీ! ఆ వెధవను కాస్త అదుపులో ఉంచు." చెట్టుకేసి చూస్తూ అన్నాడు రహమాన్.

"రంగెవరూ?" సగంమూర్ఛలో అడిగినట్టుగా అడిగాను.

"అదే బాబూ! వాడి అమ్మమ్మ! అదీ ఈ చెట్టుమీదే మకాం పెట్టింది. ఆ బోసి నోటితో మిమ్మల్ని చూసి విరగబడి నవ్వుతోంది."

నేను చివ్వున లేచి నిలబడ్డాను. నాలోకి పిచ్చిబలం వచ్చినట్టయింది. బండెక్కి కూర్చున్నాను.

"రహమాన్! పద, వెళ్దాం" అన్నాను.

రహమాన్ బండెక్కి కూర్చున్నాడు.

బండి బయలుదేరింది.

"బాబూ!"

"ఊఁ."

"ఇప్పటికైనా నమ్ముతారా దయ్యాలున్నయ్యని?"

"నమ్ముతాను. నమ్మకేం చేస్తాను? ఇక ఆ దయ్యాల కథలు చెప్పకు – ఊరు చేరే లోపలే నా గుండె ఆగిపోయేలా ఉంది."

"ఇవి కథలు కాదు బాబూ!"

"సరేలేవయ్యా! వాస్తవాలే, కథలు కావు. అంగీకరిస్తాను. ఇక ఆ విషయాలు మాట్లాడకు" అనేసి వెనక్కు వాలి కళ్ళు మూసుకొన్నాను.

లయబద్ధంగా పడుతున్న గుర్రపు డెక్కల శబ్దం వింటూ మరో ఆలోచన మెదడులోకి రాకుండా ఉంచడానికి ప్రయత్నిస్తున్నాను.

"మై మైండ్ ఈజ్ బ్లాంక్. నా బుర్ర ఖాళీగా ఉంది. నా బుర్రలో ఎలాంటి ఆలోచనలూ లేవు. నా మనసు విశ్రాంతి తీసుకొంటున్నది. నాకు నిద్ర వస్తోంది. నేను నిద్రలోకి పోతున్నాను. నేను నిద్రలాంటి అవస్థలోకి పోతున్నాను."

ఆ మధ్య నేను హిప్నాటిజం మీద పుస్తకాలు తెగ చదివాను. మనసులోని భయాన్ని పారదోలడానికి ఆ జ్ఞానాన్ని ఉపయోగించుకొనే ప్రయత్నంలో ఉన్నాను.

గుర్రం బండి ఒక్కసారిగా ఆగింది.

నేను కళ్ళు తెరిచాను.

రహమాన్ గుర్రాన్ని సముదాయిస్తున్నాడు.

"ఫర్వాలేదు, పద. అల్లరి చెయ్యకు" అన్నాడు.

గుర్రం చిన్నగా అడుగులు వేస్తోంది.

మధ్య మధ్య చెవులు నిగడతన్ని మోర పైకెత్తుతోంది.

"ఏమైంది రహమాన్?" మళ్లీ ఏం కొంప మునిగిందన్నట్టుగా అడిగాను.

"మీకు విన్పించడం లేదా?"

బద్మాష్! వీడూ భూతరాజులాగే అడుగుతున్నాడు. వీడు ఇంతవరకూ చెప్పినవన్నీ కట్టుకథలే! ఎంతసేపు గుర్రం పరిగెడుతున్నా దూరం తగ్గడంలేదు.

"అదో, వినండి బాబూ!" అల్లంత దూరంలో, వెన్నెల్లో, వింతగా మెరుస్తున్న పెద్ద మర్రిచెట్టును చూపించాడు.

"అక్కడేముంది?"

"జాగ్రత్తగా వినండి బాబూ!"

"అసలు సంగతి ఏమిటి? ఏం వినాలి?"

"ఏడుపు, ఆడదాని ఏడుపు!"

నిజంగానే నాకు భయంకంటే కోపం ఎక్కువ వచ్చింది. వాడ్ని అమాంతం బండిలో, నుంచి తోసెయ్యాలనిపించింది.

అరే, అదేమిటి?

నిజంగానే విన్పిస్తోంది.

ఆడదాని ఏడుపు!

అది మామూలు ఏడుపు కాదు.

అనాదిగా ఆడదాని గుండెను బద్దలుకొట్టుకొని వస్తున్న ఏడుపు.

అతి దీనంగా, గుండెల్ని కరిగించేలా ఉంది ఆ ఏడుపు.

ఆ సమయంలో, ఆ పరిసరాల్లో ఆ ఏడుపు జాలికంటే భయాన్నే కలిగిస్తోంది..

"అటు, ఆ చెట్టుమీద చూడండి!"

చెట్టు ఆకుల మధ్య ఏదో కదిలినట్టుగా ఉంది. కొమ్మలు ఊగుతున్నాయి. ఆ ఆకారం తెల్లగా ఉండి చెట్టుమీదకు జాలువారుతున్న వెన్నెల్లో కలిసిపోతున్నట్టుగా ఉంది.

బండి దగ్గరౌతున్నది.

"అదేంమోత!" భయంతో బిగిసిపోతూ అడిగాను.

"గాజులమోత!" అన్నాడు రహమాన్.

అవును, గాజుల మోతే! మట్టిగాజుల మోత! తెల్లటి ఆకారం! అదీ మర్రిచెట్టు మీద!

నాకు గుండె ఆగిపోయినట్టుగానే ఉంది.

"ఆ పిల్లను చూస్తుంటే గుండె తరుక్కుపోతది. ఆ పిల్ల నాన్న డబ్బుకు కక్కుర్తిపడి ముసలాడికిచ్చి చేశాడు. ఆ పిల్ల ఎదురు తిరిగింది. ఏడ్చింది. ఈ పెళ్లి జరిగితే ఎవడితోనో లేచిపోయి రెండు కుటుంబాల తలలూ వంచుతానన్నది. అయినా వినిపించుకోలేదు. అరవయ్యో పడిలో పడ్డ భద్రయ్య తరలివచ్చాడు. పెళ్లి బ్రహ్మాండంగా చేశారు. ఏం లాభం? ఆ భద్రయ్య మాత్రం సుఖపడి చచ్చాడా? శోభనం రాత్రే ఆ అమ్మాయికి పిచ్చి పట్టింది." ఓ క్షణం ఆగాడు.

మళ్లీ అదే ఏడుపు!

"ఊఁ - చెప్పు!" అన్నాను. ఆ ఏడుపు వినడంకంటే వీడి మాటలు వింటుంటేనే భయం తక్కువగా ఉంది.

"చాలా మంది అంటారు - 'దీనికి పిచ్చీలేదు పాడూలేదు. ఆ మొగుడు నచ్చక వేషాలు వేస్తుం'దని! ఇంకా ఏదేదో అంటారు. దాని బుద్ధి మంచిది కాదనీ, రాత్రిపూట ఎక్కడకో వెళ్తుందనీ అంటారు. కాని బాబూ! దీని బుద్ధి బంగారం, నాకు తెలుసు. అప్పుడప్పుడు నేను ఈ అమ్మాయిని నా బండిలో తీసుకెళ్ళి దిగబెడ్తాను. దాంతో మా ఇద్దరికీ ఏదో ఉందని పుకారు పుట్టించారు!" అని నిట్టూర్చాడు.

అర్ధరాత్రి రెండుగంటలకు ఇక్కడకు రావడం ఏమిటి?

భయం వెయ్యదా?

పిచ్చివాళ్లకు భయం ఏమిటి?

మర్రి చెట్టెక్కెందుకు కూర్చోవాలి?

పిచ్చివాళ్ళు ఏది ఎందుకు చేస్తారో అందరికీ తెలిస్తే ఈ సైకియాట్రిస్టు లెందుకూ? పోనీలే, ఇది దయ్యంకాదు, పిచ్చిది. నా గుండె కుదుటపడింది.

బండి చెట్టును సమీపిస్తోంది.

తెల్లటి ఆకారం చెట్టుమీదనుంచి దూకింది.

నేను అప్రయత్నంగా "కెవ్వు" మన్నాను. వెంటనే అది దయ్యం కాదని గుర్తొచ్చి నా భయానికి నేనే సిగ్గుపడ్డాను.

"భయంలేదు బాబూ!" అంటున్నాడు రహమాన్.

దూకిన తెల్లటి ఆకారం చెట్టుకింద అలాగే నిల్చుంది.

బండి ఆగింది.

"రా లీలా! బండెక్కు" పిల్చాడు రహమాన్.

ఆ ఆకారం కదులుతోంది.

ఒక్కొక్క అడుగే వేస్తుంటే, నా వెన్నెముకలో నలికిల పాము ఒక్కొక్క మెలికే తిరుగుతున్నట్టుగా వళ్ళు జలదరిస్తోంది.

ఈమె దయ్యంకాదు. భయం ఎందుకూ? నాకు నేను ధైర్యం చెప్పుకుంటున్నాను.

ఆ ఆకారం చెట్టునీడలోనుంచి వెన్నెల్లోకి వచ్చింది.

అక్కడే నిలబడిపోయింది.

నాకేసి చూస్తూ నిల్చుంది. రెప్పవాల్చకుండా చూస్తోంది.

ఆమె అపురూప సౌందర్యవతి!

తెల్లటి చీర.

తెల్లటి రవిక.

తల్లో తెల్లటి పూలు.

గాలివాటుకు మల్లెపూల వాసన నాసాపుటాలను తాకుతోంది. మనసులో అంతవరకూ పేరుకొన్న భయం కరిగిపోతున్నది.

ఆమె నిల్చున్న బాట తెల్లగా ఉంది.

చుట్టూ తెల్లగావున్న వాతావరణం.

ఆమెను చూస్తున్నకొద్దీ నాలోని భయం మాయమైంది. ఇన్ని గంటలు అనుభవించిన మానసిక అస్థిరత కుదుటపడినట్టు అయింది. హాయిగా గుండెల నిండుగా గాలి పీల్చుకున్నాను.

ఎంత అందంగా ఉంది!

సాక్షాత్తు ఆ వనదేవతే వచ్చి నిల్చుందనిపిస్తోంది.

ఆమె నన్నే చూస్తోంది ఇంకా.

నాకు స్త్రీ బలహీనత లేదు. తాజమహల్ చూసినప్పుడు మనసు చలిస్తుందా? గులాబితోటను చూస్తే మనసు చలిస్తుందా? అలాగే అందమైన స్త్రీని చూడగానే మనసెందుకు చలిస్తుంది? అందాన్ని చూసినప్పుడు అందమైన అనుభూతి కలగాలి. అంతేగాని అనుభవించాలనే కోరిక కలుగకూడదు. అదే ఎదిగిన మనిషి మనసు. ఆరోగ్యకరమైన మనసు. ఇవి నా భావాలు.

కాని ఇవ్వాళ ఇదేమిటి? ఆమెను చూస్తుంటే ఆమెను తాకాలనిపిస్తోంది. ఆమెను గుండెలకు హత్తుకోవాలనిపిస్తోంది.

రహమాన్ బండి దిగి ఆమె దగ్గరగా వెళ్ళాడు.

"లీలా! రా వెళ్దాం."

ఆమె మౌనంగా నడిచింది. నిద్రలో నడిచినట్టు నడిచింది.

"బండెక్కు" అన్నాడు రహమాన్.

ఆమె బండి దగ్గరకు వచ్చింది.

నాకు ఆ పిల్లలో పిచ్చిలక్షణా లేమీ కన్పించలేదు.

పిచ్చివాళ్ళంతా పిచ్చివాళ్ళలా కన్పించరు.

ఆ మాటకొస్తే మనం రోజూ చూసేవాళ్ళల్లో ఎందరో పిచ్చివాళ్ళుంటారు. ఆ లక్షణాలు పూర్తిగా ముదిరితేగాని వాళ్లకు పిచ్చి అని గ్రహించలేరు ఎవరూ

"బాబూ!"

గిర్రున తల తిప్పి చూశాను.

"ఈ అమ్మాయి కూడా ఊళ్లోకి మనతో వస్తుంది."

"నాకేం అభ్యంతరం లేదు" అన్నాను ఆమెను చూస్తూ మైమరపుగా.

ఆమె బండి ఎక్కింది.

ఎదురుగా కూర్చుంది.

మోకాళ్లు ముడుచుకొని, ముఖం మోకాళ్ల మీదకు దించుకొని కూర్చుంది.

నేను ఎదురుగా ఉన్నట్లు గమనించినట్లుగా కూడా లేదు.

అవును పాపం! ఈ వయసులో ఈమెకు పిచ్చి ఎత్తడం ఏమిటి? పిచ్చి ఎత్తలేదు. ఎత్తించారు.

మల్లెల వాసన చల్లగాలితోపాటు నా నాసాపుటాలను తాకుతోంటే నాలో ఏవేవో కోరికలు తలెత్తసాగాయి.

ఆ పిల్లను అలా చూస్తూ కూర్చున్నాను. అలా చూడటాన్నే గుటకలు వెయ్యడం అంటారు.

గుర్రంబండి చక్రం ఒకటి కొంచెం పల్లంలోకి పడి లేచింది.

అకస్మాత్తుగా లీల నామీద పడిపోయింది.

గాభరాగా సర్దుకొని కూర్చుంది.

"సారీ!" అంది నా కళ్లల్లోకి చూస్తూ.

"ఫర్వాలేదు" అన్నాను.

ఆమె కనురెప్పల్ని టపటప లాడించింది.

ఆమె అలా మరికొంతసేపు నా ఒళ్లోనే ఉంటే బాగుండుననే కోరిక లీలగా మెదిలింది.

"మీ కళ్లు చాలా అందంగా ఉన్నాయి. నీళ్లలోనుంచి మిలమిల లాడుతూ పరుగులు తీసే చేపల్లా ఉన్నాయి."

ఆ అమ్మాయి కిసుక్కున నవ్వి తల వంచుకొన్నది.

ఆ నవ్వు నా మనసుకు గిలిగింతలు పెట్టింది.

ఇంతకుముందేగా గుండెలు అవిసిపోయేలా ఏడ్చింది. ఇంతలోనే ఎలా నవ్వగలుగుతోంది?

పిచ్చిది. పిచ్చివాళ్లు ఎందుకు నవ్వుతారో, ఎందుకేడుస్తారో ఎవరు చెప్పగలరు? అందుకే వాళ్ళను పిచ్చివాళ్ళంటున్నాం.

ఆమె తల ఎత్తింది.

నాకేసి ఓరగా చూస్తోంది.

పెదవులు కదిలాయి.

ఒంపులు తిరిగిన ఆ పెదవుల మధ్య చిరునవ్వు.

నాకు వళ్ళు జల్లుమంది.

ఆ నవ్వు మామూలు నవ్వుకాదు.

పిచ్చివాళ్ళు నవ్వే నవ్వు.

నాకు పిచ్చివాళ్లంటే భయం లేదు.

వాళ్ల నవ్వంటేనే భయం. అదీ చిరునవ్వు మాత్రమే. వాళ్ళు వెర్రిగా విరగబడి నవ్వుతోంటే నాకు భయం అనిపించదు. ఆ నవ్వే పిచ్చివాళ్ల సహజమైన నవ్వుగా అన్పిస్తుంది. చిరునవ్వు అసహజంగా అన్పిస్తుంది.

నా ఎదురుగా కూర్చున్న అందాలరాణి పిచ్చిది.

నన్ను చూసి నవ్వుతోంది. ముసిముసిగా నవ్వుతోంది.

నేను బిక్కుబిక్కుమంటూ చూస్తున్నాను.

నాకు పిచ్చెక్కిపోయేలా ఉంది.

ఒక సిగరెట్ కాల్చుకుంటే బాగుండు ననిపించింది.

జేబులోనుంచి సిగరెట్‌పెట్టె తీశాను. అగ్గిపెట్టె తీశాను, పుల్ల బయటకి తీసి గియ్యబోయాను.

నా చేతిలోంచి అగ్గిపెట్టె ఎగిరి అల్లంతదూరంలో పడింది. అదే వేగంతో ఆ పిల్లకూడా బయటికి దూకింది.

నేను ఏం జరిగిందో తెలుసుకునే లోపలే ఆ పిల్ల బండిలో లేదు. నేను చూపు అందినంతవరకు చూశాను. రోడ్డు ప్రక్కగా ఉన్న చిన్న పొదల్లోనుంచి ఏదో నీడ పరుగెత్తడం చూచాను.

"రహమాన్ బండాపు."

"ఎందుకు బాబూ?"

"ఆ పిచ్చిపిల్ల బయటకు దూకింది."

"పర్వాలేదులెండి."

"అదేమిటి? పాపం, అర్ధరాత్రిపూట అరణ్యంలాంటి ఈ ప్రదేశంలో ఎక్కడ తిరుగుతుంది? బండి ఆపి పిలువు."

"అది ఇక మనకు చిక్కదు బాబూ!"

"అసలెందుకలా ఉన్నట్టుండి దూకింది?"

నా ప్రశ్న నాకే పిచ్చిగా అన్పించింది. ఆ పిల్లకు పిచ్చి! ఎందుకు దూకిందో ఎవరు మాత్రం చెప్పగలరు? అలా దూకి పారిపోవాలనిపించి ఉంటుంది. అందుకే దూకింది.

"మీరు అగ్గిపుల్ల గీయబోయారు. అందుకే పారిపోయింది!" అన్నాడు రహమాన్.

"ఆ పిల్లకు అగ్గంటే భయమా?"

"ఆ పిల్లకేంటి, ఏ దయ్యానికైనా అగ్గి అంటే భయమే. మీరు వినలేదా?"

ఒక్కసారిగా బండిలోనే ఎగిరిపడ్డాను.

నెత్తికి బండిటాపు కొట్టుకుంది.

దిమ్మెరపోయాను. అరచేత్తో నెత్తిని రుద్దుకున్నాను.

రహమాన్‌కేసి చూచాను.

వాడు నాకేసి చూడటంలేదు. ముఖం తిప్పుకొని నవ్వుకొంటున్నట్టుగా అన్పించింది.

దొంగవెధవ!

వీడూ నాటకం ఆడుతున్నాడు.

వీడూ భూతరాజూ కలిసే నన్ను భయపెట్టే ప్లాను వేసుకొని ఉంటారు. వీడికీ ఆ హత్యతో సంబంధం ఉండి ఉంటుంది. ఇవన్నీ ఇద్దరూ కలసి చేసిన ఏర్పాట్లే. దయ్యాలను నమ్మని నేను రీజనింగ్ లేకుండా దయ్యాలని భయపడటం ఏమిటి!

భూతరాజు దయ్యంకాదు.

కోతిచేష్ట సహజమైందే!

అసలే భయపడుతుండడంవల్ల అది దూకగానే భయపడ్డాను. అది మామూలు కోతిచేష్టే!

ఈ పిల్లనుకూడా వీళ్ళే కుట్రపన్ని తనను భయపెట్టడానికి ఉపయోగించి ఉంటారు. దాంతోపాటు మరొకడెవడైనా ఉండే ఉంటాడు. లేకపోతే ఆ పిల్లకు పిచ్చేమిటి? ఆ కళ్ళలో నాకు పిచ్చితనం ఎక్కడా కన్పించడం లేదు.

మళ్ళీ దూరంనుంచి వస్తున్నట్టుగా ఉన్న గాజులమోత, వెండి గజ్జలు మొజాయిక్ ఫ్లోర్‌మీద పడినట్టు మధురమైన నవ్వు.

నాకుకూడా నవ్వొచ్చింది. ఆ పిల్లే పొదల్లోంచి గాజులు మోగిస్తుందనీ, నవ్వుతోందనీ అర్థం చేసుకొన్నాను.

ఇక ఊరు చేరేంతవరకూ వీడ్ని పలకరించకూడదు.

నాలుగు సంవత్సరాల క్రితం జరిగిన ఒక సంఘటన గుర్తొచ్చింది.

అది ఆ రోజు రాత్రి పదిగంటలకు టెలిగ్రాం మోసుకొచ్చిన ఒక దారుణమైన వార్త. ఈ టెలిగ్రాములు ఎప్పుడూ రాత్రిపూటే వస్తాయి!

నా చెల్లెలి భర్త పొలంలో పాము కరచి చనిపోయాడనే వార్త.

11 గంటల బస్‌లో బయలుదేరాను. మనసంతా ముసురుపట్టిన ఆకాశంలా ఉంది.. నా చెల్లెలి ముఖం కళ్ళలో మెదలుతోంది. మనసు తరుక్కుపోతున్నది. నా చెల్లిని తల్చుకుంటూ ఉంటే, కళ్ళవెంట నీరు కారుతోంది. తుడుచుకోవడంకూడా మర్చిపోయి కూర్చున్నాను. మూడు గంటల ప్రాంతంలో బస్సు కర్నూలు చేరింది. బస్సు దిగి మైలుదూరంలో ఉన్న ఆ చిన్నగ్రామం వెళ్ళాలి. నడక సాగింది. చీకటి రాత్రి. పైగా వర్షం సన్నగా పడుతోంది. మనసులో బాధ. ఉండీ ఉండీ కళ్ళు నీరు చిప్పిస్తున్నాయి.

చల్లటి గాలి వీస్తోంది. వర్షం ఆగిపోయింది. బట్టలు తడిసిపోయాయి. మబ్బులు మెల్లమెల్లగా విచ్చుకొంటున్నాయి. కాలిబాటన నడుస్తున్నాను. అక్కడక్కడ బాటలోని గుంటలోని నీరు నా కాలు పడినప్పుడల్లా చిందుతున్నాయి.

నా దృష్టి చుట్టూ ఉన్న వాతావరణం మీద లేదు.

ఎప్పుడెప్పుడెళ్ళి నా చెల్లిని అక్కునచేర్చుకొని ఊరడిద్దామా అనే ఆదుర్దాలో ఉన్నాను.

అల్లంత దూరంలో ఊరి పొలిమేరలో రెండు ఆకారాలు కొంచెం దూరంలో నిల్చుని ఉన్నాయి. నడుస్తూనే కళ్ళు తుడుచుకొని చూచాను. ఇద్దరు లంబాడి యువతులు నిల్చుని ఉన్నారు. అనుకోకుండా తృళ్లిపడ్డాను. ఇక్కడ ఈ చీకట్లో వాళ్లెందుకు నిల్చున్నట్టు? కళ్ళు తుడుచుకున్నాను. ఓ క్షణం నిల్చున్నాను. వాళ్ళు అలాగే నిల్చుని ఉన్నారు.

నాకు దయ్యాలమీద నమ్మకం లేదని చెప్పాను గదూ?

అవి దయ్యాలని నమ్మలేకుండా ఉన్నాను. అయినా ఎవరో అర్థం కావడంలేదు.

"ఎవరక్కడ?" గట్టిగానే అరిచాను.

వాళ్లు ఉలకలేదు, పలకలేదు. అక్కడ్నుంచి ఒక్క అంగుళం కూడా కదల్లేదు.

నా మనసు ఏదో శంకతో అంత బాధలోనూ భయపడింది.

అటు చూడకూడదనుకొంటూనే చూశాను.

జుట్టు ఎగురుతున్నది. రంగురంగుల పూసలు మెళ్లో. బట్టలకు అద్దాలు. మొదటికంటే స్పష్టంగా కన్పిస్తున్నారు.

"ఎవరు మీరు?" మళ్ళీ కేకవేశాను.

సమాధానం లేదు.

నేను అటు చూడకుండా గబగబా ముందుకు దాటిపోయాను.

కొంతదూరం నడిచి వెనక్కు తిరిగిచూశాను. వాళ్లు అలాగే ఉన్నారు. పైగా ముఖాలు నా వైపుకు తిప్పారు.

సుబ్బారావు మాటలు గుర్తొచ్చాయి.

"నీకు తెలియనివి, ఇంకా విజ్ఞానానికి అందనివీ లేవంటే లేకుండా పోతాయా? చనిపోయాక ఇంకేమీ ఉండదంటారు మీవంటి కొద్దిమంది భౌతికవాదులు. కాని అనాదిగా మానవుడు దయ్యాల్ని నమ్ముతూ వచ్చాడు. ఇప్పటికీ నమ్మేవాళ్ల సంఖ్య నమ్మనివాళ్లకంటే ఎన్నోరెట్లు ఎక్కువ. నమ్మేవాళ్లంతా పిచ్చివాళ్లు కారు. పెద్దపెద్ద మేధావులుకూడా నమ్ముతున్నారు" అంటూ వాదిస్తాడు ఆవేశంగా. నేను వాడి మాటలకు నవ్వి ఊరుకుంటాను.

మరి ఈ అనుభవం ఏమిటి?

గుండెలో పేరుకొంటున్న భయాన్ని లక్ష్యపెట్టనట్టు నాకు నేనే సర్దిచెప్పుకొంటూ వెళ్ళిపోయాను.

తీరా ఊళ్లో ప్రవేశించేసరికి నా మనసు దుఃఖభారంలో ఆలోచనలతో భయం మరుగున పడిపోయింది.

మనిషి మనసు అతనికి తెలియకుండా సుఖాన్ని కోరుకుంటుంది. ఎక్కువ రోజులు బాధపడటం ఇష్టపడదు. అందువల్లనే ఎంత దుఃఖం కూడా కాలక్రమేణా తన తీవ్రతను కోల్పోతుంది. అందుకే అంటారు – కాలమే గాయాన్ని మాన్పుతుందని.

అంత్యక్రియలు జరిగాయి. చిన్నదినం కూడా అయిపోయింది. అప్పుడే నా బావమర్ది పోయి మూడురోజులైంది. ముందు కార్యక్రమాన్ని గురించిన ఆలోచనలో పడ్డాను. చెల్లెలి భవిష్యత్తు గురించీ, పిల్లల భవిష్యత్తు గురించీ ఆలోచనలు సాగుతున్నాయి.

అకస్మాత్తుగా ఆ రాత్రి నేను చూసిన లంబాడి యువతులు గుర్తొచ్చారు. అదేమిటో తెలుసుకోవాలని బుద్ధి పుట్టింది. మధ్యాహ్నం ఎవరికీ చెప్పకుండా బయలుదేరాను. ఆ ప్రదేశానికి వచ్చి నిల్చుని నాలో నేను నవ్వుకున్నాను.

అవి రెండు ఈతచెట్లు.

వర్షం! చీకటి! తడిబట్టలు! ఈదురుగాలి!

శరీరం బాధపడుతోంది.

కళ్ళల్లో నిముష నిముషానికీ ఉబికివస్తున్న నీరు!

గుండెల్లో పేరుకుపోతున్న దిగులు!

కన్ను చెదిరింది.

దయ్యాలను నమ్మను కనుక కళ్ళు తుడుచుకొని మళ్ళీ చూశాను. ఆ చెదిరిన రూపాలు ఇంకొంచెం స్పష్టంగా ఉన్నట్టు కన్పించాయి. చూసిన కొద్దీ - ముందు లంబాడా యువతులుగా భావన కలగడంవల్ల డిటైల్సు కన్పించసాగాయి. చిన్నప్పుడు ఆరుబయట నులకమంచంమీద పడుకొని మబ్బుల్ని చూస్తుంటే అవి రకరకాల ఆకారాలలో కన్పించేవి. మనం ఎలా భావిస్తే అలా కన్పించేవి.

❀ ❀ ❀ ❀

"ఏంటి బాబూ! అంతగా ఆలోచిస్తున్నారూ?"

నా ఆలోచన దారం పుటుక్కున తెగింది.

"ఆఁ - ఏమీలేదు. నీకు పుణ్యం ఉంటుంది. కాసేపు మాట్లాడకుండా కూర్చో!" అన్నాను రహమాన్‌తో.

వాడు చిరునవ్వు నవ్వాడు.

వెధవ! నవ్వుతున్నాడు.

నేను భయపడటాన్ని గుర్తుచేసుకొని, తన విజయంమీద గర్వంగా నవ్వుతున్నాడు.

"బాబూగారూ! వాళ్ళిద్దరూ ఏంచెయ్యాలో తోచక తికమక పడ్తున్నారు!"

"ఎవరూ?" వాడిమాటల్లో పడకూడదనుకొంటూనే యాంత్రికంగా అడిగాను.

"నీలకంఠశాస్త్రీ, ఆనందరావులు బాబూ!"

"వాళ్ళెవరూ?"

"ఏప్రిల్ 14వ తేదీ 'ఈనాడు' చదవలేదా బాబూ?"

"చదివానేమో కాని, ఆ పేర్లు గుర్తులేవు. అసలు సంగతి చెప్పు."

"అదే బాబూ! ప్రభుత్వంవారు - అంటే విద్యాశాఖవారు వారికి స్పాట్ వాల్యుయేషన్ ఆర్డర్లు పంపించారు."

"అయితే?" వాడేం చెప్పాలనుకొంటున్నాడో అర్థం కాలేదు.

"అందులో ఒకాయన ఐదేళ్ళక్రితం, రెండో ఆయన రెండేళ్ళ క్రితం చనిపోయారు."

నేను అయోమయంగా చూశాను.

"ఆ చెట్టుమీద వాళ్ళు కూర్చుని ఉన్నారు. ఎంత దిగులుగా ఉన్నారనుకొన్నారు? ఆర్డర్లు వచ్చాయని తెలుసు. సర్దాగా వెళ్ళాలనుకొన్నారు. మధ్యలో ఈ పేపరు వాళ్ళు, తాము చచ్చిపోయినట్టు రాసి ఆ ఛాన్సు కాస్తా చెడగొట్టారని బాధపడుతున్నారు."

రహమాన్‌ను లాగి గూబ పగలగొట్టాలనిపించింది.

ఆ న్యూస్ నేను చదివాను.

ఇలాంటి న్యూస్ వస్తూనే ఉంటుంది. వాళ్ళిద్దరితోపాటు మరొకరికి, చనిపోయిన వ్యక్తికికూడా, ఆర్డర్లు పంపినట్టుకూడా చదివాను. విద్యాశాఖ వింతలని ఒక గ్రంథం రాసి డాక్టరేట్ సంపాదించుకోవచ్చు. ఈ వెధవకు వాళ్ళ ఆత్మలు కన్పిస్తున్నాయట!

అవి దిగులుగా ఉన్నాయట!

"రహమాన్!"

"అయ్యా!"

"నీకు తెలుగు చదవడం వచ్చా?"

"వచ్చు బాబూ!"

"తెలుగు నవలలు చదువుతావా?"

"అందరివీ చదవను."

"ఎవరివి చదువుతావ్?"

అతను కొన్ని పేర్లు చెప్పాడు. నాకు ఆశ్చర్యం కలిగింది. అదీ సంగతి! అందుకే వీడికి మతిపోయింది. హెల్యూసినేషన్స్ ఎక్కువయ్యాయి.

"ఉయ్యాలా జంపాలా చదివారా బాబూ?"

"లేదు."

"మీరు రచయిత అని విన్నాను. మరి మీ తోటిరచయితలు రాసేవి చదవకపోతే ఎలా?"

"చదువుతాను. కాని దయ్యాలూ - భూతాలూ అంటూ మూఢనమ్మకాలను నూరిపోసే ట్రాష్ - అదే చెత్త - చదవను." ఖచ్చితంగా అన్నాను.

"ఇంత అనుభవం అయ్యాక కూడా మీకు నమ్మకం కుదర్లేదా బాబూ?" వాడి కంఠం అదోలా పలికింది.

తను ఊహించింది కరక్టే! 'ఉయ్యాల జంపాల' గూడా చదివాడట!

"బాబూ! అందులో హీరోకి ఆత్మలూ, దయ్యాలూ కన్పిస్తాయి. అతనితో మాట్లాడతాయి. మామూలువాడు చూడలేనివి అతను చూస్తాడు. ఏ నక్షత్రంలో పుట్టాడో రచయితకే తెలియదు. కాని నేను ఆ నక్షత్రంలో పుట్టి ఉంటాను బాబూ! చిన్నప్పుడు నేను చెప్పేమాటలు విని మా పెద్దోళ్లు బెంబేలెత్తిపోయేవాళ్లు బాబూ! ఎన్ని పుణ్యక్షేత్రాలకో

తిప్పారు. తాయెత్తులు కట్టించారు. దాదాపు మహత్తుగల దర్గాలన్నిటి దగ్గరకూ తీసుకెళ్ళారు."

"అయితే ఈ పిచ్చి నీకు ఇపుడొచ్చింది కాదన్నమాట? చిన్నప్పట్నుంచీ ఉన్నదే?"

"పిచ్చికాదు బాబూ!"

"పిచ్చే! పిచ్చే! మహాపిచ్చి! ఆ పిచ్చి చాలా భయంకరమైంది. అది ఆ ఎక్కిన వాడితోనే ఉండిపోదు. చుట్టూవాళ్లకుగూడా ఎక్కిస్తుంది. ఇలాంటి పిచ్చివాళ్ళకోసం వేరే పిచ్చాసుపత్రులు కట్టించాలి." ఆవేశంగా అరచినట్టే అన్నాను.

రహమాన్ మొహం చిన్నబోయింది.

ఏదో అనబోయాడు.

"రహమాన్, ప్లీజ్! ఇక ఆ విషయాలగురించి మాట్లాడకు. నేను అలసిపోయాను. కాసేపు కళ్లుమూసుకుంటాను. డిస్టర్బ్ చెయ్యకు." ఆజ్ఞాపిస్తూన్నట్లుగా అని బండి తడికకు తల ఆనించి చేరబడి కళ్లు మూసుకొన్నాను.

వెధవ, నవ్వుకొంటున్నాడు!

నవ్వు! నవ్వు!

ఇంకెంతసేపులే!

ఊళ్ళోకి పద! నీ పని చెప్తా!

నిజం కక్కిస్తా! మళ్ళీ ఇలా ఎవర్నీ భయపెట్టకుండా పిచ్చాసుపత్రిలో పెట్టిస్తా!

కల్పనకూ వాస్తవానికీ ఉన్న ఆ సున్నితమైన రేఖను కొందరు చెరిపేస్తుంటారు. కల్పనలో ఉన్నవాడు వాస్తవంలోకి రాకపోగా, వాస్తవంలో బతికేవాడు కూడా కల్పనలోకి జారిపోతాడు. రీజనింగ్ పోతుంది. బుద్ధిశక్తి క్షీణిస్తుంది. ఇటువంటి పిచ్చివాళ్ల మాటలవల్లా, రాతలవల్లా కల్పనకూ - వాస్తవానికీ మధ్య ఊగిసలాడే బలహీనులే దెబ్బ తింటారు.

నా శరీరం ఒక్కసారి పులకరించింది.

ఏనాడూ తెలియని ఏదో వింత అనుభవానికి నా మనసు లొంగిపోతున్నది.

ఏమైంది నాకు?

రహమాన్‌కేసి చూశాను. రహమాన్ గుర్రంమీదగా తల వంచి దేన్నో గమనించే ప్రయత్నంలో ఉన్నాడు.

రెక్కలు టప టప లాడిస్తూ, వింత వింత ధ్వనులు చేస్తూ పక్షులు ఒక్కసారిగా చెట్లమీద నుంచి లేచాయి.

దూరంగా ఏవేవో అరుపులు!

రెండు ఆబోతులు ఢీకొన్నట్టుగా రంకెలు!

మధ్యమధ్య ఏనుగుల ఘీంకారాలు లీలగా విన్పిస్తున్నాయి!

నా చెవి పక్కనే నల్లపిల్లి నోటికి చిక్కిన పావురం రెక్కల చప్పుడులాంటి చప్పుడు.

నేను తృళ్లిపడ్డాను.

అంతలో బల్లి నోటికి చిక్కిన పురుగు రెక్కల సన్నని చప్పుడు రెండో చెవి పక్కగా!

ఏమిటిది?

ఏమైంది నాకు?

ఎక్కడున్నాను?

"బాబూగారు, వింటన్నారా?"

"ఊఁ." అంతకంటే మాట్లాడాలని అనిపించలేదు.

నేను మాట్లాడకపోయినా వాడు అంత తేలిగ్గా వదుల్తాడా?

"మీకు విన్పించడం లేదా బాబూ?"

"లేదు." కావాలనే అన్నాను.

వాడు గిర్రున తలతిప్పి చూశాడు నాకేసి విస్మయంగా.

రకరకాల జంతువుల అరుపులు నాకూ విన్పిస్తున్నాయి. అరుస్తూ అవన్నీ మా వైపుకే వస్తున్నట్టు క్రమంగా ఆ అరుపులు పెద్దవవుతున్నాయి.

"బాబూగారూ, వింటున్నారా?"

"ఆఁ - వింటున్నాను. కొండలమీదున్న అరణ్యంలో జంతువులు పోట్లాడుకొంటున్నట్టున్నాయి." నిర్లక్ష్యంగా అన్నాను.

"కాదు బాబుగారూ! ఈ ప్రాంతాల్లో క్రూరమృగాలు లేవు. ఇంతవరకు ఈ ప్రాంతాల్లో క్రూరమృగాలున్నట్టుగానీ, ఎవర్నయినా చంపినట్టుగానీ విన్నారా?"

"లేదు." సాలోచనగా అన్నాను.

"ఈ అల్లరంతా పిశాచాలు చేస్తున్నదే బాబూ!"

శరీరమంతా ఏదో జరజర పాకుతున్నట్టు ఝల్లుమన్నది.

"బాబూగారూ, అలా చూడండి. మన బండి వెనకే..."

నేను గిర్రున తల తిప్పి చూశాను. అంతెత్తున ఆకాశంలో దేదీప్యమానమైన ఒక వెలుగు చక్రం మాకేసే వస్తోంది.

ఆ వెలుగు చక్రం అగ్నిగోళంగా మారింది.

ఆ అగ్నిగోళం కణకణలాడుతూ వేగంగా వస్తోంది.

అది క్రమంగా పెద్దదవుతోంది.

దగ్గరగా వస్తోంది.

దగ్గరగా వచ్చింది.

అప్పుడు ఆ వెలుగు రెండు కేంద్ర బిందువులనుంచి వస్తున్నట్టుగా కన్పించింది.

నాకు భయంగా లేదు.

వింతగా ఉంది. కుతూహలంగా చూడసాగాను.

"బాబూగారూ! పుర్రె! అస్థిపంజరం తాలూకు పుర్రె!" గావుకేక పెట్టాడు రహమాన్.

నేను గావుకేకలు పెట్టడం మానేశాను.

ఇప్పుడు వాడు పెడ్తున్నాడు.

నేను పరిశీలనగా చూశాను.

అవును, అది పుర్రే!

దాని కళ్ళు ఉండే గుంటల్లోనుంచి ఆ వెలుగులు చిమ్ముతున్నాయి.

"చాలా చిత్రంగా ఉందే!" అనాయాసంగా నా పెదవులు ఉచ్ఛరించాయి.

వెయ్యి క్యాండిల్స్ బల్బుల్లా ఆ పుర్రెకు సంబంధించిన కళ్ల గుంటలు వెలుగులు చిమ్ముతున్నాయి.

నా కళ్ళు మిరిమిట్లు గొల్పుతున్నాయి. చికిలించుకొంటూనే ఆ పుర్రెను స్పష్టంగా చూడటానికి ప్రయత్నిస్తున్నాను.

ఆ పుర్రె నోటి కన్నంనుంచి తెల్లటి పొగ వస్తున్నట్టుగా గమనించాను. క్రమంగా పొగలు వ్యాపించసాగాయి. కళ్ల వెలుగు ఆగి, ఆరిపోయింది. వెన్నెల్లో పొగ మాత్రమే వ్యాపిస్తూ కన్పించింది. ఆ పొగ దట్టంగా పేరుకొంటూ నీడలాంటి ఆకారంగా మారింది.

నేను ఆశ్చర్యంగా ఆ అద్భుతాన్ని చూస్తున్నాను. బండి ఆగిపోయిందనే విషయం కూడా గమనించలేదు.

ఆ నీడ ఒక్కసారిగా మానవాకారాన్ని ధరించింది.

నాకు భయం అన్పించలేదు.

ఆ ఆకారాన్ని చూస్తుంటే నా మనస్సు విలక్షణమైన అనుభూతిని పొందసాగింది.

ఆ అనుభూతి మానవుడు నేర్చిన భాషకు అందనిది.

ఏ భాష్యకారుడికీ లొంగనిది.

నేను తన్మయత్వంతో చూస్తున్నాను.

నా కళ్లముందు జగదేక సుందరి నిలబడి ఉంది.

"యువరాణి హెలన్!" ఒక్కసారి అరిచాడు రహమాన్. గుర్రం బండి దిగి సలాం చేశాడు వంగి.

ఆమె నన్ను చూసి చిరుగా నవ్వింది. చుట్టూ ఉన్న ప్రకృతి స్తబ్ధంగా నిలిచిపోయినట్టయింది. చంద్రుడు నన్ను చూసి ఈర్ష్యపడ్డాడు. ముఖం చూపించలేక పక్కనే ఉన్న మబ్బుతునకలో దాక్కున్నాడు.

నేను తన్మయత్వం పొందాను. గుండె వేగం పెరిగింది.

"ప్రియా! ఏమిటలా చూస్తావు? దిగిరా!"

నేను విన్నది వీణానాదం. అవి మనిషి నోట్లోనుంచి వచ్చిన మాటల్లా లేవు. నాదబ్రహ్మ స్వయంగా వీణలో ఆ మాటల్ని పలికించినట్టన్పించింది నా చెవులకు.

కళ్ళముందు అద్భుత దృశ్యం. అద్వితీయం. అపురూపం.

ప్రపంచంలోని సౌందర్యమంతా రాసిపోసినట్టుంది. ప్రకృతి ఆమె పాదాల ముందు మోకరిల్లినట్టుగా ఉంది.

ఆమె ఈజిప్టు దుస్తుల్లో ఉన్నది.

ఎవరీమె? దేవకన్యా? స్వప్నాలలోని రాజకుమార్తా? వనకన్యా?

"నిన్ను కనులారా చూడడం కోసం కొన్నివేల ఏళ్లుగా ఎదురుచూస్తున్నాను ప్రియా!"

నేను ఆమె పెద్ద పెద్ద కళ్లల్లోకి చూస్తూ మంత్రముగ్ధుడిలా ఉండిపోయాను.

"నువ్వు జన్మిస్తున్నావు, చనిపోతున్నావు, పూర్తిజీవితాన్ని జీవించి, అనుభవించి చచ్చిపోతున్నావు. కాని నేను మాత్రం ఇలా నీకోసం ఎదురుచూస్తూనే ఉన్నాను."

నేను అప్రయత్నంగానే బండి దిగాను.

"ప్రియా!" అనేక వెండి గంటలు మ్రోగాయి. కంఠంలో తేనెలు ఊరుతున్నాయి. ఎంత తియ్యటి కంఠం!

ఆ కంఠస్వరంలో మునిగిపోవాలనిపించింది.

"ప్రియా! నీతో మాట్లాడటానికి, నీతో కలిసి కాసేపు కూర్చోవడానికి మూడువేల సంవత్సరాలుగా ఎదురు చూస్తున్నాను."

"ఎవరు నువ్వు?" గొంతు పెగుల్చుకొని ఎలాగో అన్నాను.

"నేనెవర్నని చెప్పను? మూడువేల ఏళ్ల క్రితం నువ్వు నన్ను ప్రాణప్రదంగా ప్రేమించినవాడివి."

నాకంతా అయోమయంగా ఉంది.

"ఓ పది నిమిషాలు అలా వెళ్లి, ఆ చెట్టు కింద కూర్చుందాం. అన్ని విషయాలూ చెబుతాను" అన్నది విలాసంగా చూస్తూ.

"ఆ చెట్టుకిందకా?" నా గొంతు కీచుమన్నది.

ఆమె గలగల నవ్వింది. జలజల పారిజాతాలు రాలినట్టుగా విన్పించింది ఆ నవ్వు.

"భయపడ్తున్నావా? నీకోసం - నీతోనే ఉండిపోవడంకోసం ఎంత పరితపిస్తూ తిరుగుతున్నానో నీకు తెలియదు."

"కావచ్చును కాని, నువ్వు ప్రేతానివి. నేను మనిషిని! మనిషి ప్రేతంకోసం ఈ జన్మను వదలిపెట్టడానికి ఇష్టపడడు!" అన్నాను, ఆమె సౌందర్యాన్ని కనుదోయిలో నింపుకొంటూ.

"నేను అది కోరుకోవడంలేదు. కేవలం నీకు మన పూర్వజన్మ వృత్తాంతం వినిపించాలని ఉంది - అంతే."

"అందువల్ల నీకు వచ్చేదేమిటి?"

"సంతృప్తి! శాంతి!"

"వెళ్ళండి బాబూ! ఏం భయంలేదు." రహమాన్ అన్నాడు.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ప్రతి జన్మలోనూ నిన్ను చూస్తూనే ఉన్నాను. ప్రేమించేవాడిని ప్రేతాలుకూడా చంపవు. నీ సుఖాన్ని చూసి ఆనందిస్తూనే ఉన్నాను. నువ్వయినా పరిపూర్ణ జీవితాలను గడుపుతున్నావని సంతృప్తి పడ్తున్నాను" అన్నది హెలన్ కెరీనా! ముగ్ధమోహనంగా నవ్వింది.

నా మనసు నా స్వాధీనంలో లేదు.

ప్రేతం అని తెలిసీ ఆమె మాటల్ని కాదనలేకపోతున్నాను.

ఆమె వెనకే నడుస్తున్నాను. కనుపించని బంధం ఏదో వేసి, నన్ను ఆమె నడిపించుకొని వెళ్తున్నది.

"రహమాన్!" క్షణం ఆగి పిల్చాను.

"ఏం బాబూ?"

"నేను కాసేపు ఆ చెట్టుక్రిందున్న రాతి బండమీద కూర్చుంటాను.

"అలాగే."

"నిద్రపోవద్దు."

"అలాగే" అని వాడు నవ్వుకొంటూ వెళ్ళాడు. వాడిని లాగి కొట్టాలనిపించింది.

ఇద్దరం దూరం వెళ్ళి చెట్టుకింద ఉన్న రాతిమీద కూర్చున్నాం.

"హెలెన్! చెప్పు, మన జన్మలగురించి చెప్పు." నా ప్రశ్న నాకే ఆశ్చర్యాన్ని కలిగించింది.

నేను పునర్జన్మల్ని నమ్ముతున్నానా? నా మేధస్సు నన్ను హెచ్చరించబోయింది.

లేదు. నమ్మడం లేదు. కాని, నమ్మాలనిపిస్తోంది మనసుకు. అందుకే అడక్కుండా వుండలేకపోతున్నాను.

వినాలనే కుతూహలాన్ని ఆపుకోలేకపోతున్నాను.

"అది చాలా పెద్ద కథ!"

"అయినా వినాలని ఉంది. చెప్పు" అన్నాను.

ఆమె ముఖంలోకి తనివితీరాచూస్తూ ఎంతసేపయినా కూర్చోవాలని ఉంది.

# 3

"నేను ఈజిప్టు రాజకుమారిని. చాలా అందమైనదాన్ని. అందరి కళ్ళు నామీదే ఉండేవి. నాకు వయసు వచ్చినకొద్దీ ఎందరో రాజకుమారులు నా కోసం మా తండ్రికి కబుర్లు పంపించారు. నా తండ్రి మాత్రం నా పెళ్ళిగురించి శ్రద్ధ తీసుకొనేవాడుకాడు. ఒకరోజు మా అమ్మతో మాట్లాడుతుంటే విన్నాను. మా సైన్యాధిపతి పరమ దుర్మార్గుడు. అయితే బలవంతుడు. తెలివైనవాడు. సైన్యం అంతా అతని కనుసన్నల్లోనే మెలుగుతూ ఉండేది.

మా నాన్న పిరికివాడు. ఎప్పుడూ అనారోగ్యంతో బాధపడుతూ ఉండేవాడు. ఒకరకంగా రాజు సైన్యాధిపతి ఫిరోన్‌తీల్‌నే.

మా నాన్న నన్ను ఫిరోన్ తీల్‌న్‌కు ఇచ్చి వివాహం చేస్తానని మాట ఇచ్చినట్టు ఆ రోజు నాకు తెలిసింది. అమ్మ వీల్లేదన్నది. నేను చేసుకోనన్నాను. మా మాటకు ఎవరూ విలువ ఇవ్వరని నాకు తెలుసు. ఫిరోన్ చాల దుర్మార్గుడని నాకు తెలుసు.

నేను ఒక నిర్ణయానికి వచ్చాను.

ఏమైనాసరే ఫిరోన్‌కు దక్కకూడదనుకొన్నాను.

ఒకరోజు అర్ధరాత్రి నా గుర్రం ఎక్కి బయలుదేరాను.

ఎంత దూరం వెళ్ళానో నాకే తెలియదు.

ఒక అరణ్య మార్గంలో వెళ్తున్నాను. తెలతెలవారుతోంది. గుర్రం సకిలించింది. .ముందుకు పోనని మొరాయించింది. అంతలో సింహగర్జన విన్పించింది. నా ప్రాణాలు ఉగ్గబట్టిపోయాయి. ఎదురుగా సింహం నిల్చుని ఉంది అల్లంత దూరంలో.

సింహం నా మీదకు లంఘించడానికి సిద్ధంగా ఉంది.

నేను 'కెవ్వు'మని అరిచాను.

రక్షించమని కేకలు పెట్టాను.

"వెనక్కు తిప్పు గుర్రాన్ని!" ఎవరో అరిచారు వెనకనుంచి.

నేను గుర్రాన్ని వెనక్కు తిప్పాను.

సింహం గర్జిస్తూ గుర్రంమీద దూకిందనే అనుకున్నాను. అది అరుస్తూనే ఉంది. దిక్కులు మార్మోగుతున్నాయి. అయినా నేను క్షేమంగానే ఉన్నాను. గుర్రాన్ని ఆపి వెనక్కు చూశాను.

ఒక్కసారిగా గుర్రం మీదనుంచి కిందకు దూకాను.

నా కాళ్ళు భూమిలోకి కూరుకుపోతున్నట్టుగా దూకినచోటనే నిల్చుండి పోయాను.

ఎదురుగా భయంకరమైన దృశ్యం!

ఒక యువకుడు బల్లెంతో సింహంతో పోరాడుతున్నాడు. బలిష్టమైన శరీరం.

ఒక్కసారిగా భీకరగర్జన చేస్తూ సింహం కింద పడిపోయింది.

నేను ఒక్కపరుగున ఆ యువకుడి దగ్గరకెళ్ళాను.

అతని ముఖంమీదా, చేతులమీదా సింహపు గోళ్ళు గీరుకున్న గాయాలున్నాయి. వాటినుండి రక్తం ఓడుతున్నది.

అతను నన్ను చూశాడు.

నేను అతన్ని చూశాను.

ఎంతసేపు అతన్ని అలా చూస్తూ ఉండిపోయానో నాకే తెలియదు.

నేను ఒక్కసారిగా ఆవేశంతో వెళ్ళి అతన్ని చుట్టేశాను.

అతను శిలలా నిల్చుండిపోయాడు.

నా ఆవేశపు పొంగు తీసింది.

వెంటనే అతన్ని వదలి సిగ్గుపడుతూ దూరంగా జరిగి నిల్చున్నాను.

అతను నా పేరు అడిగాడు. నేను నా గురించి అంతా చెప్పాను.

అతను తనను గురించి చెప్పాడు.

అతను గిరిజనుడు. ఒక దళనాయకుడు కొడుకు. పేరు సఫరాన్.

అతని అంగ సౌష్టవాన్ని రెప్పవాల్చకుండా చూస్తూనే నిల్చున్నాను.

సఫరాన్ నాకు ధైర్యం చెప్పాడు. ఫిరోన్ తను ఉన్నంతవరకు నన్నేమీ చెయ్యలేడని మాట ఇచ్చాడు. ఇంటికి తీసుకెళ్ళాడు. అతని తల్లిదండ్రులు నన్ను ఆదరించారు.

వారం రోజుల్లోనే అతన్ని ఎంతగా ప్రేమిస్తున్నానో అర్థం చేసుకొన్నాను. నా ప్రేమను అతని ఎదుట ప్రకటించాను. అతనుకూడా నన్ను ప్రేమిస్తున్నాడని తెలుసుకొన్న నా ఆనందానికి అవధుల్లేవు.

మా యిద్దరికీ పెద్దలముందు వారి పద్ధతి ప్రకారం వివాహం జరిగింది. కొమ్ము బూరాలు ఊదారు. ఇప్పసారా తాగారు. డ్యాన్సులు చేశారు.

తుపాను వచ్చింది. వెళ్ళిపోయింది.

మా ఇద్దరిమధ్యా ఉన్న గోడలన్నీ పడిపోయాయి.

ఉన్నది మేమిద్దరమే! ప్రేమ సముద్రంలో పూర్తిగా మునిగిపోయాం.

ఇలా ఎంతోకాలం గడువలేదు.

ఫిరోన్‌కు నా ఉనికి గురించి తెలిసింది.

అతను తన సైన్యంతో ఆ దళంమీద విరుచుకు పడ్డాడు. అతని సైన్యంముందు ఈ చిన్నదళం ఆగలేకపోయింది. సఫరాన్ నా కోసం చివరి వరకు పోరాడాడు. గాయపడ్డాడు. స్పృహతప్పి పడిపోయాడు. ఫిరోన్ అతను చనిపోయాడనే భావించాడు. నన్ను బలవంతంగా తన మహల్‌కు తీసుకెళ్ళాడు.

నా తండ్రికి ఇదంతా తెలుసు.

అయినా అసమర్థుడు. అసహాయంగా మిన్నకుండిపోయాడు.

నేను అతనికి ఒక పట్టాన లొంగలేదు. లొంగదల్చుకోలేదు.

నా ప్రియుడు చనిపోయాడు.

నేనూ వెళ్ళిపోవాలి కాని, వీడ్ని మాత్రం వదలకూడదనుకొన్నాను.

ఆ రాత్రి నేను లొంగిపోవడానికి సిద్ధంగా ఉన్నట్టు కబురు పంపించాను. అతడి సంతోషానికి అవధుల్లేవు.

చక్కగా అలంకరించుకొని, నన్ను ఉంచిన గదికి వచ్చాడు.

దాసీలు నన్నుకూడా అలంకరించారు. నేను ఎదిరించలేదు.

అతన్ని మంచి మాటలతో మత్తులోకి నెట్టాను.

దిండు కింద దాచిన విషంపూసిన కత్తితీసి గుండెల్లో గుచ్చాను. అతను పిచ్చిగా అరిచాడు. లేచి నన్ను అందుకోవడానికి ప్రయత్నించాడు. అతడు చాచిన చేతికి మళ్లీ కత్తితో గాయం అయ్యింది. కుప్పకూలిపోయాడు. నేను ఆ కత్తితోనే పొడుచుకొని ప్రాణాలు వదిలాను.

నా సఫరాన్ చావలేదు. అతను కోలుకున్నాడు. అయితే మరో వివాహం చేసుకోలేదు. నేను అతనికోసం ప్రేతయోనిలో ఎదురుచూశాను. నిండు జీవితాన్ని అనుభవించిన అతను మళ్ళీ జన్మించాడు. ఈ సారి రష్యాలో జన్మించాడు." ఆగి నా వంక చూసింది.

"అంటే – ఆ సఫరాన్‌ను నేనేనా?"

"అవును ప్రియా! నువ్వే! నువ్వే! నీవు మూడువేల సంవత్సరాల నుండి పుడుతున్నావు, చస్తున్నావు. నిన్ను కలుసుకునే అవకాశం నాకు లభించలేదు. ఈసారి

నువ్వు భారతదేశంలో జన్మించినట్టు తెలుసుకున్నాను. దేశమంతా అశాంతిగా తిరుగుతూనే ఉన్నాను. ఇన్నాళ్ళకు ఇక్కడ నిన్ను కలుసుకోగలిగాను."

"మరి పూర్వజన్మలో ఎందుకు ఇలాగే కలుసుకోలేకపోయావు?" సందేహంగా అడిగాను.

"ఫిరోన్ కూడా కటిక చావు చచ్చాడు. ప్రేతయోనిలో ప్రవేశించాడు. వాడు నన్ను కనిపెట్టుకొనే ఉంటున్నాడు. నిన్ను కలుసుకోవడానికి ప్రయత్నించినప్పుడల్లా వాడు అడ్డుపడ్తూనే ఉన్నాడు."

"మరి ఇవ్వాళ?"

"అదే నాకు ఆశ్చర్యకరంగా ఉంది."

"హెలెన్!" దిక్కులు బద్దలైనట్టు అరుపు!

"వచ్చాడు. ఆ దుర్మార్గుడు వచ్చాడు. నువ్వు పారిపో!" అరిచింది హెలెన్ భయంగా.

ఆమె మాటలు పూర్తిఅయి కాకుండానే బీభత్సం కలగజేస్తూ ఏవేవో శబ్దాలు. అరుపులు. పిట్టల రెక్కల చప్పుళ్ళు.

నా ముఖంమీద గబ్బిలాలు దూకుతున్నాయి.

గబ్బిలాల గోళ్ళు నా ముఖాన్ని చీరుతున్నాయి.

"ఏమే! నీ ప్రియుడ్ని కలుసుకున్నానని కులుకుతున్నావా? చూడు నిన్నేం చేస్తానో!" మగ కంఠం గర్జించింది.

గబ్బిలాలకు చేతులు అడ్డం పెట్టుకుంటూనే ఆ మాటలు వింటున్నాను. వాడెవడో నాకు కన్పించడంలేదు.

"దుర్మార్గుడా! నువ్వు నన్నేం చేస్తావురా? నా కోరిక తీరింది. నాకు ప్రేతయోనినుంచి విముక్తి లభించింది. నువ్వింకా ఈ పిశాచ రూపంలోనే మరో వెయ్యి సంవత్సరాలు తిరుగు." ఆమె కంఠం పలికింది.

చుట్టూ రకరకాల అరుపులు.

కుక్కల ఏడుపు.

గబ్బిలాల అరుపులు.

పక్షుల రెక్కల చప్పుళ్ళు.

నాకు స్పృహ తప్పుతోంది.

"రహమాన్!" గట్టిగా అరవడం మాత్రమే గుర్తుంది.

## 4

"బాబుగారూ! బాబుగారూ!"

తట్టిలేపాడు. రహమాన్.

నేను కళ్ళు తెరిచాను.

పైన బండి కప్పు.

"నేను బండిలోకి ఎలా వచ్చాను?"

"నేను ఎత్తుకొచ్చి పడుకోబెట్టాను బాబూ!"

"ఆమె ఏమైంది?"

"ఆమె ఊర్ధ్వలోకాలకు వెళ్ళిపోయింది. ఆమె కోరిక తన ప్రియుడ్ని చూడాలనీ, మాట్లాడాలనీ, తన కథ చెప్పాలనీను-అది తీరిపోయింది. ఆమెకు ప్రేతయోని నుంచి విముక్తి లభించింది."

"వాడు?"

"వాడు వెర్రెక్కినట్టు కాసేపు బీభత్సం చేశాడు. నేనూ నా సహచరులూ శాంతపర్చి పంపించివేశాం!"

"నువ్వు......నీ......"

"అదే బాబూ! ఈ ప్రాంతంలోని ప్రేతాలన్నీ నా చెప్పుచేతల్లో ఉన్నాయని ముందే చెప్పాగా?"

ఏమిటో వీడి మాటలూ వీడూను!

ప్రతి మాటా మర్మగర్భంగానే మాట్లాడుతున్నాడు.

ఆ నవ్వు మరీను!

అసలు నేను చూసింది వాస్తవమా?

లేక కల వచ్చిందా?

నేను బండిలో కళ్ళు మూసుకొని ఆలోచిస్తూ పడుకొన్నాను.

నా ముఖంమీద చేతితో తడిమి చూసుకొన్నాను. గబ్బిలాలు నా ముఖాన్ని గీరాయిగా? మరి మామూలుగానే ఉందే? ఇది కలే! నిజం కాదు. ఎంత భయంకరమైన కల!

"రహమాన్! నేను చూసిందంతా వాస్తవమేనా?"

"ఏమిటి బాబూ, మీరు అంటున్నది?"

"అదే - ఈ ఈజిప్టు రాకుమారి....."

వాడు మాట్లాడలేదు.

"మాట్లాడవేం?"

"కళ్ళరాచూసి అనుభవించిన విషయాన్ని వాస్తవమేనా అని అడిగేవారికి సమాధానం ఏం చెప్పగలను?"

"అయితే గబ్బిలాలు నా ముఖాన్ని గీరాయి. కాని నా ముఖంమీద గాట్లు లేవే?"

"పిశాచాలు మానవ శరీరాన్ని గాయపర్చలేవు బాబూ!"

"మరి?"

"మనసు మీదే దెబ్బతీస్తాయి."

"అంటే - గబ్బిలాలు నా ముఖంమీద వాలలేదంటావా?"

"వాలాయి, కాని గాయపర్చలేదు. ఆ శక్తి వాటికి లేదు."

"దుమ్మలగూడెం ఇంకెంత దూరం ఉంది?" అంటూ విషయాన్ని మార్చాను.

"వచ్చేశాం బాబూ! మరో అరగంట!"

టైం చూసుకొన్నాను. 2-40 అయింది.

ఇదేమిటి, ఇంకా 2-40 గంటలేనా? ఎప్పుడో 2-30 అయిందే?

ఆ సంగతే అడగాలనుకొన్నాను.

కాని అడగబుద్ధి పుట్టలేదు.

ఎంత పెద్ద కలైనా కొద్ది క్షణాలే ఉంటుందంటారు.

నేను చూసింది కలే!

ఇలాంటి కల నాకు ఎందుకు వచ్చినట్లు?

వెంటనే ఆ మధ్యనే జరిగిన ఒక ఉదంతం గుర్తొచ్చింది.

❀ ❀ ❀ ❀

డాక్టర్ కృష్ణకుమార్ నా స్నేహితుడు. డాక్టరంటే పిహెచ్.డి. డాక్టర్. యూనివర్సిటీలో రీడర్‌గా పనిచేస్తున్నాడు.

అతనికి మూఢ నమ్మకాలు లేవు.

ఒక రోజు నేను వారి ఇంటికి వెళ్ళేసరికి ఊజా (Ouja) బోర్డు మీద స్పిరిట్‌ను పిలవడానికి మరొక స్నేహితుడితో కూర్చుని ప్రయత్నిస్తున్నాడు.

"ఇదేం పిచ్చి?" అన్నాను అది చూస్తూ.

కృష్ణకుమార్ నవ్వాడు.

"వీడు నా బాల్యమిత్రుడు. పేరు రఘుపతి. ఇతనికి స్పిరిట్సు కన్పిస్తాయట. ఊజాబోర్డు ద్వారా పిలిస్తే ప్రశ్నలకు సమాధానం చెబుతాయట. అందుకే చూస్తున్నాను. ఓపెన్‌మైండుతో దేన్నయినా తెలుసుకోవడానికి ప్రయత్నించడంలో తప్పేముంది?" అన్నాడు కృష్ణకుమార్.

నాకు వళ్ళు మండిపోయింది.

అయినా మరో కొత్త వ్యక్తి ముందు ఏమి అనలేకపోయాను.

"ఇవన్నీ మా వాడు నమ్మడు" అన్నాడు నన్ను పరిచయం చేస్తూ, తన మిత్రుడితో కృష్ణకుమార్.

"మీరు నమ్మరా?" అన్నాడు రఘుపతి.

"నేను నమ్మను!" ఖచ్చితంగా అన్నాను.

"డాక్టర్ రాజేంద్ర తెలుసా మీకు?" రఘుపతి అడిగాడు.

"ఎందుకు తెలియదూ? ఫేమస్ సర్జన్! ఈ మధ్యనే రిటైర్ అయ్యాడు" అన్నాడు.

"అతను కూడా నమ్ముతాడు!" రఘుపతి అన్నాడు.

"నాన్‌సెన్స్!" అన్నాను.

"అవునోయ్ ప్రసాద్! నువ్వొచ్చేముందు రఘుపతి అదే చెప్తున్నాడు!" అన్నాడు కృష్ణకుమార్.

"అవునండీ! ఆయన పిలిస్తేచాలు స్పిరిట్సు పలుకుతాయి."

నేను తృళ్ళిపడ్డాను.

"ఆయనకు మానసికమైన అస్వస్థత ఏమైనా కలిగిందా? గ్రేట్ జీనియస్!" బాధగా అన్నాను.

"మీరు బలేవారండీ! ఆయనకు మానసిక అస్వస్థత ఏమిటి? నాతో రండి. ఆయన ప్రత్యక్షంగా చూపిస్తారు!"

"ఏమిటి చూపించేది?"

"స్పిరిట్స్‌ని!"

నేను కృష్ణకేసి చూశాను.

"అదే ప్రసాద్! ఆయన ఊజా బోర్డుమీద చూపిస్తారట. హోలీ స్పిరిట్సును పిల్చి, భూత, భవిష్యత్ వర్తమానాల గురించి చెప్తారట. ఆయన దగ్గరకు బాధల్లో ఉన్న వాళ్ళెందరో వస్తూ ఉంటారట కూడా!" అన్నాడు కృష్ణ.

ఏమిటీ పిచ్చి?

ఒక డాక్టరు – అనాటమీ క్షుణ్ణంగా తెలిసిన డాక్టరు – ప్రాణం లేని శరీరాలను – ప్రాణం ఉన్న శరీరాలనూ కోసిన డాక్టరు – శరీర నిర్మాణం తెలిసిన డాక్టరు – చర్మంలోని పొరలెన్నో తెలిసినవాడు – పొరకూ పొరకూ మధ్యన ఉన్నదేమిటో ఎరిగినవాడు – మంచి సర్జన్‌గా రిటైర్ అయినవాడు – ఓపిక ఉన్నంతవరకూ ఆపరేషన్స్ చేసి ప్రజలకు ఉపయోగపడవలసిన వ్యక్తి – ఇలా ఊజా బోర్డులమీద స్పిరిట్సును పిలుస్తూ, అదంతా నిజమేనని నమ్ముతూ ప్రజల్ని నమ్మించడమా? ఓ మై గాడ్! ఈ దేశం ఎటు పోతోంది? ఎవరు దీన్ని కాపాడేది?

ఈ విజ్ఞానం, ఈ సైన్సు ఆదిమానవుడిలో ఉన్న భయాలనూ, ఆ భయాలవల్ల ఏర్పడ్డ మూఢ నమ్మకాలనూ తొలగించలేకపోతున్నాయా?

కొందరు స్వార్థపరులు అలా జరక్కుండా చేస్తున్నారు.

వారికి ప్రజలు ఎంత అజ్ఞానంలో ఉంటే అంత మంచిది.

ఈ ప్రజల అజ్ఞానాన్ని ఈమధ్య కొందరు రచయితలు కూడా తమ స్వార్థంకోసం ఉపయోగించుకోవడం శోచనీయం. క్షమించరాని అపరాధం. అవన్నీ తాము అనుభవించిన, చూచిన వాస్తవాలనే రాస్తున్నట్టుగా స్టేట్‌మెంట్సు పారేసి పాఠకుల్ని మోసం చెయ్యడం – వీళ్ళు నిజంగా రచయితలా లేక స్మగ్లర్సా?

"ఏమిటి ప్రసాద్, ఆలోచిస్తున్నావ్? వెళ్దామా?" అని అడిగాడు కృష్ణ.

నా ఆలోచనా స్రవంతికి ఆనకట్ట పడింది.

అయినా పూర్తిగా అందులోనుంచి తేలలేదు.

"ఎక్కడికి?" సాలోచనగా అడిగాను.

"రాజేంద్రగారింటికి!"

"నేను రాను!" ఠక్కున అనేశాను.

"మీలాంటివాళ్ళే రావాలి" అన్నాడు రఘుపతి.

గిర్రున తల తిప్పి అతనికేసి చూశాను.

"అవునండీ! మీలాంటి నమ్మకం లేనివాళ్ళే రావాలి. నమ్మకం లేని మీరే నమ్మడం జరిగితే ప్రజలకు ఇహానికీ, పరానికీ కూడా సేవ చెయ్యొచ్చును" అన్నాడు రఘుపతి.

"ఇహానికీ - పరానికీ కూడానా?" నా కంఠంలో ఏం పలికిందోగాని, కృష్ణ అందుకొని "ఊరికే చూద్దాం, రారాదూ?" అన్నాడు.

"పదండి వెళ్దాం!" అదేదో అక్కడే తేలుస్తానుఅన్నట్టు అన్నాను.

డాక్టర్ రాజేంద్రగారు మమ్మల్ని ఆదరంగా ఆహ్వానించారు.

ఐదేళ్ళ క్రితం ఆయనను చూశాను.

ఆ రూపం ఇంకా గుర్తుంది.

ముఖంలో గాంభీర్యం కొట్టవచ్చినట్టుండేది.

ఆ కళ్లల్లో ఎంతో ఆత్మవిశ్వాసం.

పలుకులో కరుణ.

ఆయనను చూస్తూంటే పేషెంటుకు తన ప్రాణాలకు భయం లేదన్న ఆత్మవిశ్వాసం కలిగేది.

ఆయనను అందరూ గౌరవించేవారు.

ఆకస్మాత్తుగా రిటైరయ్యే ముందు ఆయన ఒక్కగానొక్క కొడుకు కారు యాక్సిడెంటులో చచ్చిపోయాడని విన్నాను.

అప్పటినుంచీ ఆయనలో ఎంతో మార్పు వచ్చిందని అంటూ ఉండేవారు.

ఒకటి రెండు ఆపరేషన్స్ ఫెయిల్ అవడంతో అతని దగ్గర ఆపరేషన్ అంటే జనం భయపడసాగారు. అదికూడా ఆయన మనసు మీద గట్టి దెబ్బే తీసిందని విన్నాను.

రిటైర్ అయ్యాక ఆయన గురించి అనుకొన్నవాళ్ళే లేరు.

వంటినిండా విభూతిరేఖలతో కన్పించిన రాజేంద్రను చూస్తూనే నిల్చుండిపోయాను.

రఘుపతి మా ఇద్దర్నీ పరిచయం చేశాడు.

నాకేసి ఆయన అదోలా చూచాడు.

నా భావాల గురించి అతనికి తెలిసే ఉంటుంది. నా పుస్తకాలు బహుశా ఒకటో రెండో చదివి కూడా ఉంటాడు.

రఘుపతి అతనికి ప్రియశిష్యుడులా అన్పించాడు.

నేను డాక్టర్ రాజేంద్రను పరిశీలనగా చూశాను.

అతనిలో ఎంతో మార్పు ఉంది.

నిటారుగా ఉండే అతని శరీరం వంగినట్లు అయింది. అది శరీర అనారోగ్యంవల్ల కాదనీ, మానసికంగా కుంగిపోవడవల్ల ఏర్పడిందేననీ అన్పించింది. అతని కళ్లలోకి చూశాను. ఆ కళ్ళు ఏవో కన్పించని బిందువులను వెదుకుతున్నట్టుగా ఉన్నాయి. అసలు

అతని మనసే తనలోకి తను చుట్టుకొని పోయిందా అని అన్పించింది. ఆయన మమ్మల్ని కూర్చోమని చెప్పాడు. మరోసారి అతని ముఖంలోకి చూశాను.

ఆ ముఖంలో అసంతృప్తి స్పష్టంగా కన్పిస్తోంది. ఆ కళ్ళల్లో ఏదో అశాంతికూడా- కాదు – డిప్రెషన్ కన్పిస్తోంది. సాధారణంగా రిటైర్ అయినవాళ్ళు ఇక తమ జీవితం పూర్తి అయిందనే భావంలో పడిపోతారు. కుంగిపోతారు. ఎంతో ఆరోగ్యంగా ఉన్నవాళ్లు కూడా అనుకోకుండా హార్ట్ అటాక్స్‌కు గురి అవుతారు.

సైకలాజికల్‌గా తాము ఇక ప్రపంచం దృష్టిలో పనికిరానివాళ్ళం అనే భావం వచ్చేసిందని అనుకోవడమే అందుకు కారణం.

కొంతమంది రిటైర్ అయి డెబ్బయ్ దాటినవారు ఎంతో సంతృప్తిగా హాయిగా కన్పిస్తారు. అలాంటి వాళ్ళంటే నాకెంతో ఇష్టం. వాళ్లు జీవించడం తెలిసినవాళ్ళు. జీవితాన్ని అర్థం చేసుకొన్నవాళ్ళు. బ్రతికినంతకాలం ఏదో విధంగా తాము కూడా ఈ ప్రపంచానికి అంతో ఇంతో ఇవ్వగలమనే ఆత్మవిశ్వాసం ఉన్నవాళ్ళు. ఆత్మవిశ్వాసాన్నే చుట్టూ వున్న వాళ్ళకు పంచేవాళ్ళు!

అది లేనివాళ్ళు డిప్రెషన్‌కు గురి అవుతారు. మానసికంగా అనేక ఒత్తిడులకు గురి అవుతారు. ప్రపంచం నుండి విత్‌డ్రా అవుతూ తమలోకి తాము చుట్టుకుపోతారు.

ఆయన చుట్టూ అనేక పేరా సైకాలజీకి సంబంధించిన పుస్తకాలున్నాయి.

ఆయన పూర్తిగా తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని గురించి ఆలోచించడం మానేశాడు. చనిపోయాక ఏమౌతుందనే ఆలోచనలో పడిపోయాడు. ఒక్కసారి అందులోకి, ముఖ్యంగా ఆ వయసులో పడిపోయినవాడ్ని, నిజంగా వాళ్ళు నమ్మే ఆ భగవంతుడే వచ్చి, "ఆ తర్వాత ఏమీ ఉండదు. దాన్ని గురించి ఆలోచించడం అనవసరం" అని చెప్పినా వాళ్ళు ఒప్పుకోరు!

"మిమ్మల్ని వినాలని వచ్చారు" అన్నాడు రఘుపతి.

డాక్టరు రాజేంద్ర కళ్ళు మిలమిల పిచ్చిగా మెరిశాయి.

భార్యను కేకవేసి కాఫీలకు ఆర్డరు ఇచ్చాడు.

కాఫీలు అయ్యాయి. తన భార్యను పరిచయం చేశాడు. ఆమెను కూడా అక్కడే కూర్చోమన్నాడు. ఆమె మొహమాటపడుతూనే కూర్చుంది.

ఆయన ఆత్మల గురించీ, పిశాచలోకాన్ని గురించీ చెప్పసాగాడు. అచ్చం అతను ఆ లోకంలోనే బ్రతుకుతున్నట్టూ, ఆ పిశాచాల్లో తనూ ఒక పిశాచం అయి, అవి అనుభవించేవన్నీ తనే అనుభవిస్తున్నట్టుగా చెబుతూవుంటే నాకు ఏడవాలో నవ్వాలో అర్థంకాక జాలిగా మాత్రం చూశాను.

చనిపోవడం అంటే ఏమిటి?

చనిపోతున్న క్షణంలో ప్రాణి ఎలాంటి అనుభూతిని పొందుతుంది? మనం ఊహిస్తున్నట్టు ఈ జన్మను వదలలేక బాధపడుతుందా? లేక, ఈ పాపిష్టి లోకం నుంచి వెళ్ళిపోతున్నందుకు ఆనందిస్తుందా?

ప్రాణం పోగానే ఆత్మ పైనుండి తన మృత శరీరాన్ని చూస్తున్నప్పుడు ఎలాంటి అనుభూతిని పొందుతుంది?

ఆ కొత్త లోకంలో - పిశాచ లోకంలో - మొదట మొదట అడ్జస్టు కాలేక ఎంత హింసను అనుభవిస్తుంది?

ప్రేతయోనిలోకి -ప్రవేశించడానికి అది ఎంత శ్రమ పడుతుంది?

దారీతెన్నూ తెలియక అల్లాడే ఆత్మలు ఎలా మీడియం కోసం పిచ్చిగా తిరుగుతాయి?

మీడియం దొరగ్గానే వాటికి ఎంత శాంతి లభిస్తుంది?

ఆ మీడియంనే మనం దయ్యం పట్టినవాళ్ళంటాం.

దయ్యాల్ని వదిలించడానికి మంత్రగాళ్ళను. పిలుస్తాం.

మంత్రగాళ్ళు ఎలా క్రూరంగా దయ్యాల్ని వదిలిస్తారు?

అలా మీడియం నుంచి పారదోలబడిన ఆత్మ ఎంత అల్లాడిపోతుంది - మరో మీడియం దొరికేంతవరకు?

మనుషులు ఎంత స్వార్థపరులు?

దయ్యాన్ని వదిలించడానికి చూస్తారేగాని ఆ తర్వాత ఆ ఆత్మ అనుభవించే నరకయాతన గురించి ఆలోచిస్తున్నారా? ఇంతకంటే దారుణం మరొకటి ఉంటుందా?

అన్న అనేక ప్రశ్నలు ఆయన చాలా సీరియస్‌గా వేశాడు! అన్నిటికీ సమాధానాలు చెప్పసాగాడు. మనుష్యులు ఆత్మలకూ, పిశాచాలకూ చేస్తున్న అన్యాయాల గురించి కూడా అనర్గళంగా మాట్లాడాడు.

మమ్మల్నందర్నీ పిశాచ లోకంలోకి తీసుకెళ్ళిపోయాడు.

ఆయన మంచం మీద బాసింపట్టు వేసుకొని కూర్చున్నాడు. ఆయన చుట్టూ పేరాసైకాలజీ పుస్తకాలూ, వివిధ దేశాలకు సంబంధించి విచ్‌క్రాఫ్టుకు సంబంధించిన పుస్తకాలూ ఉన్నాయి.

ఆ పుస్తకాలను భట్టీపట్టినట్టున్నాడు. అందులోని విషయాలను. అనర్గళంగా చెప్పుకుపోతున్నాడు.

పేరాసైకాలజీ ఒక శాస్త్రం కాదనీ, ఇంకా ఆ విషయాలమీద కొందరు ప్రయోగాలు చేస్తూనే ఉన్నారనీ చెప్పాలనిపించింది. నాకు ఎన్నో ప్రశ్నలు వెయ్యాలనిపించింది.

మళ్ళీ అవన్నీ కూడా స్వయంగా అనుభవించినట్టూ, చూసినట్టూ చెప్తున్న అతన్ని ప్రశ్నించి ప్రయోజనం లేదని అర్థం చేసుకొన్నాను.

దుర్మార్గుడు చచ్చీ దుర్మార్గపు దయ్యం అవుతాడట! అధికారం చలాయించినవాడూ, బలవంతుడూ కూడా ప్రేతలోకాన్ని-అంటే, తన దరిదాపుల్లో ఉన్న బలహీన ప్రేతాల్ని వశం చేసుకొని - రాజ్యం చేస్తాడట!

ఇక వినడం నావల్ల కాలేదు.

"డాక్టరుగారూ, ఇంతకూ మీరు పిశాచమా మనిషా?" అని అడగాలని నోరు తెరిచే ఆగిపోయాను.

"సుశీల మా అమ్మాయికి ఆడబిడ్డ – భర్త పెట్టే బాధ, అత్తగారు పెట్టే యాతనలూ భరించలేక కాల్చుకొని చచ్చిపోయింది. కొందరయితే కిరసనాయిల్ గుమ్మరించి, వాళ్ళే చంపారంటారు. పోలీసుకేసు అయింది. అది ఆత్మహత్యగానే. నిర్ణయించారు. కాని, అది ఆత్మహత్య కాదు!" అన్నాడు డాక్టర్ రాజేంద్ర.

"ఆ సంగతి మీకెలా తెలుసు?" అన్నాను కుతూహలంగా.

"ఆమె చెప్పింది." ఠక్కున డాక్టర్‌గారి భార్య అన్నది.

"ఆమె చెప్పిందా? అంటే, చచ్చిపోకముందే ఆమెకు వాళ్ళు తనను కిరసనాయిల్ పోసి చంపబోతున్నారని తెలుసా?" విస్మయంగా అడిగాను.

డాక్టర్ బోర్డు మీద నుంచి తలెత్తి నా ముఖంలోకి చూశాడు.

అదోలా చూశాడు. వేదాంతి ఒక పసివాడి ప్రశ్న విని చూసినట్టుగా చూశాడు.

"రామాయణమంతా విని రాముడికి సీత ఏమౌతుందని నీలాంటివాడే అడిగాడట!"

నేను తెల్లబోయాను.

"అదేమిటండీ? ఆమె గురించి నాకు వివరాలేం తెలియవే!" అన్నాను.

"ఆమె స్పిరిట్ చెప్పింది."

"ఏమని?" కృష్ణ ప్రశ్న.

"తను ఆత్మహత్య చేసుకోలేదనీ, తనను భర్తా, అత్తా కలిసి హత్య చేశారనీను."

"పోలీసు రిపోర్టు ఇవ్వకపోయారు?" అన్నాను వళ్ళుమండి.

"ఎలా? వాళ్ల నమ్మొద్దూ?"

"వాళ్ళ ముందే స్పిరిట్‌ను పిలిచి చెప్పించవచ్చుగా?" నాకు వళ్ళుమండిపోతున్నది.

"చెయ్యగలను. వాళ్ళను నమ్మించగలను. కాని 'లా' ఒప్పుకోవాలిగా?"

" 'లా' నే మార్పిస్తే సరి! ప్రభుత్వాలకు ఖర్చుకు ఖర్చూ తగ్గుతుంది. అసలైన అపరాధిని శ్రమ లేకుండా పట్టుకోవచ్చు." వ్యంగ్యంగా అన్నాను.

నా కంఠంలో వ్యంగ్యాన్ని గ్రహించలేని ఆ పిచ్చి మహారాజు "మీ వంటి రచయితలూ, కృష్ణకుమార్‌గారి వంటి విద్యావేత్తలూ కృషి చెయ్యాలి" అన్నాడు.

"వట్టి కృషి చాలదండీ, ఉద్యమాలు లేవదియ్యాలి" అన్నాను వళ్ళుమండి.

"డాక్టరుగారూ! ముందు ఆ ఊజా బోర్డు మీదకు స్పిరిట్స్‌ను రప్పించండి" అన్నాడు కృష్ణ కుతూహలంగా.

నేను అతడి ముఖంవంక చూశాను.

నన్ను మాట్లాడవద్దని కళ్ళతోనే హెచ్చరించాడు కృష్ణ.

డాక్టర్ కళ్ళు మూసుకొన్నాడు.

రెండు వేళ్ళను గ్లాసుమీద ఉంచాడు.

"సుశీలా, రా! రా తల్లీ, రా! వస్తున్నావు గదూ? నేను నీకు కావల్సినవాడినే! నిజం చెప్పు! వచ్చావా?" అని గ్లాసు బోర్లించి ఊజా బోర్డు మధ్యలో పెట్టాడు.

రఘుపతీ, రాజేంద్రా, ఇద్దరూ చెరొకవైపు నుంచి రెండు కుడిచేతివేళ్లను (చూపుడు వేలూ, మధ్యవేలూ) బోర్లించిన గ్లాసుమీద ఉంచారు.

"నీ పేరేమిటి?" రఘుపతి అడిగాడు.

గ్లాసు కదలలేదు.

"చెప్పమ్మా, నీ పేరేమిటి?" లాలనగా అడిగాడు డాక్టర్.

గ్లాసు చిన్నగా కదలసాగింది.

కృష్ణ కుతూహలంగా చూడసాగాడు.

నేను పరిశీలనగా చూస్తున్నాను.

"సుశీల!" గ్లాసు కదిలిన అక్షరాలన్నీ కలుపుకొంటే ఆ పేరు వచ్చింది.

కృష్ణ ముఖంలో కదులుతున్న భావాలను చూసి నాలో నేను నవ్వుకున్నాను.

"నువ్వు ఆత్మహత్య చేసుకొన్నావా?" డాక్టర్‌గారి భార్య.

గ్లాసు కదిలింది.

`N-O' అక్షరాలను తాకి యథాస్థానంలోకి వెళ్ళిపోయింది.

"మరి ఏమైంది?"

గ్లాసు కదల్లేదు.

"చెప్పమ్మా!"

ఉహూ! గ్లాసు కదలడం లేదు.

డాక్టర్ తలెత్తి నా ముఖంలోకి చూశాడు.

"మరో దుష్టశక్తి గ్లాసులోకి ప్రవేశించింది. ఆమెను నిజం చెప్పకుండా అడ్డగిస్తోంది" అన్నాడు డాక్టర్.

నాకు మతిపోయినట్టే అయింది.

ఇలాంటివాళ్లను ప్రశ్నించడం కూడ దండగే అన్పించింది.

"ఎవరండీ ఆ ఈవిల్ స్పిరిట్?" అడిగాడు కృష్ణ కుతూహలంగా.

'ఇంకెవరు? నువ్వే!' అనాలనిపించింది నాకు.

"ఆవిడ మామగారు. వాడొక దుర్మార్గుడు. బతికున్నంతవరకూ ఆమెను వాడూ కాల్చుకు తిన్నాడు. ఆమెకంటే ఓ సంవత్సరముందు ఆకస్మాత్తుగా గుండె ఆగి చచ్చాడు. చాలాకాలం ఆ పిల్లను పట్టి పీడించాడు. దాని ఖర్మగాలి చచ్చి మళ్ళీ వాడి పాలిటే పడింది" అని గ్లాసును బలంగా కదిలించ ప్రయత్నించాడు డాక్టర్ రాజేంద్ర.

గ్లాసు తిరగబడింది!

"చూశారా? పాపం! ఆ పిల్లను జుట్టు పట్టుకొని లాక్కెళ్ళాడు." నా ముఖంలోకి చూస్తూ అన్నాడు రఘుపతి.

"నీకు కన్పించిందా?" అడిగాను.

"అవును. వాడికీ స్పిరిట్స్ కన్పిస్తాయి. వాడికి కూడా నాలాగే సైకిక్ పవర్సున్నాయి" అన్నాడు డాక్టర్.

"ఈసారి హోలీ స్పిరిట్‌ను పిలుస్తా!" అన్నాడు డాక్టర్.

"అనిబిసెంట్ పిలిస్తే పలుకుతుంది." ఉత్సాహంగా అన్నాడు రఘుపతి.

"అలాగే పిలవండి. కాని ఈసారి, గ్లాసును నేనూ, కృష్ణా కదిలిస్తాం" అన్నాను.

"మీరు కదిలించడం ఏమిటి? మీరు పట్టుకోవాలి అంతే! ఆ స్పిరిటే కదిలిస్తుంది. మీ ప్రశ్నలకు సమాధానాలు ఇస్తుంది. మీకేమైనా సమస్యలుంటే తెలుసుకోవచ్చును." ఉత్సాహంగా అన్నాడు రఘుపతి.

"సారీ! ఐమీన్....."

"పర్వాలేదు లెండి, ఇలా పట్టుకోండి. కళ్ళు మూసుకోండి. కమాన్ హోలీ స్పిరిట్ అని నాలుగైదుసార్లు అనండి. ఆ తర్వాత గ్లాసు బోర్లించండి." డైరెక్షన్స్ ఇచ్చాడు డాక్టర్.

చెయ్యి మాత్రం పెట్టి పలక్కుండా ఉండిపోయాను.

కృష్ణ వాళ్ళు చెప్పినట్టే చేశాడు.

"నీ పేరేమిటి?"

గ్లాసు కదల్లేదు.

"ప్లీజ్, చెప్పు! నువ్వెవరు?"

ఊఁహూ-గ్లాసు కదల్లేదు.

పది నిముషాలు కృష్ణ మాట్లాడుతూనే ఉన్నాడు. అయినా, గ్లాసు కదల్లేదు.

"కదలడం లేదు." తలెత్తి డాక్టర్ ముఖంలోకి చూస్తూ అన్నాడు కృష్ణ.

"మీ ఫ్రెండుకు నమ్మకం లేదని నాకు తెలుసు, మీకూ లేదా?"

"లేదండీ! అయితే ఓపెన్ మైండుతో వచ్చాను."

"ఇద్దరూ నమ్మకం లేనివాళ్ళే అయితే స్పిరిట్ రాదు!" అన్నాడు రఘుపతి.

"స్పిరిట్ రాదనకు, గ్లాసు కదలదను" అన్నాను నేను.

"రెండూ ఒకటే!" అన్నాడు డాక్టర్.

"కాదు. ఒకళ్ళకైనా నమ్మకం ఉండాలంటారు. అంటే అర్థం, ఆ ఒక్కడూ గ్లాసు తోస్తాడనేగా?"

డాక్టరూ, రఘుపతీ బోలెడంత హర్టయి బాధపడిపోయారు.

"అంటే, మీ ఉద్దేశ్యం మేము కావాలని గ్లాసు కదిలిస్తున్నామనేగా?"

"అలా అని నేను అనడం లేదు డాక్టరుగారూ! నమ్మకం ఉన్నవాడు తనకు తెలియకుండా గ్లాసును తోస్తాడు. ఇద్దరూ అలాంటివాళ్లే అయితే ఇక చెప్పనే అక్కర్లేదు. మరి నిజంగా స్పిరిట్ ఉంటే గ్లాసు ఎవరు పట్టుకొంటే దానికేం? అందులో కొన్ని ఈవిల్ స్పిరిట్సూ, కొన్ని కొంటెవీ ఉంటాయన్నారుగా? అలాంటివైనా వచ్చి, నమ్మకం లేనివాళ్ళకు నమ్మకం కలిగించాలిగా?"

"అవునండీ! నాకూ అలాగే అన్పిస్తుంది. మరో విషయం: నమ్మకం ఉన్నవాళ్ళు పట్టుకొన్నా, వాళ్లు చదువుకోనివాళ్ళయితే, అంటే, అక్షరాలు తెలియనివాళ్ళయితే కూడా గ్లాసు కదలదు. దాన్నిబట్టి నమ్మేవాళ్లు వాళ్లకు తెలియకుండానే గ్లాసును తోస్తున్నారన్నమాట. అదీ చదువుకొన్నవాళ్ళయితేనే! చదువుకోనివాళ్ళు పట్టుకుంటే కూడా - వాళ్ళు నమ్మకంగలవాళ్ళే అయితే గ్లాసు కదులుతుంది కాని, అక్షరాలు కలిపి చదివితే ఏ అర్థం రాదు" అన్నాడు కృష్ణ నన్ను సమర్థిస్తూ.

"మీకీ విషయం ఎలా తెలుసు?"

"మా మేనల్లుడికి నమ్మకం ఉంది. పిల్లలు ఆడుతుంటారు. నేను కుతూహలం కొద్దీ ప్రయత్నించి చూశాను" అన్నాడు కృష్ణ.

సమాధానం ఇవ్వలేని డాక్టర్ ముఖం కందిపోయింది. చిరాకు పడ్తున్నట్టు కన్పించాడు. ఏదో అశాంతి అతన్ని నిలవనివ్వడం లేదనిపిస్తోంది.

అతని భార్య పేరు రమాబాయి అని తర్వాత తెలిసింది.

"రాముడూ, నీ అనుభవం చెప్పు!" అన్నాడు భార్యకేసి చూస్తూ డాక్టర్.

"ఏ అనుభవం?"

"అదే – ఆ రోజు స్నానం చేస్తున్నప్పుడు నీ స్నేహితురాళ్లు పారిజాతం, విమలా వచ్చినప్పుడు....."

"ఓ, అదా! మీరే చెప్పండి" అన్నది ఆమె.

ఆమె ముఖంలోకి చూశాను.

ఆ ముఖంలో ఎలాంటి భావం లేదు. చాలా తాపీగా ఉంది. భర్త ఇలా మాట్లాడడం, వినడం బాగా అలవాటు పడినట్టుగా మాత్రమే ఉంది. భర్త నమ్మకాలే ఆమె నమ్మకాలు అయి ఉండాలి.

"ఒక రోజు నా భార్య బాత్‌రూంలో స్నానం చేస్తోంది. నేను ఇంట్లో లేను. ఇంట్లో మరెవరూ లేరు. లోపలనుంచి గడియపెట్టి స్నానం చెయ్యడానికి వెళ్ళింది. తలంటిపోసుకొని జుట్టు ఆర్పుకొంటూ హెల్లాలోకి – అంటే, ఇదే హాలులోకి వస్తూ ఆమె గడపలోనే ఆగిపోయింది. ఎదురుగా ఉన్నవాళ్ళను వెర్రిగా చూస్తూ నిలబడి పోయింది.

"ఏమిటోయ్ అలా చూస్తావ్?" అడిగింది పారిజాతం.

"మీరు లోపలకు ఎలా వచ్చారు?" బిత్తరపోతూ అడిగింది నా భార్య.

"అదేమిటి, నువ్వేగా తలుపు తీశావ్? తలకు నూనె పెట్టుకొని ఉన్నావ్. మాట్లాడుతూ ఉండండి, త్వరగా స్నానంచేసి వస్తానన్నావుగా? అంతలోనే మర్చిపోయావా?" స్నేహితురాళ్ళిద్దరూ నవ్వారు.

నా భార్య కూడా తెచ్చిపెట్టుకున్న నవ్వుతో తను ఆ విషయం మర్చిపోయినట్టుగా అంగీకరించింది" అంటూ ఆగాడు డాక్టర్.

"ఇందులో విశేషం ఏముంది?"

"వాళ్ళకొరకు తలుపు తీసింది నా భార్య కాదు!"

"మరెవరు?"

"మా ఇంట్లో తిరిగే స్పిరిట్!"

"మీ ఇంట్లో స్పిరిట్ తిరుగుతూ ఉంటుందా? మీకు మరి భయం వెయ్యదూ?" కృష్ణ అడిగాడు.

అందుకు డాక్టర్ హాయిగా నవ్వాడు.

మేము వచ్చాక అంత హాయిగా, రిలాక్స్‌డ్‌గా అంతవరకూ ఆయన నవ్వలేదు.

"అది పదేళ్ళ పసిముండ! మా ఇంటికొచ్చి దాదాపు ఐదేళ్ళయింది. మా అందరికీ కన్పిస్తూ ఉంటుంది. దానికి మా కుటుంబం అంటే ఎక్కడలేని ఆప్యాయత. మాకూ అలాగే అన్పిస్తుంది. అది ఒక్కరోజు రాకపోతే మాకు తోచదు."

'బాబోయ్! పిచ్చి బాగానే ముదిరిపోయింది' అని అరవబోయి, గొంతులోనే అణచుకున్నాను.

"అంటే, ఆ రోజు తలుపు తీసింది?"

"ఆ పిల్లే!"

"మీ భార్య రూపంలో వచ్చి తీసింది – అవునా?" అన్నాను ఆమె ముఖంలోకి లోతుగా చూస్తూ.

ఆమె నా కళ్ళల్లోకి చూడలేనట్టు చూపులు దించుకొన్నది. ఆమె మీద నాకు జాలి వేసింది.

ఆమె ఆ విషయాలను నమ్ముతుందో లేదో అర్థం కావడం లేదు.

"మీకు ఆ విషయం ఎవరు చెప్పారు?"

"ఇంటికొచ్చాక నా భార్యే చెప్పింది."

నేను మళ్ళీ ఆమె కేసి చూశాను. ఆమె తల ఎత్తలేదు.

భర్తకు ఇలాంటి విషయాలంటే ఇష్టంగనక చెప్పిందా?

లేక స్ప్లిట్ పర్సనాలిటీయా?

రెండుగా చీలిపోయిన పర్సనాలిటీలకు ఒకదాని ఉనికి మరోదానికి తెలియదు.

ఒక పర్సనాలిటీ తలుపు తీసి ఉంటుంది.

ఆమె స్నానం చేసివచ్చేసరికి ఆ పర్సనాలిటీ మరుగున పడిపోయి ఉంటుంది.

కాని ఆమెను చూస్తుంటే అలాంటి లక్షణాలేమీ కన్పించడం లేదు. చాలా బాలెన్స్డ్‌గా కన్పిస్తోంది. సోబర్‌గా కూడా ఉంది.

భర్త పిచ్చితన్నాన్ని అర్థం చేసుకొని ఆయనను నీడలా కాపాడుకొస్తున్నదానిలా ఉంది.

"నా భార్యా నేనూ మూడు జన్మలగా భార్యాభర్తలం!"

నా ఆలోచనలు పుటుక్కున తెగిపోయాయి.

ఒక్కసారిగా తల విదిలించుకొని చూశాను.

కృష్ణకేసి చూశాను.

అతను నోరు తెరిచి ముయ్యడం మర్చిపోయి చూస్తున్నాడు.

డాక్టరుగారి సతీమణి తలవంచుకొని కూర్చున్నది. సిగ్గుపడుతుందా?

"మొదట ఈజిప్టులో పుట్టాం. అప్పుడు ఆమె పేరు ఇజబెల్లా. ఆమె గొప్ప కుటుంబానికి చెందినది. నేను సామాన్య సైనికుడ్ని. నన్ను ఆమె ప్రేమించింది. చివరకు ఇద్దరం పారిపోయాం. దేశం వదిలి పారిపోయాం. పెళ్ళి చేసుకొన్నాం. ముందు ఆమె చనిపోయింది. రెండో జన్మలో పారిస్‌లో నాకంటే ముందుగా జన్మించింది. నాకు ఐదేళ్ళు వచ్చేసరికే ఆమెకు పెళ్ళయిపోయింది. నా ఇరవై అయిదవ ఏట నేను ఆమెను

కలుసుకొన్నాను. మొదటి చూపుల్లోనే జన్మాంతర ప్రేమ మాలో మేల్కొన్నది. అప్పుడు ఆమె ఒక సినీమా స్టార్. మొదటి భర్తకు విడాకులిచ్చి, పదిహేనేళ్ళు చిన్నవాడ్ని అయిన నన్ను చేసుకొన్నది. పూర్తి జీవితాన్ని జీవించాం.

ఇది మూడో జన్మ.

వచ్చే జన్మలో రష్యాలో పుడతాం.

ఆ జన్మతో ఆమెకు జన్మ రాహిత్యం వచ్చేస్తుంది. నేను మాత్రం మళ్ళీ జర్మనీలో పుడతాను. ఆ తర్వాత నాకూ జన్మరాహిత్యం కలుగుతుంది. ఆమెను ఊర్ధ్వలోకాల్లో కలుసుకుంటాను."

నాకు జుట్టు పీక్కోవాలనిపించింది, అతని మాటలు వింటుంటే.

కృష్ణకేసి చూశాను.

అతను చాలా తాపీగా కూర్చున్నాడు.

"అవును. ఈ విషయం ఇంతకుముందే డాక్టరుగారు నాకు చెప్పారు." అదేదో తన కిచ్చిన ప్రత్యేకమైన క్రెడిట్‌లా అన్నాడు రఘుపతి.

నేను చివ్వున లేచి నిల్చున్నాను.

"అరే, లేచారేం? ఇంకా చాలా విషయాలున్నాయి" అన్నాడు డాక్టరు రాజేంద్ర.

"మళ్ళీ వస్తాం! మావాడికి ఏదో అర్జంటు పనిఉంది" అన్నాడు కృష్ణ.

"తప్పకరండి. మీరూ రావాలి!" అన్నాడు నాకేసి చూస్తూ.

"అలాగే!" అన్నాను.

నేను రోడ్డు మీదకు వచ్చి గుండెల నిండుగా గాలి పీల్చుకొన్నాను.

పిచ్చాసుపత్రిలో నుండి బయటపడినట్టుగా ఉంది నా ప్రాణానికి.

"పాపం, డాక్టర్‌ను ఏ సైకియాట్రిస్టుకైనా చూపిస్తే మంచిదేమో!" అన్నాను.

"ఇలాంటివాళ్ళు చాలామంది ఉన్నార్లే!" నవ్వుతూ అన్నాడు కృష్ణ.

అవును–

ఉన్నారు! చాలామంది ఉన్నారు!.....

❀ ❀ ❀

ఒక్కసారిగా గుర్రం సకిలించింది.

తృళ్ళిపడి వెనక్కు జారిపోతున్న నేను గుర్రంబండి తడికబద్ద పట్టుకొన్నాను.

గతంలో నుంచి వాస్తవంలోకి వచ్చాను.

ఏది గతమో ఏది వాస్తవమో కూడా తెలునుకోలేనంతగా నా మనసు అలసిపోయింది.

ఇప్పుడు అర్థం అయింది.

ఆ హెలెన్ వాస్తవం కాదు.

అది కల మాత్రమే!

బండిలో వెనక్కు వాలాను.

బయలుదేరినప్పటినుంచీ పిశాచాల కథలూ, చుట్టూ భయం గొలిపే వాతావరణం.

ఆ డాక్టర్ చెప్పిన కథ నా అర్ధచేతనా మనసు పొరల్లో అణిగి ఉండి ఉండాలి. ఇవ్వాళ అదే రూపంలో కలగా వచ్చింది.

అంతే, కలే!

"బాబూ!"

"ఏమిటి?" అన్నాను. 'మధ్యలో వీడొకడు!' అనుకొన్నాను.

"ఏదో వాసన వస్తోంది."

"నాకేం రావడం లేదు."

"వస్తోంది బాబూ! బాగా శ్రద్ధగా ముక్కులు పీల్చండి."

"ఏం వాసన?"

"శరీరం కాలిన వాసన!"

గుండె ధక్కుమన్నది.

వెధవ! మళ్ళీ భయపెడ్తున్నాడు.

వీడు నాకు సజెషన్స్ ఇస్తున్నాడు.

మొదటినుంచీ వీడు చేస్తున్న పనే ఇది!

వీడికి హిప్నాటిజం తెలుసా?

వీడికి హిప్నాటిజం తెలుసో లేదో కాని, సజెషన్స్ మాత్రం ఇస్తున్నాడు.

వీడి సజెషన్స్‌ను నా మైండు రిసీవ్ చేసుకొంటున్నది.

ఆ సంగతి నేను ఊహించలేకపోయాను.

కొన్నిసార్లు, కొన్ని సమయాలలో సజెషన్స్ ఇచ్చేవాడికి వాడు ఇస్తున్నది సజెషన్స్ అని తెలియదు. అవి రిసీవ్ చేసుకొనేవాడికి తన మైండు ఆ సజెషన్స్ ఇన్‌ఫ్లుయన్స్‌లో పడిపోయిందని తెలియదు. అయినా హిప్నటిక్ ఎఫెక్ట్ ఉంటుంది.

అలాగే జరిగి ఉండాలి.

"ఏం బాబూ, వాసన వస్తోందా?"

"వస్తోంది!" నాకు తెలియకుండానే అనేశాను.

ఏమిటిలా అనేశాను?

అనెయ్యడం కాదు.

నిజంగానే నాకు వాసన వస్తోంది!

"ఇది దుష్టాత్మ బాబూ! వాడు నిన్న చచ్చిపోయాడు. వాడికి దారీ తెన్నూ తెలియక కొట్టుమిట్టాడుతున్నాడు."

నాకు మళ్ళీ ఏదోగా అనిపించింది.

ఎంత భయం లేదని నాకు నేను సర్దిచెప్పుకుంటున్నా ప్రతిసారీ భయం వేస్తూనే ఉంది.

"ఇదుగో రహమాన్!"

"బాబూ!"

"నువ్వు మాట్లాడకుండా పో!"

"అలాగే బాబూ!"

కొంతదూరం వెళ్ళి, బండి ఆపాడు.

"ఆపావేం?" అని అడిగాను.

"ఊరి పొలిమేరల్లోకి వచ్చాం. ఇక మీరు దిగి వెళ్ళాల్సిందే!"

"ఇక్కడే ఎందుకు దిగడం?"

"ఆ భైరవమూర్తి సామాన్యుడు కాదు బాబూ! వాడికి తెలిస్తే నన్నూ, నా గుర్రాన్ని కూడా ఎత్తి విసిరేస్తాడు."

వాడు అబద్ధం ఆడుతున్నాడని నాకు తెలుసు.

డెబ్బయ్ రెండేళ్లవాడు గుర్రాన్నీ, బండివాడ్నీ విసిరెయ్యడం ఏమిటి?

అల్లంత దూరంలో ఇళ్ళు కన్పిస్తున్నాయి.

"ఊరి మధ్యకు వెళ్ళాక ఆపు, నేను దిగి వెళ్తాను."

"ఊళ్ళోకి నా గుర్రం వెళ్ళదు బాబూ!"

"అదేం?"

"అది మరీ భయంకరమైన కథ, చెప్పమంటారా?"

నాకు వళ్ళు మండిపోయింది.

"అక్కర్లేదులే. ఇంద, తీసుకో" అని పది రూపాయల నోటు వాడిమీద వేసి నేను దిగాను.

పెట్టె చేతిలో పట్టుకొని గబగబ నడక సాగించాను.

వెన్నెల్లో టైం చూసుకొన్నాను.

3-10 అయింది.

"భైరవమూర్తి ఇంటికి ఎటు వెళ్ళాలో చెప్పు?" అడిగాను బండివాడిని.

"తిన్నగా వెళ్ళండి. కొంత దూరం వెళ్ళాక నాలుగు బజార్ల కూడలి కన్పిస్తుంది. కుడి చేతివైపుకు తిరిగి తిన్నగా వెళ్ళండి. ఊరిబయటగా పెద్ద బంగళా కన్పిస్తుంది. అదే భైరవమూర్తి ఇల్లు. వాడు దుర్మార్గుడు బాబూ! వాడితో ఘర్షణకు దిగకండి" అన్నాడు.

నేను చక చక ముందుకు నడిచాను.

ఇరవైగజాలు వెనక్కు తిరగకుండా నడిచాను.

నా వెనక ఎవరో నడుస్తున్నట్టుగా అన్పించింది.

ఆగాను.

వాడూ ఆగాడు.

గిర్రున తిరిగి చూశాను.

ఎవరూ లేరు.

నా భయానికి నాకే నవ్వొచ్చింది. వెధవ ప్రయాణం - పిరికితనం అంటే ఏమిటో తెలియనివాడ్ని, ఎంత దారుణంగా అడుగడుక్కూ భయపడుతూ ఊరు చేరానో తల్చుకొంటే ఈ ప్రయాణం ఎందుకు పెట్టుకొన్నానో అని అనిపించింది.

ఏదో గుర్తొచ్చి ఆగి వెనక్కు చూశాను.

బండి కన్పించలేదు.

ఇంత త్వరగా వాడు కన్పించకుండా ఎలా వెళ్ళాడు?

తిన్నగా ఉన్న రోడ్డు. ఎంత త్వరగా వెళ్ళినా కన్పించాలే!

వాడు కూడా...నా వళ్ళు ఝల్లుమన్నది.

నడక వేగం పెంచాను.

నాతోపాటు ఎవడో నడక వేగం పెంచినట్టుగా అన్పించసాగింది.

మళ్ళీ ఇదేమిటి?

గిర్రున తిరిగి నిలబడ్డాను.

వాడూ గిర్రున తిరిగి నా వెనకే నిలబడ్డట్టు అయింది.

ఛ! ఏమిటిది?

అంతా నా ఊహే!

నా పిరికితనం వల్లనే అలా అన్పిస్తోంది.

జారిపోతున్న గుండెను ఎగదోసుకొంటూ నడక వేగం పెంచాను. ఊరి మధ్యకు వచ్చాను. అప్పటికి కొంత భయం తీరినట్టుగా అయింది.

కొన్ని ఇళ్ల ముందు మంచాలు వేసుకొని మగవాళ్ళూ, ఆడవాళ్ళూ నిద్రపోతున్నారు.

అమ్మయ్య, మనుష్యుల మధ్యకు వచ్చిపడ్డాను.

ఇక భయం లేదు.

"ఎవరది?" తృళ్ళిపడ్డాను.

నా చేతిలో పెట్టె కింద పడింది.

పెట్టె తీసుకొని నిలబడి చూశాను.

"ఎందుకు బాబూ, అంత బెదిరిపోయావ్?" అన్నాడు, నడి మంచం మీద కూర్చుని చుట్ట తాగుతున్న ఓ మధ్య వయస్కుడు.

నేను ఆగాను. అతనికి కొద్దిగా దగ్గరకు వెళ్ళాను.

అతను చుట్ట నోట్లోనుంచి తీసి తుపుక్కున ఊశాడు.

"ఎవరు నువ్వు!"

"మాది ఈ ఊరు కాదు."

"ఎవరింటి కెళ్ళాలి?"

"భైరవమూర్తి ఇంటికి!"

అతను మాట్లాడకుండా భయంగా నా ముఖంలోకి చూశాడు.

"ఆ ఇల్లు ఎంతదూరం?" అన్నాను.

"నాకు తెలవదు!" అంటూ చుట్ట గిరాటువేసి మంచంలో మునగదీసుకొని పడుకొన్నాడు.

భైరవమూర్తిపేరు చెప్పగానే అలా అయ్యాడేం?

అతను దుర్మార్గుడన్నారుగా?

అందుకే ఈ ఊరి ప్రజలకు భయం కావచ్చు.

ఆలోచిస్తూ నాలుగు బజార్ల కూడలిలోకి వచ్చాను.

కుడిచేతి వైపుకు తిరిగాను.

ఇరవైగజాలు వెళ్ళేసరికి ఒక నల్లకుక్క మొరగసాగింది. దాన్ని అదిలిస్తూ ముందు కుసాగాను. ఒక ఫర్లాంగువరకు నాలుగైదు ఇళ్లున్నయ్. ఆకుక్క అరుస్తూ నా వెనకే వస్తోంది. అదెక్కడ కాలు పట్టుకుంటుందోననే భయం ఒకవైపు. నాకు కుక్కలంటే భయం. కరిస్తే బొడ్డుచుట్టూ ఇన్‌జెక్షన్స్ చేయించుకోవాలి. ఒకసారి అనుభవం అయింది.

ఒకడు కుక్కలా అరుస్తూ చావడం చిన్నప్పుడు మా ఊళ్ళో చూశాను. చాలా భయంకరమైన దృశ్యం. అదే నా భయం.

ఇళ్ళు లేవు.

కనుచూపు దూరంలో ఇళ్ళు కన్పించడం లేదు.

ఊరిబయటికి వచ్చేస్తున్నట్టున్నాను.

వెన్నెల పిండారబోసినట్టుంది.

అందుకే ఒంటరిగా నడుస్తున్నా భయంగా లేదు.

కాని, దొంగలు తిరిగే వేళ.

ఎవడైనా తన్ని, చేతిలోని పెట్టె లాక్కెడతాడేమోననే భయం. మనుష్య సంచారం లేదు. చుట్టూ నిశ్శబ్దత.

గబగబా నడుస్తున్నాను.

మరో సందులోనుంచి ఇంకో నల్లకుక్క వచ్చింది అరుస్తూ.

రెండూ చెరోవైపున అరుస్తూ నాతోపాటు నడుస్తున్నాయి.

ఇదెక్కడి పీడరా బాబూ!

ఆ దయ్యాల గొడవే బాగున్నట్టుంది.

ఎవడో ఒకడు మనిషనేవాడు పక్కనే ఉన్నాడు.

తిరిగి వెళ్ళి ఆ రాత్రికి ఎవరింట్లోనైనా తలదాచుకోవాలనిపించింది.

మళ్ళీ అంతలోకే నా పిరికితనం మీద నాకే చిన్నతనంగా అన్పించింది.

గబగబ నడుస్తున్నాను.

ఇంకా ఇల్లు కన్పించదేం?

పెద్ద బంగళా అన్నారుగా?

అయినా, వాడు నన్ను తెల్లవారకముందే ఎందుకు రమ్మనట్లు?

ఛా! మళ్ళీ వెనక్కు వెళ్తున్నాను.

ఇంత దూరం వచ్చాను.

ఈ కాస్తకు భయపడి పారిపోవడం ఏమిటి?

ఇదేదో తెలుసుకొని మంచి నవల రాయవచ్చును.

ఎదురుగా మరో కుక్క అరుపు విన్పించింది.

అది బర్రె దూడంత ఎత్తున భయంకరంగా నల్లగా ఉంది. అరుస్తో ఎదురొస్తోంది.

ఆ భైరవమూర్తి కుక్కలే అయిఉండాలి యివన్నీ!

ఇన్ని కుక్కల్ని పెంచుతున్నాడా?

భయంకరంగా దూరంనుండి వస్తోన్న కుక్కను చూస్తూ ముందుకే నడుస్తున్నాను. ఇవి కరవవు. కరిచేవయితే ఈపాటికే నన్ను ఈ రెండూ నిలువునా చీల్చేసి ఉండేవి. అందుకే అంటారు అరిచే కుక్కలు కరవవని!

ఎందుకు కరవవు?

వెధవ సామెత!

కొన్ని అరచీ కరుస్తాయి.

కొన్ని అరవకుండానూ కరుస్తాయి.

ఏమిటో పిచ్చి ఆలోచనలూ నేనూ!

అల్లంత దూరంలో వెన్నెల్లో ఎత్తుగా నిల్చున్న తెల్లటి భవనం వెన్నెల్ని కప్పుకొని వెండిలా మెరుస్తోంది!

అమ్మయ్య, వచ్చేశాను.

ఇక భయంలేదు.

నాలోని రచయిత ఉత్సాహపడ్డాడు.

ఎలాంటి కథ వినిపిస్తాడో భైరవమూర్తి?

ఏ కథయినా ఫర్వాలేదు. ఆ కథ వినడానికి నేను చేసిన సాహసమే చాలు, పాఠకులను ఉర్రూతలూగించే నవల రాయడానికి.

భూత ప్రేతాల కథలు అక్కర్లేదు.

మంచి క్రైమ్ కథ రాయవచ్చును.

ఇల్లు దగ్గరౌతోంది.

మూడు కుక్కలూ అరుస్తూనే ఉన్నాయి. ఇప్పుడు ఆ కుక్కలంటే భయంకూడా పోయింది.

ఓ క్షణం నిల్చుని భవనంకేసి చూశాను.

పూర్వకాలంలో కట్టిన కట్టడం అని తెలుస్తూనే ఉంది.

అంత పెద్ద ఇల్లు ఇప్పుడెవరూ కట్టరు.

భైరవమూర్తి తాతముత్తాతలు జమీందారులై ఉండాలి. ఈ ఊరంతా వాళ్ళ స్వాధీనంలో ఉండి ఉండాలి.

ఇప్పుడు జమీందారీలు పోయాయి.

జమీందారులూ పోయారు.

కాని, ఆనాటి వైభవం తాలూకు చిహ్నాలు ఇంకా మన సంస్కృతిలో మిగిలే ఉన్నాయి.

వారి అలవాట్లూ, ఆ దౌర్జన్యాలూ కూడా కొన్నిచోట్ల ఇంకా సాగుతోనే ఉన్నాయి.

నేను బిల్డింగ్ ముందుకొచ్చి నిల్చున్నాను.

ఒకసారిగా ఏడెనిమిది నల్లకుక్కలు నన్ను చుట్టేశాయి.

బందీని చేశాయి.

నేను అడుగు తీసి వెయ్యడానికి వీలులేకుండా ఉంది.

ఏం చెయ్యాలో తోచడం లేదు.

దిక్కులు దద్దరిల్లేలా అన్నీ ఒకేసారి అరవసాగాయి.

ప్రాణాలు ఉగ్గబట్టుకొని నిల్చున్నాను.

భవనం వైపు చూశాను.

పెద్ద గేటు వేసి ఉంది. ఆ గేటులో నుంచి కేకలు పెట్టినా ఎవరికీ వినిపించదు. పైగా, ఈ కుక్కల అరుపు లొకటి!

భవనంలో ఎక్కడా దీపం ఉన్నట్టుగా అన్పించలేదు.

కుక్కల అరుపు మరీ ఎక్కువైంది. వాటిని అదిలించడానికి కూడా భయంగా ఉంది.

అంతలో ఏదో కంఠం "ఛ-పోండి!" అని చిన్నగా విన్పించింది.

కుక్కలన్నీ ఒక్కసారిగా తలొకవైపుకు వెళ్ళిపోయాయి.

నేను చుట్టూ చూశాను.

ఎవరూ లేరు!

ఎవరా మాటలన్నది, వాటిని అదిలించింది?

భైరవమూర్తా?

అయివుండాలి.

కాని, అతనెక్కడ?

ఉన్నట్టుండి నల్లటి మబ్బులు కమ్మాయి.

చీకట్లు కమ్మాయి. తల పైకెత్తి చూశాను.

చంద్రుడు కన్పించలేదు.

సన్నజల్లు ప్రారంభం అయింది.

"భైరవమూర్తిగారూ!" గట్టిగా అరిచాను. నా గొంతు నాకే 'కీచు' మన్నట్టు విన్పించింది.

ఏదో నీడ గోడ పక్కగా కదిలివచ్చింది. వళ్ళు జలదరించింది.

వాచ్‌మాన్ అయివుంటాడని సర్దిచెప్పుకొన్నాను.

గేటు తెరిచి పక్కగా నిల్చున్నాడు.

అతని రూపం కన్పించడంలేదు. నీడలాగే కన్పిస్తున్నాడు.

"భైరవమూర్తిగారున్నారా?"

అతను పలక్కుండా చెయ్యి భవంతివైపుకు చూపించాడు.

ఆ చెయ్యి కూడ నీడలాగే ఆ చీకట్లో కన్పించింది. ఆ చెయ్యి చాలా పొడవుగా సాగినట్టుగా అన్పించింది.

మళ్ళీ భయం!

ఆ భయాన్ని వెనక్కు నెట్టే ప్రయత్నం.

ముందుకు అడుగులు వేశాను.

ఆ నిశ్శబ్ద నిశీధిలో నా అడుగుల సవ్వడి నన్నే భయపెడుతోంది.

చీకట్లో ఆ భవనం భూతగృహంలా అన్పించింది.

ఇంత పెద్ద ఇంట్లో ఒక్క దీపం పెట్టుకోకూడదూ?

భైరవమూర్తికి సంతానం, ముని సంతానం కూడా ఉండాలే న్యాయంగా?

చల్లటిగాలి జివ్వున వీచింది.

కాంపౌండులోకి అడుగుపెట్టగానే ఎముకల్ని కొరికే ఈ గాలి ఏమిటి?

భైరవమూర్తి నన్ను ఈ సమయానికే రమ్మన్నాడుగా!

మరి నా రాకకోసం ఎదురు చూడటం లేదా?

నా వెనకే బర్రున శబ్దంచేస్తూ అంతలోనే రెండు ఇనుప దిమ్మలు ఒకదానికి ఒకటి కొట్టుకున్నట్టు శబ్దం అయి, మరు నిముషంలో ఆగిపోయింది.

నేనూ యాంత్రికంగా ఆగిపోయాను.

వెనక్కు తిరిగి చూశాను.

గేటు మూసి ఉంది. కాని, గేటు తెరిచిన నీడ ఆ దరిదాపుల్లో కన్పించలేదు.

నీడేమిటి? వాడు వాచ్‌మాన్! గేటు మూసేసి బిల్డింగ్ వెనక్కు వెళ్ళిపోయి ఉంటాడు.

ఇప్పుడే ఈ చీకట్లు ముంచుకురావాలా?

అరణ్యంలో నన్ను భయపెట్టిన దయ్యాల పనేమో ఇది? అవి నన్ను వెంబడిస్తున్నాయేమో!

నేను మళ్ళీ దయ్యాలను నమ్ముతున్నానా?

దయ్యాలు ఎక్కడో లేవు.

మనసులోనే ఉన్నయ్.

అందులో నా మనసు బాగా బలహీనం అయింది కొద్ది గంటల్లోనే!

వేల సంవత్సరాల నుంచి మనిషి రక్తంలో ప్రవహిస్తున్న మూఢనమ్మకాలు.

అదను చూసి బయటపడ్తాయి. మనిషి ఒంటరిగా జీవించలేడు. ఈ భయం వల్లనేనేమో!

వెనక్కు వెళ్ళిపోతే?

వాడు గేటు తెరుస్తాడా?

సాలెగూటిలో చిక్కుపోలేదు గదా?

ఆ పెద్దమనిషి భైరవమూర్తి పేరు చెప్పగానే ఎందుకలా అయిపోయాడు? నన్నే ఓ భూతాన్ని చూసినట్టుగా చూశాడు!

భైరవమూర్తి కూడా పిశాచమేనేమో?

నాన్‌సెన్స్! ఇంతదూరం వచ్చి ఇప్పుడు భయపడి వెనక్కు పోవడం ఏమిటి?

ఇంతవరకూ నేను క్షేమంగానే చేరాను.

ఆ భూతరాజుగాడూ, రహమాన్‌గాడూ నా మైండును వశం చేసుకొని అనేక భయాల్ని కలుగచేశారు.

మన ఆలోచనలే అన్ని భయాలకూ ఉద్గమ స్థానం.

మనసులోనే అంతా ఉంది.

ఇలా నిలబడే ఆలోచిస్తున్నానేం?

గబగబా ముందుకు అడుగులు వేశాను.

పెద్ద పెద్ద మెట్లు ఎక్కుతున్నాను.

ఇదో పెద్ద జమీందారు దివాణమే! సందేహం లేదు. ఆ గేటేమిటి? ఈ మెట్లేమిటి?

తలుపుల దగ్గర ఓ క్షణం నిల్చున్నాను.

లోపల ఎలాంటి అలికిడీ లేదు.

తలుపుల మీద చెయ్యి వేశాను.

గట్టిగా తట్టనే లేదు.

రెండు తలుపులూ బార్లా తెరుకున్నాయి.

లోపలంతా చీకటి.

మరో నీడ!

చీకట్లో ముందుకు పోతోంది.

నేను దాన్ని అనుసరించాను.

మళ్ళీ తలుపులు తెరుచుకున్నాయి. అదొక పెద్ద హాలుగా కన్పించింది.

తలుపులు తెరిచిన నీడ హాల్లో నుంచి ఎటు వెళ్ళిందో చూడలేదు.

ఈ నీడలేమిటి? ఈ గొడవేమిటి?

నీడలు కాదు.

మనుష్యులే!

కాని ఒకడూ మాట్లాడిచావడేం?

మళ్ళీ వెనకనుంచి తలుపులు మూసుకున్న కిర్రు శబ్దం.

గిర్రున వెనక్కు చూశాను.

ఎవరు మూశారు?

ఆ నీడగాడేడీ?

వాడే మూసి బయటికెళ్ళిపోయాడా?

వాడు వెనక్కు వెళ్ళినట్టు లేదే! నా ముందే వెళ్ళాడుగా?

స్ప్రింగ్ డోర్స్ అయివుంటాయి.

ఈ ఇంటికి స్ప్రింగ్ డోర్సేమిటి? నాకు మతిపోయినట్టుంది.

ఉన్నట్టుండి సన్నటి వెలుగు ఎక్కడ్నుంచో నేను నిల్చున్న హాలులో పరచుకుంది.

పాతకాలపు చెక్క ఉయ్యాల హాలుకు మధ్యగా వేలాడుతోంది.

ఎంత పెద్ద ఉయ్యాల?

ఆ గొలుసులు కూడా ఏనుగుల్ని కట్టేసే గొలుసుల్లాగే ఉన్నాయ్.

హాలంతా కలయజూచాను.

గోడల మీద రంగులు మాసిపోయిన కొన్ని చిత్రాలున్నాయి. అవి భైరవమూర్తిగారి. పెద్దల చిత్రాలు కాబోలు! ఆ ఉయ్యాలా, ఆ గోడల మీది చిత్రాలూ, అక్కడున్న ఫర్నీచరూ గత వైభవాన్ని గుర్తు చేస్తున్నట్టుగా ఉన్నాయి.

ఎదురుగా ఉన్న గోడకేసి చూసి తృళ్ళిపడ్డాను.

వాడెవడు?

నా పోలికలున్నట్టుగా ఉన్నాడు!

"ఎవరు నువ్వు?"

అతడూ పెదవులు కదిలించాడు. అయితే, ఆ మాటలు నాకు విన్పించలేదు.

ఒకడుగు ముందుకు వేశాను.

అతనూ ఒకడుగు ముందుకు వేశాడు.

నేను చెయ్యి ముందుకు చాచాను.

అతడూ చెయ్యి ముందుకు చాచాడు.

'కెవ్వు' మని అరిచి రెండడుగులు వెనక్కు వేశాను.

వెనకనుంచి చిన్నపాటి ఉరుములాంటి నవ్వు విన్పించింది.

గిర్రున వెనక్కు తిరిగాను.

అతను నవ్వుతున్నాడు. విరగబడి నవ్వుతున్నాడు.

"ఏం, ఎందుకలా నవ్వుతావ్?" కీచుమన్నది నా గొంతు.

"అద్దంలో నీడ చూసుకొని భయపడేవాడివి ఇంత అర్ధరాత్రి ఇంతదూరం ఎలా ప్రయాణం చేశావ్?"

అది అద్దమా? అడగలేదు. మనసులోనే అనుకున్నాను.

వెనక్కు తిరిగి మళ్ళీ చూశాను.

అప్పటికి ఆ హాల్లోకి పూర్తిగా వెలుగు వచ్చింది. ఇంత వెలుగు ఎక్కడ్నుంచి వచ్చింది?

ఎదురుగా అద్దం!

అద్దంలో నా ప్రతిబింబం చూసుకొని గతుక్కుమన్నాను.

ఒక్కరాత్రికే నాలో ఇంత మార్పు వచ్చిందా?

ఇది నా ప్రతిబింబమా?

నా మానసిక స్థితిలో వచ్చిన మార్పే నా ముఖంలోనూ కన్పిస్తోంది.

రాత్రంతా దయ్యాలతో సహవాసం చేశాను. దయ్యాల మధ్యనుంచి ప్రయాణం చేశాను. విచిత్రమైన మానసిక సంఘర్షణకు లోనైనాను.

"ఇంకా నమ్మకంగా లేదా?" వెనకనుంచి కంఠం గంటలా మోగింది.

అవును. అది అద్దమే!

గోడకు సమతలంలో బిగించి ఉంది. ఆ సమయంలో హాలులో మసక వెలుగు మాత్రమే ఉంది. అందుకే మోసపోయాను.

నేను వెనక్కు తిరిగాను.

అతను నన్నే గుచ్చి గుచ్చి చూస్తున్నాడు.

ఆ కళ్ళేమిటలా ఉన్నాయ్? పిల్లికళ్ళు. మనిషికళ్ళు కావు. అచ్చం పిల్లికళ్ళే!

"ఎవరు నువ్వు?" అన్నాను.

"ఎవరికోసం వచ్చావ్?"

"భైరవమూర్తిని చూట్టానికి."

"నేనే ఆ భైరవమూర్తిని!" అంటూ వెళ్ళి ఉయ్యాలలో కూర్చున్నాడు.

నేను కళ్ళు వెడల్పు చేసుకొని చూశాను.

మళ్ళీ ఇక్కడో సస్పెన్సు కాబోలు!

"అలా కూర్చోండి." గోడ పక్కగా ఉన్న పాతకాలపు పడకకుర్చీ చూపించాడు.

"ముందు భైరవమూర్తిని చూడాలి."

"నేనేనని చెప్పడం లేదూ?"

"అబద్ధం!"

"ఎందుకలా భావిస్తున్నావ్?"

"భైరవమూర్తికి తొంభయ్ రెండేళ్ళు."

"అవును, నాకు తొంభయ్ రెండేళ్ళే!"

"నేను నమ్మను!" అంటూ అతన్ని చూశాను.

అతను చిరునవ్వు నవ్వాడు.

ఇతను నవ్వకుండా ఉంటే బాగుండును అన్పించింది.

అతన్ని పరిశీలనగా చూశాను.

ఇతను భైరవమూర్తా?

ఇతనికి తొంభయ్ రెండేళ్ళా?

జుట్టు నల్లగా ఉంది. వత్తుగా కూడా ఉంది.

శరీరం వ్యాయామం చేసినట్టు బలిష్టంగా ఉంది.

నలభై ఏళ్ళకంటే ఎక్కువ అని నమ్మటం అసంభవం.

అసలు నలభై ఏళ్లే ఉంటాయి. నన్ను తమాషా పట్టించడనికే అలా రాసి ఉంటాడు.

మళ్ళీ అతనికేసి చూశాను.

అతను ఉయ్యాల గొలుసులు పట్టుకొని చిన్నగా ఊగుతున్నాడు.

అతని శరీరపు రంగు గోధుమ రంగు.

జరీ అంచు పంచె కట్టుకొని, కంటెమెడ కోటు వేసుకొన్నాడు. అచ్చం గోడమీద చిత్రాలలో ఉన్నవారి వేషధారణలాగే ఉంది ఇతని వేషధారణ కూడా.

"కూర్చో!" అధికారం ఉట్టిపడే స్వరం నా తలలో లేస్తున్న ఆలోచనల మీద దెబ్బ చరిచింది.

నేను యాంత్రికంగా వెళ్ళి కూర్చున్నాను.

"నేనే భైరవమూర్తిని! నిన్ను రమ్మని రాసింది నేనే!"

నేను చూడడం మినహా ఏమీ అనలేదు.

"ప్రయాణం బాగా సాగిందా?" అతని గొంతు అదోలా ధ్వనించింది.

"బా....బా...." ఆపైన మాటలు పెగల్లేదు.

నేను ఎలాంటి పరిస్థితులను ఎదుర్కొన్నానో వీడికి ముందే తెలిసినట్టుగా ఉంది.

ఎలా తెలిసింది?

రహమాన్ మాటలు గుర్తొచ్చాయి.

'భైరవమూర్తికి కోపం వస్తే నన్నూ, నా బండిని ఎత్తి పారెయ్యగలడు' అని అన్నాడు.

"ఎలా వచ్చావ్?"

ఉయ్యాల ఊపు వేగం పెరిగింది.

"బండిలో!" ధైర్యం కూడదీసుకొంటూ అన్నాను.

నాకు నాలుక ఎండిపోతున్నట్టుగా ఉంది.

"ఏం బండి?"

"గుర్రం బండిలో!"

"గుర్రం బండిలోనా? ఇక్కడదాకా రాలేదా?"

"లేదు. ఊరి బయటే వదిలేశాడు."

తల పంకించాడు భైరవమూర్తి.

అతని చూపుల్లో అంతకుముందులేని క్రూరత్వం తొంగిచూసింది.

"రహమాన్ బండా?"

"కా...కాదు."

"ఎందుకంత భయం? అబద్ధం చెప్పాల్సిన అవసరం మీకేమిటి?" అన్నాడు అదోలా నవ్వుతూ.

నేను వెర్రిచూపులు చూశాను.

వీడికెలా తెలిసింది నేను రహమాన్ బండిలో వచ్చినట్లు?

నా అనుమానం నిజమేనేమో?

ఆ రహమాన్‌ను పంపించింది కూడా వీడే అయివుండాలి.

"వాడికి నేనంటే భయం!"

"అవును, వాడూ ఆ మాటే అన్నాడు." నేను గబుక్కున అన్నాను.

"అన్నాడా! ఇంకా ఏమన్నాడూ?" తీవ్రంగా చూస్తూ అడిగాడు.

"ఇంకేమీ అనలేదు. దాహం వేస్తోంది. కొంచెం మంచి నీళ్లు ఇప్పించండి." పెదవులతో నాలుక తడుపుకొంటూ అన్నాను.

"రాజా! మంచి నీళ్లు తీసుకురా!" లోపలకు చూస్తూ కేక పెట్టాడు.

అమ్మయ్య! ఫర్వాలేదు. ఈ ఇంట్లో ఇంకా జనం ఉన్నారు. నేను అనవసరంగా ప్రతిదానికీ బెదిరిపోతున్నాను.

ధైర్యంగా కుర్చీలో సర్దుకుని రిలాక్స్‌డ్‌గా కూర్చున్నాను.

వాకిలికున్న నల్లటి బరువైన పర్దా కదిలింది.

అప్పటివరకూ నేను ఆ హాలు కిటికీలకూ, వాకిళ్లకూ నల్ల పర్దాలు ఉన్నట్టు గమనించనే లేదు.

'ఇదేం టేస్టు బాబూ!' అనుకొన్నాను.

మంచినీళ్ల గ్లాసు చెయ్యి నాకేసి వచ్చింది.

గ్లాసు అందుకొంటూ అతడ్ని చూశాను.

నా చేతిలోని గ్లాసు ఎగిరి అల్లంత దూరానపడి శబ్దం చేస్తూ దొర్లింది. అది గ్లాసు దొర్లిన శబ్దంలా అన్పించలేదు నాకు. ఎవరో స్త్రీ అతి దారుణంగా ఆర్తనాదం చేసినట్టుగా అన్పించింది.

నేను గాభరాగా లేచి నిల్చున్నాను.

"ఏమైంది? ఎందుకలా బెదిరిపోతున్నారు?"

భైరవమూర్తి అడుగుతున్నాడు.

కాని నా కళ్ళు మాత్రం మంచి నీళ్ల తెచ్చినవాడి ముఖంమీదనే ఉండిపోయాయి. శిలాప్రతిమలా నిల్చిపోయాను.

"ఏంటి బాబూ! అంత బెదిరిపోయారు?"

"నువ్వు...."

"నేనే బాబూ!"

"నువ్వు...ఆ..."

"అవును బాబూ! నేను ఆ భూతరాజునే!" తాపీగా సమాధానం ఇచ్చాడువాడు.

"నువ్విక్కడి కెలావచ్చావ్?" బెదురుగా చూస్తూ నంగి నంగిగా అడిగాను.

"అదేంది బాబూ! నేను ఇక్కడికి రాక ఎక్కడి కెళ్తాను?"

"భూతరాజు నా దగ్గరే ఉంటాడు. నీ కోసం స్టేషన్‌కు పంపించాను" అన్నాడు భైరవమూర్తి.

"నా మాట మీరు నమ్మలేదు. నేను ఎప్పుడో ఇంటి కొచ్చాను, అన్నాడు భూతరాజు."

"ఎట్లా వచ్చావ్ ఇంత త్వరగా?" అయోమయంలోనుంచి బయటపడకుండానే ప్రశ్నించాను.

"అడ్డదోవన! నా మాట మీరు వివలేదు."

అప్పటికి నాకు ధైర్యం వచ్చింది. అరచేత్తో నొసలు రుద్దుకున్నాను.

"ముందు మరో గ్లాసు మంచి నీళ్ళివ్వు!" ధైర్యంగా అడిగాను.

భూతరాజు ఇచ్చిన మంచినీళ్ళు గట గట తాగేశాను.

"ఇంకా కావాలా బాబూ?" ఖాళీ గ్లాసు అందుకొంటూ అడిగాడు.

"వద్దు."

"భూతరాజూ!" గ్లాసు తీసుకొని లోపలకు వెళ్ళబోతున్న భూతరాజు ఆగి నాకేసి చూశాడు.

"నువ్వు నాతో వస్తూ అకస్మాత్తుగా అలా మాయమయ్యావేం?"

"మాయం అవడానికి నేనేం దయ్యాన్నా బాబూ?"

"మరి ఏమయ్యావ్?"

"గబగబా అడ్డదారిన పడి వచ్చేశాను."

"అదే ఎందుకంటున్నాను?"

"ఆ రహమాన్‌గాడు వస్తున్నట్టు తెలిసి..."

"వస్తే ఏం?"

"బాబోయ్! వాడు దయ్యం అని మీకు తెలియదు కనక వాడితో మీరు ఇంత దూరం ప్రయాణం చేశారు. తెలిసి తెలిసీ నేనెట్టా వాడితో ప్రయాణం చేస్తాను బాబూ?"

నేను భూతరాజు కేసి వెర్రివాడిలా చూశాను.

"రహమాన్..."

నా గొంతులోనుంచి పైమాటలు పెగల్లేదు.

అసలు దయ్యాలు వీళ్లా, లేక రహమానా?

❀ ❀ ❀

"ఇంకా ఏమిటా రాతలు, పడుకోక?"

ఆడగొంతు.

శివప్రసాద్ కుర్చీలోనే ఇంతెత్తున ఎగిరిపడ్డాడు.

"ఏమిటండీ, అంత భయపడిపోయారూ?"

శివప్రసాద్ భార్య ముఖంలోకి ఓ క్షణం "ఇదీ దయ్యమేనా?" అన్నట్టు చూశాడు.

"ఏమిటలా చూస్తారు? ఈ ముదనష్టపు నవల ఏ ముహూర్తంలో మొదలు పెట్టారోగాని మనిషి మనిషిలో లేరు!"

తన భార్యే! కృష్ణవేణి!

తను ఇంట్లోనే ఉన్నాడు.

"పది లంఖణాలు చేసి నిన్ననే పథ్యం తీసుకున్నారు. మళ్ళీ పొద్దుటినుంచి ఒకటే రాత!" కృష్ణవేణి నస.

శివప్రసాద్ భార్య ముఖంలోకి చూశాడు.

"మరి రాయకపోతే ఎలా? ఆ అడ్వాన్సు కాస్తా నా జబ్బుకే సరిపోయినట్టుంది!" అన్నాడు దిగులుగా.

"ఇక చాల్లే, పడుకోండి. పదకొండు దాటిపోయింది" అన్నది కృష్ణవేణి.

"పడుకుంటాలే! నువ్వు పడుకో!"

"మళ్ళీ రాస్తారా?"

"ఓపిక లేదు. ఇక పడుకుంటాను. కాగితాలన్నీ సరిగా సర్దాలి. రేపు పొద్దుటే 'వెలుగు–చీకటి' ఆఫీసుకెళ్ళాలి' అన్నాడు. వ్రాసిన కాగితాలను బొత్తిగా పెట్టి పేజీనంబర్లు చూసి, టాగ్ గుచ్చాడు.

"బియ్యం, పప్పులూ రేపటికి అయిపోతాయి."

"కిరాణా కొట్లో అప్పు తీసుకో!"

"ఇవ్వనంటున్నాడు."

"పాత బాకీ తీర్చాంగా?"

"ఎక్కడ? ఆరొందలకు మూడొందలేగా ఇచ్చాం! మొత్తం ఇస్తేగాని మళ్ళీ ఇవ్వడట!"

"సరే, రేపు చూస్తాలే! రాసినంతవరకు తీసుకెళ్లి ఇస్తాను. మరో వెయ్యి రూపాయలు అడుగుతాను."

"ఇస్తాడంటారా?" అపనమ్మకంగా అడిగింది భార్య.

"ఎందుకివ్వడూ?" చాలా ఆత్మవిశ్వాసంతో అన్నాడు ప్రసాద్.

కృష్ణవేణి వెలుగారిపోయిన కళ్ళల్లోకి ఓ క్షణం వెలుగొచ్చింది. అంతలోకే ఇట్టే ఆరిపోయింది. భర్త మాటల్ని నమ్మలేనట్టు ముఖంలోకి చూసింది.

శివప్రసాద్‌కు భార్యమీద జాలి వేసింది.

"బాధపడకు, త్వరలోనే మంచి రోజులొస్తాయి. వెళ్ళి పడుకో" అన్నాడు శివప్రసాద్.

ఆమె భర్తను ఆశ్చర్యంగా చూసి వెళ్ళిపోయింది.

శివప్రసాద్ కాగితాలు బొత్తిగా బల్లమీద సర్దిపెట్టి వెయిట్ పెట్టాడు.

లేచి వెళ్లి పక్కమీద నడుం వాల్చాడు.

వళ్ళంతా విరగ్గొట్టినట్టుగా ఉంది.

కళ్ళు మూసుకొన్నాడు.

నిద్రపోవడానికి శాయశక్తులా ప్రయత్నించాడు.

భూతరాజు, రహమాన్, భైరవమూర్తి, ఈజిప్టు యువరాణి హెలెన్, ఫీరోన్ తీల్‌నే – ఒక్కొక్కరే బుర్రలో అల్లరి చేస్తున్నారు.

నిజంగానే మనసులో భయంగా ఉంది.

తను రాస్తున్న కథకు తనే భయపడ్తున్నాడా?

పాఠకులు తప్పక పిచ్చెక్కినట్లు చదువుతారు.

తన పేరు బ్లో అప్ అవుతుంది.

ఛ! ఏమిటి? తను ఇలా ఆలోచిస్తున్నాడు.

లేచి వెళ్ళి రెండు కాంపోజ్ టాబ్‌లెట్సు వేసుకొన్నాడు.

అయినా బుర్రలో ఏదో ధనాధనా తిరుగుతూనే ఉంది.

కణతలు అదురుతున్నాయి.

ఎప్పుడు తను నవల వ్రాయడం ప్రారంభించినా ఇలాగే ఉండేది. 'అవి సజీవ పాత్రలు. తన బుర్రలో అల్లరి చేసేవికావు. తనకు రెండో రోజు రాయాల్సిన విషయాలను చెప్పేవి. ఆ అనుభూతి వేరు. ఆ సంతృప్తి వేరు.

ఇదేమిటి? ఇవన్నీ దయ్యాలూ – పిశాచాలూ తలలో అల్లరి చేస్తున్నాయి.

తను రాసిన కథలూ, నవలలూ, ఒకప్పుడు – దాదాపు పదేళ్ళక్రితం వరకు పుల్లారెడ్డి నేతి మిఠాయిల్లా అమ్ముడయేవి.

తన రచనలు అచ్చువేసి, అమ్ముకొని ఇళ్లు కట్టుకొన్నవాళ్ళున్నారు.

కారుల్లో తిరిగే స్తోమతను తెచ్చుకున్నవాళ్లున్నారు.

కేవలం తన రచనలనేకాదు – తనలాంటివారి మేధలను కొని, కారు చౌకగా కొని, మార్కెట్‌లో అమ్ముకొని లావెక్కినవాళ్ళెందరో!

తన రక్తం తాగినవాళ్ళు ఒకవైపు బలుస్తూ ఉంటే – మరోవైపు తను రోజు రోజుకూ క్షీణించిపోయాడు.

ఆనాడు తన భవిష్యత్తు గురించి ఆలోచించలేదు. సాహిత్యపు ట్రెండు మారితే తన కుటుంబం ఏమైపోతుందని ఆలోచించలేదు. ఏ రచయితా భవిష్యత్తు గురించి, అంటే, డబ్బు సంపాదించుకొని భవిష్యత్తులో సుఖపడ్దామని ఆలోచించడు. అలా ఆలోచించేవాడు రచయితే కాదు.

తనను తను సమర్థించుకొంటున్నాడా?

తన అసమర్థతను ఇలా సర్దుకుని తన మనసునే జోకొట్టి నిద్రపుచ్చడానికి ప్రయత్నిస్తున్నాడా?

తను బ్రతకాల్సిందీ, తన భార్యాబిడ్డలూ బ్రతకాల్సిందీ తన రచనల మీదేననే జ్ఞానం లేకపోవడం తన నిజాయితీకి నిదర్శనంగా భావించి తృప్తిపడ్తున్నాడా?

కాదు! కాదు! తన ఆలోచనావిధానం వేరు.

రచనలు తను పేరు కోసం చెయ్యలేదు.

అయితే పేరు వచ్చినప్పుడూ, పదిమంది ప్రశంసించినప్పుడూ తనకు ఆనందం కలగలేదని చెప్పుకోవడం ఆత్మద్రోహమే.

తను డబ్బు కోసం రాయలేదు.

తన రచనకు ఎక్కువ పారితోషికం లభించినప్పుడు తనకు సంతృప్తి కలగలేదా? కలిగింది. తన కుటుంబంలోని సభ్యులు సుఖంగా జీవిస్తున్నారనే సంతృప్తి తనకు కలిగింది. అంతే కాని, పాఠకులు ఏం కోరుకుంటున్నారు? ఏ సరకు సప్లై చేస్తే ఎక్కువ డబ్బు వస్తుందని తాను ఆలోచించలేదు.

రచయిత అయినవాడెవ్వడూ అలా ఆలోచించడు. అందులో తన ప్రత్యేకత ఏమీలేదు.

రచయిత, అంటే నిజాయితీ గల రచయిత పేరు కోసం మాత్రమే రాయడు.

డబ్బు కోసం అసలే రాయడు.

మరెందుకు రాస్తారు.

ఎందుకా?

రాయకుండా ఉండలేరు కనక రాస్తారు!

అందుకే తనూ రాశాడు.

కాని ఈ రోజు ఏమైంది?

తనను రాయమని ఎవరూ అడగడంలేదు.

పత్రికలు పెరుగుతున్నాయి.

రచయితలూ పెరుగుతున్నారు.

మేధావులూ, బాగా చదివినవాళ్లూ ఈనాటికీ తనను గొప్ప రచయితగా గుర్తిస్తూనే ఉన్నారు.

లాభం? ఆ గుర్తింపు తనకు తిండి పెడుతుందా?

తన ఆకలి తీరుస్తుందా?

తన భార్యా బిడ్డల పొట్టలు నింపుతోందా?

తను ఇంకా రాస్తూనే ఉన్నాడు.

ఓపిక లేకపోయినా రాస్తూనే ఉన్నాడు.

రాసి, అభిమానం చంపుకొని, పబ్లిషర్ దగ్గరకెళ్ళి రాత ప్రతిని సమర్పించుకొని ఏ వందో, రెండొందలో తెచ్చుకొంటున్నాడు. వాళ్లు తన పుస్తకాలు వేస్తూనే ఉన్నారు. తనకు ప్రత్యేక పాఠకులున్నారని తనకూ తెలుసు. అయినా పబ్లిషర్ తనమీద జాలిదల్చి అచ్చువేస్తున్నట్టు ముఖం పెట్టి అయిష్టంగా ఓ రెండొందలు అందిస్తాడు.

తనకు అభిమానంతో అక్కడి కక్కడే చచ్చిపోవాలనిపిస్తుంది.

కాని తనమీద ఆధారపడిన ఆ ఇల్లాలు, ఆమె వెనక ఉన్న ఆ నలుగురు సంతానం అనబడే సైన్యం ఏం కావాలి? రెండోవాడు తెలివైనవాడు. ఈ కొంపలో ఉంటే పొట్టనిండా తిండికూడా దొరకదని వాడు అర్థం చేసుకొన్నాడు. ఇలాంటి కుటుంబాల్లో సంప్రదాయాల పేరుతో ఉండే హిపోక్రసీని కూడా తెలుసుకొన్నాడు. అందుకే పద్దెనుగేళ్ళ

పూర్తి అవకుండానే వెళ్ళిపోయాడు. ఎక్కడ ఉన్నాడో తెలియదు. ఏం చేస్తున్నాడో తెలీదు. ఇక్కడ ఈ ఇంట్లోకంటే సుఖంగానే ఉండివుంటాడని తన నమ్మకం. అందుకే వాడి గురించి తను పెద్దగా ఆలోచించడు. కృష్ణవేణి మాత్రం వాడ్ని తల్చుకొని ఏడుస్తూ ఉంటుంది.

"వెలుగు–చీకటి" సంపాదకుడికి అతనికి నచ్చే నవల, పాఠకులు మెచ్చే నవల ఇస్తానని ఐదు వందలు అడ్వాన్సు తెచ్చుకున్నాడు ఇరవై పేజీలు రాశాడు. అంతే! జబ్బు పడ్డాడు. పది లంఖణాలు చేశాడు.

నిన్ననే పథ్యం తీసుకొన్నాడు.

తన భార్యకు తన మీద ఇంకా ప్రేమ చావలేదు.

ఇంకా తనను గొప్పవాడిగానే గుర్తిస్తుంది.

ఆడవాళ్ళలో ఉన్న ఈ బలహీనతే వాళ్ళపరంగా అభిశాపం అయింది.

ఇంత సహనమా?

ఒకోసారి తనకు తన భార్యమీద బోలెడంత కోపం వస్తుంది.

ఆమె సహనం మీద కోపం వస్తుంది.

ఆమె ఎదురు తిరగదేం?

తన అసమర్థతను ఎత్తి చూపదేం?

"నీ రాతలు ఇక చాలు!. కూలిచేసైనా కన్నందుకు పిల్లలకు తిండిపెట్టు" అని తన భార్య అంటే ఎంత బాగుండును అని అనిపించేది తనకు.

ఒకనాడు తను తన భార్యను రాణీ అని పిల్చేవాడు.

ఆనాడు ఆమె సర్దాగా సాదాదుస్తుల్లో ఉన్న రాణీలాగే ఉండేది.

ఇప్పుడు ఆమెను అలా పిల్చే ధైర్యం తనకు లేదు.

అలా పిలవడంవల్ల తను ఆమెను ఎగతాళి చేస్తునట్లుగా ఉంటుందేమోనని భయం.

తనకు ఆమె ముఖంలోకి తిన్నగా చూసే ధైర్యం కూడా ఈనాడు లేదు.

నలభై నిండిన ఆమె అరవై నిండుతున్నట్టుగా కన్పిస్తోంది.

దానికి కారణం ఎవరు?

తనే! తన అసమర్థతే!

కమిట్‌మెంటు అంటూ మడికట్టుకొని కూర్చుని తను నిజంగా ఏమైనా సాధించాడా?

తనూ కాలంతోపాటు రచనల ధోరణి మారుస్తూ, చెత్త కథల పోటీలలో సైతం పాల్గొంటే తనకీరోజు ఈ బాధ ఉండేదా?

ఏంలేకపోయినా రచయితగా సంపాదించుకొన్న ఈగో మాత్రం తనకు మిగిలింది.

ఇంట్లో బియ్యం లేకపోయినా పట్టించుకోడు.

ఆడపిల్ల ఓణీలు చిరిగిపోయినయ్ అని భార్య చెప్పినా వినిపించుకోడు. అందుకే ఆమె అసలు తనకు ఇలాంటివి చెప్పదు.

విని తనేం చెయ్యగలడు?

ఎవరిముందుకెళ్ళి చెయ్యి చాచగలడు?

ప్రాణ స్నేహితుల్ని కూడా అప్పు అడగలేడు.

ఒకప్పుడు తను బాగా ఉన్న రోజుల్లో చాలా మందిని ఆదుకున్నాడు. అందులో చాలామంది ఇప్పుడు బాగానే ఉన్నారు.

తన పరిస్థితి తెలిసీ వాళ్ళు తనకు ఇవ్వాల్సింది కూడా ఇవ్వరు.

తనకు మొహమాటం అని తెలుసు.

అందరూ తనకు మొహమాటం లేదనీ, ముక్కుకు సూటిగా వెళ్ళే వ్యక్తి అనీ అంటారు. అదీ నిజమే!

కాని డబ్బు దగ్గరే, తొంభయ్ తొమ్మిది మందికి ఉండని విషయంలోనే, తనకు మొహమాటం!

మరి దీన్నేమంటారు?

హిపోక్రసీ కాదా?

ఏమో! తనకే తెలియదు.

అతని ఆలోచనలు మందగిస్తున్నాయి.

బుర్రలోని ధ్వనులు అలసిపోయాయి.

కాంపోజ్ పనిచేస్తోంది.

నిద్రలోకి జారిపోయాడు.

# 5

శివప్రసాద్ రచయిత అని వేరుగా చెప్పక్కర్లేదు.

దాదాపు పాతికేళ్ళకు పైగానే రాస్తున్నాడు.

అతడు తన మేధను కరిగించి, ప్రతి రక్తంబొట్టునూ కార్చి రాసిన రచనలతో ఎందరో డబ్బు చేసుకొన్నారు.

అతనికి నిత్యావసరాలకు ఇబ్బంది లేకుండా గడిచిపోయింది.

మంచి కీర్తి కూడా వచ్చింది.

బాగా చదువుకున్నవాళ్ళ మన్ననలను ఈనాటికీ పొందుతూనే ఉన్నాడు.

సాహిత్యాన్ని ఒక సామాజిక శక్తిగా గుర్తించి రచనలు చేశాడు.

శివప్రసాద్ ఇంటర్ చదువుతున్న రోజుల్లోనే చిన్న చిన్న కథలు వ్రాయడం ప్రారంభించాడు.

కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో 1946 నుంచి 1951 వరకు తెలంగాణాలో సాగిన సాయుధ పోరాటం, సాహిత్య సాంస్కృతిక సంచలనం ప్రజల జీవితాలను ప్రభావితం చేసింది. చాలా మంది రచయితలు ఆ పోరాటం ద్వారా ప్రభావితులై రచనలు చేశారు. దాదాపు అన్ని కళారూపాలనూ విప్లవోద్యమ ప్రయోజనానికి విరివిగా వినియోగించుకోవడం జరిగింది.

ఆ సాహిత్యాన్ని క్షుణ్ణంగా చదివాడు.

"మా భూమి, ముందడుగు" లాంటి నాటకాలను కాలేజీల్లో ప్రదర్శించి శివప్రసాదు నటించాడు.

ఫలితంగా బి.ఏ. మొదటి సంవత్సరంలోనే కాలేజీ నుంచి డీబార్ అయాడు.

అతను ఆళ్వారుస్వామి "ప్రజల మనిషి"ని ఎన్నోసార్లు చదివాడు.

ఉన్నవవారి "మాలపల్లి" అతడ్ని ప్రభావితం చేసింది. ఒక భక్తుడు భగవద్గీతను చదివినట్లు 'మాలపల్లి'ని ఎన్నోసార్లు చదివాడు.

గురజాడ, శ్రీశ్రీ ఆయనకు ఆరాధ్యులు.

భూస్వామ్య వ్యతిరేక ప్రజాస్వామిక సాహిత్యాన్ని సామ్యవాదోన్ముఖంగా తీసుకెళ్ళి, తెలుగువాళ్ళ సాంస్కృతిక పురోగమనానికి దోహదం చేసిన ఉత్తమ సాహిత్య స్రష్ట కొడవటిగంటి కుటుంబరావుగారికి ఏకలవ్య శిష్యుడుగా మారాడు.

చలంలోని తిరుగుబాటు ధోరణిని ఆకళింపు చేసుకొన్నాడు.

గోపీచందు రచనలలోని ప్రాతలను తన చుట్టూ చూశాడు.

సాహిత్య ప్రయోజనం "ఆనందం" అనీ, అదే సార్వకాలిక, సార్వజనీన, విశ్వజనీన ప్రయోజనం అని చెప్పేవాళ్ళను ఛాందసులుగా చూశాడు. వాళ్ళను మానవ జాతికే శత్రువులుగా భావించాడు.

ప్రాచీన భారతీయ విమర్శకులందరూ దాదాపు 'నియతికృత' 'నియమరహిత'మైన 'ఆనంద నిష్యందత'ను సాహిత్య ప్రయోజనంగా భావించేవారు. అది కేవలం వారి భ్రమ మాత్రమేనని వాదించేవాడు.

రెవెన్యూ ఇన్‌స్పెక్టర్‌గా ఉద్యోగంలో చేరాడు.

ఉద్యోగంలో ఉన్నప్పుడే అతను వివాహం చేసుకొన్నాడు.

పెద్దలకు ఇష్టంలేని వివాహం చేసుకొన్నాడు.

కులాంతర వివాహం, కట్నం లేకుండా చేసుకొన్నాడు.

ఫలితంగా తనవాళ్ళకు దూరం అయ్యాడు.

పెద్ద ఆర్భాటం లేకుండా స్నేహితుడి చెల్లెల్ని నలుగురు స్నేహితుల మధ్య ఐదు రూపాయల ఖర్చుతో పెళ్ళి చేసుకొన్నాడు.

కృష్ణవేణి అపురూప సౌందర్యవతి.

రూపానికి తగిన గుణం.

పెద్దగా చదువుకోకపోయినా భర్త ఆదర్శాలను అర్థం చేసుకోగల సంస్కారం ఆమెకుంది.

ఆమెకు తన భర్త పెద్ద రచయిత కావాలని కోరిక. భర్తను ఏనాడూ చీరెలకూ, నగలకూ వేధించలేదు.

ప్రభుత్వ ఉద్యోగంలో అతనికి ఊపిరాడటం లేదు.

అది అతని ఆలోచనలకు కళ్లెం వేసింది.

అతని కలానికి సంకెళ్ళు వేసింది.

"రాణీ! ఉద్యోగానికి రాజీనామా ఇవ్వాలనుకొంటున్నాను" అన్నాడు ఒక రోజు భోజనం చేస్తూ, భార్యతో.

"చెయ్యండి!"

అతను చివ్వున తలెత్తి ఆమె ముఖంలోకి చూశాడు.

"మనస్ఫూర్తిగా అంటున్నావా?"

"ఎందుకు సందేహం వచ్చింది? ఎన్నో పాత్రలను వాస్తవ వ్యక్తులా అన్నంత సహజంగా సృష్టించిన మీరు నన్ను అర్థం చేసుకోలేకపోయారన్నమాట!" ఆమె కంఠం ప్రశాంతంగా పలికింది.

శివప్రసాద్ సిగ్గుపడిపోయాడు.

"సారీ, రాణీ!" అన్నాడు.

ఆమె హాయిగా నవ్వింది.

"నేను అదృష్టవంతుడ్ని!"

ఆమె పక పక నవ్వింది.

ప్రసాద్ అయోమయంగా భార్య ముఖంలోకి చూశాడు.

ఎందుకు నవ్వుతోంది?

ఆమె చెప్పినదాన్ని తను నమ్మినందుకా?

అంటే - రాజీనామా చెయ్యడం ఆమెకు ఇష్టం లేదా?

"ఏమిటాలోచిస్తున్నారు?"

"ఎందుకు అలా నవ్వావు?"

"ఇదెప్పటినుంచి మీకు పట్టుకుందా అని నవ్వాను."

"ఏమిటి?"

"అదృష్ట దురదృష్టాల మీద నమ్మకం!"

"ఓ - అదా?" గుండెల నిండా గాలి పీల్చుకున్నాడు రిలీఫ్‌గా.

"జన్మలో వచ్చిన సంస్కార దోషం! వీటిని నమ్మనివాళ్ళు చాలామంది ఈ మాటల్ని ఉపయోగిస్తారు."

ఆమె హాయిగా నవ్వింది.

అతని మనసు వెన్నెల్లో విరగబూసిన మల్లెపందిరి అయింది.

"ఉద్యోగం మానేస్తాను. నా రచనల మీద వచ్చే పారితోషికం మనం బ్రతకడానికి చాలు. కాని ముందు ముందు నా రచనలకు డిమాండ్ తగ్గి...ఆర్థిక ఇబ్బందులు వస్తే...నువ్వు నిలబడగలవా?"

ఆమె ముఖంలోకి పరిశీలనగా చూశాడు.

"నా గుండె అంత బలహీనమైనదా?" ఆమె ఎదురుప్రశ్న వేసింది.

ఆమె ముఖంలోకి చూశాడు.

అదే ప్రశాంతత! అదే ఆత్మనిబ్బరం!

ఆ రాత్రి ప్రసాద్ ఆదమర్చి నిద్రపోయాడు.

తెల్లవారి ఆఫీసుకెళ్ళి రాజీనామా పత్రం రాసి ఇచ్చాడు.

కొందరు స్నేహితులు అతనికి ఆ పని చెయ్యొద్దని హితబోధ చేశారు.

ప్రసాద్ ఎవరి సలహానూ పట్టించుకోలేదు.

# 6

శివప్రసాద్ రచనలోనే తన కాలాన్నీ మనసునూ నిమగ్నం చేశాడు.

సామాజిక అవగాహనతో సంఘ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని రచనలు చేశాను.

కమిట్‌మెంటూ, నిజాయితీ లేని రచయితల్ని సంఘద్రోహులుగా గాఢంగా నమ్మాడు.

ఉపన్యాసాలలో అదే చెప్పాడు.

తనకు తెలిసిన జీవితం గురించే రాశాడు.

మైకాగని కార్మికుల గురించి రాయడానికి వారి దగ్గర ఆరు నెలలు, వారితోపాటు జీవించాడు.

ఆ నవల సాహిత్య లోకంలో ఎంతో సంచలనాన్ని కలిగించింది.

గతితార్కిక భౌతిక వాదాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకొని, ఈ దోపిడీ వ్యవస్థ మారితేగాని, పీడితుల సమస్యలకు పరిష్కారం లేదనే ఆలోచనా తరంగాలను పాఠకుల బుర్రల్లో రేకెత్తించిన ఘనత శివప్రసాద్‌కు లభించింది.

శ్రమ శక్తి ఎంత దారుణంగా దోచుకోబడుతుందో, పెట్టుబడిదారీ విధానంలో శ్రమజీవుల మనుగడ ఎంత బాధాకరమైనదో ఆ నవలలో ఆవిష్కరించాడు.

సాహిత్యం సాంఘిక చైతన్యంలో ఒక శాఖ అని అతని నమ్మకం.

సజీవంగా ఉండటానికి మానవుడు ఊపిరి పీల్చుకోవడం ఎంత అవసరమో, సజీవమైన సంఘానికి చైతన్యం అంత అవసరం అని అతనికి తెలుసు.

ఆ చైతన్యాన్ని కలిగించే రచనలే సమాజానికి ప్రయోజనాన్ని అందిస్తాయి.

చాలాకాలం అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యుడుగా ఉన్నాడు.

అది రెండుగా చీలింది.

అందులోనుంచి చీలిన మరికొందరు తీవ్రవాదులుగా మారారు.

అతను సంఘాలతో సంబంధాలను వదులుకొన్నాడు.

రచయితలు, ఒక ప్రయోజనాన్ని ఆశించి అవగాహనతో రాసే రచయితలు, మీ అవగాహన తప్పంటే - మీ అవగాహన తప్పని ఒకర్నొకరు దుమ్మెత్తి పోసుకోవడం అతనికి నచ్చలేదు.

అతను స్వతంత్రంగా ఉంటూ ఎన్నో రచనలు చేశాడు.

పీడితుల విముక్తి కోసమే రచనలు చేశాడు.

క్రమంగా అభ్యుదయ రచయితలు పాఠకుల్ని ఆకర్షించడంలో అపజయం పొందసాగారు.

గత ఐదారేళ్ళుగా సాహిత్యపు ట్రెండు పూర్తిగా మారిపోయింది.

పత్రికల సంఖ్య పెరిగింది.

రచయితల సంఖ్యా పెరిగింది.

రచయితల్లో సీరియస్‌నెస్ తగ్గింది.

ఒక కమిట్‌మెంటు అంటూ లేకుండా పాఠకులకు చాక్లెట్లూ, బిస్కత్తులూ తినిపించసాగారు.

జొన్నరొట్టె బిస్కత్తులంత రుచిగా ఉండదు.

కాని ఆకలి తీరాలంటే జొన్నరొట్టే తినాలి.

శివప్రసాద్‌లాంటివాళ్ళు వేదికల మీదనుంచి అడపా దడపా కేకలు పెట్టినా ఎవరూ వినిపించుకొనే పరిస్థితిలో లేరు.

సాహిత్య సింహాసనంమీద ప్రణయదేవతను ప్రతిష్టించారు రచయితలు, ముఖ్యంగా రచయిత్రులు.

పత్రికలూ, పాఠకులూ ఆ దేవతా పూజలో పడి, వాస్తవాన్ని చూడడం మానేశారు.

ఎవరన్నా "ఇది వాస్తవం" అని చెప్పడానికి ప్రయత్నించినా వినడానికి మానేశారు.

చాలాకాలం ప్రణయదేవతే తెలుగు సాహిత్యాన్ని తన చెప్పుచేతల్లో పెట్టుకుంది. ప్రణయకథల రచయితల్నీ, రచయిత్రుల్నీ కూడా పాఠకులు దేవతల్లాగే చూశారు.

కొందరు కాలంతోపాటు ప్రయాణం సాగించారు.

కమిట్‌మెంట్ ఉన్నవాళ్ళు అడపా దడపా రాసినా రెమ్యూనరేషన్ రాని పేపర్లలో మాత్రమే ఆ రచనలు వస్తాయి.

ఆ సమయంలో నిరాశా నిస్పృహలకు లోనైన ప్రతివాళ్ళూ రచయిత్రుల మీద విరుచుకుపడ్డారు.

శివప్రసాద్ కూడా అవకాశం దొరికినప్పుడల్లా, ఆ అవకాశాన్ని జారవిడుచుకోకుండా రచయిత్రులను దుమ్మెత్తిపోశాడు.

శివప్రసాద్‌కు కష్టాలు ప్రారంభం అయ్యాయి.

దరిద్ర దేవత అతని నట్టింట్లో తిష్టవేసింది.

కూతురికి పెళ్ళి ఈడొచ్చింది.

పెద్దకొడుకు బి.ఏ. పూర్తిచేసి, ఉద్యోగంలేక ఏదో ప్రెస్‌లో పనిచేస్తున్నాడు. వచ్చే నాలుగు వందల్లో రెండు వందలు మాత్రమే ఇంట్లో ఇస్తాడు సూర్యం.

ఆడపిల్ల పది పూర్తిచేసి ఇంట్లో కూర్చుంది.

రెండోవాడు పారిపోయాడు ఇల్లు వదిలి.

ఆఖరివాడు ఎనిమిది చదువుతున్నాడు.

కూతురు కమల ఎప్పుడూ నవలలు చదువుతూనే ఉంటుంది. అన్నీ ప్రేమ నవలలే. శివప్రసాద్ వద్దన్నా మానదు. పిల్లలకు తండ్రంటే లక్ష్యం లేదు. సంపాదించని తండ్రి అంటే ఏ పిల్లలు గౌరవిస్తారు? ఆ మాటకొస్తే భార్యా గౌరవించదు. కాని

అలా కాదు. భర్తకు ఏమాత్రం బాధ కలక్కుండా చూడాలని శాయశక్తులా జాగ్రత్త తీసుకొంటున్నది.

ఇంటి పరిస్థితులు చూసి రెండు మూడు సార్లు అతనికీ ప్రేమనవలలు వ్రాయాలనిపించింది. కాని మనసు చంపుకొని ఎదిగీ ఎదగని మనసులకు, చూస్తూ చూస్తూ మత్తుమందును సరఫరా చెయ్యలేకపోయాడు.

ఒకరోజు శివప్రసాద్ కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ఏం చెయ్యాలి? ఏదో చెయ్యాలి? కూలి చేసుకొని అయినా బతకాలి. అంతేగాని, సాహిత్యం పేరుతో విషాన్ని సరఫరా చెయ్యలేడు.

తను నిజంగా కూలిపని చెయ్యగలడా?

ఈ వయసులో? పైగా, కాయకష్టానికి అలవాటుపడని శరీరం!

"భోజనానికి రండి!" భార్య పిల్చింది.

"ఆకలిగా లేదు." అన్నాడు ప్రసాద్.

శివప్రసాద్‌కు ఆకలిగా ఉంది. అయినా లేదన్నాడు.

"ఆకలిగా లేకపోవడం ఏమిటి? రాత్రి కూడా జ్వరంగా ఉందని తినలేదు. రండి!"

శివప్రసాద్ లేచాడు.

వంటింట్లో పీటమీద కూర్చున్నాడు.

ముద్ద నోట్లో పెట్టుకోబోతూ ఆగాడు.

తలెత్తి భార్య ముఖంలోకి చూశాడు.

"పిల్లలంతా తిన్నారా?"

"ఆఁ."

"నువ్వూ?"

అదేం ప్రశ్న అన్నట్టు చూసింది.

తన ప్రశ్న తననే వెక్కిరించినట్టుగా అన్పించింది శివప్రసాద్‌కు.

"నువ్వూ పెట్టుకో!" అన్నాడు.

గత పదేళ్లుగా భార్యను రాణీ అని పిల్చే ధైర్యం అతనిలో లేదు. అలా పిలిస్తే ఆమె పలకదు అనికాదు.

తెల్లవారి లేస్తే చేట పట్టుకొని, అభిమానాన్ని చంపుకొని ఇరుగు పొరుగు ఇళ్ళకు బియ్యం అప్పు అడగడానికి వెళ్ళే భార్యను 'రాణీ' అని పిలవడం హాస్యాస్పదంగా ఉంటుందనిపించేది అతనికి.

భార్యను చూశాడు సాలోచనగా.

ఈ మధ్య మరీ ఇంత చిక్కిపోయిందా?

అస్థిపంజరానికి చర్మం బిగించి కుట్టినట్టుగా ఉంది.

"తినండి!"

"నువ్వూ పెట్టుకో!"

"నేను తర్వాత తింటాను."

"అలా వీల్లేదు."

ఆమె లేవలేదు.

శివప్రసాద్ లేచాడు.

గిన్నెల దగ్గరకు వెళ్తుంటే భార్య వారించబోయింది.

అతను గిన్నెల మూతలు తీసి చూశాడు.

అన్నీ ఖాళీగా అతని ముఖంలోకి వెక్కిరింపుగా చూశాయి.

గదిలో నుంచి విసురుగా వెళ్ళిపోతున్న భర్త చెయ్యి పట్టుకొన్నది. ఆమె కళ్ళు చమర్చి ఉన్నాయ్.

"నన్ను వదులు!"

"అన్నం తినండి!"

"అది అన్నం కాదు - విషం!" అరిచాడు ప్రసాద్.

కృష్ణవేణి అయోమయంగా చూసింది.

"నాకు విషం పెడుతున్నావు గదూ?"

ఆమె తృళ్ళిపడింది.

"నువ్వు తినకుండా నాకు పెడ్తున్నావా? ఎంతకాలంగా ఇలా చేస్తున్నావ్?"

"ఇవ్వాళే!"

"బియ్యం లేవా? మరి చెప్పలేదేం?"

కృష్ణవేణి అతని ముఖంలోకి చూసింది.

తన ప్రశ్న తననే వీపుమీద చరిచినట్టు అయింది శివప్రసాద్‌కు.

చెప్పాలా? బియ్యం లేవని చెప్పాలా? ఎన్నోసార్లు చెప్పింది. చెప్పినప్పుడల్లా తనేం చేశాడు? విసుక్కున్నాడు. అరిచాడు. కొంపవదిలేసి వెళ్ళిపోతానన్నాడు.

అన్ని మాటలూ కోపంతోనే అన్నాడు.

ఆ కోపం భార్యమీద కాదు.

తన మీద!

తన అసమర్థత మీద!

అవును, చెప్పినా ఎక్కడ్నుంచి తెస్తాడు?

"పద, కూర్చో!" భార్య రెక్క పట్టుకొని కూర్చోబెట్టాడు. తన పళ్ళెంలో అన్నం కలిపి మొదటి ముద్ద భార్య నోటికి అందించాడు.

ఆమె సిగ్గుపడుతూనే నోరు తెరిచింది.

ఇద్దరూ కలిసి భోజనం చేశారు ఒకే పళ్లెంలో.

సగం ఆకలి తీరింది ఇద్దరికీ.

"బియ్యం ఎక్కడ తెచ్చావ్?"

"పక్కింటి పిన్నిగారు, ముందు విసుక్కొని లేవన్నది. తీరా, తిరిగి వస్తుంటే వెనక్కు పిల్చి ఇచ్చింది."

ఆ దృశ్యాన్ని ఊహించుకొన్నాడు.

తన భార్య మానసిక పరిస్థితిని ఊహించుకొని కంపించిపోయాడు.

ఆమెను ఇంత దారుణమైన మానసిక దుస్థితికి తను గురి చేస్తున్నాడా?

నో! నో! ఇక తన భార్య ఖాళీ చేటతో పక్కింటికి సగంచచ్చి వెళ్ళకూడదు. తలదించుకొని అప్పులు అడగకూడదు.

ఆమెను తను బ్రతికించుకోవాలి.

అది తన బాధ్యత.

కొద్దిరోజుల క్రితం కూతురు అన్న మాటలు గుర్తొచ్చాయి.

"నాన్నా! అందరిలా నువ్వూ ప్రేమకథలు రాయకూడదూ?"

తను ఆ పిల్లకు ఏం సమాధానం చెప్పాలో తోచక తికమక పడ్డాడు.

"ఈ రోజుల్లో నీ బోరింగ్ కథ లెవరిక్కావాలి? నువ్వు కథలు రాస్తావని మా జనరేషన్‌వాళ్లకు చాలామందికి తెలియదు."

శివప్రసాద్ ఒక వెర్రినవ్వు నవ్వాడు.

"పేరు సంగతి ఎలా వున్నా డబ్బులైనా వస్తాయ్‌గా! ఆ సౌభాగ్యవల్లికి, సుందరమ్మకూ నవలకు పదివేలదాకా ఇస్తారటగా? నువ్వూ రాయి డాడీ!" కటిక దారిద్ర్యంలో బతుకుతున్న ఆడపిల్ల అభ్యర్థన.

"ఛ! ఏమిటే ఆ మాటలు? మీ నాన్న ఎంత గొప్ప రచయిత? ఆయన ప్రేమకథలు రాస్తే అందరూ నవ్వరూ? శిఖరాగ్రంమీద నుంచి మురుక్కాలవలోకి దూకమంటావా?" తల్లి కూతుర్ని మందలించింది.

"మహా గొప్పరచయిత!" ఈసడింపుగా అని అక్కడ్నుంచి విసురుగా వెళ్ళిపోయింది కూతురు.

"బాధపడుతున్నారా? చిన్న సన్నాసి! ఏదో అన్నది!" భార్య భర్తకు సర్ది చెప్ప బోయింది.

"బాధా? ఎందుకూ? ఉన్నమాటే అన్నది!" అన్నాడు అతను.

ఆ రాత్రి అర్ధరాత్రి దాకా ఆలోచించాడు.

ఒక నిర్ణయానికి వచ్చాడు.

తన రచనలు ఎవర్ని ప్రభావితం చేశాయో, ఒక్క వ్యక్తినైనా మార్చగలిగాయో లేదో తనకు తెలియదు.

తన భార్య బిడ్డలు ఆకలి చావులు చావకూడదు.

తను రాయాలి.

రాత్రింబవళ్ళు కష్టించి వ్రాయాలి.

ప్రేమకథలు రాయాలి.

రాసి బాగా డబ్బు సంపాదించాలి.

అంతరాత్మ లేవబోయింది.

"నువ్వు నోరు మూసుకొని పడి ఉండు" అని దాని నెత్తిన చాలా పెద్ద దెబ్బే కొట్టాడు. దానికి ఇప్పట్లో లేచే శక్తి లేకుండా కొట్టాననుకొన్నాడు.

నిద్రపట్టడం లేదు.

తెల్లవారితే తన నిర్ణయం మారొచ్చు!

మూర్ఛపోయిందనుకొంటున్న అంతరాత్మ మళ్ళీ లేవవచ్చును. అంతరాత్మకు జాలి ఉండదు. తన ధోరణి తనది.

ఇప్పుడే ప్రారంభించాలి.

ఈ క్షణంలోనే ప్రారంభించాలి.

శివప్రసాద్ శివం ఎక్కినట్టుగా మంచంమీదనుంచి దూకాడు.

బల్ల దగ్గరకు వెళ్ళాడు.

సొరుగులో నుంచి కాగితాలు లాగాడు.

పెన్ అందుకొన్నాడు.

# 7

"పండి ఒరిగి ఉన్న బంగారు వడ్లకంకులు పిల్లగాలులకు తలలు ఊపుతున్నాయి.

పశ్చిమాన సూర్యుడు అస్తమిస్తూ సంధ్యాదేవి ముఖానికి కుంకుమ దిద్దుతున్నాడు.

చల్లగా మెల్లగా వీస్తున్న గాలి చిత్రమైన సువాసనను వెదజిమ్ముతూ ఉంది.

ఊరు వెలుపలి చెరువుగట్టున కూర్చున్న శ్రీహర్ష రాబిన్ కుక్ రాసిన ఫీవర్ చదువుతున్నాడు. తనకు ఆ పుస్తకం అంతకుముందే ఎక్కడో చదివినట్టుగా అన్పించసాగింది.

శ్రీహర్ష ఇంగ్లీషు నవలలతోపాటు తెలుగు నవలలు కూడా చదువుతాడు.

ఈ పుస్తకంలోని ప్రతి పాత్ర, ప్రతి సంఘటనా ఎక్కడో చదివినట్టే ఉంది. రాబిన్ కుక్ ఎవర్నయినా కాపీ కొట్టాడా? ఎవర్ని? ఎవర్ని?

ఛ- రాబిన్ కుక్ కాపీ కొట్టడం ఏమిటి?

శ్రీహర్షకు పల్లెజీవితం తెలియదు. సెలవలకు ఆ ఊళ్ళో గడపడానికి వచ్చాడు. ఆ ఊరి షావుకారు రామయ్య కొడుకు చిట్టిబాబు శ్రీహర్ష సహపాఠ మిత్రుడు.

రెండు రోజులు ఉండి వెళ్ళిపోవడానికి వచ్చినవాడు, ఆ పల్లె సౌందర్యానికి ముగ్ధుడై మరో పదిరోజులు ఉండాలనే నిర్ణయించుకొన్నాడు.

అకస్మాత్తుగా కోకిల కూత విన్పించింది.

శ్రీహర్ష పుస్తకం మూసి ఆ మధుర శబ్దం వినసాగాడు.

అది కోకిల కూత కాదు.

కోకిల కంఠంలోని మాధుర్యాన్ని నింపుకొన్న ఒక స్త్రీ కంఠం.

"సౌసాల్ పహలే ముజెతుమ్ సే ప్యార్ థా

ఆజ్‌భీ హై, కల్‌భీ రహేగా!"

శ్రీహర్షకు ఆ పాట అంటే చాల ఇష్టం!

కాని, ఆ పాట ఈ పల్లెలో విన్పించడం ఏమిటి? సినిమాల ప్రభావం పల్లెలమీద, పట్నాలకంటే ఎక్కువగా ఉందని విని తను నమ్మలేదు.

ఆ కంఠంలో నుంచి ఓ మంచి జానపద గేయం వస్తే ఎంత సహజంగా ఈ వాతావరణానికి నప్పుతుంది!

ఆలోచిస్తున్న అతని నుదురును ఏదో ఉసిగా వచ్చి తగిలింది.

"అబ్బా!" అంటూ నొసలు రుద్దుకున్నాడు.

నిముషంలో బొప్పి కట్టింది.

పక్కనే పడివున్న గులకరాయి తీసుకొని లేచాడు.

ఆ పాట ఇంకా విన్పిస్తూనే ఉంది.

ఆ పాట విన్పించే వైపుకు నడిచాడు.

పొలం మధ్యలో మంచెమీద ఓ పదహారేళ్ళ పల్లెపడుచు నిల్చుని ఉంది. ఆమె పాడుతోంది. చేతిలోని వడిసెలతో పిట్టల్ని తోలుతోంది.

శ్రీహర్షను చూసి ఆమె పాట ఆపింది.

మంచెమీద నుంచి లేడిపిల్లలా ఒక్క గెంతులో దూకింది. శ్రీహర్ష ముందుకొచ్చి నిల్చుంది. కళ్ళు వెడల్పు చేసుకొని చూసింది. అంతలోనే ఆ పెద్ద పెద్ద రెప్పల్ని టపటప లాడించింది.

"నా పాట వినడానికి వచ్చావా?" శ్రీహర్షను అడిగింది.

"కాదు."

"నా పాట బాగా లేదా?"

"నీ గొంతు చాలా బాగుంది."

"అయితే మళ్ళీ పాడనా?"

"అక్కర్లేదు."

"మరెందుకొచ్చావ్?" ఆమె పెద్ద పెద్ద కళ్ళలో నిరాశ కన్పించింది.

"ఇది ఇచ్చి వెళ్దామని."

"ఏమిటది?"

"చేయి చాపు."

చేయి చాపి "కళ్ళు మూసుకోవాలా?" అని అడిగింది.

"అక్కర్లేదు" అంటూ గులకరాయి ఆమె అరచేతిలో పెట్టాడు.

తన చేతిలోని రాయికేసి చూసింది.

కళ్లెత్తి అతని ముఖంలోకి చూసింది.

నుదుటిమీద బొప్పిని చూసింది.

"అరే, మీకు తగిలిందా? నేను కొట్టాలని కొట్టలేదు." బెంగగా అన్నది.

"ఆ సంగతి నాకు తెలుసు."

అని గిర్రున వెనక్కు తిరిగి వెళ్ళి తను అంతకుముందు కూర్చున్న స్థలంలో కూర్చున్నాడు.

చిరు గజ్జల సవ్వడి!

గాజుల గలగల!

పుస్తకంలో నుంచి తలెత్తి చూశాడు.

మంచెమీది పిల్ల ఎదురుగా నిల్చుని ఉంది.

"ఎందుకొచ్చావ్?"

"ఇదివ్వడానికి."

రాయినీ, వడిసెలనూ చూపిస్తూ అన్నది.

"అవి నాకెందుకూ?"

"నన్ను కొట్టడానికి!"

"నిన్ను నేనెందుకు కొట్టాలి?"

"మరి నేను నిన్ను కొట్టాగా?"

"ఓ అదా! నిన్ను కొట్టినందువల్ల నాకేమొస్తుంది? నాకు తగిలిన దెబ్బ పోతుందా?"

"కోపం పోతుంది."

"నాకు కోపం వచ్చిందని చెప్పానా?"

"నాకే తెలిసింది."

అతను ఆమె సౌందర్యాన్ని చూస్తూనే ఉండిపోయాడు.

"నీ పేరేంటి?"

"శ్రీహర్ష!"

"అదేం పేరు, నోరు తిరక్కుండా!"

శ్రీహర్షకు నవ్వొచ్చింది. తనకా పేరు పెట్టినప్పుడు తన నాయనమ్మ కూడ ఆ మాటే అన్నదట! నాన్న చెబ్తూ ఉంటాడు.

"పెద్దవాళ్ళు పెట్టారు."

"బాగా లేదు. వేరే పెట్టుకో!"

"ఏం పెట్టుకోమంటావు! పోచయ్య అని పెట్టుకోనా?"

"ఛ! నాగేశ్వర్రావు అని పెట్టుకో!"

శ్రీహర్ష పకపక నవ్వాడు.

"నువ్వు సినిమాలు బాగా చూస్తావా?"

"ఓ! ఏసంకాలంలో మా ఊళ్లో టూరింగ్ టాకీస్ వస్తదిగా?"

"హిందీ సినీమాలు బాగా చూస్తావా?"

"ఓ!" కళ్ళు తిప్పుతూ అంది.

"నీ పేరు చెప్పలేదు."

"నువ్వడిగావా ఏమిటి?" బుంగమూతి పెట్టింది.
"ఇప్పుడు అడుగుతున్నాగా - చెప్పు!"
"కోకిల!" పెదవులు తమాషాగా విరుస్తూ గర్వంగా చెప్పింది.
"బాగుందా?" మళ్ళీ తనే అన్నది.
"బాగుంది. నీ గొంతుకూడా కోకిల గొంతులా మధురంగా ఉంది!"
"మధురంగా - అంటే!"
"తియ్యగా ఉంది."
ఆ పిల్ల కళ్ళు మెరిపిస్తూ చూసింది.
శ్రీహర్ష లేచాడు.
"అప్పుడే వెళ్తావేం?"
"చీకటి పడిందిగా?"
"మళ్ళీ రేపొస్తావా?"
"రమ్మంటావా?"
"రా! నీ దగ్గర బొమ్మలు తీసే డబ్బా ఉందా?"
శ్రీహర్షకు అర్థం కాలేదు ఓ క్షణం.
అర్థం అవగానే నవ్వొచ్చింది.
"నా దగ్గర ఆ డబ్బా లేదు."
కోకిల ముఖం చిన్నబోయింది.
"ఆ డబ్బా నీకెందుకూ?"
"నా ఫొటో తీస్తావని?"
శ్రీహర్షకు నవ్వు వచ్చింది.
"వెళ్తాను" అంటూ బయలుదేరాడు.
"రేపు తప్పకుండా రా!" వెనకనుంచి కేకపెట్టింది కోకిల.
శ్రీహర్ష సమాధానం ఇవ్వలేదు.
నిలబడలేదు.
ముందుకు సాగిపోయాడు."

❀ ❀ ❀

శివప్రసాదుకు ఆవలింత వచ్చింది.
రాయడం ఆపి, రాసిన పేజీలు చదవసాగాడు.
పరమచెత్తగా అన్పించి చింపెయ్యబోయి ఆగాడు.
ఇది బాగుందో లేదో తేల్చాల్సింది తను కాదు.
రేపు కమలను చదవమంటే సరి!
శివప్రసాద్ రాసిన కాగితాలను సర్దిపెట్టి వెళ్లి పడుకున్నాడు.

రెండో ఛాప్టర్ గురించి ఆలోచిస్తూ నిద్రపోయాడు.

# 8

శివప్రసాద్ ప్రొద్దుట ఆలస్యంగా లేచాడు.

కూతురు కాఫీ అందించింది.

"డాడీ!" ఆ పిలుపులో ఏదో కొత్తదనం విన్పించి తలెత్తి కూతురి ముఖంలోకి చూశాడు.

"నువ్వు ప్రేమ కథ రాస్తున్నావా?" ఉత్సాహంగా అడిగింది.

"చదివావా?"

"చదివాను. ప్రారంభం చాలా బాగుంది."

"ఆదిలోనే ఆకట్టుకుందా?" నవ్వుతూ అడిగాడు.

"అవును డాడీ!" ఉత్సాహంగా అన్నది.

"సీరియల్‌గా ఇస్తావా? ఏ పత్రికకు?" మళ్ళీ అడిగింది.

"పూర్తి కానివ్వు!" అన్నాడు శివప్రసాద్.

"శ్రీహర్ష రూపం వర్ణించలేదు డాడీ!"

"ఎలా వర్ణిస్తే నీకు ఇష్టమో చెప్పు!"

నేటి పాఠకులకు తన కూతురు కూడా ఒక ప్రతినిధేనని అతనికి తెలుసు. ఆమెకు ఇష్టమైతే డెబ్బయ్ శాతం పాఠకులను ఆకర్షించగలదు.

కమల చెప్పుకుపోతుంటే ఆమె కళ్ళల్లో కదులుతున్న భావాలను చూస్తూ నిట్టూర్పు విడిచాడు శివప్రసాద్.

ప్రతి ఆడపిల్లా ఈనాడు భర్తగా కోరుకునే వ్యక్తి నవలలోని హీరోలా ఉండాలని కలలు కంటోంది. కలల్ని వాస్తవాలుగా భావించి, చివరకు ఆ వాస్తవాన్ని ఎదుర్కోలేక పోతోంది.

"ఏమిటి డాడీ ఆలోచిస్తున్నారు, నేను చెప్పింది బాగాలేదా?"

"బాగుంది, చాలా బాగుంది. హీరోని అలాగే వర్ణిస్తాలే!" అన్నాడు శివప్రసాద్.

కమల సంతోషానికి అంతులేదు.

అమ్మకు చెప్పింది.

అన్నకు చెప్పింది.

తమ్ముడికి చెప్పింది.

ఇరుగుపొరుగు స్నేహితురాళ్లకు చెప్పింది, తన నాన్న ఓ బ్రహ్మాండమైన ప్రేమ నవల రాస్తున్నాడని.

శివప్రసాద్ రాత్రింబవళ్లు కూర్చుని వారం రోజుల్లో నవల ముగించాడు.

శివప్రసాద్ ఆశ్చర్యానికి అంతులేదు.

చెప్పడానికి ఏమీ లేనప్పుడు నవల రాయడం ఎంత సులభమో అర్థం చేసుకొన్నాడు.

నవల రాస్తూ ఎప్పటికప్పుడు తన కూతురి సలహా తీసుకొంటూనే ఉన్నాడు.

జనబహుళ్యాన్ని అతిగా ఆకర్షించిన ప్రేమ నవలల కథలు కూతుర్ని అడిగి చెప్పించుకొన్నాడు.

ఆ కథలు వింటున్నప్పుడు ఎన్నోసార్లు తను రాస్తున్న కాగితాలను చింపెయ్యాలనిపించింది ప్రసాద్‌కు.

కాని, ఇంటి పరిస్థితులు చూస్తూ ఆ పని చెయ్యలేకపోయాడు.

మనిషి పరిస్థితుల చేతుల్లో కీలుబొమ్మగా ఎలా మార్తాడో స్వయంగా అనుభవిస్తూ ఆలోచిస్తున్నాడు ప్రసాద్.

ప్రేమ నవల పూర్తయింది.

దానికి పేరు కూడా కమల పెట్టింది "ప్రణయసామ్రాజ్యం" అని.

కాని, ఆమెకు ముగింపు నచ్చలేదు.

మార్చమని సలహా ఇచ్చింది.

ప్రసాద్ నవ్వి ఊరుకున్నాడు.

ఆ నవల తీసుకొని 'ధరణి' ఆఫీసుకు వెళ్ళాడు.

ఆ పత్రిక ఎడిటర్ నరాల శాస్త్రి తర్వాత కబురు పంపిస్తానన్నాడు.

"ఎన్ని రోజులు పట్టుంది?" ప్రసాద్ నీరసంగా అడిగాడు.

"నేను చిన్నప్పటినుంచీ మీ అభిమానినని మీకూ తెలుసు. అందువల్లనే పాఠకులు మెచ్చకపోయినా మీ కథలు అప్పుడప్పుడు ప్రచురిస్తూనే వచ్చాను. మాదేముంది చెప్పండి? పాఠకులు ఏది కోరితే అదే ఇవ్వాలి. మా పత్రిక సేల్సు పెరగాలనేదే మా ప్రధాన ధ్యేయం" అంటూ ఉపన్యాసం ప్రారంభించాడు.

ప్రసాదుకు అతని చేతిలో ఉన్న స్క్రిప్టును గుంజేసుకొని అక్కడ్నుంచి పారిపోవాలనిపించింది.

"ఇలాంటి పరిస్థితుల్నీ, నాలాంటివాళ్ళనూ దృష్టిలో పెట్టుకొనే 'లేడి కాళ్ళు లేక కాదు, కాలం వచ్చి చిక్కింది' అనే సామెతను ప్రచారంలోకి తెచ్చారు మన పెద్దలు."

"ఇది ప్రేమ కథండీ!" అన్నాడు ప్రసాదు గొంతు తగ్గించి.

"అలాగా?" కట్ట విప్పి పేరు చూసి ఆశ్చర్యంగా ప్రసాద్ ముఖంలోకి చూశాడు.

"పేరు బాగుంది. ఈ రాత్రికే కథ చదివేస్తాను. మీరు ప్రేమ కథ వ్రాశారు కనుక మేము పాఠకులను ఆకర్షించే ప్రకటనలు కూడా ఇచ్చి ప్రచురిస్తాం" అన్నాడు సంతోషంగా.

"అయితే ఎప్పుడు రమ్మంటారు?" దాదాపు ఏడుస్తున్నట్టే అడిగాడు ప్రసాద్.

"రేపు ఉదయం రండి!" అన్నాడు శాస్త్రి.

కాళ్ళీడ్చుకుంటూ వచ్చాడు ఇంటికి ప్రసాద్.

అతనికి బాధగా ఉంది. కారణం, ఆ నవల ప్రచురిస్తారో లేదోనని కాదు - తను అలాంటి నవల రాయవలసి వచ్చినందుకు.

ఇంతకాలం దేన్ని తను మత్తు మందనీ, విషం అనీ భావించాడో, పది మందిలో అనేక వేదికల నుంచీ, అనేక కాలేజీ ఉత్సవాల్లో - ఉపన్యాసాలు దంచాడో, దాన్నే ఈనాడు తను పాఠకులకు అందిస్తున్నాడు.

ఆ రాత్రంతా విసుగ్గానే గడిపాడు.

తండ్రిని ఏదో అడగాలని వచ్చి కూతురు అతని ముఖం చూసి అడగలేక పోయింది.

రెండో రోజు మళ్ళీ ధరణి ఆఫీసుకు వెళ్ళాడు.

అతడ్ని చూడగానే శాస్త్రి ముఖం విచ్చుకొన్నది. అతని ముఖంలోని సంతోషాన్ని చూసిన ప్రసాద్‌కు మనసంతా చేదు చేదుగా అన్పించింది. అతనికి నచ్చిందంటే తను చాలా చాలా చెత్త వ్రాశాడన్నమాట!

"ప్రసాదుగారూ! మీ నవల అద్భుతంగా ఉంది. వచ్చేవారం నుంచే ప్రారంభిస్తాం. అన్ని పత్రికలకూ పంపడానికి ప్రకటనకూడా తయారుచేశాను. అయితే, మీరు ఒక పని చెయాలి."

"ఏమిటి?"

"మీరు ముగింపు మార్చాలి."

ప్రసాద్ మౌనంగా అతడి ముఖంలోకి చూశాడు.

"ట్రాజడీ వద్దండీ! చివరకు హీరో హీరోయిన్ను తన బిగి కౌగిలిలో బంధించినట్టు రాయండి."

ప్రసాద్ అతని ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

తన కూతురు కూడా అచ్చం ఇదే సలహా ఇచ్చింది.

నరాలశాస్త్రికి పాఠకుల నరాల గురించిన పరిజ్ఞానం పూర్తిగా ఉందన్నమాట! మొత్తంమీద సార్థకనామధేయుడు.

"మారుస్తారా?"

"కథంతా అసహజంగానే వాస్తవానికి దూరంగానే రాశాను. కనీసం ముగింపైనా వాస్తవానికి దగ్గరగా ఉండనివ్వండి. శ్రీహర్షలాంటి విద్యాధికుడు, శ్రీమంతుల బిడ్డా, అలాంటి పల్లెటూరి పడుచుతో ప్రేమాయణం సాగిస్తాడు కాని, పెళ్ళి చేసుకోడు!"

"అది నిజమేనండీ! ఈ రోజుల్లో వాస్తవం ఎవడిక్కావాలి? మీరు ముగింపు మారిస్తేనే మీ నవల యాక్సెప్ట్ చెయ్యగలం! కావాలంటే ఇవ్వాళే అడ్వాన్సు కూడా ఇస్తాను - పారితోషికం మూడు వేలు!" అన్నాడు.

అతని బలహీనతమీద సుత్తి దెబ్బ తగిలింది.

అంగీకరించాడు ముగింపు మార్చడానికి.

పల్లెపడుచులకు ద్రోహం చెయ్యడానికి అంగీకరించాడు.

ఈ నవల చదివిన పల్లెటూరి ఆడపిల్లలు పట్నంనుంచి వచ్చే కుర్రాళ్ళకోసం ఎదురుచూస్తారు. ఎవరికైనా అలాంటివాడు తటస్థపడితే... నిజంగానే అతడు తనను ప్రేమిస్తున్నాడనీ, మెళ్లో మూడు ముళ్ళూ వేసి తీసుకెళ్తాడనీ నమ్ముతారు.

నో! నో! తను ఆ పని చెయ్యలేదు.

చెయ్యక?

తన పెళ్ళాం బిడ్డల్ని చంపుకుంటాడా? తనకుమాలిన ధర్మం....

ఏమిటీ చిత్రం! తన ఆలోచనలే మారిపోతున్నాయ్.

చివరి వది పేజీలతోపాటు, ఓ వెయ్యి రూపాయలు అడ్వాన్సు కూడా తెచ్చుకొన్నాడు ఇంటికి ప్రసాద్.

చిత్రం!

తను ఇంతకుముందు రాసిన ఏ నవలకూ ఇంత పారితోషికం రాలేదు!

అవన్నీ ఎంత కష్టపడి రాశాడు. ఒక్కొక్క నవల రాసేముందు ఆ సబ్జెక్టుకు సంబంధించిన ఎంతో మేటర్ సేకరించి రాసేవాడు. ఒక నవల రాయడానికి కనీసం ఒక సంవత్సరం పట్టేది.

వెయ్యి రూపాయలు తన భార్య చేతిలో పెట్టినప్పుడు ఆ కళ్ళలో ఎంత జీవం తొణికిసలాడింది!

# 9

"రండి! రండి! ఇంత త్వరగా ముగింపు మార్చి తెచ్చేశారా?" ఆనందంగా అడిగాడు శాస్త్రి.

"లేదు. ఆ నవల తీసుకెళ్ళడానికి వచ్చాను. మీరిచ్చిన వెయ్యి రూపాయలు కూడా తెచ్చాను."

"అదేమిటి?"

"నాలోని రచయితను సగం చంపేసి ఆ నవల రాశాను. ముగింపు మార్చి పూర్తిగా చంపలేను. ఇలాంటి పిచ్చి ప్రేమలు ఫలిస్తాయని అమాయకుల్ని నమ్మించలేను."

"ఇలాంటివి ఎక్కడా జరగవంటారా?"

"జరగొచ్చును. కాని, అవి ఎక్సెప్షన్స్, ఎక్సెప్షన్స్‌ను జనరలైజ్ చేసి సాహిత్యంలో చూపడం ఘోర అపరాధం."

శాస్త్రి భృకుటి ముడిపడింది.

కొంచెంసేపు ఆలోచించాడు.

"సరే, అలాగే ఇవ్వండి, పాఠకులు ఎండింగ్ బాగా లేదంటారు - అంతేగా?" అన్నాడు శాస్త్రి.

శాస్త్రి అంగీకరిస్తాడని ఆశించని ప్రసాద్‌కు అతని నిర్ణయం ఆశ్చర్యాన్ని కలిగించింది.

బ్యాగ్‌లోనుంచి ముగింపు కాగితాలను ఇచ్చి, బయటకు వచ్చి, రిలీఫ్‌గా నిట్టూర్చాడు.

ఆ డబ్బు తిరిగి ఇవ్వమని తీసుకెళ్తున్నప్పుడు కృష్ణవేణి కళ్ళు అతనికేసి అదోలా చూశాయి. తనను ఒక రాక్షసుడ్ని చూసినట్టు చూశాయి.

కృష్ణవేణి కూడా మారిపోతోంది!

మారకేం చేస్తుంది?

పరిస్థితుల ప్రభావం!

మళ్ళీ ఇంటికి వచ్చి భార్య చేతిలో ఆ వెయ్యి ఉంచాడు. కాని, ఆమె ముఖంలోకి చూడలేకపోయాడు.

నవల ప్రచురణ ప్రారంభం అయింది.

పాఠకుల ఉత్తరాలు అతని నవల అమోఘంగా ఉందని వస్తున్నాయి. అతనికి అంత మంచి నవలను అందిస్తున్నందుకు కృతజ్ఞతలు చెప్తున్నారు.

విప్లవం అనే పత్రిక మాత్రం తనను విమర్శిస్తూ, నెలకో వ్యాసం రాస్తోంది. అంతకుముందు ఆ పత్రిక తన నవలలను ఏనాడూ పొగడలేదు. ఇప్పుడు పాత నవలలను పొగుడుతూ, ప్రసాద్‌లాంటి రచయిత ఎంత దిగజారిపోయాడో రాస్తున్నది. వాళ్ళు రాసే రాతలతో ప్రసాద్ ఏకీభవిస్తాడు. కాని, చాలా కాలంగా తను బ్రతికున్నాడో చచ్చాడో కూడా పట్టించుకోనివాళ్లు అలా రాయడం కొంత చిరాకును కలిగించింది.

ఆ రోజు మధ్యాహ్నం తను నిద్రపోతున్నాడు.

అకస్మాత్తుగా తనకు ఎవరిదో మగ కంఠం వినిపించింది.

ముందుగదిలో నుంచి మాటలు వినిపిస్తున్నాయి.

"ఆయన ఒప్పుకుంటారో లేదో!" తన భార్య కంఠం.

"ఎందుకు ఒప్పుకోడూ? ఒకసారి వ్రాశాడు. అశేష పాఠకుల ఆదరం లభించింది. ఆ నవలతో ఆ పత్రిక సేల్సు కూడా బాగా పెరిగినట్టు వింటున్నాం. అందుకే వచ్చాను. ఈ రెండు వేలు ఉంచండి."

"వద్దండీ! ఆయన్ను లేపుతాను. ఆయనతోనే మాట్లాడండి." కృష్ణవేణి అంటోంది.

"నీది మరీ చాదస్తం. తీసుకో! నాన్నకు నేను చెప్తాను. 'ప్రణయసామ్రాజ్యం' చదువుతూ నా ఫ్రెండ్స్ నాన్నను చూడటానికి వస్తామంటున్నారు. నాన్న ఇలాంటివి ఇంకా ఎన్నో రాయగలరు."

"తీసుకోండమ్మా! ఇల్లు గడవద్దా? పిల్లకు పెళ్ళి చెయ్యరా? ఇప్పుడే గిరాకీ ఉంది.. నాలుగురాళ్లు సంపాదించుకోండి. తీసుకోండి."

ప్రసాద్ చివ్వున మంచం దిగి బయటికి వచ్చాడు.

భార్య చేతిలో నోట్లకట్ట చూశాడు.

అతనికి శివం ఎత్తిపోయింది.

"నమస్కారమండీ!" అన్నాడు 'తెలుగు తేజం' ఎడిటర్ రామచంద్రం.

"ముందా డబ్బు అతనికిచ్చెయ్!" గర్జించాడు ప్రసాద్.

కృష్ణవేణి ఆ డబ్బును గాభరాగా కిందకు వదిలేసింది.

ప్రసాద్ ఆ నోట్లను తీసి రామచంద్రానికి అందించాడు.

"మా బీదతనాన్ని గురించి మాట్లాడే అధికారం నీ కెవరిచ్చారు?" రామచంద్రాన్ని నిలదీశాడు ప్రసాద్.

రామచంద్రం ఓ క్షణం బిత్తరపోయాడు.

"ప్రసాద్‌గారూ! ఇందులో మీరింతగా ఉద్రేకపడాల్సింది నాకేమీ కన్పించడం లేదు. మీరు ఒక నవల వ్రాశారు. అది పాఠకుల్ని విశేషంగా ఆకర్షిస్తోంది. అందుకే నేను అడగడానికి వచ్చాను. తప్పేముంది?"

"ఆ విషయం నాతోనే మాట్లాడవచ్చుగా?"

"మీరు నిద్రపోతున్నారని...." నసిగాడు రామచంద్రం.

"అందుకని నా భార్యకు డబ్బిచ్చి టెంప్ట్ చేస్తారా?"

"తప్పేముందండీ? ఈ మధ్య అందరూ ముందుగా అడ్వాన్సు ఇస్తేగాని వ్రాయడానికి ఇష్టపడటం లేదు."

"ఇతరుల సంగతి నాకు అనవసరం! స్క్రిప్టు రాసి ఇచ్చిగాని డబ్బు తీసుకోను."

"సీరియల్‌గా, ఇన్‌స్టాల్‌మెంటుగా ఇవ్వండి!"

"అలా నేను రాయలేను. నేను పూర్తి నవల రాస్తే ముందు మీకే ఇస్తాలెండి."

"ఈ రెండువేలూ ఉంచండి!"

"అక్కర్లేదు తీసుకెళ్ళండి. స్క్రిప్టు ఇచ్చాకే తీసుకుంటాను."

"సరే, మీ ఇష్టం! మాకు నవల వ్రాయడం మాత్రం మర్చిపోకండి."

"అలాగే!"

"ఎప్పటికివ్వగలరు?"

"చెప్పలేను."

"ట్రైచెయ్యండి, వీలయినంత త్వరలో ఇవ్వడానికి! మరి వస్తాను" అంటూ రామచంద్రం వెళ్ళిపోయాడు.

ప్రసాద్ భార్యకేసి చూసి ఏదో అనబోయాడు.

ఖిన్నమైన ఆ ముఖం చూస్తూ ఏమీ అనలేకపోయాడు.

"నాన్నా! నీది మరీ చాదస్తం!"

ప్రసాద్ కూతురి ముఖంలోకి చూశాడు.

ఆ పిల్ల ముఖం దించుకొని అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

# 10

ప్రసాద్ మళ్ళీ రాయడం ప్రారంభించలేదు.

ధరణిలో నవల ముగింపు బాగా లేదని ధరణి పాఠకులు రాశారు. అలాంటి పాఠకులు బాగా లేదంటే సంతోషించాలే గాని విచారించనక్కర్లేదని అతని భావం.

మూడు వేలు ఎన్ని రోజులొస్తాయి?

అప్పులు తీర్చగా ఎలాగో ఆరు నెలలు ఇల్లు గడిచింది.

మళ్ళీ పరిస్థితులు మొదటికే వచ్చాయి.

మరో ప్రేమ నవల ప్రారంభించాడు. కాని, రోజుకు నాలుగు పేజీలు కూడా కదలడం లేదు.

ఈ లోపల సాహిత్యం మరో మలుపు తిరిగింది.

మంత్రతంత్రాలు సాహిత్యంలోకి జొరబడ్డాయి. పాఠకుల్ని విశేషంగా ఆకర్షించాయి. పెద్ద సంచలనాన్నే మంత్రాలు సృష్టించాయి.

రచయితల దృష్టి ఆ వైపుకు మళ్ళింది.

దయ్యాలను పాత్రల్ని చేశారు. పిశాచాల సాహిత్యం ప్రోత్సహించబడసాగింది.

ఎంత భయంకరంగా రాస్తే పాఠకులు అంత వెర్రెక్కి చదవసాగారు. ఆ రచయితను అంత ఆరాధించటం ప్రారంభించారు.

ప్రసాద్ వింటూనే ఉన్నాడు. కొన్ని నవలలు చదివాడు.

తులసివనంలో గంజాయి మొక్కలు నాటబడ్తున్నాయి.

రకరకాల సంచలన వార్తలు వింటున్నాడు.

బాధపడటంకంటే అతనికి చెయ్యగలిగిందేమీ కన్పించడం లేదు.

అంతకంటే ప్రేమ కథలు మొరుగని భావించాడు.

ఒక నవల ముగించి తెలుగు తేజం ఆఫీసుకు తీసుకెళ్ళాడు.

"ఇప్పుడు ఇలాంటి కథలకు డిమాండ్‌లే"దని రామచంద్రం నిర్లక్ష్యంగా చెప్పాడు. శివప్రసాద్‌ను కూర్చోమని. కూడా చెప్పలేదు. శివప్రసాద్ అక్కడ్నుంచి గబగబా బయటికొచ్చాడు.

"వెలుగు-చీకటి" ఆఫీసుకు వెళ్ళాడు.

ఆ ఎడిటరూ అదే చెప్పాడు.

మంచి సస్పెన్సు కథ రాయమన్నాడు.

పిశాచాల కథ అయితే హాట్ కేక్‌లా పాఠకులు అవురావుమని భుజిస్తారని చెప్పాడు. అలాంటి నవలొకటి రాయమనీ, రెమ్యూనరేషన్ బాగానే ఇస్తామనీ చెప్పాడు.

ఆ రాత్రంతా ఆలోచించి "మరో దయ్యం కథ" ప్రారంభించాడు. కసికసిగా యసాగాడు.

పూర్తిగా ముగించకుండానే తీసుకెళ్లి "వెలుగు-చీకటి" ఎడిటర్‌కు ఇచ్చివచ్చాడు.

మూడో రోజు అతనికి "వెలుగు-చీకటి" నుంచి కబురందింది.

# 11

"రండి, ప్రసాద్‌గారూ!"

"వెలుగు - చీకటి" ఎడిటరు లేచి నిల్చుని ఆహ్వానించాడు.

ప్రసాడకు అతని మర్యాద చూస్తే ఆశ్చర్యం కలిగింది.

ఇంత మర్యాద ఎందుకో?

ఆ పిశాచాల కథ చదివాక తనకు ఇంత మర్యాద చేస్తున్నాడు? ఓ మై గాడ్!

"మీ కథ చదివాను, అద్భుతంగా ఉంది. ఫైవారం ఒక సీరియల్ పూర్తి అవుతోంది. వెంటనే ప్రారంభిస్తాను. నేను రాత్రి చదివాను. రాత్రంతా నిద్రపట్టలేదంటే

నమ్మండి. నాకంటే ముందే మా ఆవిడ చదివింది. ఇప్పుడావిడ రాత్రుళ్లు వంటరిగా బాత్‌రూం కెళ్ళడానికే భయపడుతూంది!" సంతోషంగా చెబుతున్నాడు.

ప్రసాద్ ఆశ్చర్యంగా అతని ముఖంలోకి చూస్తున్నాడు.

"ఈ నవల దెబ్బతో మన పత్రిక - ధరణి మీద దెబ్బతియ్యక మానదు." ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు.

ప్రసాద్‌కు ఏం చెప్పాలో అర్థం కావడంలేదు. వెర్రివాడిలా కళ్ళప్పగించి వింటున్నాడు.

అతనికి ఆ ప్రశంస సంతోషాన్ని కలిగించడం లేదు.

"అదేమిటండీ, మంచి సస్పెన్సులో ఆపారు? ఆ తర్వాత ఏం జరుగుతుంది? రహమాన్‌కూడా దయ్యమేనా? లేక భూతరాజు దయ్యమా? ఈ భైరవమూర్తి ఎవరు?" ఊపిరి పీల్చుకోవడం మర్చిపోయి ప్రశ్నలవర్షం కురిపించాడు ఎడిటర్.

"అవన్నీ ఇప్పుడే నేను చెప్పలేనండీ!"

"అదేమిటి? ముగింపు ఇంకా ఆలోచించుకోలేదా?"

"ముగింపు చెబితే నేను చచ్చిపోతాను."

"అదేమిటండీ?" తెల్లముఖం వేశాడు ఎడిటర్.

"నిజమే చెబుతున్నాను. ఇది నా జీవితంలో నిజంగా జరిగింది. దాన్నిగురించి పూర్తిగా చెబితే చంపేస్తానని బెదిరించాడు."

"ఎవరూ?" ఊపిరి బిగబట్టి అడిగాడు ఎడిటర్.

"అదీ చెప్పకూడదండీ!" ప్రసాద్ తలదించుకొని అన్నాడు.

"పెద్ద చిక్కే తెచ్చిపెట్టారే! సగం కథ వేస్తే పాఠకులు ఊరుకుంటారటండీ?"

ప్రసాద్ మాట్లాడలేదు.

ఎడిటర్ ఏదో ఆలోచనలో పడ్డాడు.

బ్లఫ్ చేస్తున్నాడు. పోజు కొడ్తున్నాడు. తను ముందే చాలా బాగుంది అని అనకుండా ఉండాల్సింది.

పూర్తిగా చెబితే తను చచ్చిపోవడం ఏమిటి? పైగా, నిజంగా జరిగిందని తనను నమ్మించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇదంతా ఎక్కువ డబ్బు గుంజడానికి వేసిన పథకం.

"మీరు వ్రాసిందంతా నిజంగా మీ జీవితంలో జరిగిందా?" పరిశీలనగా చూస్తూ అడిగాడు ఎడిటర్.

"అవును." క్లుప్తంగా సమాధానం ఇచ్చాడు ప్రసాద్.

"తమాషాగా అంటున్నారు గదూ?"

"తమాషా కాదు, నా స్వానుభవం అని చెప్తున్నానుగా?"

"మీరు నిజంగా దయ్యాల్ని నమ్ముతారా?"

"ఒక రాత్రంతా దయ్యాలతో గడిపానంటుంటే నమ్ముతారా అని ప్రశ్నిస్తారేమిటి?"

"దేవుడ్ని కూడా నమ్ముతారా?"

"నమ్ముతాను. దయ్యాలను నమ్మినవాడు దేవుడ్ని నమ్మకుండా ఎలా ఉంటాడు?"

"ఈ అనుభవం మీకు ఇటీవలే జరిగిందా?"

"కాదు, దాదాపు ఇరవై యేళ్ళు అయింది."

ఎడిటర్ ప్రసాద్ ముఖంలోకి విస్మయంగా చూశాడు.

"మరి ఇంతకాలం మీ రచనలూ, మీ భావాలూ వేరుగా ఉన్నాయే? మార్క్సిస్టు ఐడియాలజీకి కమిటెడ్ అయినట్టు అందరికీ భ్రమ ఎందుకు కలిగించారు? మీరు నాస్తికులని అందరి భావం. మీ ఆలోచనలు రాడికల్ అని అందరూ అనుకొనేలా చేశారు. ఇంత ద్రోహమా? ఇంత మోసమా?"

"నేను ఎవర్నీ మోసం చెయ్యలేదు."

"ఇది మోసం కాదటండీ? ఒకవైపు మీరు దైవాన్నీ, దయ్యాలనూ నమ్ముతూ, ప్రజలకు అలాంటివి ఏమీ లేవని చెప్పడం మోసం కాదా?"

"కాదు. ఎందుకంటే, దయ్యాలూ, దైవమూ ఉన్నాయని చెప్పడంకంటే అలాంటివి లేవని చెప్పడంవల్లనే ఈ కర్మభూమిలో జన్మించిన ప్రజలకు క్షేమం. అందుకే నేను నా నమ్మకాలను వెనక్కు నెట్టి, ప్రజాహితంకోరి అలాంటి రచనలు చేశాను."

"ఏమిటో - మీ మాటలు నాకు అయోమయంగా ఉన్నాయి."

"నా మాటలు మీకు అలాగే ఉంటాయని నాకు తెలుసులెండి. అసలు విషయానికి రండి."

"మీరు నవల పూర్తి చేసితీరాలి!"

"నేను చనిపోయినా ఫర్వాలేదంటారు, అవునా?"

"రామ రామ! అలా ఎందుకంటానండీ? కథ చెబితే చనిపోతారా ఏమిటి? మరీ చాదస్తంగా మాట్లాడుతున్నారు."

"మీకు పిశాచాలంటే నమ్మకమేనా?"

"ఎందుకులేదండీ బాబూ! మా అమ్మను ఒక పిశాచమే చంపింది" అని గబుక్కున నోరు జారినందుకు నాలుక గట్టిగా కరుచుకొన్నాడు. 'అబ్బ' అని పైకే అన్నాడు ఎడిటర్.

"మరి నన్ను ఆనాటి పిశాచాలన్నీ కలిసి పీక్కుతింటాయంటే నమ్మరేం? మీరు నమ్ముతారు - నాకు తెలుసు."

"అయితే, ఏం చెయ్యమంటారు?" జుట్టు పీక్కుంటూ అన్నాడు ఎడిటర్.

"మీరే చెప్పండి."

"ఇది స్వానుభవం అని ముందే ప్రకటనలు ఇస్తాం. పూర్తిచేసి చనిపోయారనుకోండి, మీ త్యాగం చిరస్థాయిగా తెలుగు సాహిత్యపు పుటల్లో..."

"సువర్ణాక్షరాలతో లిఖించబడుతుందంటారు?" మధ్యలోనే అందుకొని అన్నాడు ప్రసాద్.

ఎడిటర్ మౌనంగా అతడి ముఖంలోకి చూశాడు.

"సరే, నేను చావడానికి సిద్ధమే!"

ఎడిటర్ కళ్ళు మిల మిలలాడాయి.

"జాతస్య మరణం ధృవం. ఏనాటికైనా పోవాల్సినవాళ్లమే. ఇలాంటి చావు అందరికీ వస్తుందటండీ?" ఆనందంగా అన్నాడు.

"పిశాచాలు పీక్కుతినే చావా?" తీవ్రంగా ఉంది ప్రసాద్ కంఠం.

ఎడిటర్ తడబడ్డాడు.

"కాదండీ! పాఠకులకోసం - సాహిత్యాన్ని సుసంపన్నం చెయ్యడం కోసం..." ప్రసాద ముఖంలోకి చూసి ఆగిపోయాడు ఎడిటర్.

ప్రసాద్‌కు అతడ్ని లాగి గూబ పగలగొట్టాలనిపించింది.

"సరే, నేను త్యాగం చెయ్యడానికి సిద్ధమే - కాని, ఒక షర్తుమీద!"

"చెప్పండి. రెమ్యూనరేషన్ గురించేనా? మొత్తం పదివేలు! ఇవ్వాళ ఐదువేలు! పూర్తిఅయాక ఐదువేలు!"

"పూర్తి అయాక నేనెక్కడుంటానండీ?"

"మీ భార్యకు అందిస్తాం!"

"అందుకు హామీపత్రం ఇవ్వాలి."

"అలాగే!"

"నేను పెట్టదల్చుకున్న షర్తు మరొకటుంది!"

"ఏమిటి?"

"ఇప్పుడిచ్చినంతవరకు వెయ్యండి. ఆ తర్వాత ఎడిటర్ నోట్ ఒకటి వెయ్యండి."

"ఏమని?"

ప్రసాద్ టేబుల్ మీద ఉన్న ఒక పేపరు తీసుకొని వ్రాయసాగాడు.

"ఎడిటర్ నోట్ - రచయిత ప్రసాద్ తన స్వానుభవాన్ని ఇంతవరకూ చెప్పారు. ఆయన భైరవమూర్తి తోటకు చేరాడు. దయ్యం అనుకొన్న భూతరాజు అక్కడ కన్పించాడు. భూతరాజు రహమాన్ దయ్యం అని చెప్పాడు - ప్రసాద్‌కు పిచ్చెక్కినంతపనైంది. రహమాన్ కూడా దయ్యమా అని అడగాలనుకొన్నాడు. కాని గొంతు బిగిసిపోయింది - అంతవరకు మీ ముందు ఉంచారు. ఆ తర్వాత కథ చెబితే ఆయన్ను పిశాచాలు పీక్కు తింటాయట. అందుకే ఆ కథ చెప్పడం ఆయనకు ఇష్టంలేదు.

"నా ప్రోద్భలంతో ఒక షర్తు పెట్టారు. పాఠకులు రచయిత చనిపోయినా సరే, కథ ముగింపు వినాలని కుతూహలపడితే తప్పక పూర్తి చేస్తానన్నారు.

"మన 'వెలుగు - చీకటి' పాఠకుల మీద ఆయనకున్న అభిమానానికి జోహార్లు.

"అందుకే పాఠకులు తమ అభిప్రాయాలను పంపించవలసిందిగా కోరుతున్నాను. మెజారిటీ కోరికను మన్నించడానికి సిద్ధంగా ఉన్నారు రచయితగారు.

"వారి జీవితాన్నే సాహిత్య సేవకు త్యాగం చెయ్యడానికి ముందుకు వచ్చారు.

"అందుకే-పాఠకులారా! మీ అభిప్రాయం రాయండి."

అని వ్రాసి ముగించి కాగితం ఎడిటర్ చేతికి అందించాడు.

ఎడిటర్ చదువుతున్నాడు.

ప్రసాద్ అతని ముఖకవళికలు పరిశీలనగా చూస్తున్నాడు.

"వండర్‌ఫుల్! కొత్త ప్రయోగం! పాఠకుల పార్టిసిపేషన్ కూడా ఉంటుంది. ఇంతవరకూ ఏ పత్రికా చెయ్యని ప్రయోగం. మన పత్రిక గర్వించదగిన ప్రయోగం చెయ్యబోతోంది. ఈ దెబ్బతో ధరణి కిందకూ మన పత్రిక పైకీ!" దాదాపు గంతులు వేసినంత పని చేశాడు ఎడిటర్.

"మీకు జీతం పెరగడం కూడా ఖాయం!" అన్నాడు ప్రసాద్.

"ఏదో మీ దయ!" రెండు చేతులు జోడించాడు వెలుగు – చీకటి ఎడిటర్.

"ఎడిటర్‌గారూ!" దిగులుగా పిల్చాడు ప్రసాద్.

"ఏమిటి సర్? చెప్పండి!"

"మీ ఆనందంలో పాలుపంచుకొనేందుకు నేను ఉండనే అని దిగులుగా ఉంది." బోలెడంత దిగులుపడిపోతూ అన్నాడు ప్రసాద్.

"మీరు ఉండకపోవడం ఏమిటి?. ఉంటారు సర్!" అన్నాడు ఎడిటర్, ఇనుమడించిన ఉత్సాహంతో.

"అదేమిటయ్యా! కథ పూర్తిచేస్తే పిశాచాలు నన్ను చంపేస్తాయని చెప్పడం లేదూ? అంటే, నా మాట మీద మీకు నమ్మకంలేదన్న మాట!"

"ఎంతమాట! ఎంతమాట! మీ మాట మీద నమ్మకం లేకపోవడమా?" ముక్కుమీద వేలు వేసుకొన్నాడు ఎడిటర్.

"మరి?"

"అదే సర్! ఈ క్షణభంగురమైన శరీరాన్ని వదిలేస్తారు. అయినా మీరెక్కడికెళ్తారూ? ఆస్ట్రల్ బాడీలో ఉండి అంతా చూస్తూనే ఉంటారు!" అన్నాడు తన్మయత్వంగా ఎడిటర్.

"అయితే, పిశాచం అయి తీరమంటారు?"

"కొంతకాలం తప్పదుగా సర్!" అతి మామూలుగా ధైర్యం చెబుతూ అన్నాడు ఎడిటర్.

"జీవుడు శరీరాన్ని వదలగానే చీకట్లో కొట్టుమిట్టాడుతూ నరకయాతన అనుభవిస్తాడట! కొందరికి ఆ సమయంలో మీడియం అవసరం ఏర్పడుతుందట!"

"ఇంత జనం ఉండగా మీడియం మీకు దొరక్కపోవడం ఏమిటి సర్?"

"అవసరం అయితే నిన్నే మీడియంగా వాడుకొంటాను." ఎడిటర్ కళ్ళల్లోకి తీవ్రంగా చూస్తూ అన్నాడు ప్రసాద్.

"కెవ్వు"మని అరిచి కుర్చీనుంచి చివ్వున లేచి నిల్చున్నాడు. ఎడిటర్ గజగజ వణికిపోతున్నాడు. తలలో నుంచి చెమటచుక్కలు కారుతూ ముఖాన్ని తడుపుతున్నాయి. ఎదురుగా ఉన్న ప్రసాద్‌ను పులుకు పులుకున చూడసాగాడు.

"అదేమిటయ్యా అలా వణికిపోతున్నావ్? అలా చూస్తావేం? నేనింకా చావలేదు. మనిషినే! కూర్చో."

ఎడిటర్ నిలబడే ఓపికలేనట్టు కుర్చీలో కూలబడ్డాడు.

అదోలా నవ్వాడు ప్రసాద్.

ఎడిటర్ వెన్నెముకలోకి నలికల పాము మెలికలు తిరుగుతూ పాకుతున్నట్టు శరీరం గగుర్పొడిచింది.

"అయ్యో ఎడిటరూ! అంత భయం ఏమిటి?"

"అ...అలా నవ్వకండి సర్!" నాలుకతో పెదవులు తడుపుకొంటూ అన్నాడు ఎడిటర్. ముఖానికి పట్టిన చమట్లు తుడుచుకొన్నాడు.

"ఏమిటయ్యా, అంత భయపడిపోయావ్?"

"మరి భయం కాదా అండీ?" అంతకంటే ఏమనాలో తోచనట్టు అన్నాడు.

"భయమా! ఎందుకూ? నేను ఎటూ పిశాచం అవడం ఖాయం. నిన్ను మీడియంగా వాడుకోవడం కూడా ఖాయమే. నిన్నూ చంపి మా లోకానికి తీసుకెళ్ళడం ఖాయం!"

"బాబ్బాబు! మీకు దణ్ణం పెడ్తాను, అలా మాట్లాడకండి." రెండు చేతులూ ఎత్తి నమస్కరించాడు ఎడిటర్.

"భయపడకు. నువ్వొచ్చాక అక్కడ మనం ఒక పేపరు పెడ్దాం" అని నవ్వుతూ ఎడిటర్ ముఖంలోకి చూశాడు ప్రసాద్. అతన్ని చూస్తుంటే ప్రసాద్‌కు చచ్చేంత నవ్వు వస్తోంది.

"నాకంత ధైర్యం చెప్పి నువ్వంత వణికిపోతావేమయ్యా? ఎదుటివాడి ప్రాణం నీ ప్రాణంలాంటిది కాదా? మనం ఆ లోకంలో పెట్టబోయే పేపరుకు మంచి పేరు ఆలోచించు."

ఎడిటర్‌కు ఏడుపొక్కటే తక్కువ.

"మనకు రచయితలు కూడా కావాలిగా? మన తెలుగు సాహిత్యంలో పిశాచ, భూత, ప్రేత, మాయా మంత్రాల రచయితలు ఎందరో ఉన్నారు. అందులో పాండిత్యం సంపాదించిన వారున్నారు. పిశాచ లోకంలో స్వయంగా విహరించినట్టు రాయగలవారున్నారు. అందువల్ల మనిద్దరం కలిసి ఆ రచయిత(త్రు) లను కూడా. పిల్చుకెళ్దాం!" అన్నాడు ప్రసాద్ నవ్వుతూ.

"సర్! నాకు భయంగా ఉంది, అలా మాట్లాడకండి." దాదాపు ఏడుస్తూనే అన్నాడు ఎడిటర్.

"జాతస్య మరణం ధ్రువం! భయమెందుకయ్యా పిచ్చివాడా?"

"సర్! నా మాటలు నాకే అప్పగిస్తున్నారు. సర్దాగా అంటున్నారు గదూ? నాకు తెలుసు. మీరు చాలా మంచివారు. ఈవిల్ స్పిరిట్‌గా మాత్రం కాదు."

"ఏ స్పిరిట్‌కయినా మీడియం చాలా అవసరం." గట్టిగా ఒక్కొక్క అక్షరాన్నే నొక్కుతూ అన్నాడు ప్రసాద్.

"సర్! సర్! పిశాచ రచయిత(త్రు)లు చాలామంది ఉన్నారుగా! పిశాచాల గురించి రాసి, అవన్నీ తమ స్వానుభవం అని చెప్పినవాళ్లు కూడా ఉన్నారు. అంటే, మానవుని రూపంలో ఉండి కూడా వాళ్లకు పిశాచాలతో సంబంధ బాంధవ్యాలు ఉన్నట్టున్నాయి. పైగా, వాళ్లకు ఆ ప్రత్యేక శక్తి కూడా ఉంది. వాళ్లకు మనుషులమీదకంటే పిశాచాల

బాధలమీదే చాలా సానుభూతి ఉంది. అందుకని ముందు వాళ్లను మీడియంగా చేసుకోండి సర్!" ప్రాధేయపడసాగాడు ఎడిటర్.

ప్రసాద్ ఎడిటర్ ముఖంలోకి చూస్తూ మౌనంగా వింటున్నాడు.

"ఎలాగయినా మీరూ మీరూ ఒకటి సర్! ముందు వాళ్ళను మీడియంగా వాడుకుంటే బాగుంటుంది సర్!"

"బాగానే ఉంటుంది." సాలోచనగా అన్నాడు ప్రసాద్.

"అదీ! ఆ మాటన్నారు - బాగుంది!" ఉత్సాహంగా అన్నాడు ఎడిటర్.

"వాళ్ళను ముందే తీసుకెళితే నాకేం ప్రయోజనం? ముందు నాకో ఎడిటర్ కావాలి. పత్రిక పెట్టాకే మా జాతి జోలికి వెళ్తాను." ఎడిటర్ కళ్ళలోకి చూస్తూ అన్నాడు ప్రసాద్.

ఎడిటర్‌కి జుట్టు పీక్కుంటూ అరవాలనిపించింది.

"సర్! మీకు ఐదువేలు ఇవ్వాలిగా! ప్రొప్రైటర్ దగ్గరకు వెళ్లొస్తాను" అంటూ గబగబా ప్రొప్రయిటర్ గదిలోకి వెళ్ళాడు అతను.

అలా వెళ్తున్న అతన్ని చూస్తూ విషాదంగా నవ్వుకొన్నాడు ప్రసాద్.

కళ్ళుమూసుకొని కుర్చీలో వెనక్కు వాలాడు.

కునుకుపట్టింది.

"ఇదుగో సర్, చెక్కు."

ప్రసాద్ తృళ్ళిపడి కళ్ళుతెరిచాడు. ఎడిటర్ చేతిలో చెక్కు అందుకొని చూశాడు. ఐదువేలకు చెక్కు! అతని కళ్ళల్లో క్షణం కాలం వెలుగు కన్పించి మరుక్షణం ఆరిపోయింది.

"మిగతాది నా భార్యకు అందించండి."

"అలాగే సర్! అంతేకాదు, మీ కుటుంబ సహాయానికి నిధి కూడా ఏర్పాటు చేస్తాను సర్, మన పేపరు పాఠకుల ద్వారా" అంటూ ప్రసాద్ ముఖం చూసి ఆగిపోయాడు ఎడిటర్.

ప్రసాద్ నవ్వాడు.

"నా జోలికి రాకండి సర్!"

"మాట ఇవ్వలేను. అయినా ప్రయత్నిస్తాను" అంటూ బయటికి వెళ్ళిపోయాడు ప్రసాద్.

చేతిలోని చెక్కును చూసుకొని రిలీఫ్‌గా నిట్టూర్చాడు.

ఎడిటర్ రూపాన్ని తల్చుకొని ముసిముసిగా నవ్వుకొన్నాడు.

# 12

"మరో దయ్యం కథ" వెలుగు-చీకటి వారపత్రికలో ప్రారంభం అయింది.

పాఠకులనుంచి పుంఖానుపుంఖాలుగా ఉత్తరాలు వచ్చి పడ్తున్నాయి. ప్రసాద్‌గారి రచన మమ్మల్ని అదిలోనే ఆకట్టుకుందని కొందరు రాస్తే, ఆ నవల చదువుతుంటే

చావుభయం పోయిందనీ, వీలయినంత త్వరలో పిశాచలోకం చూడాలని ఉందనీ మరికొందరు వ్రాశారు.

అవి చదువుకొని ప్రసాద్ ఆనందించలేదు.

పాఠకుల అజ్ఞానానికి జాలిపడ్డాడు.

చావుభయం పోయిందట! వాళ్ళను లాక్కొచ్చి హుసేన్‌సాగర్ కట్టమీదకు తీసుకెళ్ళి, దూకమని చెప్పాలనిపించింది.

'వెలుగు-చీకటి' సేల్సు బ్రహ్మాండంగా పెరిగిపోయాయి.

అది తెలుసుకొన్న అనేక పేపరువాళ్లు అతన్ని కలిసి, నవలలు అడిగారు. ధరణి ఎడిటర్ నరాలశాస్త్రి ఇక సరేసరి!

పెద్ద మొత్తాల ఆశకూడా చూపించారు.

అయినా ప్రసాద్ అంగీకరించలేదు.

ఆ నవల పూర్తి అయాకగాని మరొకటి రాయనని చెప్పాడు.

ప్రసాద్‌కు ఎందరో అభిమానుల ఉత్తరాలు వస్తున్నాయి.

అవి చదవకుండానే చింపివేస్తున్నాడు.

అతన్ని స్వయంగా కలుసుకోవడానికి వస్తున్నారు.

ఒకరోజు ప్రసాద్ సిడ్నీ షెల్డన్ రాసిన 'బ్లడ్‌లైన్' చదువుతూ కూర్చున్నాడు. అదో అంతకుముందే చదివినట్టుగా అన్పించి ఆలోచించాడు.

అవును, ఆ మధ్య తనో నవల చదివాడు.

తెలుగు నవల అది.

అచ్చం ఇదే కథ.

సిడ్నీ షెల్డనే కాపీ కొట్టాడనగలడు - ఒకవేళ ఎవరైనా ఆ మాట ఆ రచయితతో అంటే! ప్రసాద్‌కు నవ్వొచ్చింది.

"నాన్నా!" కమల పిల్చింది.

"ఏమ్మా," పుస్తకంలోనుంచి, తలెత్తి అడిగాడు ప్రసాద్.

కమల ఈమధ్య పూర్తిగా మారిపోయింది.

అంతకుముందు తనమీద కసికసిగా ఉండేది.

ఇప్పుడు తనకు కావాల్సినవన్నీ ఆమే చూస్తుంది. తనంటే ఎంతో గౌరవంగా చూస్తోంది. పెద్దకొడుకు కూడా ఇంట్లో రెండు వందలకు బదులు మూడొందలు ఇస్తున్నాడు.

"నాన్నా!"

"చెప్పు."

"నా స్నేహితురాళ్లు వచ్చారు!"

"సినిమాకు వెళ్తావా? అమ్మకు చెప్పి వెళ్ళు."

"కాదు నాన్నా! వాళ్ళు నిన్ను చూస్తారట!"

"నన్నేం చూస్తారు!"

"నీ నవల చదువుతున్నారు, రాత్రిళ్ళు నిద్రకూడా పట్టడంలేదట."

"పాపం! చదవ్వద్దని చెప్పు."

"అదేంటి నాన్నా! ఆ నవల వాళ్ళకు ఎంతో నచ్చిందట. అంత సస్పెన్సుతో ఇంతవరకూ ఏ నవలా రాలేదట!"

"అలాగా!" నిర్లిప్తంగా అన్నాడు ప్రసాద్.

"వాళ్ళను పిలవనా?"

"వద్దు."

"నిన్ను ఏదేదో అడగాలని వచ్చారు."

"వాళ్ళ ఇడియాటిక్ ప్రశ్నలకు సమాధానం నేను ఇవ్వనని చెప్పు." విసుగ్గా అన్నాడు ప్రసాద్.

"ప్లీజ్, నాన్నా!"

"అది అంతగా ముచ్చటపడ్తుంటే కాసేపు మాట్లాడరాదూ?" కృష్ణవేణి సిఫార్సు చేసింది.

"అందులో ఏ పిల్లయినా నన్ను ప్రేమిస్తున్నానంటే ఎలా?"

"ఛ! అవేం మాటలండీ? వాళ్ళంతా మన అమ్మాయితోటివాళ్ళు."

"అయితే మరీ డేంజరు! ఆ ఈడువాళ్ళే ఎవర్నయినా ఇట్టే ప్రేమించేయగలరు – ముఖ్యంగా రచయితల్ని!"

"వాళ్ళు అలాంటివాళ్ళు కాదు నాన్నా!"

"నన్ను విసిగించక వెళ్ళు. మళ్ళీ ఎవర్నీ ఇలా ఇంటికి తీసుకురాకు." కోపంగా దాదాపు అరిచినట్టే అన్నాడు ప్రసాద్.

"నేను తీసుకురాలేదు, వాళ్ళేవచ్చారు." గుణుస్తూ అన్నది కమల.

"అయితే వెళ్ళిపొమ్మని చెప్పు!" గట్టిగా అన్నాడు ప్రసాద్.

కమల ముఖం చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయింది గొణుక్కొంటూ.

"అది ఎంత చిన్నబుచ్చుకొందో చూడండి. కాసేపు వాళ్ళతో మాట్లాడితే మీ కొంపేం మునిగిపోతుంది? అంతకుముందు మిమ్మల్ని కలవడానికి ఎంతమంది వచ్చేవాళ్లు? గంటలకొద్దీ అన్నం, నీళ్లు మర్చిపోయి మాట్లాడేవారుగా?"

"వాళ్లు వేరు. వాళ్లు ఇలాంటి ఇడియట్స్ కాదు. ఈ నవల చదివి వాళ్ళు రారు."

కృష్ణవేణికి ఏం సమాధానం చెప్పాలో తోచలేదు.

"అంత బాధగా ఉంటే నువ్వు మాట్లాడరాదూ?" ఏ భావం లేకుండా అన్నాడు.

"నేనేం మాట్లాడతాను?" రాగం తీసింది కృష్ణవేణి.

"రచయిత భార్యగా మాట్లాడు. వాళ్లు వేసే ప్రశ్నలకు నువ్వు చాల్లే సమాధానాలు ఇవ్వడానికి!"

"చాల్లెండి సరసం!"

"సరసం కాదు, నిజమే చెబుతున్నాను కృష్ణా!"

"నేను అసలు ఆ నవల చదవలేదు. రెండు వారాలు చదివాను. రాత్రిళ్లు నిద్రపట్టక మానేశాను. అయినా ఆ నవలేంటండీ! ఆ దయ్యాలూ - భూతాలూ - ఇంతకు ముందెప్పుడైనా ఇలాంటివి రాశారా?"

"అందుకేగా ఇంత పేరూ - ఇంత డబ్బూ! వీళ్ళంతా కూడా ఆ నవల చదివేగా వచ్చారు? మన ఇంటి పరిస్థితులు కూడా చక్కబడ్డాయి."

"అవును. ఇంకా వేరే పేపరువాళ్లు కూడా అడుగుతున్నారు. రాయకూడదూ?"

"ఎందుకు రాయాలి? డబ్బుకోసమేగా!"

"అదేం ప్రశ్న" అన్నట్టు చూసింది కృష్ణవేణి.

"డబ్బుకోసమేగా?" రెట్టించాడు.

"అవునండీ! ఇంత కాలానికి మళ్ళీ కాళ్ళు నేలమీద ఆనుతున్నాయి. పిల్లకు పెళ్ళి చెయ్యాలి. డబ్బుకోసమే రాయండి. అందరూ రాయడం లేదూ? ఆ పిచ్చినన్నాసి ఎక్కడున్నాడో!" పారిపోయిన కొడుకుని తల్చుకొని కన్నీళ్లు పెట్టుకొన్నది భార్య.

"కృష్ణా, నన్ను విసిగించకు!" విసుగ్గా అన్నాడు ప్రసాద్.

కృష్ణవేణి భర్తముఖం చూసి లోపలకు వెళ్ళిపోయింది.

ఆలోచనలో పడింది.

ఈమధ్య ఈ మనిషి అదోలా ఉంటున్నాడేం?

ఏదో దిగులుగా ఉంటున్నాడు.

బయటికి ముఖం చూపటంలేదు.

ఏదో తప్పు చేసినట్టు బాధపడ్తున్నాడు.

ఒక మాటా మంతీ లేదు.

ఇరవైనాలుగ్గంటలూ పుస్తకాలు ముందేసుకొని కూర్చోవడం. ఆర్థికంగా ఇబ్బందిపడినప్పుడు కూడా ఇంత దిగులుగా కన్పించలేదు.

రాయడంకూడా పూర్తిగా మానేశాడు.

కృష్ణవేణికి భర్త వాలకం అర్థంకాక మథనపడసాగింది.

ఏవేళప్పుడు ఈ పాడు దయ్యాల కథ మొదలుపెట్టాడో! అప్పట్నుంచే మనిషి అదోలా ఉంటున్నాడు.

# 13

"ఏమండీ, ఇది విన్నారా?"

ఒకరోజు రాత్రి భర్తతో అన్నది కృష్ణవేణి ఆసక్తిగా.

ప్రసాద్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"కాంతమ్మపిన్ని అత్తగారు మీ నవల చదివించి వింటున్నదట!"

"అయితే ఏమంటావ్?"

"ఆమె మతిపోయినట్టుగా ప్రవర్తిస్తోందట. డెబ్బయ్ ఏళ్ల ఆవిడ రాత్రిళ్లు ఒంటరిగా పడుకోవాలంటే భయపడుతోందట. కన్ను మూస్తూనే పిచ్చిమాటలు మాట్లాడుతోందట. చచ్చినవాళ్ళు తనచుట్టూ చేరుతున్నట్టు చెబుతుందట!"

"అలాగా?" సాలోచనగా అన్నాడు ప్రసాద్.

"ఆమెకు రోజూ రాత్రిళ్ళు ఏనాడో చచ్చిపోయిన భర్త కన్పిస్తున్నాడట!"

"మంచిదేగా!"

"అదికాదండీ! రాత్రిళ్లు ఎవర్నీ నిద్రపోనివ్వడం లేదట. పెద్దగా భర్తని తిడుతూ అరుస్తూ ఉంటుందట. ఈ వయసులో ఈ బుద్ధులేమిటంటూ ఒకోసారి మురిపెంగా మందలిస్తుందట. ఆమెకు మతిపోయిందనీ, ఆ నవల చదివి ఆమెకు విన్పించినందుకు, ఆమె కొడుకు భార్యని తిట్టిపోస్తున్నాడట."

"నీకెవరు చెప్పారూ?"

"వాళ్ళ భార్యని చెప్పింది."

"నన్ను తిట్టిందా?"

"ఇది మరీ బాగుంది! మిమ్మల్నెందుకు తిడుతుంది?"

"మనసులు పోగొట్టే నవల రాస్తున్నందుకు!"

"ఆమెకు మీ నవల చాలా బాగుందట. పత్రిక రాగానే ఇంట్లో అందరూ నేను ముందు చదవాలంటే నేను ముందు చదవాలని కొట్లాడుకుంటున్నారటండీ!" గొప్పగా చెప్పింది భార్య.

"వద్దని చెప్పు! వాళ్ళకు కూడా మతిపోతే వాళ్ళూ బాధపడాలి."

"ఏమిటండీ, మీ మాటలూ మీరూనూ!"

"నిజం కృష్ణా! నీకు తెలిసినవాళ్ళందరితో ఆ నవల చదవ్వద్దని చెప్పు."

కృష్ణవేణి భర్త ముఖంలోకి చిత్రంగా చూసింది.

అతను అదేమీ పట్టించుకొన్నట్టు లేదు

అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయాడు.

# 14

"నాన్నా!"

ప్రసాద్ తలెత్తి చూశాడు.

భోజనాల దగ్గర కూర్చున్నప్పుడు సూర్యం తండ్రితో ఏదో చెప్పే ప్రయత్నంలో తబ్బిబ్బైపోతున్నాడు.

"ఏమిట్రా?"

"మీ నవల మా ప్రెస్‌లోనే ప్రింటవుతోంది."

"అయితే?'

"కంపోజిటర్స్ బలే సస్పెన్సుతో నడుస్తోంది అంటున్నారు."

ప్రసాద్ సమాధానం ఇవ్వలేదు.

"ముందు ముందు ఏం జరుగుతుందో తెలుసుకోవాలని కుతూహలంతో చచ్చిపోతున్నారు. ఎవరి నోట విన్నా ఆ కథ గురించే!"

ప్రసాద్ మౌనంగా భోజనం చేస్తున్నాడు.

"నన్ను ఒకటే చంపేస్తున్నారు."

"మధ్యలో నిన్ను చంపెయ్యడమేమిటి?"

"ముగింపు చెప్పమని!"

"నీకెలా తెలుస్తుంది? అది రాస్తుంది నువ్వుకాదని చెప్పు."

"అదికాదు నాన్నా!"

"మరేమిటి?"

"మిమ్మల్నడిగి చెప్పమంటున్నారు?'

"నువ్వు చెబుతానని ప్రామిస్ చేశావా?"

"అవును."

"ఇంకెప్పుడూ అలాంటి తెలివితక్కువ ప్రామిస్‌లు చెయ్యకు. సీరియల్ ఎండింగ్ ఎవరైనా ముందే చెప్పారా?"

సూర్యం ముఖం చిన్నబుచ్చుకున్నాడు.

ఏదో అనడానికి తలెత్తిన భార్య భర్త ముఖం చూసి ఆగిపోయింది.

అతను ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

దిగులుగా ఉన్నట్టు కన్పిస్తున్నాడు.

ఎందుకో చాలా కుంగిపోతున్నాడు.

"ధరణి ఎడిటర్ నా దగ్గరకు వచ్చాడు." అన్నాడు సూర్యం ఉన్నట్లుండి.

"నాచేత తమకో నవల రాయించమని అడగడానికా?"

"అవును."

"అతనికి కూడా ప్రామిస్ చేశావా?" తీవ్రంగా ఉంది ప్రసాద్ కంఠం.

"లేదు." ముక్తసరిగా సమాధానం ఇచ్చాడు కొడుకు.

"రాయకూడదూ?" కృష్ణవేణి అన్నది.

"పన్నెండు వేలు ఇస్తానన్నాడు!" చిన్నతనంనుంచి దరిద్రాన్ని అనుభవించిన సూర్యం అన్నాడు.

కొడుకు మనసులోని భావం అర్థం చేసుకున్నాడు ప్రసాద్.

"సూర్యం!" మృదువుగా పిల్చాడు.

సూర్యం తలెత్తాడు.

"ఇక నేను రాయనక్కర్లేదు. ఈ ఒక నవలతో మన దరిద్రం తీరిపోతుంది. హాయిగా బ్రతకవచ్చు."

ప్రసాద్ మాటలకు అర్థం బోధపడక తల్లీకొడుకులు ముఖముఖాలు చూసుకొన్నారు.

ఇద్దరిలో ఎవరికీ మళ్ళీ ప్రశ్నించే ధైర్యంలేదు.

ప్రసాద్ ఆ రాత్రంతా మథనపడ్డాడు.

తను తప్పు చేస్తున్నాడా? ఆ నవల రాయవలసిందికాదు!

అది చదివి ఎంతమంది పిచ్చివాళ్ళవుతారో?

ఒకవైపు భయపడుతూనే ఎందుకు చదువుతారో? కేవలం థ్రిల్‌కోసం, కుతూహలం కొద్దీ చదువుతారు. మళ్లీ-మళ్లీ అలాంటివే కోరుకొంటారు!

'ఒక నవల చదివి మనిషి మార్తాడా?' అని ఎందరో ప్రశ్నిస్తారు.

ఇలాంటి నవలల ప్రభావం బలహీనమైన మనసుల్ని కుదిపేస్తుందనే విషయం నిర్వివాదం. అందరూ అంగీకరించేదే.

ఈ విషయం రాసేవాళ్లకూ, అచ్చువేసేవాళ్ళకూ, చదివేవాళ్ళకూ కూడా తెలుసు. చివరకు నష్టపోయేది చదివేవాళ్ళే!

ఈ నవల అచ్చు ప్రారంభం అయినప్పట్నుంచీ తనను తిడుతూ చాలామంది ఉత్తరాలు వ్రాస్తున్నారు. వాళ్లు మామూలుగా పత్రికలు చదివే పాఠకులు కారు. తను దయ్యాల కథ వ్రాస్తున్నట్టు విని, నమ్మలేక చదువుతున్నవాళ్లు. వాళ్లు అలా తిట్టి రాస్తుంటే తనకు కోపం రావడం లేదు.

ఇక సాధారణ పాఠకుల ఉత్తరాలు – పత్రికలో అచ్చు అయినవి కాగా, తనకు పుంఖానుపుంఖాలుగా వచ్చి పడిపోతున్నాయి. వాటిని తను చదవకుండానే చింపిపారేస్తున్నాడు.

ఆ నవల ముగింపు గురించి ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయాడు. నిద్రనుంచి కలలోకి. ప్రసాద్‌కు తను పిశాచాల లోకంలో ఉన్నట్టు రకరకాల, వింత వింత కలలు రాసాగాయి.

# 15

ప్రసాద్ వ్రాసి యిచ్చినంతవరకు సీరియల్ పూర్తి అయింది.

చివరి సంచికతోపాటు, ప్రసాద్ ఎడిటర్ పేరుమీద ఇచ్చిన నోట్ కూడా ప్రచురించారు.

ఆ నోట్ చదివిన పాఠకుల్లో సంచలనం బయలుదేరింది.

రెండు వారాలు వ్యవధి ఇచ్చి, అధిక సంఖ్యాక పాఠకుల కోరిక మేరకు ఆ నవల ముగించడమా, లేక అసంపూర్ణంగానే ఆపడమా అనేది ఆధారపడి ఉంటుందని కూడా ప్రకటించారు.

ఆ నోట్ చదివిన కృష్ణవేణికి మతిపోయినట్టే అయింది.

ప్రసాద్‌తో ఇక ఆ పాడు నవల రాయొద్దని మొత్తుకుంది.

ఆమెకు అతను చిరునవ్వే సమాధానంగా ఇచ్చాడు.

ఆమె ఏడ్చింది.

గోల చేసింది.

"పిచ్చిదానా! నవల రాస్తే చచ్చిపోతారా? ఇదో స్టంట్!" అంటూ భార్యకు సర్దిచెప్పాడు. ఆమె మనసు తేలికపడింది. ఆమెతో ముగింపు విషయంలో ఎవరి దగ్గరా మాట్లాడవద్దని చెప్పాడు.

ఆ నోట్ చదివి కమలకు కుతూహలం పెరిగింది.

నిజంగా డాడీ చచ్చిపోతారా?

అలా చచ్చిపోతే చాలా గొప్ప పేరు వస్తుంది. డాడీ గురించి పేపర్లలో రాస్తారు. రేడియోలో చెబుతారు. టి.వి.లో కూడా చూపిస్తారు. ముఖ్యమంత్రి కూడా ఇంటికి వచ్చి....

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావ్?" ప్రసాద్ ప్రశ్నించాడు, అప్పుడే లోపలకు వచ్చి.

"డాడీ, మీరు నిజంగా చచ్చిపోతారా?" కుతూహలంగా అడిగింది కమల.

ప్రసాద్ నవ్వాడు.

"మీరు ఆ నవల ముగించరా?" ఆతృతగా అడిగింది కమల.

ప్రసాద్ కూతురి ముఖంలోకి చూశాడు.

"మా స్నేహితురాళ్ళంతా ఒకటే గోల!"

"ఏమని?"

"అయ్యో! కథ మంచి సస్పెన్సులో ఆగిపోయిందనీ, పూర్తిగా తెలుసుకోనంతవరకూ అశాంతిగా నిద్రపట్టదనీ గోల..."

"పూర్తి చెయ్యమంటావా?"

"చెయ్యండి!" ఉత్సాహంగా అన్నది కమల.

"నేను చనిపోయినాసరే..."

"పోండి డాడీ! ఎక్కడైనా నవల రాస్తే చనిపోతారా ఏం?"

"అవును, చనిపోతారు."

"దయ్యాలు పట్టాయనేగా భయం! బోలెడు మంది మంత్రగాళ్ళు ఉన్నారు" అన్నది కమల.

ప్రసాద్ కూతురి ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

తన కూతురు కూడా ఈనాటి పాఠకులకు ప్రతినిధే!

"రాస్తావుగదూ?"

"రాస్తాను."

"నా స్నేహితులు బలే సంతోషిస్తారు. మా నాన్న నేను బలవంతం చెయ్యడం వల్లే రాస్తానన్నారని చెబుతాను." కళ్ళు తిప్పుతూ గర్వంగా అన్నది కమల.

అప్పుడే వచ్చిన సూర్యాన్ని ప్రసాద్ లోపలకు పిల్చాడు.

అతడి ముఖంలో విచార రేఖలు కన్పిస్తున్నాయి.

"అలా ఉన్నావేం?"

"ఆ ఎడిటర్ నోట్ ఏమిటి?" విసుగ్గా అన్నాడు సూర్యం.

"ఏం?"

"నా స్నేహితులంతా ఇదో స్టంటు అని ఎగతాళి చేస్తున్నారు. రచయితలూ, రచయిత్రులూ కూడా ఆ నోట్ చదివి నవ్వుకుంటున్నారట!" తనకెంతో అవమానం జరిగినట్టు బాధపడిపోతూ అన్నాడు సూర్యం.

"నీ బాధ అదా?"

"మీలాంటి రచయితకి ఈ చీప్‌స్టంట్సు ఏమిటి నాన్నా?"

"ఇది స్టంటో కాదో ముందుగానే ఎలా చెబుతావ్?"

"అంటే?"

ప్రసాద్ సమాధానం ఇవ్వలేదు.

"మీరు ఆ కథ ముగిస్తే నిజంగానే చనిపోతారా?" నమ్మనట్టుగా అడిగాడు సూర్యం.

"నిజంగా చనిపోతే నీకు నీ స్నేహితుల ముందు తలవంచుకోవల్సిన అవసరంలేదు కదా?"

"అప్పుడు వాళ్లే తలవంచుకోవల్సి వస్తుంది."

"అందుకే చిరాకుపడకుండా తాపీగా ఉండు."

"అంటే?"

"వెయిట్ అండ్ సీ!" అన్నాడు ప్రసాద్ కొడుకుతో.

"నాన్నా!"

"ఏమిటి?"

"ఒకటి అడుగుతాను, నిజం చెబుతావా?"

"నువ్వు అడిగే ప్రశ్నమీద ఆధారపడి ఉంటుంది. అయినా, నా నిజాయితీని శంకించడం ఎంతకాలం నుంచి మొదలుపెట్టావ్?"

సూర్యం తలదించుకొన్నాడు.

"క్షమించండి!" అంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

కొడుకు ఏది అడగాలనుకొన్నాడో ప్రసాద్ ఊహించాడు.

'నువ్వు ఇంతవరకు వ్రాసిందంతా నిజంగా నీ జీవితంలో జరిగిందా? ఇది ప్రజల్ని మోసం చెయ్యడం కాదూ?' అని అడగాలనుకొని ఉంటాడు. ఆలోచిస్తూ దీర్ఘంగా నిట్టూర్చాడు శివప్రసాద్.

# 16

రెండు వారాలు సీరియల్ రాలేదు. సీరియల్‌కు బదులుగా పాఠకుల లేఖలు ప్రచురించారు.

పాఠకులు చాలా మంది ఏమైనా సరే ఆ నవల ముగించి తీరాల్సిందేనన్నారు. ఆ సస్పెన్సు భరించలేకపోతున్నామని రాశారు. కొందరు మాత్రం ముగింపువల్ల నిజంగా రచయితకు హాని జరిగేలా వుంటే అంతటితో వదిలెయ్యమని రాశారు.

"వెలుగు-చీకటి" అసిస్టెంటు ఎడిటర్ శేఖర్ ఉత్తరాలు తీసుకొని వచ్చాడు. అతను చాలా ఉత్సాహంగా ఉన్నాడు.

"మీ ఎడిటర్ రాలేదేం?"

"ఆయన ఆరోగ్యం అంత బాగాలేదు సర్! అందుకే నన్ను పంపించారు. ఇలా నవల మధ్యలో ఆపి పాఠకులకు అవకాశం ఇవ్వడం చాలా కొత్త ప్రయోగం సర్!"

'నీ బొంద ప్రయోగం! అందువల్ల ఎవరికి క్షేమం?' మనసులోనే అనుకొన్నాడు ప్రసాద్.

"ఈ నవల ప్రయోగంతో మన పత్రిక సేల్స్ అనుకోనివిధంగా పెరిగిపోయాయి సర్! ఇప్పట్లో మన పత్రికను ఏ పత్రికా పడెయ్యలేదు." ఉత్సాహంగా అన్నాడు శేఖర్.

"నవల అయిపోయాక సేల్స్ పడిపోతే?"

"మరో నవల ఇలాంటిదే...."

"మరో నవల అలాంటిదే రాయడానికి నేనుండనుగదయ్యా?"

"మీరుండకపోతేనేం సర్! మీరు మార్గం చూపించారు. ఆ మార్గంలో నడిచేవాళ్ళు ఎందరో వస్తారు."

ప్రసాద్‌కు అతడి గూబ పగలకొట్టాలనిపించింది. 'యూ రోగ్! గెట్ అవుట్!' అని అరవాలనిపించింది. తను లేకపోయినా ఫర్వాలేదా? ఎంత హాయిగా చెప్తున్నాడు ఆ మాట!

పాఠకులు కూడా నూటికి తొంభయ్ మంది రైటరు చచ్చినా సరే ఆ నవల ముగించాల్సిందే అంటున్నారు!

"సర్! పాఠకుల ఉత్తరాలు చూడండి."

ఉత్తరాల కట్ట అందించాడు.

"ఏమంటున్నారు?"

"ముగింపు చెయ్యాల్సిందే నంటున్నారు సర్!"

"నేను చచ్చిపోయినా పర్వాలేదన్నమాట!" తీవ్రంగా ఉంది ప్రసాద్ గొంతు.

శేఖర్ తడబడ్డాడు.

"నీ ఉద్దేశ్యం?"

"నాదేముంది సర్! మీ...మీ ఇష్టం!" అన్నాడు శేఖర్.

"మీ ప్రొప్రయిటర్ ఏమంటున్నాడు?"

"చాలా హాపీగా ఉన్నాడు సర్! ఐదు వేలు ఇవ్వాలిగా? దానికి మరో రెండు వేలు చేర్చి ఇవ్వమని రాశాడు. మా కందరికి ఒక నెల బోనస్ కూడా ఇచ్చాడు సర్! అదంతా మీ చలవే!"

"కనీసం ఒక సంతోష వార్త విన్నాను."

"మరో రెండు వేలు ఇవ్వడమేగా సర్?"

"కాదు."

శేఖర్ ప్రసాద్ ముఖంలోకి క్వశ్చన్ మార్కు ముఖం పెట్టి చూశాడు.

"మీ అందరికీ ఒక నెల బోనస్ ఇప్పించగలిగినందుకు. నా నవల ఆ మాత్రం ఉపయోగపడినందుకు."

"థ్యాంక్యూ సర్!"

"స్క్రిప్టు ఎప్పటికి కావాలన్నాడు మీ ఎడిటర్?"

"వారం రోజుల్లో పూర్తిగా ఇవ్వమని చెప్పాడు సర్!"

"వారం ఎందుకూ? మూడు రోజుల్లో ఇచ్చేస్తాను."

"థ్యాంక్యూ సర్!"

ప్రసాద్ నవ్వాడు.

"స్క్రిప్టు అందగానే మిగతా ఏడు వేలు పంపిస్తానని చెప్పమన్నాడు సర్!"

"ఎవరు?"

"ఎడిటర్‌గారు."

"నువ్వు తెస్తావా?"

"నేనే తెస్తాను సర్! స్క్రిప్టు తీసుకెళ్ళడానికి వచ్చినప్పుడు చెక్కు కూడా తెస్తాను."

"ఎవరికిస్తావ్?"

"ఇంకెవరికి సర్? మీకే!"

"నీకేం పిచ్చా?"

శేఖర్ ప్రసాద్ ముఖంలోకి నిజంగా పిచ్చివాడిలాగే చూశాడు.

"నీలాంటివాడే రామాయణం అంతా విని రాముడికి సీత ఏమౌతుందని అడిగాడట."

శేఖర్ అయోమయంగా చూశాడు.

"అర్థం కాలేదుగదూ?"

'కాలేదు' అన్నట్టు తల ఊపాడు శేఖర్.

"అప్పుడు నేను ఉండను గదయ్యా!"

"ఎక్కడికి కెళ్తారు సర్?"

"బొందలోకి!"

"సారీ సర్! అసలు సంగతి మర్చిపోయాను. చెక్కు మీ శ్రీమతిగారికి పువ్వుల్లో పెట్టి అందిస్తాం సర్!"

"మాట తప్పితే జాగ్రత్త! నేను పైనుంచి చూస్తూనే ఉంటాను."

"అలా చెయ్యం సార్! ప్రతివారం మీ గురించి రాస్తామని కూడా ఎడిటర్‌గారు చెప్పమన్నారు."

"అదికూడా మీ సర్క్యులేషన్‌కు ఉపయోగపడ్తుందనుకొంటాను."

"అవును సర్!" ఉత్సాహంగా అన్నాడు శేఖర్.

'యూ ఇడియట్! గెట్ అవుట్' అని అరవాలనుకొన్నాడు ప్రసాద్. కాని అలా చెయ్యలేకపోయాడు. తన చావు గురించి ఒక్కరికీ సానుభూతి లేదు. పత్రిక సర్క్యులేషన్

పెరుగుతుందని సంతోషం పత్రిక అధిపతులకు. ఎలాగయినా పూర్తి నవల చదవాలని పాఠకుల కోరిక.

"వెళ్ళొస్తా సర్!" లేచి నిల్చున్నాడు శేఖర్.

"మంచిది. మీ ఎడిటర్‌గారిని అడిగినట్లు చెప్పు. నా మాటల్ని గుర్తుంచుకోమని చెప్పు."

"అలాగే, ఎల్లుండి సాయంత్రం వస్తాను."

"మీ రెందుకూ? మా పెద్దబ్బాయిచేత పంపిస్తాను లెండి. చెక్కు కూడా వాడికివ్వండి."

"నేనే వస్తాను సర్! ఫోటోగ్రాఫర్‌ను కూడా తీసుకొస్తాను. ఎడిటర్‌గారూ, ప్రొప్రయిటరూ కూడా వస్తారండీ!"

"ఫోటోగ్రాఫర్ ఎందుకూ?" అయోమయంగా చూశాడు ప్రసాద్.

"మీ ఫోటోలు!" నసిగాడు శేఖర్.

"నా శవం ఫోటోలా?" శేఖర్ ముఖంలోకి లోతుగా చూస్తూ అన్నాడు ప్రసాద్.

ప్రసాద్ చూపులకు తడబాటుపడ్డాడు శేఖర్.

"పిశాచాలు నా శరీరం మీకు దక్కనిస్తా యనుకొంటున్నారా?" అదోలా చూశాడు ప్రసాద్.

ఆ చూపు పిశాచపు చూపులా అన్పించింది శేఖర్. అతని ముఖం తెల్లకాగితంలా తెల్లబోయింది.

"వస్తాను సర్!" అంటూ ఖంగారుగా వెలుగు-చీకటి అసిస్టెంటు ఎడిటర్ శేఖర్ వెళ్ళిపోయాడు.

ప్రసాద్‌కు నవ్వాలనిపించింది. విరగబడి నవ్వాలనిపించింది. ఏడవాలనిపించింది. భోరున ఏడవాలనిపించింది. జుట్టు పీక్కోవాలనిపించింది.

కాని, అందులో ఏ ఒక్కటీ చెయ్యలేదు.

దిగ్గున లేచి రైటింగ్ టేబుల్ ముందు వెళ్ళికూర్చున్నాడు. సొరుగులాగి తెల్ల కాగితాలు బయటికి తీశాడు. ఆ కాగితాలు ఎప్పుడో కొన్నవి. పట్టుకొంటే చిరిగేలా ఉన్నాయి. తను ఒక రచయిత, తెల్ల కాగితాలు కొనుక్కోలేని రచయిత!

పెన్ తీశాడు. ఓ అర్ధగంట కళ్ళుమూసుకొని ఆలోచిస్తూ కూర్చొన్నాడు. మనసులోనే రాసినంతవరకు మననం చేసుకొన్నాడు. చివరి వాక్యంతో ప్రారంభించాడు "మరో దయ్యం కథ"ను.

# 17

"రహమాన్...కూడా..." నా గొంతు కీచుమన్నది. భయంగా భూతరాజు ముఖంలోకి చూశాను.

"అవును."

"భూతం! నువ్వు లోపలకెళ్ళు." భూతరాజు వాక్యం పూర్తికాకుండానే భైరవమూర్తి గర్జించాడు.

భూతరాజు మెరుపులా అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు. నేను భైరవమూర్తిని చూశాను. అతను రెండు చేతులతో ఉయ్యాల గొలుసులు పట్టుకొని చిన్నగా వెనక్కూ ముందుకూ ఊగుతూ నన్నే కన్నార్పకుండా చూస్తున్నాడు.

మరీ అవేం కళ్ళు, అలా ఉన్నాయ్? జంతువుల కళ్లలా ఉన్నాయ్! అతనికి చీకట్లోకూడా కన్పిస్తుందేమో! ఏదో చెప్తాను రమ్మన్నాడు. మరి చెప్పడేం? అలా చూస్తాడేం? శత్రువును చూసినట్టు చూస్తాడేం?

వీళ్ళంతా ప్లాను వేసుకొనే నన్ను పిలిపించి ఉంటారు. రహమాన్, భూతరాజు, భైరవమూర్తి – ముగ్గురూ ఒకే గ్రూపు. అలా చేసినందువల్ల వాళ్లకేం వస్తుంది? ఏ ప్రయోజనం లేకుండా నా చుట్టూ ఈ సాలెగూడు అల్లాల్సిన అవసరం వాళ్ళకేముంది?

వీళ్ళు నా రచనలు చదివి ఉంటారు.

నేను అమధ్య మంత్రాల సాహిత్యాన్నీ, పిశాచాల సాహిత్యాన్నీ కాస్త గట్టిగానే విమర్శిస్తున్నాను. భావి భారత పౌరులను తయారుచేస్తున్న ఆచార్యవర్యులు కూడా దయ్యాలగురించీ, చేతబడులగురించీ, వశీకరణ మంత్రాలగురించీ వ్రాయడం చూస్తుంటే నాలోని రక్తం కుతకుతలాడిపోతున్నది. వాళ్ళ నమ్మకాలను వాళ్ళవరకే ఉంచుకొంటే ఎవరికీ బాధలేదు. సాహిత్యం పేరుతో అమాయకుల మనసుల్లోకి మూఢ నమ్మకాలను కూరుతుంటే నిజాయితీగల ఏ రచయితా భరించలేడు. అందువల్లనే నేను అవకాశం దొరికినప్పుడల్లా ఈ విషయం గురించి మాట్లాడుతూనే ఉన్నాను. కొందరు ఉడుక్కుని, ఆ ఉడుకుబోతుతనాన్ని అనేక రకాలుగా కక్కడం కూడా నాకు తెలుసు. వాళ్ళు కక్కిన ఆ పదార్థంలో వాళ్ళ కడుపుల్లోని అజీర్తే కన్పించింది నాకు.

వాళ్ళే భైరవమూర్తి ద్వారా నన్ను ఏడ్పించడానికి ఈ పన్నాగం పన్నలేదుగదా? అంతే అయివుండాలి. ఇందులో దయ్యంగాడు ఎవడూ లేడు. చీకటిరాత్రిలో, నా మనసును బలహీనపర్చి, ఆ తర్వాత రకరకాల ధ్వనులతో మాటలతో నన్ను భయపెట్టి పిచ్చివాడ్ని చెయ్యాలని వేసిన ప్లాను ఇది.

మూఢనమ్మకాలు ఉన్నవాళ్లకు అవి లేవనే వాళ్లను చూస్తే చాలా కోపం. భగవంతుడ్ని నమ్మేవాళ్లు నాస్తికులతో ఆ విషయంమీద మాట్లాడటానికే ఇష్టపడరు. అంతవరకూ ఎందుకు? పిచ్చిగా బాబాలనూ, అమ్మల్నీ నమ్మేవాళ్లయితే వాళ్ళను విమర్శించేవారికి దూరంగా పారిపోతారు.

ప్రఖ్యాత రచయిత విల్ డ్యురెన్ట్ అన్న మాటలు నాకు గుర్తొచ్చాయి ఆ క్షణంలో. "ద స్టోరీ ఆఫ్ సివిలిజేషన్" అనే పుస్తకంలో ఆయన ప్రజల మూఢనమ్మకాల గురించీ, అంధ విశ్వాసాల గురించీ చెబుతూ "రెలిజన్స్ ఆర్ మోర్టల్ బట్ సూపర్‌స్టిషన్స్ ఆర్ ఇమ్మోర్టల్" అన్నాడు.

కాలక్రమేణా మతరూపాల్లో కూడా మార్పులు వచ్చాయి.

నేటి హైందవ మతాన్ని పూర్వకాలపు వైదిక మతంతో పోల్చిచూస్తే భేదం స్పష్టంగా కన్పించగలదు. కాలక్రమేణా ఎన్నో మార్పులూ చేర్పులూ జరగడం అసహజం కాదు.

దేవుళ్ల ప్రాముఖ్యతకూడా మారుతూనే వస్తోంది. ఈనాడు కలియుగ దైవంగా భావించబడుతున్న తిరుపతి శ్రీనివాసులు ఇటీవలివాడే. కొద్దికాలంగా అయ్యప్పస్వామి పేరు విరివిగా విన్పిస్తోంది. ముఖ్యంగా సినిమా ప్రపంచంలో అయ్యప్పన్ బాగా జోరబడ్డాడు. మరికొంతకాలంపోతే ఈయనగారు, శ్రీనివాసులుగార్ని ఓవర్‌టేక్ చేసే ప్రమాదం లేకపోలేదు. మరి నిన్న మొన్నటినుంచే 'సంతోషిమాత' పేరు విన్పిస్తోంది. దక్షిణాదిన ఆ సినీమా వచ్చాకే ఆమె ప్రభావం స్త్రీల మనసులమీద ఎక్కువ కన్పిస్తోంది. కొన్నాళ్లకు ఆడవాళ్ల కలియుగ ప్రత్యక్ష దేవత ఆవిడగారే అయికూర్చున్నా ఆశ్చర్యపడాల్సిన పనిలేదు.

కాలంతోపాటు ఉత్పత్తి సాధనాలూ-వాటితోపాటు మనిషి, ఆలోచనలూ, జీవిత విలువలూ మారుతూనే వస్తున్నాయి.

కాని దురదృష్టం ఏమిటంటే, మానవుడి బుర్రలో అనాదినుంచీ వేళ్లుపాతుకుపోయిన మూఢనమ్మకాలు మాత్రం చెక్కు చెదరకుండా వెంట వస్తూనే ఉన్నాయి. అంధవిశ్వాసాలు యథాతథంగా మానవుడు తన జనరేషన్‌నుంచి మరో జనరేషన్‌కు చాలా పదిలంగా అపురూపంగా అందిస్తూనే ఉన్నాడు.

నాటి రాతియుగపు మానవుడ్ని పట్టుకొన్న దయ్యాలూ-భూతాలూ నేటి అణుయుగంలోని మానవుడ్నికూడా వదలలేదు. గొప్ప సైంటిస్టులు కూడా అమ్మల్నీ బాబాలను నమ్ముతూనే ఉన్నారంటే నాకు అప్పుడప్పుడు సందేహం కలుగుతూ ఉంటుంది. నిజంగా వాళ్లు నమ్ముతున్నారా? లేక, తమ స్వార్థపూర్తికోసం వాళ్లకు అండగా నిల్చి, ప్రజల్ని నమ్మిస్తున్నారా అని!

"ఏమండీ రచయితగారూ? అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?"

బాగా లాగి వదలిన ఎలాస్టిక్ వైరు చివర్లవలె నా బుర్రలో ఆలోచనలు ఒకదాన్నొకటి ఢీ కొట్టాయి. నేను తృళ్ళిపడ్డాను. నా ఆలోచనల లోకంలో నేనున్న పరిసరాల్నే మర్చిపోయాను.

"మీరు వచ్చిన పని మర్చిపోయారా?"

"మీరు పిల్చారు. నేను వచ్చాను. మీరు ఏదో చెప్తానన్నారు. చెప్పండి వింటాను." చాలా ధైర్యంగా అన్నాను.

కుర్చీలో నిటారుగా కూర్చుని 'ఇక చెప్పు!' అన్నట్టు భైరవమూర్తి ముఖంలోకి చూశాను.

"ఆకలేస్తుందా? ఏమైనా తింటారా?"

"తెల్లవారుతూ ఉంది. ఇప్పుడు తిండేమిటి? చెప్పండి."

"ఇప్పుడు రెండే అయింది!"

"నాలుగు అవస్తోంది!" అంటూ గడియారం చూసుకొన్నాను.

నాకు మతిపోయినట్టే అయింది. ఊళ్లోకి ప్రవేశించేసరికి నా గడియారంలో మూడు దాటడం చూశాను. కాని, ఇప్పుడు రెండే అయింది! ఇదెలా సాధ్యం? నేను గడియారాన్ని వెనక్కు తిప్పలేదే?

ఆ గాభరాలో నాకు అలా కన్పించి ఉంటుంది. ఎప్పుడు తెల్లవారుతుందా అనే ఆతృతతో ఉండడంవల్ల నాకు అలా కన్పించి ఉంటుంది. ఇక ఇలాంటి చిన్న విషయాల గురించి ఆలోచించి మనసు పాడుచేసుకోవడం అనవసరం.

"ఇప్పుడేమీ వద్దు! మీరు చెబుతానన్న ఆ హత్యా రహస్యం చెప్పండి."

"మీ రచనలు చదివాను. చాలా చక్కగా రాస్తారు. అయితే మీరు దేవుడ్నీ, దయ్యాన్నీ, మరణాంతర జన్మల్నీ నమ్మరు. అందుకే మిమ్మల్ని పిలిపించాను."

"మీరు నమ్ముతారా?" నేను అడిగాను.

"నమ్ముతాను."

"మరి వాటిని నమ్మే రచయితలు చాలా మంది ఉన్నారుగా? వాళ్ళకా ఉత్తరం రాయలేకపోయారా? వాళ్ళయితే మీరు చెప్పే ట్రాష్ అంతా నమ్మి, ఉద్గ్రంథాలు రచించేవారు!" కోపంగా అన్నాను.

అతడు చిరునవ్వు నవ్వాడు. వాడు నవ్వకుండా ఉంటే బాగుండును అని అన్పించింది నాకు.

అదేమిటో వాడు నవ్వినప్పుడల్లా నాకు అలాగే అన్పిస్తోంది.

"నమ్మేవాళ్ళకు చెప్పడం ఎందుకూ? నమ్మనివాళ్ళకే చెప్పాల్సిన అవసరం ఉంది."

"ఇంతకీ మీరు నన్ను రప్పించింది దయ్యాలున్నాయని నమ్మించడానికా?" నేను చివ్వున లేచి నిల్చున్నాను.

"నమ్మడం - నమ్మకపోవడం మీకే వదిలేస్తాను. నేను చెప్పదల్చుకొన్నది చెప్తాను. మీరు దయచేసి కూర్చోండి."

నేను విసుగ్గా కూర్చున్నాను.

"చనిపోయాక జీవుడు పడే నరకయాతన గురించి మీకేం తెలుసు? ఒకటి కాదు- రెండు కాదు-ఎనభైనాలుగు లక్షల రకాల నరకాలున్నాయ్!"

'నీకు పిచ్చిపట్టింది' అని అరవాలనుకొన్నాను. కాని, మౌనంగా ఉండిపోయాను వాడి శరీర సౌష్టవాన్నీ, బలాన్నీ అంచనా వేస్తూ.

"ఇక్కడ్నుంచి యమలోకం ఎంత దూరమో మీకు తెలుసా?"

"ఆ తెలుసు, మీకూ నాకూ మధ్య ఉన్నంత దూరం!" వళ్ళుమండి అన్నాను.

మూర్తి గలగల నవ్వాడు. మట్టికుండల దొంతర రాళ్ళమీదకు దొర్లి పగిలినట్టుగా ఉంది అతని నవ్వు. "కరెక్ట్! ఇక్కడ్నుంచి యమలోకం 98 క్రోసులు ఉంది. మన మధ్య ఉన్న దూరం కూడా అదే!" అర్థయుక్తంగా నవ్వాడు.

"ఇవి చెప్పడానికే పిల్చారా? ఈ విషయాలు వినడానికి మీదాకా రానక్కర్లేదు. మా రచయితలే ఎంతో చక్కగా, అచ్చంగా వాళ్ళు ఆ లోకాలన్నీ తిరిగివచ్చినట్టే రాస్తున్నారు. పిశాచాల మధ్య విహరిస్తున్నట్టూ, వాళ్ళే స్వయంగా పిశాచాలైపోయి, తమ స్వంత అనుభవాన్ని చెబుతున్నారా అన్నంత గొప్పగా రాస్తున్నారు."

భైరవమూర్తి ఉయ్యాల ఊపు పెద్దది వేశాడు.

"మూర్తిగారూ! మిమ్మల్నొక విషయం అడగాలని ఉంది - చెప్తారా?"

"అడుగు." పాదం నేలకు తన్నిపట్టి ఉయ్యాలను కదలకుండా ఉంచాడు.

"మీకు తొంబయ్ రెండేళ్ళని రాశారు. కాని మీ తల నెరవలేదు. శరీరపటుత్వం సడలలేదు. ఒక్క పన్ను కూడా కదిలినట్టుగా లేదు. ఈ వయసులో ఇలా ఎలా ఉండగలిగారు? దీని రహస్యం చెబుతారా?" అడిగాను.

మూర్తి నేలకు తన్ని పట్టిన కాలును గాలిలోకి విసిరాడు. ఉయ్యాల ముందుకెళ్ళి ఎత్తుకు లేచింది. కొద్దిక్షణాలు గాలిలోకి కాళ్ళు తన్ని పట్టి ఉయ్యాలను అలాగే గాలిలో నిలబెట్టాడు. అది చూడగానే మళ్ళీ నా మనసులో ఏదో పురుగు తొలచసాగింది. ఆ పురుగు పేరు భయం!

"నా ప్రియురాలు కోసం నిరీక్షిస్తున్నాను. అందుకే నాకు ముసలితనం రాలేదు." మళ్ళీ ఉయ్యాలలో వెనక్కు వచ్చి కాళ్ళు నేలకు తన్ని అన్నాడు మూర్తి.

"మీ ప్రియురాలు ఎక్కడుంది?"

అతను పైకి చెయ్యెత్తి చూపించాడు. "ఆమె నన్ను ప్రేమించడం లేదు. నేను ఆమెను ప్రేమిస్తున్నాను. మా ఇద్దరిమధ్య మరొకడున్నాడు. వాడ్ని తొలగిస్తేగాని నాకు నా ప్రియురాలు దక్కదు."

నాకు వళ్ళు జలదరించింది. "పైనున్న ప్రియురాలి కోసం ఎదురుచూడటం ఏమిటి?" ఎలాగో అన్నాను.

"అవును. ఆవిడ ప్రేతయోనిలో ఉంది. దాని ప్రియుడు మాత్రం పుడుతున్నాడు. చస్తున్నాడు..." అంటూ నా కళ్ళల్లోకి లోతుగా చూశాడు.

నాకు ఈజిప్టు యువరాణి...నేను మార్గమధ్యంలో చూశానని భ్రమపడిన హెలన్ గుర్తొచ్చింది. నేను చూశాననుకొన్న ఆ దృశ్యం భ్రమకాదా? వీడే ఆ ఫిరోన్‌తీతాన్ కాదుగదా? నాకు సిగరెట్ తాగాలనిపించింది. సిగరెట్ పెట్టె ఉంది. కాని అగ్గిపెట్టె లేదు.

"మీరేమీ అనుకోకుండా ఉంటే అగ్గిపెట్టె ఇప్పిస్తారా?"

"అలాగే. భూతరాజు! అగ్గిపెట్టె తీసుకురా!"

భూతరాజు వచ్చాడు.

"సాయంత్రం ఒక పుల్లుంటే దీపం వెలుగించాను. రేపు కొనొచ్చు లెమ్మని బద్ధకించాను" అన్నాడు భూతరాజు.

అగ్గిపెట్టె అడిగి నేను భైరమూర్తి ముఖంలోకి చూశాను. అతని ముఖంలో మార్పులేదు. అయితే అతను భూతం కాదు. మామూలు మనిషే! నా తలకూడా పిశాచాల గృహంగా మారిపోయే అవకాశం లేకపోలేదనిపించింది. మరో రెండురోజులు ఇలాగే ఆలోచిస్తే చాలు!

"అసలు విషయానికి వద్దాం" అన్నాడు భైరవమూర్తి.

నాకు సగం దూరం పోయిన ప్రాణం తిరిగివచ్చినట్టు అయింది.

"మాది జమీందారుల వంశం. మా నాన్నగారికి నేను ఒక్కడ్నే సంతానం. నేను వివాహం చేసుకోలేదు. చివరకు ఒక్కడ్నే మిగిలిపోయాను. నాకుతోడు నమ్మినబంటు

భూతరాజు ఉంటున్నాడు. ఇది జరిగి దాదాపు నలభై ఏళ్లు అయింది. అంటే - అప్పుడు నా వయసు నలభైరెండు అన్నమాట.

ఈ భవనం వెనకనే నా పొలాలున్నాయి. పొలాలలో కూలీలు పనులు చేస్తుంటారు. భవంతిలో కూడా నౌకర్లు చాలామంది ఉన్నారు. నేను ఎక్కడికెళ్ళినా గుర్రపు బగ్గీమీదే వెళ్ళేవాడ్ని. ఒకరోజు ఉదయం ఒక నౌకరు పరిగెత్తుకొచ్చి మా పొలాల చివర తెల్లవారేసరికి ఓ గుడిసె వెలిసిందని చెప్పాడు. నాకు ఆశ్చర్యం కలిగింది. ఆ గుడిసె నా పొలంలో లేదు కనక నేను పెద్దగా పట్టించుకోలేదు.

రెండోరోజు, ఆ గుడిసెలో ఒక ముసల్ది ఉంటుందనీ, అది పగలంతా లోపలే ఉంటుందనీ, ఎవరితో మాట్లాడదనీ మరొక నౌకరు వచ్చి చెప్పాడు. విన్నాను. కాని ఆ విషయం కూడా నేను పెద్దగా పట్టించుకోలేదు. ఆ ముసల్ది ఎవరు? ఎక్కడ్నుంచి వచ్చింది? ఇక్కడికే ఎందుకొచ్చింది? ఏం తింటున్నది? ఎలా జీవితం గడుపుతున్నది? ఇలాంటి ప్రశ్నలేవీ నేను వేసుకోలేదు. ఒకరోజు మా పొలంలోని బావి నుంచి చిన్న బిందెతో నీళ్ళు పట్టుకెళ్ళడం చూశాను. నేను పెద్దగా పట్టించుకోలేదు అప్పుడు కూడా.

ఒకరోజు నా గుర్రంబండివాడు పరిగెత్తుకొచ్చాడు.

"సాబ్! నేను ఏదో పనిమీద ఆ గుడిసె వైపుకు వెళ్ళాను. గుడిసె తడికె తెరిచి ఉంది. తొంగిచూశాను. ముసల్ది కూర్చొని ఉంది. ఆమె ముందు నేలమీద బంగారు నగలు ఎన్నో పరిచి ఉన్నాయి. నాకు ఆశ్చర్యం వేసింది. ఆమె ఒక్కొక్క నగే తీసి ఓ క్షణం దాన్ని చూసి ఒక మట్టిముంతలో వెయ్యసాగింది. ఎన్ని నగలో!" రొప్పుకుంటూ ఉద్విగ్నతతో చెప్పాడు వాడు.

నా ఆశ్చర్యానికి అంతులేదు.

"నీ ముఖం, నువేం చూశావో" అని అన్నాను.

"లేదు సాబ్! నిజంగా చూశాను. నా కళ్ళు జిగేల్‌మన్నయ్!" అన్నాడు వాడు.

"ఆ ముసల్ది దొంగల ముఠాకు సంబంధించింది అయివుంటుందంటున్నారు బాబుగారూ!" అని మళ్ళీ అన్నాడు.

"ఎవరంటున్నారు?"

"మన పనివాళ్లంతా."

"అందరికీ దాని దగ్గరున్న నగల గురించి చెప్పావా?"

"చెప్పలేదు. తమరికే చెప్తున్నాను."

"ఎవరికీ చెప్పకు. దొంగల ముఠాకు సంబంధించిందే అయి ఉండాలి. ఏదన్నా జరిగితే వాళ్లు మనందర్నీ ఊచకోత కోస్తారు" అన్నాను నేను బండివాడితో.

ఆ రోజు రాత్రి నేను భోజనం చేసి పడుకున్నాను. మా ఇంట్లో పనివాళ్లు భోజనాల దగ్గర కూర్చున్నారు. ఆకస్మాత్తుగా స్త్రీ ఆర్తనాదం "రక్షించండి! రక్షించండి!" అని విన్పించింది.

నేను మంచం మీద నుంచి ఒక్క దూకు దూకేను. ఇంట్లోనుంచి ఆ ఆర్తనాదం వచ్చిన వైపు పరుగుతీశాను. నా వెనకే నా నౌకర్లూ వచ్చారు. మాకు అల్లంత దూరంలో

ఇద్దరు యువకులు అక్కడే ఆగిఉన్న టాంగా ఎక్కారు. టాంగా వేగంగా పరుగుతీస్తూ కనుమరుగైంది.

మేము గుడిసె దగ్గరకు వెళ్ళాం. ఆ భయంకర దృశ్యం చూసి నిలచిపోయాం శిలాప్రతిమల్లా. ఆ ముసలమ్మ రక్తపు మడుగులో పడి ఉంది. నేను నౌకర్ని పోలీసు స్టేషన్‌కు పంపించాను, సమాచారం ఇచ్చి రమ్మన్ని. నేను ఇంటికి వచ్చేశాను."

చెప్పి రెండు కాళ్లూ నేలకు గట్టిగా తట్టి పైకిలేపాడు భైరవమూర్తి. ఉయ్యాల ఉసిగా పైకి లేచి అంతే ఉసిగా కిందకు వచ్చింది. దాని ఊపు వేగం తగ్గడానికి కొన్ని నిముషాలు పట్టింది.

"పోలీసులు మిమ్మల్ని ప్రశ్నించారా?" నేను అడిగాను.

"లేదు" అన్నాడు మూర్తి.

"ఆశ్చర్యంగా ఉందే!" అన్నాను.

"ఆశ్చర్య పడాల్సిన విషయం ఇంకా చెప్పందే?" అదోలా చూస్తూ అన్నాడు భైరవమూర్తి.

క్రైం కథ వింటూ, అంతవరకు నన్ను తరిమిన దయ్యాలను గురించి పూర్తిగా మర్చిపోయాను. అందువల్ల అతను ఎలా చూసినా, ఎలా నవ్వినా భయం కలగడం లేదు. ధైర్యంగా వింటున్నాను.

"చెప్పండి" అన్నాను.

"రెండో రోజు ఉదయం పోలీసులతోపాటు నేనూ మా పొలంలో ఉన్న ఒక చెట్టు కిందకు వచ్చాను. అక్కడి దృశ్యం చూసి అందరం అవాక్కయి పోయాం. కారణం - అక్కడ రెండు శవాలున్నాయి. వాళ్ళిద్దరూ శివం, రామం అని గుర్తించాను."

"వాళ్లెవరూ?" అని అడిగాను.

"వాళ్లు అంతకు రెండు రోజుల ముందు ఈ ఊరు వచ్చారు. ఊరి బయట ఉన్న చిన్న లాడ్జిలో దిగారు. అసలు వాళ్లు ముసలమ్మను చంపి ఆ నగలు కొట్టెయ్యడానికే ఈ ఊరు వచ్చారని నేను అర్థం చేసుకున్నాను. ఆ సంగతే పోలీసులకు చెప్పాను."

"అంతకుముందు మీరు వాళ్లను చూశారా?" నేను భైరవమూర్తి ముఖంలోకి చూస్తూ అడిగాను.

"చూడలేదు."

"మరి ఆ శవాలు వాళ్లవేనని మీకెలా తెలిసింది?"

"నాకు భూతరాజు చెప్పాడు." తడుముకోకుండా సమాధానం ఇచ్చాడు మూర్తి.

"వాళ్లను కూడా కత్తితో చంపారా?"

"కాదు - గొంతు పిసికి."

"ఆ విషయం మీకెలా తెలుసు?"

"నాలుకలు పైకి వచ్చాయి. కళ్లు తెరుచుకొని ఉన్నాయి."

"పోలీసులు హంతకుల్ని పట్టుకోవడానికి ప్రయత్నం చేశారా?" అడిగాను.

"చెయ్యలేదు."

"చిత్రంగానే ఉంది. గ్రామంలో మూడు హత్యలు జరిగాయి. అయినా పోలీసులు పట్టించుకోలేదు!" నాకు నేనే చెప్పుకొంటున్నట్టుగా అన్నాను.

"మూడు కాదు, నాలుగు!" కంచు మోగినట్టు మోగింది భైరవమూర్తి కంఠం.

"నాలుగేమిటి?" అయోమయంగా అడిగాను.

"హత్యలు!"

"నాలుగా! నాలుగోవాడెవడూ?"

"గుర్రంబండిలో వాళ్ళను ఎక్కించుకొచ్చినవాడు - రహమాన్!"

నేను ఇంతెత్తున ఎగిరిపడ్డాను.

"రహమానా?" గొంతు పెగుల్చుకొని అడిగాను.

"అవును. వాడే! వాడే నా బగ్గీ తోలేవాడు. నాకు తెలియకుండా నా బగ్గీలోనే హంతకుల్ని తెచ్చాడు, రాస్కెల్!" పళ్ళు పటపట కొరికాడు భైరవమూర్తి.

"ఆ రహమాన్‌తోనే నువ్వు ఈ ఊరు వచ్చావ్!" నన్ను చూస్తూ మళ్ళీ అన్నాడు భైరవమూర్తి.

"అబద్ధం! వాడూ వీడూ ఒక్కడు కాడు." అరిచాను. మూర్తి అదోలా నవ్వాడు. నేను భయాన్ని వెనక్కు నెట్టి "ఆ తర్వాత ఏమైంది?" అన్నాను.

"వాళ్ళ శవాలపక్కనే ఒక చిన్న గొయ్యి తవ్వి ఉంది. ఆ పక్కనే ఒక మట్టిముంత ఉంది. దాంట్లోనే ముసలమ్మ నగలు దాచుకొనేదట. కాని దాన్ని పోలీసులు ఎత్తిచూసి ఒకసారిగా వదిలేశారు. అందులో నగలకు బదులు మనిషి పుర్రె, కొన్ని ఎముకలు ఉన్నాయ్!"

"ఓ మైగాడ్!" నా నోట్లో నుంచి అనాయాసంగా వచ్చేసింది.

మూర్తి ముఖం గంభీరంగా మారింది.

వీడే ఆ ముసలిదాన్ని చంపేసి ఉంటాడు. ఆ ముగ్గురికీ భాగం పెడ్తానని ఆశ చూపించి వాళ్ళద్వారా చంపించి ఉంటాడు. వాళ్ళను కూడా ఇతడే చంపించి ఉంటాడు. ఊరికి పెద్ద. జమీందారు వంశజుడు. చిన్న ఊళ్లో ఉన్న ఆ హెడ్‌కానిస్టేబుల్‌కూ, పక్క తాలూకా సబ్ ఇన్స్‌పెక్టర్‌కూ ఇతడ్ని ఇరికించేటంత ధైర్యం ఉండి ఉండదు.

'ఏమిటి ఆలోచిస్తున్నావ్?' భైరవమూర్తి కంఠం కర్కశంగా ఉంది.

'పారిపో! పారిపో! వాడు దుర్మార్గుడు. వాడు నిన్ను చంపడానికే ఇక్కడకు పిలిపించాడు' ఎవరో నా చెవుల దగ్గర గుసగుసగా చెప్తున్నారు.

భైరవమూర్తి ఉయ్యాల మీదినుంచి ఒక్కసారిగా దూకాడు. నేను ఒక్క ఉదుటన కుర్చీలో నుంచి లేచి వెనక్కు జరిగాను. అక్కడ అంతవరకూ ఉన్న ఉయ్యాల లేదు. నా మతిపోయినట్టయింది. అరవాలనుకొన్నాను. గొంతు పెగల్లేదు.

"నీ కోసమేరా నేను ఎదురు చూస్తుంది ఇన్నివేల సంవత్సరాలుగా! ఇవ్వాళ చిక్కావు!" భైరవమూర్తి భయంకరంగా అరిచాడు.

వాడు తన రెండు చేతులనూ ముందుకు చాస్తున్నాడు. అతడ్ని ఎవరో వెనక్కు లాగుతున్నట్టు అన్పించింది నాకు. నేను హాలులో నుంచి పారిపోవాలని పరుగుతీశాను. అన్ని తలుపులూ వేసి ఉన్నాయి

"ఒరేయ్! నీకెంత ధైర్యం, నన్ను పట్టుకున్నావ్! వదులు, వాడ్ని చంపేస్తాను."

ఏదో అదృశ్య శక్తి భైరవమూర్తి నా దగ్గరకు రాకుండా అడ్డుపడుతోందని అర్థం చేసుకొన్నాను.

"ఒరేయ్ భూతరాజూ! నన్ను వదుల్తావా లేదా?" భైరవమూర్తి అల్‌సేషన్ డాగ్‌లా అరుస్తున్నాడు.

భూతరాజా? భూతరాజు నన్ను రక్షిస్తున్నాడా? ఏడీ, నాకు కన్పించడేం! నా బుర్ర మొద్దుబారిపోయింది. కళ్ళప్పగించి నిల్చుండిపోయాను.

"ఒరేయ్ గాడ్దికొడకా, వదల్రా నన్ను!"

"వదల్ను. పారిపోండి బాబూ!" భూతరాజు గొంతుమాత్రం విన్పించింది.

"నీ పని చెప్తానుండరా!" భైరవమూర్తి చాలా పెద్దగా అర్చాడు.

ఆ వెంటనే అతని రూపం పొగగా మారిపోయింది. ఆ పొగకూడా మానవ రూపంగానే కన్పిస్తోంది. మరో పొగ. మరో పొగ. భైరవమూర్తి చుట్టూ పొగలు వ్యాపించాయి. అవి కూడా మానవాకారంలోనే ఉన్నాయి. రకరకాల అరుపులు! కుక్కల అరుపులు! గుడ్లగూబల అరుపులు! కీచురాళ్ళ అరుపులు! వింత వింత ధ్వనులు! ఒకళ్ళతో ఒకళ్ళు పోరాడుతున్నట్టు శబ్దాలు!

"పారిపో డియర్!" ఒక స్వీట్ వాయిస్ నా చెవిలో రహస్యంగా చెప్పింది.

"దొంగముండా! నేను వినలేదనుకొంటున్నావా? నీ ప్రియుడ్ని రక్షించడానికి వచ్చావా? వస్తావని తెలుసే! అందుకే వాడ్ని ఇక్కడకు రప్పించాను."

నీడలాంటి సన్నని ఆకారాన్ని పట్టుకోడానికి ఓ పెద్ద ఆకారం ప్రయత్నిస్తోంది. ఆ రెండు ఆకారాల మధ్య మరో రెండు ఆకారాలు అడ్డం పడుతున్నాయి.

"నువ్వూ వచ్చావట్రా రహమాన్!" భైరవమూర్తి కంఠం.

బయట ఉరుములు మెరుపులు! వర్షంపడ్తున్న ధ్వని! అంతకుముందున్న ధ్వనులు దూరంగా ఒకదాన్నొకటి తరుముతున్నట్టు విన్పిస్తున్నాయి. ఎవరో `తలుపు తెరిచినట్టుగా అయింది.

అంతలోకే హాలులోకి వెలుగు వచ్చింది. నా కళ్ళముందు మళ్ళీ ఉయ్యాల. ఉయ్యాల గొలుసు పట్టుకొని కూర్చున్న ఓ ముసల్ది నన్నే చూస్తూ బోసి నోటితో నవ్వింది. నేను ఒక్కసారిగా కెవ్వున అరిచాను. బయటికి పరుగుతీశాను. ఎంత దూరం పరిగెత్తానో తెలియదు. అరుస్తూ ఊళ్ళోకి పరుగులు తీస్తున్నాను. పడిపోతున్నాను.

"పారిపోండి! జనంతోపాటు మంత్రగాడు కూడా వస్తున్నాడు." రహమాన్ గొంతులా అన్పించింది.

"జాగ్రత్త! ఈ కథ రాశావా, అది పూర్తి చేసిన రోజే నిన్ను మేమందరం కలిసి పీక్కుతుంటాం." మరో కంఠం. ఆ కంఠం భైరవమూర్తిది.

నేను పడిపోయాను. ఆ తర్వాత ఏం జరిగిందీ నాకు తెలియదు. కళ్ళు తెరిచేసరికి తెల్లగా తెల్లవారింది. నా చుట్టూ జనం!

"ఆ దయ్యాల కొంపకు వెళ్ళినట్టున్నాడు." ఒకడు అన్నాడు.

"బతికి బయటపడ్డాడు. అదృష్టమే!" మరో గొంతు.

ఎవరో నన్ను లేవదీశారు. కాఫీ తాగించారు. అప్పటికి తేరుకున్నాను. ఎవరేమడిగినా సమాధానం చెప్పలేదు. మధ్యాహ్నానికి కొంత తేరుకున్నాను. ఊరికి వెళ్ళిపోతానని చెప్పాను.

ఒకతను నాతో పక్క ఊరిదాకా వచ్చి, ఏలూరు బస్ ఎక్కించాడు. అక్కడ్నుంచి హైదరాబాద్ వచ్చాను. మంచం పట్టాను. జ్వరం ముంచుకొచ్చింది. కొద్దిరోజుల్లోనే ఆరోగ్యం కుదుటపడింది.

ముగించాను.

ముగిస్తుండగానే నా తలలో ఏవేవో పేలిపోతున్నట్టుగా అన్పించసాగింది. అతికష్టం మీద చివరి పేజీలు రాశాను.

కిటికీ దగ్గర శబ్దం అయింది. ఎవరో నన్ను పిలుస్తున్నారు. వెళ్ళకుండా ఉండలేకపోతున్నాను, అర్ధరాత్రి! అందరూ నిద్రలో ఉన్నారు. నేను వెళ్ళిపోతున్నాను. అరుగో, వాళ్లు నన్ను...పిలు...స్తు......రు. నా పాఠకులకు...నా...శుభా..."

# 18

రెండోరోజు ఉదయం సూర్యం, 'వెలుగు–చీకటి' పత్రికాఫీసుకు వెళ్ళాడు. ఎడిటర్ సుందర్రావు అతన్ని చూస్తూ ఉండిపోయాడు. ఏదో అడగాలని భయంవేసి ఆగిపోయాడు.

"స్క్రిప్టు తెచ్చాను!" అంటూ ఎడిటర్‌కు అందించాడు సూర్యం.

"మీ నాన్నగారు..." అసిస్టెంట్ ఎడిటర్ శేఖర్ సగంలో ఆపాడు.

"రాత్రి నన్ను పిల్చి చెప్పారు. ఉదయం ఏదో పని ఉండి బయటికి వెళ్తున్నాననీ, ఉదయం కాగితాలు తీసుకెళ్ళి మీ ఆఫీసులో ఇవ్వమనీ చెప్పారు" అన్నాడు సూర్యం.

"అయితే మీ నాన్నగారు చచ్చిపోలేదా?" ఎడిటర్ చలికుదుపులో ఉన్నవాడు అడిగినట్టు అడిగాడు.

"వాట్ నాన్‌సెన్స్ యుఆర్ టాకింగ్!" అరిచాడు సూర్యం.

ఎడిటరూ, అసిస్టెంట్ ఎడిటరూ ముఖముఖాలు చూసుకొన్నారు.

"వస్తాను" అంటూ వెనక్కు తిరిగిన సూర్యంతో "ఓ క్షణం ఆగండి. అలా కూర్చోండి, చెక్కు ఇస్తాను" అన్నాడు ఎడిటర్ సుందర్రావు.

సూర్యం కూర్చున్నాడు.

ఎడిటర్ ప్రొప్రయిటర్ రూంలోకివెళ్ళి ఐదువేలు రూపాయల చెక్కు తెచ్చియిచ్చాడు.

"ఏడు వేలిస్తారు తెమ్మని చెప్పారే మా నాన్నగారు?" అన్నాడు సూర్యం.

'నవల పూర్తిచేస్తే, చస్తాను - చస్తాను - అన్నాడు. మరి చావలేదుగా?" అనబోయి ఆపుకున్నాడు ఎడిటర్.

"అసలు ఇస్తానన్నది పదివేలే! ఆ రెండువేల గురించి మీ నాన్నగారు వస్తే మాట్లాడతాలే!"

సూర్యం వెళ్ళిపోయాడు.

ఎడిటర్ సుందర్రావూ, అసిస్టెంట్ శేఖర్ ముఖముఖాలు చూసుకొన్నారు. కళ్ళతోనే మాట్లాడుకొన్నారు.

"ముందు అది చదవండి సర్!" అన్నాడు శేఖర్.

ఎడిటర్ స్క్రిప్టు చదవసాగాడు.

"ఇంత ద్రోహం చేస్తాడనుకోలేదు. రేపు పాఠకులకు ఏం సమాధానం చెప్పాలి?" ఒక పేజీ చదివి ఎడిటర్ అసిస్టెంటుతో దిగులుగా అన్నాడు.

అసిస్టెంటు మాట్లాడలేదు. ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

ఓ గంటలో గబగబ స్క్రిప్టు తిరగేశాడు.

ముగింపు చదివి కుర్చీలోనుంచి ఎగిరి గంతేసినంతపని చేశాడు ఎడిటర్ సుందర్రావు.

"ఏమిటిసార్, అంత గంతేశారు?" శేఖర్ అడిగాడు.

"అద్భుతం! పాపం, అతడు చెప్పింది నిజమేనయ్యా! ఇదుగో చదువు" అంటూ శేఖర్‌కు కాగితాల కట్ట అందించాడు. శేఖర్ చదివి ముగించి నిట్టూర్చాడు.

శేఖర్‌కు రచయిత చనిపోవడం ఇష్టంలేదు. ఆ భావం వ్యక్తంచేస్తే ఎడిటర్ తనను ఉద్యోగంనుండి పీకేస్తాడని తెలుసు. టెంపరరీ ఉద్యోగం. మరీ ఇటీవలే అతికష్టంమీద దొరికిన ఉద్యోగం. అందుకే ఎడిటర్ చెప్పిన ప్రతిదానికీ తందాన పాడుతున్నాడు.

ముగింపు చదివాక అతని మనసు అట్టడుగు పొరల్లో ఏదో కదులుతోంది. తోచడంలేదు. పిచ్చిగా ఉంది. బాధగా ఉంది.

"ఏం చేద్దాం?" ఎడిటర్ ఉత్సాహంగా అడిగాడు.

మనసులోని బాధ కన్పించకుండా ఉండేందుకు పెదవుల మీదకు చెరునవ్వు తెచ్చిపెట్టుకొన్నాడు శేఖర్.

"అద్భుతం సర్!" అని అన్నాడు తెచ్చిపెట్టుకొన్న ఉత్సాహంతో.

"ఈ విషయం వెంటనే ప్రకటిద్దామా?"

"వద్దు సర్! తొందరపడొద్దు. అతడు రాసింది నాకు నిజం అని నమ్మబుద్ధి కావడంలేదు. నవల స్టార్ట్ చెయ్యండి. అతను చనిపోతే ఎటూ తెలుస్తుంది. లేదా, నవలను యథాతథంగా వేద్దాం. ముగింపు సంచికలో మంచి నోట్ రాద్దాం!"

ఎడిటర్ ఆలోచించాడు. అసిస్టెంటు ఆలోచన బాగానే ఉన్నట్టు తోచింది. అతని సూచన అంగీకరించాడు. సీరియల్ మళ్ళీ ప్రారంభం అయింది. రెండు వారాలు గడిచింది.

"రచయిత ఏమయ్యాడు? చనిపోయాడా?" అంటూ పాఠకుల నుంచి ఉత్తరాలు వస్తున్నాయి. కాని, ఎడిటర్ వాటిని ప్రచురించకుండా ఉంచేశాడు.

# 19

శివప్రసాద్ ఆ రాత్రినుంచి మళ్లీ ఇంటికి రాలేదు. భార్య ఒకటే గోల! తల్లి బలవంతం మీద సూర్యం పోలీసు కంప్లైంట్ ఇచ్చాడు.

అతను ఇల్లు వదిలి వెళ్ళిపోయిన పదిహేనవ రోజు అలహాబాద్ పోలీసు సూపర్నెంటు నుంచి హైదరాబాద్ కమీషనర్‌కు టెలెక్సు మెసేజ్ వచ్చింది.

పోలీసు ఇన్‌స్పెక్టర్ శివప్రసాద్ ఇంటికి వచ్చి విషయం చెప్పాడు. అందరూ గొల్లున ఏడ్వసాగారు.

పోలీసు రిపోర్టు ప్రకారం - ఒక వ్యక్తి తాలూకు కొన్ని వస్తువులు - చెప్పులూ- డైరీ వగైరా త్రివేణి సంగమం ఒడ్డున కన్పించాయి. డైరీలో అతని అడ్రసూ పేరూ ఉంది. అతను ఆత్మహత్య చేసుకొన్నట్టు అనుమానంగా ఉంది. కాని శవం దొరకలేదు - ఇదీ రిపోర్టు.

కృష్ణవేణి దొర్లిదొర్లి ఏడ్చింది.

తెల్లవారేసరికి అన్ని న్యూస్ పేపర్లలోనూ తాటికాయంత అక్షరాల్లో వార్త మొదటి పేజీలోనే పడింది. ఎందరో కరస్పాండెట్సు అతని ఇంటికి వెళ్ళారు. అతని భార్యను ప్రశ్నించడానికి ప్రయత్నించారు. ఆమె ఎవరితోనూ మాట్లాడలేదు.

కొడుకునుంచిగానీ, కూతురినుంచిగాని ఉపయోగకరమైన విషయాలేమీ రిపోర్టర్స్‌కు దొరకలేదు. ఆయన బ్రతికుండగా పట్టించుకోని ఎందరో మేధావులు ఆయన గొప్పతనాన్ని గురించి చెబుతూ సానుభూతిని తెలియజేశారు.

ఆయన పేరుకూడా తెలియని కొందరు రాజకీయ నాయకులు కూడా 'వారు లేకపోవడం వల్ల తెలుగు సాహిత్య రంగానికే తీరనిలోటు ఏర్పడిం'దని ప్రకటనలు ఇచ్చారు. సంతాపం తెలియజేశారు.

"వెలుగు-చీకటి" ప్రకటించిన ప్రకటన-

"శివప్రసాద్ మహారచయిత అని వేరుగా చెప్పనక్కర్లేదు. ఆయన మన పత్రికకోసం అపూర్వమైన త్యాగం చేశారు. తమ చావు తప్పదని తెలిసీ మన పాఠకులకోసం అద్భుతమైన నవల వ్రాసి, పాఠకుల కోరికను కాదనలేక ముగించి - తను పిశాచాలకు ఆహారం అయ్యాడు. శివప్రసాదుగారికి 'వెలుగు-చీకటి' దాని పాఠకులూ సంతాపాన్ని తెలియజేస్తూ, వారి ఆత్మకు శాంతి కలగాలని భగవంతుడ్ని

మరో విషయం - వారి కుటుంబం ఆర్థిక ఇబ్బందులలో ఉంది. పాఠకులు వారికి తోచిన ఆర్థికసహాయాన్ని అందించి వారి ఋణం తీర్చుకోవలసిందిగా కోరుతున్నాం. ఆర్థికసహాయం అందించిన వారి పేర్లు 'వెలుగు - చీకటి'లో ప్రకటిస్తాం."

తమ అభిమాన రచయిత మరణవార్త విని తామెంతగా విలపించారో కుమిలిపోయారో తెలియజేస్తూ పత్రికకు లేఖలు రాశారు అనేకమంది పాఠకులు.

మనియార్డర్లు కూడా కుప్పతిప్పలుగా వచ్చి పడిపోతున్నాయి. ఎడిటరు శివప్రసాదు ఇంటికి వెళ్ళి అతని భార్యను ఓదార్చాడు. వస్తూ వస్తూ రెండు వేలు క్యాష్ ప్రసాద్ కొడుకు చేతిలో పెట్టి వచ్చాడు.

కర్మకాండ పూర్తిఅయింది. రోజులు గడుస్తున్నాయి. ప్రసాద్ రూపం స్వంతవాళ్ళ మనసుల్లోనే మసకబార సాగింది. బయటివాళ్ళ సంగతి వేరే చెప్పనక్కర్లేదు.

"మరో దయ్యం కథ" పూర్తికాకుండానే విజయనగరం నుంచి ఓ పబ్లిషర్ హుటా హుటిగా హైదరాబాద్ వచ్చాడు. ఆ నవలతోపాటు అతని రచనలన్నీ పది సంవత్సరాలకు కంట్రాక్టు రాయించుకొని ఏభయ్‌వేలు ఇచ్చాడు.

ఆ డబ్బుతో ప్రెస్ పెట్టుకొనే ప్రయత్నంలో ఉన్నాడు సూర్యం. మరో ఏభయ్ వేలవరకు నిధి వసూలయింది. ఆ నవల పూర్తికాగానే సంతాప సభ పెట్టి, ఆ చెక్కు ప్రసాద్ భార్యకు ఇవ్వడానికి నిర్ణయం జరిగింది.

ఆ డబ్బు తల్లి పేరుమీద బ్యాంకులో వెయ్యాలనుకొన్నాడు సూర్యం.

భర్తపోయిన బాధ ఒకవైపు తొలుస్తున్నా, ఇంతకాలంగా భుజాలమీద ఎక్కి తొక్కుతున్న దారిద్ర్యభారం దిగిపోవడంతో ఆమెకు కొంత మనసు కుదుటపడింది.

అన్ని బాధలకంటే దారిద్ర్య బాధ ఎంత భయంకరమైనదో అది దిగిపోయాక గాని ఆమెకు అర్థం కాలేదు. మళ్ళీ ఆ రోజులు రాకూడదని పదేపదే దేవుడికి మొక్కుకుంది.

కమలకు కూడా కొంత రిలీఫ్‌గా అన్పించింది. తండ్రిలేని బాధ లేకపోలేదు.

"అన్నయ్యా! కాలేజీలో చేరతాను" అన్నది కమల, పబ్లిషర్ ఏభయ్ వేలు ఇచ్చిపోయిన రోజు.

"అలాగేనమ్మా!" అన్నాడు సూర్యం.

చిర్రుబుర్రులాడే సూర్యం అంత సౌమ్యంగా సమాధానం చెప్పేసరికి కమలకు కాళ్ళు భూమిమీద ఆనలేదు. వెంటనే వెళ్ళి పక్కింటి స్నేహితురాలితో తనూ కాలేజీలో చేరుతున్నట్టు చెప్పింది.

# 20

ఎడిటర్ సుందరరావు మళ్ళీ నవల ప్రారంభించినప్పట్నుంచీ ఏదో దిగులుగా ఉంటున్నాడు. ఎవరితోనూ మునుపటిలా మాట్లాడటంలేదు.

ముఖ్యంగా ప్రసాద్ చనిపోయాడనే వార్త వచ్చాక అతను ఆఫీసుకు కూడా సరిగా రావడంలేదు.

వచ్చినా ఎంతోసేపు కూర్చోలేకపోతున్నాడు.

అతన్ని చూసి అందరూ ఏదో గుసగుసలాడుతున్నారు.

"ఏమిటి సార్, అలా ఉంటున్నారు? చిక్కిపోతున్నారు." అడిగాడు అసిస్టెంట్ శేఖర్.

సుందర్రావు కళ్ళల్లో నీలి నీడలు పారాడాయి.

"శేఖర్! నాకు రోజూ చాలా చెడ్డకలలు వస్తున్నాయి" అన్నాడు ఢిగులుగా.

"ఏం కలలు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"రోజూ శివప్రసాద్ కలలోకి వస్తున్నాడు."

"అతన్ని గురించి ఎక్కువ ఆలోచించడంవల్ల కావచ్చు. దీనికింత ఇదైపోవడం ఎందుకూ? ఎందుకైనా మంచిది, సైక్రియాట్రిస్టును కన్సల్ట్ చెయ్యండి" అన్నాడు శేఖర్.

"సైక్రియాట్రిస్టేం చేస్తాడు?" దిగాలుగా అన్నాడు ఎడిటర్.

"మీ మనసులో ఉన్న భయానికి కారణాలను బయటికి లాగుతాడు. దాంతో మీకు మానసిక స్వస్థత చేకూరుతుంది."

"నాకు పిచ్చిపట్టిందనా నీ ఉద్దేశ్యం?" చురుగ్గా ఉంది ఎడిటర్ ప్రశ్న.

శేఖర్ తడబడ్డాడు.

"అది కాదండీ!..." నసిగాడు.

"ప్రసాద్ దయ్యం అయి నన్ను పీడిస్తున్నాడు!"

"ఛ! అవేం మాటలండీ? అలాంటి భావం రానివ్వకండి" అన్నాడు శేఖర్.

"నీకు తెలియదు శేఖర్! ఒకరోజు అతడు ఏమన్నాడో తెలుసా?"

"చెప్పండి."

"నేను కథముగిస్తే చనిపోవడం ఖాయం. అలా అర్ధాంతరంగా చనిపోయినవాళ్ళు దయ్యాలు అవడం ఖాయం. కొన్ని ఆత్మలకు వెంటనే ఏ ఆధారం దొరక్క నానా యాతనకు గురి అవుతాయి. అప్పుడు వాటికి మీడియం చాలా అవసరం. అలాంటి పరిస్థితి వస్తే నిన్నే మొదటి మీడియంగా చేసుకొంటాను అని అన్నాడు." నుదుటికి పట్టిన చమట తుడుచుకొంటూ సుందరరావు! అన్నాడు.

శేఖర్‌కు నవ్వొచ్చింది.

"మిమ్మల్ని భయపెట్టడానికి సర్దాగా అని ఉంటాడు."

"అప్పటికి అతను చనిపోయినట్టు వార్త రాలేదు. ఆ తర్వాత మూడు రోజులకు ఆ వార్త వచ్చింది. కాని, నాకు అతడు వారంరోజుల ముందే కన్పించాడు!"

"కన్పించాడా! ఎక్కడ?"

"నా గదిలో! మధ్యరాత్రి మెలుకువ వచ్చింది. దాహం వేస్తోంది. నీళ్ళు తాగుదామని లేచాను. తలుపు దగ్గర ఎవరో నిల్చున్నట్టయింది. కళ్ళు నులుపుకు చూశాను. ప్రసాద్! 'నువ్వా? ఎలా వచ్చావ్?' అన్నాను మూసి ఉన్న తలుపును చూస్తూ.

అతను మాట్లాడలేదు.

ముందుకు ఒక్కొక్క అడుగే వేస్తున్నాడు.

'కెవ్వు'న అరిచాను.

నా భార్య నిద్రలేచింది.

లైటు వేసింది. ఏమీ కన్పించలేదు.

ఆమె భయపడుతుందని చెప్పలేదు. చనిపోగానే ముందు నా దగ్గిరికే వచ్చాడు."

శేఖర్ అతని ముఖంలోకి చూశాడు.

కళ్లు తేలిపోతున్నాయి.

కింద గవద ఎముకలు పైకి లేచాయి. ముఖం బిగుసుకోసాగింది. పిచ్చిచూపులు చూడసాగాడు.

భయం వేసింది శేఖర్.

బయటకెళ్ళి ఆఫీసువాళ్లతో చెప్పాడు.

అందరూ ఎడిటర్ గదిలోకి వచ్చేసరికే అతను ఈ లోకంలో లేడు. పిచ్చిపిచ్చిగా మాట్లాడుతున్నాడు.

వాళ్ళను చూసి లేచి పరిగెత్తబోయాడు. ఆఫీసువాళ్లు పట్టుకొన్నారు. ముగ్గురుకలిసి అతడ్ని పట్టుకోలేకపోయారు.

"నన్ను వదలండిరా! నేను వీడ్ని తీసుకెళ్ళడానికి వచ్చాను. నేను చచ్చిపోతానంటే చాలా ఆనందించాడు. నీచుడు, తన పేపరు సేల్స్ చూసుకొన్నాడు. అవతల ఒక నిండుప్రాణం గురించి ఆలోచించలేదు."

ఆ గొంతు సుందరరావు గొంతులా లేదు.

ప్రసాద్ గొంతులా ఉంది!

గోల విని ప్రొప్రయిటరు తన గదిలో నుంచి బయటికి వచ్చాడు. పరిస్థితిని చూశాడు.

"గాలి చేష్టలాగే ఉంది" అన్నాడు.

"అవును సార్! మా ఇంటి దగ్గర ఒక మంత్రగాడు ఉన్నాడు. తీసుకొస్తాను" అన్నాడు ఒక గుమాస్తా.

"ముందుగా కార్లో అతడ్ని ఇంటికి తీసుకెళ్ళండి" అన్నాడు ప్రొప్రయిటర్.

"ఒరే ప్రొప్రయిటరూ! వెంటనే సంతాపసభ పెట్టి, ఆ సేకరించిన డబ్బును నా భార్యకు ఇచ్చెయ్!" కారు ఎక్కుతూ అరిచాడు సుందరరావు–కాదు–అతనిలో ఆవహించిన ప్రసాద్.

అతడ్ని ఇంటికి చేర్చారు.

మంత్రగాడ్ని తీసుకొచ్చారు.

భార్య టెలిగ్రాం ఇచ్చి అన్నగార్ని పిలిపించింది.

నాలుగు రోజులు తంటాలుపడి ఆ మంత్రగాడు ఆ కేసు తనవల్ల కాదని చెప్పి వెళ్ళిపోయాడు.

మరో మౌల్వీని పిలిపించారు.

ఎడిటర్‌మీదనుంచి ప్రసాద్‌ని వెళ్ళగొట్టే ప్రయత్నాలు మౌల్వీ కూడా చేశాడు. లాభం లేకపోయింది.

ఆదిలాబాదు నుంచి మరొకడ్ని పిలిపించారు.

# 21

నవల పూర్తిఅయి వారం రోజులైంది.

శేఖర్ వచ్చి "సర్! ఆ డబ్బు - సభ పెట్టి అందరి ముందూ తన భార్యకు ఇవ్వమని ప్రసాద్ గోల చేస్తున్నాడు" అన్నాడు ప్రొప్రయిటర్‌తో.

"ప్రసాద్ గోల చెయ్యడం ఏమిటి?"

"అదే సర్! ఎడిటర్‌గారి మీద..."

"ఓ అదా? సరే, వెంటనే మీటింగు ఏర్పాట్లు చెయ్యండి" అన్నాడు ప్రొప్రయిటర్.

ఆనోటా ఆనోటా ప్రసాద్ దయ్యం అయి సుందరరావును పట్టాడని చాలామందికి తెలిసిపోయింది.

నమ్మినవాళ్లు అతడ్ని తల్చుకొని జాలిపడ్డారు.

నమ్మనివాళ్లు ట్రాష్ అని కొట్టి పారేశారు.

ప్రసాద్ కొడుకు సూర్యం అలాంటి పుకార్లు లేవదీసినందుకు ఉగ్రుడైపోయాడు. సుందర్రావు ఇంటికి వెళ్ళాడు.

అతని పరిస్థితి చూశాడు.

సూర్యంను చూడగానే ఆప్యాయంగా పలకరించాడు.

అమ్మనూ, చెల్లినీ బాగా చూసుకోమన్నాడు.

ఆ గొంతు అచ్చం తండ్రి గొంతులాగే ఉంది.

సూర్యంకు మతిపోయినట్టే అయింది.

ఇంటికి వచ్చి తల్లితో జరిగింది చెప్పాడు.

ఆమె భర్త ఫోటో దగ్గర నిల్చుని ప్రార్థించింది.

"బ్రతికి ఉండగా మీరు ఎవరికీ అన్యాయం చెయ్యలేదు. మీ రచనలతో ప్రజల్లో ఏదో మార్పు తేవాలనేవారు. అందరూ సుఖపడే రోజు చూడాలనేవారు. చచ్చిపోయి ఇలాంటి పేరు ఎందుకు తెచ్చుకోవడం? మీరు వెళ్ళిపోండి. అతడ్ని వదలండి" అంటూ ఏడ్చింది.

# 22

"వెలుగు-చీకటి" ఆఫీసులో ఆనాడు సాయంత్రం ప్రసాద్ సంతాపసభ జరుగుతుందని అన్ని పేపర్లలో న్యూస్ రిలీజ్ చేశారు.

ఆఫీసు ముందు పెద్ద ఆవరణ ఉంది.

అక్కడే మీటింగు ఏర్పాటు జరిగింది.

ఆ సభకు ఒక మంత్రి అధ్యక్షత వహించాడు. ఉయ్యాల-జంపాల రచయిత ఒక వక్త. డాక్టర్ రాజేంద్ర మరో వక్త. వాళ్లుకాక ఆఫీసువాళ్లు మరికొందరు తమ సంతాపాన్ని తెలియజేస్తారు.

శేఖర్ వెళ్ళి ఎడిటర్ సుందరరావును కార్లో తీసుకొచ్చాడు. అతని బావమర్ది కూడా అతనితో వచ్చాడు.

సుందరరావు చాలా చిక్కి శల్యం అయిపోయాడు.

అతను దయ్యం మీదలేనప్పుడు మామూలుగానే ఉంటాడు. అతన్ని కూడా అసిస్టెంటు పట్టుకొని వేదిక మీద కూర్చోబెట్టాడు.

ఎడిటర్‌ను అందరూ జాలిగా చూశారు.

కొందరు ప్రసాద్‌ను - అంటే, ప్రసాద్ దయ్యాన్ని తిట్టారు. ఆడవాళ్ళు మెటికలు విరిచారు.

సాహిత్యం గురించి తనకేమీ తెలియదంటూనే మంత్రిగారు సాహిత్యాన్ని గురించీ, ప్రసాద్‌ను గురించీ అర్ధగంట అనర్గళంగా మాట్లాడారు.

ఆ ఆవరణ అంతా జనంతో కిక్కిరిసిపోయింది.

రిటైర్డ్ సర్జన్ డాక్టర్ రాజేంద్ర ఆత్మల గురించీ, పునర్జన్మల గురించీ చాలా వివరంగా చెప్పారు. ఈవిల్ స్పిరిట్స్ ఎలా ఉంటాయో? హోలీ స్పిరిట్స్ ఎలా మానవులకు సహాయం చేస్తాయో చాలా వివరంగా చెప్పాడు.

ఆయన కూర్చోగానే చప్పట్లతో వాతావరణం మారుమోగిపోయింది.

ఆ తర్వాత 'ఉయ్యాల-జంపాల' నవలా రచయిత లేచి నిల్చున్నాడు. అతని పెన్‌నేమ్ "మాతాహరి." అది ఆడపేరో మగపేరో కూడా తెలియకుండా పెట్టాడు. అతడు లేవగానే కరతాళ ధ్వనులతో చెవులు చిల్లులు పడ్డాయి.

అతని ముఖం గంభీరంగా మారింది. నలువైపులా పరికించి చూశాడు. అందరూ తనకేసే కుతూహలంగా చూడడాన్ని గమనించాడు. తల పంకించాడు. తన అభిమానులను చూస్తూ చిద్విలాసంగా నవ్వాడు. గొంతు సకిలించాడు.

"ముందు నా అభిమానులకు నమస్కారం. ఆ తర్వాత వేదిక నలంకరించి పెద్దలకు నమస్కారం."

మళ్ళీ సభికుల్లో నుంచి కరతాళ ధ్వనులు.

"సమస్త బ్రహ్మాండానికీ భూలోకం నాభిస్థానం. అందులో మన భారతదేశం పవిత్రములైన, లోకశ్రేయోదాయకములైన, యజ్ఞయాగాది క్రతువులు చేయుటకు తగిన కర్మభూమి. ఈ మాట అన్నది నేను కాదు. వేదాలే చెప్పాయి.

ఈ చాతుర్వర్ణ వ్యవస్థను ఈశ్వరుడే సృష్టించాడు."

"నోరుముయ్!" జనంలోనుంచి అరుపు.

అందరి తలలూ ఆ అరుపువచ్చిన వైపుకు తిరిగాయి.

"మానవుడే ఈశ్వరుడ్ని సృష్టించాడు." రెండోవైపునుంచి మళ్ళీ విన్పించింది.

"భక్తులారా! నా అభిమాన పాఠకులారా! ఇక్కడ కొంతమంది పాషండులు చేరినట్టు కన్పిస్తోంది. వారిని శ్రద్ధగా గమనించి బయటికి పంపించివెయ్యండి" అన్నాడు మాతాహరి కోపంగా.

"చెప్పండి, మాట్లాడండి!" జనంలోనుంచి కేకలు.

"అవతార పురుషులు, పరమ గురువులు, తమ భౌతిక ఉపాధి యొక్క అడ్డంకి తొలగిన వెంటనే తమ యశః కాయన్నీ, తేజస్సునూ, సాన్నిధ్యాన్నీ, తమ శరణాగతులలో, హృదయ సమర్పకులలో, వారి వారి సమర్పణ శీలాన్నిబట్టి అనుగ్రహిస్తూ ఉంటారు. కాలగతిలో విశ్వాంతరాళమంతా వ్యాపించి భూమిజీవుల మనో బుధ్యహంకారాలను ప్రబోధన చేసే కాలస్వరూపమైన భగవంతుని అంశలుగా శాశ్వత వర్తమాన స్వరూపులుగా..."

"అర్థం కావడంలేదు." జనంలోనుంచి అరిచాడు ఒకడు.

"అర్థమయ్యేలా చెప్పండి." మరొకడు.

"మీ ఉయ్యాల - జంపాల గురించి చెప్పండి." అతని అభిమానుల కేకలు.

"నాకు పెద్దలు ఇచ్చిన ఐదునిముషాల సమయం అయిపోయింది." గడియారం చూసుకొని అన్నాడు మాతాహరి.

"ఒక విషయం చెప్పి కూర్చుంటాను. ప్రసాద్‌లాంటి నాస్తికులు 'మరో దయ్యం కథ' వ్రాయడం ముదావహం. వారు ఆ కథ వ్రాసి, అశేష పాఠకుల కోరికమీదకు తన ప్రాణాన్నే పిశాచాలకు బలిచేసిన త్యాగశీలి. అలాంటి వ్యక్తి అర్ధాంతరంగా చనిపోవడంవల్ల అతని ఆత్మకు ఎక్కడా ఆధారం దొరక్క ఎంతో యాతన అనుభవించి ఉంటుంది. చివరకు ఎడిటర్‌గారు మీడియంగా లభించారు. ఇప్పుడు మంత్రగాళ్లను రప్పించి ఆ ఆత్మను తరిమెయ్యడం అన్యాయం. అక్రమం. మళ్లీ ఆయనకు మరో మీడియం దొరికేంతవరకూ నరకయాతన అనుభవించాల్సి ఉంటుంది.

నేను ఈ విషయాలను 'ఉయ్యాల-జంపాల'లో వివరంగా రాశాను."

"అవును. అది చదివి నువ్వుకూడా మనిషిరూపంలో ఉన్న పిశాచివనే అనుకొన్నాను. లేకపోతే నువ్వు వాటి కష్టసుఖాలను అంతబాగా, వాస్తవానికి దగ్గరగా ఎలా వర్ణించగలవు?" ఒకడు లేచి అన్నాడు. అతను అన్న విధానం చూసినవాళ్లకు అతను మాతాహరిని ఎగతాళి చేస్తున్నాడని ఇట్టే అర్థం అయిపోయింది.

ఒకేసారి అనేక గొంతులు "కూర్చోవయ్యా!" అంటూ అరిచాయి.

అతను కూర్చున్నాడు.

మాతాహరి మళ్ళీ ప్రారంభించాడు: "పిశాచలోకం గురించి నాకు బాగా తెలుసు. నేను వ్రాసింది వాస్తవ సంఘటనలేనని మరోసారి చెబుతున్నాను. చివరిమాటగా - ఎడిటర్‌గారిని ఆవహించిన ప్రసాద్‌గారి ఆత్మను వెళ్ళగొట్టడానికి ప్రయత్నించవద్దని, అతని ఆత్మకుకూడా సానుభూతి చూపండని కోర్తున్నాను."

"ఏమిటయ్యా చెప్తున్నావ్? మీ పిశాచాల గురించి నా దగ్గర చెప్పకు. చచ్చినవాడి ఆత్మ బాధపడుతుందని బ్రతికున్నవాడ్ని గాలికి వదిలెయ్యమంటావా?" ఒక మంత్రగాడు లేచి అరిచాడు.

"అలా జరగడానికి వీల్లేదు. ఎడిటర్‌గార్ని రక్షించాలి." జనంలో నుంచి అనేక కంఠాలు అరిచాయి.

మాతాహరి కిక్కురుమనకుండా మైకు వదిలి వెళ్లి కూర్చున్నాడు. అతని ముఖం నల్లగా మాడుచెక్కలా అయింది.

"నాకు మాట్లాడడానికి రెండు నిముషాలు సమయం ఇవ్వండి!" ఒకతను లేచి అడిగాడు.

మంత్రిగారితో ప్రొప్రయిటర్ "అవకాశం ఇవ్వకండి. అతనే అగ్నిపర్వతం. మొన్నటిదాకా జైల్లో ఉండి వచ్చాడు" అన్నాడు.

మంత్రిగారు అనుమతిని నిరాకరించారు.

అతను సభలోనుంచి వెళ్ళిపోయాడు. అతనివెనకే మరో పదిమంది యువకులు లేచి వెళ్ళిపోయారు.

"పీడా వదిలింది. ఇంతసేపూ అల్లరి చేస్తుంది ఆ నాస్తికమూకే!" అన్నాడు మాతాహరి మంత్రిగారితో.

మంత్రిగారు భావగర్భితంగా తల పంకించారు.

"ఇప్పుడు ఎడిటర్‌గారు తమ అనుభవాన్ని చెబుతారు." అనౌన్సు చేశారు అధ్యక్షులు.

ఎడిటర్ లేవబోతుంటే వారించి "కూర్చునే మాట్లాడండి" అన్నాడు అధ్యక్షుడు.

"మరో దయ్యం కథ" వ్రాయించడానికి తను ప్రసాద్‌ను ఎంత కష్టపడి ఒప్పించాల్సి వచ్చిందో చెప్పాడు. ఆ తర్వాత పాఠకుల కోరిక మేరకు అతను చేసిన త్యాగాన్ని కొనియాడాడు. తనను మీడియంగా వాడుకోవడం తన దురదృష్టంగా చెప్పాడు. ప్రసాద్ ఆత్మ తనను ఎలా పట్టుకొని పీడిస్తున్నదో చెప్పాడు. అందరూ ఊపిరి పీల్చడం మర్చిపోయి వినసాగారు. ముందు వరసలో కూర్చున్న కృష్ణవేణికి అక్కడ్నుంచి పారిపోవాలనిపించింది.

"వాడి తిక్క అలాగే కుదిరించు డాడీ!" మనసులో తండ్రిని అర్థించింది కూతురు.

మరో ఇద్దరు దయ్యాల భూతాల జోలికి వెళ్ళకుండా ప్రసాద్‌తో తమకు గల పరిచయాన్ని వివరించారు. అతన్ని కమిటెడ్ రైటరని పొగిడారు. అతను దయ్యాల కథ వ్రాశాడంటే తమకు నమ్మకంగా లేదన్నారు. తాము ఆ పుస్తకం చదివిగాని ఏ విషయం చెప్పలేమన్నారు. బహుశా సెటైర్ రాసి ఉండవచ్చునన్నారు.

వాళ్ళిద్దరి ఉపన్యాసం జనానికి అంతగా నచ్చలేదు. జనంలో ఒకటే కలకలం. కబుర్లు చెప్పుకొంటున్నారు. గోలగోలగా ఉంది.

మంత్రిగారి కరకమలాలతో ప్రసాద్ భార్యకు చెక్కు అందించే కార్యక్రమం కూడా ముగిసింది. చెక్కు అందుకొని వచ్చి కూర్చున్న కృష్ణవేణి కళ్ళు తుడుచుకొన్నది.

కూతురు తల్లి చేతిలోని చెక్కు అందుకొని ఓసారి దానికేసి ఆశగా చూసి, బ్యాగ్ తెరచి అందులో పదిలంగా పెట్టుకొన్నది.

"ఇప్పుడు ప్రొప్రయిటర్‌గారు ఒక ముఖ్యమైన ప్రకటన చెయ్యబోతున్నారు. దయచేసి నిశ్శబ్దంగా ఉండండి" అన్నాడు అధ్యక్షుడు.

ప్రొప్రైటర్ మైకు ముందు కొచ్చాడు.

"మా ఎడిటర్‌గారి కృషివల్లనే మా పత్రిక ఈనాడు అన్ని పత్రికల కంటే ఎక్కువ అమ్ముడవుతోంది. కాని వారికి ఇలా అనారోగ్యం కలగడం నాకు చాలా బాధాకరంగా

ఉంది. ప్రసాద్ ఆత్మ మా ఎడిటర్‌గార్ని పీడిస్తోంది. దాన్ని వదిలించినవారికి నేను పదివేల రూపాయలు ఇస్తానని ప్రకటిస్తున్నా."

కరతాళధ్వనులు మిన్నుముట్టాయి.

"నేను బాగుచేస్తాను!" ఓ కంఠం కంచులా మోగింది.

అందరూ తలలు తిప్పిచూశాడు.

ఒక వ్యక్తి జనాన్ని తప్పించుకొంటూ, వేదిక వైపుకు నడుస్తున్నాడు. జనం అతనికి దారి ఇస్తున్నారు.

పెరిగిన గడ్డాల, మీసాల మధ్యనుంచి అతని ముఖం మబ్బుల చాటునుంచి కన్పిస్తున్న చంద్రబింబంలా ఉంది.

బట్టలు మురిగ్గా ఉన్నాయి. జుట్టు పెరిగి మెడలమీదకుంది. ఇతను మంత్రగాడా! అలాగే ఉన్నాడు. చాలా షాబీగా ఉన్నాడు. ఇప్పుడే శ్మశానంలోనుంచి వస్తున్నట్టు ఉన్నాడు- అనేకమంది ఆలోచనలు.

మంత్రగాళ్లుమాత్రం ఆలోచనారహితంగా, ఆశ్చర్యంగా చూస్తున్నారు. అసూయగా చూస్తున్నారు.

మరికొందరు అతడ్ని కళ్ళు పెద్దవి చేసుకొని సంతోషంగా చూస్తున్నారు. అతను వేదిక ఎక్కి మైకు దగ్గర నిల్చున్నాడు.

అతన్ని చూసి ఎడిటర్ బెదురుచూపులు చూడసాగాడు.

ప్రొప్రయిటర్ పిచ్చిచూపులు చూశాడు.

"ప్రసాద్!" అసిస్టెంట్ ఎడిటర్ శేఖర్ దాదాపు అరిచినంత పని చేశాడు.

"ప్రసాద్! ప్రసాద్!" జనంలో నుంచి కొందరు అరిచారు.

"డాడీ!" సంతోషంతో అరిచింది కూతురు.

ప్రసాద్ కూతురుకేసి చూసి చిరునవ్వు నవ్వాడు.

కళ్ళు పెద్దవి చేసుకొని, విడోవేషంలో తనకేసే చూస్తున్న భార్యను కళ్ళతోనే పరామర్శించాడు. జనంలో ఒకటే కలకలం!

"మరో దయ్యం కథ రచయితగారా!" ఒక మగగొంతు.

"చచ్చిపోలేదా!" ఒక ఆడగొంతు.

"చావకుండానే దయ్యం అయి, ఎడిటర్‌ను ఎలా పట్టాడు!" మరో మగ గొంతు.

రకరకాల అల్లరల్లరిగా ఉంది వాతావరణం.

ప్రసాద్ మైకు దగ్గరకెళ్ళి నిల్చున్నాడు.

"మిత్రులారా!"

అతని కంఠం వింటూనే కలకలం ఆగిపోయింది.

సూది పడినా విన్పించేటంత నిశ్శబ్దం!

"ఇంతవరకూ దయ్యాల గురించీ, ఆత్మల గురించీ చెప్పిన విషయాలు చాలా శ్రద్ధగా విన్నారు. నేను దయ్యాం అయి ఎడిటర్‌గార్ని పట్టానన్నారు. ఆయన స్వయంగా

తన అనుభవాల్ని చెప్పారు. వారు అబద్ధం చెప్పారని నేను అనడం లేదు. వారు ఎంత చిక్కిపోయారో మీరు చూస్తూనే ఉన్నారు. వారు చెప్పింది నిజమే! వాస్తవం మాత్రం కాదు.

మనందరికీ అతను ప్రసాద్ అనేవాడిని (కాసేపు చనిపోయానని మీరూ ఊహించుకోండి) అంటే అతడి ఆత్మ స్వరూపాన్ని చూపగలిగితే అది వాస్తవం అవుతుంది. తను మాత్రమే అనుభవించి చెప్పేది నిజం!

పాతగోడల మీద మరకలుంటై. కాగితం మీద సిరా దొర్లితే మరకలౌతుంది. ఈ మరకలన్నింటిలోనూ రకరకాల ఆకారాలను మనం చూడవచ్చును. మన చిత్తప్రవృత్తినిబట్టి ఆ ఆకారాలు కన్పిస్తాయి.

ఆకాశంలో పరుగులు తీసే మబ్బు తునకల్లో క్షణానికో ఆకారం కన్పిస్తుంది.

మనిషి, ఏనుగు, కుక్క అజంతా శిల్పాలు, హనుమంతుడు, రావణాసురుడు, పులి, గుర్రం - ఒకటేమిటి? ఎన్నెన్నో రూపాలు మన మెదడులో కదులుతూ ఉంటై. మనసులో కదిలిన రూపమే కళ్ళకు కన్పిస్తుంది. దాన్నే మనం Subjectivity అంటాం. నిజంగా మబ్బుల్లో ఆ రూపాలు లేవు. అందుకే అవి నిలవవు. అవన్నీ పాత అనుభవాలవల్లా, నమ్మకాలవల్లా కలిగే భ్రమలు.

ఏ రాత్రిపూటో, చీకట్లో, నిర్జన ప్రదేశంలో ఒంటరిగా మనం నడిచి వెళ్ళే సందర్భాలు వస్తయ్. మనల్ని ఎవరో అనుసరిస్తున్నట్టుగా అనుభూతి పొందుతాం. ఆ భావం రాగానే అడుగుల చప్పుడు విన్పిస్తున్నట్టుగా ఉంటుంది. అనుకోకుండా వెనక్కుతిరిగి చూస్తాం. ఏమీ ఉండదు.

దయ్యాల మీద నమ్మకం ఉన్న వ్యక్తికి అయితే ఏ చెట్టో, పుట్టో దయ్యంలా కన్పిస్తుంది. లంబాడీ దయ్యమో, ముస్లిం దయ్యమో, హిందూ దయ్యమో, క్రైస్తవ దయ్యమో కన్పిస్తుంది. నిజానికి అక్కడ దయ్యం లేదు, కాని అతడు చూసిన ఆ అనుభూతి అబద్ధం కాదు.

అలాగే మీ ఎడిటర్‌గారు చెప్పినవన్నీ, అనుభూతిని పొంది చెప్పినవే" అంటూ ప్రసాద్ వెనక్కు తిరిగిచూశాడు.

ఎడిటర్ కళ్ళు ఇంకా భయంగానే చూస్తున్నాయి.

మాతాహరిని చూశాడు. అతని భృకుటి ముడిపడి ఉంది.

వీడు ప్రసాదా? లేక ప్రసాద్ శవంలోకి ప్రవేశించిన దుష్టాత్మా? అదే అయి ఉండాలి. అతని శవం దొరకలేదని పోలీసులు రిపోర్టు ఇచ్చారుగా?

అతని ఆలోచనల్ని అర్థం చేసుకొన్నట్టుగా ప్రసాద్ చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వుతో మాతాహరి సందేహం నమ్మకంగా మారింది.

"చెప్పండి! చెప్పండి!" జనంలోనుంచి కేకలు.

"దైవంమీదా, దయ్యాలమీదా నాకు నమ్మకం లేదు."

"అయితే ఎందుకు రాశావ్?"

"నా బీదతనం - మీ పాఠకులు - నాచేత దయ్యాల కథ రాయించారు. కాని అది దయ్యాల కథ కానేకాదు. నేను ఎక్కడా దయ్యాలున్నయ్ అని చెప్పలేదు. నాకు

దొరికిన అవకాశాన్ని సద్వినియోగమే చేసుకొన్నాను. లేనివాటిని ఉన్నట్టు చెప్పడం చాలా తేలిక. అలాంటివి వినడం పాఠకులకు ఇష్టం. పాఠకుల బలహీనతన్నూ, అమాయకత్వాన్నీ రచయితలు ఎలా ఉపయోగించుకొంటున్నారో చూపించడానికే ఈ నవల రాశాను. నేను చచ్చిపోతాను కథ ముగిస్తే అన్నాను. అనేకమంది పాఠకులు ముగించాల్సిందేనన్నారు. ఆఖరకు నా కూతురు కూడా ముగించమనే అడిగింది. అంటే, ఇలాంటి కథల్లో ఎలాంటి నిషా ఉంటుందో ఆలోచించండి. మత్తులో ఉన్నవాడికి మంచీ చెడూ ఆలోచన ఉండదు.

ఇకపోతే ఎడిటర్‌గారి విషయం.

ఆయనకు దయ్యాలంటే భయం. వాటిమీద ఎంతో నమ్మకం. అయినా ఆయనకూడా పత్రిక సేల్సు కోసం నన్ను ఆ కథ ముగించమన్నాడు. మీడియం అవసరం అయితే మిమ్మల్నే వాడుకుంటానన్నాను. ఆ రోజు ఆయన చాలా భయపడిపోయాడు. ఆ భయం ఆయన అవచేతనా మనసులో బాగా నాటుకుపోయింది. నేను నిజంగానే చచ్చిపోయాననే నమ్మాడు. ఆ తర్వాత నేను దయ్యం అయినట్టు ఊహించుకొన్నాడు. తనను పట్టుకొన్నానని భావించాడు. పైన చెప్పాను చూడండి మబ్బుతునకల గురించి, అచ్చం అలాగే జరిగింది.

ఒక దినపత్రిక ఎడిటర్ ఉండేవాడు. మంచి మేధావి. నేను అతడ్ని చాల గౌరవించేవాడ్ని. అకస్మాత్తుగా ఆయన జిల్లెళ్ళమూడి అమ్మకు భక్తుడుగా మారిపోయాడు. కారణం తెలుసా?

ఒక రోజు ఆయన టేబుల్ మీద సిరాబుడ్డి ఒలికిపోయిందట. ఆ మరకలో ఆయనకు జిల్లెళ్ళమూడి అమ్మ బొమ్మ కన్పించిందట. అంతకుముందు ఆయనకు ఆవిడమీద నమ్మకం లేదు. అతని స్నేహితులు చాలా మందికి ఆమె మీద కొత్తగా నమ్మకం ఏర్పడింది.

వాళ్ళతో వాదిస్తూ ఉండేవాడు. వాళ్ళ వాదన ప్రభావం ఆయనకు తెలియకుండానే ఆయన మనసుమీద ఉండి ఉండవచ్చును. ఇప్పుడైనా మీకు అర్థం అయిందా, దయ్యాలు ఎక్కడో లేవు, మన మనసుల్లోనే ఉన్నయ్ అని?" ప్రజలకేసి చూస్తూ ప్రశ్నించాడు.

"అవును, మీరు చెప్పిందే నిజం!" కొద్దిమందిమాత్రమే అరిచారు.

మాతాహరి ప్రొప్రయిటర్ చెవిలో ఏదో చెప్పాడు.

ప్రొప్రయిటర్ మంత్రిగారి మీదకు వంగి ఏదో అన్నాడు.

మంత్రిగారు బెల్ నొక్కారు.

"మానెయ్యమంటారా?"

"చెప్పండి, చెప్పండి!" చాలామంది అరిచారు.

"ప్రజలు కోరుతున్నారు కనుక మరో ఐదు నిముషాలు మాట్లాడతాను. అసలు ఈ దయ్యాల భావన ఎలా వచ్చింది? ఎందుకొచ్చింది?

మానవుడు ప్రాయికంగా ఆలోచనాజీవి. మానవునిలోని జిజ్ఞాస ఈనాటిది కాదు. అనాదినుంచి సాగుతూనే ఉంది. ఈ గుణమే మానవుణ్ణి ఇతర జంతుజాలం నుంచి వేరు చేసింది.

మానవుడు తన చుట్టూవున్న ప్రకృతిని ఆసక్తితో, ఆశ్చర్యంతో చూడడం మొదలుపెట్టాడు.

తనతోపాటు ఉన్నవాడు ఆకస్మాత్తుగా చనిపోతున్నాడు అంటే నమ్మలేకపోయాడు. ఎక్కడకు పోయాడు? మళ్ళీ వస్తాడా? అనే జిజ్ఞాస బయలుదేరింది. అప్పుడే ఆత్మభావం ఏర్పడింది. చనిపోయినవాళ్ళు ఎక్కడో ఉన్నారు. మరి వాళ్లకు ఆకలి లేదా? అనే మరో ఆలోచన. అందుకు కొందరు తెలివైనవారు, సోమరులు, పరాన్నభుక్తులు - వాళ్ళకీ ఆకలి వేస్తుందనీ, అన్నం పెట్టాలనీ చెప్పారు. తమకు పెడితే పిత్రాత్మలకు చేరుతుందని చెప్పారు. రోజూ పెట్టాలంటే కష్టం కదా? అందుకే మన ఒక్క సంవత్సరం, వాళ్లకు ఒక్కరోజు అని చెప్పారు. నమ్మించారు అమాయకుల్ని.

ఈజిప్టులోని పిరమిడ్ల సంగతేమిటి? అందులో చనిపోయిన రాజుతోపాటు ధన ధాన్యాలనూ, దాస దాసీలనూ, భార్యలను కూడా సజీవ సమాధి చేసేవారు. వారు వెళ్ళిపోయినచోట మరి ఈ లోకంలో అనుభవించిన అవసరాలన్నీ కావాలిగా?

16 వ శాతాబ్దంలో పాశ్చాత్య మత బోధకులు ఆడవాళ్ళకు కూడా ఆత్మలు ఉన్నయ్యా అనే విషయం మీద చర్చలు జరిపారు."

జనంలో కొందరు మాట్లాడుకొంటున్నారు.

"సారీ! మీకు బోర్ కొట్టిస్తున్నానేమో! అతిక్లుప్తంగా చెబుతాను. అలా పోయి ఆత్మ ఎక్కడకు వెళ్తుంది? అనే జిజ్ఞాస మొదలైంది. దానికి స్వర్గం - నరకం సృష్టించి, మంచివాళ్ళు స్వర్గానికీ, చెడ్డవాళ్లు నరకానికీ వెళ్తారనీ చెప్పారు.

పరిపూర్ణ జీవితం గడపకుండా చనిపోయినవాళ్లు వెంటనే స్వర్గానికో నరకానికో వెళ్ళరుగా? మరి వారి ఆత్మలు ఎక్కడుంటాయి? ఏమి చేస్తుంటాయి? అనే ప్రశ్నలు ఉదయించాయి.

అప్పుడే దయ్యాలు - పిశాచాలూ పుట్టాయి. స్వర్గం - నరకం చేరే లోపల ఆత్మలు ఇక్కడిక్కడే అశాంతిగా తిరుగుతూ ఉంటాయన్నారు.

ఆత్మ సైజు ఎంత అని ఆలోచనాపరులు తర్జన భర్జనలు జరిపారు.

శరీరమంతే ఉంటుందని కొందరు, ఆరంగుళాలని కొందరు, బొటన వ్రేలంత అని కొందరు అన్నారు. అణువుకంటే చిన్నది, బ్రహ్మాండంకంటే పెద్దదీ అని 'కఠోపనిషత్' చెప్పింది.

అంటే - దేవుడికంటే ముందే ఆత్మభావన, దయ్యాల - పిశాచాల, పునర్జన్మల భావన మానవ జీవితంలోకి ప్రవేశించింది.

దేవుడు తర్వాత పుట్టాడు.

ఎలా పుట్టాడు అని చెప్పాలంటే మీకు మరీ బోరు కొట్టినట్టు అవుతుందని నా భయం. అందుకే రెండు ముక్కల్లో చెప్తాను.

గురజాడ 'మనుషులు చేసిన దేవుళ్లారా! మీపేరేమిటి?' అని అడిగాడు. మానవుని హేతుబద్ధమైన ఆలోచనా స్రవంతిలో భాగంగా బయలుదేరిన దైవభావం చివరకు మార్పులేని పరమసత్యమై, మానవుడ్ని తన బానిసగా చేసుకోవడమే మానవ జీవితంలో

ఒక ప్రధానమైన విషాదఘట్టం. ప్రకృతి శక్తులను గురించిన మానవుని భయమే, అజ్ఞానమే, దైవానికి మూల ఆధారం. ఆదిమానవుడు చెట్టునూ, పుట్టనూ, రాయినీ, రప్పనూ దేవుడిగా పూజించాడు. సామాన్య మానవుడి ఈ భయాన్ని ఆసరాగా తీసుకొని, సామాన్య మానవులకన్న తెలివైనవారు, మోసబుద్ధిగలవారు, విజ్ఞాన సంపన్నులు, సోమరులు, పరాన్నజీవులు, దేవుని చుట్టూ కొన్ని నియమాలు అల్లి, అవే పరమ సత్యాలగా బోధించి, వాటి ఆధారంగానే దోపిడీ వ్యవస్థను సృష్టించారు. వారు చెప్పిన దాన్ని ప్రశ్నించకూడదన్నారు.

దేవుడు మానవ రూపంలోకి ప్రవేశించాడు. మానవుడికి ఉన్న ఈతి బాధలన్నీ దేవుడికీ ఉన్నట్టుగా చెప్పారు. దేవుళ్ళకూ పెళ్ళిళ్ళు కావాలి. పిల్లలు పుడ్తారు. సవతుల పోరు ఉంటుంది. ఒకటేమిటి? మానవుని జీవితంలోని వికారాలన్నీ దేవుడికీ ఆపాదించారు. అనేకమంది దేవుళ్ళు, వాళ్ళకు చిల్లర దేవుళ్లు బానిసలుగా పుట్టారు.

ఈ దేవుడ్ని గురించీ, మతం గురించీ చెప్పాలంటే కొన్ని గంటలు కాదు, కొన్ని రోజులు చెప్పాల్సి ఉంటుంది.

దైవభావంకంటే ముందే తంత్రాలు – మంత్రాలు పుట్టాయి. దేవుడుకంటే ముందే దయ్యాలు పుట్టాయన్నాను కదూ?

మంత్రాల ద్వారా క్షుద్రశక్తుల్ని వశం చేసుకోవచ్చునన్నారు.

మంత్రాలద్వారా దయ్యం పట్టినవాళ్ళను బాగుచేస్తామంటున్నారు.

ఆ మంత్రాలను ప్రయోగించి ఆరోగ్యంగా ఉన్న మనిషిని చంపవచ్చనే నమ్మకాలు మన నరనరంలోనూ జీర్ణించుకుపోయాయి. చేతబడి, బాణామతి, అనేక పేర్లు చలామణిలోకి వచ్చాయి.

మానవునిలోని ఈ బలహీనతల్ని దోపిడీకి ఉపయోగించుకోవడం రాక్షసత్వం. కొందరు తెలివైనవారు అదే చేశారు. చేస్తున్నారు."

"పాషండుడు?"

"నాస్తికుడు"

"దేవుడు లేడట!"

"దయ్యం లేదట!"

"తన్నండి! కొట్టండి!" జనంలో కేకలు.

ఒకరిద్దరు అరిచేసరికి అందరిలోనూ ఉద్రేకం పొంగింది.

ప్రసాద్ మీదకు చెప్పులు పడ్తున్నాయి. రాళ్లు పడ్తున్నాయి.

ఎవరో టేబుల్‌మీది పేపర్‌వైట్‌తో తలమీద బలంగా కొట్టారు.

ప్రసాద్ 'గావు' కేకపెట్టి పడిపోయాడు.

"కొట్టండి! చంపండి! అసలు ఇతను ప్రసాద్ కాదు. ప్రసాద్ శరీరంలో ప్రవేశించిన ప్రేతాత్మ!" పెద్ద కుంకంబొట్టు పెట్టుకొన్న మంత్రగాడు వెర్రెక్కినట్టు అరుస్తున్నాడు. చిందులేస్తున్నాడు.

జనంలో ఉద్రేకం తగ్గింది.

పోలీసులు వచ్చారు.

ప్రసాద్‌ను ప్రొప్రయిటర్ కార్లో ఆసుపత్రికి తీసుకెళ్ళారు.

తెల్లవారి అన్ని పేపర్లలోనూ వచ్చిన వార్త–

"ప్రముఖ రచయిత ప్రసాద్ నిన్న ఒక మీటింగులో మాట్లాడుతూ దేవుడు లేడన్నాడు. దయ్యం లేదన్నాడు. మతం మనిషిని పిచ్చివాడ్ని చేస్తున్నదన్నాడు. జనం రెచ్చిపోయి ఆయనమీద విరుచుకుపడ్డారు.

బాగా దెబ్బలు తగిలాయి.

తలకు బలమైన గాయం తగిలింది.

ఆయనకు ఇంకా స్పృహ రాలేదు.

విలేఖరులు అడిగిన ప్రశ్నలకు డాక్టరు అతని పరిస్థితి చాలా క్రిటికల్‌గానే ఉందనీ, ఇప్పుడే ఏమీ చెప్పలేమనీ అన్నారు."

ఆ వార్త చదివిన ఎందరో "ప్రసాద్ చనిపోకూడదు. బతకాలి! బతుకుతాడు!" అని పదేపదే మనస్సుల్లో అనుకొన్నారు.



# కోతి - కొబ్బరికాయ

"డేంజర్ లెవల్ దాటిందట!"

ఉలిక్కిపడి లేచి కూర్చున్నాను.

ఎదురు బెర్త్‌మీద రిటైర్డ్ చీఫ్ ఇంజనీరు కూర్చుని పక్కనున్న మాజీమంత్రితో మాట్లాడుతున్నాడు.

"వచ్చే ఇరవైనాలుగ్గంటల్లో వరద ఉధృతం ఇలాగే ఉంటే మరో రెండడుగులు పెరగొచ్చు."

"అయితే రాజమండ్రి -?" మాజీమంత్రి నోరు తెరిచి అలాగే ఉంచేశాడు.

కంపార్టుమెంట్‌లో అంతవరకూ దివ్యంగా వెలుగుతున్న లైట్లు గుడ్డిదీపాలయినాయి. ఆ మసక వెలుగులో మాజీ చీఫ్ ఇంజనీరు ముఖంలోకి ఆతృతగా చూశాను.

"పంధొమ్మిది వందల ఏభైమూడులో - అంటే, ముప్పై రెండేళ్ళనాడు - అప్పుడు నేను ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా ధవళేశ్వరం సర్కిల్లో-"

రైలాగింది! ఆయన ఆగి కిటికీరెక్క పైకెత్తి చూశాడు. మాజీ మంత్రిగారు కూడా లేచి రెండో కిటికీలో తల దూర్చాడు.

వాళ్ళిద్దర్నీ తోసేసుకుని ఈదురుగాలి రయ్యిన లోపల కొస్తోంది. అయినా నాకు ఊపిరి సలపటం లేదు. చమటలు పట్టిపోతున్నాయి.

రాజమండ్రి ఏమౌతుంది? ఇరవై నాలుగ్గంటల్లో? ఒక్క ఊపుతో లేచి నిలబడ్డాను. కాళ్ళకు పట్టు దొరకడంలేదు. వాళ్ళ వెనక నిలబడి బయటికి చూడటానికి ప్రయత్నించాను.

"ఏమైందీ?" పెద్దగా అరిచాను. నా అరుపుకు పైబెర్తు మీద వళ్ళు తెలియకుండా నిద్రపోతున్న ఐ.ఏ.ఎస్. అర్భకుడు - ఏజెన్సీ సబ్‌కలెక్టరు ఎగిరి కిందకు దూకాడు.

"వాట్ హేపెన్డ్ మేడమ్? వాట్ -" మాజీమంత్రి గార్ని తోసుకొని కిటికీ దగ్గర తలపెట్టాడు.

"ఏమైందండి?" గట్టిగా అరిచాను. మాజీ చీఫ్ ఇంజనీరు మెల్లగా తిరిగి నావైపు చూశాడు.

"మీరు - మీరూ" మహా తాపీగా అడుగుతున్నాడు. అసలు విషయం వదిలేశాడు. వీళ్ళంత స్తబ్ధులు కాబట్టే కట్టిన ఆనకట్టలు కొట్టుకుపోతున్నాయి! వంతెనలు కూలిపోతున్నాయి! నా ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

"మీరు - మీరు వాసిరెడ్డి-"

"అవును, నేను వాసిరెడ్డి సీతాదేవినే - ఇంతకీ ఏమైంది?"

వచ్చే చిరాకును అణుచుకుంటూ అన్నాను.

"నేను రిటైర్డ్ చీఫ్ ఇంజనీర్ని. నా పేరు -"

"తెలుసు, రాత్రి మీరు మాట్లాడుకుంటుంటే విన్నాను." విసుగ్గా అన్నాను.

"రామారావు జీ.వో. అదే ఏభై ఐదేళ్ళకు వయస్సు తగ్గిస్తూ జారీచేసిన జీ.వో. వుంది చూశారా - దాని ప్రకారం ఫిబ్రవరి 83 లో రిటైరయ్యాను."

"రీ ఇన్‌డక్షను ఇస్తారట్లేండి. ఇప్పుడేమయిందో చెప్పండి. ఇంకా ఇరవై నాలుగ్గంటల్లో రాజమండ్రి-" విసురుగా అడిగాను.

"రీ ఇన్‌డక్షన్? చీఫ్ మినిష్టర్ ఇస్తానన్నా ఆ చుట్టూ ఉన్న గ్రహాలు ఊరుకుంటారమ్మా సీతాదేవీ?" ఎన్నో ఏళ్ళ పరిచయం ఉన్నట్లు మాట్లాడేస్తున్నాడు. మహానుభావుడు చెయ్యెత్తి దండం పెట్టొచ్చు.

"కాకపోతే ఇంట్లో కూర్చోపెట్టి జీతం యిస్తార్లేండి. మీకు పోయిందేమిటి?" ఆయనగార్ని చూస్తుంటే కసికసిగా వుంది.

"అదీ లేదంటున్నాడు గదమ్మా - అర్ధ జీతం ముష్టిగా వేస్తాడట!"

"అయ్యా యింజనీరుగారూ! లక్షలూ కోట్లూ సంపాదించుకొన్న యింజనీర్లకు అది ముష్టిగా కన్పించవచ్చు కాని-"

"సీతాదేవిగారూ! మీరు చాలా పొరపాటుపడుతున్నారు. మీరూ గవర్నమెంటు ఉద్యోగంలో ఉన్నారు. పైగా రచయిత్రి. మీకు యిలాంటి అభిప్రాయాలున్నాయంటే-" ఆయన కంఠం వణికిపోతూంది. ఉద్రేకపడిపోతున్నాడు.

"సారీ - క్షమించండి. నా ఉద్దేశ్యం-" బాగా తగ్గిపోయి గుటకలు మింగాను.

"మేజర్ యిరిగేషన్ చీఫ్ యింజనీరు చేసిన నాకు ఉండటానికి కొంపకూడా లేదంటే మీరు నమ్ముతారా?"

నాకు గుండెలు కదబడ్డాయి. యింత ఆ (హో) నెస్టా? అబ్‌సర్డ్. అసంభవం. ఆయన పేరన లేకపోవచ్చు. అల్లుళ్ళ పేరనో కూతుళ్ళ పేరనో కోట్ల ఆస్తి - ఆరు తరాలు దంతాలు అరిగేట్టు తిన్నా తరగని ఆస్తి - మాజీమంత్రి నా ముందుకు వచ్చి నిలబడ్డాడు. నా ఆలోచనకు బ్రేక్ పడింది.

"సీతాదేవిగారూ! అల్లుళ్ల పేర్న, కొడుకుల పేర్న, కూతుళ్ళ పేర్న, కోడళ్ళ పేర్న మరిపోతే మనవళ్ళ పేర్న సంపాదించిన కోట్లాది ఆస్తి దఖలుపరిచి - నేను సన్యాసిని నా దగ్గరేముంది బూడిద అంటూ-" మాజీమంత్రివర్యులు ఉపన్యాసం లంకించుకొన్నాడు. ఈయనగారు చెప్పేదంతా లోగడ ఎన్నోసార్లు ఎసెంబ్లీలోనూ బయటా పేపర్లలో విన్నదే మరి.

"అది పోనీయండి. యింతకీ నేనడుగుతున్నదీ-"

"అహాఁ. చూశారా యింజనీరుగారూ, ఈవిడగారి అభిమానం! ఆ సంగతెత్తేసరికి అది పోనీయండి యిది పోనీయండి అని దులపరించేస్తున్నారు."

నాకు నోటమాట పెగల్లేదు. తెల్లమొహంవేసి ఇంజనీర్‌ను చూశాను. అవతల వున్న ఐ.ఏ.యస్. ప్రొబేషనర్‌కు తెలుగు రాదు. అస్సాంనుంచి వచ్చినవాడు.

"ఉంటుందండీ బాబూ, ఉంటుంది. ఎంత రచయిత్రి అయినా ఆ మాత్రం అభిమానాలు ఉండవంటారా? ఆ మాట కొస్తే మీకూ నాకూ లేవూ? అసలంతవరకూవస్తే కులాభిమానం లేనివాళ్ళెవరో చెప్పండి నాకు?" జీవిత సత్యాల్ని వెళ్ళడిస్తున్న వేదాంతిలా చెప్పుకుపోతున్నాడు ఇంజనీరు.

నాకు వళ్లు మండిపోతున్నది. ఈ కులం పిచ్చివాళ్ళను కిందున్న గోదారిలోకి తోసేయాలన్నంత కసిగా వుంది. గోదారి గుర్తురాగా గుండెల్లో గుబులు తలెత్తింది మళ్ళీ.

"ఇరవై నాలుగ్గంటల్లో రాజమండ్రి-"

"తెలుగు. తెలుగు. రాజమహేంద్రవరం - రాజరాజ నరేంద్రుడు పరిపాలించిన తెలుగు సంస్కృతి వెల్లివిరిసిన" ఇక ఆపైన రాక ఆగిపోయిన ఆ మాజీమంత్రి ముఖం ఇప్పటికీ నాకు బాగా గుర్తున్నది. వత్తివత్తి పలికి తన మాటల్లోని వ్యంగ్యానికి తనే మురిసిపోతున్న ఆ మాజీమంత్రి ముఖం చూస్తుంటే నాకు చిరాకు వేసింది.

వీళ్ళేం మనుషులు? గోదారేమిటి? ఇరవై నాలుగ్గంటల్లో రాజమండ్రి మునగడమేమిటి? ఇప్పుడీ బండి ఇక్కడ ఎందుకు ఆగినట్టూ?

ఆ మాజీలనిద్దర్నీ తప్పుకొని "వాటీజ్ ద మాటర్ మిస్టర్ సంగ్మా!" కిటికీ దగ్గర కొచ్చాను.

"ఆ కుర్రాడికేం తెలుసమ్మా? నన్నడగండి నే చెప్తా!" అన్నాడు ఇంజనీరు.

"తమర్నే గద ఇంతవరకూ అడిగింది."

"చెప్తూనే వున్నాగదమ్మా! మీరే తొందరపడి పోతున్నారు." నన్ను తప్పు పట్టుతూ నింపాదిగా శెలవిచ్చాడు ఇంజనీరు. ఈ తరహా మనుషులతో లాభంలేదు. నోరు మూసుకుని వాళ్ళు చెప్పే సోదంతా విన్నాక - అన్న నిర్ణయానికొచ్చి మేస్టారిముందు స్టూడెంటులా నిలబడి చూశాను.

"ఇంజన్ డ్రైవరు బండాపేశాడు-"

ఇంజన్ డ్రైవరు అపకపోతే ఆయనా నేనూ ఆపుతామా? ఏమిటో చాదస్తం!

"అదే - ఎందుకు ఆపాడూ అని?"

"వరద ఉధృతంగా ఉంది. ట్రాక్‌కు చాలా దగ్గర్లో ఉంది ప్రవాహం. అందుకని -"

"తేల్చిచెప్పు మహానుభావా! నాకు గాబరాగా వుంది."

బండి ఇప్పుడెక్కడ ఆగింది? బ్రిడ్జీమీదనా? అటు వెనక్కూ పోక, ఇటు ముందుకూ పోక గోదారిమధ్యలో వంతెనమీద రైలు ఆగిందా? ఈ వంతెన కొట్టుకుపోయి రైలు పెట్టెలు గోదావరి పొంగులో కలిసి సముద్రంలో తేలేదాకా....

"ఏమిటమ్మా చాలా గాబరాపడుతున్నట్టున్నారు. ఇది మామూలే. బ్రిడ్జిదగ్గరకు రాగానే రైలు ఆగి మళ్ళీ మెల్లిగా బయలుదేరి బ్రిడ్జి దాటుతుంది. గోదావరి స్టేషన్నుంచి క్లియరెన్సుకోసం ఆగాడు డ్రయివరు. కొన్ని వందలసార్లు దాటాను నా ముప్పయిమూడేళ్ళ సర్వీసులో యీ బ్రిడ్జి."

నిట్టూర్పు విడిచాను. హాయిగా గాలి పీల్చుకొన్నాను. ఈ మాట చెప్పటానికి ఇంత సస్పెన్స్‌లో ముంచెత్తాడు. గోదావరిలో మునిగి మునిగి ఒడ్డుకు చేరినట్టుంది. తిరిగొచ్చి

బెర్త్‌మీద కూర్చున్నాను. ఆ మాజీలకేసి నిర్లక్ష్యంగా చూశాను. నది దాటేటప్పుడు ఓడమల్లయ్య, దాటేక బోడిమల్లయ్య అన్న సామెత గుర్తొచ్చింది.

"ఎందుకు నవ్వుతున్నారూ?"

"నేనా?" ఆశ్చర్యంగా అన్నాను. అంతలోనే గుర్తొచ్చింది నాలో నేను నవ్వుకొన్నట్టు.

"మీ ముఖాలు చూసి!" అనాలి అనిపించింది.

"నా చిన్నప్పటి సంగతేదో గుర్తొచ్చిందండి. రైలు గోదావరి వంతెనమీద పోతూండగా, కానీలూ తీసి గోదాట్లోకి విసిరాను. అన్నీ స్థంభాలకు తగిలి ఇవతల పడ్డాయి. ఒక్కటీ నేరుగా నదిలోకి విసర్లేకపోయాను. మా స్నేహితురాలు కమల ఒక కాని విసరగలిగింది. వెంటనే కేరింతలు కొడుతూ చప్పట్లు చరిచింది. 'నాకు మంచి మొగుడొస్తాడే సీతా, నాకు మంచి మొగుడొస్తాడే' అంటూ బెంచీమీద నిలబడి గోదాట్లోకి చూస్తూ కిటికీచువ్వలు పట్టుకొని గంతులేసింది - అమాయకంగా ఐదేళ్ళ కమల." రక్కున ఏదో గుర్తొచ్చి ఆగిపోయాను. వాళ్ళు మాట్లాడిందంతా నాకు సొదగా అనిపించింది. ఇప్పుడు నేను చేస్తున్నదేమిటి? ఎవడి సొద వాడిది. ఎవరి నస వారిది. ఏం చేస్తాం. మనిషి మనసులో ఎంతని దాచుకోగలడు?

"దొరికాడా?"

ఉలిక్కిపడ్డాను.

"ఏమిటి దొరికింది?" ఎదురడిగాను, నలిగిపోయిన ఖాదీ సిల్కులాల్చీలో నూనె హరించుకుపోయి కొడిగట్టిన చమురువొత్తిలా వెలుగుతున్న మాజీ మంత్రివర్యుడ్ని.

"మొగుడు.!" కర్ణకఠోరంగా వుంది.

"ఎవరికి?" మాట జారింది. యథాలాపంగా అన్నాను. మాటలు వెనక్కు రావుగదా?

"మీ నేస్తం కమలకు మంచి మొగుడొచ్చాడా?" అదోలా నవ్వేడు.

"మొగుడయితే దొరికాడు."

"మంచి మొగుడు దొరికాడా అని?" ఆ ప్రశ్నలోనే ఏదో ఆనందం ఉన్నట్టు ముఖం పెట్టాడా వ్యక్తి.

డీజిల్ ఇంజన్ కూత ఒకటి, రెండుసార్లు - బండి కదిలింది. టైం చూసుకొన్నాను. 5-45 అయింది.

సికింద్రాబాద్‌లో 7-45కు బయలుదేరిన గోదావరి ఎక్స్‌ప్రెస్ కొవ్వూరు స్టేషను దాటి గోదావారి రైలు బ్రిడ్జి దగ్గిరకు 5 గం. 45 నిముషాలకొచ్చి ఆగింది. 4 గం. 55 నిముషాలకు రాజమండ్రి చేరవలసిన బండి ఇప్పుడు గోదావరి బ్రిడ్జిమీద కొచ్చింది. గంటకు పైగా లేటు. పాపం, మా వాళ్ళు స్టేషన్లో నాలుగున్నరనుంచే వైట్ చేస్తూ వుంటారు.

ఏమిటో మనసు చాలా చిత్రమైంది. పదినిముషాల ముందు చావుబ్రతుకుల్ని ఆలోచించింది. ప్రమాదం ఏదీ లేదనగానే ఓ గంట లేటయితేనే విలవిల్లాడిపోతుంది. హౌ సిల్లీ యూజిట్! 'నీ వెక్కిన బండి ఒక జీవితకాలం లేటు' అన్న ఆరుద్ర కళ్ళముందు కదిలాడు.

వాటే బ్యూటిఫుల్ సింఫొని! టక్ టక్ థన్ థన్- బ్రిడ్జి మీద రైలు వెళుతూ చేస్తున్న ధ్వని తమాషాగా ఉంది. రైలు వేగం పెరుగుతున్నకొద్దీ గుడ్డిగా వెలుగుతున్న లైట్లు కంపార్టుమెంటులో కాంతివంతమయినాయి. కిటికీ దగ్గర బ్రిడ్జి ఇనపదూలాల మధ్యనుంచి కిందకు చూస్తూ నిలబడ్డాను.

గోదారి – వరదగోదారి ఉరవళ్ళు తొక్కుతూ నిండుగా ప్రవహిస్తూన్నది. చూపు కందినంతవరకూ జలమయంగా వుంది. చల్లటి నీటితుంపర్లలో గాని ముఖాన్ని తాకుతూ వుంది. మధురమైన అనుభూతి 'ఎన్నెల్ను మేసి ఏరు పారుతూంటే–' ఎప్పుడో ఏ మహాకవో ఏ మధురానుభూతి పొందో చెప్పిన భావగీతికలు మనసు తీగలను మీటుతూ వుంటే బాహ్యప్రపంచాన్నే మరిచిపోయాను. ఇలా – ఇలా – జీవితకాలం – అనంతంగా ఈ బండి, ఈ వంతెన మీద నడుస్తూ వుంటే – పొంగిపొరలి ఒడ్డుల్ని ఒరుసుకొని ప్రవహిస్తున్న నిండు గోదావరిని వెన్నెల్లో చూస్తూ ఉండిపోతే –

గోదావరి స్టేషన్ వచ్చింది.

సూట్‌కేసు సర్దుకొన్నాను.

గాలికి లేచి అల్లీబిల్లిగా తిరుగుతూ నుదురు మీదగా వాలిపోయిన ముంగురులను సర్దుకొని బెర్తుమీద కుదురుగా కూర్చున్న నా ముఖంలోకి ముఖం పెట్టి ముందుకు వంగి చూస్తూ మాజీమంత్రి మళ్ళీ అడిగాడు.

"మీ స్నేహితురాలి మొగుడి సంగతి చెప్పారు కాదు."

పెద్ద జిడ్డుగాడిలా వున్నాడు. కళ్ళెత్తి చురుగ్గా చూశాను. అబ్బ ఆ ముఖం! అచ్చంగా స్కెలిటిన్‌లా వుంది! మొగుడంట మొగుడు! భర్త అంటే ఈయన నోటి ముత్యాలేం రాలిపోతాయో! సంస్కారం లేదు. ప్రజలంటే అలుసు. ఆడదంటే మరీ అలుసు. మనుషులంటే ఎంత నిర్లక్ష్యం? ముప్పై అయిదేళ్ళు దేశాన్ని ఏలారు, ఈ జాతి మనుషు లింకెంతకాలం ఏలుతారో?

"ఏం పాపం! మంచి మొగుడు దొరకలేదా?"

వళ్ళు మండిపోతున్నది ఆయన మాట్లాడుతుంటే! ఆ ముఖం చూస్తుంటే వాంతి వచ్చేట్టుంది. అప్పటికి ఇంకా ఏమీ తినలేదు కాబట్టి సరిపోయింది.

"ఏమండి సీతాదేవిగారూ?"

ఉలిక్కిపడ్డాను. యేదో మృగం మానవభాష మాట్లాడుతున్నది.

"కథ సస్పెన్స్‌లో వదిలేసిపోతున్నారు." ఊరుకునేట్టు కన్పించడంలేదు. మాజీ ఇంజనీరు మాజీమంత్రి మాటకు బెక బెకఁ నవ్వాడు.

"మంచిమొగుడో చెడ్డమొగుడో మీరే చెప్పాలి!" అని ముఖంలోకి చూశాను.

"నేనా! ఎలా?" అంటూ నోరు తెరిచాడు. కోట్లకు కోట్లు తిన్న నోరది. లక్షలకు లక్షలు అబద్ధాలాడిన నోరది, వేలకు వేలు బూతులు కూసిన నోరది.

ఛ... ఛ... ఎందుకు ఇలా ఆలోచిస్తున్నాను. నాకే అన్యాయంగాను అక్రమంగాను అనిపించింది. ఆ రకం మనుషుల మీద నాకున్న డీప్ రూటెడ్ ప్రెజుడిసెస్‌తో ఎదురుగా వున్న ఈ పెద్ద మనిషిని గురించి ఆలోచిస్తున్నానేమో అనిపించింది.

"మాంచి సస్పెన్స్‌లో ఉంచేసారు. మీ కమలెవరో నాకు తెలియదు. ఇహ అవిడగారి మొగుడి సంగతెలా తెలుస్తుంది నాకు? అహహ్హా!" అతడు నవ్వుతుంటే మూరెడు ముందుకొచ్చిన బానెడు పొట్ట ఎగిరెగిరిపడింది.

"ఎలాగో చెప్తా వినండి!" నాటక ఫక్కీలో అన్నాననుకొన్నాను. ఎలా అన్నానో తెలియదుగాని మా. మ. ఆయన పక్కనే వున్న మా. యి. బుద్ధిమంతులైన బడిపిల్లలు ఆలిస్ యిన్ వండర్‌లాండ్ కథ వినడానికి సిద్ధమయినట్టుగా శ్రద్ధగా వినసాగారు.

"కమల పెళ్ళయేనాటికి ఆమె భర్త మెట్రిక్ తప్పి, ఒకానొక మంత్రిగారి దగ్గర అన్‌అఫీషియల్ అంతరంగిక కార్యదర్శిగా పనిచేస్తున్నాడు. పార్టీ ఆఫీసులో ప్రెసిడెంటుక్కూడా అతి సన్నిహితుడుగా పనిచేస్తున్నాడు. చిన్న పెద్ద పనులు చేయిస్తూ రెండు చేతులా అర్జిస్తున్నాడు. ఆరంభంలో ఆఫీసుబాయ్‌లా మెలిగిన ఆయన ఐదేళ్ళలో చాలా ఎత్తుకు ఎదిగిపోయాడు. ప్రతి మగవాడి విజయాల వెనక ఒక ఆడదాని ప్రతిభ వుంటుందన్న నానుడి అక్షరాల నమ్మినవాడు గనక కమలను బలవంతంగా రాజకీయాల్లోకి, కాదు కాదు – రాజకీయంలోకి దించాడు. భార్య శీలాన్ని పెట్టుబడిగా పెట్టి అంచలంచలుగా పైకి వచ్చాడు. ముందు ఎమ్మెల్లే. ఆ తర్వాత మంత్రయ్యాడు. మంత్రయ్యాక ఆడవాళ్ళ శీలాన్ని తను ఆదిలో పెట్టిన పెట్టుబడికి ఇబ్బడిముబ్బడిగా హరించివేశాడు. మళ్ళీ జన్మంటూ వుంటే మళ్ళీ ఇలాటి రాజకీయ నాయకుడికి భార్యగా మాత్రం పుట్టించవద్దని భగవంతుడ్ని ప్రార్థించి గోదావరిలో దూకి ఆత్మహత్య చేసుకొన్నదట నా చిన్ననాటి స్నేహితురాలు కమల!" ఆగి మాజీ మంత్రిగారి ముఖంలోకి చూశాను. దేన్నో వెతకడానికి ప్రయత్నం చేశాను. నా ఆశలు అడియాశలయినాయి. బెల్లంకొట్టిన రాయిలా స్తబ్దుగా జిడ్డోడుతూ వున్నాడు.

"కమల భర్త పేరేమిటి?" ఉత్కంఠతో అడిగాడు మాజీ సి.ఇ. అతడిమాట విననట్టే నటించి కిటికీలోనుంచి బయటికి చూశాను. రాజమండ్రి అవుటర్ సిగ్నల్ కన్పించింది. హాయిగా గాలి పీల్చుకొన్నాను. ధైర్యాన్ని కూడదీసుకొన్నాను.

"ఎవరండీ ఆయన? మీకు తెలియకుండా ఎవరుంటారు? నలభైయేళ్ళనుంచి రాజకీయాల్లో వున్నారు!" మాజీ చీఫ్ ఇంజనీరు ఉక్కిరిబిక్కిరయిపోతూ పక్కనవున్న మాజీ మంత్రిగార్ని గుచ్చి గుచ్చి అడుగుతున్నాడు.

"ఇంత కథ చెప్పిందిగా, అదికూడా ఆవిడ్నే చెప్పమనండి." అతడి మాటల్లో ఇనపదబ్బనాలున్నాయి. ఆ క్షణంలో అతడు నాకేసి చూసిన చూపుల్లో చురకత్తుల మెరుపులు కనిపించాయి. నాకు నోరెండిపోతూంది.

అయినా బింకంగా ముఖంపెట్టి సూట్‌కేసు తీసుకొని నిలబడి చూశాను.

బండి ప్లాట్‌ఫారంమీదకొచ్చింది. కళ్ళు విచ్చుకొని కలయచూశాను. జనంలోనుంచి నా కోసం వచ్చిన మా కో ఆర్డినేటర్ కల్పన. ఆమెతోపాటు మరో ఇద్దరు ముగ్గురు కనిపించారు. ప్రాణం లేచివచ్చింది.

ధైర్యంగా ఎదురుగావున్న మాజీలకేసి చూశాను.

మంత్రి కత్తులు నూరుతున్నట్టుగా అనిపించింది. ఆ మాజీ సి.ఇ.కేం గుర్తొచ్చిందో అతడూ నాకేసి కొరకొరా చూస్తున్నాడు. బోడి మాజీగాళ్లు - యింక నన్నేం చేస్తారు!

అంతలో బాత్‌రూంలో డ్రస్ చేంజి చేసుకొని సబ్‌కలక్టర్ కంపార్ట్‌మెంటులోకి వచ్చాడు. చిలిపిమనసు, అవకాశం దొరికితే కవ్వించాలనిపిస్తుంది.

బండాగింది. కిటికీదగ్గరవున్న నన్ను చూసి మావాళ్లు పరుగెత్తుకొని కంపార్టుమెంటు దగ్గరకు వస్తూవున్నారు.

"క్షమించాలి. మిమ్మల్ని సస్పెన్స్‌లో వదిలి వెళ్ళాలని లేదు - చెప్పేస్తున్నాను వినండి-"

"మొత్తానికి రచయిత్రి అనిపించారు. భలే కథ చెప్పారు. గొప్ప సస్పెన్స్!" పగలబడి నవ్వసాగాడు మాజీ మంత్రి.

బ్లడీ హిపోక్రేట్, క్షణాలమీద మనిషి మారిపోయాడు.

"ఏమండి సి. ఇ. గారూ! మన సీతాదేవి పుస్తకాలేమయినా చదివారా?"

మన సీతాదేవట! పయోముఖ విషకుంభం అంటే ఏమిటో నాకు మొదటిసారిగా అర్థమయింది.

"చదవలేదు. కాని విన్నాను. రెండు మూడేళ్ళక్రితం ఆమెగారు రాసిన నవల ఒకటి గవర్నమెంట్ నిషేధించిందని తెలుసు. అప్పుడు పత్రికల్లో ఎసెంబ్లీలో-" సి. ఇ. గారి మాట పూర్తి కాకుండా అందుకొన్నాడు మాజీమంత్రి.

"అసెంబ్లీలో వచ్చేముందు కేబినెట్‌లో డిస్కషన్ కొచ్చింది. నిషేధాన్ని రద్దు చేయాలని నేను గట్టిగా వాదించాను."

స్కౌండ్రల్ ! పచ్చి అబద్ధాలు. కసికసిగా వుంది. ఎలాగో నిలదొక్కుకున్నాను. కంపార్టుమెంటులోకి కల్పన యిద్దరి అసిస్టెంట్సుతో సహా వచ్చింది.

"థాంక్యూ సర్ !" వాకిట్లో నిలబడి చెప్పాను.

"నేనే థ్యాంక్సు చెప్పాలమ్మా మీకు. మంచి కాలక్షేపం, బలే కథ చెప్పారు." ఎంతో ఆప్యాయత ఆ గొంతులో.

"అయ్యయ్యో! అది కథ కాదండి, వాస్తవంగా జరిగింది. అయితే, ఆమెపేరు కమల కాదు."

"మరెవరూ?" ఇద్దరూ ఒక్కసారే నోళ్ళు తెరిచారు.

"విజయదుర్గ!"

మళ్ళీ వెనక్కు చూడలేదు. మరుక్షణంలో ప్లాట్‌ఫారం మీదకు దూకేశాను.

"ఏమిటి మేడమ్, అంత ఖంగారు పడుతున్నారు బండి ఆలస్యమయిందనా? టైముంది మనకు. ఇక్కడ టిఫెన్ చేసుకొని ఏడుగంటలకు బయలుదేరితేచాలు —మన ప్రోగ్రాంటైంకు అమలాపురం చేరుకోవచ్చు." వెనకే నడుస్తూ చెప్పుకుపోతున్నది కో ఆర్డినేటర్ కల్పన. ఏదో సాధించాననే తృప్తి మనసుని చుట్టేసింది.

జీప్‌లో కల్పన పక్కన కూర్చున్నాను, "ముందు గెస్ట్‌హౌస్‌కు పోనియ్!" డ్రయివర్‌కు ఆదేశాలిచ్చింది కల్పన. చాలా చురుకయిన పిల్ల.

# 2

"మేడమ్! వచ్చేది ముమ్మడివరం." కల్పన అన్నది.

"ముమ్మడివరం బాలయోగి!" సాలోచనగా అన్నాను.

"అవును మేడమ్, చూస్తారా?" అని డ్రయివర్ని మెల్లగా పోనియ్యమని సంజ్ఞ చేసింది కల్పన.

"అక్కడేముంది కల్పనా, చూడటానికి?"

"అదేమిటి మేడమ్, అలా అంటారు. లక్షలాది జనం వచ్చి చూసిపోతారు. సెక్రటరీలు, మంత్రులు వచ్చి బాలయోగిగారి దర్శనం చేసికొనిపోతూ ఉండేవాళ్ళు మేడమ్!"

"ఆయన చచ్చిపోయాడుగా?"

"అయితే ఏం మేడమ్? ఇంకా జనం తండోపతండాలుగా వచ్చి ఆయన సమాధిని దర్శనం చేసుకుపోతూ ఉన్నారు. బాలయోగిగారి మహత్యం అలాంటిది."

"ఏం మహత్యం తల్లీ, మనిషి చచ్చి కుళ్ళి వాసన కొడుతూంటే మూడురోజుల తర్వాత శవాన్ని బయటికి తీశారని పేపర్లో చదివానే!"

కల్పన గతుక్కుమన్నది.

"అది నిజమే మేడం! అయినా జనానికి భక్తి తగ్గలేదు."

"ఇది భారతదేశం. ఇంకో వందేళ్ళయినా పట్టొచ్చు - మతపిచ్చిను, మూఢాచారాలను, నమ్మకాలను వదిలించుకొని శాస్త్రీయ దృక్పథం అలవరచుకోడానికి. మరి మనది నాలుగు వేల సంవత్సరాల నాగరికత గదా!"

"నేరుగా వెళ్ళిపోదామా?"

"నీకు చూడాలనివుంటే ఆగుదాం" అంటూ కల్పన మొహం చూశాను.

"నో. నో.... మేడం! మీరు చూస్తారేమోనని. అంతే!" డ్రయివర్‌కేసి తిరిగి నేరుగా పోనీయమని చెప్పింది.

అరవైకిలోమీటర్ల వేగంతో పోతూ ప్రతి రెండు మూడు నిమిషాలకు స్పీడ్ తగ్గించి ఎదురొచ్చే వాహనాల్ని తప్పుకొంటూ పోతున్నాడు జీప్ డ్రయివర్. చల్లటిగాలి ముఖాన్ని తాకుతూంటే హాయిగా వుంది. కళ్ళు మూతలు పడుతున్నాయి.

"మేడం! రాత్రి నిద్రపట్టలేదా?" అని అడిగింది కల్పన.

"ఏం? కునికిపాట్లు పడుతున్నానా?"

"అని కాదు మేడమ్! జీప్ కదా అని. అందులో బయటవైపు కూర్చున్నారని."

కల్పన తెలివైనది. నవ్వొచ్చింది. ఎంత సున్నితంగా చెపుతుంది.

"కోనసీమ వచ్చేశాం మేడమ్! ఇంకో గంటలో అమలాపురం వెళ్ళిపోతాం."

"కోనసీమంటే ఎగ్జాక్ట్‌గా ఏ ఏరియా?" ముంచుకొస్తున్న నిద్రమత్తును వదిలించుకొందామన్న ప్రయత్నంలో కల్పనను మాటల్లోకి దించాను. అడిగితే చాలు- కల్పనకు ఎక్కడలేని ఉషారు వస్తుంది. చెప్పింది చెప్పకుండా విసుగెత్తించకుండా

గంటలతరబడి కబుర్లు చెపుతుంది. అదీ ఒక కళే అనుకోవాలి. అది అందరికీ చేతనయింది కాదు. నా మట్టుకు నాకు ఐదు నిమిషాలు మాట్లాడాక మళ్ళీ ఇంకేం మాట్లాడాలా అని ఆలోచిస్తాను.

"మేడమ్! ఇంతకుముందు బ్రిడ్జి దాటాం కదా, అక్కడ్నుంచి కోనసీమ మొదలవుతుంది. రాజోలు, కొత్తపేట, అమలాపురం - యీ మూడు తాలూకాల భూభాగాన్ని కోనసీమ అంటారు. గోదావరి పాయలుగా చీలి గౌతమీ, వసిష్ఠ, వైనతేయా పేర్లతో చివరకు సముద్రంలో కలుస్తుంది. ఈ గోదావరి పాయలమధ్య వున్న భూభాగాన్నే కోనసీమంటారు మేడమ్! ఇంత సారవంతమయిన భూమి ఆంధ్రప్రదేశ్‌లో మరెక్కడా లేదు. బహుశః భారతదేశంలోకూడా లేదంటే అతిశయోక్తి కాదేమో! ఈ కోనసీమవాసులకో ప్రత్యేకత వుంది."

"ఏమిటది?" ఉత్సాహంగా ఉత్కంఠతో అడిగాను.

కల్పన ఆసాధ్యురాలు, నిద్రమత్తు వదలగొట్టింది.

"ఈ కోనసీమను గురించి ఓ కథ ఉంది మేడమ్, మీరు విన్నారో లేదో?"

"కథా? చెప్పు, చెప్పు" అంటూ సర్దుకు కూర్చున్నాను జీపులో. ఎటు చూసినా పచ్చటి తివాచి పరచినట్టున్నది నేల. రోడ్డుకు అటూ యిటూ అరటి, కొబ్బరి, మామిడితోటలు, పూలతోటలు, పసుపుతోటలు - చూస్తుంటే ఒళ్లు పులకరించి పోతూంది.

"కల్పనా! చెప్పవేం? కోనసీమ కథ చెప్తానన్నావుగా?" కల్పనవేపు తలతిప్పి చూశాను. ఆమె చెంపలు ఎరుపెక్కాయి. కళ్లు మిలమిల్లాడుతున్నాయి. ఆశ్చర్యంగా చూశాను. కథ చెప్పడానికి ప్రిపేర్ అవుతందన్నమాట! తను చెప్పబోయే కథ మనసులో మొదలవగానే ఆమె ముఖంలో వచ్చినమార్పు నన్ను మంత్రముగ్ధను చేసివేసింది. కల్పన-ప్రవృత్తికి తగ్గ పేరు. ప్రయత్నిస్తే పెద్ద ఆర్టిస్టు కాగలదు.

"మేడమ్, రెడీ?" కల్పన కంఠంలో ఎంతలో ఎంత మార్పు!

"యస్, ఐయాం రెడీ! గో ఆన్!"

"కైకేయి కోరికపై తండ్రిమాట జవదాటని శ్రీరామచంద్రుడు సీతాసమేతుడై లక్ష్మణుడు వెంటరాగా అయోధ్య వదలి అరణ్యవాసానికి బయలుదేరి వస్తున్నాడు."

వారేవా? వాట్‌స్టైల్!

"అయోధ్య రాముడికి కోనసీమకు సంబంధమేమిటి కల్పనా?" వచ్చే నవ్వాపుకుంటూ అడిగాను.

"మేడమ్! మీరట్లా మధ్యలో అడ్డుపుల్ల లేయకూడదు. పూర్తిగా విన్న తర్వాత అడగండి అనుమానాలేమన్నా ఉంటే." సీరియస్‌గా ముఖంపెట్టి అన్నది.

"సారి కల్పనా, సారీ... ప్లీజ్, చెప్పు. ఊఁ !" పెదవి బిగించి కూర్చున్నాను.

"అట్లా బయలుదేరిన రాముడు, సీత, లక్ష్మణుడూ దండకారణ్యంలో కొంతకాలం ఉండి దక్షిణాపథానికి ప్రయాణం కట్టారు. లక్ష్మణుడు మూటాముల్లె నెత్తినబెట్టుకొని అన్నగారిని, వదినగారిని అనుసరించి వస్తున్నాడు. సీతా, రాముడు చెయ్యీ చెయ్యీ

కలుపుకొని చెట్టాపట్టా లేసుకొని దారిలో కనిపించే వింతలను విశేషాల్ని చూస్తూ హాయిగా కబుర్లు చెప్పుకొంటూ వసిష్ఠానది వొడ్డుకొచ్చారు.

వాళ్ళ వెనకే అన్నగారి అడుగుజాడల్లో మూటలు మోస్తూ చెమటలు కక్కుతూ లక్ష్మణుడు కూడా నది ఒడ్డుకు చేరుకున్నాడు.

సీతారాములు నది దాటారు. ఆ వెనకే లక్ష్మణుడు నది దాటాడు. నది దాటాక కొంతదూరం సీతను వెంటబెట్టుకొని నడిచిన రాముడు లక్ష్మణుడొస్తున్న జాడ కనిపించకపోయేసరికి ఆగి వెనక్కు తిరిగిచూశాడు.

అల్లంతదూరంలో లల్లాయి పాటలు పాడుకొంటూ, యీలలు వేస్తూ నిర్లక్ష్యంగా నడిచివస్తోన్న లక్ష్మణుడ్ని చూసి రాముడు ఇదేమిటి నా తమ్ముడు లక్ష్మణుడేనా యితడు అని ఆశ్చర్యపోయాడు.

కొయ్యబొమ్మలా నిలబడి తమ్ముడికేసి చూడసాగాడు. అంతవరకు నెత్తిమీద పెట్టుకొని మోస్తూ తీసుకొస్తున్న మూటల్ని రెండు చేతుల్తో పట్టుకొని అటూ యిటూ ఊపుతూ రాముడికేసి ఉసిఉసిగా వడివడిగా వస్తున్నాడు. అలా వస్తున్న తమ్ముడినిచూసి, మనసులో మథనపడుతూ సీతమ్మను వెంట పెట్టుకొని ముందుకు నడక సాగించాడు రాముడు.

"ఆగు!"

వెనకనుంచి లక్ష్మణుడి కేక వినిపించింది. రాముడూ సీతా శిలావిగ్రహాల్లా నిలబడిపోయారు. దగ్గరౌతున్న లక్ష్మణుడి వాలకం చూసిన రాముడు అయోమయావస్థలో పడిపోయాడు.

"ఎవడు మోస్తాడనుకున్నావ్ యీ గాడిద బరువంతా? నీ బట్టలూ సామాగ్రీ కాకుండా నీ పెళ్ళాం చీరెలు, లంగాలు కూడా నేను మొయ్యాలా ఏమిటి? నేనేం నీ బానిసను అనుకొన్నావా? నేనూ మగాడ్నే! నాకూ పౌరుషం ఉంది. ఆడది విడిన బట్టలు మోసే ఖర్మ నాకేం పట్టలేదు! మీ మూటలు మీరు మోసుకోండి!" అంటూ లక్ష్మణుడు మూటల్ని రాముడి ముందు పారేశాడు. అలా వాళ్ళ ముందు మూటలు విసిరేసి స్వేచ్ఛగా తిరుగుతూ, పళ్ళు ఫలాలు కోసుకొని తింటూ హాయిగా పాటలు పాడుకుంటూ అన్న, వదినలను వదిలేసి వెళ్ళిపోయాడు.

ఇదేమీ అర్థంకాని రాముడు ఖిన్నుడైపోయి తమ్ముడు పారేసిన మూటల్ని నెత్తిన పెట్టుకుని సీతతో ముందుకు సాగిపోయాడు. సీతమ్మకయితే అంతా అగమ్యగోచరంగా ఉంది.

రాముడూ సీతా మూడురోజులపాటు నడిచి ఎట్టకేలకు గోదావరి పాయలయిన గౌతమీ వైనతేయాపాయలు దాటి దక్షిణదిక్కుగా నడవసాగారు.

ఆమడదూరం అన్నా నడిచారో లేదో వెనకనుంచి హృదయవిదారకంగా కేకలు విన్పించాయి. రాముడు ఆగి వెనక్కు తిరిగిచూశాడు. అటునుండి తమ్ముడు లక్ష్మణుడు గుండెలు బాదుకొని విలపిస్తూ పరుగు పరుగున వస్తూ కన్పించాడు.

"అగ్రజా! శ్రీరామచంద్రప్రభూ! ఏమిటీ దారుణం? నీ అనుంగు తమ్ముడు, నీ సేవకుడు యింకా బ్రతికేవున్నాడు. ఆ మూటలు మీరు మొయ్యడమేమిటి? నా వదిన,

నా తల్లి నెత్తిన ఆ భారమేమిటి? కరుణాసముద్రా! దయామయా! నాకీ శిక్ష ఎందుకు విధించావు? నేను చేసిన నేరమేమిటి? నే చేసిన అపచారమేమిటి?" కన్నీరు మున్నీరుగా విలపిస్తూ లక్ష్మణుడు అన్న పాదాలను చుట్టేసుకున్నాడు.

దయామయుడయిన రామచంద్రుడు తమ్ముడ్ని ఓదార్చి తన దగ్గర, సీతమ్మ నెత్తిమీద వున్న మూటల్ని దించి లక్ష్మణుడికి అందించాడు. లక్ష్మణుడు మహాప్రసాదంలా అందుకొని నెత్తిన పెట్టుకుని అన్నగారి ఆజ్ఞకోసం ఎదురుచూశాడు.

నాలుగడుగులు ముందుకువేసిన రాముడికి చటుక్కున ఏదో ఆలోచన తళుక్కున మెరిసింది. అవతల నది దాటేంతవరకూ ఎంతో నమ్రతతోవున్న లక్ష్మణుడి ప్రవర్తన నది దాటగానే మార్పు వచ్చింది. ఈ నదిపాయ దాటగానే లక్ష్మణుడిలో మళ్ళీ మార్పు వచ్చింది.

ఏమిటీ చిత్రం?

రాముడు ఆగి లక్ష్మణుడితో "తమ్ముడూ! నువ్వూ వదినా నడుస్తూ ఉండండి. నేనిప్పుడే వస్తాను" అని చెప్పి వెనక్కు వెళ్ళాడు.

నది దాటి కొంతదూరం నడిచి అక్కడ యింత మట్టి తీసి మూట కట్టుకొని తిరిగి ప్రయాణమయ్యాడు. నది దాటి లక్ష్మణుడిని, సీతను కలుసుకున్నాడు. తను తెచ్చిన మట్టి మూటలను కూడా లక్ష్మణుడి నెత్తిన పెట్టి దక్షిణదిక్కుగా ప్రయాణం సాగించాడు.

రావణాసురుడు సీతను ఎత్తుకువెళ్ళాడు. రాముడు వానరసైన్యాన్ని వెంటబెట్టుకుని వారధికట్టి లంకను చేరడం. రావణాసురుడ్ని చంపి సీతను వెంటబెట్టుకుని పుష్పక విమానంలో అయోధ్యకు తిరిగిరావడమూ జరిగిపోయాయి.

పట్టాభిషేకం అయాక నిండుసభలో సీతాసమేతుడయిన రాముడు కొలువుతీరివున్న ఓ రోజు దండకారణ్య విశేషాల్ని, కిష్కింధలో జరిగిన కథాకమామీషూ, లంకానగర ఔన్నత్యాన్ని ముచ్చటించుకొంటున్నారు. రాముడికి హఠాత్తుగా ఆనాటి లక్ష్మణుడి ప్రవర్తన గుర్తుకొచ్చింది.

మూటకట్టి తెచ్చిన మట్టిని దర్బారు హాల్లో కుప్పగా పోసి సభాసదులకేసి చూశాడు.

వాల్మీకి, వశిష్ఠ, విశ్వామిత్రాది మహాఋషులూ, సుగ్రీవ, అంగద, జాంబవంత, హనుమాదులూ కొలువుతీరి ఉన్నారు. భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు సీతారాములకు వింజామరలు వీస్తు నిలబడివున్నారు.

"గురువర్యులూ, మహాఋషులూ, పూజ్యులూ, స్నేహితులూ, హితులారా–" పట్టాభిరాముడు గంభీరంగా మొదలుపెట్టి, ఆనాటి లక్ష్మణుడి ప్రవర్తనను గురించి సవివరంగా వివరించాడు.

"ఇప్పుడు మీముందున్న మట్టి గోదావరీనది పాయల మధ్య ఉన్న భూఖండానికి చెందినది. ఆనాటి లక్ష్మణుడి ప్రవర్తనకు కారణం నా తమ్ముడ్ని ఆవరించిన మాయా, ఇంద్రజాలమా లేక యీ మట్టిలో వున్న గుణవిశేషమా అన్నది నాకు ఇంతవరకు అంతుబట్టలేదు. అందువల్ల మీ రొక్కొక్కరే ఆ మట్టిమీద నిలబడి మీ అమూల్యమయిన అభిప్రాయాల్ని తెలియజేయమని కోరుతున్నాను!"

రాముడు చెప్పినదంతా విని ఎవరికి వారు మౌనంగా కూర్చున్నారు. ఎవ్వరూ రాకపోవడం గమనించిన రాముడు హనుమంతుడ్ని చూసి అన్నాడు:

"హనుమా! నువ్వు చిరంజీవివి. త్రేతాయుగం తర్వాత వచ్చే ద్వాపర కలియుగాంతాలవరకూ ఉండవలసినవాడివి. బ్రహ్మజ్ఞానివి. రామాజ్ఞను జవదాటనివాడివి. ఊс- లేచి, ఆ మట్టిమీద నిలబడు అంజనీపుత్రా!"

"రామాజ్ఞ!" శిరసు వంచుకొని వినమ్రతతో రాముడికి నమస్కరించి ఆ మట్టిమీద నిలబడ్డాడు. సభాసదులు ఊపిరి బిగబట్టి చూస్తున్నారు.

హనుమంతుడి రోమాలు నిక్కపొడిచినయ్. తోక జయ్యన లేచి దర్బారుహాలు కప్పుకు ఆనింది.

"ఓయీ రామచంద్రా, విను. ఈ హనుమంతుడు లేకపోతే నీకు సీతజాడ తెలిసేది కాదు. ఈ అంజనీతనయుడు లేకపోతే నీ తమ్ముడు లక్ష్మణుడు బ్రతికేవాడు కాదు, అదంతా ఎందుకు? నా సహాయమే నీకు లేకపోతే నువ్వింకా అడవులు పట్టుకొని ఏడుస్తూ తిరుగుతూనే ఉండేవాడివి....." సభ అంతా హాహాకారాలలో సందిపోయింది. ఏమిటీ ఘోరం? హనుమంతుడేనా యిలా మాట్లాడుతున్నది?

సుగ్రీవ, అంగద, జాంబవంతాదులు హనుమంతుడ్ని ఆ మట్టికుప్పమీదనుంచి పక్కకు నెట్టారు. కొద్దిక్షణాల్లో రోమాలు కుంచించుకుపోయాయి. తోక ముడుచుకుపోయింది.

"రామచంద్రప్రభో! మన్నించు. ఆ మట్టిమీద నిలబడి ఏదేదో మాట్లాడాను" అంటూ హనుమంతుడు రాముడి కాళ్ళమీద పడిపోయాడు.

రాముడు చిరునవ్వు ప్రసరించుతూ సభను కలయచూశాడు. ఎవరికివాళ్లు గుండెలు బిక్కపట్టుకుని కూర్చున్నారు.

"గురువర్యా! తమరు-" సగౌరంగా ఆహ్వానించాడు.

వశిష్ఠమహాఋషి గడ్డం సవరించుకొని తపోమహిమాన్వితుడయిన తనను గుప్పెడు మట్టి ఏం చేయగలదు అన్న ధీమాతో వచ్చి ఆ మట్టిమీద నిలబడ్డాడు.

"ఓయీ రామా! నీ పుట్టుకకు కారణం నేను. నీ తండ్రిచేత పుత్రకామేష్టియాగం చేయించి పుత్రభిక్ష ప్రసాదించింది నేను. నీకూ, నీ తమ్ముళ్ళకు చదువుసంధ్యలు నేర్పింది నేను. నేనే లేకపోతే నువ్వింతటివాడివి....."

విశ్వామిత్ర మహాఋషి వచ్చి వశిష్ఠుడ్ని మట్టిమీద నుంచి పక్కకు లాగాడు.

"దశరథతనయా! అయోధ్యరామా! పాహిమాం, పాహిమాం - సర్వాన్ని జయించాననుకున్నాను. కాని, నాలో అహంకారం యింకా చావలేదని యిప్పుడే తెలుసుకున్నాను. యీ చారెడు మట్టి నా కళ్ళు తెరిపించింది."

"వశిష్ఠా! ఏమిటీ బేలతనము? ఈ చారెడుమట్టి నిష్ఠా గరిష్ఠులయిన మమ్మేమి చేయగలదో ఇప్పుడే చూచెదము గాక!" అంటూ విశ్వామిత్రముని ఆ మట్టిమీద నిలబడ్డాడు.

మొదటి ఇద్దరికంటే మరొక్క క్షణం మౌనంగా నిలబడ్డాడు విశ్వామిత్రుడు. సభాసదులందరూ విశ్వామిత్రునికి అభినందనలు తెలియజేయడానికి నిలబడ్డారు.

"అర్భకుడా! ఇదియంతయూ నీ గొప్ప అనియే తలంచుచుంటివా? నీకు ధనుస్సు పట్టడం నేర్పినవాడిని నేను, తాటకిని కబంధుడ్ని నువ్వు చంపానని తలపోస్తున్నావేమో? నా తపోమహిమవల్లనే నువ్వు రాక్షససంహారం చేయగలిగావు. నేను రాజఋషినని మరిచిపోయావా? సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగిన నేను నీకు మంత్రతంత్రాలు ఉపదేశించి ఇంతటివాడిని చేశాను. శివధనుస్సు విరచడం నీవల్ల అయేపనేనా? అది నావల్లగదూ జరిగింది? నా ప్రమేయం లేకుండా సీతను వివాహమాడగలిగేవాడివా?..."

విశ్వామిత్రుడు శృతిమించి రాగాన పడుతున్నాడని గ్రహించిన సభాసదులంతా మూకుమ్మడిగా వచ్చి అతడ్ని పక్కకు లాగారు.

"ఏమిటీ విచిత్రం? యీ పిడికెడు మట్టి సృష్టికే ప్రతిసృష్టిచేయగల నాకే భంగపాటు కలిగిస్తుందా? తాటకసంహారా! జానకిరామా! క్షమించు'' విశ్వామిత్రుడు తలదించుకున్నాడు.

"అందులో మీ తప్పు లేదు మహాత్మా! ఊరడిల్లండి." విశ్వామిత్రుడిని ఓదార్చి మళ్ళీ సభాసదులను కలయజూశాడు శ్రీరామచంద్రమూర్తి.

తలెత్తి రాముడికేసి చూసే ధైర్యం ఎవరికీ లేకపోయింది. ఎవర్నిపిలిచి ఆ మట్టిమీద నిలబడమని ఆదేశిస్తాడోనని భయంతో వణికిపోతున్నారు. సర్వశక్తి సంపన్నులయిన వశిష్ఠ విశ్వామిత్ర హనుమదాదులకే శృంగభంగమయింది. వారిముందు తామేపాటివాళ్ళు?

"మహాత్మా! ఆదికవీ! వాల్మీకి మునీంద్రా! తమరు ప్రయత్నిస్తే సఫలీకృతులు కాగలరనే మా విశ్వాసం!" రాముడు సింహాసనం మీదనుంచి లేచి నిలబడి వాల్మీకికి నమస్కరించాడు.

వయోవృద్ధుడయిన వాల్మీకి మందహాసం చేస్తూ అడుగులో-అడుగువేసుకుంటూ నడిచివచ్చి మట్టిమీద నిలబడ్డాడు. సభ యావత్తూ ఊపిరి బిగబట్టి ఉత్కంఠతో చూస్తున్నది. రాముడు చిరునవ్వుతో వాల్మీకి మహాఋషికేసి ఆశగా చూడసాగాడు.

"కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరం! అన్నది ఎవరు? ఈ వాల్మీకే! రాముడనేవాడు పుట్టకముందే వాల్మీకి రామాయణాన్ని రచించాడు. అసలు రాముడెవడు? నేను సృష్టించిన పాత్ర! నా కావ్యానికి రూపకల్పన మాత్రమే యీ రాముడు చేసిన ఘనకార్యాలన్నీను. నేనే రామాయణ కావ్యం వ్రాయకపోతే యీ రాముడు లేడు. భూమిపుత్రి సీతను ఎవరు సృష్టించారు? అసలు ఆవిడ రావణాసురుడికి ఏమౌతుంది? లంకలో అశోకవనంలో సీత ఏంచేసింది? నేనేగనక సీతను మండోదరికి సవతిగా చిత్రిస్తే యీ రాముడెక్కడ ఉండేవాడు? ఈ సీత మహాసాధ్వి ఎలా...."

'నెట్టండి – పక్కకు నెట్టండి! ముసలాడు మతిపోయిమాట్లాడుతున్నాడు. సభలో పెద్దగా కేకలూ అరుపులూ వినిపించాయి. హనుమంతుడు తోకతో వాల్మీకిని చుట్టి దూరంగా విసిరేశాడు.

"రామకథ రచించి తరించాననుకున్నాను. కాని, రామదూషణచేసి ఘోర పాపం చేశాను. ఆశ్రిత రక్షకా! కోదండ రామా! నాకు యీ పాప విమోచనం కలిగించవా రామచంద్రా!" వాల్మీకి వాపోయాడు.

"ఆదికవీ! వాల్మీకి మహాఋషీ! ఇందులో మీరు చేసిన పాపమేమీ లేదు, వశిష్ఠ విశ్వామిత్ర, హనుమదాదులు చేసినదే మీరూ చేశారు. ఇందులో తమరి తప్పిదమేమీ లేదు." అని శ్రీరామచంద్రప్రభువు లేచి నిలబడి సభాసదుల నుద్దేశించి ఇలా అన్నాడు:

"ఆర్యులారా, పూజ్యులారా! వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, హనుమదాదులు. ఆ మట్టిమీద నిలబడి ఏమేమి మాట్లాడారో సభాసదులందరికీ విదితమే. ఇది వారి గుణదోష మెంతమాత్రము కాదు."

ఇందరి నిష్కామకర్ములను, మహాత్ములను ఇలా అహంకారంతో స్వార్థచింతనతో మాట్లాడించేట్లు చేసినది మీ అందరి సమక్షంలోవున్న చారెడు మట్టే. ఇది ఆ మట్టి మహాత్యం.

ఆ మట్టిలో వున్న సారం మనుషుల్ని అలా తయారు చేస్తుంది. ఆ గడ్డమీద పుట్టిన పశుపక్ష్యాదులే గాక మనుషులు కూడా ఏపుగా పెరుగుతారు. పుష్టిగా వుంటారు. అహంకారంతోనూ, ఆత్మస్థయిర్యంతోనూ ఉంటారు. అది ఆ గడ్డ మహాత్యం. కలియుగంలో భారతఖండంలో ఇది కోనసీమగా ప్రసిద్ధి పొందుతుంది."

అప్పుడే లేచి నిలబడిన సీతను గమనించి ఆగిపోయాడు రాముడు.

వదిన సీతమ్మను తలెత్తిచూసి అంతలోనే అవనతవదనుడై ముఖం పక్కకు తిప్పుకొన్నాడు లక్ష్మణుడు.

తమ్ముడి పెదవులపై ఛాయామాత్రంగా కదిలిన దరహాసం చూసి రాముడు కలవరపడ్డాడు.

కొంపతీసి సీత ఆ మట్టిమీద నిలబడతానంటుందా ఏం? తనను గురించి ఏమేమి మాట్లాడుతుందో? తనను గురించి అంతగా తెలియనివాళ్ళే యింతలేసి అన్నారు. ఇహ అర్ధాంగి అయిన సీత అయితే – సద్గుణాభిరాముడికి వణుకు పుట్టింది. ఒళ్ళు చల్లబడింది. సూర్యవంశ చరిత్ర, రఘువంశ చరిత్ర ఆ చారెడు మట్టిలో –

"హనుమా!" రాముడు గంభీరంగా ముఖంపెట్టి ఆంజనేయుడ్ని చూశాడు.

"స్వామీ!" రామభక్త హనుమాన్ మోకరిల్లాడు. "ఏమి ఆజ్ఞ?"

"ఆ మట్టి తీసుకెళ్ళి గౌతమీ, వసిష్ఠా నదుల మధ్య కలిపేయ్!" ఆజ్ఞాపించాడు కోదండరాముడు.

"ప్రభువాజ్ఞ! కాని, నాదొక చిన్నకోరిక – అనుగ్రహించాలి."

"ఏమిటది?" పది తలల రావణబ్రహ్మను యుద్ధరంగంలో ఎదుర్కొన్నప్పుడు రాముడు స్థయిర్యాన్ని కోల్పోలేదు. కాని ఈ కోతివెధవ ఇప్పుడేమి కోరనున్నాడో గదా హతవిధీ!

"కలియుగంలో కోనసీమలో నేను స్థిరనివాసం ఏర్పరచుకోవాలని ఆశగా వుంది. అందుకు ప్రభువులు అనుగ్రహించాలి."

రాముడు అమ్మయ్య, తిమ్మయ్య కోరిక ఇదేగదా అని కుదుటపడ్డాడు.

"అలాగే కాని, ఒక్క షరతు."

"శలవియ్యండి ప్రభూ!"

"నీ గుండెల్లో సీతారాములుండరు. భగవదంశ నీలో ఉండదు. వట్టి కోతిగానే వుండిపోతావు."

"ప్రభూ రామచంద్రా! కనికరించాలి. ఇంత శ్రగా సీతా రాముల సేవలకే జీవితాన్ని ధారపోసినవాడిని." కిందవున్న మట్టిని పోగుచేసి మూటకడుతూ అన్నాడు హనుమంతుడు.

ఆ మట్టి స్పర్శ తగలగానే హనుమంతుడిలో వచ్చిన మార్పును పసిగట్టాడు రాముడు. మేడమ్ గట్టిగా పట్టుక్కూర్చోండి. ఇక్కడ రోడ్డు షార్ప్‌కర్వుంది" అని హెచ్చరించింది కల్పన.

"ఊఁ ఓ.కే. కానియ్. ఆపేశావ్ మధ్య — సస్పెన్స్ పెట్టేసి. అప్పుడు రాముడేమన్నాడు?" ఉక్కిరిబిక్కిరయిపోతున్నాను.

"హి డజ్‌నాట్ వాంట్ టూ టేక్ ఎనీమోర్ చాన్స్!"

"ఏమిటేమిటి కల్పనా, సడన్‌గా మార్చేశావ్?"

"అదే మేడమ్! రాముడు ఇహ చాన్స్ తీసుకోదల్చుకోలేదు, భారత ఖండంలో హైందవులు గుడులు కట్టి నీ విగ్రహాన్ని ప్రతిష్టిస్తారు, పూజిస్తారు. కాని, నువ్వు కనిపించితే కర్రుచ్చుక్కొడతారు. గడ్డలు విసురుతారు. నీ జాతివాళ్ళను బంధించి విదేశాలకు ఎగుమతి చేస్తారు. అందుకు సమ్మతమేనా అని రాముడు హనుమంతుడ్ని అడిగాడు మేడమ్!"

"అందుకు హనుమంతుడు ఒప్పుకొన్నాడా?" అని నేనడిగాను కల్పనను.

"ఒప్పుకొన్నాడు మేడమ్, ఒప్పుకున్నాడు మేడమ్!" కల్పన నొక్కినొక్కి చెపుతుంటే నాకు నవ్వొచ్చింది. అక్కడ రాముడి దర్బారులో తను వుండి చూసినట్టే చెపుతూంది కల్పన.

కల్పనకి కథే కావచ్చు. వాస్తవికత ఉట్టిపడేట్టు చెప్పుతున్నది కల్పన. గొప్ప రచయిత్రి అయ్యే లక్షణాలున్నాయి కల్పనలో. పుక్కిటి పురాణగాథనుంచి అల్లిన ఓ కట్టుకథను ఎంతటి నైపుణ్యంగా చెప్పగలుగుతుంది! ఆశ్చర్యంగా ఉంది. కల్పన శిల్పం శైలి అద్భుతం.

"హనుమంతుడు అలా ఒప్పుకున్నాడంటే ఎవరూ నమ్మరోయ్ కల్పనా!" అన్నాను.

"షూర్ మాడమ్-ఒప్పుకున్నారు." తల మరీ మరీ ఎగరేసి చెప్పుకుపోతున్నది కల్పన.

"హనుమంతుడు ఎందుకు ఒప్పుకున్నాడో తెలుసా మేడమ్?" కళ్ళు గిరగిరా తిప్పుతూ నావంక చూసింది.

"ఎందుకట?" నాకు నవ్వాగడంలేదు.

"గుడిలో రాతిబొమ్మయి కూర్చునేకంటే కోనసీమలో కోతయి కొబ్బరిచెట్లమీద తిరగడం కోటిరెట్లు నయం అన్నాడట హనుమంతుడు."

"బ్యూటిఫుల్ - వండర్‌ఫుల్ - ఎండింగ్ - గొప్ప ముగింపు. కొసమెరుపు." కల్పన వీపుమీద చరిచాను. బాస్ మెచ్చుకుంటున్నందుకు కల్పన ఉప్పొంగిపోయింది.

"చాలా గొప్పగా చెప్పావోయ్! కథ బరువంతా చివరి వాక్యంలో వుంది. కథకు ప్రయోజనమూ ఆ ముగింపులోనే వచ్చింది. సెభాస్ కల్పనా!"

"ఏమిటి మేడమ్! మీముందా? హనుమంతుడిముందు కుప్పిగంతులా అన్నట్టుంది?" మూతి గుండ్రంగా తిప్పుకుంటూ సాగదీసి సాగదీసి అన్నది కల్పన.

దేరీజ్ స్ట్రీకాఫ్ జీనియస్ ఇన్ హర్. ఇంతకుముందు యీజీ గోయింగ్ టైప్ అనే అనుకొన్నాను.

"మేడమ్! వచ్చేశాం అమలాపురం. ఉయ్ ఆర్ జస్ట్ ఇన్ టైం!"

కల్పన కోఆర్డినేటర్ కల్పనయిపోయింది.

"నేరుగా గెస్టుహౌసుకు వెళుతున్నాం మేడమ్! స్నానం చేసి టిఫిన్ తీసుకొని మీటింగ్ హాలుకు వెళదాం."

"ఓ.కే. నీ యిష్టం."

మరో ఐదు నిమిషాల్లో జీప్ అమలాపురం అతిథిగృహాని కొచ్చింది. మహిళాసంఘం ఆర్గనైజర్లు ఇద్దరు ఎదురొచ్చి ఆహ్వానించారు. జీప్ దిగి అతిథి గృహంలో కాలుపెట్టేముందు పక్కన నడుస్తున్న కల్పనని చూసి -

"ఒక్క సందేహం కల్పనా!" అన్నాను.

"ఏమిటి మేడమ్?" ఆశ్చర్యంగా అన్నది కల్పన.

"కథను కంచికి పంపేశావా? సందేహాలుంటే అడగమన్నావుగా?" అన్నాను.

"వాట్ మేడమ్? మీరింకా అదే ఆలోచిస్తున్నారా?"

"సీత లేచి నిలబడింది ఎందుకో చెప్పలేదు."

"రూం నంబరు 2 సి మనది" అంటూ డోర్ తెరిచి గది చూపించింది. గది తలుపు వేసింది. కలయచూస్తున్న నన్ను చూసి-

"మేడమ్! బాత్‌రూం యిటు" అన్నది కల్పన.

"చెప్పలేదు. సీత ఎందుకు లేచి నిలబడింది రాముడి దర్బారులో?"

చిలిపిగా నవ్వింది కల్పన. బాత్‌రూం డోర్ తెరుస్తున్న నాకు నవ్వాగింది కాదు.

# 3

మూడురోజులు ఊపిరి సలపకుండా గడిచిపోయింది. యూత్ క్లబ్స్. విజిట్సూ, మహిళాసంఘాల సభలు, సమావేశాలు, ముఖ్యమైన సెంటర్స్, గ్రామాల పర్యటనతో నేనొచ్చిన పని పూర్తయింది. కల్పన అన్నీ సమర్థవంతంగా నిర్వహించింది.

ఆ రోజు మూడు గంటలకు అతిథి గృహం చేరాము. రెండు గంటలు విశ్రాంతి తీసుకుని లేచేసరికి కల్పన ఫ్రెష్‌గా తయారయి వచ్చింది. ఆమె వెనకే అటెండరు కాఫీ టిఫిన్ పట్టుకొచ్చి నా ముందుంచాడు.

"త్వరగా కానీయండి మేడమ్! మనకు తిరిగొచ్చే సరికి లేటయిపోతుందేమో?"

కల్పనకేసి ఆశ్చర్యంగా చూశాను.

"మళ్ళీ ఎక్కడకి ప్రోగ్రాం పెట్టావ్?"

"అరగంట పోనూ, అరగంట రానూ - ఏడింటికల్లా తిరిగి వచ్చేద్దాం!"

"రాజమండ్రి వెళ్ళే సంగతేం చేశావ్, ఇప్పుడు బయలుదేరితే గోదావరి అందొచ్చు. బై ఛాన్స్ బర్తు దొరికితే వెళతాను, లేకపోతే కోడార్క్‌లో-"

"అదేమిటి మేడమ్! రేపు సాయంకాలం వరకూ మీరిక్కడే ఉంటున్నారు. మీకోసం కోనసీమ స్పెషల్ పూత రేకులు తయారుచేయిస్తున్నాను. రేపు రాత్రి గోదావరి ఎక్స్‌ప్రెస్‌కు మీ టికెట్ రిజర్వు చేయించాను. త్వరగా కాఫీ తాగి డ్రస్ చేసుకోండి."

కల్పనతో వాదించి లాభం లేదని తెలుసు. అంత ఆప్యాయత, అభిమానం అయినవాళ్లుకూడా చూపించరు.

"ఓ. కె. డియర్! ఇంతకీ ఎక్కడికి తీసుకుపోతున్నావో చెప్పలేదు?"

"సస్పెన్స్ మేడమ్, సస్పెన్స్! ఈ మధ్య సస్పెన్స్ కథలుకూడా రాస్తున్నారుగా మీరు. జీవితంలో సస్పెన్స్ చూడొద్దా?"

"కథల్లో సస్పెన్స్ బాగానే వుంటుంది. జీవితంలో సస్పెన్స్ భరించలేము కల్పనా!"

"అది నిజమే మేడం!" ఆమె కళ్ళలో ఏవో చీకటి నీడలు. కలవరపడ్డాను. ఎప్పుడూ నవ్వుతూ తుళ్ళుతూ చెలాకీగా వుండే కల్పనకు కూడా.....

పది నిమిషాల్లో తయారయి కల్పన పక్కన జీప్‌లో కూర్చున్నాను. కొబ్బరితోటలు, జామచెట్లు, అరటితోటలు – వాటిమధ్యగా కాలువపక్కన రోడ్డుమీద జీప్ వెళుతుంటే ఎంతో హాయిగా వుంది. ప్రకృతి పంచియిచ్చే ఆనందం ముందు మానవుడు కల్పించుకున్న సుఖాలు ఏమాత్రం?

చిన్న వంతెన దగ్గర జీప్ ఆగింది.

"మేడం! దిగండి. అదుగో, ఆ కన్పించేది టెంకాయపాలెం. ఈ కొబ్బరితోటలోనుండి నడిచి వెళ్ళాలి."

జీప్ దిగాను. కల్పన వెనక నడుస్తున్నాను. రెండు అరటితోటలూ, ఓ పసుపుతోటా దాటి ఒత్తుగా, గుబురుగా పెరిగివున్న జామతోట ముందుకొచ్చి ఆగాం.

"మేడం! తోటమధ్యలోవున్న గుడి కనిపిస్తుందా?" అడిగింది కల్పన.

"గుడా? అదెక్కడా కనిపించడంలేదే?"

"అదేమిటి మేడం! అక్కడ జామచెట్టునీడలో-"

"ఓ అదా? అదేం గుడి? ఏదో గుడిసెలాగుంటేను." గుడంటే గాలి గోపురాలు, ఆకాశాన్ని అంటుకునే పెద్ద పెద్ద కట్టడాలను ఊహించిన నా కళ్ళకు అది గుడిగా కనిపించలేదు. కల్పన వెనకే కాలిబాటన నడిచి గుడిముందుకొచ్చి ఆగాను.

"ఇది అంజనేయస్వామి గుడి. మొదటిసారి వచ్చిన వాళ్ళకు ఒకే ఒక్క కోరిక నెరవేరుతుంది. అందుకే యీ గుడికి భక్తులు ఒకే ఒకసారి వస్తారు. కోనసీమలో పెళ్ళికాని ఆడపిల్లలంతా ఓసారివచ్చి స్వామివారి దర్శనం చేసుకుంటారు."

"మంచి మొగుడు దొరకాలనా?"

"కరెక్ట్ మేడం! కోనసీమ కాపరానికి వచ్చిన కోడళ్ళంతా ఓసారొచ్చి దర్శనం చేసుకుంటారు."

"మంచి కొడుకు పుట్టాలనా?"

"అవును మేడం! స్త్రీ కోరుకునేదేమిటో మీకు బాగా తెలుసు. ఇప్పుడు మీరు మొదటిసారిగా వచ్చారు. ఏమి కోరుకుంటారో కోరుకోండి!" ఉషారుగా అన్నది కల్పన.

"నువ్వు మొదటిసారి వచ్చినప్పుడేం కోరుకున్నావో చెప్పు ముందు."

"మంచి ఉద్యోగం రావాలని."

కల్పన కళ్ళలోకి ప్రశ్నార్థకంగా చూశాను.

"మంచి ఉద్యోగం వస్తే మంచి భర్తకూడా దొరుకుతాడు మేడం!"

"బాగా వంటచేసి పెట్టేవాడటా?"

కల్పన విరగబడి నవ్వింది. నాకూ నవ్వాగలేదు.

"నీ కోరిక నెరవేరిందా?"

"మొదటిది జరిగింది."

"ఏయ్! నిన్ను సెలక్ట్‌చేసి ఉద్యోగమిచ్చింది నేను. ఆంజనేయస్వామి ఏం చేశాడు?"

"హనుమంతుడొచ్చి ఇంటర్వ్యూ బోర్డులో కూర్చుంటాడా ఏమిటి? మీచేత చేయించాడు."

"ఓహో! అంటే నీది ఆంజనేయస్వామి రికమన్‌డేషన్ అన్నమాట! సరే, ఆ రెండోది ఏమైంది?"

"ఆ మధ్య ఒకడు పెళ్ళిచూపుల కొచ్చాడు. జీతమెంతని అడిగాడు. ఆ తర్వాత పైసంపాదనెంతని అడిగాడు గాడిద కొడుకు."

"అమ్మాయ్! చెంపలేసుకో. దేముడుముందు తిడుతున్నావ్?" నవ్వాపుకుంటూ అన్నాను.

"గెటవుట్ రాస్కెల్. మళ్ళీ ఈ సీమలో కన్పించావో కాళ్ళు విరగ్గొడతానన్నాను. వాడే చెంపలు వాయించుకుని అదేపోక పోయాడు."

"అవును. అన్నట్టు, మీ స్వామి తీర్చే కోరిక ఒక్కటే కదా! అందుకే అలా జరిగింది పో" అన్నాను.

"అది పోనీయండి మేడమ్! మీరు కోరుకున్నారా? గుళ్ళోకి వెళదామా?"

ఓ క్షణం ఆగి అన్నాను.

"నేను కోరుకునేదేమీ లేదు, పద!"

"నేను నమ్మను." ఖచ్చితంగా అనేసింది.

దిమ్మెరపోయి చూశాను.

"నన్ను చెప్పమంటారా, మీరేమి కోరుకున్నదీను!"

"ఊఁ- చెప్పు చూద్దాం!"

"ఓ మంచి కథకు ప్లాటివ్వమని!"

కల్పన వీపుమీద గట్టిగా చరిచాను, ఆవులిస్తే పేగులు లెక్కపెడతారంటారు. కల్పన నోరు తెరవకపోయినా లెక్క పెట్టేట్టున్నది.

గుళ్ళో ప్రవేశించాం.

రెండు నిముషాలు ఆంజనేయుడు విగ్రహాన్ని తదేకం చూశాను.

"ఇదేమిటి కల్పనా, ఈ ఆంజనేయుడి చేతిలో?"

"కొబ్బరికాయ!"

"ఆ చేతిలో ఉండవలసింది సంజీవపర్వతం కదా?"

"ఈయన పేరే టెంకాయ ఆంజనేయుడు. ఈ వూరి పేరు టెంకాయపాలెం అని అందుకే వచ్చింది." యాంత్రపాలజీ ప్రొఫెసర్‌లా చెప్పుకుపోతున్నది కల్పన.

కొండంత కొబ్బరికాయని చేతిలో సంజీవపర్వతంలా పెట్టుకున్న ఆంజనేయుడి విగ్రహాన్ని చూడటంమాట రాము దెరుగు, విననుకూడ వినలేదు.

"ఈ కోతేమిటి? కొబ్బరికాయేమిటి?" పెదవి విరిచాననుకుంటాను.

"భలే అన్నారు మేడమ్! కోతీ - కొబ్బరికాయా! దీని వెనక ఓ పెద్ద కథ వుంది" అన్నది కల్పన.

"ఏమిటా కథ?"

"గుడివెనక ఉంది, రండి."

కల్పన గుడివెనక్కు తీసుకెళ్ళింది. ఐదు - రాతిలో చెక్కబడిన బొమ్మలున్నాయి.

"మేడం! ఈ బుర్రమీసాలవాడున్నాడు చూశారా? వాడి పేరు శివయ్య. ఆ పక్క విగ్రహం వాడిభార్య గంగమ్మది. ఆ చిన్నది కూతురు గౌరి. గౌరికి ఇరుపక్కల ఉన్నవాళ్ళు వీర్రాజు, సత్తిరాజులు!"

శ్రద్ధగా పరిశీలనగా చూస్తున్నాను.

"మేడం! ఇటు తల పైకెత్తి చూడండి!" కల్పన చెయ్యి యెత్తి చూపుతూ అన్నది.

చూశాను.

పెద్ద కొబ్బరికాయ. ఆ కొబ్బరికాయమీద కూర్చుని వున్న చిన్న కోతి. మళ్ళీ ఆ కోతిచేతిలో చిన్న కొబ్బరికాయ - మళ్ళీ ఆ కొబ్బరికాయమీద చిన్న కోతి - అలా మూడు కోతులూ - మూడు కొబ్బరికాయలూ ఉన్నాయి.

చూస్తుంటే నాకంతా అయోమయంగా వుంది. నా బుర్ర ఎండిన కురిడీ కొబ్బరికాయలా అయిపోయినట్టు అనిపించింది.

"చూశారా? మీ కోరిక నెరవేరింది."

"ఊఁ!" తృళ్ళిపడ్డాను.

"కథకు ఇతివృత్తం దొరికిందిగా!"

"ఈ కోతి - కొబ్బరికాయతో నాకు వున్న మతి కాస్తా పోగొట్టావ్? శివయ్య, గంగమ్మ, గౌరి, వీర్రాజు, సత్తిరాజులకు యీ కొబ్బరికాయ కోతికీ వున్న సంబంధం ఏమిటో చెప్పు మరి."

"వెళదాం పదండి. చీకటిపడితే కాలవపక్క రోడ్డు మీద మన డ్రయివర్ సరిగా నడపలేడు, వాడికి రేచీకటి." కల్పన దారితీసింది.

వంతెనదగ్గరకొచ్చి జీపు ఎక్కాం - జీపు సాగింది.

"ఊఁ! ఇప్పుడు చెప్పు - ఆ కోతి, కొబ్బరికాయ కథేమిటో?"

"రాత్రికి మేడం!"

"అంతవరకూ సస్పెన్సేనంటావా?"

'అహ! టెంకాయ ఆంజనేయుడు అనగా!" కల్పన నవ్వులుతో తియ్యటి పుప్పొడులు వెదజల్లింది.

గెస్టుహౌసుకు వచ్చేదాకా కోతీ - కొబ్బరికాయను గురించే ఆలోచిస్తూ కూర్చున్నాను. అతిథిగృహం ఆవరణలోకి జీపు తిరుగుతుండగా మెరుపులా గుర్తొచ్చింది.

"దశరథరాముని దర్బారులో హనుమంతుడు కలియుగంలో కోనసీమలో ఉండేందుకు పర్మిషన్ అడిగాడు కదూ?"

"ఆఁ- అడిగాడు. రాముడు పర్మిషన్‌కూడా యిచ్చాడుగా!" చాలా సీరియస్‌గా అన్నది కల్పన.

"అయితే, ఆ హనుమంతుడేనా, యీ టెంకాయ ఆంజనేయుడు?"

"భలే, కరెక్ట్‌గా ఊహించారు మేడమ్!"

"సో దేరీజ్ కంటిన్యుటి ఇన్ యువర్ స్టోరీ" అన్నాను కల్పన భుజంమీద చెయ్యివేసి జీప్ దిగుతూ.

భోజనాలయాక పక్కమీద కూర్చొని "ఊఁ- నీ కోతి - కొబ్బ...." ఆవలింత ఆపుకుంటూ "చెప్పు" అన్నాను.

"మేడమ్! మీ కళ్ళు మూతలు పడిపోతున్నాయి. ఇహ పడుకోండి" అంటూ లేచి నిలబడింది కల్పన.

"అయితే, ఓ పనిచెయ్యి. ఈ రాత్రి ఆ కథేదో రాసి రేపు ఉదయం పట్టుకురా" అన్నాను.

"నేనా? కథ రాయడమా?" కల్పన కళ్ళు మెరిశాయి.

"హనుమంతుడి బలం జాంబవంతుడు చెప్పేదాకా తెలియలేదట హనుమంతుడికి. అట్లా వుంది నీ వరస."

"సీతమ్మ ఆజ్ఞ అవశ్యం ఆచరణీయం." తమాషాగా చేతులు కట్టుకొని తలవంచి అన్నది కల్పన.

ముంచుకొస్తున్న నిద్ర తేలిపోయింది.

"గుడ్‌నైట్ మేడం!"

"గుడ్‌నైట్!"

"విష్‌యూ మంకీ డ్రీమ్స్!" అనేసి కల్పన ఒక్క గంతులో గదిలోనుంచి బయటికి దూకింది.

నాటీగరల్ - లేచి డోర్ లాక్ చేసి వచ్చి పడుకున్నాను. అపురూపమయిన ఆమె లావణ్యం, అమోఘమైన తెలివితేటలు, అనన్య సామాన్యమయిన ఆమె వాక్చాతుర్యం, అద్వితీయమైన ఆమె స్నేహార్ద్రత తలుచుకుంటూ ఎప్పుడు నిద్రపోయానో తెలియదు.

# 4

సాయంత్రం టీ తాగి బయలుదేరాం... ఉదయంనుంచి అప్పటిదాకా కల్పన నన్ను బిజీగానే పెట్టింది. తన స్నేహితులను తీసుకొచ్చి పరిచయం చేసింది.

అమలాపురం అంతా తిప్పి చూపించింది. పెద్దరాజు గారింటికి భోజనానికి తీసుకెళ్ళింది. రాజుల మర్యాదలూ ఆచార వ్యవహారాలూ నేను స్వయంగా చూడాలని కల్పన ఉద్దేశ్యం అయివుంటుంది

జీప్ పళ్ళబుట్టలతోనూ పూతరేకుల డబ్బాలతోను నింపేసింది.

"మేడమ్! నేరుగా రాజమండ్రి వెళ్ళిపోతున్నాం" అన్నది జీప్ ఎక్కి కూర్చుని కల్పన.

"అంటే?" ఆమె పక్కన సర్దుక్కూర్చొని అన్నాను.

"మొన్న వచ్చేప్పుడు మీకు ముమ్మిడివరం బాలయోగి ఆశ్రమం చూపించాలని చుట్టూతిప్పి తీసుకెళ్ళాను. ఇప్పుడు నేరుగా వెళుతున్నాం. అటు గౌతమీ - ఇటు వశిష్ఠానది. అంటే - మీరు కోనసీమ అంతా చూసినట్టే."

"గట్టిదానివే, థాంక్యూ!"

"పోనియ్ - జాగ్రత్తగా!" డ్రయివరుకు ఆదేశాలిచ్చింది కల్పన.

పచ్చటి చేలూ, పళ్ళతోటలూ, కాలువలూ జీపువెంట పరుగులు తీస్తున్నాయి. కోనసీమ ప్రకృతి సౌందర్యాన్ని హృదయం విప్పి ముద్రించుకోవడానికి ప్రయత్నం చేస్తున్న నాకు హఠాత్తుగా ఓ కొబ్బరితోటలో కోతులు కన్పించాయి.

"కల్పనా! ఏదీ నీ కోతి - కొబ్బరికాయ కథ."

కల్పన పక్కకు తిరిగి నా కళ్ళలోకి చూసింది.

"మీరు అడుగుతారా లేదా అని ఉక్కిరిబిక్కిరయి చచ్చిపోతున్నాను. మీరు అడక్కపోతే నేనెంత డిజపాయింటయేదాన్నో మేడం! రాత్రంతా కూచుని బుర్ర పగులకొట్టుకుని రాసేను.

ఇది కల్పన కాదు మేడం! ఎన్నోయేళ్ళ క్రితం యీ కోనసీమలో జరిగింది. దృష్టాంతరంగా టెంకాయస్వామి గుడి యిప్పటికీ వుంది. చూచారుగా ఆ గుడివెనక చెక్కబడిన గౌరి కథే యిది."

హేండ్‌బ్యాగ్ తెరచి మడతచుట్టిపెట్టిన అరవై డెబ్బై పేజీల రాతప్రతి నా చేతికి అందించింది కల్పన.

"మేడం, ఒక్క షరతు!" నేను కళ్ళజోడు తుడుచుకుని చదవడానికి ఉపక్రమిస్తుండగా అన్నది కల్పన.

"ఏమిటా షరతు?"

"ఒప్పులు నావి, తప్పులు మీవి."

"ఎందుకో?" వచ్చే నవ్వుని ఆపుకుంటూ అడిగాను, కల్పన ముఖంలోకి చూస్తూ.

"నేను మీ ఏకలవ్య శిష్యురాల్ని, అందుకని!"

"మరి గురుదక్షిణ?"

"మీరు కోరింది.!"

"నేను యీ కథ చదివేంతవరకూ నోరు మూసుకుని కూర్చో."

"గురువాజ్ఞ. మహాప్రసాదం."

కాగితాల పొత్తివిప్పి మొదటిపేజీ చూశాను. ఆశ్చర్యపోయాను. కథకు పెట్టిన పేరే బ్రహ్మాండంగా వుంది. ఆమె చిలిపితనమూ, తెలివితేటలూ కథకు పేరు పెట్టడంలోనే వెల్లడవుతున్నాయి.

"కల్పనా! యీ కథకు పెట్టిన పేరు –" నా మాట పూర్తికాకముందే కల్పన నోటిమీద వేలుపెట్టి తను మాట్లాడకూడదన్నట్లు సూచించి. చెవులూ, కళ్ళూ, నోరూ మూసుకొని వుండే బొమ్మల్లో ఆఖరి బొమ్మలా ఉందప్పుడు కల్పన.

చదవడం ప్రారంభించాను.

"కోతి – కొబ్బరికాయ!"

లేక

కొబ్బరికాయ కోతి!

కాక

గౌరి ప్రేమ కథ!

అనే

కన్నవారి కన్నీళ్ళగాథ!

అనగనగా –

గోదావరి అనుంగు పుత్రికలయిన గౌతమీ, వశిష్ఠ. వైనతేయానదుల పరివేష్టితమయిన భూభాగంలో ఓ చిన్న పల్లె వుంది. ఆ పల్లెకు శివయ్య మకుటంలేని మహారాజు. శివయ్య భార్య గంగమ్మ ఊరంతటికి పెద్ద ముత్తయిదువ.

ఆ పల్లెవాసులంతా చేపలు పట్టుకొని, రాదారి పడవల్లో సరుకులు రవాణా చేసి జీవిస్తూ వుంటారు. వాళ్ళ అవసరాలు బహుకొద్ది. కోర్కెలు చిన్నవి. విసిరిన వలలో పక్కో జెల్లో పడితేచాలు. ఇంటిదాని కడుపున రెండు కాయలుకాస్తే చాలు, తగాదాలు లేవు. కార్పణ్యాలు లేవు. కావేషాలు లేవు. తగాదాలు ఎప్పుడేమన్నా వస్తే కులపెద్ద శివన్న తీర్పు శివుడాజ్ఞలాంటిది.

ఇదిట్లా వుండగా–

శివయ్య, గంగమ్మ దంపతులకు ఓ ఆడకూతురు పుట్టింది. ఊరంతా పండగ చేసుకొంది. అస్తారుబతంగా అల్లారుముద్దుగా, బొంత అరటిలా చప్పుచప్పున ఎదిగొస్తూన్న ఆ పిల్లకు గౌరి అని నామకరణం చేశారు శివయ్య దంపతులు.

అరెరే! యిహ ఆ గౌరి ఎలా పెరుగుతుందయ్యా అంటే –

'గోదారి గట్టుంది, గట్టుమీద చెట్టుంది, చెట్టుమీద పిట్టుంది. పిట్టమనసులో ఏముందో' అన్నట్టే కాకుండా, గౌరమ్మ పాలపొంగు వయసులో, బిగువు బిగువు వంటితో బెదురు బెదురు చూపుతో, తళుకు బెళుకు కళ్ళతో, వంపుసొంపుల హొయలతో

నదీనదాలూ, చెట్టూపుట్టా, ఆకూరెమ్మా, పువ్వూరేకూ వెతుకుతోంది. ఎందుకోసం? పదహారేళ్ళ పల్లె పడుచు దేనికోసం వెతుకుతుంది? అందుకోసం!

అది అందరికి పండగరోజు. పండగలన్నింట్లోకి పెద్ద పండగ. శివన్న కొత్తబోటు జలప్రవేశం చేసేరోజు. పల్లీయులందరు పండగ చేసుకున్నారు. శివన్న ఇంట్లో తిని, తాగి తందనాలాడుతూ పడవలరేవుకాడి కొచ్చారు.

శివయ్య, గంగమ్మలు గంగమ్మ తల్లికి పూజలు చేశారు. కొత్తపడవకు పసుపు కుంకుమలు అద్దారు, అలనాటి దాసరాజు కుమార్తె మత్స్యగంధిలా అలంకరించుకుని గౌరి పడవమీదకొచ్చింది. కూతురు వెనకే శివయ్య, గంగమ్మ పడవమీద కొచ్చారు. చిన్నా పెద్ద పల్లీయులంతా పడవచుట్టూ మూగారు.

శివయ్య పీచు తియ్యని కొబ్బరికాయ సంచిలోనుంచి తీసి పడవ ముందుభాగాన పెట్టాడు. సాంబ్రాణీకడ్డీలు వెలిగించి కొబ్బరికాయలో దూర్చాడు. కుంకమ బొట్టుపెట్టి సాష్టాంగపడి కొబ్బరికాయకు మొక్కాడు. లేచి నిలబడి కొబ్బరికాయ రెండు చేతుల్తో పైకెత్తి పట్టుకుని జనాన్ని అందర్నీ కలియజూస్తూ అన్నాడు శివయ్య :

"గంగపుత్రులారా! పుత్రికల్లారా! మన కులాచారం ప్రకారం పడవ జలప్రవేశం చేసేప్పుడు పీసుతీసిన కొబ్బరికాయ కొట్టి శాత్తామని మీ అందరికీ తెలుసు. మరి మా వంశాచారంగా పీసుతియ్యని కొబ్బరికాయ కొట్టాలన్నదికూడా మీ అందరికీ తెలిసిందే. ఇది మా తాతలనాటినుంచి వత్తాన్న ఆశారమే అనికూడా మీలో పెద్దోలందరికీ తెలుసు.

మా తాతముత్తాతలు మన కులానికి పెద్దలు. పల్లెకు నాయకులు అవటాన ఇట్టాంటి ఆశారం వుందిమరి. కుటుంబంలో పెద్దకొడుకయినోడు కొట్టాలి యీ కొబ్బరికాయని అనికూడా మీ అందరికీ తెలుసు. ఉన్నదల్లా ఒక్కగాను ఒక్కబిడ్డ, లేక లేక కలిగిన సంతానం, మా గౌరితల్లిచేత కొబ్బరికాయ కొట్టించాలని నా అభిమతంగా వుంది. మరి మీరేమంటారు?" శివయ్య చుట్టూవున్న వాళ్ళను కలయజూశాడు.

అవునని అందరూ తలలూపి తమ ఆమోదాన్ని తెలియజేశారు. కాని వయోవృద్ధడయిన పక్కెయ్య "అపశారం అపశారం గంగమ్మతల్లికి" అన్నాడు.

"ఏందిరా పక్కెయ్యా, నువ్వంటుంది?" శివయ్య పక్కెయ్య ముందుకొచ్చి అన్నాడు.

"తొలంబరం మొగోడు కొట్టాలసిన కొబ్బరికాయను ఆడకూతురుచేత కొట్టిత్తే గంగమ్మతల్లికి అపశారం చేసినట్టు కదా?"

"కానేకాదు. ఆ మాటకొత్తే కొడుకయినా, కూతురైనా గౌరమ్మే కద నాకుంది. అయినా ఆడకూతురు కొబ్బరికాయ కొడితే అపశారం ఎట్టవుద్ది? గంగమ్మ తల్లికూడా ఆడకూతురే గంద!" తర్కించాడు శివయ్య.

"ఔ ఔ శివన్న! నువ్వు సెప్పిందే సరయినమాట. గౌరమ్మ సేతనే కొట్టించు" అన్నారు అందరూ.

భూమికీ, ఆకాశానికీ, గాలికీ, గంగకూ దండంపెట్టి శివయ్య కూతురు గౌరికి కొబ్బరికాయ అందించాడు.

గౌరి కొబ్బరికాయ ఒకచేత్తో, హారతిపళ్ళెం మరోచేత్తో పట్టుకుని బోటంతా కలయదిరిగి వాయుదేవుడికి, వరుణదేవుడికి మొక్కి నొగలిముందు నిలబడింది. శివన్న గంగమ్మలకు మొక్కి కొబ్బరికాయ పైకెత్తింది.

"గౌరమ్మా! ఒక్క దెబ్బకు పగలాలి" శివయ్య బుర్ర మీసాలు తిప్పుకుంటూ గౌరికి హెచ్చరిక చేశాడు.

గౌరి తన బలమంతా కుడిచేతిలోకి కూడదీసుకున్నది. ఆకాశంకేసి లేచిన కొబ్బరికాయ పడవ నొగలిమీదకొచ్చినట్టే వచ్చి గౌరి చేతుల్లోనుంచి జారి గోదావరిలో పడింది!

తృళ్ళి తూలిన గౌరి కొబ్బరికాయంతోపాటు నదిలో పడింది. అందరూ ఆహాకారాలు చేశారు. పక్కెయ్య మాత్రం కుళ్ళు కుళ్ళుగా నవ్వుకున్నాడు.

"మీరేం భయపడకండి, గంగమ్మ తల్లి నా గౌరమ్మ నేంచేయదు. గోదార్ని అటూ యిటూ ఆరుసార్లు యీదగల సత్తా నా కూతురికుంది" అని అందరికీ ధైర్యం చెబుతున్న శివయ్య ఒక్కసారిగా గావుకేక పెట్టాడు.

"మొసలి! మొసలి!! అమ్మా గౌరీ!"

కొర్రమీనులా తృళ్లుతూ పొర్లుతూ పడవదగ్గరకు యీదుకొస్తున్న గౌరికి మొసలి ఎదురయింది, ఎండిన చెట్టు మానులా నీళ్ళలో సగంపైనా సగం కిందా తేలుతూ తనవైపే నోరుతెరుచుకుని వస్తోన్న మొసలిని చూసింది. గిర్రున వెనక్కు తిరిగింది. నది గోదారిలోకి యీదుతోంది.

పడవమీద హాహాకారాలు. ఒడ్డున వున్న పల్లెజనం కేకలు, పెడబొబ్బలు పెడుతున్నారు.

శివయ్య చేతులెత్తి కులదేవతను పిలుస్తున్నాడు.

గంగమ్మ గంగాభవానికి మొక్కుతూ సోకాలు తీస్తున్నది.

నదిలో మొసలి మునిగినప్పుడు గౌరి తేలుతూంది. గౌరి మునిగినప్పుడు మొసలి తేలుతున్నది. ఉరవళ్ళు పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తున్న గోదావరి నదిలో గౌరిని వెంటాడుతున్న మొసలి రానురాను దగ్గరవుతుంది.

గౌరిని రక్షించడానికి సిద్ధమయిన గజయీతగాళ్లు 'హేమాహేమీ'ల కాళ్లు చల్లబడి గుడ్లు మిటకరించి ఒడ్డున నిలబడి చూస్తున్నారు. మొసళ్ళంటే గంగపుత్రులకు వళ్ళు తెలియని భయం మరి!

శివయ్య నిర్వీర్యులైపోయి నిలబడిన గంగపుత్రులను కలయజూశాడు.

"గంగమ్మా తల్లిమీద ఆన! ఓ గంగపుత్రులారా! చెప్పేది వినండి. నా గౌరమ్మను రక్షించినోడికి నా సర్వస్వం అయిన గౌరినిచ్చి కళ్యాణం చేస్తా. నా యావదాస్తి, యీ కొత్తబోటు ఆడికే యిస్తా. ఆ అదృష్టవంతుడెవరో, వీరాధివీరుడెవడో, సూరాధిసూరుడెవరో ముందుకు రండి!" ఎలుగెత్తి చాటాడు.

అంతా మౌనంగా నిలబడ్డారు. గోదావరి గలగలలు మినహా అంతా నిశ్శబ్దం.

"ఇందరున్నారు మూతిమీద మీసం ఉన్నోళ్లు! అన్నీ రొయ్యమీసాలేనా? నా కూతుర్ని రచ్చించేవాళ్ళే లేరా?" గంగమ్మ వాపోయింది.

"అయితే ఇనండిరా! ఇట్టాటి కులపోళ్ళకు పెద్దగా ఉండేకంటే మొసలి నోట్లపడి చావడం మేలు" శివయ్య తలగుడ్డ నడుంకు బిగించాడు.

"అగు మామా! నేనున్నా" సత్తిరాజు పంచె ఎగగట్టి చొక్కా విప్పి నదిలోకి దూకాడు. అదే సమయంలో పడవ అవతలవైపునుంచి మరొకడు నదిలోకి దూకి ప్రవాహంలో సొరచేపలా యీదుకుపోతున్నాడు.

"అడెవడూ?" ఆశ్చర్యపోయాడు శివయ్య.

"ఆడు నా మేనల్లుడు ఈ(ర్రాజు!" గర్వంగా అన్నది గంగమ్మ.

"ఔనా! శివన్నా! నీ మేనల్లుడు సత్తిరాజు గెలుస్తాడో, గంగమ్మ మేనల్లుడు ఈ(ర్రాజు గెలుస్తాడో చూడాలి. ఈ దెబ్బతో నీ అసలల్లుడెవడో తేలిపోవాలి." పడవలోవున్న పెద్దల్లో ఒకడన్నాడు.

"ఔ మల్లన్నా! నా బిడ్డను కాపాడినోడే నా యింటి అల్లుడవుతాడు. ఇంతకీ" అంటూ శివయ్య అరిచెయ్యి ఆనించుకొని దూరంగా నదిమీదకు చూశాడు. ఒడ్డున వున్న వాళ్ళందరూ ఆదుర్దాగా చూశారు.

"మామా, నేనున్నా!" అన్న సత్తిరాజు మాట ఎప్పుడయితే విన్నాడో, వీ(ర్రాజు పంచ బిగించి కట్టి, పట్టాకత్తి మొలలో దోపి అల్లంతదూరానవున్న సత్తిరాజుని చూసి, కోడెతాచు చందాన తలతిప్పి మీసం దువ్వి, గంగమ్మతల్లికి నమస్కరించి నదిలోకి దూకాడు. సత్తిరాజూ వీ(ర్రాజు పోటాపోటీగా గండుమీనుల్లా ఈదుతున్నారు. నిముషాలమీద నడి గోదార్లోకి వచ్చారు. ముందు గౌరి, గౌరిని వెన్నంటి మొసలి, మొసలి వెనక రాజు, సత్తిరాజులు.

శివయ్య, గంగమ్మలతోపాటు పడవమీద ఒడ్డునవున్నవాళ్ళ భయాందోళనలు, సంభ్రమాశ్చర్యాల్లోకి మారాయి. రాజు, సత్తిరాజులు చురకత్తుల్లా మెరసి రేచుక్కల్లా మొసలిని చుట్టుముట్టారు.

కొద్దిక్షణాలు.

క్షణం ఊపిరి బిగబట్టారు.

గోదావరి కుంకుమబొట్టు పెట్టుకుంది.

ఎ(ర్రచీర కట్టుకుంది. ఎ(ర్రరవిక తొడుక్కుంది!

గోదారంతా రక్తం!!!

"అమ్మా గౌరీ!" శివయ్య దంపతులు పెనుకేక వేశారు.

"మూడు ప్రాణులు నడిగోదారిలో – మొసలినోట్లో!" మునలి వక్కెయ్య గొణుక్కుంటున్నాడు. ఒడ్డున పల్లె పడుచులు గోడు గోడున ఏడుస్తున్నారు. పల్లెకారులు చేతులెత్తి అరుస్తున్నారు.

క్షణాలు గడిచాయి.

నిముషాలు దొర్లాయి.

జనం చప్పట్లు కొడుతున్నారు. ఈలలు వేస్తున్నారు.

(ర్రాజు, సత్తిరాజులు గౌరిని చెరోరెక్కా పట్టుకొని ఈదుకొస్తున్నారు. శివయ్య పడవమీద మోకరిల్లి గంగమ్మతల్లిని ప్రార్థిస్తున్నాడు.

# 5

గూడెంలో కొబ్బరిచెట్టుకింద ఇంటిముందు నులకమంచంమీద శివయ్య కొలువుతీరి వున్నాడు. ఆడా, మగా, ఆబాలగోపాలమ్మ చుట్టూచేరి కూర్చొని వున్నారు.

వీర్రాజు, సత్తిరాజు కులపెద్దల వెనగ్గా జనానికి కొంచెం ముందుగా నిబడి వున్నారు.

గౌరి తండ్రి వెనగ్గా తల్లి పక్కన నిలబడి ర్రాజు, సత్తిరాజుల్ని దొంగచూపులు చూస్తూవుంది.

కొలువుతీరిన శివన్నకు కొబ్బరాకులు వింజామరలయి వీస్తున్నాయి. చల్లని నీటిగాలి. అయినా ఉక్కగానే వుంది అందరికీ. ఉత్కంఠంతో శివయ్యను చూస్తూ ఉన్నారు.

శివయ్య లేచి నిలబడ్డాడు. అందరినీ కలయచూశాడు. గొంతు సవరించుకొని గంభీరంగా మొదలుపెట్టాడు:

"గంగమ్మ తల్లిగా ప్రమాణం చేశాను. నా ప్రమాణాన్ని చెల్లించుకోబోతున్నాను. పెద్దలు మీరంతా కూడబలుక్కొని చెప్పండి. గౌరిని కాపాడిందెవరు? నా చెల్లెలి కొడుకు సత్తిరాజా? నా పెళ్ళాం తమ్ముడు కొమార్డు ఈర్రాజా?"

"అందరికీ పెద్దవు నువ్వే! మా అందరి తగవులు తీర్చేటోడివి, మంచి సెడ్డ సెప్పేటి కులపెద్దవు గందా? నువ్వే సెప్పాలి మరి" అన్నాడు ముసలి పక్కెయ్య.

"అరే పక్కిరీ! వయిసొచ్చిందిరా నీకు. కాని బుద్ధి పెరగలేదు. ఇది నా సొంత ఇషయం. ఇది నాకు తేలకనే మీముందు పెట్టింది. ఒకడేమో నా సొంత సెల్లెలి కొడుకు. రెండోవాడేమో నా ఆడదాని సొయాన తమ్ముడు కొడుకయిపాయె. ఇద్దరూ గౌరిని కాపాడినోళ్ళేగంద. మరెట్టా? అందుకే మిమ్మల్ని కోరుతున్నా. మీరే మంచీ సెబ్బరా ఆలోచించి న్యాయమేదో సెప్పండి" అని శివయ్య తిరిగి నులకమంచం మీద, చక్రవర్తి సింహాసనంమీద కూర్చున్నట్టు కూర్చున్నాడు.

"బలే సిక్కు తెచ్చిపెట్టావుగదయ్యా శివయ్యా! సణుకున్నాడు పక్కెయ్య.

"మల్లన్నా! మనకు తప్పేట్టు లేదులే మరి" అంటూ పక్కెయ్య జామచెట్టుకిందకు దారితీశాడు. మరో యిద్దరు కులపెద్దలు అడవయ్య, జంగయ్య వాళ్ళతో చేరారు. కాలం గడిచిపోతూంది. పొద్దు నడినెత్తి కొచ్చింది. ఇంకా వాళ్లు చర్చించుకుంటూనే వున్నారు.

చిన్నా పెద్దా, ఆడ మగా ఉక్కిరిబిక్కిరయిపోతూ అల్లంతదూరం జామచెట్టుకింద కూర్చున్నవాళ్ళకేసి కళ్లు పత్తికాయలు చేసుకుని చూస్తున్నారు.

అటు ఈర్రాజువైపువాళ్లు, యిటు సత్తిరాజువైపువాళ్లు పెద్దల నిర్ణయం తమకే అనుకూలంగా వస్తుందనే ఆశలతో ఎదురుచూస్తున్నారు.

ఇహ శివయ్య, గంగమ్మల సంగతి సరేసరి.

ఒక్కగానొక్క బిడ్డ, బోలెడంత ఆస్తి, కొత్తపడవ. ఉత్తరోత్తరా ఒక వూరికి పెద్దరికం. కులపెద్దరికం అన్నీ గౌరిని మనువాడబోయేవాడికే దక్కుతాయి. ఆ అదురుష్టం ఎవడికి పడుతుందో? తన తమ్ముడి కొడుక్కా? తన చెల్లి కొడుక్కా? ఆ ఇద్దరికి ఇదే ఆలోచన. ఒకటే ఆలోచన.

ఇక గౌరమ్మ ఎలా ఉందయ్యా అంటే? ఇద్దరూ తను కావాలనుకునేవాళ్ళే. ఇద్దరికీ తనంటే వల్లమాలిన యిష్టం. ఇద్దరూ తననే మనువాడ కోరుతున్నవాళ్ళే! మరి తనకో? ఎవరంటే యిష్టం - మధనపడిపోతూ జామచెట్టుకింద తలలు మోటించుకుని కూర్చున్న కులపెద్దలకేసి కన్నార్పకుండా చూస్తున్నది గౌరి.

పెద్దలు యింకా చర్చిస్తూనే ఉన్నారు. జనంలో అలజడి బయలుదేరింది. శివయ్య అసహనంగా ఉన్నాడు. అయినా అతడు కల్పించుకోకూడదు. పెద్దల నిర్ణయం శిరసా వహించాలి. గంగమ్మతల్లి అనగా - జనం లేచికూర్చుంటూ బట్టలకు అంటిన యిసుకను దులుపుకుంటున్నారు. ఉండి ఉండి గాలి స్తంభించిపోయింది. కొబ్బరాకు లల్లల్లాడటం లేదు.

ధనామని ఓ కొబ్బరికాయ పయినుంచి పడింది. జనం మధ్యలో శివయ్యముందు పడింది. అందరూ తలలు పైకెత్తి చూశారు. శివయ్య మంచం మీదనుంచి ఒక్క గంతేసి దూకాడు, తల పైకెత్తి చూశాడు.

రెండుచేతులు పైకెత్తి, "స్వామీ దండాలు, దండాలు!" అంటూ బిగ్గరగా అరిచాడు.

కొమ్మ మీదనుంచి కొమ్మమీదకు దూకుతూ కిచకిచ లాడింది ఓ కోతి.

"ఆంజనేయసామీ! దండాలు. కరుణించు సామీ, కరుణించు!" రెండుచేతులు పైకెత్తి కోతిని పిలిచాడు.

అది కిచకిచా కొబ్బరి ఆకులమీదుగా మరొక చెట్టు మీదకు, అక్కణ్ణుంచి మరో చెట్టుమీదకు దూకుతూ వెళ్ళిపోయింది.

శివయ్య వంగి కోతి పడేసిన కొబ్బరికాయ తీసుకుని కళ్ళకద్దుకున్నాడు.

"ఇది ఆంజనేయసామివారి ప్రసాదం. నా గౌరమ్మను మనువాడబోయేవాడికే యిస్తాను" అని ప్రకటించాడు. జనం తమ ఆమోదాన్ని తెలియజేశారు. శివయ్య అటూ యిటూ తిప్పి చూసుకుంటూ 'ఇది- ఈ కొబ్బరికాయ గోదావరి నదిలో పడిపోయినది కాదుగదా?' అనుకున్నాడు.

"ఏంది బావా? కోతిసిరిన కొబ్బరికాయకేసి అట్టా సూత్తండావ్?" అడిగాడు సత్తిరాజు తండ్రి.

"కళ్లు పోతయ్‌రా! నోరుమూసుకో. ఇదేం కొబ్బరికాయనుకున్నావ్?" అంటూండగా జామచెట్టు నీడలోంచి కులపెద్దలు కదిలిరావటం కనిపించింది శివయ్యకు. చేతిలోవున్న కొబ్బరికాయ గంగమ్మకిచ్చి జనం ముందుకొచ్చి నిలబడ్డాడు. నలుగురు పెద్దలూ వచ్చి శివయ్యముందు నిలపడ్డారు.

గౌరి గుండెలు గుబగుబలాడాయి.

జనం ఒకళ్ళనొకళ్ళు తోసుకుని ముందుకు వస్తున్నారు.

శివయ్య జనాన్ని సర్ది కూర్చోబెట్టాడు.

గంగమ్మ - గౌరి తన మేనల్లుడికే దక్కుతుందని ఆశతో ఎదురు చూస్తూవుంది.

"అందరూ యింటుండగా మీ అభిప్రాయమేమిటో చెప్పండి. గౌరిని రచ్చించినోడు సత్తిరాజా, ఈశ్రాజా?" నలుగుర్నీ ఉద్దేశించి అన్నాడు శివయ్య.

"నే వొప్ప!"

"ఏందే మద్దెల నీ యవ్వ నీ గొడవ!" శివయ్య పెళ్ళాన్ని గదిమాడు.

"ముందు సత్తిరాజు ఊసెందుకెత్తావ్? ఆళ్ళని చెప్పనీయ్ మరి" అన్నది గంగమ్మ.

"బాగుందే నీ యవ్వారం? ఎవుడో ఓడిపేరు ముందల చెప్పాలి గందా?"

"అట్టయితే ఈఁరాజుగాడి పేరే ముందెట్టొచ్చుగా?" గంగది పెద్ద లాజిక్కు. శివయ్య తల గోక్కుంటూ ఏదో అనబోయేసరికి గౌరి అడ్డం వచ్చింది.

"మీరేంది కయ్యాలాడుకుంటారు? ఆ పెద్దోళ్ళను మాటాడనియ్యండి."

ఈఁరాజూ, సత్తిరాజూ గౌరి ముఖంలోకి ఒక్కసారిగా చూశారు, గౌరి తననే కోరుకుంటుందా?

"మల్లన్నా, అడవయ్యా- మీరు కానీయండి." ఆదేశించాడు శివయ్య.

మల్లన్న, అడవయ్య, జంగయ్య, పక్కెయ్య ముఖముఖాలు చూసుకున్నారు. సుప్రీంకోర్టు బెంచ్ జడ్జిమెంట్ ఒక జడ్జిద్వారా వెల్లడించినట్లు, ఆ నలుగురి ఉమ్మడితీర్పును ఎవరు తెలియచేయాలా అని మంతనాలాడుకున్నారు. ఆ భారం అందరికంటే వయసులో పెద్ద అయిన పక్కెయ్యమీద పడింది.

"ఊఁ! చెప్పు పక్కెయ్యా - పచ్చపాతం ఒద్దు. భయం అసలే వద్దు, సంసయించొద్దు. కొబ్బరికాయ పగలేసినట్టు చెప్పు!" ప్రోత్సహించాడు శివయ్య.

ముసలాడు అందరికంటే ముందుకొచ్చి నిలబడ్డాడు. తలగుడ్డ విప్పతీసి ముఖం తుడుచుకుని మళ్ళీ కట్టుకున్నాడు. గొంతు సకిలించి, కళ్లు చికిలించి ఇకిలించాడు. జనం ఉక్కిరి బిక్కిరయిపోతున్నారు సస్పెన్స్ భరించలేక. ముసలాడు జాగుచేస్తుంటే వాళ్ళకు ఒళ్ళు మండిపోతూంది. గౌరి ముఖం జేవురించింది ఈఁరాజూ, సత్తిరాజు బిగిసిపోయివున్నారు.

"పక్కెయ్యా! సెప్పు మీ తీర్పు." శివయ్య హెచ్చరించాడు.

ఎట్టకేలకు పక్కెయ్య గొంతు పలికింది:

"గంగమ్మ శివయ్యల కూతురయిన గౌరమ్మను రచ్చించినోడు ఎవరయ్యా అంటే-" అని ఆగి ముసలాడు జనాన్ని ఓసారి కలయజూశాడు.

"చెప్పు - చెప్పశ!" జనం అరిచారు.

"సత్తిరాజు!" ఆగి గుటక మింగాడు ముసలాడు. గుంపులో కలకలం. "ఈఁరాజు!" ఆగి దగ్గాడు పక్కెయ్య. నోళ్ళు తెరచినవి తెరచినట్టే ఉండిపోయాయి.

"ఒరే పక్కిరిగా, సంపుతున్నావురా?" మందిలోనుంచి అరిచాడొకడు.

"ఇది గీళ్ళిద్దరూ నదిలో దూకినారు. ఇద్దరూ మొసల్ని సంపినారు. ఇద్దరూ గౌరమ్మను రచ్చించినారు. ఇద్దరూ గౌరమ్మను ఒడ్డుకు చేర్చినారు. ఇందులో ఓరు తక్కువా, ఓరు ఎక్కువా సెప్పడానికి యీల్లేదని మా అందరి అభిప్రాయం. అందువల్ల మా నలుగురి తీర్పు ఏంటంటే ఈఁరాజు, సత్తిరాజు యిద్దరూ శివయ్య కూతుర్ని రచ్చించినారు." అక్కడ ఆగి శివయ్య ముఖంలోకి చూసి "ఇక నీ పెమాణం చెల్లించుకో శివయ్యా!" అన్నాడు పక్కెయ్య. జనాన్ని మహా గొప్పగాచూసి చతికిలబడ్డాడు యిసుకపఱ్ఱమీద.

జనం బిగిసిపోయారు. వాడి తీర్పేదో ఎవడికీ అంతు చిక్కలేదు.

"ఓరి నీయవ్వ! ఏం తీర్పురా యిది? పీకలమీద పీట ముడి ఏశారేందిరా? ఇసురొలలో యిరుక్కుపోయినట్టు ఇదేం తీర్పురా?" పక్కెయ్య ముఖంలో ముఖంపెట్టి చూస్తూ, "ఇంతకీ గౌరిని ఎవుడికిచ్చి చేయమంటావురా?" బిగ్గరగా చిరాగ్గా అరిచాడు శివయ్య.

పక్కెయ్య మిగతా ముగ్గురికేసి చూశాడు. మళ్ళీ తలలు కూడేసి గుసగుసలాడారు.

"శివన్నా! నీ కూతుర్ని గోదార్లో మొసలి నోట్లోంచి కాపాడినోడెవడో చెప్పమన్నావు మేము చెప్పాము. ఇద్దరూ రచ్చించారని మా తీర్పు మరి! నీ పెమాణం నువ్వెట్టా సెల్లించుకుంటావో మాకేం ఎరిక? కూతుర్ని యిద్దరికీ మనుమాడిస్తావో వొదులుకుంటావో నీ యిట్టం" అని మళ్ళీ కూలబడ్డాడు పక్కెయ్య.

"ఓరే, యిదేమన్నా సత్తెకాలమనుకున్నారా? అర్జునుడు కుంతమ్మ దగ్గరకొచ్చి 'అమ్మా! అమ్మా ఓ పండు తెచ్చా'నంటే మంచిది కొడకా అందరూ పంచుకుని తినమందట. ఆ మాటమీద నిలబడి ఐదుగురన్నదమ్ములు ద్రౌపదిని మనువాడారట. ఇదిగో, అట్టుందిరా మీ తీర్పు" అన్నాడు శివయ్య.

"అయితే, నీ యిట్టం. మా తీర్పది. ఏం చేసుకుంటావో చేసుకో" అని నలుగురు న్యాయమూర్తులు వెళ్ళడానికి సిద్ధమయారు.

"ఒరే ఆగండిరా! నే చెప్పేదికూడా యినండిమరి" అని బుర్రమీసాలు సర్దుకున్నాడు శివయ్య.

"నా ఆస్తంతా ఒక వాటా, కొత్త పడవతో సహా" రెండోవాటా యీ గౌరి.

"సాములోరి కొబ్బరికాయో?" జెల్లల పీతయ్య పళ్ళికిలించాడు.

అందరూ ఫక్కున నవ్వారు.

"అరే సీతామ్ - దేవుడిచ్చిన కొబ్బరికాయ నా వాటాదిరా!" అని సత్తిరాజును, యీర్రాజుని దగ్గరిగా పిలిచాడు, శివయ్య.

"ఒరే! ఇన్నారుగదరా. నా ఆస్తికావాలో గౌరి కావాలో కోరుకోండి. నా మాటకు తిరుగులేదు, తెలిసిందా?" అన్నాడు శివయ్య.

ఇద్దరూ గౌరే కావాలన్నారు.

జనం చప్పట్లు కొట్టారు.

గౌరి సిగ్గుపడింది.

గంగమ్మ అయోమయంగా చూసింది.

శివయ్య వలలోపడ్డ బొచ్చెచేపలా గిలగిల్లాడాడు.

"ఇద్దర్నీ ఎట్టా మనువాడుద్దిరా గౌరి?" అందరిని కలయజూచాడు.

"ఏందిరా దారి?"

"గోదారే?" చవలయ్య జనంలోనుంచి అరిచాడు. పకపకలు, వికవికలు.

"శివయ్య తాతా! నే చెప్పేదా?" అరిచాడు గుంపులో నుంచి ఒకడు. అందరూ ఆ పన్నెండేళ్ళ చిత్రాయిగాడికేసి చిత్రంగా చూశారు.

"చెప్పరా మనవడా!" మీ కిష్టమేనా అన్నట్టు ఈర్రాజుని, సత్తిరాజుని చూశాడు శివయ్య.

"ఏ పుట్టలో ఏపాముందో సెప్పనీయ్!" అన్నాడు పక్కెయ్య. అందరూ తలలూపారు.

చిత్రాయిగాడు ఓ పుల్లను విరిచి తెచ్చి జనాన్ని తప్పుకోమని, గుండ్రంగా ఓ పెద్ద గీత గీశాడు.

"ఇదిగో తాతా, చూడు. ఇక్కడేమో సత్తిరాజు, అక్కడేమో ఈర్రాజు!" గీతమీద నిలబడి చిత్రాయిగాడు చెప్పుకుపోతున్నాడు.

"ఈళ్ళిద్దరూ యీ గిరిదాటకుండా యుద్ధం చేయాలి. ఎవడు గెలిస్తే వాడిది గౌరి" తేల్చి చెప్పేసి శివయ్య కళ్ళలోకి చూశాడు చిన్నోడు.

"ఓరి కుర్నాయాలా! బయస్కోపు బొమ్మలాట చూపిస్తావేటి?" జనంలోనుంచి అరిచాడొకడు.

"మీ ఇద్దరికీ ఇష్టమేనా?" ఈర్రాజును, సత్తిరాజును గుచ్చిగుచ్చి చూశాడు శివయ్య.

క్షణాలమీద రంగం సిద్ధమయిపోయింది. ఇద్దరూ బరిమీదకొచ్చారు. ఈర్రాజు పక్కన కొందరు, సత్తిరాజు పక్షాన కొందరు చేరి గిరి బయట నిలబడ్డారు.

ఈర్రాజు, సత్తిరాజూ బరిమీదకొచ్చి బాణాకర్రలు, ఈటెలు, గొడ్డళ్ళు ఒకదానితర్వాత ఒకటి తీసుకుని తలపడ్డారు. చివరకు గాలాలూ వలలూ తీసుకొని కలపడ్డారు. పోరు ఘోరంగా సాగిపోతోంది. ఎవడూ గిరి దాటలేదు. మల్లయుద్ధానికి, ముష్టియుద్ధానికి సిద్ధమయ్యారు. ఒకడి మెడ ఒకడు విరుస్తున్నాడు. తలలు ఢీ కొంటున్నాయి. కొబ్బరికాయలు పగిలిన మోతలు, అరుపులు, పెడబొబ్బలు.

ఇరుపక్షాలవాళ్లు యీలలూ కేకలతో గంతులేస్తున్నారు.

"అది దొంగపట్టు- ఇదువ్?" ఈర్రాజు పక్షంవాడొకడు గిరిదాటి సత్తిరాజుమీద కొచ్చాడు.

"అడిదే దొంగదెబ్బ!" అంటూ సత్తిరాజు మనిషొకడు గిరిలోకి దూకాడు. ఇరుపక్షాలవాళ్లు కేకలు వేసుకుంటూ తన్నులాటకు దిగారు.

గౌరి పరుగెత్తుకొచ్చి సత్తి, ఈర్రాజుల మధ్యకొచ్చి నిలిచింది.

"ఆగండి!" శివయ్య రంకె వేశాడు. పెద్దలు యిరుపక్షాల కుర్రాళ్ళని సర్ది దూరంగా నిలబెట్టారు.

"శివయ్యన్నా! ఇది పద్ధతికాదు. పైగా అన్నిట్లోనూ సత్తి, ఈర్రాజులు సమాన ఉజ్జీలనే రుజువయిపోయిందిగందా!"

"ఇప్పుడేం చేయమంటావ్ చింతయ్యా?" ప్రాధేయపూర్వకంగా అడిగాడు శివయ్య.

"ఇక వదిలెయ్!"

"నా పెమాణమో?" దిగులుగా అన్నాడు శివయ్య.

"నీ పెమాణాన్ని వదులుకోమంటంలేదు. గంగమ్మ తల్లిమీద చేసిన పెమాణాన్ని వదులుకుంటే గంగపుత్రులకు పుట్టగతులుండవని నాకు తెలియనిదా శివయ్యన్నా!"

"బాగా సెప్పినావ్! ఇప్పుడా పెమాణాన్ని ఎట్టా నిలుపుకోను?"

"ఇను, మరి!"

"ఒరే - అందరూ ఇనండిరా, మన చింతయ్య సెప్పేది. మనందర్లో సదుకొన్నోడు ఆడేగందా!"

"ఔ. ఔ. మరి! సదూకున్నోడు." అందరూ చింతయ్య కేసి చూశారు మెచ్చుకోలుగా.

"ఇంతవరకూ తేలిందేమిటంటే ఈ(రాజూ, సత్తిరాజూ ధైర్యసాహసాల్లో సమానమయినోళ్లు. అది గౌరిని రక్షించినప్పుడే తేలిపోయింది. భుజ బలపరాక్రమాల్లో ఇద్దరూ సముజ్జీలేనని యిప్పుడే మీరందరూ కళ్ళారా చూశారు. ఇకపోతే మిగిలిపోయింది బుద్ధి పరీక్షే! వీళ్ళల్లో మగువ మనసెరిగినో దెవడో తేల్చాలి!"

"అంటే?" ఐదారుగురు ఒక్కసారే అడిగారు.

"ఆడదాని మనసెరిగి మెప్పించేవాడెవడా అని!" ఆగాడు చింతయ్య.

"చెప్పు చెప్పు, వివరంగా చెప్పు" అన్నాడు శివయ్య.

"మనం యీళ్ళిద్దరి తెలివితేటల్ని పరీక్షించాలి. బుద్ధి కుశలతను పరీక్షించాలి. గౌరిని మెప్పించే మనసు, బుద్ధి ఎవరికుందో పరీక్షించాలి!"

"భేష్ భేష్ చింతయ్యా! చదువుకొన్నోడి దారే వేరు. చెప్పుమరి. ఏంపరీక్ష పెడతావో పెట్టు చింతయ్యా!" అని శివయ్య రొప్పుతూ రోస్తూ నిలబడివున్న వీ(రాజుని, సత్తిరాజుల్ని చూసి "మీ కిష్టమేనా?" అని అడిగాడు.

సై అంటే సై అన్నారిద్దరూ.

మంది తమ ఆమోదాన్ని తెలియచేసింది.

"అయితే మరి వినండి" దగ్గర్లోవున్న రాతి దిమ్మమీద నిలబడ్డాడు చింతయ్య.

"శివయన్న కొత్త పడవమీద ఒక నెలరోజులపాటు కలసి బ్రతకాలి. ఇద్దరూ కలసి పడవ నడపాలి, సంపాదించాలి. ఇది రాదారి పడవ కాబట్టి సరకులు రవాణాచేసి సరిగ్గా ముప్పై రోజులకు ఐదువందల రూపాయలు సంపాదించాలి."

"ఐదువందలే!" నోరు తెరిచాడు శివయ్య. ఒక్క క్షణం బోటు కట్టేయకుండా నడిపినా అంత వస్తుందో లేదో చెప్పడం కష్టం! ఆశ్చర్యపోయాడు శివయ్య.

"అదేమరి పరీక్ష! వీరి బుద్ధికుశలతకు, శక్తికి పరీక్ష! అంత డబ్బు ఆర్జించితేనే వీళ్ళు పరీక్ష నెగ్గినట్టు, అదీ న్యాయంగా సంపాదించాలి. ఈ నెలరోజులు వాళ్ళ ఖర్చు అందులోనే. అదిపోనే ఐదొందలు!"

"ఉండుండు చింతన్నా?" అంగిడిబడ్డ గొడ్డులా అయిపోయాడు శివయ్య.

"అది సరే! ఇడిఇడిగా పోటీ పెట్తేనే ఎటూ తేలక చస్తున్నాంగదా. ఇద్దరికీ కలిసి పరీక్ష పెడుతున్నావ్. ఇద్దరూ కలిసేకదా సంపాయించేది. గెలుపయినా ఓటమయినా ఇద్దరికీ కదా?"

"శివయ్యన్నా! ఆ సంగతి నాకు తెలియంది కాదు." సాలోచనగా నవ్వి చింతయ్య మళ్ళీ అన్నాడు.

"ఒకే పిల్లను ప్రేమించిన యిద్దరు బద్ధశత్రువులు ఒకే పడవలో ముప్పైరోజులు కలిసి ఉండగలగడం, కలిసి శ్రమించడం, కలిసి సంపాదించడం నువ్వు అనుకొన్నంత తేలికకాదు. అందులోనూ నీతి న్యాయం తప్పకుండా ఉండాలి.

ఇద్దరిదీ ఒకే కోరిక. ఆ కోర్కెను సాధించడానికి ఇద్దరూ భుజం భుజం కలిపి పనిచేయడం సామాన్యులకు సాధ్యపడేదికాదు. వాళ్ళకు తెలుసు యిద్దరూ కలిసి శ్రమించి సాధించేదేమీలేదని. అయితే ఈ పందెంలో నెగ్గాలంటే కలిసి శ్రమించక తప్పదు. ఇందులో ఒకాడు పడవ వొదిలి పారిపోక తప్పదు, కాకపోతే మనం పెట్టిన యీ షరతుల్ని ఉల్లంఘిస్తాడు."

"సరే చింతయ్యా! చదువుకున్నాడివి నీకు ఎదురు చెప్పలేను, కాని–"

"ఆగు శివయ్యన్నా! నీ సందేహమేమిటో నాకు తెలుసు గౌరి. ఈ ముప్పైరోజులూ పడవమీదే వుంటుంది. వాళ్ళ ప్రవర్తన, నడవడిక గమనిస్తూ ఉంటుంది.

ముప్పై ఒకటోరోజున తన మనసు తెలుసుకొన్న వాడెవడో, తను మెచ్చిన వాడెవడో మన అందరి సమక్షంలో తెలియజేస్తుంది" అని చెప్పి చింతయ్య దిమ్మ దిగాడు.

"గౌరీ! నీకిది సమ్మతమేనా?" కూతురు తల నిమురుతూ అడిగాడు శివయ్య.

"సమ్మతమే" అని చింతయ్యకేసి పక్కచూపులు చూసింది గౌరి.

"సమ్మతంగాక ఏమవుతుంది? ఇది నీ పథకమే గదా పడతీ!" అనుకొన్నాడు చింతయ్య.

పొద్దువాలుతుంది. అందరూ ఇళ్ళకు బయలుదేరారు.

# 6

పున్నమిరోజున పూజచేసి గంగమ్మతల్లికి మొక్కి సత్తి, ఈశ్రాజులు పడవెక్కారు. రేవుకాడ కొబ్బరికాయలు నింపుతున్నారు.

శివయ్య, గంగమ్మ, పాలెంజనం సాగనంపటాని కొచ్చారు. నిండుగా సరుకుతోవున్న పడవను చూసి "ఏందర్రా యిది? ఇంత బరువా? పడవ మునిగితే?" అడిగాడు శివయ్య.

"ఏందిమామా! నీ కూతురు పడవమీదుండగా పడవెట్టా మునుగుద్ది!" తట్టనిండా కొబ్బరికాయ లెత్తుకొని పడవమీద కాలుపెడుతూ అన్నాడు సత్తిరాజు.

"అదేంది మామా? యిది వూరిపడవ? శివన్న పడవ మునగాలంటే శివుడాజ్ఞకావాలి మరి!" మామను ఉబకేశాడు ఈశ్రాజు.

పోటాపోటీలుగా పడవకు సరుకెత్తుతూన్న అల్లుళ్ళను చూసి మురిసిపోయారు శివయ్య, గంగమ్మలు.

పొద్దువాలుతుండనగా పడవలు విడిచారు. అందరికంటే ముందుగా పోవాలని రాతిగుంజకు కట్టిన తాడును విడిచాడు ఈశ్రాజు.

చుక్కాని పట్టుకొని పడవను ప్రవాహంలోకి తిప్పుతున్నాడు సత్తిరాజు. చెంగున పడవమీదకు దూకింది గౌరి. పరుగు పరుగున వచ్చి పడవమీదకు దూకేడు ఈశ్రాజు. కాలువ మధ్యకొచ్చింది పడవ.

ఒడ్డునున్న శివయ్య, గంగమ్మలను చూసి చేతులూపారు ముగ్గురూ - గౌరి చుక్కానిపట్టగా సత్తి, ఈరాజులు తెరచాప ఎత్తసాగారు.

దూరందూరంగా తెరచాప కనిపించినంతవరకూ చూస్తూ నిలబడేవున్నారు శివయ్య, గంగమ్మలు.

"చూశావా గంగీ! ఇద్దరూ సముజ్జీలేనే?" ఏదో ఆలోచిస్తూ దూరతీరాలకేసి చూస్తూ అన్నాడు శివయ్య.

"అట్టయితే నీ కూతురికి పెళ్ళయినట్టే?" మూతి విరిసింది గంగమ్మ.

"ఏమిటోనే గంగీ, మనసు బెంగగా వుందే! ఎవరికి అన్యాయం జరిగిపోద్దోనని బయంబయంగా ఉందే?" దిగులుగా అన్నాడు శివయ్య.

తెరచాప కొసకూడా కనిపించేంతవరకు చూసి, అదీ కనుమరుగయేసరికి దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు శివయ్య. గంగమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"ఇంతా నీవల్లే!" అంది.

"ఏందే నువ్వనేది? గంగమ్మ - తల్లిమీద చేసిన పెమాణాన్ని వదులుకో మంటావా?"

"నేనెందుకంటానయ్యా! అల్లుళ్ళిద్దరూ నాబంగా తిరిగొచ్చిన ఆ బిడ్డకు చేమంగా పెళ్ళి అవాలని గంగమ్మ తల్లిని కోరుకుంటున్నా. నూరు కొబ్బరికాయలు ఆంజనేయసామికి కొడతానని మొక్కుకుంటున్నా, ఇన్నావుగా మరి!" మొగుడి డొక్కలో మోచేత్తో పొడిచింది గంగమ్మ.

"నీ యవ్వ! మళ్ళా అదేం కోరికే? ఇప్పటికే పీక్కు సత్తుంటేను. ఇద్దరూ నాబంగా చేమంగా వత్తే- ఓడికని యిత్తావే కూతుర్ని?"

"నువ్వూరుకో! అదంతా ఆ ఆంజనేయసామే చూసుకొంటాడ్లే!" భర్తను గదిమింది.

"మళ్ళీ ఆయనకెందుకు యీ తగులాట? ఆయన అసలే బెమ్మచారి!"

"సరిసరి, బేగి నడు. ఇంట్లో చందువాల కూరుంది." కాలవకట్టమీద గబగబా నడవసాగింది గంగమ్మ.

చందువాల కూర తలచుకున్న శివయ్యకు నోట్లో నీళ్లు ఊరాయి. భార్యకంటే ముందే అంగలు పంగలేసుకుంటూ నడిచి యింటికి చేరాడు.

నిండుగా ఒడ్డు ఒడుచుకొని ప్రవహిస్తున్న కాలవలో పడవ హంసలా వయ్యారంగా సాగిపోతోంది. తెరచాప తాళ్లు పట్టుకొని గౌరినే చూస్తూ కూర్చున్నాడు సత్తిరాజు. చుక్కాని కొయ్య చంకలో యిరికించి అటు యిటూ తిప్పుతూ గౌరినే చూస్తున్నాడు ఈర్రాజు. వాళ్ళిద్దరిమధ్యగా పడవమీద నిలబడి అటూ అస్తమిస్తోన్న సూర్యుడ్నీ యిటు గాలికి రెప రెపలాడే తెరచాపనూ చూస్తూ వుంది గౌరి.

తనకిదంతా కాశీమజలీ కథలా వుంది. సంతోషంగా ఉంది, ఆదుర్దాగా వుంది, హాయిగా వుంది, అలజడిగా వుంది, ఆనందంగా వుంది. బాధగానూ వుంది. ఈరా-

సత్తీ ఎవరు? ఎవరు? ఇద్దరూనా? యీ యిద్దరితో కాపరం ఎట్లా? మెచ్చి మనసిచ్చినోడు ఒక్కడే - ఆ ఒక్కడే ఎవరు?

తూర్పుగాలి రయ్యిన వీస్తోంది. తెరచాప నిండుగా గాలి నింపుకొని పొట్ట పగిలేట్టుగా ఉబ్బివున్నది. పడవ వేగం హెచ్చింది, నీటిని కోస్తూ సర్రున సాగిపోతోంది.

నిండు చంద్రుడు నిదురలేచి వస్తోన్నాడు–.

గౌరి మేను పులకరించింది.

ఆకాశంలో చంద్రుడు, నీళ్ళల్లో చంద్రుడు. పైన చంద్రుడు, కింద చంద్రుడు, చుక్కాని దగ్గర చంద్రుడు, తెరచాపదగ్గర చంద్రుడు.

గౌరి మనసంతా వెన్నెల. నలుగురు చంద్రుళ్లు కలిసి నిప్పులు తెప్పలుగా కురిపిస్తోన్న వెన్నెల! నీటి అలలమీద వెన్నెలాడుతూన్న సయ్యాటలకు మురిసి తృళ్ళి పడుతోన్న చిరుచిరు మీనాల సోయగాలు చూసి గౌరి మధుర స్వప్నాలలో తేలిపోతూవుంది.

తెల్లటి మబ్బులను దాటుకొని పరుగులుతీస్తున్న చంద్రుణ్ణి చూస్తూ తెరచాప కొయ్యకానుకొని వెన్నెల్లో నిలబడింది. ఎంతసేపు నిలబడిందో ఏమో! ఈరా, సత్తిరాజులు గౌరిని చూస్తూ ఆకలి మరిచిపోయారు.

కూనిరాగాలు తీస్తూ పడవంతా కలయతిరుగుతూన్న గౌరిని గుర్తొచ్చిది అయ్యోపాపం వీళ్ళు కూడు తినలేదే అని.

"ఏమర్రా, మీకు ఆకలవడంలేదా?" ఇద్దరిమధ్యా నిలబడి అడిగింది.

నిన్ను చూస్తుంటే ఆకలే అవడంలేదన్నాడు ఈరా.

నువ్వుంటే చాలు, నీళ్లు నిప్పులూ వద్దన్నాడు సత్తి.

నవ్వుకున్నది గౌరి.

తనలో తనకే ఏదో యిదిగా అదిగా అయిపోతున్నది.

ఏమిటి వీళ్ళిద్దరూను? ఒకరినిమించి ఒకరు! గిన్నెలు తెచ్చి ముందు పెట్టింది.

అన్నం మూటవిప్పి అటూ యిటూ పరుగులు తీస్తూ అన్నం, రొయ్యలకూరా పెట్టింది.

వెన్నెల్లో కూర్చుని అవురావురని తింటున్న వాళ్ళిద్దర్ని ఆప్యాయంగా చూసింది.

గిన్నెలు కాలవనీళ్ళల్లో కడిగి ఓమూల బోర్లించింది, చుక్కానికి తెరచాప కొయ్యకు మధ్యగా పడవమీద పక్క పరచుకొని పడుకున్నది. చంద్రుడి ముఖంలో ముఖంపెట్టి 'హైలసా, హైలసా' పాట అందుకుంది. ప్రేమికులిద్దరూ వంతపాడారు.

# 7

తెల తెలవారుతోంది. వెన్నెల వెల వెల బోతూన్నది. పడవ లాకు దగ్గరికొచ్చి ఆగింది.

పడవను పక్కకులాగి కట్టేశారు. ముగ్గురూ దూరంగా కాలవకట్టన దుబ్బుల్లోకి వెళ్ళారు. ముఖాలు కడుక్కొని కాలవలో జలకాలాడారు.

పొద్దు కరకరా ఎక్కివస్తోంది.

ఇంకా లాకు లెత్తలేదు.

ఈరా ఆదుర్దాగా లాకులెత్తే కళాసికోసం వెతికాడు, సత్తిరాజు ముడిచిన తెరచాపను ఎత్తడానికి సిద్ధమౌతున్నాడు. ముందువచ్చిన పడవలూ, వెనకవచ్చిన పడవలూ అక్కడే ఆగి వున్నయ్. సాయంత్రానికి అడంగుకు చేరితే సరుకు దించి తిరిగి ప్రయాణం కట్టొచ్చు. కాని యిప్పుడు బయలు దేరకపోతే అడంగుకు చేరేసరికి చీకటిపడుతుంది. చీకటిపడితే సరుకు దించుకోరు. రాత్రంతా అక్కడే పడివుండాలి. ఆరోజు వృథా అయిపోతుంది. ఇట్టా అయితే ముప్పై రోజుల్లో ఐదు వందలు ఎలా సంపాదించాలి? ఈరా ఆదుర్దా పడిపోతున్నాడు. కాలుగాలిన పిల్లిలా లాక్ దగ్గర కట్టమీద తిరుగుతున్నాడు.

"ఏంది యీర్రాజు, ఈడ సూత్తావుండావ్?"

"ఇయ్యాల లాకులెత్తరంట!" వెనకవచ్చిన పడవ సరంగు చెప్పాడు.

"ఎందుకో?"

"ఈడ కామదదూరంలో తిరునాళ జరుగుతోందిట. కళాసీ, ఓర్సీలు ఆడకి పోయారంట! ఇయ్యాల లాకులెత్తేపనే లేదంట."

"ఏందేంది ఏం తిరునాళ? ఎక్కడా?" అప్పుడే సత్తిరాజుతో కలిసి లాకుదగ్గరకొచ్చిన గౌరీ అడిగింది. ఈరా చెప్పాడు. వింటూ రాజు దిగులుపడిపోయాడు.

"ఏందర్రో? మొఖాలట్టపెట్టారూ? మనంకూడా తిరునాళ కెళదాం పదండి" అన్నది గౌరీ ఉషారుగా.

"తిరునాళకా?" యిద్దరూ వెర్రిమొఖాలేశారు.

"అవున్నా! తిరునాళకే? మీరు రాకపోతే పోండి. నే వెళ్ళతాను" అంటూ బయలుదేరింది గౌరి.

"మరి పడవో?" అన్నాడు ఈరా.

"ఇక్కడే ఉంటది. పడవెక్కడన్నా తిరనాళ కొస్తాదా ఏంటి బావా?" ఎగతాళి చేసింది. ఈరా ముఖం ముడుచుకున్నాడు.

"పడవలో సరుకో?" సత్తిరాజు సందేహాన్ని వెళ్ళగక్కాడు.

"అయితే నువ్వుండు మావా! నేనూ ఈరా తిరనాళ కెళ్ళొస్తాం" అన్నది గౌరి.

సత్తిరాజు చిత్తయిపోయాడు.

"అట్టా కుదరదు. నేనుకూడా వొస్తా."

"సరుకో?" అన్నది గౌరి.

"నువ్వుండు కాపలా. మేమిద్దరం తిరనాళకెళ్ళొస్తాం" అని నాలిక్కొరుకున్నాడు సత్తిరాజు.

గౌరి నవ్వుకున్నది.

"ఓ పని చేద్దాం. ముందు ఈరా నేనూ వెళ్తాం. తిరికొచ్చాక నువ్వెళ్ళు."

"ఠాట్! అట్టా కుదర్దు. నేనొస్తాను, ఆడ్నే ఉండమను." మొండికెత్తాడు సత్తిరాజు.

"తమాషాకు అన్నాగాని ఏడవమాక. ఈరా, నేను తిరనాళ చూసి అన్నం వేళకు తిరిగొస్తాం. అన్నం తిన్నాక మధ్యాన్నం మనిద్దరం వెళదాం, సరేనా?" ఈరా, సత్తి ఇద్దరూ ఒప్పుకున్నారు.

ఈరా, గౌరీ బయలుదేరారు.

సగం దూరంలో ఉండగా సత్తిరాజు పరుగులు తీస్తూ వచ్చి వాళ్ళను కలుసుకొన్నాడు.

"ఏంటిటొచ్చావ్? పడవలో సరుకో!" గౌరి మందలింపుగా అన్నది.

"పక్కెయ్య కొడుకు గండెయ్య పడవ మన పడవెనకే కట్టేశాడు. వాడు మన పడవ. సరుక్కూడా కాపలా కాస్తానన్నాడు" రొప్పుకుంటూ చెప్పాడు సత్తిరాజు.

ముగ్గురూ చకచక నడిచి తిరునాళ జరిగే ఊరు చేరుకున్నారు.

ఈరా, సత్తి మధ్యలో గౌరీ తిరునాళ్ళల్లో తిరిగుతూ వింతలు విశేషాలు చూసి తన్మయత్వం చెందుతున్నారు. గౌరి కోరిందల్లా ఈరా, రాజు పోటీలుపడి కొనియిచ్చారు. ఈర్రాజు రిబ్బన్లు కొన్నాడు. సత్తిరాజు పిన్నీసులు కొన్నాడు. గోదారి పడవకు దారిబత్యం కింద యిచ్చిన బయాణా ఖర్చు పెడుతున్నారు. సత్తిరాజు రంగులరాట్నం ఎక్కించాడు. ఈర్రాజు ఉయ్యాల ఎక్కించాడు గౌరిని. పురివిప్పిన నెమలిలా ఆనందిస్తోంది.

జనాన్ని రాసుకుంటూ తోసుకుంటూ తిరుగుతోన్న వాళ్ళకు ఓ సన్యాసి ఎదురయినాడు. కాషాయిబట్టలు సన్యాసి దాటిపోయాక ఉక్కులాంటి వళ్ళుగల భీకరాకారుడొకడూ వాడిపక్కనే సన్న గాలిపటంలా ఉన్నవాడొకడూ ఎదురయ్యారు. వీళ్ళను దాదాపు కిందపడేట్లు తోసుకుంటూ పోయారు. ముగ్గురూ తిరిగి వెనక్కి చూశారు. ముందు దాటి పోయిన కాషాయబట్టల సన్యాసిని వాళ్ళు వెంబడిస్తోన్నట్టుగా తోచింది.

సత్తి, ఈరా, గౌరి గుడిదగ్గర కొచ్చారు. ప్రదక్షిణం చేసి గుడిలోకి వెళ్ళారు. గౌరి కొబ్బరికాయ కొట్టి చేతులు జోడించింది. ఏం కోరుకుంటుంది? ఈరానా? సత్తిరాజునా? ఇద్దరినా? గుడిలో అమ్మవారికి దణ్ణంపెట్టేసి బయటికొచ్చింది. గౌరితోపాటు ఈరా, సత్తిరాజు వచ్చి గుడిమెట్లమీద కూర్చున్నారు. వాళ్ళిద్దరిమధ్య కూర్చొని బడలిక తీర్చుకొంటూ ఉన్న గౌరికి గుడిలోనుంచి బయటికొస్తూన్న సన్యాసి కన్పించాడు.

"ఈరా! చూడు చూడు, ఆ సన్నాసే!" అన్నది.

ఆ సన్యాసి చేతిలో ఓ సంచి, ఆ సంచిలో ఓ కొబ్బరి కాయ, అందులోనూ పీచు తీయనిది.

"చూశావా సత్తీ, ఆ సన్నాసి సంచీలో కొబ్బరికాయ! గుళ్ళోకి వెళ్ళి కొబ్బరికాయ కొట్టకుండా తిరిగి వెళ్తున్నాడు. అయినా పీచు తీయకుండా కొబ్బరికాయ గుళ్ళోకెందుకు తీసుకెళ్ళినట్టూ?" బుగ్గమీద వేలేసుకున్నది గౌరి.

"అదేగదా!" ఇద్దరూ వంత పలికారు.

"అదుగో వాళ్ళే!" హడావుడిగా లేచి నిబడింది గౌరి. ఈరా, సత్తి మెట్లమీదనుంచి గౌరితోపాటే ఒక్కసారి లేచి నిలబడ్డారు.

అంతకుముందు వీళ్ళను తోసుకుంటూ సన్యాసిని వెంబడిస్తూ పరుగెత్తిన ఉక్కుగాడూ, చెక్కగాడూ గుడి వెనక నుంచి రావడం కనిపించింది.

"చూశారా! ఆ సన్నాసిని వీళ్ళిద్దరూ పట్టుకోవాలని పరుగులు తీస్తున్నారు, చూశారా?"

"ఆఁ చూశాం చూశాం!" అన్నారిద్దరూ జంటకవుల్లా.

"ఎందుకంటా?"

"ఏమో మరి?" ఇద్దరూ కళ్లు తేలేశారు.

"సన్నోసిగాడి దగ్గరేముంది?" పెదవి విరిచింది గౌరి.

"కొబ్బరికాయ ఉందిగా?" అన్నాడు ఈరా తెలివిగా.

"నీ బుర్ర ఒట్టి మట్టిబుర్రనే" అంది గౌరి.

ఈర్రాజు చిన్నబుచ్చుకున్నాడు.

"నువ్వు చెప్పు సత్తీ!" అడిగింది.

"కాషాయబట్టలకోసమా?" తడుముకుంటూ చెప్పాడు.

"నీ తల్లో ఇసుకుంది!"

సత్తిరాజు తల దించుకొన్నాడు.

"అయితే నువ్వుచెప్పు." ఇద్దరూ ఒక్కసారే అడిగారు.

"బూడిద!" అన్నది గౌరి.

ఇద్దరూ ముఖాలు చూసుకున్నారు.

"పదండి పోదాం!" గౌరి బయలుదేరింది. ఇద్దరూ ఆ సన్యాసోడి దగ్గరేముందా అని ఆలోచిస్తూ గౌరి వెనకే నడిచారు.

లాకుల దగ్గరకొచ్చేసరికి పొద్దువాటాలి పోయింది. అక్కడ ఒక్క పడవాలేదు. లాకులెత్తేశారులా వుంది. పడవలన్నీ లాకులుదాటి వెళ్ళిపోయినై.

"మీ కోసమే ఆగా. నేపోతున్నా" అంటూ పెక్కెయ్య కొడుకు తెరచాప యెత్తాడు.

"తిరునాళ, తిరునాళ అని లాక్కుపోయావు. చూశావా పడవలన్నీ వెళ్ళిపోయినై!" సత్తిరాజు సణిగాడు.

"ఇప్పుడేమయిందర్రా?" గౌరి కసురుకున్నది.

"ఐదొందలు, ఐదొందలు నీ అబ్బ కావాలంటాడు. నువ్వేమో యిట్టా చేత్తన్నావ్? ఎట్టావత్తయ్యే?" ఈర్రాజు గుర్రుగా అన్నాడు,

"ఒరే మీరట్టా మాట్టాడుతుంటే మీతో నేనసలు రానే రాను!" కాలవకట్టమీద చతికిలపడింది గౌరి.

"అమ్మమ్మ! ఊరికే అన్నామే! కోప్పడకే గౌరీ!" అన్నాడు లబలబలాడుతూ సత్తిరాజు.

"తప్పు ఒప్పేసుకుంటున్నాంగా! లేమరి. పొద్దు కూకుతోంది." ప్రాధేయపడ్డాడు ఈర్రాజు. చెరొకపక్కా చేరి గౌరిని ప్రాధేయపడుతున్నారు.

సంచి చేత్తోపట్టుకుని సన్యాసి కాలవకట్టమీద పరుగులు తీసుకున్నాడు. ఉక్కుమనిషి పటాకుల రత్తయ్య, చెక్కగాడూ, తేళ్ళ గురవయ్య వెంబడించడం గౌరిని బ్రతిమిలాడటంలో నిమగ్నమయిన సత్తిరాజూ, ఈరాజ్రూ గమనించలేదు.

గౌరిని బ్రతిమిలాడి బామాలి ఎట్టకేలకు ఒప్పించారు.

"నే చెప్పినట్టు వింటారా?"

"వింటాం, వింటాం." చెంపలు వాయించుకొన్నారు.

గౌరి, ఈరా పడవ ఎక్కారు. సత్తిరాజు తాడువిప్పి పడవలోకి దూకాడు.

ఈర్రాజు చుక్కాని పట్టాడు. సత్తిరాజు, గౌరి తెరచాప నెత్తారు.

పడవ లాకులు దాటింది.

పొద్దు కుంకింది.

గాలివాలుకు పడవ వేగాన్ని పుంజుకొన్నది.

గౌరి పడవతొట్టికేసి వస్తూ హఠాత్తుగా ఆగిపోయింది.

"ఒరే! ఈర్రాజుమామా! ఈడజూడు!" అని అరిచింది గౌరి.

ఈర్రాజు తెరచాపతాళ్లు గుంజకు కట్టేసి పరుగెత్తుకు వచ్చాడు.

"ఏందిది? ఈ సన్నాశాయన చెప్పాపెట్టకుండా పడవెక్కాడు?" ఆశ్చర్యపోయాడు ఈర్రాజు.

కొబ్బరికాయల గుట్టమీద కాళ్ళు బార్లాగా చాపి పడుకుని వున్న సన్యాసిని చూసి "ఓ సాదువయ్యోయ్! లేలే! ఎక్కడికి పోతుండవ్?" అని గౌరి అడిగింది.

సన్యాసి ఉలకలేదు - పలకలేదు.

"ఏందయ్యా? నిన్నే - మాట్టాడవేం?" అంటూ వంగి సన్యాసి రెక్కపట్టుకొన్న ఈర్రాజు ఒక్క గావుకేక పెట్టాడు. సన్యాసిచెయ్యి విడిచిపెట్టి వెనక్కు ఒక్క దూకు దూకాడు. సన్యాసి చేతికి చుట్టుకున్న సంచి జారిపడింది. ఆ సంచిలో నుంచి కొబ్బరికాయ బయటపడింది. దొర్లి మిగతా కొబ్బరికాయల్లో కలిసిపోయింది.

రెప్పవాల్చకుండా ఆకాశంకేసి చూస్తున్న సన్యాసిని చూసిన గౌరికి వణుకుపుట్టింది.

ఈరా కేకకు చుక్కాని వదిలేసి సత్తిరాజు పరుగెత్తుకొచ్చాడు.

"ఏందీ సన్యాసి మన పడవెక్కాడు?" అని, "లే లే" అంటూ కొబ్బరికాయల గుట్టమీద పడుకొనివున్న సన్యాసిని బలంగా గుంజాడు, జరజరా కొబ్బరికాయలు జారినై, సన్యాసి తిరగబడ్డాడు.

వీపున కత్తి దిగబడివుంది! కింద రక్తంతో కొన్ని కొబ్బరికాయలు తడిసిపోయినాయి.

"ఏందిరా ఈరా యిది?" అడిగాడు సత్తిరాజు.

"అదే సత్తిరాజూ! నాకూ అర్థం కావడంలేదు!" అన్నాడు ఈర్రాజు.

"ఈణ్ణి సంపినోళ్ళు వాళ్ళేనంటావా?"

"వాళ్ళుగాక మరెవరంటావ్?"

"సంపి మన పడవలో వేశారంటావా?"

"సంపాక మన పడవలో ఎందుకెయ్యాలా? కాలవలోనే పారెయ్యొచ్చుగా?"

"పడవమీదకొచ్చి చంపారంటావా?"

"అట్టయితే ఆళ్లు మనకు కన్పించాలిగా?"

"మన మొచ్చేముందే చంపి పారిపోయి ఉంటేనో?"

"అట్టయితే పక్కెయ్య కొడుకు పీతయ్య మనకు చెప్పడా?"

"అయితే మనమొచ్చాకే జరిగిందంటావా?" అన్నాడు ఈర్రాజు.

"ఏమో మరి?" తల గోక్కున్నాడు సత్తిరాజు. "ఐతే నువ్వాడ వుండావుగదా చూడలేదా?" రెట్టించాడు.

"ఏందిర నీ యవ్వారం?" ఉద్రేకపడ్డాడు ఈర్రాజు.

"మీరుండండర్రా. ఏం జరిగిందంటే-" అంటూ మొదలెట్టింది గౌరి.

"నువ్వు చూశావా?" ఇద్దరూ ఒక్కసారిగా అన్నారు.

"చూళ్ళేదు కాని చూసినట్టే చెప్తా వినండి?"

"ఒరే సత్తిరాజూ, పడవొడ్డుకు పడ్తుంది చుక్కాని పట్టు!" హెచ్చరించాడు ఈర్రాజు. సత్తిరాజు వెళ్ళి చుక్కాని పట్టి పడవను కాలవ మధ్యలోకి తెచ్చాడు. గౌరి, ఈర్రాజు సత్తిరాజు దగ్గరకొచ్చి కూలబడ్డారు.

"మనం తిరునాళ్ళో చూసిన సన్యాసి ఈయనే మరి గుర్తుందిగా! ఈయన్ని వెంటాడుతున్న యిద్దర్నీ ఆ కర్రోడ్ని బక్కటోడ్ని కూడా చూశాం గద - మనం గుడిమెట్లమీద కూర్చుని వుండగా వీళ్ళు పరిగెత్తుకుపోవడం కన్పించిందిగా మనకు. అట్టావొచ్చి అట్టావొచ్చి యీ సన్నాశాయన మన పడవలోకి వచ్చిపడ్డాడు. ఈయన్ని తరుముకొంటూ వొచ్చినోళ్లు వచ్చేసరికి మనం పడవ యిప్పి వుండాలి. వాళ్లు కట్టమీద నుంచొని పడవెక్కుతున్న ఈయన పైకి కత్తిని విసురుంటారు. ఇప్పుడీ సన్నాసోడేమో చచ్చి మన పాలిట పడ్డాడు. ఏంచేద్దాం?" గౌరి దిగులుగా అన్నది.

"పడవ వెనక్కుతిప్పి లాకులదగ్గరకెళ్తేనో?" అన్నాడు ఈర్రాజు.

"అడ్ని మనమే చంపామంటేనో?"

"ఒరే మీరుండండిరా!" అన్నది గౌరి. ఇద్దరూ గౌరిని ఆత్రంగా చూశారు, ఆశగా చూశారు.

"మీ పందెం మాటో?"

"అవునవునే గౌరీ! ఇప్పటికే ఒకరోజు పోయింది!" అన్నాడు ఈర్రాజు.

"అయితే ఓ పని చేద్దాం?" అన్నాడు సత్తిరాజు.

గౌరి, ఈర్రాజు సత్తిరాజుని చూశారు.

"శవాన్ని కాలవలో తోసేసి మనపాటికి మనం ఏమీ తెలియనట్టే పోతేసరి."

"అది తప్పుడుపని కాదా మామా?" అడిగింది గౌరి.

"ఔనౌనే గౌరి! మామకిచ్చినమాట మరిచాను."

"చెంపలు వాయించుకోరా సత్తిగా?" యీసడింపుగా అన్నాడు ఈర్రాజు.

సత్తిరాజుకు ఎక్కడలేని పౌరుషం వచ్చేసింది.

"ఒరే ఈరిగా, అసలు నువ్వే యీడ్ని చంపేసుంటావురా!" అన్నాడు సత్తిరాజు.

"ఛ! నోరుమూయండి." కసిరింది గౌరి. ఇద్దరూ మౌనంగా గౌరిని చూశారు.

"ఓ పని చేద్దాం. వచ్చే లాకులదగ్గర పడవాపి, దగ్గర్లో వున్న పోలీసుస్టేషన్‌కు వెళ్ళి చెప్పుద్దాం."

"అది బాగానేవుందిగాని గౌరీ! మళ్ళా లాకులొచ్చేసరికి తెల్లవారుద్ది" అన్నాడు సత్తిరాజు.

"అయితే ఏమైంది?"

"ఈ రాత్రంతా సచ్చినోడ్ని పడవలో పెట్టుకోని ఎట్టా ఉంటామే గౌరీ?" అన్నాడు ఈర్రాజు.

తప్పదురా తప్పదు."

"సరే, నువ్వంటే మాకు తప్పేదేముంది" అన్నాడు సత్తిరాజు.

అర్ధరాత్రి దాటింది. పడవలో ముగ్గురూ బిక్కు బిక్కు మంటూ కూర్చున్నారు. గాలివాటం బాగానే వుంది. పడవ వేగంగా పోతోంది. ఈరా మధ్య మధ్య శవాన్ని చూసి తిరిగి చుక్కాని దగ్గరకొస్తూ ఉన్నాడు.

"ఏంటి మామా, నీ అనుమానం." గౌరి అడిగింది.

"సచ్చినోడు లేచి పారిపోయాడేమోనని" సత్తిరాజు హేళనగా అన్నాడు.

"అదికాదురా-" ఆగి కాలవకట్టమీదకు చూశాడు ఈర్రాజు. గౌరీ, సత్తిరాజూ ఈర్రాజు ముఖంలోకి చూశారు.

"అదుగో అక్కడ తుమ్మచెట్ల చాటున చూడండి!" మెల్లగా గొంతు తగ్గించి అన్నాడు ఈర్రాజు.

కాలవకట్టమీద తుమ్మచెట్లనీడలో యిద్దరు మనుషులు పరుగెత్తిరావడం కన్పించింది.

"వాళ్ళే. తిరునాళ్ళో కన్పించినోళ్లు!"

"సన్యాసోడ్ని చంపినోళ్లు!"

"ష్! మెల్లిగా - వాళ్ళు పడవదగ్గిర కొస్తున్నారు." గౌరి హెచ్చరించింది.

వాళ్ళుకాలవలో దిగారు.

ఈదుకొస్తున్నారు.

"రానియ్. కొడుకుల్ని కట్టిపడేద్దాం."

"వాళ్ళ దగ్గర కత్తులుంటాయ్!" గౌరి హెచ్చరించింది.

"మనదగ్గర తెడ్డుకర్రలున్నాయ్."

"తాళ్ళూ, వలలూ ఉన్నాయి."

సత్తి, ఈరాలూ తెడ్లూ, తాళ్ళూ తీసుకొని సిద్ధమయారు.

పటాకుల రత్తయ్యా, తెల్ల గురవయ్యా ఈదుకొంటూ పడవను సమీపించారు. ఈరా, సత్తి చెరొకడ్ని చూసుకున్నారు. తెడ్లతోనూ, తాళ్ళతోనూ బాదారు. పడవ యెక్క కుండా చేశారు. వాళ్ళు పారిపోయి కట్ట ఎక్కారు.

"ఈరా! మనం తొందరగా వెళ్ళిపోవాలిరా. వీళ్ళు ఎళ్ళి ఇంకా మందితో వస్తారేమో? వాళ్ళొచ్చేసరికి మనం రక్కిసపాడు లాకు చేరాలి."

"సత్తీ, చిన్న తెరచాప కూడా వదలమంటావా?"

"ఓరి మామలూ! పడవ బరువుమీదుంది ఒరిగిపోగలదు. జాగ్రత్త!" హెచ్చరించింది గౌరి.

వేగుచుక్క పొడిచింది.

పడవ రక్కిసపాడు లాకులదగ్గరాగింది.

తెల్లవారిందాకా సత్తిరాజు, యీర్రాజు పడవకు కాపలా కాశారు. గౌరి కునుకుతీసి అప్పుడే లేచికూర్చుంది. రక్కిసపాడులాకుకు మూడుమైళ్ళ దూరంలో పోలీసుస్టేషన్నుంది.

గౌరిని, సత్తిరాజును పడవమీదవుంచి ఈరా బయలుదేరాడు.

పొద్దు నెత్తిమీదకొస్తుండగా పోలీసులు ఈర్రాజును వెంటబెట్టుకొని పడవదగ్గర కొచ్చారు. శవాన్ని దించి కట్టమీదుంచారు.

“ఊఁ! నడవండి.”

“మేమా? మాకేం తెలియదు.”

“అదంతా తర్వాత! ముందు నడవండి.” హెడ్డు దబాయించాడు.

“మేమాడ్ని చంపలేదు.” గౌరి గొంతు కీచుమన్నది.

“ఏం పిల్లోవ్. కూతపెడతన్నావ్! ముందు పడవ దిగు.” కానిస్టేబులొకడు గౌరి రెక్కపట్టుకుని గుంజాడు.

“ఆడకూతుర్ని పట్టుకుంటావ్! వదులొదులు, వస్తాం పద.” ఈరా అరిచాడు.

“పడవలో సరుకుంది. అందర్నీ రమ్మంటున్నారు.”

“మావాళ్ళుంటార్లే! మీ సరుకెక్కడికీ పోదులే! నడవండి” అన్నాడు హెడ్డు.

“ఇంతకీ ఏ సరుకంటా?”

“కొబ్బరికాయలు!”

“ఓరినీయమ్మ! కొబ్బరికాయలే గద! ఎవడయినా దేవుడికి కొట్టేయేగా? నడునడువ్.” హెడ్ ఎద్దేవగా అని, లాఠీతో ముందుకు తోశాడు సత్తిరాజును.

సత్తిరాజూ, గౌరీ, యీర్రాజూ బెదురుబెదురుగా పోలీసులవెంట నడిచారు.

పాపం, వాళ్ళకు పొద్దుటనుంచీ తిండీతిప్పల్లేవు. ఆకలితో నకనకలాడిపోతున్నారు. ఎందుకొచ్చిన బాధ యిది? సత్తిగాడ్నో, ఈరిగాడ్నో కట్టుకుంటే యీ తిప్పలన్నీ ఉండేయి కాదుగదా అని ఆలోచిస్తూంది గౌరి. పొద్దువాలుతుండగా మెలికలపాడు పోలీసుస్టేషన్‌కు చేరారు.

# 8

“కొండయ్యా! యీళ్ళనో పట్టుపడ్తావేంటి? అన్నీ కథలు చెప్తున్నారు కథలు!” హెడ్డుతో అన్నాడు యస్సై.

“నిజం బాబయ్యా, సత్తెపెమాణంగా గంగమ్మ తల్లి మీద ఒట్టేసి చెపుతున్నా. మాకేం తెలవదు. మేము చూసేసరికికల్లా ఆ సన్నాసోడు సచ్చిపడుందాడు.” సత్తిరాజు ప్రాధేయపడి చెపుతున్నాడు.

“కొండయ్యా? ఇది ఇట్టా తేలేదికాదుగాని యీళ్ళ ముగ్గురినీ లోపలేసేయ్!” యస్సై లాఠీకర్ర బల్లమీద టకటకలాడించాడు.

"బాబ్బాబు! మా యిద్దర్నీ కొట్లో పెట్టండి. ఆడకూతుర్ని వదిలేయండి." ఈరా బ్రతిమిలాడాడు.

"ఒరే! ఆడకూతురంటే గుర్తొచ్చింది. అసలీ పిల్ల ఎవత్తిరా? మీరు చెప్పింది నిజమేనా? లేక యీ పిట్టను లేవదీసుకొస్తున్నారా?"

"ఏంది యస్సయిబాబూ! మంచిగ మాట్లాడు. నేనెవర్ననుకొంటున్నావ్. సర్దార్ శివయ్య కూతుర్ని. శివయ్యంటే జిల్లా మొత్తం ఎరికే. ఉప్పెనొచ్చినప్పుడు మూడొందల మంది ప్రాణాలు కాపాడాడు మా అయ్య శివయ్య."

యస్సై గౌరిని ఎగాదిగా చూశాడు, మెత్తబడ్డాడు.

"ఆడకూతుర్ని వొగ్గేసి ఇది గీళ్ళిద్దరినీ లోపలేసేయమంటావా?" అన్నాడు హెడ్డు. జాలర్ల కుటుంబంనుంచి వచ్చిన హెడ్డు, శివయ్య పేరు ఎక్కడో విన్నట్టున్నాడు.

"ఆడకూతరొక్కతే ఎట్టా వెళతది? పడవెట్టా నడుపుతుంది హెడ్డు? వీళ్ళిద్దర్లో ఒకర్నుంచి, మిగతా యిద్దరిని సొంతపూచికత్తులమీద వదిలెయ్!" అన్నాడు యస్సై.

"మీలో ఎవరు వుంటార్రా యిక్కడ?"

నేనంటే నేనన్నారు యిద్దరూ.

హెడ్డు తల గోక్కున్నాడు.

"నువ్వుచెప్పు శివయ్యకూతురా! ఎవడ్ని కొట్లో వెయ్యమంటామ్. ఎవడ్ని విడిచిపెట్ట మంటావ్?"

"ఇద్దర్నీ వదలండి."

"ఇద్దర్నీ వొగ్గేసి –" ప్రశ్నార్థకంగా చూశాడు గౌరిని హెడ్డు.

"నేనుంటా!"

హెడ్డు తల తిరిగిపోయింది. ఇంకా నయం యస్సై బాబు యినలేదు. హెడ్డు విశాఖపట్నం అగ్నికుల క్షత్రియుడయినా కోస్తాలోవున్న జాలర్లంటే అభిమానం జాస్తి, గోదావరి జిల్లా జాలర్లకు, విశాఖపట్నం జాలర్ల కుటుంబాలమధ్య ఇచ్చిపుచ్చుకోటాలున్నాయి.

హెడ్డు గౌరిని పక్కకు తీసుకెళ్ళాడు.

"ఉంటానంటున్నావ్? ఇదేంది పోలీస్టేషన్. పెళ్ళి కావల్సిందానివి. శివయ్య కూతురని యింత సెపుతున్నా, వినకపోతే యస్సైబాబుదాకా ఎందుకు, ఈపాటికి నేనే ఏసేద్దును కొట్లో. తెలిసిందా? నువ్వెళ్ళిపో – మీ అయ్యకు సెప్పు. వచ్చి యిడిపించుకుంటాడు–"

యస్సై పిలుపు విని "సార్! వచ్చేసా" అంటూ గౌరిని వదిలి యస్సైదగ్గర కెళ్లాడు కొండయ్య.

"ఏందోయ్ ఆలస్యం! శవాన్ని పోస్ట్‌మార్టంకు పంపాలి.' పడవంతా సోదా చేయాలి."

"ఒకడ్నుంచి రెండోవాడ్ని, పిల్లను వదిలేద్దాం సార్!" వినయంగా విన్నవించుకున్నాడు.

గౌరి చెవిపోగో, ముక్కుపుడకో కొండయ్య చేతిలో పడిందనుకున్నాడు యస్సై.

"అట్టాగే! అట్టాగే! ఆడకూతురు ఒంటరిగా ఎట్టా పోతది? ఒకద్నుంచి ఒకద్ని వదిలెయ్" అన్నాడు యస్సై.

ముగ్గురూ తర్జనభర్జనలు పడ్డారు. సత్తిరాజు తనే ఉండిపోతానని పట్టుబట్టాడు. గౌరికి సత్తిరాజుమీద ప్రేమ పెరిగింది. వాడి త్యాగబుద్ధికి కరిగిపోయింది. ఈర్రాజుకూడా సత్తిగాడిని లోలోపల మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు.

"హెడ్డూ! ఏమాత్రం చేస్తదేంటి?"

"ఏందిసార్ అదీ?" హెడ్డు తల గీసుకున్నాడు.

"అన్నీ వివరాలు చెప్పాలేంటి?" గదమాయించాడు యస్సై.

"ఏం ఉచ్చుకోలేదు సార్!" హెడ్డు నసిగాడు.

"అయితే ఆళ్ళిద్దర్నీకూడా లోపలెయ్!" గర్జించాడు యస్సై.

హెడ్డు బయటికి పరుగెత్తాడు. స్టేషన్ ఆవరణ, దాటిపోతూన్న ఈరాను. గౌరిని ఆపాడు.

ఐదు నిముషాల్లో తిరిగొచ్చి జత చెవిపోగులు యస్సై బల్లమీద వుంచాడు. అవి తీసి జేబులో వేసుకొంటున్న యస్సై వంక ఆశగా చూశాడు హెడ్డు.

"నాకు తెలుసులేవోయ్! ముక్కుపుడక ముందే సర్దేశావుగా!"

హేడ్ జేబులు తడుముకున్నాడు.

"బాబూ, శవాన్ని సెక్‌చెయ్యొద్దా?" ఉషారుగా అన్నాడు హెడ్.

"నీ తలకాయ! సచ్చినోడి దగ్గరేం ఉంటుంది బూడిద. శవాన్ని పోస్టుమార్టంకు పంపించే ఏర్పాట్లు చూడు!" అంటూ యస్సై లేచి నిలబడ్డాడు.

ఆ రాత్రంతా పోలీసు కాపలాతోనే ఈరా, గౌరి పడవలోనే పడుకున్నారు. ఉదయం బారెడు పొద్దెక్కాక పోలీసులు పడవను వదిలేశారు.

పగలంతా ప్రయాణంచేసి పొద్దుకూకుతుండగా పడవ రామాపురం రేవును చేరింది. పడవ రేవులోకి వస్తుండగానే కొబ్బరికాయల వ్యాపారి మురుగుల రంగయ్య శెట్టికోసం వెతికాడు ఈర్రాజు. ఈ సరుకు ఆయనది. శెట్టిగారికి సరుకు ఒప్పచెప్పి రసీదు రాయించుకొని తిరిగివెళ్ళి సరుకు వేసిన వ్యాపారి బాతుల బసవయ్యకు చూపిస్తే, ముందిచ్చిన దారిభత్యం మినహాయించి మిగతా డబ్బిస్తాడు.

గౌరిని పడవమీదేవుంచి ఈర్రాజు దిగి రేవుకాడ మురుగుల రంగయ్యకోసం వెతికాడు. నిన్న సాయంకాలం రావాలిసిన పడవ యీరోజొచ్చింది. నిన్నంతా చూసి రంగయ్య వెళ్ళిపోయాడేమో? ఆయనొస్తేగాని సరుకు దించడానికి వీల్లేదు.

రేవుకాడ కొబ్బరికాయలు దించి ఎవరికి అప్పచెప్పేట్టు? బస్తీకెళ్ళి రంగయ్య శెట్టికి చెప్పిరావాలంటే ఏడేడు పధ్నాలుగు మైళ్ళుంది - ఏం చేయడానికి తోచక రేవంతా

కాలుగాలిన పిల్లిలా తిరిగాడు ఈ(రాజు. రంగయ్యశెట్టి మనుషులెవరన్నా కన్పిస్తారేమో అన్న ఆశతో బాగా చీకటిపడేదాకా చూశాడు. తిరిగి పడవ దగ్గరకొస్తున్న ఈ(రాజు ఎనకనుంచి యెవరో పిలుస్తున్నట్టయి ఆగాడు.

"ఎవరికోసం చూస్తున్నావ్? మురుగుల రంయ్యశెట్టి కోసమేనా చూస్తున్నావ్?"

"అవునాయనకోసమే! ఏరీ ఎక్కడా?" అపరిచితవ్యక్తిని తేరిపారచూశాడు.

"రంగయ్యశెట్టికి ఏదో పనుండి ఆగిపోయాడు. నన్ను పంపించాడు బరువెత్తుకొని రమ్మని."

సన్నగా పొడుగ్గావున్న అతడు తన పేరు సింగినాథం రామస్వామిగా పరిచయం చేసుకున్నాడు. ఈ(రాజు రామస్వామిని అనుమానంగా చూశాడు.

"ఏంటట్టా చూస్తావ్? లారీ కూడా తెచ్చాను సరుకు దించు" అన్నాడు ముందుకు నడుస్తూ రామస్వామి.

"లారీ ఎక్కడా?"

"అదిగో అడితీ పక్కన! పడవకాడికి తీసుకొస్తా పద!" అన్నాడు రామస్వామి.

"ఉండుండు! ఆ లారీ శెట్టిగారిది కాదేమో?"

"శెట్టిగారి సొంతలారీ చెడిపోతే అద్దెకు తెచ్చాం. నడువ్!" తొందరపెట్టాడు.

క్షణం ఆలోచించి "శెట్టిగారికే సరుకు వొప్పచెప్పమని బాతుల బసవయ్య చెప్పాడు. మరి మీకెట్లా యిచ్చేది?" అన్నాడు వీ(రాజు.

"ఇదిగో – నీ పేరేందీ? ఈ(రాజా? శెట్టిగారు పంపించారయ్యా అంటే వినవేంది? ఏమయినా సరుకుదించి లారీ కెత్తాల్సిందే! లేకపోతే మాకు లారీ కిరాయి దండగవుద్ది!" దూకుడుగా అన్నాడు రామస్వామి.

"నీకు కిరాయి దండగే. నాకు మాటపోద్ది! ఏమయినా మురుగుల రంగయ్యశెట్టి చెపితేనే సరుకెత్తేది."

"ఏందయ్యా పెద్ద నకరాజేత్తన్నావ్!"

"నువ్వెవడవయ్యా, అసలు నన్ను సరుకు దించమంటానికి?"

మాటామాటా పెరిగి చెయ్యి చెయ్యి కలిసేదాకా వచ్చింది. రేవులోవున్న కళాసీలు సరంగులూ చుట్టూ మూగారు.

అదిచూసి రామస్వామి జారుకొన్నాడు. కాసేపటికి అతడి వెనక లారీకూడా కన్పించలేదు.

"దొంగనాయాల! నన్ను బురిడీ కొట్టించాలనుకున్నాడు. ఏమాలితే యింకేమయినా వుందా?" ఈ(రాజు పడవెక్కి జరిగిందంతా గౌరికి చెప్పాడు.

ఈ(రాజు తెలివికి, జాగ్రత్తకు గౌరి మురిసిపోయింది.

ఈ(రాజు తిరిగొచ్చేసరికి కూడొండి సిద్ధంగా ఉంచింది. ఇద్దరూ ఎదురుబొదురుగా కూర్చొని రొయ్యలపులుసు కలుపుకొని తిన్నారు.

"పాపం! సత్తిరాజు మామకు అళ్లు కూడెట్టారో లేదో? ఎట్టా ఉండాడో ఏందో మరి?" అనుకున్నది గౌరి.

రాత్రి తొమ్మిది గంటలవుతుంది. సరంగులంతా పడవల మీద పడుకొని పాటలు పాడుకుంటున్నారు. గౌరి తనకూ ఈర్రాజుకు పక్కలు పరిచింది. తన పక్కమీద పడుకొని "యీరూ! వచ్చి పడుకో. రోజంతా కష్టపడ్డావ్!" అన్నది.

గౌరిమాట వింటూనే ఈర్రాజుకు రక్తం ఉడుకెక్కిపోయింది. తనపక్క గౌరికి దగ్గరగా లాక్కున్నాడు.

"దూరం, దూరం ఈర్రాజు మామా! నువ్వు మాట తప్పుతున్నావ్. నీతి తప్పుతున్నావ్. ఇట్టయితే నువ్వు పందెంలో ఓడిపోయినట్టే మరి! నేను సత్తిరాజు మామకు పెళ్ళాన్నవుతాను. నీకు దక్కనుగాక దక్కను. ఆలోచించుకో మరి!"

ఈర్రాజు బారెడుదూరంగా పక్క లాక్కున్నాడు.

"ఏందోనే గౌరీ ఉడుకురక్తం, ఎన్నెల, కొర్రమీనులాంటి పిల్ల పక్కనుంటే అట్లా అనిపించింది. ఇదుగో, చెవులు పట్టుకొని గుంజీళ్లు తీస్తున్నా చూడూ!" నాలుగుపుంజీలు గుంజీళ్ళు తీసి పక్కమీద వెల్లికలా పడుకున్నాడు.

కన్ను మూతడపడిందో లేదో లారీరొద విని లేచికూర్చున్నాడు. ఈర్రాజు. లారీ హెడ్‌లైట్ కాంతికి కళ్లు చిదతలారిపోతున్నాయి.

"ఎవరదీ?" అంటూ ఈర్రాజు పడవ దిగొచ్చాడు. గౌరి లేచి పడవమీద నిలబడి చూస్తున్నది.

"ఈర్రాజువు నువ్వేనా?"

"అవున్నేనే ఏందంటా?" చిరాకు పడిపోయాడు. లోలోపల ఏదో తెలియని భయం తరుముతూ వుంది.

"ఇదుగో! యీరు ఉంగరాల బంగారయ్యగారు, పట్నం వ్యాపారి, కొబ్బరికాయల వ్యాపారం, టోకుగా కొంటారు. అమ్ముతారు. మురుగుల శెట్టికూడా యీయనే అమ్ముతాడు." లావుగా పొట్టిగా ఉన్నవాడొకడు గుండ్రంగా పెద్ద బొజ్జతో ఉన్నాయన్ను చూపించి చెప్పుకుపోతున్నాడు.

"అయితే ఏందంటా?" కటాబిటిగా అన్నాడు ఈర్రాజు.

"కొబ్బరికాయల సరుకు కొంటానికొచ్చారు బంగారయ్యగారు."

"ఆ సరుకు శెట్టిగారిదయితే నేనెట్టా అమ్ముతాను?"

"శెట్టిగారికి కొబ్బరికాయలకు బదులు రొక్కం ఇచ్చేయొచ్చు. చిల్లరధర కొబ్బరికాయ అణా! టోకుగా అయితే రూపాయికి ఇరవై. నీకు తెలుసుగా – ఐదుకు వంద, ఏభైరూపాయలకు వెయ్యికాయ. వంద తీసుకొని సరుకిచ్చేయ్. ఏభై శెట్టికిచ్చి ఏభై నీ లాభంగా వుంచుకో." అతడు చెప్పుకు పోతూంటే అయోమయంగా చూశాడు ఈర్రాజు.

"బంగారయ్యగారికి అర్జంటుగా కావాలిసి వచ్చింది. విదేశాలకు ఎగుమతి చేయాలి కొబ్బరికాయ. అందుకని ఇబ్బడి రేటుపెట్టి కొంటున్నారు."

ఈలోపల గౌరి పడవ దిగివచ్చింది. పక్కపడవలవాళ్లు మెల్లమెల్లగా లేచి కళ్ళు నులుపుకొని వింతగా చూస్తున్నారు.

"ఆఖరిమాట ఇంకో వంద!" ఉంగరాల బంగారయ్య అన్నాడు.

"బంగారయ్యగారూ, ఈర్రాజు మొహమాటం మనిషి! శెట్టిగారికెలా చెప్పాలని ఆలోచిస్తాన్నాడు. ఇచ్చేయండి ఐదొందలు. శెట్టి కావాలంటే ఇంకో వంద యిచ్చి నచ్చ చెప్పుకుంటాడు ఈర్రాజు."

బంగారయ్య మొలనవున్న కాయితంపొట్లం తీసి వందరూపాయలనోట్లు ఐదు ఈర్రాజు చేతిలో బలవంతంగా పెట్టాడు.

ఈర్రాజు మంత్రముగ్ధుడయిపోయాడు.

వందరూపాయలనోటు జన్మలో ఒక్కసారే చూశాడు.

అది మురుగుల శెట్టి చూపించాడు. అదీ తన చిన్నతనంలో అయ్యవెంట సరుకేసుకొచ్చినప్పుడు.

ఇంతవరకూ వందరూపాయల స్పర్శ తెలియదు. చిన్నతనంలో ముట్టుకుచూడాలని ఆశపడ్డాడు. అది సాక్షాత్తు లచ్చిందేవిరా, నీలాటోళ్లు ముట్టుకుంటే మైలపడిపోతుందన్నాడు.

ఇప్పుడు తన చేతుల్లో ఐదుగురు లచ్చిందేవులు. ఈ లచ్చిందేవుల్ని శివయ్య మామకిస్తే తనకు గౌరి దక్కుతుంది.

మెత్తబడిపోతున్నాడు ఈర్రాజు. జావకారిపోతున్నాడు, చమటలు పట్టినై.

ఇందులో తనేం తప్పుచెయ్యడంలేదు. శెట్టి జేసేది యాపారమే! ఇప్పుడిదీ యాపారమేగదా!

"ఒరేయ్ హమాలీలూ, సరుకు దించండిరా." ఉంగరాల బంగారయ్య కేకవిని ఉలిక్కిపడ్డాడు.

కళ్ళముందు తారట్లాడుతున్న లచ్చిందేవమ్మలు మాయమై, గౌరమ్మ ఎదురుగా కళ్ళముందు కన్పించింది.

ఈర్రాజు ఐదొందలూ ఉంగరాల బంగారయ్యమీదకు విసిరాడు.

"నువ్వు నాయెత్తు బంగారమిచ్చినా సరుకమ్మను. ఈ సరుకు మురుగుల రంగయ్యగారిది. ఆరే అమ్ముకోవాలి. అమ్ముకున్నా, దాసుకున్నా ఆరే చేయాలి. మీ రెల్లండి!" గిర్రున తిరిగి పడవెక్కాడు. ఈర్రాజును చూసి గౌరి గర్వపడింది. సరంగులూ రేవుపనివాళ్ళూ ఆశ్చర్యపోయారు. ఇంత నీతిమంతులు యింకా వున్నారా? ఐదొందలు-ఏభై రూకలు సరుక్కు ఐదునూర్లు! ముక్కులు నలుపుకున్నారు కళాసీలు.

ఉంగరాల బంగారయ్యతోపాటు అతనివెంట వచ్చినవాళ్ళంతా బిలబిలా లారీ యెక్కారు. ఆ ఎక్కుతున్నవాళ్ళల్లో ఒకడు ముఖంమీదుగా రంగుగుడ్డ చుట్టుకొని ఉన్నాడు. వాడ్ని ఎక్కడో చూసినట్టుంది. ఈర్రాజుకు. వాడినే చూస్తూ ఉన్నాడు. వాడు లారీలోకి దూకేసరికి తలగుడ్డ ఊడి భుజానపడింది.

వాడే వాడే సింగినాదం రామసామిగాడు! ముందొచ్చి సరుకు శెట్టిగాడు తెమ్మన్నారు అన్నాడు. ఇప్పుడీళ్ళతో వచ్చాడు?

ఏందీ గొడవ?

ఏందీ అయోమయం?

ఈశ్రాజు బుర్ర చేపలపులుసులా కుతకుతా ఉడికిపోయింది.

గౌరికి అల్లంతదూరంలో పక్కమీద పడుకున్నాడు. ఆలోచనలు తెగడంలేదు అసలీ పందెం ఏందీ? ఆడు పడవలో చావడమేమిటి? ఈడొచ్చి ఈ కొబ్బరికాయలు యింత బెట్టి కొంటానంటమేంటి? ఈ కొబ్బరికాయల్లో ఏముంది? మామూలు కొబ్బరికాయలే గందా? ఈశ్రాజుకు మెదడులో హఠాత్తుగా మెరుపు! ఆ మెరుపులో గుడిలోనుంచి చేత్తో పట్టుకుని గుడిమెట్లమీద పరుగులు తీస్తున్న సన్యాసి కళ్ళముందు కదిలాడు.

అవును, ఆ సన్యాసి తెచ్చిన కొబ్బరికాయ ఏమయింది?

దిగ్గునలేచి కొబ్బరికాయలు నింపిన తొట్టిలోకి దిగాడు. దీపం బుడ్డి వెలగించి వెతుకుతున్నాడు. ఆ కొబ్బరికాయ, వచ్చిన సన్యాసి తెచ్చిన కాయ! వెయ్యికాయల్లో అదేది? కాయల్లో కలిసిపోయింది. పోలీసోళ్లు కాయలన్నీ కెలికేసి తిరగేసి పడవంతా వెతికారు. అందులో కలిసిపోయింది. దాని కోసమే సన్యాసిని వాళ్లు చంపింది. దానికోసమే ఉంగరాల బంగారయ్య వొచ్చింది. సింగినాదం రామస్వామి! అన్నీ దొంగపేర్లు, దొంగనాటకం, మోసం! ఆ కొబ్బరికాయలో ఏముంది? ఏదీ అది?

వెర్రిగా వెతుకుతున్నాడు. ఒక్కోటి తీసుకొని మళ్ళీ విసిరేస్తున్నాడు. కొబ్బరికాయల తొట్టిలో కాళ్లు దిగబడి పోతున్నాయి జారిపోతున్నాడు, పైకెక్కుతున్నాడు.

"ఏంది మామా? ఎతుకుతున్నావ్?"

ఉలిక్కిపడ్డాడు. తల పైకెత్తి చూశాడు.

గౌరి పైన నిలబడి తొట్టిలోకి చూస్తూ కన్పించింది.

"ఏం లేదు."

"ఏంది యీశ్రాజూ, ఏదో వెతుకుతున్నావుగా? ఏమీ లేదంటావేం?"

"కొబ్బరికాయ!"

"దాహమేస్తుందా? ఆకలేస్తుందా? అన్ని కాయలుంటే వెతుకుతావేంటి?"

"ఆ కొబ్బరికాయ!"

"ఏ కొబ్బరికాయా?" కళ్ళు చిట్లించింది గౌరి.

"సన్నాసి కొబ్బరికాయ!"

"సన్నాసి కొబ్బరికాయా!" గౌరి కనుబొమ్మలు ముడి పడ్డాయి.

"అదే! అదే!!"

"అందులో ఏముంది?"

"తెలియదు."

"సర్లే, పైకిరా నీకే చెప్పేది."

"అది ఇక్కడే వుంది! అది యిందులోనే వుంది. దానికోసమే ఇంతమంది–"

"నీకేమన్నా పిచ్చా?"

"ఆ పిచ్చే, కొబ్బరికాయ పిచ్చి!"

"చాల్లే సంబడం! నోరు మూసుకొని పైకొచ్చేయ్!" గౌరి ఈశ్రాజు చెయ్యిపట్టుకొని పైగి గుంజింది.

వచ్చి పడుకున్నాడు. నిద్ర పట్టడంలేదు. రపా రపా పేలిపోతున్నాయి. వేయి కొబ్బరికాయలు పగిలిపోయినై ఈర్రాజు బుర్రలో-

అవన్నీ పగలగొట్టి చూస్తే! వెయ్యి కొబ్బరికాయల పీచు తీయాలంటే ఒక్కడికి మూడురోజులు పడుతుంది. ఈ రాత్రికి రాత్రి పడవను ఎక్కడికన్నా తీసుకెళితేనో-

"ఏంటిమామా? నిద్రపోలేదా?"

గౌరి గొంతు వింటూ ఈ లోకంలోకొచ్చాడు ఈర్రాజు.

ఛ! ఛ! తనేంటి యిలా అయిపోయాడు? గౌరిని మనువాట్టానికి పందెం ఒప్పుకున్నాడు. నీతిగా వుండాలి, న్యాయంగా సంపాదించాలి. మురుగుల శెట్టి సరుకు మురుగుల శెట్టికే అప్పగించాలి. ఆరు నూరయినా, నూరు ఐదునూర్లయినా సరే!

"గౌరీ!"

"ఊం!"

"నన్ను మనువాడతావా?"

"ఆడతానో లేదో మరి, అదంతా నీమీదే వుంది. పందెం గెలిచి నన్ను గెలువు."

ఈర్రాజు ఉబ్బిపోయాడు. పక్కకు తిరిగి వత్తిగిలి పడుకున్నాడు. మగత మగతగా మత్తుమత్తుగా నిద్రపట్టింది.

❀ ❀ ❀

గుండెలమీద బరువు, ఏదో తొక్కుతున్నట్టుగా వుంది. కళ్ళు తెరిచాడు ఈర్రాజు.

పీకమీద పట్టాకత్తి.

వెన్నెల్లో వాడిముఖం స్పష్టంగానే కనిపిస్తోంది. వాడే! ఉక్కుగాడు - కర్రోడు. సన్యాసిని వెంటాడినవాడు.

"లే! తెరచాప యెత్తి పడవను యీ రేవు దాటించు. అరిచావో మెడ తెగిపోతుంది." ఈర్రాజును లేపి కూర్చోపెట్టాడు.

తెరచాప కొయ్యకు కట్టిపడేసివున్న గౌరిని చూసి ఈర్రాజు గిలగిల్లాలాడిపోయాడు.

"గౌరిని వదలండి, మీరు చెప్పినట్టే చేస్తాను."

"సరే! అల్లరి చేశారో పీకలు తెగిపోతాయి జాగ్రత్త!"

రెండోవాడు గౌరి నోట్లో కుక్కిన గుడ్డలు తీసి చేతికట్లు విప్పాడు. గౌరి వణుకుతూవచ్చి చుక్కాని పట్టింది. ఈర్రాజు తెరచాప యెత్తాడు.

ఈర్రాజు వెనక పటాకుల రత్తయ్య, గౌరి పక్కన తేళ్ళ గురవయ్య కత్తులుదూసి కూర్చున్నారు.

పడవ రేవు దాటింది.

ఈదురుగాలిగా వుంది. సముద్రంలో తుఫాన్ లేచిందనుకున్నాడు ఈర్రాజు. గాలి ఎడాపెడా వీస్తోంది. తెరచాప తిరగబడకుండా బలంకొద్దీ గుంజిపట్టుకున్నాడు ఈర్రాజు. చుక్కాని పట్టుకొని కాలవకు మధ్యగా పడవ నడిపిస్తూవుంది గౌరి.

చుక్క పొడిచింది.

ఇంకా ఓ జాముపొద్దుందనుకున్నాడు ఈశ్రాజు. వీళ్లు పడవను ఎక్కడకు తీసుకెళుతున్నట్టు? ఎందుకుతీసుకెళ్తున్నట్టు? ఇంకెందుకు – ఆ కొబ్బరికాయకోసమే! అందుకోసమే ఆ సన్యాసిని చంపారు. ఎదురు తిరిగితే తమ పీకలు కోస్తారు.... పక్కనేవున్న పటాకుల రత్తయ్యను చూస్తూ ఆలోచిస్తున్న ఈశ్రాజు కళ్లు జిగేల్‌మన్నాయి. కాలవపక్క రోడ్డుమీద ఆగివున్న హెడ్‌లైట్లు వెలుగు పడవమీద పడింది.

"ఏయ్ నిన్నేరా! సరిగా విను, ఆ లారీ ఆగిందగ్గర పడవను ఒడ్డుకు పట్టించాలి తెలిసిందా?" కత్తి వీపుకు ఆనించి చెవి పక్కన ఊదినట్టన్నాడు.

"అట్టాగా! తెరచాపల్ని దించాలంటే ఇంకో మనిషి ఉండాలి మరి!"

"చెప్పు. నే చేస్తా!"

"మీ చేతగాదు. అడ్డం తిరిగితే పడవ బోల్తాకొట్టుంది. నువ్వు చుక్కాని పట్టుకొని గౌరిని యిటు పంపించు."

"ఓరినీయమ్మ ఇదొకటా! జాగ్రత్త పడవ బోల్తా పడిందో – మీ ఇద్దరు బతుకులు తిరగబడ్తాయి." పటాకుల రత్తయ్య వెళ్ళి చుక్కాని పట్టుకొని గౌరిని పంపించాడు.

గౌరి చెవులో గుసగుసలాడాడు ఈశ్రాజు.

సరే సరే అన్నట్టు తలూపింది.

మరుక్షణంలో తెరచాపలు టపటపలాడాయి. వెనక్కూ ముందుకూ కొట్టుకున్నాయి.

నిండుపడవ తిరగబడింది.

ఈశ్రాజూ, గౌరీ కాలువలోకి దూకారు.

కాలవంతా కొబ్బరికాయలతో నిండింది.

నిండుగా ప్రవహిస్తున్న కాలవలో వెయ్యిన్నొక్క కొబ్బరికాయలు తేలి కొట్టుకుపోతున్నాయి.

ఈశ్రాజు ఒడ్డెక్కి గౌరి కోసం చూశాడు. ఖంగారుపడి కాలవలో చూశాడు. గౌరి జాడలేదు. ఆవలి ఒడ్డుకేసి చూశాడు. గౌరి కట్టదిగి చేలకు అడ్డంపడి పరుగెత్తడం వెన్నెల్లో కన్పించింది ఈశ్రాజుకు. మళ్ళీ కాలవలోకి దిగి యీది అవతల ఒడ్డుకు చేరుకోవాలన్న ప్రయత్నంలో వున్న ఈశ్రాజుకు కాలవలోనుంచి కట్టయెక్కి తనవైపే వస్తూన్న పటాకుల రత్తయ్య కన్పించాడు.

ఈశ్రాజు తిరిగి చూడకుండా కట్టదిగి చేలకు అడ్డంపడి పరుగుతీశాడు.

# 10

గౌరి తెలతెలవారేదాకా చెట్టూ, పుట్టా, గట్టూ, గనెందాటి పరుగులు తీసింది. అరటితోటలోకి చేరి అలుపుతీర్చుకుంటూ చుట్టూ కలయజూసింది.

తనను వెంబడిస్తున్న టపాకుల రత్తయ్య ముఠావాళ్లు కనుమరుగు అవడంతో దీర్ఘంగా నిట్టూర్చింది. అరటిచెట్టు బోదెకు నడుం ఆనించి, చతికిలబడి కూర్చుని సేద దీర్చుకోసాగింది.

జరిగిందంతా ఓ పీడకలలా అన్పించింది.

ఈర్రాజు ఏమయ్యాడు?

సత్తిరాజేమయ్యాడు?

ఆ సత్యాన్వేషణ ఏమిటి?

ఆ కొబ్బరికాయేమిటి?

అసలీగొడవంతా ఎందుకొచ్చినట్టు? బుద్ధి గడ్డితినకపోతే ఈ పందానికి తను ఎందుకు వప్పుకున్నట్టు?

ఈరిగాడో, సత్తిగాడ్నో - ఎవడ్నో ఒకడ్ని కట్టుకొనివుంటే అసలు యీ తిప్పలు వుండేవి కాదుకదా?

అరటితోట బయట అలికిడి అయినట్టుగా తోచింది గౌరికి.

గాలి కుంభించి అరటిబోదెకు చుట్టుకుపోయింది.

గుండె గొంతులోకి వచ్చి ఆగినట్టుగా వుంది.

మెల్లమెల్లగా మనుషుల మాటలు విన్పిస్తున్నాయి.

అరటి ఆకుల్ని పక్కకు తోసుకుంటూ, తోట చాళ్ళ మధ్యగా నడిచివస్తోన్న తేళ్ళ గురవయ్య కన్పించగానే ప్రైప్రాణం పైనే పోయినట్టుగా అయింది గౌరికి.

గురవయ్యతోపాటున్న ఇద్దరు తోటంతా గాలిస్తూ చూస్తున్నారు. అందులో ఒకడు తనవైపే రావడం గమనించిన గౌరి చివ్వున లేచి నిలబడింది.

సాహసే లక్ష్మి!

పరుగు లంకించుకుంది.

"ఒరే! జగ్గూ, వెంకూ - చూస్తారేంటిరా నీయమ్మ. పట్టుకోండి. ఇటు - ఇటు పరిగెత్తిందిరా!" అరుస్తూ తేళ్ళ గురవయ్య తోటలోనుంచి బయటకు పరుగుతీశాడు.

మరుక్షణంలో జగ్గూ, వెంకూ రెండోవైపునుండి తోట బయటకు వచ్చారు.

అప్పటికే గౌరి డొంకనపడి పరుగులు తియ్యడం కనిపించింది.

ముగ్గురూ గౌరివెంట పడ్డారు.

"మొద్దుముండాకొడుకుల్లారా! పిల్లముండపాటి పరిగెత్తలేరట్రా?" నోరుతెరచి గాలిపీలుస్తూ అరిచాడు గురవయ్య.

రోజూ లీటరుసారా, ఐదు బీడీకట్టలు దమ్ముపీల్చే తేళ్ళ గురవయ్యకు కళ్లు బైర్లుకమ్ముతున్నాయి పరుగెత్తలేక.

ఎగశ్వాస, దిగశ్వాసగా కాగా, గురవయ్య రొప్పుతూ, రోస్తూ "రేయ్! కొడకల్లారా! దీన్ని పట్టుకొని బాస్‌కు అప్పగించలేకపోయారో, టపాకుల రత్తయ్య మీ తలకాయల్ను కొబ్బరి బొండాల్ని చెక్కినట్టు చెక్కుతాడ్రా. లగెత్తండి! పట్టుకోండి" అని అరిచాడు.

"నిన్ను మాత్రం వదులుతాడా ఏంటి? నీ వళ్లు కొబ్బరి తురిమినట్టు తురుమడా ఏంటి?" పరిగెత్తుతూనే వెనక్కు తిరిగి అన్నాడు జగ్గు.

"ఎంత ధైర్యంరా నీకు నన్ననడానికి? నీ గుండెల్లో నిద్రపోతారా కొడకా!" గురవయ్య అరిచాడు.

"ఇప్పుడుమాత్రం ఆ పని చెయ్యకు చిన్నబాస్! పెద్దబాస్ కొబ్బరికాయ పీచు తీసినట్టు నీ తాట వలిచేస్తాడు" అన్నాడు వెంకుగాడు వెనక్కు తిరక్కుండానే.

ముగ్గురూ డొంకదాటి రోడ్డువైపుకు పరుగుతీశారు.

అప్పటికే గౌరి రోడ్డెక్కింది.

రోడ్డుమీద కొంతదూరం పరిగెత్తి ఆగిచూసింది.

గురవయ్యా, జగ్గూ, వెంకూ అప్పుడే రోడ్డెక్కుతున్నారు.

వాళ్ళు తనను వదిలేట్టు లేరు. తను ఇహ పరిగెత్తలేదు. ఏం చెయ్యాలి?

ఏదో ఒకటి చెయ్యాలి – తప్పదు.

అదే! ఏం చెయ్యాలి?

ఆలోచిస్తూ నిలబడ్డ గౌరికి రోడ్డుమీద వస్తున్న లారీ కనిపించింది.

రోడ్డుకు అడ్డంగా నిలబడి రెండుచేతులూ యెత్తి ఊపింది.

లారీ 'కజ్' మని ధ్వనిచేస్తూ ఆగింది.

లారీడ్రైవరు కిందకు దిగి ఎక్కమన్నట్టుగా సైగ చేశాడు.

గౌరి ఎక్కడానికి ప్రయత్నిస్తుంటే డ్రయివర్ చెయ్యి అందించి పైకి గుంజాడు.

గౌరి లారీలో డ్రయివరువక్కన కూర్చుని కృతజ్ఞతాభావంతో చూసింది. గుండెలనిండా గాలి పీల్చుకుంది.

లారీడ్రైవరు నూనూగుమీసాలకింద పెదవులపైన, కోడెత్రాచు విడిచిన కుబుసంలా నవ్వు కదిలి విరిగిపోయింది.

"ఊఁ పోనియ్! త్వరగా పోనియ్!" పక్కకు తిరిగి డ్రయివర్‌ను చూసింది గౌరి.

అతడ్ని చూసిన గౌరి అలాగే చూస్తూ వుండిపోయింది.

అంతవరకూ అతడ్ని పరికించి చూడని గౌరి బుగ్గలు ఎర్రబడ్డాయి. అతడు ఆమెవంకే కన్నార్పకుండా చూస్తున్నాడు.

అంత అందగాడ్ని గౌరి అంతవరకూ చూడలేదు.

గళ్ళచారల బనీనూ, మెడకుచుట్టిన ఎర్రతువ్వాలూ, అచ్చం బయస్కోపులో చూసిన కథానాయకుడిలా వున్నాడు.

"ఏంటిపిల్లా! అంత తొందర?"

అతడిగొంతు వింటూనే గౌరి అదోలా అయిపోయింది.

"వాళ్ళొచ్చారంటే నన్ను లాక్కు పోతారు." గుటకలు మింగుతూ అన్నది గౌరి.

"వాళ్ళబ్బతరంకాదు. అంజిగాడంటే ఏంటనుకున్నావ్?"

"నిన్నూ, నన్నూ ఇద్దర్నీ చంపేస్తారు. నీకు పుణ్యం వుంటుంది, తొందరగా పోనియ్."

"ఏందిపిల్లోయ్! బెదిరిపోయినట్టున్నావ్? నా తడాకా చూపించమంటావా? ఏరీవాళ్ళు? ఎక్కడున్నారు?" లారీ హాండిల్ అందుకొని డోర్ తెరిచాడు.

కిందకు దిగబోతున్న అతడిచెయ్యి పట్టుకొని గౌరి అతడికేసి ప్రాధేయపూర్వకంగా చూసింది.

ఆ చూపులకు అతగాడు కరిగిపోయాడు.

ఇంజను స్టార్ట్ చేశాడు.

లారీ కదిలింది.

గౌరి గుండెలు తేలకపడ్డాయి.

వంగి బయటకు తొంగిచూసింది.

అప్పుడే తేళ్ళ గురవయ్యా, జగ్గూ, వెంకూ రోడ్డుమీదకు వచ్చారు.

సాగిపోతున్న లారీవెనక చేతులెత్తి అరుస్తూ పరుగులు తీస్తున్నారు.

గౌరి వాళ్ళకు 'టాటా' చెపుతున్నట్టుగా చెయ్యివూపి నవ్వింది.

లారీ శరవేగంతో రొదచేస్తూ ముందుకు దూసుకుపోతున్నది.

లారీ లేపినదుమ్ములో కలిసిపోయారు వెనక పరిగెత్తుకొస్తున్నవాళ్ళు.

గౌరి మనసు స్థిమితపడింది. ప్రమాదం తప్పింది. ఓరగా డ్రయివర్‌కేసి చూసింది.

"నీ పేరేంటన్నావ్?"

"ఆంజనేయులు. అంజిబాబంటారు." ఒకచేత్తో స్టీరింగు పట్టుకొని, రెండోచేత్తో మెడకుచుట్టుకొన్న తువ్వాలును సర్దుకుంటూ చెప్పాడు.

"ఇంతకూ నీ పేరేంటో?" అంజిబాబు తలతిప్పి గౌరిని చూశాడు.

"గౌరీదేవి, అందరూ గౌరి అంటారు."

"పేరు మంచిగా వుందిలే."

"ఏం, నేను బాగాలేదా?"

"తస్సాదియ్యా! నువ్వు బాగోపోతే ఇంకెవరు బాగుంటారంటా?" ఎదురుగా వచ్చిన లారీని తప్పుకొంటూ అన్నాడు అంజి.

గౌరి ముసిముసిగా నవ్వుకొన్నది.

"ఇంతకీ ఏందికత? ఏ వూరి మీది? ఎందుకిట్టా పరిగెత్తుకొస్తున్నావ్? అళ్ళు నీ కోసం ఎందుకు? వెంటబడ్డారు"

"శానా కతుంది. అవన్నీ ఇప్పుడెందుకులే!" సాగదీస్తూ అన్నది గౌరి.

"ఓహో! పిట్ట కొంచెం కూత మాలావుగా వున్నట్టుందే నిన్ను చూస్తుంటే! అసలు నీ సంగతేంటి?"

"పిట్టా గిట్టా అన్నావంటే ఊరుకొనేదిలేదు. నే నెవర్ననుకొన్నావ్?"

"ఎవరేంటి?"

"గవరయ్య కూతుర్ని. గంగపుత్రుల కులపెద్ద మా అయ్య గవరయ్య. తెలుసుకో!"

"ఓసోసి. శానావుందే నీ కత? అయితే ఎందుకు పారిపోయివస్తున్నావ్? ఇష్టంలేని మనువాడమన్నాడా మీ అయ్య?"

"అదేంలేదు. ఇష్టమయినవాడ్ని మనువాడమంటేనే ఇన్ని తిప్పలొచ్చాయి,"

"సిత్రంగా వుందే యిది!"

"సిత్రమా? ఇసిత్రమా? ఈ కత సెపితే శానా వుంది."

"చెప్పుమరి!"

"ఓ డ్రయివరుబాబూ! అదంతా నీ కెందుక్కాని. నువ్వు బండి బేగితోలు."

అంజిబాబు బ్రేకునొక్కి బండి అపాడు.

గౌరి ఖంగారుగా చూసింది.

"ఏంది పిల్లోయ్! నాతో పరాచికాలాడుతున్నావా? దిగు బండి."

అంజి గౌరి చెయ్యి పుచ్చుకుని తోశాడు.

"అంజిబాబూ! ఏంది? ఆడకూతుర్ని ఇంత అన్యాయం చేస్తావా? ఇప్పుడు దిగిపోమ్మంటే నే నెక్కడకు పోతాను? ఆ ముదనష్టపొళ్లు ఇంకా నా వెనక పరిగెత్తుకొస్తున్నారో ఏమో?"

"అయితే చెప్పు. ఆళ్లు నీయంట ఎందుకు పద్తున్నారు?"

"సెప్తాగాని! ముందు బండి తొందరగా తోలు."

లారీ సాగింది మళ్ళీ రొదచేస్తూ."

........

జీపు డ్రయివర్ సడన్‌బ్రేకు వేశాడు.

నేను ముందుకు తూలిపడ్డాను.

చేతిలోవున్న కాగితాల బొత్తి జారి జీపులో పడింది.

"మేడమ్! జాగ్రత్త!"

పక్కన కూర్చునివున్న కల్పన నన్ను పట్టుకొన్నది.

"ఎదురుగా లారీ వస్తోంటే కన్పించలేదా? దగ్గిరకొచ్చాక సడన్ బ్రేకు వెయ్యకపోతే ముందే స్లో చేసుకోకూడదూ?" డ్రయివర్ని మందలించి కల్పన నావైపు తిరిగి ముఖంలోకి చూసింది.

"మేడమ్! దెబ్బ తగ్గల్లేదుగదా?"

నుదురుమీద చేత్తో రుద్దుకుంటూ తల పైకెత్తాను.

కల్పన వెంటనే నా నుదుటిమీద చెయ్యివేసి నిమురుతూ నా కళ్ళల్లోకి చూసింది.

ఆమె హస్తస్పర్శ నేను యీ జన్మలో మర్చిపోలేనిది. ఆ హస్తస్పర్శలో వున్న స్నేహభావమూ, అప్యాయతా, అనురాగం – ఓహో – ఆ అనుభూతి జీవితాంతం హృదయ కుహరంలో దాచుకోవాలన్న ఆకాంక్షతో నిర్మలమైన కల్పన కళ్ళల్లోకి చూశాను.

అప్రయత్నంగా నా కళ్లు ఆర్ద్రం అయ్యాయి.

"అదేమిటి? ఏమిటి మేడమ్?" కల్పన తల్లడిల్లిపోయింది.

"నథింగ్ హాపెన్డ్. ఐయామ్ ఓ.కే."

కల్పన నిట్టూర్పు విడిచింది.

ఆమె కళ్ళల్లో కొబ్బరాకులమీద జారిపడుతున్న ఉదయభానుడి అరుణకిరణ కాంతులు జాలువారాయి.

"నీ కిచ్చిన ప్రామిస్ బ్రేక్ అయింది. దానికి కారణం నువ్వేమరి!" సీట్లో సర్దుక్కూర్చుంటూ అన్నాను.

"ఏమిటా ప్రామిస్?" కల్పన కళ్లు మిలమిల్లాడాయి.

"ఈ కథ చదవడం పూర్తి అయేవరకూ నేను మాట్లాడకూడదని ఆంక్ష పెట్టావుగదా?" అన్నాను.

"యస్! యస్ మేడమ్! గుర్తుంది. అయితే ప్రతి రూలుకు ఎక్స్‌ప్లయిన్ ఉంటుంది."

"ఉంటే? నువ్వు నాకు ఎక్స్‌ప్లయిన్ యిచ్చావన్నమాట?"

"ఆc! ఇచ్చేశా!" తల ఎగరేసింది కల్పన.

"గుడ్! అయితే విను."

కల్పన విస్మయంగా చూసింది.

కల్పనను ఏదోరకం ట్రాప్ చెయ్యగలిగాననే సంతోషంతో మొదలుపెట్టాను.

"ఒక అమ్మాయి, ఇద్దరబ్బాయిల కథలో మూడో పాత్ర ప్రవేశించింది."

"అవును."

"సత్తిరాజూ, ఈశ్రాజులతో పాటూ ఈ అంజిగాడు కూడా కథలోకి దిగుతాడా ఏం?" అన్నాను.

"ఏం అలా ఎందుకనుకోవాలి? అంజిబాబు విలన్ ఎందుకు కాకూడదూ?"

"అంత అందగాడూ, మంచివాడూ విలన్ ఎలా అవుతాడూ?"

కల్పన నా ప్రశ్నకు పకపకా నవ్వింది.

"ఏమిటి మేడమ్! అందగాడూ, మంచివాడూ విలన్ కాకూడదనే రూలు ఎక్కడన్నా వుందా?" నవ్వు ఆపుకుంటూ అన్నది కల్పన.

నాకు నిజంగానే బుర్ర కదిలిపోయినట్టుగా అయింది.

కల్పన అన్నదాంట్లో చాలా తర్కం వుంది.

వాస్తవికత వుంది.

"మరి పేరు అంజిబాబు అని పెట్టావేం?" దీనికి ఏం సమాధానం చెపుతుందో వినాలనే అన్నాను.

"దుర్మార్గుడూ, క్రూరుడూ అయిన వాడిపేరు భయంకరంగానూ, కర్ణకఠోరంగానూ ఉండాలని లేదు.

చరిత్రలో, ఇతిహాసాల్లో పుక్కిటి పురాణగాథల్లోని నాయకుల పేర్లు సాంఘిక యితివృత్తాల్లో, అటూయిటూ మార్చి, విలన్‌లు అనబడే పాత్రలకు పెట్టడం, ఈనాటి రచయితలూ, రచయిత్రులూ చేస్తున్నపనే. నరకాసురుడి పేరుకంటే నాకు బలిచక్రవర్తి పేరే భయంకరంగా విన్పిస్తుంది. కాని ఆ పాత్రల వెనకవున్న కథా కమామీషునుబట్టి నరకాసురుడనగానే భయంకరంగానూ, బలిచక్రవర్తి అనగానే సౌమ్యంగానూ, మనసుమీద ముద్ర పడిపోతుంది. ఇకపోతే మేడమ్! వింటున్నారా లేదా?" అని ఆగి నావైపు చూసింది కల్పన.

"గో ఆన్!"

ప్రోత్సహిస్తూ అన్నాను.

"మంచిపాత్రలనీ, చెడ్డపాత్రలనీ వేరువేరుగా వుండవనే నా అభిప్రాయం. ప్రతి మనిషిలోనూ మంచీ చెడూ వుంటాయి. ఆ మంచీ చెడుల విలువలు కాలాన్ని బట్టి మారుతూ వుంటాయి. మారుతున్న సమాజంలో మారని విలువలంటూ వుండవు. ఒకే కాలంలో, ఒకే సమాజంలో, ఒకే క్రియకు వేరు వేరు అర్థాలు, అన్వయాలు ఉన్న సందర్భాలుకూడా లేకపోలేదు. పొరుగింటివాడ్ని ఒకడ్ని చంపితే హత్య! పొరుగు దేశంవాళ్ళను వందమందిని చంపితే దేశభక్తి. అవునా మేడమ్?"

"ఊఁ కానియ్!" ఇంకా వినాలనే కుతూహలంతో అన్నాను.

"ఆడదాని శీలాన్ని అనుమానించేవాడు రాముడైతే దేముడెలా అవుతాడు?" ఆగి నా ముఖంలోకి చూసింది కల్పన.

"ఊఁ! గో ఆన్!" ప్రోత్సహిస్తున్నట్టు అన్నాను.

"సీతను తెచ్చి లంకలో పెట్టిన రావణుడు ఆమెను బలత్కారం ఎందుకు చెయ్యలేదూ?"

"నువ్వే చెప్పు!"

"ఆమెను అనుభవించడానికి రావణుడికి అడ్డేంవుంది? అయినా రావణుడు సీత తనకుతానై మనసిచ్చి అర్పించుకుంటుందేమోనని వేచివున్నాడేగాని బలవంతం చెయ్యలేదే? దశరథుడికి మూడువేలమంది భార్యలుంటే తప్పులేదు. రావణుడికి మండోదరి ఒక్కత్తే భార్య. సీతను రెండోభార్యగానో – నో – జస్టేమినిట్! అనదర్ బ్రిలియంట్ ఐడియా!"

"ఊఁ! చెప్పుతల్లీ! నిన్నాపడం ఎవరితరం?" పెదవి బిగించి అన్నాను.

"అసలు రావణుడికి సీతమీద మోజు లేదు."

"అలాగా?" నాకు నవ్వొచ్చింది.

"అవును మేడమ్! అంతే!"

"మరెందుకు సీతను ఎత్తుకెళ్ళాడు?"

"రామలక్ష్మణులు తన చెల్లెలు శూర్పణఖకు చేసిన అన్యాయానికి ప్రతీకారంగానే రావణుడు సీతను యెత్తుకెళ్ళాడు. రావణుడు కూడా రాముడు చేసినట్టే సీత ముక్కూ చెవులూ కోసివుంటే?"

"ఊఁ – కోసివుంటే? ఆగావేం? చెప్పు!"

"ఈనాడు గుళ్ళల్లో అందాలరాముడిపక్కన ముక్కూ చెవులూ నరకబడిన సీతమ్మవారి విగ్రహం వుండేది. అవునా మేడమ్! స్త్రీమూర్తి రూపాన్ని అందవికారంగా చెయ్యడం అన్యాయం కాదా? అమానుషం కదా? దానవత్వం కాదా?" ఆవేశం అడ్డొచ్చి ఓ క్షణం ఆగి మళ్ళీ అందుకున్నది కల్పన.

"అందమైన శూర్పణఖను వికృతంగా చేసిన రాముడు దేవుడా? అందమైన ఆడపిల్లల ముఖం మీద యాసిడ్ చల్లే దుర్మార్గులకూ, ఆ రామలక్ష్మణులకూ తేడా ఏమిటి మేడమ్?"

"కల్పనా!" ఎంత ప్రయత్నించినా నా అసహనాన్ని అణుచుకోలేకపోయాను.

"యస్! మేడమ్!" కల్పన గొంతు తగ్గించి మెల్లగా అన్నది.

కల్పన తెలివైనది.

ఇట్టే పట్టేస్తుంది ఎదుటివాళ్ళ మనసును.

"నువ్వింతవరకూ చెప్పిన రామాయణం మీద ఆంధ్రదేశంలో ఉత్తరకాండ తర్వాత మరో రెండు ఖండన ఖాండన భాండాలు నడిచాయి. వాటి ప్రభావం ఎంతో కొంత నీమీద ఉన్నట్టుంది."

నా మాట పూర్తికాకుండానే కల్పన అందుకున్నది:

"తనమీద ఏ ప్రభావం లేదని చెప్పుకొనేవాళ్ళ మాటల మీద నాకు అంత నమ్మకంలేదు మేడమ్! అలాగే ఫలానావారి మీదా, ఫలానావారి ప్రభావం పూర్తిగా వుంది అనే మాటలమీద కూడా నాకు నమ్మకం లేదు. మనం విన్నవీ, కన్నవీ, చదివినవీ, అనుభవించినవీ - ఈ అన్నిటి కూడికల తీసివేతల ఫలితాన్ని వ్యక్తి ప్రకృతిలో భాగించితే వచ్చే లబ్ధశేషమే - ఈ సోకాల్డ్ ప్రభావం...."

"అపాపు!" రెండుచేతులతో చెవులు మూసుకొన్నాను.

"చూశారా మేడమ్!"

"ఏమిటి?"

"ఐ ఒన్ యిట్!" కల్పన పకపకా నవ్వింది.

గోదావరి రేగడిభూముల్లో పత్తిచేలు ఊదినట్టుగా వుంది ఆ నవ్వు.

"ఏమిటది?"

కళ్ళజోడు తీసి పైటకొంగుతో తుడుచుకొన్నాను.

"మిమ్మల్ని కన్‌ఫ్యూజ్ చేశానా లేదా?"

"దానివల్ల నీకొచ్చే లాభం?"

"చాలావుంది."

"ఏమిటో అది?"

"మీరు నా కథ...."

"నీ కథా?"

"ఐ మీన్ - నేను వ్రాసినకథ చదువుతున్నారా?"

"తున్నాను. ఐతే?" పుల్లవిరుపుగా అన్నాను.

"వినండి అయితే...."

"చెప్పండి." అదే ధోరణిని అనుకరిస్తూ అన్నాను.

"పాఠకుల్ని ముందు గందరగోళంలో పడెయ్యాలి."

"ఎలా?"

"అర్థం పర్థంలేని పదజాలం వాడుతూ, యాబ్‌స్ట్రాక్ట్ ఐడియాస్‌ను ఏదో ఒక ట్రూ సైన్సుకు ముడివెయ్యాలి. ఇక్కడ మదర్ ఆఫ్ ఆల్ సైన్సెస్ అయిన అర్థమేటిక్ సైన్సుకు లంకె వేశాను. ఇదో పెద్ద టెక్నిక్ మేడమ్!"

"అలాగా!"

"అవును మేడమ్! ఇప్పుడీ టెక్నిక్‌ను చాలామంది అర్థమాన రచయితలు వాడుతున్నారు."

"అర్థమాన రచయితలా?"

"అదే మేడం! వర్థమాన రచయితలు. డబ్బుకోసం రాస్తున్న ఈ వర్థమాన రచయితల్నీ, రచయిత్రుల్నే అర్థమాన రచయితలుగా పేర్కొనడం జరిగింది." అని చిలిపిగా నా కళ్ళల్లోకి చూసింది కల్పన.

నేను మౌనంగా వుండిపోయాను.

"ఎలావుంది మనప్రయోగం?" ఉషారుగా ప్రశ్నించింది.

నవ్వాలో ఏడ్వాలో నాకు అర్థం కాలేదు. అయోమయంగా వుంది.

"అర్థమున్నా లేకపోయినా, అర్థమయినా కాకపోయినా అర్థంకోసం ఆర్థికశాస్త్రంతోనూ, పారాసైకాలజీతోనూ ముడిపెట్టి కథాకథన చేస్తున్న భూత, ప్రేత అర్థమాన రచయితలకున్న డిమాండు మీకుందా చెప్పండి?" నా ముఖంలోకి ఓ క్షణంచూసి మళ్ళీ మొదలుపెట్టింది.

"పుట్టబోయే పత్రికనుంచి గతించబోయే పత్రికల సంపాదకులదాకా, ఈ అర్థమాన 'త' 'త్రి' ల గడపల్లో బిస్తర్లు కట్టుకొని క్యూలో సశేషశయ్యల్లాగా నిలబడుతున్నారన్న సంగతి మీకింకా తెలియనట్టుంది." తలతిప్పి చూసింది.

నేను ముఖంలోకి గాంభీర్యాన్ని తెచ్చిపెట్టుకున్నాను.

"ముప్పై ఆరుకోట్ల తెలుగు పాఠకలోకం–"

"ఆగాగు చిట్టితల్లీ! నాకు నిజంగానే మతి పోగొట్టేశావ్. ముప్పై ఆరుకోట్ల తెలుగువారేమిటి? అన్నగారు ఆరుకోట్లు అంటున్నారుగా?"

"నో కాంట్రడిక్షన్ మేడమ్! ఆరారు ముప్పై ఆరుకోట్లు. ఒక్కొక్కడు ఒక్కొక్క కథ ఆరుసార్లు చదివితే, ఆరుకోట్ల మంది ఆరుసార్లు చదివితే – ముప్పై ఆరుకోట్లు!"

"నీకేమయినా మతిపోయిందా కల్పనా?"

"ముప్పై ఆరుకోట్లమందికి లేనిమతి నాకొక్కదానికే ఉందని చెప్పుకోవడం సాహసమే అవుతుంది. నేనంత అహంకారిని కాదు మేడం!"

గుడ్లప్పగించి కల్పనకేసి చూశాను.

"పోతే మేడమ్! మీ అనుమానం ఒక్కొక్క పాఠకుడూ ఆరుసార్లు ఎలా చదువుతున్నాడనేగా?"

"అవును" అన్నట్టు తల ఊపాను.

"సీరియల్‌గా రాబోయేముందు పాఠకుడు ఒకసారి చదువుతాడు."

నిజంగానే నాకంతా అయోమయంగా వుంది.

"సీరియల్ రాబోయేముందు పాఠకుడు ఎలా చదువుతాడు?" అన్నాను.

"ఎడిటర్ ఫలానా సంచలిత రచయి(త) (త్రి) గారి సంకలిత రచనను గురించి ప్రకటన చేస్తాడు."

"చేస్తే?"

"పాఠకుడు అప్పుడోసారి చదువుతాడు. రెండోసారి సీరియల్ చదువుతాడు. వారం వారం వచ్చే సీరియల్‌లో "జరిగిన కథ"గా మూడోసారి, పత్రిక మొదటి పేజీలో సీరియల్ మధ్యనా వారంవారం ప్రచురించే ఉత్తరాల్లో నాలుగోసారి, పుస్తకంగా వచ్చాక ఐదోసారీ, ఆరోసారి చదువుతాడు."

"పుస్తకం వచ్చాక రెండుసార్లు చదువుతాడా?"

"ఆమాటవస్తే మూడుసార్లుకూడా చదువుతాడు."

"నాకర్థం కావడంలేదు. విడమర్చి చెప్పు."

"ఒకేసారి ప్రథమ ముద్రణ, ద్వితీయ ముద్రణ, తృతీయముద్రణ జరుగుతోంది. అందులో ఏ ముద్రణ ప్రతి చదివినా మూడు ముద్రణలప్రతి చదివినట్టేగా? అందువల్ల పుస్తకం వచ్చాక మూడుసార్లు - రాకముందు ఎన్నిసార్లన్నాను? మూడుసార్లు - వెరసి మూడుమూళ్ళు తొమ్మిదిసార్లు. కాదు - నాలుగుమూళ్లు..."

"కల్పనా! ఇంకాపుతావా?"

"ఏం మేడమ్?"

"నీ లెక్కలూ నువ్వూ నాకంతా అగమ్యగోచరంగా వుంది."

"చూశారా మరి! ఇదే టెక్నిక్."

"ఏమిటా టెక్నిక్?"

"ముందుగా పాఠకుల్ని తర్కరహితుల్ని చెయ్యాలి."

"ఆ తర్వాత?"

"ఆ తర్వాత మనం ఏం చెప్పినా నమ్ముతాడు. పందిని నంది అని చెప్పినా నమ్ముతాడు."

"నందిని పందంటే?"

"అదీ నమ్ముతాడు మేడమ్!"

"ఎలా?"

"అర్థం పర్థంలేని భయంకరమైన వర్ణనలతో పాఠకుని మస్తిష్కాన్ని నంబ్ చెయ్యాలి. ఆ తర్వాత రచయిత ఏం చెబితే అదే నమ్ముతాడు."

కల్పన చెప్పినమాటల్లో వాస్తవం లేకపోలేదనిపించింది.

కాని, ఇప్పుడామె చెప్పినవన్నీ విశ్లేషించి ఆలోచించే ఓపిక నాలో లేదు.

కల్పనవైపు చిరాగ్గా చూశాను.

"నేను అడిగింది నీ కథలోని అంజిబాబును గురించి. నువ్వేమో...."

"తినబోతూ రుచి అడగడం ఎందుకు మేడం? కథ పూర్తిగా చదవండి- అంజిబాబూ హీరోనో, విలనో తెలుస్తుంది." అన్నది కల్పన, దూరంగావున్న కాలవమీద వంతెన కేసి చూస్తూ.

"రెండూ కాకపోతే?" అన్నాను.

"రెండూ అవచ్చునేమో?"

కల్పన ముక్తసరిగా చెప్పింది.

రెండు నిమిషాలు ఆలోచించాకగాని కల్పన మాటల్లోని అంతరార్థం నాకు బోధపడిందికాదు.

పేజీలు తిప్పి కథ ఎక్కడ ఆపానో వెతుక్కుంటున్నాను.

"మేడమ్! మీ కిచ్చిన ఎక్స్టెన్షన్ టైం అయిపోయింది."

"అంటే?"

"కథ పూర్తిఅయేదాక ఇక మీరు మాట్లాడకూడదు."

"జస్టేమినిట్!"

"ఏమిటి?"

"నేను కథ చదివేంతవరకూ నువ్వు నోరుమూసుకొని కూర్చోవాలనికదా మన ఒప్పందం?"

"అవును."

"మరి ఉల్టాపల్టాచేసి మాట్లాడతావేం? నేను మాట్లాడకూడదని మన ఒప్పందంలో లేదుగా!" అన్నాను.

"నాకు గుర్తుంది. కాని, ఆ సంగతి ఇంతవరకూ మీకే గుర్తులేదు." కల్పన చిలిపిగా అన్నది.

"అది నేను మర్చిపోయేట్టు చేసింది నువ్వే!"

"సజెషన్ మేడమ్, సజెషన్! సైకాలజీలో యిదో ప్రక్రియ. మీకు తెలియంది కాదనుకోండి!"

"సంతోషించాంగానీ యికనన్నా కాసేపు నోరుమూసుకొని కూర్చో." కసిరాను.

"మీరు ఆదేశిస్తే నోరేంఖర్మ, చెవులుకూడా మూసుకొని కూర్చుంటాను."

వినయవిధేయతల్ని నటిస్తూ అన్నది కల్పన.

"ఇంకానయం - ముక్కు మూసుకొని కూర్చుంటానన్నావు కాదు."

"చెప్పండి మేడమ్! ముక్కు మూసుకోమన్నారా?"

"వద్దుతల్లీ వద్దు. ఆ హత్యానేరం నామీదకొస్తుంది" అన్నాను నవ్వుతూ.

"ఇది హత్య ఎలా అవుతుంది మేడమ్?"

"ఏదో ఒకటి అవుతుందిలే. నువ్వు...."

"మేడమ్! వండర్ఫుల్ ఐడియా!"

"మళ్ళీ ఏమొచ్చింది?"

"అది ఆత్మహత్య మాత్రమే అవుతుంది. వండర్ఫుల్ థీమ్, హిప్నాటిస్టు సజెషన్తో ముక్కుమూసుకొని మరణించిన మాలినిది హత్యా లేక ఆత్మహత్యా? ప్రఖ్యాత డిటెక్టివ్ నరేంద్ర శాస్త్రీయ పరిశోధన...."

"ఏయ్ కల్పనా! నువ్వు నోరు మూసుక్కూర్చుంటావా లేక ఈ కాగితాలు కట్ట ఆకాలవలోకి విసిరెయ్యమంటావా?"

నా కంఠంలోని తీవ్రతకు కల్పన నోరుమూసుకొని ముంగిలా కూర్చుంది. ఆమె కూర్చున్నతీరుకు నాకు నవ్వొచ్చింది. అయినా నవ్వలేదు.

ఒకసారి కల్పనను తేరిపారచూసి కాగితాల్లో తల దూర్చాను.

కథ చదవడం ప్రారంభించాను....

"ఏందిపిల్లా! నీ కత ఇప్పుడు సెప్పు. నీకేబయంనేదు. సెప్పు." లారీ వేగంగా నడుపుతూ అడిగాడు అంజిబాబు.

"ఈడెవడోగాని మంచోడిలాగే వున్నాడు" అనుకుంది గౌరీదేవి.

కొత్తపడవకు కొబ్బరికాయకొట్టి నీళ్ళలో వేసినదగ్గరనుంచి జరిగిన కథంతా అంజికి చెప్పింది. కొబ్బరికాయల పడవ నీళ్ళల్లో మునిగిపోవడం, ఆ దుర్మార్గులు తనను తరుముకుంటూ రావడం వివరంగానే చెప్పింది.

విన్న అంజిబాబు చాలా యిదైపోయాడు.

అన్నన్నా! ఆడకూతురుకెన్నెన్ని కష్టాలొచ్చాయిరో అనుకొన్నాడు.

చాలా ఆలోచించాడు - ఒక నిర్ణయానికి వచ్చాడు.

# 11

పగలంతా ప్రయాణంచేసి లారీ మునిమాపువేళకు ఊరి బయట పాడుపడ్డ పొగాకు బేరన్‌దగ్గర కొచ్చింది.

లారీ ఆపి అంజిబాబు దిగాడు.

"గౌరీ! యింకా చూస్తున్నావేటి! బేగి దిగు!" అంటూ చెయ్యి అందించాడు.

"ఏంది అంజిబాబూ, యాడకు తెచ్చావ్?"

గాభరాగా చుట్టూ కలయజూస్తూ అన్నది గౌరి.

"ఏం భయంలేదు. నేనున్నాగా? దిగు!"

"ఓరి భయం ఎందుకు? నీ భయం సాలదా?"

అంజిబాబు విరగబడి నవ్వాడు.

గౌరి భయం భయంగా చూసింది.

"ఇదుగో పిల్లా! ఓ మాట చెపుతున్నా - సరిగా ఇనుకో!"

"ఏటది?"

"ఈ అంజిగాడు చెడ్డోళ్ళకు చెడ్డోడు, మంచోళ్ళకు మంచోడు. దిగు! దిగు!"

అని అజిబాబు గౌరిచెయ్యి దొరకపుచ్చుకుని లారీలోనుంచి కిందకు దించాడు.

గౌరి బిక్కు బిక్కుమంటూ అంజిబాబు వెనకే బేరన్‌లోకి నడిచింది.

"నువ్వాడుండు!" అని అంజిబాబు లోపలకు వెళ్ళాడు.

కొద్దినిముషాల్లో లాంతరు వెలిగించి తీసుకొచ్చాడు.

ఆ లాంతరు వెలుగులో అడుగులో అడుగు వేసుకుంటూ గౌరి లోపలకు నడిచింది.

"ఎవరదీ?"

ఇద్దరూ. వస్తాదుల్లాంటివాళ్లు లోపలకు ప్రవేశించారు.

"నేనే! అంజిని."

లాంతరు పైకెత్తి పట్టుకొని చెప్పాడు అంజిబాబు.

"ఓయ్! సిన్నదొరా! నువ్వా? ఎవుళ్ళో అనుకున్నాం."

గుబురుమీసాలతో కర్రిదున్నపోతులా వున్నవాడు అన్నాడు.

"ఈ పిట్ట నెక్కడపట్టావ్ అంజిబాబూ?"

పారల్లాంటి పళ్లు బయటపెట్టి అడిగాడు చిరుతపులిలాంటి ముఖంవాడు - రెండోవాడు.

"రేయ్ పులిగా! పిట్టా గిట్టా అనబోకు. ఈ పిల్ల పెద్దింటి ఆడపడుచు."

"ఎట్టెట్టా?" గుబురుమీసాలు కదిలాయి.

"అవును. గంగ బిడ్డరా! శివన్న నాయకుడి ఒక్కగానొక్క ఆడకూతురు. పెద్ద కష్టాల్లో పడిపోనాది." అంజి గౌరిని సగౌరంగా చూపిస్తూ అన్నాడు.

"ఓసోసి! అంత పెద్దింటి ఆడకూతురయితే నీతో ఎందుకు లేసొస్తుంది అంజిబాబూ?" చిరుతముఖంవాడు పళ్లు బయటపెట్టాడు.

"ఓరేయ్ పులిగా! ఒళ్లు దగ్గరుంచుకో! లేకపోతే పిల్లయిపోతావ్ నాకొడకా!"

రెండడుగులు ముందుకువేసి పులిగాడి ముందుకొచ్చి నిల్చున్నాడు అంజిబాబు.

పులిగాడు పిల్లే అయ్యాడు. రెండడుగులు వెనక్కు వేశాడు.

"ఏదో పిట్టనట్టుకొచ్చావనుకొన్నా. పండగజేసుకుందామనుకొన్నాగాని పెద్దింటి ఆడకూతురని నేను కలగన్నానా?" నీళ్లు నములుతూ అన్నాడు పులిగాడు.

"కలగన్నావా? ఆ కలేందో మర్చిపో! నేకపోతే బొమికలు ఏరేస్తా. తెలిసిందా?" అన్నాడు అంజి.

"వదిలేయ్ సిన్నదొరా! అడు తెలీక ఏదేదో వాగినాడు." మధ్యలోకి వచ్చాడు గుబురుమీసాలవాడు.

"మరాడ్ని వళ్లు దగ్గరెట్టుకోమని సెప్పు."

"సరి! సరి! తెలుసుకున్నాడు. వదిలెయ్ ఈసారికి." సర్దుబాటుగా అన్నాడు గుబురుమీసాల కర్రెన్న.

"కర్రెన్నా! పెద్దోడివి చెపుతున్నావని ఆడ్ని వదిలేస్తున్నా. నువ్వాళ్ళోకెళ్ళి నాకూ గౌరికీ బువ్వ పట్టుకురా! అడ్డరోడ్డుకాడ ఆదెమ్మ హోటల్లో కోడిపలావుంటే పట్టుకురా! చేపల పులుసుంటే అదికూడా అట్టుకురా! గంగపుత్రుల కూతురుగందా? రొయ్యల పులుసన్నా, చేపల పులుసన్నా మంచి యిష్టంగా వుండాలిమరి" అని అంజి గౌరికేసి తిరిగి–.

"ఏంది గౌరిదీవీ! అంతేనా?" అన్నాడు.

గౌరి గుండెల్లో పేరుకున్న చీకటితెరలు క్షణం క్షణం తొలగిపోతున్నాయి.

భయం, ఆందోళన క్రమంగా తగ్గసాగాయి.

అంజిబాబంటే సదభిప్రాయం ఏర్పడింది.

తన గురించీ, తన తండ్రిగురించీ, తన వంశంగురించీ ఎంత గొప్పగా చెపుతున్నాడో?

అంజిబాబు చాలా మంచివాడు!

అంజిబాబు అలాటిలాటివాడయితే తనకు యిక్కడ దిక్కెవరు?

మరొకడయితే ఒంటరిగా చిక్కిన కన్నెపిల్లను ఇంత ఇదిగా చూస్తాడా?

గౌరి అంజికేసి అభిమానంగా చూసింది.

"ఏంటి? ఇంకిక్కడే నిలబడిపోయినావు గౌరీ! ఇటొచ్చి కూచో."

గౌరి నిల్చునేవుంది.

"అదిగో! ఆ కుండలో చల్లటి నీళ్ళున్నయ్. ముఖం కడుక్కొని కాసిని తాగు. అంతలో అన్నం వస్తది. తిని పడుకుందువుగాని" అన్నాడు అంజిబాబు.

అతడి గొంతులో ఆప్యాయతకూ, ఆదరణకూ గౌరి ముగ్ధురాలైపోయింది.

నాలుగడుగులు ముందుకు వేసింది.

షెడ్డంతా కలయజూసి ఆశ్చర్యంతో తల మునకలైపోయింది.

కొబ్బరికాయలు!

కొబ్బరికాయలు!

షెడ్డు దూలాలకు అనుతున్న కొబ్బరికాయల కుప్పలు! గౌరి అంజిబాబుకేసి చూసింది.

అంజి గౌరినే చూస్తున్నాడు.

"ఇవన్నీ!"

గౌరి అంజిని తడబడుతూ అడిగింది.

"కన్పించడం లేదా? కొబ్బరికాయలు."

"నువ్వుకూడా...." గౌరికి వెన్నెముకలోకి ఏదో పాకినట్టయింది.

"ఆఁ – నేనుకూడా."

"వజ్రాల దొంగలముఠాలో...." కంఠం వణికింది.

"అంజీ!"

"ఆఁ!"

"ఎవర్రా ఆ పిల్ల! నిజంగా శివన్న కూతురేనా?" అంటూ ఓ స్థూలకాయుడు లోపలకు వచ్చాడు.

అతడ్ని చూసి గౌరి ఉలిక్కిపడింది.

"ఆఁ! శివన్నకూతురే! గౌరి!" అంజిబాబు సమాధానం.

గౌరికి శరీరం చల్లబడిపోతున్నట్టుగా వుంది.

"షెబాష్ అంజీ! పటాకుల రత్తయ్య పేరు నిలబెట్టావ్‌రా!" మెచ్చుకున్నాడు.

"తండ్రికిమించిన కొడుకు!" పులిగాడు.

"పులికడుపున మేక పుడుతుందా?" కర్రెన్న మెచ్చుకోలుగా అన్నాడు.

పటాకుల రత్తయ్య!

అంజి పటాకుల రత్తయ్య కొడుకా?

గౌరి వంట్లో రక్తం గడ్డకట్టుకుపోసాగింది.

కాళ్ళకింద భూమి కదులుతున్నట్టుగా వుంది.

కాళ్లు భూమికి తన్నిపట్టి నిల్చుంది.

అంజిగాడు యింత దుర్మార్గుడా?

ఎంత మోసం చేశాడు?

ఎంత మంచివాడిగా ప్రవర్తించాడు?

తను అతడ్ని ఎంత గొప్పగా ఊహించుకుంది?

నిజంగా, మనస్ఫూర్తిగా వాడ్ని నమ్మింది తను!

వాడంటే తనలో ఏదో తెలియని అనురాగం మొలకెత్తింది.

ఇంత మోసమా?

ఇంత కుట్రా?

ఎంతగా నమ్మించి ఇక్కడకు తీసుకొచ్చాడు?

అంజిబాబుకేసి చూసింది.

అంతవరకూ ఎంతో అందంగా కన్పించిన అతడి ముఖం గౌరి కళ్ళకు అప్పుడు వికృతంగా, జుగుప్సాకరంగా కన్పించింది.

"థూ!"

తుపుక్కున ఊశాడు పటాకుల రత్తయ్య.

"ఎందుకురా ఇంతమంది వున్నారు? కోసుకుతినడానికా? తేళ్ళ గురవయ్యగాడూ, పాముల బుచ్చయ్యగాడూ, మీరూ – ఇంతమంది కలిశారు. ఎందుకు? చేతగాని ఎదవలు ఒక్క ఆడకూతుర్ని పట్టుకోలేకపోయారు... థూ!" అని ఆగి అంజికేసి ఆప్యాయంగాచూస్తూ మళ్ళీ అన్నాడు–

"చూడండ్రిరా! నా కొడుకొక్కడే పట్టుకొచ్చాడు. ఇక నా అంజిబాబు కోటీశ్వరుడైపోతాడ్రా! ఆఁ ఏమనుకున్నారో? కోటీశ్వరుడు!"

పటాకుల రత్తయ్య ఆనందంతో ఉబ్బితబ్బిబ్బైపోతూ అన్నాడు.

గౌరికి తల తిరిగిపోతున్నది. వెఱ్రిచూపులు చూస్తూ నిల్చుంది.

పటాకుల రత్తయ్య గౌరి దగ్గరకొచ్చి నిలబడ్డాడు.

"ఏమే! కంత్రీపిల్లా! ఈ పటాకుల రత్తయ్యకే టోకరా యిస్తావా?"

గౌరి గుడ్లప్పగించి నిల్చుంది.

"ఈర్రాజుగాడు ఎక్కడ దాక్కున్నాడో సెప్పు!" రత్తయ్యగొంతు గురగురలాడింది.

"నాకేంతెలుసూ ఆడెటుపోయాడో?"

గౌరి ధైర్యం కూడదీసికొని అన్నది.

"ఆడెటుపోతే నాకేంగానీ ఆ కొబ్బరికాయ ఎక్కడ దాచావో చెప్పు."

పటాకుల రత్తయ్య పళ్లు బిగించి, గౌరిమీదకు వంగి, ముఖంలో ముఖంపెట్టి అడిగాడు.

గౌరి రెండడుగులు వెనక్కువేసి "ఏ కొబ్బరికాయ?" అన్నది.

"ఓసోసె! చిత్రాంగి ఏషం ఏస్తున్నావ్? ఆ కొబ్బరికాయేనే పిల్లా!"

"ఏ కొబ్బరికాయ? నాకు తెలవదు."

"ఆ సన్నాసి తెచ్చిన కొబ్బరికాయే పిల్లా! ఏషాలెయ్యక సెప్పు."

"నాకు తెలవదు."

"తెలవదూ?"

పటాకుల రత్తయ్య గౌరి చెయ్యిపట్టుకొని వెనక్కు విరిచాడు.

గౌరి గిలగిల్లాడిపోతూ అల్లంతదూరంలో కూర్చుని తమాషా చూస్తున్న అంజికేసి నిస్సహాయంగా చూసింది.

"చెప్పు! కొబ్బరికాయ ఎక్కడుందో చెపితే అయ్య నిన్నేం చెయ్యడు. వదిలేస్తాడు చెప్పు."

అంజిబాబు లేచి నిలబడ్డాడు.

అంజి ముఖంమీద ఖాండ్రించి ఉయ్యడానికి సిద్ధంగా వుంది గౌరి.

వీడూ ఆ తండ్రికి తగ్గ కొడుకే!

రత్తయ్యగాడి ముఖం చూస్తేనే సొరచేపగాడని తెలుస్తోంది.

ఈడు - ఈ అంజిగాడు - చందమామలాంటి చందువా ముఖం.

కాని, ముఖం వెనక ఎంత వికారం వుంది? ఎంత కుట్ర వుంది?

మోసగాడు!

దగాకోరు!

తనమీద ఎంత ప్రేమ ఒలకపోశాడు?

ఎంత మర్యాద చూపించాడు?

అంతా వేషం!

నాటకం!

ఈడికంటే ఆడి అయ్యే నయం!

"చెప్పే పిల్లా!"

గౌరి తుళ్ళిపడింది ఆలోచనలనుంచి.

"కొబ్బరికాయ ఎక్కడ?"

చెయ్యి మెలితిరిగిపోతున్నది.

గౌరి బాధతో మెలికలు తిరిగిపోతున్నది.

"నిజంగా నాకు తెలవదు."

"నీకు తెలవకుండా యాడికిపోతుందే?"

గౌరి రెండోచెయ్యికూడా వెనక్కు విరిచి పట్టుకున్నాడు రత్తయ్య.

"సన్నాసి తెచ్చిన కాయ పడవలోవున్న కాయల్లో కలిసిపోయింది. పడవ బోల్తాపడి కాలవలో...."

"ఆ కతంతా నాకు తెలుసే. ఆ కొబ్బరికాయ తీసి ఎక్కడో దాచి పడవ బోల్తా కొట్టించారే మీరు. అదికూడా నీళ్ళల్లో కొట్టుకుపోయిందని నమ్మించడానికే చేశారే ఆ పని, అవునా?"

"కాదు."

"నిజం చెప్పు!"

"నిజం! కావాలని పడవ బోల్తా కొట్టించలేదు."

"అబద్ధం చెప్తావే?"

వెనక్కు విరిచిన రెండు రెక్కలు పట్టుకొని గౌరిని పైకెత్తాడు రత్తయ్య.

గౌరి రెక్కలు విరిగిన పక్షిలా గిలగిల్లాడిపోయింది.

"సత్తెపెమాణంగా చెపుతున్నాను. ఆ కాయ ఎక్కడుందో నాకు తెలవదు. నన్ను వదిలెయ్." గౌరి ప్రాధేయపడింది.

"ఓరేయ్ పులిగా! కర్రోడా! యిలా రండ్రా!"

పటాకుల రత్తయ్య కేకలు పెట్టాడు.

బయట కాపలా కాస్తున్న ఆ ఇద్దరూ కేకలు విని లోపలకు పరుగున వచ్చారు.

"ఊఁ రండ్రా!"

ఇద్దరూ దగ్గిరకొచ్చి నిలబడ్డారు.

"ఊఁ చూస్తారేంరా?"

పులిగాడూ, కర్రెన్నా ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు - రత్తయ్య ఏంచెయ్యమంటున్నాడో అర్థంకాక.

"చూస్తారేంరా! దీని గుడ్డలు ఊడదీసి, కొబ్బరికాయల గుట్టమీద..."

రత్తయ్య వికటంగా క్రూరంగా నవ్వాడు.

ఆ నవ్వుకు గౌరికి కళ్ళు బైర్లుకమ్మాయి.

పులిగాడూ, కర్రిగాడూ గౌరిని చెరొక రెక్కాపట్టుకొని కొబ్బరికాయల గుట్టకేసి లాక్కెళ్ళుతున్నారు.

గౌరి కెవ్వున కేకవేసింది.

"ఒరేయ్! దాని నోరు నొక్కండిరా!"

పటాకుల రత్తయ్య అరిచాడు.

కర్రోడు నల్లరాతిబండలావున్న చెయ్యి గౌరి నోటిని నొక్కి పట్టుకుంది.

గౌరికి ఊపిరాడటంలేదు.

పెనుగులాడుతోంది.

కళ్ళముందు చీకట్లు కమ్ముకుంటున్నాయి.

"ఆగండి." సింహం గర్జించినట్టుగా వినిపించింది గౌరికి.

అది! అది! అంజిగొంతే! గౌరికి యింకా స్పృహ పూర్తిగా తప్పలేదు.

అంజి ఒక్కదూకులో ముందుకొచ్చి నిలబడ్డాడు.

పులిగాడ్నీ, కర్రిగాడ్నీ చెరో తన్ను తన్నాడు.

వాళ్లు ఇంతెత్తున ఎగిరి కొబ్బరికాయల గుట్టలమీద పడ్డారు.

గౌరి ఒక్కసారిగా లేచి అంజిబాబు వెనక్కొచ్చి నిలబడింది.

"ఒరేయ్ అంజీ!"

రత్తయ్య కొడుకునుచూస్తూ పళ్లు నూరాడు.

అంజిబాబు గౌరికి అడ్డంగా నిలబడ్డాడు - ఎవరొస్తారో రండి అన్నట్టుగా.

"తప్పుకో!" రత్తయ్య గాండ్రుమన్నాడు.

"గౌరిని ముట్టుకో, చెప్తా!" అంజి గర్జించాడు.

"ఆc! అంతవరకొచ్చిందంట్రా నీ వ్యవహారం? కుర్రకుంకా!" రత్తయ్య గౌరిపైకి రాసాగాడు.

"నీకే చెప్పేది, తప్పుకో!" అంజి తండ్రిని ధిక్కరించాడు.

"అది పారిపోయిందంటే మనకు వచ్చే నష్టం ఏమిటో తెలిసే మాట్లాడుతున్నావట్రా?"

"ఆ - తెలుసు."

"వజ్రాలు! కోట్లరూపాయల వజ్రాలు!" రత్తయ్య కొడుక్కు ఆశ చూపిస్తున్నట్టుగా అన్నాడు.

"ఒరే అయ్యా! నా మాటిన్రా! ఆడకూతురి శీలం అంతకంటే విలువైందిరా అయ్యా!" అంజి తండ్రికి నచ్చజెబుతున్నట్టుగా అన్నాడు.

"అయ్యా! గియ్యా! అట్టా నన్ను పిలవకు. నేను నీకు అయ్యనూ కాను, నువ్వు నాకు కొడుకువూ కావు."

"మరీమంచిది. అయితే తొలుగు." నిటారుగా నిల్చున్నాడు అంజిబాబు.

"నేను తొలగాలంట్రా నా కొడకా!" పటాకుల రత్తయ్య పళ్ళు నూరాడు.

"నీ కొడుకును కాదన్నావుగదరా అయ్యా!"

"ఛ! అట్టా పిలవకు నన్ను. ఫో బయటకు."

"పోతాను. కాని, గౌరిని తీసుకొనే యెల్తాను."

"ఈ షెడ్డులోనుంచి నీ శవమేరా వెళ్ళేది. దాన్ని కూడా తీసుకెళ్తావే?"

పటాకుల రత్తయ్య నడుముకున్న బెల్టులోనుంచి కత్తి దూశాడు.

ఈ లోపల పులిగాడువచ్చి వెన్నువిరుచుకొని రత్తయ్య పక్కన నిలబడ్డాడు.

కర్రోడు రత్తయ్యకు రెండోపక్కనవచ్చి నిలబడ్డాడు.

"నా బొందిలో ప్రాణం వుండగా గౌరి మీకు దక్కదు!" అంజి కంఠం కంచులా మోగింది.

"అది వుండదనేగా సెపుతుండా!" పటాకుల రత్తయ్య రక్తపుకళ్ళతో చూశాడు.

"ప్రాణాలమీద ఆశుంటే అడ్డంలే!" అని అంజిబాబు పులిలా రత్తయ్యమీదకు దూకాడు.

అంతే!

క్షణకాలం!

ఒకే ఒక్కక్షణం!

రత్తయ్య చేతిలో కత్తి సర్రున పొట్టలో దిగబడింది.

ఎవరి పొట్టలో?

తండ్రి పొట్టలోనా?

కొడుకు పొట్టలోనా?

అసలు ఆ కత్తి ఎవరిది?

కొడుకుదా?

కాదు, తండ్రిదే!

కాదు, కొడు....

అసలు కత్తి దిగబడిందా?

ఇదంతా నిజంగా జరిగిందా?

అంతా తన భ్రమేనా?

గౌరి తల విదిలించుకుంది.

అంజిగాడు అసలు తండ్రికి ఎదురు తిరగనేలేదా?

ఎందుకు తిరుగుతాడూ?

వాడేగా తనను మోసంచేసి తీసుకొచ్చి అయ్య కప్పగిచాడు.

తనను పులిగాడూ, కర్రెగాడూ కొబ్బరికాయలమీదకు లాగుతున్నారా?

అంజి ఏం చేస్తున్నాడు?

వాడి అయ్య పటాకుల రత్తయ్య పక్కన నిలబడి విషపునవ్వు నవ్వుతున్నాడా?

మరి ఆర్తనాదం ఎవరిది?

తనదేనా? తన అరుపు తనకే ఎవరో అరిచినట్టుగా విన్పించిందా?

ఏది నిజం?

ఏది అబద్ధం?

# 12

"కన్నకొడుకునే చంపిన నాకు నువ్వొక లెఖ్ఖటే పిల్లా? చెప్పు!, ఎక్కడ దాచావా కొబ్బరికాయ?"

పటాకుల రత్తయ్య గౌరి పీకమీద కత్తి ఆనించి గద్దించాడు.

"నీది వట్టి మట్టిబుర్రరా రత్తిగా!" అన్నది గౌరి.

గౌరికి అంత ధైర్యం ఎక్కడ్నుంచి వచ్చిందో మరి!

"ఏమిటే భడవా? ఏం కూశావే?"

పటాకుల రత్తయ్య ఉడికిపోతున్నాడు కోపంతో.

"గుండెలమీద పెంచుకొన్న కొడుకును చంపావ్! దుర్మార్గుడా!"
"నోరుముయ్!"
"కొడుకూ పోయె! కొబ్బరికాయా పోయె!" అంది గౌరి తాపీగా.
పటాకుల రత్తయ్యకు నెత్తిమీద సుత్తిదెబ్బలా తగిలింది. బిత్తరపోయాడు.
గౌరీ పీకమీద పెట్టిన కత్తి తీశాడు.
క్రమంగా వాడిబుర్ర పనిచెయ్యసాగింది.
గౌరి ముఖంలోకి పరిశీలనగా చూశాడు.
ఏదో ఆలోచన అతడి బుర్రలో తళుక్కుమంది.
"ఆ కొబ్బరికాయ నువ్వు వాడికిచ్చావా?" సందేహంగా చూస్తూ అడిగాడు పటాకుల రత్తయ్య.
గౌరి వెంటనే సమాధానం యివ్వలేదు.
షెడ్డు కప్పుకేసి చూసింది అర్థయుక్తంగా.
రత్తయ్య బుర్ర జావ జావ అయిపోయింది.
ఒంట్లోకి ఎక్కడలేని నీరసం వచ్చేసింది.
రక్తం మడుగులో పడివున్న కొడుకు శవాన్ని కొద్ది క్షణాలు చూస్తూ వుండిపోయాడు.
తనేం చేశాడు?
కొడుకును చంపుకున్నాడు.
వజ్రాలు పోగొట్టుకున్నాడు చేజేతులా.
అయితే ఇది ఆ కొబ్బరికాయ అంజిగాడికి ఇచ్చిందన్నమాట?
వాడెక్కడ దాన్ని దాచిపెట్టాడో?
ఇప్పుడెలా?
ఎవరు చెప్తారు?
రత్తయ్య గౌరి ముఖంలోకి కసిగా చూశాడు.
వాడు ఆ కొబ్బరికాయ ఎక్కడ దాచాడో దీనికి తెలిసే వుండాలి. అందుకే వాడు దీన్ని అంత వెనకేసుకొచ్చాడు. వాడ్ని చంపి తను పొరపాటు చేశాడు. వాడు చచ్చాడు. ఇది బతికే వుందిగా?"
"ఏయ్! వాడు ఆ కొబ్బరికాయ ఎక్కడ దాచాడో చెప్పు." గౌరిని క్రకౄరంగా చూస్తూ అడిగాడు.
గౌరి మాట్లాడలేదు. నిర్లక్ష్యంగా వుండిపోయింది.
"చెప్పవేం?"
"ఏం చెప్పాలే?"
"వాడు ఆ కొబ్బరికాయ ఎక్కడ దాచాడో నీకు తెలుసా?"
గౌరి నిర్లక్ష్యంగా నవ్వింది.

"ఏంటేవ్! మహాయిదిగా ఉన్నావ్? ఏం చేస్తానో తెలుసా?"

"ఏం చేస్తావేం?" అన్నట్టుగా చూసింది.

"నీకు తెలుసా లేదా?"

"ఏమిటి?"

"వాడు కొబ్బరికాయ ఎక్కడ దాచాడో తెలుసా?"

"తెలుసు." నిర్భయంగా అన్నది గౌరి.

పటాకుల రత్తయ్య వంట్లోకి ఒక్కసారిగా పోయిన గాలి మళ్ళీ కొట్టినట్టు అయింది.

"అయితే చెప్పు."

"చెప్పకపోతే?"

"వాడికి పట్టినగతే నీకూ పడుతుంది. చెప్పవే!" పటాకుల రత్తయ్య గౌరి చెయ్యి పట్టుకున్నాడు.

గౌరి అతడి చేతిని విదిలించికొట్టింది.

"ఏందే నీ దయిర్యం?" పళ్ళు కొరికాడు.

గౌరి "హూ!" అని చీదరించుకుంది.

"చెప్తావా లేదా?"

"చెప్తాను."

"బేగి చెప్పు."

"నువ్వు ముందీమాట చెప్పు." గౌరి కంఠంలో ఆందోళన లేదు, భయం లేదు.

"ఏంటా మాట?"

"అంజిబాబు నీ కొడుకేనా?" నిలదీసినట్టుగా అన్నది.

రత్తయ్య సాలోచనగా గౌరి ముఖంలోకి చూశాడు.

"చెప్పు. అంజి నీ కొడుకు కాడు. అవునా?"

"వాడట్టా చెప్పాడా?"

"అంజి చెప్పలేదు. నేనే అడుగుతున్నా."

"కాదు."

"అంజిబాబు ఎవరు?"

"వాడు దొరబిడ్డ."

దొరబిడ్డా! అందుకే దొరబిడ్డలాగే ప్రవర్తించాడు. తను అప్పుడే అనుకుంది - అంజి రత్తయ్య కొడుకు కాదని.

"దొరబిడ్డ నీ దగ్గరెందుకున్నాడు?"

"చిన్నప్పుడే ఎత్తుకొచ్చాను. ఎవరికీ తెలియకుండా పెంచాను."

"ఎందుకు చేశావ్ ఆ పని?"

"నీకు చెప్పాలా?"

"అవును, చెప్పాలి."

"కసి! కసి! తీర్చుకోటానికి చేశాను." పటాకుల రత్తయ్య కసి కసిగా అన్నాడు.

"ఎవరిమీద కసి? అంజిమీదా?"

"కాదు. ఆడి అబ్బమీద."

"ఎందుకు?"

"ఆడి అబ్బ నాకు అన్యాయం చేశాడు."

గౌరి రత్తయ్య కళ్ళల్లోకి చూసింది. ఆ కళ్ళల్లో కసి నాగుబాము బుసలు కొడ్తోంది.

"వాడి అబ్బ నాకు తీరని అన్యాయం చేశాడు. ఆడు చేసిన దుర్మార్గానికి నా భార్య-గర్భిణీగావున్న నా భార్య - ఆడింట్లో పనిచేసిన నా భార్య ఆడిదొడ్లో బావిలో పడి చచ్చిపోయింది. నిలువునా ప్రాణం తీసుకుంది. నా భార్య పోయింది. బిడ్డ పుట్టకుండానే పోయాడు. అందుకనే వాడిమీద నాకు కసి. అందుకే ఆడి కొడుకుని యెత్తుకొచ్చా."

"కత శానావుందే?"

"శానా వుంది."

"రత్తయ్యా!"

"ఏంటి?"

"నువ్వు చెప్పిందంతా నిజమేనా?"

"సత్తెపెమాణంగా?"

"ఏమో, నాకు నమ్మకంగాలేదు" అంది గౌరి.

"చచ్చిన నా భార్యతోడు. దానిమీద ఒట్టేసి సెప్తున్నా. వీడ్ని పెంచాను, పెద్ద చేశాను. నేనే సంపేశాను. సచ్చిన అంజిమీద ప్రమాణంచేసి చెపుతున్నా."

ముఖానికి రెండుచేతులూ అడ్డంపెట్టుకొని భోరున ఏడ్చాడు పటాకుల రత్తయ్య.

వాడి ఏడ్పుచూస్తూ గౌరి కళ్లు తుడుచుకుంది.

ఏదీ! తన కళ్ళల్లో నీళ్లు తిరగలేదే?

చేతికి తడి అంటలేదే?

రత్తయ్యలో కన్పించిన ఆ వెన్నలాంటి మెత్తటి మనసు క్షణంలో పాషాణంగా మారింది.

"చెప్పు! ఆ కొబ్బరికాయ ఎక్కడ దాచాడు వాడు?"

"చెప్పకపోతే?"

"నీ తల ఎగిరి కొబ్బరికాయల గుట్టలో పడిపోగలదు - చెప్పు."

"నా తల ఎగిరి కొబ్బరికాయ గుట్టలో పడితే నీకొచ్చేదేముంది? బూడిదతప్ప."

రత్తయ్య గౌరి ముఖంలోకి చూశాడు. ఓ క్షణం ఆలోచించాడు.

"నువ్వు బతికుంటే?" గౌరిని చూశాడు సందేహంగా.

"నేను బతికుంటేనేగా నీకా వజ్రాల కొబ్బరికాయ దొరికేది?"

"అవును, నిన్ను చంపను."

"అంతేకాదు. ఇంకా..."

"ఏంటి చెప్పు?"

"నువ్వు నన్ను మహారాణిని చూసినట్టుగా చూసుకోవాలి."

"అట్టాగే. మరి ఆ కొబ్బరికాయ ఎక్కడుందో చెప్తావా?"

"ఇంకా.... ఇను."

"ఏంటి సెప్పు!"

"మీవాళ్ళంతా నేను చెప్పినట్టు ఇనుకోవాలి."

"అట్టాగే, నువ్వు కూర్చోమంటే కూర్చుంటారు, నించోమంటే నించుంటారు."

"అంతేకాదు."

"ఇంకా ఏంటే?" అసహనంగా అన్నాడు రత్తయ్య.

"అదేవద్దు. కోపం గీపం చూపించావో!"

"చూపించను. నేనూ నువ్వు చెప్పినట్టే యినుకుంటాను. చెప్పు, ఆ కొబ్బరికాయ ఎక్కడుంది?"

"ఇంత త్వరగా చెప్పను. నీ మాటమీద నాకు నమ్మకం కుదరాలి."

"అందుకేం చెయ్యమంటావో సెప్పు!"

"నన్ను కొబ్బరికాయ ఎక్కడుందో చెప్పమని అడక్కూడదు."

రత్తయ్య నీరు కారిపోయాడు.

"నాకు చెప్పాలనిపించినప్పుడు, నీమీద దయ కలిగినప్పుడు నేను చెప్తాను" అన్నది గౌరి.

రత్తయ్య ఆలోచనలో పడ్డాడు.

"తెలిసిందా?"

"తెలిసింది."

"మరి నేను చెప్పినట్టు ఇనుకుంటావుగా?"

"అట్టాగే!"

పటాకుల రత్తయ్య బుర్రలో కమ్ముకొనివున్న కారుమేఘాలు విచ్చిపోయినట్టుగా అయింది.

ఆలోచనలో పడ్డాడు.

గౌరి చెప్పింది అక్షరాలా నిజం!

ఈ పిల్ల బతికుంటేనే ఏనాటికయినా ఆ వజ్రాలు తనకు దక్కుతాయి!

బతిమాలో బామాలో, ఆదరించో బెదిరించో యీ పిల్లనుంచి కొబ్బరికాయ ఎక్కడుందీ రాబట్టాలి.

అంతవరకు దీన్ని మంచిగా చూసుకోవాలి.

జ్ఞానోదయం అయిన రత్తయ్య అంతవరకూ చేతిలోనేవున్న కత్తి మొలకున్న బెల్టులో దోపుకున్నాడు.

# 13

రెండు రాత్రిళ్ళూ, రెండు పగళ్ళూ ప్రయాణంచేసి ఈఁరాజు ఒక ఊరు చేరాడు. అంతవరకూ పటాకుల రత్తయ్య మనుషులు వెన్నాడుతూనే ఉన్నారు. వాళ్ళ బెడద తప్పిపోయిందన్న నమ్మకం కుదిరాక ఆ ఊళ్ళో రామమందిరంలో తల దాచుకున్నాడు. ఉదయం రామమందిరం ముందున్న వేపచెట్టుకింద జనం గుమికూడి ఆనాటి పత్రికల్లో వార్తలు చదివి ఎవరికివాళ్లు యిళ్ళకు పరుగులు తీస్తున్నారు.

వేపచెట్టుకు ఆనుకొని పత్రిక తిరగవేస్తూ కూర్చున్న పూజారిని "ఏందిసామీ? అందులో ఏముంది - జనం అట్టా తొక్కిసలాడి పరుగులు తీస్తున్నారూ?" అని అడిగాడు.

ఈఁరాజును ఎగాదిగా చూసి "ఏమిటయ్యా? ఇంకా నువ్వు వినలేదా? అయితే విను" అని మొదటిపేజీ తిప్పి చదవడం మొదలుపెట్టాడు:

"కొబ్బరికాయల యుద్ధం"

'మా ప్రత్యేక విలేఖరి!'

పేరిస్‌లోవున్న ప్రదర్శనశాలనుంచి మాయమైన మూడు వజ్రాలు ఇండియా చేరినట్టు వార్త! విదేశీ దొంగల ముఠాలు ఆ వజ్రాలవేటలో హోరాహోరి యుద్ధం చేస్తున్నాయని తెలియవచ్చింది. ఇండియాలో రెండు ముఠాలకు పెద్ద ఎత్తున ఏజెంట్లు ఉన్నట్టు తెలుస్తుంది. ఒక్కో వజ్రమూ కోటిరూపాయలు చేస్తుందని అంచనా. ఈ రెండు అంతర్జాతీయ ముఠాలేకాకుండా మన దేశంలో వున్న వజ్రాల వర్తకులు, మహారాణులు, మహారాజులు ఆ వజ్రాలను చేజిక్కించుకోవాలని తమతమ మనుషులతో వజ్రాలవేట సాగిస్తున్నారని తెలియవస్తూన్నది. ఇకపోతే -"

ఆగాడు పూజారి.

"కొబ్బరికాయల యుద్ధం అని చదివారు - అదేంది సామీ మరి!"

"ఆగు వస్తున్నా! పేజీ తిప్పనియ్యి" అంటూ పత్రిక పేజీలు తిప్పి చదివాడు పూజారి:

"ఐరోపాలో మాయమైన వజ్రాలు ఇండియాలో కొబ్బరికాయలో వున్న వైనం!"

"కొబ్బరికాయలో వజ్రాలా సామీ?" ముఖమంతా కళ్లు చేసుకున్నాడు ఈఁరాజు. గొంతు కీచ్‌మంది.

'ఏందోయ్ సంగతీ' అన్నట్టు పూజారి ఈఁరాజును చూశాడు.

"నువ్వు సదువు సామీ!" ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు ఈఁరాజు.

"పేరిస్‌నుంచి దొంగిలించితెచ్చిన వజ్రాల్ని ఎండుకొబ్బరికాయలో దాచిపెట్టి పైన కొబ్బరిపీచు అంటించారని ఇంటిలిజెన్స్ సి.ఐ.డి. వారి భోగట్టా!

ఇప్పటికే యీ వార్త ఆనోటా ఈనోటా పడి ఊరూరు పాకిందని తెలుస్తున్నది. పులిమీద పుట్రన్నట్టు సన్యాసి వేషంలో వున్న వజ్రాలదొంగల తాలూకు మనిషొకడు కొబ్బరికాయలు రవాణా చేస్తున్న పడవలో హత్య చేయబడ్డాడట! పోలీసులు శవాన్ని, పడవ సరంగుని స్వాధీనం చేసుకుని విచారణ చేస్తున్నారని తెలియవస్తోంది.

"పడవ బోలా!"

మొన్న శుక్రవారం రాత్రి ఒక కొబ్బరికాయల పడవ పెద్ద కాలవలో తిరగబడి కొబ్బరికాయలన్నీ కాలవలోపడి కొట్టుకుపోయినై అని తెలుస్తూంది. అలా కాలవలోపడి కొట్టుకువస్తున్న కొబ్బరికాయలు కాలవపక్క పది పదిహేనుయేళ్ళవాళ్లు ఎవరి కందినవి వాళ్లు తెచ్చుకున్నారట. ఆ తెల్లవారే పట్నాలనుంచి పెద్ద పెద్ద వ్యాపారులు ఊళ్ళమీదబడి ఒక్కొక్క కాయ ఐదేసి రూపాయలకు కొనుక్కు వెళ్ళారట.

ఆ తర్వాత కొబ్బరికాయలో వజ్రాలున్నవార్త పొక్కి, అమాయకులయిన పల్లెప్రజలు గుండెలు బాదుకున్నారని కూడా తెలుస్తున్నది. కొబ్బరికాయ వ్యాపారస్థుల దగ్గరనుంచి వజ్రాల వేటగాళ్ళు అయినకాడికి కొబ్బరికాయలు కొనేశారని తెలుస్తున్నది. ఇంకా కొంటున్నారనికూడా తెలుస్తున్నది. ఐతే, యీ గుట్టుతెలిసిన ఏ వర్తకుడూ కొబ్బరికాయలు అమ్మడం లేదనికూడా తెలుస్తున్నది. అలాగే చిల్లరకొట్లల్లో వున్న కొబ్బరికాయలన్నీ ఇప్పటికే మాయమైనాయని తెలుస్తోంది.

"కొబ్బరికాయ దొంగతనాలు!"

గత రెండు రోజులుగా కొబ్బరికాయల దొంగతనాలు, దోపిళ్లు విచ్చలవిడిగా జరుగుతున్నట్టు తెలుస్తోంది. కొబ్బరికాయల గోదాములవద్ద ముష్టియుద్ధాలు, కత్తిపోట్లు జరుగుతున్నట్లు తెలియవస్తున్నది.

"అమ్మేవాడే లేడు!"

దేశం మొత్తమీద యీరోజు కొబ్బరికాయ అమ్మేవాడు కనిపించటం లేదట. దేవుడిగుళ్ళో కొట్టడానిక్కూడా కొబ్బరికాయ దొరకడం లేదని భక్తులు వాపోతున్నారు.

"కనిపించడం లేదు"

బోల్తాపడిన పడవలోవున్న ఈశ్రాజు అనే ఇరవైయేళ్ళ కుర్రాడూ, గౌరి అనే పద్దెనిమిదేళ్ళ పడుచు కనిపించడం లేదని మెలికలపాడు పోలీసు అధికారులనుంచి వార్తలందుతున్నాయి.

ఈ పడవకు సంబంధించిన మరొక పల్లెటూరి యువకుడు సత్తిరాజు అనేవాడు పోలీసు స్టేషన్నుంచి తప్పించుకుపోయాడని ఒక వార్త! కాదు, వాడ్ని వజ్రాల దొంగలముఠా ఎత్తుకుపోయిందని మరొక వార్త! ఇది ఇలా వుండగా కనిపించకుండా పారిపోయిన ఈశ్రాజు, గౌరమ్మల దగ్గరే వజ్రాల ఆ కొబ్బరికాయ ఉండొచ్చని పోలీసులు అనుమానిస్తున్నారు.

"మెలికలపాడు యస్సై, హెడ్డూ, సస్పెన్షన్."

సన్యాసి హత్యానేరంలో అనుమానితులయిన గౌరిని, ఈశ్రాజును వదిలేసినందుకూ, హత్య జరిగిన కొబ్బరికాయల పడవను వదిలేసినందుకూ, పోలీస్ కస్టడీలో వున్న సత్తిరాజు తప్పించుకుపోయినందుకూ విధినిర్వహణలో అజాగ్రత్తల కారణంగా మెలికలపాడు యస్సైని, హెడ్డుని జిల్లా పోలీసు అధికారి సస్పెండు చేసినట్టు ఇప్పుడే అందిన వార్త! ఏడవ పేజీలో – అదికూడా పైకే చదివి, ఏడవపేజీ తెరచి "ఏమోయ్! వింటున్నావా?" అంటూ పత్రికలోనుంచి తల బయటపెట్టాడు పూజారి.

"అరే! ఏమైపోయాడు" అంటూ చుట్టూ చూశాడు. ఈశ్రాజు అప్పటికే రామమందిరం వెనక్కు తప్పుకొని కందిచేలకడ్డంగాబడి పోతున్నాడు.

వీడూ వజ్రాలదొంగ ముఠావాడేనేమో? అనుమానం వచ్చి పూజారి రామమందిరంలోకి పరుగుతీశాడు. గర్భగుడిలో విగ్రహం చాటున దాచిపెట్టిన ఐదు కొబ్బరికాయలు యింకా అక్కడే ఉండటంచూసి తేలికపడ్డాడు. కొబ్బరికాయల పీచు తీసి కొట్టి చూడాలనివుంది పూజారికి. కాని, భయం వేస్తున్నది ఎవడన్నా చూస్తాడేమోనని! శ్రీరామచంద్రుడి అనుగ్రహం వుంటే ఆ ఐదు కొబ్బరికాయల్లోనే ఒకదానిలో ఆ వజ్రాలుండొచ్చు అనే ఆశతో ఉన్నాడు పూజారి.

కాని ఎలా? కొబ్బరికాయ పీచు కనిపిస్తేనే జనం అనుమానిస్తున్నారు. వజ్రాలు తనదగ్గరేవున్న కొబ్బరికాయలోనే దొరికితే ఇంకేమన్నా వుందా? పోలీసులు, వజ్రాల దొంగల ముఠాలు, అందాకా ఎందుకు - ఊరివాళ్లే తన తలకాయ కొబ్బరికాయలా ఒక్క దెబ్బకు పగలేసి వజ్రాలు ఎత్తుకుపోరూ? మహాప్రభో రామచంద్రా! పాహిమాం, పాహిమాం- పూజారి రామచంద్రమూర్తి ముందు సాష్టాంగం పడ్డాడు.

# 14

దేశం అల్లకల్లోలంగా వుంది. ఎక్కడచూసినా అలజడులు, అల్లర్లూను. వజ్రాలవేట సాగిపోతూంది. అనేక అంతర్జాతీయ ముఠాలు దిగాయి. అంతర్రాష్ట్రముఠాలు రంగంలోకి దిగాయి. కండపుష్టిగల ప్రతి గూండాగాడికి చేతినిండా పని. ఏదో ఒక ముఠాలో చేరిపోతున్నాడు.

ఈ వజ్రాల వేటలో లక్షల రూపాయలు చేతులు మారుతున్నాయి. కొబ్బరికాయలల్లే తలలు పగిలిపోతున్నాయి. మనిషిని చూస్తే మనిషికి అనుమానం! ఇండియాలో జరుగుతున్న అల్లర్లంతా విక్టోరియా మహారాణిదాకా వొచ్చింది. పార్లమెంటును సమావేశపరచింది. ఇండియాకు ప్రత్యేక అధికారులను పంపించింది. వాళ్ళనే 'కురిడీకాయ ఆఫీసర్లని' ఇండియాలో పిలిచేవారు. వారు దేశమంతా తిరిగి రాణిగారికి ఒక నివేదికను అందజేశారు. దాని సారాంశం యిది – వజ్రాల కొబ్బరికాయ దొరికేదాకా అల్లర్లు ఆగవని.

మహారాణిగారు బ్రిటిష్ పార్లమెంట్‌చేత ఒక శాసనం చేయించారు. దానికే 'కొబ్బరికాయ శాసనమ'ని పేరొచ్చింది.

ఆ శాసనం ప్రకారం ఇండియాలో కొబ్బరికాయ అమ్మకూడదు, కొనకూడదు. కొబ్బరికాయ పీచు తియ్యకూడదు, కొట్టకూడదు. ఇందులో ఏది చేసినా మూడేళ్లు కఠిన శిక్ష లేక ఆరేళ్లు విడికైదు. రెండవక్లాజులో యింకా యిలా వుంది:

కొబ్బరికాయను దగ్గరగాని, ఇంట్లోగాని ఉంచుకోవడం నేరం. ఈ శాసనం అమల్లోకి వచ్చిన మూడు రోజుల్లోపల ప్రజలు కొబ్బరికాయలు ప్రభుత్వ కొబ్బరికాయ గోదాముల్లో అప్పచెప్పి రసీదులు పొందాలి. ఇందుకు భిన్నంగా ప్రవర్తించినవారికి ఆరేళ్ళ కఠినశిక్ష, మూడేళ్ళు విడికైదు.

ఈ శాసనంతో దేశం అట్టుడికిపోతున్నది. అప్పుడింకా గాంధీ పుట్టలేదు. లేకపోతే అప్పుడే కొబ్బరికాయ సత్యాగ్రహం చేసివుండేవారు.

ఉప్పుసత్యాగ్రహందాకా ఆగాల్సినపని ఉండేదికాదు. స్వాతంత్ర్యం అప్పుడే వచ్చి వుండాలి. ఇప్పటికి కురిడీ స్వరాజ్యంగా ప్రఖ్యాతిగాంచి ఉండేదది. ఈ అర్ధరాత్రి సొరాజ్యంకంటే కురిడీ సొరాజ్యమే బాగుండేదేమో? చెప్పలేం.

అయినా జనం ఖాతరు చెయ్యలేదు. ఒక్క కొబ్బరికాయ కూడా ప్రభుత్వ గోదాములో జమ కాలేదు. కొబ్బరికాయ శాసనోల్లంఘనం విరివిగా జరిగిపోతున్నది.

ఇళ్ళల్లో కొబ్బరికాయల పీచు రహస్యంగా తీస్తున్నారు. కొబ్బరికాయలు పగలగొట్టి తమ అదృష్టాన్ని వెతుక్కుంటున్నారు. పొరుగువారిక్కూడా తెలియకుండా నేరాన్ని కప్పిపుచ్చుతున్నారు. కొబ్బరిపీచు, చిప్పల్ని పొయ్యిలో వేసి కాల్చివేస్తున్నారు. కట్టెపుల్లల అవసరం లేకుండానే అన్నం, కూరా ఉడుకుతుంది. కొబ్బరి పిసరంతకూడా లేకుండా తినేస్తున్నారు. పెద్ద యెత్తున నిలవచేసినవాళ్లు రాత్రిళ్లు రాత్రిళ్లు కొబ్బరికాయల పీచు తీయించి, కాయలు పగలగొట్టిస్తున్నారు. చిప్పలూ, పీచులూ తగలపెట్టించి, తినగా మిగిలిన కొబ్బర్ని గొయ్యితీసి పాతేయించుతున్నారు.

సరిగ్గా ఏడువారాలు గడిచేసరికి దేశ ఆర్థిక విధానమే దెబ్బతినిపోయింది. పచ్చికొబ్బరి తినీ తినీ ప్రజల ఆరోగ్యాలు దెబ్బతిన్నాయి.

వంటచెరకు కొట్టేవాళ్ళకు పనిలేదు. రవాణా లేదు. కొత్తలారీలు, కొత్తకారులూ రోడ్డుమీదకు రావడంలేదు. పూజచేసి కొబ్బరికాయ కొట్టిగాని డ్రయివర్లు కొత్తవాహనాల్ని బయటకు తీయరు. కొట్టాలంటే కొబ్బరికాయ లేదు. శాస్త్రానికి, మొక్కుబడికి కూడా కొబ్బరికాయ కన్పించడం లేదు.

గుళ్లు తలుపులు తెరవటంలేదు, పూజలు లేవు, పునస్కారాలు లేవు. మూడువారాలుగా ఒక్క దేముడిముందూ టెంకాయ పగల్లేదు. మూడుకోట్ల దేవతలూ లక్షమంది చిల్లరమల్లర దేవుళ్ళకూ ఒక్కపొద్దయిపోయింది. దాంతో దైవభక్తి, దైవభీతి తగ్గిపోయింది. పూజారులూ, అర్చకులూ రోడ్డున పడ్డారు.

ఆలిండియా అర్చకమహాసభ, ఆలిండియా భక్తసమాజం సభలు జరిపి, విక్టోరియా రాణిగారికి విజ్ఞాపన చేసుకున్నారు. ఏమని? వెయ్యి ఓడల కొబ్బరికాయలు పంపమని. అందుకామె కొబ్బరికాయలు మా దేశంలో దొరికేవి కావు. అందుకోసం మలయా, సింగపూర్, సిలోన్‌లు కొల్లకొట్టాల్సి ఉంటుందని తెలియజేసింది.

కొత్తపరిశ్రమలు వేటికి ప్రారంభోత్సవాలు జరగలేదు. నిర్మాణం పూర్తయిన మిల్లులు ప్రారంభోత్సవానికి కొబ్బరికాయల్లేక మూతపడివున్నాయి. ఉత్పత్తి తగ్గిపోయింది. అభివృద్ధి కుంటుపడింది.

ఇహ ప్రజలబాధలు చెప్పితే తీరేవిగా లేవు. కొబ్బరి కలశాలు లేక పెళ్ళిళ్ళు ఆగిపోయాయి. పీచు పరిశ్రమలు దెబ్బతిని పనివాళ్లు రోడ్లమీద పడ్డారు. ఆడవాళ్ళకు బట్టతల లొస్తున్నాయి - కొబ్బరినూనె కరువొచ్చిపడింది. తలకు రాసుకోవడానికి చిటికడంత నూనె దొరకడంలేదు. ఆడా మగా, పిల్లా జెల్లా జిడ్డుతలల్తో తిరుగుతున్నారు. జుట్టు జడలుకట్టి, పేలు కుప్పలు కుప్పలుగా పెరిగిపోతున్నాయి.

జనం బాధలు యిలా వుండగా యిహ ఆదేవుళ్ళ బాధలు ఎలా ఉన్నాయంటే ఆ దేవుడికే తెలియాలి.

అలిండియా భక్తసమాజంవాళ్ళ 'అర్షధర్మ' అనే ద్త్వెవార పత్రికలో ఓ వార్త వచ్చినట్టు 'నాస్తికధర్మ' పత్రిక ప్రకటించింది.

ఏడేడు పధ్నాలుగు లోకాల దేవుళ్ళు వైకుంఠములో సమావేశమయారట. కైలాసము నుంచి ప్రతినిధులెవ్వరూ హాజరుగాలేదని తెలిసింది. సమావేశం కైలాసంలో జరగాలని కైలాసవాసులు పట్టుబట్టారట. కాని వైకుంఠవాసులు ససేమిరా కాదన్నారట. ఆ కారణంగా కైలాస ప్రతినిధులు తమ తమ నిరసనను తెలియజేస్తూ సమావేశాన్ని బహిష్కరించారట. విష్ణుమూర్తి అధ్యక్షతన జరిగిన సర్వదేవుల సమావేశంలో భూలోకంలో తమకు పూజలు పునస్కారాలు జరగడం లేదని మొరపెట్టుకొన్నారట; తీవ్రవాదోపవాదాలు జరిగాక నేరమంతా విష్ణువుమీదనే మోపారని త్రిలోకసంచారి నారదుడు ఆర్షధర్మ పత్రికకు ఎ క్రెడెగ్ కరస్పాండెంట్ హోదాలో తెలియచేశాడట.

విష్ణుమూర్తి రామావతారంలో ఉన్నప్పుడు హనుమంతుడికి కోనసీమలో కోతిగా తిరగమని వరం ప్రసాదించడం కారణంగానే ఇప్పుడీ తిప్పలన్నీ వచ్చిపడ్డాయని సర్వదేవతల సభ తీర్మానించింది. హనుమంతుడు మామూలు వానరమై కోతిచేష్టలు చేస్తూ కొబ్బరికాయల్తో ఆడుకుంటూ ఈ అనర్థాన్ని తెచ్చిపెట్టాడని నిర్ధారణ చేశారు. వజ్రాలు దాచిన కొబ్బరికాయ దొరికేంతవరకూ నరమానవుడు దేవుడికి కొబ్బరికాయ కొట్టే అవకాశమే లేదని సభ అభిప్రాయపడింది.

ఇదంతా రామభక్త హనుమాన్‌వల్ల వచ్చిన అనర్థమే కాబట్టి విష్ణుమూర్తి వెంటనే కల్పించుకొని హనుమంతుడికి వెంటనే ఆదేశాలు జారీ చేయాలని సభ ఏకగ్రీవంగా తీర్మానించింది. ఆ తీర్మానం ప్రకారం హనుమంతుడు కొబ్బరికాయల్తో ఆడుకోవడం మానేసి వజ్రాల కొబ్బరికాయ ఎక్కడుందో వెతికి (వజ్రాల కొబ్బరికాయ హనుమంతుడే శివయ్య అనే తన భక్తుడిదగ్గర దాచిపెట్టాడని భూలోకంలో శాశ్వతంగా నివాస మేర్పరచుకొన్న చిల్లరదేవుళ్ళు పెద్ద ఆరోపణ చేశారని అభిజ్ఞవర్గాల భోగట్టా) ప్రభుత్వానికి, ప్రభుత్వంమీద నమ్మకంలేకపోతే ప్రజలకు అప్పగించాలి. తాజావార్త:

సర్వదేవతల సభ తీర్మానాన్ని సత్వరమే అమలు జరపమని కోనసీమలోవున్న వానర రూపధారి హనుమంతుల వారికి ఆదేశాలు విష్ణుమూర్తినుంచి అందాయని ఇంతకుముందే తెలిసింది. వివరాలకు 'నాస్తికధర్మ' వచ్చే సంచిక చూడండి అంటూ నాస్తికధర్మ విలేఖరి కథనం ముగించేశాడు.

అయితే అర్షధర్మ పత్రికవాళ్ళు ప్రివీకౌన్సిల్లో నాస్తిక ధర్మ పత్రికమీద పరువునష్టం దావా వేశారని తెలుస్తోంది – తమ పత్రిక ప్రకటించిన కొబ్బరికాయ కథనాన్ని వక్రించి నాస్తికధర్మ పత్రిక ప్రకటించిందని.

# 15

గూడెంలో గంగమ్మ శివయ్యమీద కారాలు మిరియాలు నూరుతూంది- ఇదంతా నీవల్లే వచ్చింది. ఏడు వారాలైంది బిడ్డ కన్పించక అని.

ఈర్రాజు, సత్తిరాజు ఏమైపోయారో? గంగమ్మ ఊరూవాడా ఏకం చేసేస్తున్నది. పొంగిన గోదావరిలా ఆమె దుఃఖానికి అంతులేదు. ఇంత జరుగుతున్నా శివయ్య

కొబ్బరిబొండాలలో నీళ్ళలా తొణక్కుండా బెణక్కుండా నింపాదిగా ఉన్నాడు. అంతా ఆంజనేయుని దయ అనుకుంటూ నిమ్మకు నీరెత్తినట్టు కూర్చున్నాడు.

గౌరి ఏమైందో అన్న దిగులుతో నిద్రపట్టక గంగమ్మ అర్ధరాత్రివూట లేచి కూర్చుంది. ఇంటి పెరట్లో అలికిడైనట్టనిపించి బయటకొచ్చింది. కొబ్బరి ఆకుల నీడలో నిలబడ్డ ఇద్దరు మనుషులు గంగమ్మను చూసి గోడదూకి పారిపోయారు. గుర్రుపెట్టి నిద్రపోతున్న భర్తను లేపింది గంగమ్మ.

"మనింటిచుట్టూ మనుషులు తిరుగుతున్నారు. నాకు భయంగా వుంది. ఏందీ గొడవ?" గంగమ్మ అడిగింది.

శివయ్య ఆవలిస్తూ లేచినవాడల్లా భార్య మాటలు వింటూనే ఉలిక్కిపడ్డాడు. చప్పునలేచి భోషాణం తెరిచి ముడుపుగట్టిన కొబ్బరికాయ ఉందో లేదో అని చూసుకున్నాడు. గంగమ్మ ఆశ్చర్యంగా చూసి అదీసంగతి అనుకొని తలాడించింది.

"ఏందయ్యా? ఈ కొబ్బరికాయలోనే అవి ఉండాయా?" అన్నది. అవేమిటో చెప్పే ధైర్యం చాలలేదు గంగమ్మకు.

"నోరుముయ్యెశ! ఇది ఆంజనేయులోరి ప్రసాదం! కళ్లు పోతాయ్. పాపం మాటలు మాట్టాడకు."

భర్త మాటల్లో ఏదో అంతరార్థం ఉన్నట్టనిపించింది గంగమ్మకు. ఏనాడూ భర్త తనతో యిలా మాట్టాడలేదు. ఉన్నదున్నట్టు కుండ పగలేసినట్టు మాట్టాడేవాడు.

"ఆ కోతి తెచ్చిపడేసిన కొబ్బరికాయేనా?" తెగించి అన్నది గంగమ్మ.

"నీ యవ్వ! నీ బుద్ధి పోనిచ్చేవుగాదే! ఆంజనేయస్వామిని బట్టుకొని కోతంటావా తప్పుడు ముండకానా! కొత్త పడవ నీళ్ళళ్ళో వేసేటప్పుడు గౌరి చేతుల్లోంచి జారి గోదావరిలో పడింది యీ కొబ్బరికాయేనే పిచ్చిముండా!"

"అని ఎట్టా చెప్తావయ్యా?" ఎడంచేతిలో కుడిచెయ్యి గుద్ది అన్నది గంగమ్మ.

"నువ్వూ చూశావుగందే! హనుమంతులోరు సొంతంగా తెచ్చి పెజలందరూ చూస్తుండగా తెచ్చి నాముందు పడేసింది."

"ఆ కొబ్బరికాయే యిదని ఎట్టా రుజువు?"

"నీ యవ్వ! ఆంజనేయుడికి సాచ్చికం కావాలంటే? అట్టయితే రాములారే దిగిరావాలి!"

"దిగిరమ్మను!"

శివయ్య కళ్ళెర్రచేశాడు.

"నీ యవ్వ! నీ యవహారం శానాదాకా వచ్చిందే?"

"యవ్వారంకేంగాని నీ యింటిచుట్టూ తిరుగుతున్నోళ్ళను చూసుకో!" అని చిరబురలాడుతూ గంగమ్మ వెళ్ళి మంచమెక్కి ముసుగు తన్నిపట్టింది.

అసలు సంగతి అప్పుడు బుర్రకెక్కింది శివయ్యకు.

ఈ బోషాణంలో దాచిన కొబ్బరికాయలోనే.... శివయ్యకు వణుకుపుట్టింది. గుండెలు గుబగుబలాడాయి.

మూడుకోట్ల రూపాయల విలువైన వజ్రాలు-శివయ్య మెదడు బండబారిపోయింది. ఇవి కాజేయడానికేనా తన ఇంటిచుట్టూ వీళ్లు తిరుగుతుంది?

"గంగీ, లేలే!" పెళ్లాన్ని కొట్టిలేపాడు.

"వజ్జిరాలు! వజ్జిరాలు!" పలవరిస్తూ లేచి కూర్చుంది. గంగమ్మ.

"ఉష్! గోడకు చెవులుంటయ్!" హెచ్చరికగా అన్నాడు శివయ్య.

భోషాణం తెరిచి కొబ్బరికాయ తీసి తలగుడ్డ పరిచి మూట కట్టాడు శివయ్య.

"మనం ఈ కొబ్బరికాయ యింట్లో పెట్టుకొని ఇంకా ఇక్కడేవుంటే పీకలమీదకొస్తుంది. ప్రాణాలకే ముప్పు. లేలే!"

"ఈ అర్ధరాత్రిపూట ఎక్కడికి పోతావయ్యా?" గంగమ్మ అయోమయంగా అన్నది.

"ముందు నువ్వు బయల్దేరవే గంగీ?" కసురుకున్నాడు శివయ్య.

"గవర్నమెంటోళ్ళ కిచ్చేస్తావా?"

సాములోర్నడిగి ఆరెట్టా చేయమంటే అట్టా చేద్దాం!"

"ఎట్టెట్టా?" మొగుడికి మతేమన్నా పోయిందా అన్నట్టు చూసింది గంగమ్మ.

"ఇంత రాత్రిపూట ఎక్కడకెళ్ళి దాక్కుంటావయ్యా?" గంగమ్మ శివయ్య చెవులో నోరుపెట్టి అడిగింది.

"ఇల్లుకంటే గుడి పదిలం అన్నారే! రాములోరి గుళ్ళో తెల్లార్చుకుందాం పద." గుడ్డలో చుట్టిన కొబ్బరికాయ చంకలో పెట్టుకొని పెళ్ళాంతో బయలుదేరాడు శివయ్య. రహస్యంగా తాటితోపు తుమ్మలబీడు దాటుకొని గుడి వెనక్కొచ్చారు... ప్రహారీగోడల నీడల్లో నక్కి నక్కి మెల్ల మెల్లగా గుడిలోకి చేరారు.

"ఈ కొబ్బరికాయలో ఉంది వజ్రాలేనంటావా?" రహస్యంగా అడిగింది గంగమ్మ - భర్త పక్కన చతికిలబడి కూర్చుంటూను.

"అది ఆ భగవంతుడికే ఎరుక!" గర్భగుడివైపు తిరిగి రెండు చేతులూ జోడించి చెప్పాడు శివయ్య.

"ఏదో? నువ్వొక్కటీ సరిగా చెప్పవుగందా?" నిట్టూర్చింది గంగమ్మ.

"ఓ వెర్రిమొగమా! మన పడవ బయలుదేరిన రాత్రి గుర్తుందా? తెల్లవారుజామున లేచి బయటికెళ్తుంటే ఎక్కడికని అడిగావు!"

"రాములోరి గుడిదగ్గర కెళతానన్నాని చెప్పావుగా!"

"ఇంతరాత్రిపూటేంపని అని అడిగావా?"

"అడిగాను. అయితే?"

"ఏమని చెప్పాను?"

ఓ క్షణం గుర్తుచేసుకొని గంగమ్మ చెప్పింది.

"నిద్దర పట్టటంలేదు. గౌరి తల్లిమీదే మనసంతాను, గుడికెళ్ళి రాములోర్ని మేలు చెయ్యమని మొక్కుకొందామని గదా ఎళ్ళావు?"

శివయ్య గుబురుమీసాలకింద సన్నగా నవ్వుకున్నాడు.

"ఏందయ్యా మాట్టాడవు. అంతేనా?"

"అసలు సంగతి అదికాదే! ఆడదాని నోట్లో నువ్వుగింజ నానదని నీకు చెప్పలేదు. ఆ రాత్రి ఆంజనేయసామి కలలో కన్పించి రాములోరి గుళ్ళో పడుకున్న సన్నాసి తలకింద ఒక కొబ్బరికాయ ఉందనీ, దాన్ని తీసుకొని, నీ ధగ్గరున్న కొబ్బరికాయ వాడి తలకింద పెట్టమని చెప్పాడు సామి. ఎళ్ళిసూత్తునుగదా. నిజంగా సన్నాసి కొబ్బరికాయ తలకింద పెట్టుకొని గుడి ఎనకాల పడుకుని ఉన్నాడు. కొబ్బరికాయలు మార్చి సడీసప్పుడు గాకుండా ఇంటికొచ్చేశాను."

సిత్రంగా వుందే? తలకాయలు మారుస్తారని ఇన్నానుగాని కొబ్బరికాయలు మారుస్తారని ఇనలేదు" బుగ్గ నొక్కుకుంది గంగమ్మ.

"ఓసి ఎర్రిపీనుగా! అది హనుమంతుడి ఆజ్ఞ!"

"సుగ్రీవాజ్ఞ అని ఇన్నానుగాని హనుమంతుడి అజ్ఞ అని నేను ఇనలేదు?" కళ్లు తిప్పింది గంగమ్మ.

"అయితే ఇప్పుడిన్నావుగా. ఇహ నోరు మూసుకో! సప్పుడు చెయ్యకుండా పడుకో!"

"ఇంకా ఆవేశం ఎందుకయ్యా? కొబ్బరికాయ వగలగొట్టి నూడు. వజ్రాలున్నాయేమో?" గొంతు తగ్గించి గుసగుసలాడింది.

"కళ్లుపోతయ్యే గంగీ! ఆంజనేయసామే కల్లోకొచ్చి ఏంచేయాలో శలవిస్తారు. ఆ సామి చెప్పినట్టే చేయాలి. ఈ కొబ్బరికాయ వారిది. కాయ ఆంజనేయసామిదైతే అందులో కొబ్బరి ఆరిదే, నీళ్లు ఆరివే. వజ్రాలూ ఆరియ్యేనే యెర్రిదానా?"

మొగుడివంక అనుమానంగా చూసింది గంగమ్మ! ముసలాడేదో తనను మాయజేస్తున్నాడు. ఆంజనేయసామి కలలోకి రావడమేమిటి - కాయలు మార్చడం ఏమిటి? విడ్డూరం గాకపోతే! ముసలాడేదో దాస్తున్నాడు! నిజంగా హనుమంతుడు కల్లోకొచ్చి యీ కొబ్బరికాయ గవర్నమెంటోళ్ళకు యియ్యమంటే? ముసలాడు చాదస్తుడు. అంతపనీ చేస్తాడు. మూడు కోట్లరూపాయల విలువైన వజ్రాలని జనం గుంపులుపడి ఆగుబ్బుగా చెప్పుకోవడం తను విన్నది. అసలు యిన్నిటికీ కాయలో వజ్రాలున్నాయా?

భర్త నిద్రపోయాక ఆ సంగతేదో తేల్చుకొందామని నిర్ణయించుకున్న గంగమ్మ నిద్ర ముంచుకువస్తోన్నట్టుగా వట్టొట్టి ఆవలింతలు చేసింది. కళ్ళు అరమూతలువేసి పక్కనే మేనువాల్చిన భర్తను దొంగచూపులు చూస్తూ పడుకొన్నది గంగమ్మ.

శివయ్య గురక మానేసి "వచ్చావా సామీ. దణ్ణం. దణ్ణం" అని కలవరిస్తున్నాడు. ఇదే అదననుకొని గంగమ్మ భర్త తలకింద ఉన్న కొబ్బరికాయను సంగ్రహించి అడుగులో అడుగులేస్తూ తిరిగి తిరిగి చూస్తూ గుడి వెనక్కు చేరింది.

గుడి వెనక గొంతు కూర్చుని కొబ్బరికాయ ముందేసుకొని పీచు తీయడానికి ఉపక్రమించిన గంగమ్మ ఎదురుగా నిలబడ్డ నిలువెత్తు మనిషిని చూసి అమాంతం వెనక్కు పడి గుడ్లు తేలవేసింది. తెప్పరిల్లుకొని లేచి అరవడానికి ప్రయత్నిస్తున్న గంగమ్మ నోటికి చెయ్యి అడ్డంపెట్టి "నేనే సత్తిరాజును, అరవమాక!" అన్నాడు.

"ఒరే సత్తిగా! నువ్వా! గౌరేదిరా?" అని అడిగింది గంగమ్మ. పాపం, తల్లి మనసు గదా!

"పటాకుల రత్తయ్యమురా చేతుల్లో ఉండిపోయిందే గంగమ్మత్తా!"

"అయ్యో నా కూతురా!"

"ఉష్ ఉష్! ఊరుకో వింటారు. గుడిచుట్టూ రత్తయ్య ముఠా కాపేసి ఉంది, బయట కార్లో గౌరిని కట్టిపడేసి ఉంచారు. ఈ కొబ్బరికాయ వాళ్ళకప్పచెప్పితే గౌరిని వదిలేస్తారు. ఆ ఒప్పందంమీదే ఆళ్ళను ఇక్కడికి తీసుకొచ్చా. ఇచ్చేయ్ ఆ కొబ్బరికాయ!

"ఇది దేముడిచ్చిన కొబ్బరికాయ. మీ మామయ్య ఒప్పుకుంటాడా?" సత్తిరాజు ముఖంలో ముఖం పెట్టి మెల్లగా అన్నది.

"గౌరికంటే ఎక్కువంటావా ఇది? ఇది వాళ్ళ చేతుల కందకపోతే గౌరి మనకు దక్కదు. గొంతు పిసికి గుడి ముందు పారేస్తారు. నీకూ నాకూ మామయ్యకూ చావు తప్పదు."

"వజ్రాలు!"

"మూడకోట్ల వజ్రాలయితే మాత్రం మన గౌరికంటే ఎక్కువేందే? ముష్టి మూడొజ్రాలు! జాగుచేశావంటే రత్తయ్య ముఠా లోపలకొచ్చేస్తారు. ఆళ్ళను పోలీసులు వెంబడిస్తున్నారని తొందర్లో బయట నిలబడ్డారు. ఆలీసం చేశావంటే ఆళ్ళు తెగించి లోపలకొచ్చేస్తారు. ఆ తర్వాత మనం చేసేదేమీ ఉండదు. తే. తే," అంటూ సత్తిరాజు గంగమ్మ చేతుల్లోంచి కొబ్బరికాయ లాగేసుకొన్నాడు.

"ఏందిరా నీయమ్మ ఇంతసేపు!" ఇద్దరు దృఢకాయులు గుడిప్రాకారపు గోడలు దూకి లోపలకొచ్చారు.

"ఇదిగో కొబ్బరికాయ!" సత్తిరాజు చూపించాడు. ఇద్దర్లో కోలముఖంగాడు చెయ్యి ముందుకు చాచాడు.

సత్తిరాజు చప్పున కొబ్బరికాయ ఉన్న చెయ్యి వెనక్కి తీసుకొన్నాడు.

"ముందు గౌరిని వదలండి! తర్వాతే కొబ్బరికాయ!" సత్తిరాజు వెనక్కు వెనక్కునడిచాడు.

"అమ్మ కంత్రీనాకొడకా! వదులుతాం. వదులుతాంరా!" అంటూనే మీద మీద కొచ్చారిద్దరూ.

"మీ ఒప్పదం ఏంటిరా? ఇప్పుడు మీరు మాట్లాడేదేంది?"

"రేయ్, మమ్మల్నే బిత్తరకొట్టాలని చూస్తున్నావా? దాన్నొదిలేసి మేమిటు వెళ్ళగానే పోలీసోళ్ళను తీసుకురావాలని చూస్తున్నావు గదరా! కొబ్బరికాయ సముద్రం దాటి వెళ్ళేంతవరకూ గౌరి మా దగ్గరే ఉండాలి. ఈ సంగతి బయటికి పొక్కిందో పిల్లముండ ప్రాణాలు దక్కవ్. తెలిసిందా! ఇటియ్యి," పొత్రంముఖమాడు ముందునుంచి సత్తిరాజు మీద పడ్డాడు. వెనకనుంచీ రోకలి ముఖంగాడు కమ్ముకొన్నాడు.

"సత్తిరాజూ! ఇచ్చావంటే గౌరి మనకు దక్కదు!" గుడి కుడిపక్కనుంచి కేక వినిపించింది.

"ఈర్రాజూ!" సంభ్రమాశ్చర్యాలతో అరిచాడు సత్తిరాజు.

రెప్పపాటులో సత్తిరాజు చేతిలో ఉన్న కొబ్బరికాయ గాల్లోకి లేచి ఈర్రాజు చేతుల్లో వాలింది. సత్తిరాజును వదిలేసి ఈర్రాజుమీద పడ్డాడు పొత్రంగాడు, రోకలిబండగాడు.

ఈశ్రాజు, సత్తిరాజు చేతుల్లో బంతిలా ఎగురుతున్నది కొబ్బరికాయ.

తెలతెలవారుతోంది.

కొబ్బరికాయను ఒకరి చేతుల్లోంచి మరొకరి చేతుల్లోకి విసురుకొంటూ గుడిచుట్టూ తిరుగుతున్నారు సత్తిరాజు, ఈశ్రాజు. లోపల జరుగుతున్న అల్లరి విని బయట వున్న రత్తయ్య ముఠా – ఐదారుగురుదాకా ప్రహరి దూకి లోపల కొచ్చారు. శివయ్య లేచాడు. తలకింద కొబ్బరికాయ లేకపోవడం చూసి గాభరాపడ్డాడు. గాల్లో ఎగురుతున్న కొబ్బరికాయను, దానికోసం పరుగులు తీస్తున్న మనుషుల్ని చూసి తత్తరపోయాడు! గుడిమెట్లు దిగివచ్చిన శివయ్యకు సత్తిరాజు, ఈశ్రాజు కనిపించారు.

"గంగమ్మత్తా!" ఈశ్రాజు కొబ్బరికాయ విసిరాడు మీదబడ్డ ముగ్గురి మనుషులకు అందకుండా. ఈశ్రాజును వదిలేసి గంగమ్మ మీద పడ్డారు వాళ్లు.

"గంగీ!" అరిచాడు శివయ్య.

మరుక్షణంలో కొబ్బరికాయొచ్చి శివయ్య చేతుల్లో వాలిపోయింది.

"సామీ! నీ కొబ్బరికాయ నీకే ఇస్తున్నా! అందుకో ఆంజనేయా!" కొబ్బరికాయ గుడిమీదకు విసిరాడు శివయ్య.

గుడి గోపురం మీద నిద్రపోతున్న కోతి లేచి కూర్చున్నది. పళ్ళు బిగించి కిచకిచలాడింది. నోరు తెరిచి కవ్వింపుగా చూసింది. గుడిమీద చెక్కిన రాములోరి బొమ్మ కాళ్ళ దగ్గర ఇరుక్కుపోయిన కొబ్బరికాయను అందుకొన్నది.

రత్తయ్య మనుషులు గుడిఎక్కి పాకుతున్నారు. ఈశ్రాజూ, సత్తిరాజూ వాళ్ళ కాళ్ళు పట్టుకొని కిందకు గుంజుతున్నారు.

శివయ్య, గంగమ్మలను ఇద్దరు మనుషులు పెడరెక్కలు విరిచి పట్టుకొన్నారు.

కోతి కొబ్బరికాయ లంకించుకొని రాములోరి పెద్దగుడి మీదనుంచి సీతమ్మోరి చిన్న గుడిమీదకు, సీతమ్మోరి చిన్న గుడిమీదనుంచి లక్ష్మణస్వామి బుల్లి గుడిమీదకు దూకుతూ రత్తయ్య ముఠాను మూడుచెరువులు నీళ్లుతాగించి ముప్పుతిప్పలుపెట్టి ముప్పందుల కోనసీమ జీళ్లు తినిపించింది.

విసిగి వేసారిన రత్తయ్య కత్తితీసి విసిరాడు. అదిచూసి శివయ్య "సామీ! ఆంజనేయసామీ?" ఎలుగెత్తి అరిచాడు. ఆ కేకకు ఎగిరి గంతేసిన కోతి కత్తిదెబ్బ తప్పుకొన్నది. కత్తి గోపురానికి తగిలి గిరగిరా తిరికొచ్చి అది విసిరిన రత్తయ్య మెడమీద పడింది. మెడతెగి రక్తం బొల బొలా కారుతోంది. రత్తయ్య మనుషులు కోతిమీదకు విసురుతూన్న రాళ్ల రప్పలు వదిలేసి, మెడతెగిన కోడిలా కిందబడి గిలగిలా కొట్టుకుంటున్న రత్తయ్యను భుజాన వేసుకున్నారు.

ఇంతలో ప్రాకారం బయటనుంచి పోలీసు ఈలలు విన్పించాయి. భుజాలమీద కెత్తుకున్న రత్తయ్యను అక్కడే పారేసి రత్తయ్య మనుషులు ప్రాకారంమీదికి పాకసాగారు.

పారిపోతున్న రత్తయ్య ముఠాను తరిమి తరిమి పట్టుకున్నారు పోలీసులు.

ఈశ్రాజు, సత్తిరాజు వెళ్ళి, కారు వెనకసీట్లో కట్టిపడేసి వున్న గౌరిని కట్లువిప్పి తీసుకొచ్చి శివయ్య దంపతులముందు నిలబెట్టారు.

గోపురంమీద కంచుశిఖరాలమధ్య కొబ్బరికాయ వళ్ళో పెట్టుకొని తాపీగా కూర్చున్న కోతి కిందవున్న ఎఱ్ఱబుట్టల్ను కొత్తగా చూసి వింతగా కిచకిచలు చేసింది.

రత్తయ్య మురాను పట్టుకోవడానికి స్వయంగా వచ్చిన జిల్లా పోలీసు అధికారి ఈఱ్ఱాజును, సత్తిరాజును అభినందించాడు.

ఆ కోత్తి దగ్గరున్న కొబ్బరికాయ తెచ్చియిస్తే సర్కారు చేత పెద్ద ఈనాం యిప్పిస్తానని ఆశపెట్టాడు. "దొరా! అది మావల్ల కాదు" అన్నారు ఈఱ్ఱాజు, సత్తిరాజు కూడబలుక్కున్నట్టు.

"దొంగలయితే దొరికారు - కాని అసల్ది కొబ్బరికాయ దొరక్కపోతే ముప్పైరోజులుగా దేశమంతా గాలించిన మా శ్రమ వృధాపోతుంది" అని చుట్టూ నిలబడివున్న పటాలాన్ని చూశాడు.

"ఇక్కడ్నుంచి కోతి తప్పుకుందో - మీ కొలువు లూడిపోతాయ్! జాగ్రత్త! చుట్టూ కమ్మండి. కొంతమంది బయటకెళ్ళి చెట్టూపుట్టా దగ్గర నిలబడండి. ఈ కోతి ఎక్కడి కెళుతుందో చూస్తా!" నడుము బిగించి యుద్ధానికి సన్నద్ధమవుతున్న వీరుడిలా శిఖరాగ్రాన కూర్చున్న కోతివైపు చూశాడు. కోతి చంకలు గోక్కుని వెక్కిరించింది. అధికారికి ఒళ్లు మండిపోయింది.

ఓ పదిమందిదాకా గోపురం ఎక్కసాగారు. సగంమంది మధ్యదాకా వెళ్ళి ఆగిపోయారు. ఓ నలుగురు మూడొంతులు ఎక్కి అటుపైకి వెళ్ళలేక, ఇటు కిందకు దిగలేక అక్కడే ఉండిపోయారు. ఎట్టకేలకు ఒకడు శిఖరాగ్రం చేరాడు. కింద నుంచి పటాలం అంతా హర్షధ్వానాలు చేసింది. ఆ జవానుకు డబుల్ ప్రమోషనా, త్రిబుల్ ప్రమోషనివ్వాలా అని అప్పుడే ఆలోచిస్తున్నాడు యస్పీ. అంగుళం అంగుళం పాకుతూ కలశాలను సమీపించాడు. ఒక కలశాన్ని ఆనుకొని రెండో కలశాన్ని తన్నిపట్టి కొబ్బరికాయ ఒళ్ళోపెట్టుకొని దర్జాగా, ఠీవిగా కూర్చున్న కోతి ఒక్కసారి లేచి, కొబ్బరికాయతో పైకి వస్తున్న వాడి తలకాయమీద మొత్తింది.

గోపురం మీదనుంచి గిరగిరా దొర్లుకుంటూ కిందబడ్డాడు జవాను. నడుములు విరిగిపోయాయి. తల కొబ్బరికాయ పగిలినట్టు మధ్యకు పగిలింది.

పోలీసు అధికారి రుద్రుడైపోయాడు. ఒళ్లు తెలియని కోపంతో రివాల్వర్ తీసి 'ఎటన్షన్' అని అరిచాడు.

"టక్ టక్" పటాలం మొత్తం ఒక్కసారిగా చేసిన బూట్లశబ్దంతో దేవాలయ ఆవరణంతా నిండిపోయి గోపురం ప్రతిధ్వనించింది.

గుడిచుట్టూ వలయాకారాలలో నిలబడి తుపాకులెక్కుపెట్టి ఆజ్ఞలకోసం ఎదురుచూస్తూ నిలబడ్డారు జవాన్లు.

"రడీ! షూ-"

"దొరా! ఆగు! అవరాధం, అవరాధం! ఆంజనేయసామి! సాచ్చాత్తూ హనుమంతులోరు ఆయన!" శివయ్య ఆక్రందనకు గుడిలోవున్న రాములోరి రాతివిగ్రహం కరిగిపోయి ఉండాలి.

లబలబలాడుతూ తుపాకులకు అడ్డం పడ్డాడు. కోతిని చంపొద్దని అధికారి కాళ్లు పట్టుకొన్నాడు శివయ్య.

"మరయితే ముసలాడా! కోతిని చంపనుగాని ఆ కోతి దగ్గరున్న కొబ్బరికాయ తెచ్చిస్తానంటావా?" వెటకారంగా అన్నాడు పోలీసాయన.

"ఔ! దొరా– తెచ్చిస్తా!"

తుపాకిగుండు తగిలినట్లయిపోయాడు జిల్లా అధికారి.

"ఏంరా! ముసలోడా! నాటకమాడుతున్నావా? ఒళ్లు చీరేస్తా లే అడ్డంలే!" గర్జించాడు సూపరింటెండెంటు.

"సత్తెపెమాణంగా చెవుతున్నా దొరా! నే నడిగితే ఆంజనేయసామి తప్పకుండా యిస్తాడు. ఆ రోజు అడగందే ఇచ్చిన సామి, ఇయ్యాల అడిగితే ఎందుకియ్యడు దొరా? నా మాట నమ్ము!" కాళ్ళావేళ్ళాపడి ప్రాధేయపడ్డాడు శివయ్య.

"అడగందే ఇచ్చాడా?" యస్పీ టోపీ తీసి తల రుద్దుకున్నాడు. శివయ్య ముఖాన్ని పరిశీలించి చూశాడు. కళ్ళల్లోకి అనుమానంగా చూశాడు.

ఈ కోతి వీడి పెంపుడుకోతే! సందేహం లేదు. ఈ కోతిని అడ్డంపెట్టుకొని ఎంత నాటకం ఆడాడు! దేశాన్ని అల్లకల్లోలం చేసేశాడు. అంతర్జాతీయ వజ్రాల దొంగలముఠాకు ఆలిండియా ఏజెంటు వీడే! సందేహం లేదు. దొరికాడు నా కొడుకు–ముసలినక్క! ఈ దెబ్బతో డబుల్ ప్రమోషన్ ఐ.జి.పి....

"నా మాట నమ్ముదొరా!"

రాబోయే ప్రమోషన్ను ఊహించుకుంటూ ఏదో లోకంలా ఉన్న యస్పీ ఉలిక్కిపడ్డాడు.

"నీమాటే నమ్ముతున్నా(నా ఒరే ముసలోడా! మాట తప్పావో?"

"తుపాకేసేయ్ దొరా! నా తలకోసి నీ కళ్ళముందు పెడతా!" శివయ్య శపథం చేస్తున్నట్టున్నాడు.

"ఆరమ్స్ డౌన్! ఎటీజ్!"

పటాలం మళ్ళా ఒక్కసారిగా తుపాకులుదించి కాళ్ళు ఎడంగాపెట్టి నిలబడ్డారు.

శివయ్య పైపంచతో ముఖం తుడుచుకొని నిట్టూర్పు విడిచాడు.

వీడే – సన్యాసిని చంపిందికూడా యీ ముసలాడే అయి ఉంటాడు. కూతుర్ని అడ్డంపెట్టి మేనళ్ళులిద్దరిని కొబ్బరికాయ దాటేయడానికి ప్రయత్నించాడు. పందెం – పడవా అంతా హంబక్!

ఈ తెలివితేటలన్నీ వీడి కెక్కడ్నుంచీ వచ్చాయో! పేగియాస్ అన్న అంతర్జాతీయ ముఠావాళ్ళవే అయివుండాలి. పర్‌ఫెక్ట్ క్రైం!

రెండోముఠా అడ్డం తగిలేసరికి పడవ ముంచేసి కొబ్బరికాయ కోతి కిచ్చాడా? తన ఆలోచనలో మళ్ళీ ఇక్కడే ఏదో లింకుపోయినట్టయి, టోపీ చమట తుడిచి నెత్తిన పెట్టుకొన్నాడు యస్పీ.

ఇంతకీ యీ వజ్రాలవేటలోవున్న ముఠాలు రెండా – మూడా? ఈ ముసలోడిని ఆ కుర్రనాకొడుకుల్ని బొక్కలో తోసి నాలుగు ఉతికితే అంతా వాళ్ళే చెప్తారు. ముందీ

కొబ్బరికాయ దొరకనీయ్. మెయిన్ ఎక్జిబిట్ యిదే! ఇది లేకపోతే అసలు కేసుకు ఆధారమే లేదు. అందుకే ముందీ కొబ్బరికాయ చేతిలో పడనీయ్! తనకు తనే చెప్పుకొన్నాడు యస్పీ.

"ఒరే ముసలోడా, నీ పేరేంటన్నావ్?"

"శివయ్య."

"ఒరే శివయ్యా! నీ పడవకథ, నీ కూతురి పెళ్ళికథా – నీ కథంతా మా సి.ఐ.డి.లు ఎప్పుడో రిపోర్టు చేశార్రా, నాకంతా తెలుసు! పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యకుండా కొబ్బరి కాయతోపాటు కోతినికూడా అప్పచెప్పాలి. తెలిసిందా?"

"దొరా!" బాధతో శివయ్య మెలికలు తిరిగిపోయాడు – "కొబ్బరికాయుంచుకొని.."

"హార్నీయమ్మ. కోతిని వదిలేయమంటావా? అది ఎక్యూజుడ్ నంబరు టూరా ఆ కోతిని హాజరువరచకపోతే కోర్టు ఆ కేసు కొట్టేస్తదిరా. అందుకని కోతి ముఖ్యం. అవసరమయితే నిన్ను అప్రూవర్‌గా తీసుకుంటామ్. ఏమంటావ్?"

యస్పీ మాట్లాడిందేమీ అర్థం కాలేదు శివయ్యకు. అయోమయంగా చూశాడు.

"దొరా! అది కోతిగాదు – ఆంజనేయసామి సూడుదొరా!" అంటూ శివయ్య తల పైకెత్తి రెండుచేతులు జోడించి "సామీ, ఓ ఆంజనేయసామీ! ఇక నావల్లకాదు; నిన్ను నువ్వే కాపాడుకోవాలి!" అన్నాడు.

తల పైకెత్తి చూస్తున్న యస్పీని గోపురాగ్రాన కూర్చున్న కోతి గుర్రుగా చూసి 'ఊఁ ఊఁ' అంటూ గూపులు చేసింది.

కోతికేసి కన్నార్పకుండా చూస్తోన్న యస్పీకి కళ్లు బైర్లుకమ్మి తల తిరిగిపోయింది.

దయ్యంపట్టి చిందులు తొక్కుతున్న పెళ్ళాం కళ్ళముందు కదిలింది. "శ్రీరామాంజనేయం, ప్రసన్నాంజనేయం" అంటూ భూతవైద్యుడు పెళ్ళాన్ని వేపమండలతో చితకబాదే దృశ్యం – ఆ తర్వాత ఆవిడ సొమ్మసిల్లి, తేరుకొని ఆంజనేయుడి ఫోటోకి కొబ్బరికాయ కొట్టే దృశ్యం సురభివాళ్ళ నాటకంలో వైరువర్కులా కన్పించింది.

యస్పీగా పిలవబడుతూ యూనిఫాంలోవున్న అసలు మనిషి సుబ్బారాయ నామధేయుడు బయటికొచ్చాడు. చేయియెత్తి దండం పెట్టడానికి నామోషీ అయి, టోపీతీసి చేత్తోపట్టుకొని, ఇన్ ఆనర్ ఆఫ్ మంకీ గాడ్ శాల్యూట్ చేశాడు.

నాలుగువేల సంవత్సరాల భారతీయ సంస్కృతి – నూరేళ్ళ పాశ్చాత్య నాగరీకం ఘర్షణపడ్డాయి ఆ క్షణంలో.

అది చూసిన జవాన్‌లు తుపాకిలెత్తి పట్టుకొని పటాపట్ కటూకట్ చేసి శాల్యూట్ కొట్టారు. కొబ్బరికాయ కాళ్ళమధ్య ఇరికించుకొని రెండుచేతుల్తో చంకలు గోక్కుంటూ కోతి వందనస్వీకారం చేసింది.

తనను తాను తెలుసుకొని బిత్తరపోయాడు మనిషి. సుబ్బారాయుడ్ని యూనిఫారంలోకి తొక్కేసి యస్పీ కొచ్చాడు.

"ఎటన్‌షన్!"

పటాపట్ కొట్టి నిలబడింది పటాలం మళ్ళీ.

"రేయ్ ముసలోడా! ఏందిరా, మంత్రమేస్తున్నవా మంత్రం! డొక్క చీరేస్తా. ముందా కొబ్బరికాయ దించు - దించూ!" రంకెలు వేశాడు యస్పీ.

"అట్టాగే దొరా! తవరొక్కరే ఈడుండి జనాన్‌లందరినీ బయటకి పంపించండి."

"అమ్మ కేటునాకొడకా! అందర్నీ బయటికి పంపించి నన్ను ఏమారుద్దామనుకొంటున్నావా?" సుబ్బారాయుడ్ని తొక్కేసి యస్పీ అన్నాడు.

"దొరా! నీదగ్గర పిస్తోలుంది. నీకేటి భయం?"

శివయ్య ముఖంలోకి అదోలాచూసి ఎస్పీ పటాలాన్ని ప్రాకారం బయటికి పొమ్మని ఆర్డరిచ్చేశాడు. పటాలం లెఫ్ట్‌రైట్ మార్చి చేస్తూ వెళ్తూంటే కలశాలమీద హనుమంతయ్య ఉయ్యాల లూగాడు.

"సామీ! ఆంజనేయసామీ! అంతా చూశావుగా?" రెండు చేతులూ జోడించి పైకెత్తి దణ్ణంపెట్టూ - శివయ్య విన్నవించుకొన్నాడు.

"నువ్వు రాములోరి బంటువు. నేను నీ బంటుని! దయుంచి ఆ కొబ్బరికాయ దయచేయి సామీ!"

'ఆకాశంబుననుండి శంబుని శిరంబందుండి' అన్నట్టుగా దొర్లుకుంటూ పొర్లుకుంటూ గుడిగోపురాగ్రంనుంచి భూమ్మీదకు వస్తూన్న-

కొబ్బరికాయను చూసినవాడై శివయ్య ఏమంటున్నాడయ్యా అంటే -

"శ్రీమద్ రమారమణ గోయిందో హారి!

రామభక్త హనుమాన్‌కు జై!!

వాలి కేత సామికీ జై!!"

తన్మయుడై పోయిన శివయ్య రెండుచేతుల్తో కొబ్బరికాయను పట్టుకొని కళ్ళకు అద్దుకొన్నాడు.

# 16

సభాప్రాంగణం కిటకిటలాడిపోతూంది. దేశం నలుమూలల్నుంచీ జనం వచ్చారు. దేశవిదేశాలనుంచి ప్రతినిధులొచ్చారు.

విక్టోరియారాణిగారి ప్రత్యేకదూత వేదికమీద ఆశీనులైవున్నారు. ఆయన పక్కనే విదేశాంగమంత్రి కూర్చున్నాడు. ఐరోపా రాయబారులు, ఆఫ్రికాదేశాధిపతులూ, ఆసియా వాణిజ్య వ్యవహారాల మంత్రులూ, అమెరికా దేశీయాంగ మంత్రి, సి. ఐ. ఏ బాసూ, ప్రివీకౌన్సిల్ సభ్యులూ, న్యాయమూర్తులూ, ఇన్‌టర్‌పోల్ అధికారులూ వేదికమీద కొలువుతీరి ఉన్నారు. ప్రపంచ వ్యాప్తంగా ఎక్కువ సర్క్యులేషన్ ఉన్న ప్రముఖ పత్రిక ప్రత్యేక విలేఖరులూ, ఎక్కువగా కొనబడి చదవబడే పత్రికల ఎడిటర్లూ, కొనకుండా ఎక్కువగా చదవబడే పత్రికల యజమానులూ. యజమానురాళ్ళూ వేదికకింద మూడు వరసల్లో కూర్చున్నారు. ఐ. జీ.లు వేదికమీద, డి. ఐ. జీలు, వేదికచుట్టూ యస్పీలు, యస్సైలు జనం మధ్య, జవాన్‌లు జనం వెనక నిలబడి ఉన్నారు. కదిల్తే నొక్కేసేట్టు మనిషికొక్క పోలీసోడు, కనీవినీ ఎరుగని బందోబస్తు.

ఠంచనుగా నిర్ణీత సమయానికి యస్పీ డబ్బారేకుల సుబ్బారాయుడు సీలువేసిన చిన్నసైజు భోషాణం లాంటి ఉక్కుపెట్టెను, స్పెషల్ సెక్యూరిటీ కమాండోలు వెంటరాగా, వేదికమీదకొచ్చి రాణిగారి ప్రత్యేకదూత – ఆనాటి ముఖ్య అతిధిఅయిన సర్ లాంగ్‌కోట్ ముందుంచాడు. ఫొటోగ్రాఫర్లు తోసుకుతోసుకొని క్లిక్కులు కొట్టూంటే వేదిక మెరుపుల్తో ధగధగలాడిపోయింది.

సర్ లాంగ్‌కోటుగారు ఐదు నిముషాలపాటు పారిస్ మ్యూజియంలో మాయమైన వజ్రాల విశిష్టతను, ప్రాముఖ్యతను గురించి చెప్పి, వజ్రాల దొంగలముఠాను పట్టుకోవడానికి దేశవిదేశాల పోలీసు అధికారుల కృషిని ప్రశంసించి, జూలూడిపోయిన సింహంమల్లే సభను పర్యావలోకించారు.

ఒకమూల శివయ్య దంపతులు చేతులు కట్టుకొని పోలీసు బందోబస్తుమధ్య నిలబడివున్నారు. వాళ్ళపక్కనే ఈశ్రరాజు, సత్తిరాజు, వాళ్ళిద్దరిమధ్యన గౌరి వరుసగా నిలబడి ఉన్నారు.

సర్ లాంగ్‌కోట్ తల పంకించి, భోషాణం పెట్టెను ఎత్తి, వేదికమీద వాళ్ళకు కిందవాళ్ళక్కూడా చూపించి సీలు ఊడదీశాడు. పెట్టెతెరిచి కొబ్బరికాయ బయటికితీశాడు. ఎత్తిపట్టుకొని మళ్ళీ అందరికి తిప్పి తిప్పి చూపించాడు.

అమెరికానుంచి ప్రత్యేకంగా రప్పించబడిన బ్రేక్ టెంకాయ నిపుణుడు, రష్యానుండి 'పీస్ టెంకాయ' నిపుణుడూ ముందుకు వచ్చి సర్ లాంగ్‌కోట్‌గారినుంచి కొబ్బరికాయను అంది పుచ్చుకొన్నారు. నిపుణులిద్దరూ విడివిడిగానూ, కలిసి కట్టుగాను పరీక్షించి 'దీసీజ్ నథింగ్ బట్ టెంకాయ అండ్ ఓన్‌లీ టెంకాయ' అని విడివిడిగా తమ అభిప్రాయాల్ని తెలియజేశారు. విడివిడిగా చెప్పినా కూడా అది ఏకగ్రీవమైన అంగీకారం అవడం అందర్నీ సంభ్రమాశ్చర్యాల్లో ముంచివేసింది. అందులోనుంచి తేరుకొన్నవారు తేరుకొన్నట్టు హర్షధ్వానాలు చేస్తూ తమ ఆమోదాన్ని తెలియజేశారు.

నిపుణుల పరిశీలన అయాక సర్ మిస్టర్ లాంగ్‌కోట్ టెంకాయ ఇంటర్‌నేషనల్ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ చీఫ్ ఇంజనీరు చేతికిచ్చాడు.

చీఫ్ ఇంజనీర్ సున్నితంగా కొబ్బరికాయను అటూ ఇటూ తిప్పి, పీచును అతి లాఘవంగా ఒక్కసారి గుంజేశాడు.

బట్టతలవాడి నెత్తిమీద విగ్గు లాగేసినట్టు గుండ్రటి బోడి టెంకాయ బయటపడింది.

వెంటనే 'పీస్ టెంకాయ' రష్యా నిపుణుడొచ్చి, ఆ పీచు ఎలా అంటించబడిందీ వేదికముందున్న వాళ్ళందరికీ వివరించి చెప్పాడు.

టెంకాయ ఇంటర్ నేషనల్ చీఫ్ ఇంజనీరు కురిడి కొబ్బరికాయను అతి నైపుణ్యంగా తిప్పి 'క్రాక్ టెంకాయ' నిపుణుడైన అమెరికన్ చేతుల్లో పెట్టాడు. టెంకాయ మధ్యకు ఎలా అతికించబడిందో వివరించి అమెరికా నిపుణుడు కూర్చున్నాడు.

వేదికమీద ఎత్తయిన బల్ల, ఆ బల్లమీద మఖమల్ బట్టపరిచి వుంది. టేబిల్‌మీద కొబ్బరికాయపెట్టి చీఫ్ ఇంజనీర్ సర్ లాంగ్‌కోటుకేసి చూశాడు. లాంగ్‌కోటుగారి అనుమతి పొంది కొబ్బరికాయ పగులగొట్టడానికి కౌంటు డౌన్ మొదలుపెట్టాడు.

వేదికమీద ఉన్నవాళ్లు, సభలో ఉన్నవాళ్ళు సముద్ర తరంగాల్లా లేచి నిలబడ్డారు. కెమెరాలు క్లిక్, ఫ్లాష్‌లైట్ల వెలుగుల్లో కళ్లు చిడతలారిపోతున్నాయి.

చీఫ్ ఇంజనీరు పదినుంచి అవరోహణ క్రమంలో చదువుతూ 'శూన్యం' (జీరో) అని ఆఖరి అంకె చదివాడు.

కొబ్బరికాయ రెండుగా విడిపోయింది.

మొహెంజదారో హరప్పాలనాటి మూడు బుల్లి బుల్లి మట్టి కోతిబొమ్మలు బయటపడ్డాయి.

ఒక కోతి కళ్లు మూసుకొని ఉంది.

రెండోది చెవులు మూసుకొని ఉంది.

మూడోకోతి నోరు మూసుకొని ఉంది.

వేదికమీదున్న వాళ్లు దిగ్భ్రాంతి చెందారు. వేదికకింద ఉన్నవాళ్ళు దిమ్మరపోయారు. భాషలో తేడా అంతే! జరిగింది మాత్రం ఒక్కటే!

అందరూ కళ్లునులుపుకొని తలలు విదిలించుకొంటుండగా ఫ్రెంచి దౌత్యోద్యోగి ఒకరు హడావుడిగా వేదిక మీదకు పరుగెత్తుకొచ్చారు.

ఫ్రెంచ్ విదేశాంగమంత్రి ముందుకొచ్చి వంగి చెవులో చెప్పాడు.

పారిస్ మ్యూజియంలో మాయమైన వజ్రాలు ఎలిసీ ప్యాలెస్‌లో దొరికాయని, దేశాధ్యక్షుడే యీ దొంగతనం చేయించి, వేరే కొబ్బరికాయలో మూడు కోతిబొమ్మలు పెట్టాడనీ, వజ్రాలు అపహరించడానికి సహకరించిన ఫ్రెంచి ప్రధానిని, హోంమంత్రిని మభ్యపరచడానికి నిజంగా కొబ్బరికాయలో వజ్రాలు దాచినట్టు, అది అంతర్జాతీయ దొంగల ముఠా కాజేసికెళ్ళినట్టు ఒక కట్టుకథ సృష్టించి ప్రచారం చేయించాడనీ, కె.జి.బి., సి.ఐ.ఎ. గూఢచారి సంస్థల ద్వారా వెల్లడవడంతో ఫ్రెంచి ప్రజలు తిరుగుబాటుచేసి ప్రెసిడెంటు నివాసమైన ఎలిసీ ప్యాలెస్‌మీద దాడిచేసి ప్రెసిడెంటును చంపి వజ్రాలను స్వాధీనం చేసుకొన్నారనీ, ప్రధాని, హోంమంత్రి దేశాన్ని వదిలి పారిపోయారని పారిస్‌నించి వర్తమానం ఇప్పుడే వచ్చిందని ఫ్రెంచ్ దౌత్యోద్యోగి విదేశాంగ మంత్రికి చెప్పాడు.

వెంటనే ఫ్రెంచ్ విదేశాంగమంత్రి మైక్ దగ్గరకొచ్చి జరిగిందిచెప్పి ఫ్రెంచి ప్రజల తరఫున, ప్రభుత్వం తరఫున భారత ప్రజలకు - ముఖ్యంగా కోనసీమ వాసులకు, ప్రత్యేకించి శివయ్య దంపతులకు, ఈశ్రాజుకీ, సత్తిరాజుకీ లాస్ట్ బట్ లీస్ట్‌గా - సారీ లాస్ట్ బట్ నాట్ లీస్టుగా గౌరికి క్షమాపణలు చెప్పుకొన్నాడు.

ఫ్రాన్సు దేశాధ్యక్షుడి దుశ్చర్యకారణంగా భారతీయులు అనుభవించిన కష్టాలకు నష్టపరిహారంగా వందేళ్ళ తర్వాత ఒక డజను మిరేజ్ విమానాలను స్వల్ప వడ్డీతో వాయిదాల మీద తీర్చుకొనే పద్ధతిలో అప్పుగా యిస్తానని పడిపోయిన ఫ్రెంచి ప్రభుత్వం తరఫున వాగ్దానం చేశాడు. అంతేగాదు, ఫ్రెంచి విదేశాంగమంత్రి శివయ్య నిజాయతీని మెచ్చుకుంటూ, ఒక వెయ్యినూటపదహార్ల ఫ్రాంకులు పారితోషికంగా నిండుసభలో, వేదికమీద నిలబడి ప్రకటించేశాడు.

అందుకు శివయ్య ముందుగా కృతజ్ఞత తెలియచేసి తర్వాత అన్నాడు:

"దొరా! నువ్వు బుడతకీచు దొరవో, పరాసుదొరవో నాకయితే తెలవదుగాని నువ్వు నా కిచ్చిన ప్రాంకులన్నీ ఎట్టి మీ ఎలిశమ్మ బంగళా ఎదురంగా మా ఆంజనేయసాములోరి గుడి కట్టించమని నా ఏడికోలు- యిన్నపాలు దొరా!"

సభికులు చేసిన హర్షధ్వానాలు ఎలిసి ప్యాలెస్‌దాకా వినిపించాయి. వేదికమీద వాళ్ళు కిందకూ, వెనకవాళ్ళు ముందుకూ వచ్చి శివయ్యను అభినందించారు.

"మరి మా మాటో?"

ఒకటితక్కువ ముక్కోటి దేవతలూ ఒకటై విలపించారు.

సమాప్తం.

ఎన్.బి. సశేషం లేదు!

# 17

జీప్ రాజమండ్రి స్టేషన్ ముందాగింది. కాయితాలను మడిచి కల్పన కిచ్చాను.

"ఎలావుంది మేడమ్?"

"బావుంది!"

"నిజం చెప్పండి మేడమ్?" కల్పన కళ్లు మెరిశాయి.

"నిజంగా చాలా బాగుంది కల్పనా!" నా బుర్ర కదిలిపోయింది. కల్పన యింత బాగా ఎలా రాయగలిగిందా అని ఆలోచిస్తూ జీప్ దిగి స్టేషన్‌లోకి నడిచాను.

గోదావరి ఎక్స్‌ప్రెస్ అరగంట లేటని చెప్పారు. ప్లాట్‌ఫారంమీద అటూయిటూ పచార్లుచేస్తుంటే కల్పన పక్కనే నడుస్తున్నది.

"ఏమిటి మేడమ్ ఆలోచిస్తున్నారు, నా కథను గురించే గదూ?" మనసుని చదివినట్లే అడిగింది. ఆశ్చర్యంగా చూశాను కల్పనను.

"అవును, నీ కథ గురించే."

"ప్లీజ్! ప్లీజ్! చెప్పండి మేడమ్!" చిన్నపిల్లలు కాడ్‌బరీ చాక్‌లెట్సు కోసం అల్లరి చేసినట్టుగా వుంది కల్పన ధోరణి.

"నీ కథకు ముగింపేది?"

"సమాప్తం అని రాసేనుగా మేడమ్? ఇట్లాంటి డౌట్ వస్తుందని యన్. బి. లో సశేషం లేదనికూడా రాశాను."

కొంటెపిల్ల! నవ్వాగడంలేదు నాకు.

"ఇంతకీ గౌరి ఎవరిని వరించింది? ఈర్రాజునా? సత్తిరాజునా?"

"అదే సస్పెన్స్! ముగింపు చెప్పేశానంటే సినిమావాళ్లు కథ కొట్టేస్తారు మేడం!అందుకని-"

"సర్లే! నాకు చెప్పు. నేనేమీ సినిమాలు తియ్యబోవడం లేదు."

కల్పన అటూ యిటూ తలతిప్పి చూసింది.

"ప్రొడ్యూసర్లెవరూ కథలు వెతుక్కుంటూ రైల్వేప్లాట్‌ఫారాలమీద తిరగడంలేదు కాని చెప్పు!"

"అది సినిమా తీశాక పిక్చర్ ఫెయిలయితే చేసే పని! ఇప్పుడు మీరొకటి..."

"ఏమిటీ?" ఆగి కల్పన ముఖంలోకి చూశాను.

"ప్రామిస్!"

"ఎవరికీ చెప్పనులే నీ ముగింపు - చెప్పు." కథకు ముగింపేమిటో తెలుసుకోవాలని ఆతృతగా ఉంది నాకు.

"మీకు కోపం రాకుండా వుంటే-"

"నా కోపం ఎందుకూ!" తెల్లబోయాను. అయోమయంగా వుంది.

కల్పన దగ్గరగా జరిగింది.

"ఈశ్రాజు, సత్తిరాజూ రామభక్తహనుమాన్ భక్తులై పోయారు!"

"అంటే?"

"ఆజన్మ బ్రహ్మచారులుగా ఉండిపోయారు."

"మరి గౌరి?"

"ఆంజనేయస్వామి భక్తురాలయి, ఆజన్మ బ్రహ్మచారిణిగా ఉండిపోయింది." ఆగి నా కళ్ళలోకి చూసింది.

"కోతి!" వచ్చే నవ్వును పెదవులకింద తొక్కిపట్టుకున్నాను.

"మరి కొబ్బరికాయో?" అల్లరిగా చూసింది కల్పన. వీపుమీద చరిచాను.

"మేడమ్! సీరియస్‌గా అడుగుతున్నా - కథమీద మీ విమర్శ - విశ్లేషణ కావాలి నాకు. చెప్పండి."

ఆలోచనలో పడ్డాను-కథంతా గుర్తుచేసుకుంటూ నడుస్తున్నాను.

"మీరేమి ఆలోచిస్తున్నారో చెప్పమంటారా మేడమ్!" నన్ను రాసుకొని నడుస్తూ అన్నది కల్పన.

"ఊఁ - చెప్పు చూద్దాం?"

"ఈ కథకు సాంఘికప్రయోజనం ఉందా అని!" ఆగి చూసింది.

"ఊఁ - ఇంకా?"

"సమాజంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయాన్ని గురించి ఏమయినా ఉందా?"

"ఇంకా?"

"ఆర్థికసిద్ధాంతాలు - మార్క్సిజం - శాస్త్రీయదృక్పథం"- నా ముఖంలోకి చూసి ఆగిపోయింది కల్పన.

నాకు నిజంగా కోపంవచ్చింది. ఆపుకోవడానికి నేను చేసిన ప్రయత్నం విఫలమైనట్టుంది. ముఖంచూసి గ్రహించింది కల్పన.

లేని నవ్వు తెచ్చిపెట్టుకొన్నాను. అనవసరంగా రియాక్ట్ అయానేమో ననిపించింది. ఒకోసారి అలా అయిపోతుంటుంది. స్పోర్టివ్‌గా కల్పన కేసి చూశాను.

"ఆగావేం? ఊఁ - కానియ్?" ప్రోత్సహిస్తూ భుజం తట్టాను.

"కథలో పడవకు బదులు కాంటెసా కారో వాయుదూతో పెడితే హీరో హీరోయిను ఎంచక్కా హాయి హాయిగా డ్యూయెట్లు పాడుకుంటూ శాంత గంభీర... "

"చాలు చాలు. అర్థమైంది. ఊఁ - తర్వాత?"

"బాండెడ్ లేబర్ల విముక్తి పోరాటానికి ఈ కథలో ద్రోహం జరిగిపోయిందని-"

"ఆఁ ఆ!" నాకు నిజంగానే ఇది అర్థం కాలా.

"లక్ష్మణస్వామీ, హనుమంతుడూ రాముడి కట్టుబానిసలు. ఎదురుతిరిగిన వీళ్ళ పోరాట పటిమను నీరు కార్చేసింది రచయిత్రి. రివిజనిస్టు. అదే కోనసీమ కాకుండా శ్రీకాకుళం అయితే!"

"ఆగాగు - అర్థమైందిలే!"

"ఇంకా మీరేమాలోచిస్తున్నారంటే-పడవలో చచ్చిపడివున్న సన్యాసి శవం లేచి...."

"స్టాప్, స్టాప్!" కల్పన వీపుమీద గట్టిగా చరిచాను. నవ్వాగడంలేదు. గబాగబా ముందుకు నడిచాము.

గోదావరి ప్లాట్‌ఫారంమీదకొచ్చి ఆగింది.

కల్పన సామాను కంపార్టుమెంటులో పెట్టించింది. డోర్ దగ్గర నిలబడి కల్పన కళ్ళల్లోకి సూటిగా చూశాను.

"నా అభిప్రాయాన్ని నువ్వు వినలేదే?"

"మీరు చెప్పలేదుగా!"

"నువ్వు చెప్పనిస్తేనా?"

"చెప్పండి!"

"విను!"

"యస్? మేడమ్!"

"ఒకటి - కథలో పౌరాణిక, జానపద, సాంఘిక ఇతివృత్తాలను కలిపి కిచిడీ కొట్టేశావు. రెండోది - భూత వర్తమాన కాలాలకు ఎల్లలు చెరిపేశావ్! మూడు-"

"ఒన్ మినిట్ మేడమ్! మీరు రెండుగా చెపుతున్నది వాస్తవానికి ఒకటే. భూత భవిష్యత్ వర్తమానకాలాలు కలిసిపోతే పౌరాణిక, జానపద, సాంఘికాలంటూ విడివిడిగా యితిహాసాలూ, యితివృత్తాలూ ఎలా వుంటాయి?"

దిమ్మరపోయాను. షి యీజ్ రియల్లీ ఎ జీనియస్!

"కల్పనా!" తర్వాత నోటమాట పెగల్లేదు.

రైలు కూతవేసింది.

"కల్పనా! కాలానికి గమనం లేదంటావా?"

మనసంతా తాత్వికచింతనమీద లగ్నమయింది.

"మేడమ్! ఈ కథను ప్రపంచవ్యాప్తంగా ప్రఖ్యాతిగాంచిన ఒక సిద్ధాంతం ఆధారంగా చేసుకొని రాశాను."

"సిద్ధాంతమా? ఏమిటది?"

"ఐన్‌స్టీన్ థియరీ ఆఫ్ రిలెటివిటీ!"

రైలు కదిలింది.

"బై - బై - కల్పనా! థాంక్యూ వెరీమచ్!"

చెయ్యి ఊపుతూ ప్లాట్‌ఫారంమీద నిలబడిన కల్పనను చూపు అందినంతవరకూ చూస్తూ డోర్‌దగ్గర నిలబడ్డాను.

థియరీ ఆఫ్ రిలెటివిటీ! సాపేక్ష సిద్ధాంతం - బుర్రలో గిరగిరా తిరిగిపోతోంది.

కంపార్టుమెంటులో ప్రవేశించి బెర్త్‌మీద కూర్చున్నాను. తలెత్తి చూశాను.

ఎదురుగా ఆ మాజీమంత్రి!

గుండెలు కలుక్కుమన్నాయి.

వెంటనే కేబిన్‌లోనుంచి బయటికొచ్చాను. కూపే ఖాళీగా వుంది. వెళ్ళి కూర్చున్నాను.

బయట గాలీ వానా మొదలయింది.

బంగాళాఖాతంలో మళ్ళీ వాయుగుండమా?

థియరీ ఆఫ్ రెలెటివిటీ - అదే బుర్రలో తిరుగుతోంది. కోతి, కొబ్బరికాయకు సాపేక్షసిద్ధాంతానికి వున్న సాపేక్ష భావనేమిటి?

ఐన్‌స్టీన్ థియరీ ఆఫ్ రిలెటివిటి - ఏనాడో మస్తిష్కంలో మరుగుపడిన సాపేక్ష సిద్ధాంత సూత్రాలను జ్ఞప్తికి తెచ్చుకొంటున్నాను.

ఉలిక్కిపడ్డాను.

కూపే డోర్ తోసుకొని మాజీమంత్రి ఎదురుగావచ్చి నిలబడ్డాడు. కూపే డోర్ లాక్ చెయ్యడం మరిచినట్టు అప్పుడు గుర్తొచ్చింది.

"సీతాదేవిగారూ! తమాషాగా ఉందికదూ?" ఆయన ముఖం చూస్తూంటే గుండెల్లో జెర్రులు పరుగెత్తాయి. రోగ్! అప్పట్నుంచీ కాపుకాస్తున్నాడన్నమాట!

"తమాషా ఏమిటి?" ఎలా అన్నానో తెలియదు. అలాంటి స్థితిలో ధైర్యం దానంతట అదే వస్తుందేమో? ఇన్‌స్టింక్ట్ ఆఫ్ సెల్ఫ్ ప్రిజర్వేషన్.

"మళ్ళీ తిరుగు ప్రయాణంలో కూడా కలుసుకొన్నాం."

"అయితే?" ఎందుకయినా మంచిదని లేచి నిలబడ్డాను.

"ఇవ్వాళ్ళ పత్రిక చూశారా?"

"చూళ్ళేదు. ఏం?" బయటికి వెళ్ళే ప్రయత్నంలో ఉన్నాను.

"అన్నగారి పార్టీలో చేరుతున్నట్టు వార్త వొచ్చింది." ముఖం పక్కకు తప్పుకొని అన్నాడు.

"ఎవరూ చేరుతుంది?"

"నేనే!"

"మీరు, మీరు అన్న పార్టీలో చేరుతున్నారా?"

"ఏమ్మా, అంత ఆశ్చర్యపోతున్నారు? నాకంటే-"

"త్రాష్టులు చాలామంది ఉన్నార్లే!" మనసులోనే అనుకొన్నాను.

అతడు ఆనందంగా నవ్వాడు. నేను వొట్టివొట్టిగా బోలుబోలుగా నవ్వాను. ఏడవలేక నవ్వటం అంటారే - అలా.

"మీ సామాను యీ కంపార్టుమెంటులోనే పెట్టమంటారా?"

"థాంక్స్! మీకు శ్రమ!"

"శ్రమేమిటమ్మా, ఆడబడుచులకు ఆ మాత్రం సేవచెయ్యలేమా?" అని సామానుతెచ్చి కూపేలో సర్దిపెట్టాడు.

"జాగ్రత్తమ్మా - ఒంటిరిగా వున్నారు. తలుపు గడియవేసుకోండి!" అని హెచ్చరిక చేసి వెళ్ళిపోయాడు మాజీమంత్రి.

"ఏమిటీమార్పు! ఇది నిజమైన మార్పేనా?" సాపేక్ష సిద్ధాంతం బుర్రలో కదిలింది.

ఇదేనా సాపేక్షసిద్ధాంతమంటే? సిల్లీ! నాలో నేను నవ్వుకొన్నాను.

బోల్టు బిగించి పక్క పరుచుకొని పడుకొన్నాను. మస్తిష్కంలో కోతీ కొబ్బరికాయా తిరుగుతోంది. సాపేక్ష సిద్ధాంతాల సూత్రాలకు, ఈ కథకు ఎలాంటి పొత్తు? ఏమి అన్వయం వుంది?

మాస్ అండ్ స్పేస్! టైం అండ్ వెలాసిటీ!! వేగాన్నిబట్టి వస్తువు పరిమాణం మారుతుంది. వేగం పెరిగినకొద్దీ వస్తువు పరిమాణం పెరగాలి. యస్. యస్. క్లూ దొరికింది.

కోతి వేగానికి చిహ్నం!

కొబ్బరికాయ వస్తువు!

కోతి చేతిలో కొబ్బరికాయ!

కోతి స్పేస్‌కు వెలాసిటికి సింబల్ అయితే, కొబ్బరి కాయ మాస్‌కు సింబల్ అవుతుందా యీ కథలో?

కోతి చేతిలోవున్న కొబ్బరికాయ పరిమాణం పెరిగిందా? ఎలా? ఎలా అన్వయం?

ష్యూర్ ష్యూర్! కొబ్బరికాయ పరిమాణం పెరిగింది. ఇంతింతై విశ్వాంతరాళం అంతయింది. కోనసీమలో పుట్టిన కొబ్బరికాయ కథ ఫ్రాన్స్ దేశాధ్యక్షుడి ఎలిసీప్యాలెస్‌దాకా పెరిగింది.

వండర్‌ఫుల్ - మాస్టర్‌పీస్!

త్రి చీర్స్ టు యూ కల్పన!

కల్పనను మనసారా దీవించి గుండెలకు హత్తుకోవాలన్పించింది. కల్పన రూపం నా కళ్ళల్లో నిల్చిపోయింది.

కల్పన భావోద్రేకత, కల్పనాశక్తి నా మనసును చుట్టేశాయి.

హాయిగా నిద్రపోయాను.

ఉదయం తొమ్మిదిన్నరకు గోదావరి ఎక్స్‌ప్రెస్ సికింద్రాబాద్ స్టేషన్‌కు చేరింది.

సామాను కూలీ అందుకొన్నాడు. రైలు దిగి స్టేషన్ బయటికొచ్చి పోర్టికోలో నిలబడి మా డ్రైవర్ కృష్ణ కోసం చూశాను.

"బండిక్కడుంది. ఇటు సార్!" వెధవ! వెనకే నిలబడి వున్నాడు. నోట్లో బెల్లంగడ్డ ఉన్నట్లు మాట్లాడుతాడు. ఆడ మగ అందరాఫీసర్లు సార్లే వీడికి.

యాధాలాపంగా కృష్ణ ముఖంలోకి చూశాను. కళ్ళు ఎర్రగా ఉన్నాయి. ముఖం ఉబ్బి వుంది.

"ఏం? అట్లా ఉన్నావ్? రాత్రంతా తాగిచచ్చావా?"

"లేదుసార్!" కృష్ణ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఎర్రటి జీరలపైన పొంగిన కన్నీరు రక్తంలా కన్పించింది.

"ఏమైంది కృష్ణా!" గాబరాపడ్డాను – ఆదుర్దాగా ఉంది.

"మా అదృష్టం!" కళ్ళనీళ్లు తుడుచుకొన్నాడు.

"అయితే ఎందుకేడుస్తావ్? అసలేమయింది?" చిరాగ్గా ఉంది.

"మీరు బతికొచ్చారు, అంతేసాలమ్మగారూ!"

"బతికిరావడం ఏమిటి?" జీప్‌లో ఎలా ఎక్కానో తెలియదు. "ఏమైంది కృష్ణా!"" నోరెండిపోతున్నది. ఏదో తెలియని ఆవేదన, ఆతృత!

"రాత్రి ఆఫీసుకు ఫోన్ వచ్చింది." గుటక మింగాడు.

"ఆఁ – ఫోనొస్తే?"

"నిన్న రాత్రి మిమ్మల్ని రాజమండ్రి స్టేషన్‌లో దించి తిరిగివెళ్తున్నప్పుడు జీప్–" అక్కడాగి, "మీరొచ్చేప్పుడు జరిగితే?" అని మళ్ళా ఆగాడు.

నిస్సహాయంగా కృష్ణ మొఖంలోకి చూశాను. అతడే చెప్పాలి. నేనిక అడగలేను.

"తెల్లార్లూ వాచ్‌మెన్ యాదయ్యా, నేను ఏడ్చాం. ఏడు గంటలకు మళ్లా ఫోన్ దొరికింది. జీప్ తిరిగొచ్చేప్పుడు జరిగిందని!" జీప్ ఎక్కి స్టీరింగ్ పట్టుకొన్నాడు.

"ఏం జరిగిందీ?" నా అరుపుకు సికింద్రాబాదు స్టేషన్ మీది గడియారం ఊడిపడాల్సింది – పడలేదు! ఆగిపోయింది. జీప్ స్టార్టయి ఒక్కదూకు దూకింది.

"జీపు కాలవలో పడింది."

ప్రాణాలు కడబడ్డాయి, తల మొద్దుబారిపోయింది.

"జీప్‌లో–"

"కల్పనమ్మా, డ్రైవరూ, అటెండరు హనుమంతూ ఉన్నారు."

డ్రైవరు పక్కకు తిరిగి నా ముఖంలోకి చూశాడు.

"అటెండర్ హనుమంతు ఈదుకొని ఒడ్డుకు చేరాడు. డ్రైవర్ లక్ష్మయ్య శవం దొరికింది."

"కల్పన?" గుండెలు చీలిపోతున్నాయి. మెదడు ముక్కలు ముక్కలవుతూన్నట్టుగా ఉంది.

"తెలియదు."

"ఆఁ!" నా ఊపిరి ఆగిపోతూంది.

"ఇంకా వెతుకుతున్నారట!"

ఇంటికి చేరుతూనే అమలాపురం లైట్నింగ్‌కాల్ బుక్ చేశాను. రిసీవర్ చేతులో పట్టుకొనే ఉన్నాను.

"సారీ మేడమ్ - లైన్స్ అవుటాఫ్ ఆర్డర్!" రిసీవరు చేతుల్లోంచి జారిపోయింది.

కల్పనా - కల్పనతోపాటు ఆమె కోతి - కొబ్బరికాయ కథ - ఓ హనుమాన్!

రాజమండ్రి స్టేషన్‌లో ప్లాట్‌ఫారంమీద నిలబడి వీడ్కోలు యిస్తున్న కల్పన యింకా నా కళ్ళల్లో - ఓ భగవాన్!

దుఃఖం పొర్లుకొస్తుంది-

గోదావరి పొంగులా.

# 18

"సెవన్ సిక్స్ ఫైవ్ ఎయిట్ త్రీ అండీ?"

"యస్ ప్లీజ్!"

"అమలాపురంనుండి ట్రంకాల్ - మాట్లాడండి."

ఆపరేటర్ లైన్ యిచ్చింది.

"హల్లో!"

"గుడ్ ఈవెనింగ్ మేడం!"

"ఎవరూ?" ఆనందంతో గొంతు పూడిపోయింది.

"నేను కల్పనను! క్షేమంగా చేరారా?"

"నా క్షేమం సరే! జీప్ కాలవలో...."

"పడింది. డ్రైవర్‌కు రేచీకటి అని మీకు చెప్పానేమో? ఎదురుగా లారీ వస్తుంటే బాగా పక్కకు తిప్పాడు. డ్రైవరువైపు పడటంతో నేను బతికి బయటపడ్డాను మేడం! కాలవలో కొంతదూరం వాలుకు కొట్టుకుపోయాను. లక్కీ - కాలవలో వెళ్తున్న కొబ్బరికాయల పడవవాళ్ళు నన్ను సేవ్ చేశారు. -హనుమంతూవాళ్ళు నా బాడీకోసం-"

"ఏమిటా మాటలు?"

"అదే మేడం! నాకోసం జీపు పడినచోట వెతికారట. శవం కన్పించకపోవడంతో మనిషే గల్లంతనుకున్నారు."

"థాంక్ గాడ్!"

"థాంక్ కొబ్బరికాయల పడవ!" ఫోన్‌లో కల్పన నవ్వు వినిపించి నాకూ నవ్వొచ్చింది.

"ఇంతకీ నీ కోతీ-కొబ్బరికాయ స్క్రిప్టు ఏమైంది? కాలవలో కొట్టుకుపోయిందా?"

"నోనో! మేడం - పర్సులో పెట్టానుగా! పర్స్ భుజానికే ఉంది. అయితే మేడమ్! పర్సులోకి నీళ్లుపోయి కాయితాలు తడిసినై. ఎండబెట్టి చూస్తానుగదా! ఒక్కొక్క అక్షరం తాటికాయంత - కాదు - కొబ్బరికాయంత అయిపోయినై."

"సరేగాని, ఇది విను - రాత్రంతా ఆలోచించాను. నీ కథకు ఐన్‌స్టీన్ థియరీ ఆఫ్ రిలెటివిటీకి ఉన్న పొంతనేమిటో నాకు బోధపడలేదు."

కల్పన పకపక నవ్వడం స్పష్టంగా విన్పించింది.

"నా బొంద! ఐన్‌స్టీన్ థియరీకీ నా కథకూ సంబంధం ఏమిటి? ఉంటే బోడిగుండుకూ మోకాలికీ వున్న సంబంధం లాంటిదే!"

నాకు వొళ్లు మండిపోయింది.

"మరెందుకలా చెప్పావ్? రాత్రంతా ఏదేదో ఊహించుకొంటూ బుర్రంతా చెడగొట్టుకొన్నాను."

"ఇప్పుడు కొత్త టెక్నిక్ అదేకదా! రచయితలూ, రచయిత్రులూ అందరూ కాదనుకోండి - చాలామంది సిలికాన్ టెక్నాలజీ అడ్డంపెట్టుకొని తలాతోకా లేని కథలు వ్రాసి అదంతా ఓ పెద్ద టెక్నిక్, సైన్సూ అంటున్నారుగా మేడం! అందుకని కొండకి గాలం వేసినట్టు ఐన్‌స్టీన్ థియరీ ఆఫ్ రిలెటివిటీయే నా కథకు మూలం అని కోసేశాను. క్షమించాలి గురూ! మేడమ్ - నేను ఆర్ట్ స్టూడెంటును. నా కసలు ఐన్‌స్టీన్ థియరీ కాదుకదా, టీవీ స్క్రీన్‌మీద బొమ్మ ఎలా పడుతుందోకూడా తెలియదు మేడమ్!"

"సరేగానీ! నీకో గుడ్ న్యూస్!"

"చెప్పండి మేడమ్!" కల్పన కంఠం ఆశగా పలికింది.

"ఇక్కడో సినిమా ప్రొడ్యూసర్‌కు నీ కొబ్బరికాయ కథ చెప్పాను. సినిమా రైట్సు కావాలంటున్నాడు - ఇస్తావా?"

"ఇస్తా మేడం, ఇస్తాను!" ఆ గొంతులో ఎంత సంతోషమో?

పెదవి నొక్కిపట్టుకొని "అయితే ఒక కండీషన్ పెడుతున్నాడు" అన్నాను.

"ఏమిటి మేడమ్! అది ఏం కండీషన్?"

"నీ కథలో కోతిలాచేసే కోతి దొరకడం కష్టం అంటున్నాడు. అందుకని...." వస్తున్న నవ్వును బిగబట్టుకొన్నాను.

"అందుకనీ?" దీర్ఘం తీసింది కల్పన.

"నువ్వా వేషంవేస్తే నీ కథ సినిమా తీస్తాడంటోయ్!"

మౌత్‌పీస్‌కు చెయ్యి అడ్డంపెట్టుకొని విరగబడినవ్వుతూ వింటున్నా

మాటా పలుకూ లేదు. కొద్దిక్షణాలపాటు నిశ్శబ్దం.

అమ్మాయిగారికి తిక్క వదిలిపోయింది. లేకపోతే నన్ను ఆటలు పట్టిస్తుందా బోడి?

"మేడమ్! ఒప్పుకొంటున్నా. అయితే ఒక కండీషన్!"

"ఏమిటో చెప్పు!" ఖుషీ ఖుషీగా అన్నాను.

"ఆ ప్రొడ్యూసర్ కొబ్బరికాయ వేషం వెయ్యాలి!"

"సిక్స్ మినిట్స్ ఓవర్!"

టెలిఫోన్ గరల్ గొంతు విన్పించింది.

లైన్ కట్ అయింది.

